# మరింగంటి కవుల సాహిత్య సేవ

కాకతీయ విశ్వవిద్యాలయము నుండి
డాక్టరేట్ పట్టమునందిన
సిద్ధాంత గ్రంథము



డా. శ్రీరంగాచార్య

**MARINGANTI KAVULA SAHITYASEVA**

(A Doctorol Thesis from Kakatiya University)

By Dr. SREERANGACHARYA, Lecturer In Telu
S. V. Govt Oriental College PALEM 509215 Dist. [illegible]
boobnagar, INDIA.

ప్రథమ ముద్రణ : ప్రమోదూత ఉగాది 1990
ప్రతులు : 1000



వెల రూ. 125-00

తిరుమల తిరుపతి దేవస్థానముల వారి ఆర్థిక సాహాయ్యముచే ఈ గ్రంథము ముద్రింపబడినది. కృతజ్ఞతలు

ప్రతులకు :
ఎస్. శ్రీనివాసమూర్తి
8.115 స్టాఫ్ క్వార్టర్స్,
పాలెం - 509215

నవయుగ బుక్ హౌస్
సుల్తాన్ బజార్, హైదరాబాదు.

విహార్ పబ్లిషింగ్ హౌస్
[illegible] చౌరాస్తా,
హైదరాబాదు-500027.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
[illegible], హైదరాబాదు-500029.

# అంకితము



యాదగిరి లక్ష్మీనరసింహస్వామివారి పాదారవింద సన్నిధికి

పరిగణించే కవులలో నాటినుంచీ నేటిదాకా అవిచ్ఛిన్నంగా సాగిపస్తున్న ప్రపత్తిప్రపన్న సంప్రదాయ నిష్ఠ. దీనితో ముడిపడినవే విశిష్టాద్వైత సంప్రదాయనిష్ఠ, భక్తినిష్ఠలు. ఈ ముప్పిరిగొన్న నిష్ఠా విధానంతో ఎక్కడా తెగిపోకుండా అన్ని తరాలలోన్లు, ఇందరిందరు కవులు ప్రవర్తించటం నిజంగా విశేషమే. ప్రతి కావ్యంలోనూ ఈ నిష్ఠ గంగా యమునల మాదిరిగానో, సరస్వతి మాదిరిగానో అనుస్యూతమవుతూనే ఉంటుంది. దీనితోబాటు గమనించవలసిన మరొక అంశం కూడా ఉంది. అది ఈ సంప్రదాయానికి ఎంతగానో ప్రచారం సంపాదించిన ఈ ప్రచార దృష్టి. ఈ వంశీయులందరిలోనూ దాదాపు సామాన్య లక్షణంగా గుర్తించవచ్చు. ఈ వంశంలో ఎందరెందరో పండితులు, కవులు, రచయితలు తమ తమకున్న కవితా శక్తిని - ఆ శక్తిలో తారతమ్యం ఉండవచ్చు; ఉండటం సహజమైన విషయం గూడా - ధారపోశారు. తమను తాము అంకితం చేసుకొన్నారనటం మరింత సమంజసంగా ఉంటుంది. పురాణేతిహాస ప్రవచనాల ద్వారా, సంప్రదాయ గ్రంథాల 'కాలక్షేపా'ల ద్వారా ఈ సంప్రదాయానికి విస్తృత వ్యాప్తి సాధించారు. ఎందుకిట్లా చేసారు? విధర్మీయులు అనేక ప్రలోభాలను కల్పించటం ద్వారా, బలవంతంగా కూడా మతం మార్పిడి సాగిస్తుంటే, దానికి తట్టుకొని నిలువరించుకోగల ఆత్మస్థైర్యం, ఆత్మవిశ్వాసం ఉద్దీపింపచేయటానికి. ఇందుకోసం ఈ వంశంవారు విస్తృతంగానూ, పర్యటన సాగించారు. తెలంగాణాలో విస్తృతంగానూ ఇతర ప్రాంతాల్లో పరిమితంగానూ వీరి కృషి బాగా వ్యాపించి ఉండటం ఈ అంశానికి దాఖలా.

ఈ వంశీయుల్లో దాదాపు సామాన్య లక్షణంగా మరొకటి కనిపిస్తుంది. తమ ప్రధాన లక్ష్యమయిన సంప్రదాయ వ్యాప్తికోసం వారు జనసామాన్యంలోకి చొచ్చుకుపోయినారు. వారికోసం ప్రక్రియా వైవిధ్యాన్ని ప్రయోగించారు. ప్రబంధాలు రచించటం అట్లా ఉంచి; ద్విపదలు, యక్షగానాలు, శతకాలు, కీర్తనలు, హరికథలు, తిరునామాలు (ఒక విధంగా వగ సాహిత్యం) మంగళహారతులు, చాటువులు........ఇట్లా ఎన్నో ప్రక్రియలను ఉపయోగించారు. ప్రబంధాలు జనసామాన్యానికి అందుబాటులో ఉండవని వారు తమ అనుభవంలో గుర్తించినట్టున్నారు. అందుకని యక్షగాన, హరికథ, తిరునామాలను విరివిగా స్వీకరించారు. అసలు తెలుగు 'తిరునామ సాహిత్యం' మొత్తంగా చూస్తే పరిగణించే కవులవీ, వారి శిష్య ప్రశిష్యులకే ఎక్కువ భాగమని స్పష్టమవుతుంది. ఆ తిరునామాల్లో, మంగళహారతుల్లో సాంప్రదాయిక విషయాలను మనసుకు హత్తుకొనే విధంగా, ప్రశాంతరాగాల కూర్పులో సులభంగా తెలిసేట్టు రచించారు. వీటిలో శ్రోతను చమత్కరింపజేసే 'మార్మిక' లక్షణాలు గూడా కనిపిస్తాయి...

తెలుగు నుడికారం కన్పిస్తువది. ప్రాంతీయ మాండలికతా స్ఫూర్తి కలుగుతుంది. అన్నిటికి మించి పరస్పరమయిన ఆత్మీయత కన్పిస్తుంది.

ఒక 'జీవిత కార్యం' అన్నట్టుగా కాక, ఒక 'వంశకార్యం'గా స్వీకరించిన ఈ నిష్ఠా పూర్ణమయిన బాధ్యత 'మరిగంటి' వంశాన్ని తెలుగు ప్రాంతమంతా ఒక గొప్ప ఆచార్య పీఠంగా స్వీకరించింది. యథార్థంగా 'మరిగంటి' వారికి అగ్రహారాలూ, భూములూ, ధన - ధాన్యాలూ ఇచ్చి సన్మానించింది. కృతజ్ఞతా భావం ప్రదర్శించుకొంది. తమకు లభించిన వాటిని 'అనియత విద్యా' ధోరణిలో జ్ఞానవ్యాప్తికి, సంప్రదాయ వ్యాప్తికి విరివిగా ఉపయోగించటం ఈ వంశంలో దాదాపుగా ఒక సామాన్య లక్షణమయింది. ఈ ధనాదులకోసంగా వీరు తమ నిష్ఠను పెంచుకోలేదు. పరమ దరిద్ర స్థితిలో గూడా భగవత్సేవలో పాల్గొంటలేదు. ఇందుకు ఉదాహరణగా 'కాణికవి' 'కన్నిటిధార' చూడవచ్చు. ఈ కన్నీటిధార సీస పద్యాల్లో ప్రవహించింది. భాషా వ్యాకరణాలను అధిగమించి ఆయన ఆర్తి ఆ పద్యాల్లో శ్రోతలను కలచివేస్తుంది. ఒకొక్క 'కాణి' (ఆనాళ్లల్లో పైసన్నర) విరాళంగా సేకరించి భగవత్సేవ సాగించినందుకు వెంకటరామానుజాచార్యులు గారికి 'కాణి కవి' అనే పేరు ప్రసిద్ధమయిపోయింది. ఇదిట్లా ఉంచి, ఈ కవులలో కొందరు పురాణాదుల 'పరిశోధన' చేసి తమ 'పరిశోధన' ఫలితాలను కావ్యాలుగా రచించారు.

వీటన్నిటికి మించి గమనించవలసిన 'విశేష' మేమిటంటే, ఈ వంశ కవులలో దాదాపుగా అందరి కవుల కావ్యాలూ- అవి చిన్నవి కావచ్చు, పెద్దవి కావచ్చు- భగవదంకితం కావటం ఈ కవులలో పండితులూ ఉన్నారు. సామాన్యులూ ఉన్నారు. అందరి విషయంలోనూ ఈ లక్షణం సామాన్యంగా కన్పిస్తుంది.

ఈ కవుల్లో కొందరు సంస్కృతంలోనూ ప్రౌఢ రచనలు చేసారు. వాటిలో 'శఠవైరి వైభవదివాకరం'. ఇది ఆలంకారిక గ్రంథం. శఠవైరి అంటే, శ్రీ వైష్ణవ సంప్రదాయంలో అందరికీ అత్యంత ప్రామాణికమయిన 'తిరువాయి మొళి' రచించిన నమ్మాళ్వారులు. వారిని నాయకులుగా చేసి అలంకారాలను వివరించిన గ్రంథమిది. చంద్రాలోకాదుల తీరుకు చెందింది. అలంకార వర్గీకరణంలోనూ, విశ్లేషణలోనూ, నిరూపణలోనూ పలుచోట్ల ఈ గ్రంథం స్వతంత్రంగా వ్యవహరించింది.

ఇట్లా బహుముఖంగా ప్రవర్తించిన వంశం మరిగంటి కవి వంశం మరి ఇట్లాంటి వంశానికీ, కావ్య-సాహిత్యానికి సంబంధించిన అంశాలు, విషయాలు తెలుసుకోవటం అవసరం. కాని ఈ విషయాలను గూర్చి ఇంతకు ముందు

చాలా స్వల్పంగా పరిశీలన సాగింది. కాని సమగ్ర రీతిలో సాగింది ప్రస్తుత గ్రంథం.

ప్రస్తుత పరిశోధన గ్రంథం రచించిన శ్రీరంగాచార్య పి.హెచ్.డి. డిగ్రీ కోసమని 'పరిశోధన' ఆరంభించినవాడు కాదు. శోధనలోనూ, పరిశోధనలోనూ అంతకుముందే అనుభవం సంపాదించిన పండితుడు. ఈ గ్రంథం చివరి ఉపయుక్త గ్రంథ సూచిలో ఉటంకించబడిన శ్రీరంగాచార్య వ్యాసాలను చూస్తే ఈ విషయం స్పష్టపడుతుంది. ఆయన పరిశోధనలో అవగతమయిన విషయాలతో ఆయన రచించిన 'మన ప్రాచీన తాళపత్ర గ్రంథములు - వాని దుఃస్థితి' మొదలయిన వ్యాసాలు ఆయన నిష్ఠను వ్యక్తం చేస్తాయి. ఆయన గ్రంథ సంపాదన - పరిశోధన నలగొండ జిల్లాలో ఆరంభమయింది. నలగొండ జిల్లా మొత్తానికి మొత్తంగా నృసింహక్షేత్రమయంగా అన్పిస్తుంది. యాదగిరి నృసింహ క్షేత్రం ప్రసిద్ధమయిందే. తెలంగాణా తిరుపతిగా అది ప్రశస్తి కెక్కింది. వాడపల్లి, మట్టపల్లి మొదలయినవి నృసింహ క్షేత్రాలే. నృసింహ స్వామికీ మరింగంటి వారికీ సంబంధాలు ఎక్కువ. ఈ తీరుగా మరింగంటి వారి సాహిత్యంపై శ్రీరంగాచార్య దృష్టి పడింది. వెదికినా కొద్దీ చిత్రవిచిత్రమయిన కావ్యాలు లభిస్తున్నాయి. చిత్రవిచిత్రమయిన విషయాలూ తెలుస్తున్నాయి. కొన్ని కావ్యాలను గూర్చి వ్యాసాలు రచించారు. కొన్నింటిని- ప్రధానంగా దశరథ రాజనందన చరిత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకళ్యాణం కావ్యాలను పరిష్కరించి వెలువరించారు. ఈ విధమయిన కృషితో ఈ పి. హెచ్. డి. పరిశోధన రంగంలోకి వచ్చారు. వచ్చి ఎంత కృషి చేసిందీ, ఎన్నెన్ని ప్రదేశాలు తిరిగిందీ, ఎంతెంత సమాచారం సేకరించిందీ ఎవరూ ప్రత్యేకంగా చెప్పనక్కర లేదు; ఈ గ్రంథం తానే చెబుతుంది; ఆయన దీనికోసం పడ్డ వ్యయ-ప్రయాసలను తప్ప. (గ్రంథంలోని 'అనుబంధాలు' ఆ అంశాన్ని కొంతలోకొంతయినా సూచించకపోవు.) అయితే —

ఇప్పటిదాకా, దాదాపు అయిదు వందలేండ్ల మీద పరుచుకొని ఉండిన సమాచారాన్నంతా బీసువోకుండా వలవేసి పట్టుకునేది అసాధ్యమయిన విషయం కాని, శ్రీ రంగాచార్య అసాధ్యమని ఊరుకోలేదు. సాధ్యమయినంత సంపాదించనే సంపాదించారు. ఈ గ్రంథం వెలువడటంతో తనపని కూడా పూర్తయిపోయిందని ఆయన అనుకోవటంలేదు. ఇంకా అవ్యగ్రత ఆయనను వదల లేదు వదలదేమోగూడా అదట్లాఉంచి, ఒకరి వంశం వంశాన్ని గూర్చి ఇంత కృషి చేయటం అరుదయిన విషయమేమరి. అదట్లా ఉంచి మరింగంటి వారి ఇన్ని రచనలు సమీకరించిన తరువాత, వాటిని వర్గీకరించి సాహిత్య వైవిధ్యాన్ని గుర్తించిన తరువాత, వివిధ ప్రక్రియలను గమనించిన తరువాత కేవలం పట్టిక

నిర్వహణం వల్ల ప్రయోజనమేమిటి ? అందుకని వివిధ ప్రక్రియల్లో లభించిన గ్రంథాలను గూర్చి పరిచయం చేయటంగూడా అవసరమే ననిపించింది. అయితే ఒక్కొక్క ప్రక్రియలో రచనలను పరిశీలించటమున్నా అదో ప్రత్యేకమయిన విషయమవుతుంది. ఆయా ప్రక్రియల్లోని ఆయా గ్రంథాల ప్రత్యేక పరిశీలనావకాశం తనకూ, తనంతటివారికీ మిగిల్చి ఉంచుకొన్నారు శ్రీరంగాచార్య. ప్రస్తుతానికి పరిచయం వరకే సరిపెట్టారు. ఈ పరిచయం ఆ గ్రంథాలను, వాటిలో ప్రతిపాదితాంశాలనూ గూర్చి ఉత్సుకత, ఉత్సాహం పెంపొందించ టానికి ఉపకరిస్తున్నదనటంలో ఎవరికీ విప్రతిపత్తి ఉండదను కుంటాను.

భాష, ప్రౌఢిమ, సాహిత్య సౌందర్యం మొదలయిన అనేకానేకాంశాల విషయం అట్లాఉంచి ఈ విధమయిన ప్రబోధ ప్రచార లక్షణంగల రచనల్లో సమకాలీన పరిస్థితులు చిత్రవిచిత్రంగా వ్యక్తమవుతూ వుంటాయి. సామాన్య ప్రజాసంబంధాలను వదులుకోవటం కాకుండా పెంచుకొనే లక్ష్యంగల రచనల్లో ఈ అంశం మరింత అధికం. స్తిమితంగా, జాగ్రత్తగా అధ్యయనం చేస్తే ఆ విషయాలు ఆ కావ్యాలనూ కవులనూ, వారు ఆయాపరిస్థితుల్లో నిర్వహించిన బాధ్యతలనూ గుర్తించే అవకాశం కలుగుతుంది సాహిత్యాధ్యయనం వల్ల కలిగే ఈ అనుషంగిక ప్రయోజనాన్ని—సాహిత్య చరిత్ర పరిణామ క్రమంలో కోల్పోలేముగదా! ఇన్నేండ్లమీద ఈ కవుల రచనా విధానంలోనూ దృక్పథంలోనూ వ్యక్తమయ్యే అంశాలను గమనించటం సాహిత్యరంగంలో ఉపకారకంగానే ఉంటుంది. అయితే, ఒకటే షరతు. అధ్యయనం చేయబోయే ముందే దాన్ని గురించి కొన్ని అభిప్రాయాలను నిర్ధారించుకో గూడదు. దానివల్ల కలుగవలసిన ఫలితం కలుగక పోవటమో, లేదా వ్యతిరేక ఫలితాలు కలుగటమో - తప్పదు. మునుముందు శ్రీ రంగాచార్య ఈ పనిగూడా ప్రారంభిస్తారని ఆశించవచ్చు.

అధీతి, బోధ, ఆచరణ, ప్రచారాలు నాలుగూ దాదాపుగా ఏకత్ర సమకూడిన ఈ మరింగంటి వంశ కవులనుగూర్చి ఇంత పరిశోధన పూర్వక మయిన సమాచారాన్ని, వీలయినంత విశ్లేషణగా సాహిత్య ప్రియులకు అందించటంలో అలసిపోని కృషి సాగించినందుకు శ్రీరంగాచార్యను మనఃస్ఫూర్తిగా నా అభినందనలు. ఆయన సాహిత్యరంగానికి ఉపకారకమయిన కార్యకలాపాల్లో మరింత ఉత్సాహంతో, నిష్ఠతో మునుముందుకు సాగుతారనీ, మరింగంటి కవులు సమ్మకొన్న పరతత్త్వం ఆయనకు అందుకు శక్తిస్తోమతలను పెంపొందింప చేయగలదనీ విశ్వసిస్తున్నాను ఆయన కృషిని ప్రోత్సహించే ఉత్సాహం సహృదయులలో కలుగుతుందనిగూడా విశ్వసిస్తున్నాను.

వరంగల్లు　　　　శుభమ్
16-8-1990

—సంపత్కుమారాచార్య

ఆచార్య బిరుదురాజు రామరాజుగారు
హైదరాబాదు.

# ఆశీస్సు

ఓం శ్రీ సాయిరామ

కడచిన ఏనూరేండ్లనుండి తరతరాలుగా ఆంధ్రగీర్వాణ సాహిత్య సమారాధనం అవ్యాహతంగా చేస్తున్నవారు ఆసూరిమరింగంటి లేదా మరింగంటి ఇంటి పేరున్న శ్రీవైష్ణవులు. ఈ ప్రపన్నుల వంగడానికి మొదటి కుదురు నల్లగొండ మండలం. అటు తరువాత తెలంగాణమంతటను ఆంధ్ర రాయలసీమ ప్రాంతాల్లోను ఈ వంశంవాళ్ళు వ్యాపించినారు. భగవద్రామానుజులకు వీరికి ఏదో బాదరాయణ సంబంధం ఉన్నట్లు కథలు చెప్పుతారు. ఇటు కుతుబ్షాహీల చేతను అటు విజయనగర సార్వభౌముల చేతనూ సత్కృతులైన ఈ వంశం లోని మహాకవులు ఒక్క కావ్యమైనా నరాంకితం చేయలేదంటే వీరు ఎంతటి ప్రపన్నులో మనం ఊహించవచ్చు. 16వ శతాబ్దం ప్రారంభంలో ఉండిన చెన్నయాచార్యులు మొదలుకొని ఈనాటి వరకున్న మరింగంటి వంశీకులు సృష్టించినంత సాహిత్యం తెలుగుదేశంలో మరే వంశం వారు సృష్టించలేదంటే అతిశయోక్తి కాదు. మరింగంటి కవులు రచించిన విశిష్ట ప్రబంధాలు. అచ్చ తెనుగు కృతులు, శ్లేషకావ్యాలు, చిత్రకవితలు, శతకాలు యక్షగానాలు కొంతకు కొంతైనా సాహిత్య చరిత్రల కెక్కినవి. ఆ వంశీకులు రచించిన కీర్తనలు, స్తోత్రాలు, మంగళారతులు, తిరునామాలు మౌఖిక ప్రచారంలో బండ్లకెత్తదగినంత ఉన్నవి. తెలంగాణంలో 60 ఏండ్లకు పైబడిన వయసున్న విశిష్టాద్వైతులందరికీ మరింగంటివారి మంగళారతో తిరునామమో తప్పక వస్తుంది. కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారు రెడ్డి యువజన గ్రంథాలయానికి ఆదిరాజు వీరభద్రరావుగారు లక్ష్మణరాయ పరిశోధక మండలికి సేకరించిన తాళపత్ర గ్రంథాలకు కేటలాగులు సిద్ధం చేస్తుండిన నాకు 1951లో మరింగంటి కవులు రచించిన రాలాంక నందినీ పరిణయం, చిలువ పడగరేని పేరణము, శ్రీకృష్ణశతానందీయము వంటి అనేకకృతులు చూచే భాగ్యం కలిగింది. అటు తరువాత కాలంలో నేను కూడ చెల్వపిళ్ళరాయ చరిత్ర, ఇందిరాల భాగవతం, కేశవస్వామిశతకం, నరసింహ స్తోత్రాలు అముద్రితాలు సేకరించినాను, కనగల్లులో గొప్ప గ్రంథాలయం సమకూర్చిన శ్రీమాన్ మరింగంటి రంగాచార్యుల వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు

జరిపినాను. మరింగంటి కవులను గూర్చి వారి రచనల గూర్చి [illegible] వ్యాసాలు కూడ ప్రకటించినాను ఐతే అది అసమగ్రమైన కృషి

ఇన్నాళ్ళకు మరింగంటి కవులను గూర్చిన సమగ్ర గ్రంథం వెలువడు తున్నందుకు చాలా సంతోషం. 'మరింగంటి కవుల సాహిత్య సేవ' పేరుతో పి. హెచ్.డి. ఉపాధికోసం రచించిన ఈ సిద్ధాంత గ్రంథంచాలా ప్రశస్తమైనది. ఇది మరింగంటి సాహిత్య సర్వస్వం వలె ఉన్నది. మరింగంటి కవుల వంశాలు ఎక్కడెక్కడికి వ్యాపించినదీ, ఆయా వంశీయులు రచించిన కృతులూ వాటి వైశిష్ట్యమూ వైవిధ్యమూ శ్రీరంగాచార్యులు ఈ గ్రంథంలో సూక్ష్మేక్షికతో పరిశోధించి ప్రదర్శించినారు. ఇంత వరకే ఈ రంగంలో లబ్ధప్రతిష్ఠులైన శ్రీ రంగాచార్యులు, అనితరసాధ్యమైన ఇట్టి గ్రంథం రచించినందుకు వారి పరిశ్రమను అభినందిస్తూ శ్రియఃపతి, వారికీ వారి కుటుంబానికి ఇతోధిక యశఃప్రాభవాలు ప్రసాదించవలెనని కోరుతున్నాను.

1-8-117/2 చిక్కడపల్లి
హైదరాబాదు. 20

బి. రామరాజు

తిరుమల రామచంద్రగారు
హైదరాబాదు.

# సేవా ప్రస్తుతి

పది పదకొండు శతాబ్దాలు మన దేశంలో మహా సంక్షుబ్ధ కాలం. ఎటు చూచినా ద్వేషాలు, యుద్ధాలు, పారమార్థికచింతలేని చిత్తవృత్తులు; శాంతి సామరస్యాలులేని జీవితాలు. అట్టి సంక్షుభిత పరిస్థితిలో అవతరించారు. భగవద్రామానుజులు. వారు వివిధ విషయాల సమన్వయం సంఘంలో శాంతిని, పరమార్థ చింతను నెలకొల్పగలదనే విశ్వాసంతో ఆసేతు శీతనగం పలుమారు పర్యటించి సమన్వయం సమకూర్చారు. భాషలకు సమన్వయం, భగవదారాధన విధానాలయిన ఆగమాల సమన్వయం, తత్త్వచింతనల సమన్వయం, వర్ణ సమన్వయం, హృదయానికీ బుద్ధికీ సమన్వయం, ఇలా ఎన్నో సమన్వయాలు. వీటి అమృత కలశంగా ఆవిర్భవించింది విశిష్టాద్వైతమతం. దీనిలో 'ప్రపత్తి' 'శరణాగతి' అనేవి అతి ముఖ్యం.

ఈ ప్రపత్తి మూడు విధాలు. స్వనిష్ఠ, ఉక్తినిష్ఠ, ఆచార్యనిష్ఠ అని. పరిణత చిత్తుడైన ముముక్షువు స్వయంగా అనుష్ఠించేది స్వనిష్ఠ. తనకు అర్థం తెలియకపోయినా ఆచార్యుడు చెప్పినట్లు చేయడం ఉక్తినిష్ఠ. ఆచార్యుడు తాను శరణాగతుడవుతున్నప్పుడు "వీడు నా పుత్రుడు, వీడు నా శిష్యుడు, వీడు నా సేవకుడు" అని తన్నాశ్రయించిన వారికి కూడ, వారి ప్రమేయం లేకుండా రక్షించమని భగవంతుని ప్రార్థించడం ఆచార్య నిష్ఠ.

ఈ శరణాగతి మరి మూడు విధాలు : ఆర్త ప్రపత్తి, దృప్తప్రపత్తి, ప్రాయశ్చిత్త ప్రపత్తి. పొగ నిండిన గదిలో ఉన్నవాడు బైటపడాలని చూస్తున్నట్లు నీటిని మునిగిన వాడు వెలుపలికి రావడానికి పెనుగులాడుతున్నట్లు సంసారంలో కూరుకుపోయినవాడు "భగవంతుడా! నన్ను వెంటనే నీ సన్నిధికి చేర్చుకో!" అని ప్రార్థిస్తే, భగవంతుడు అతని సర్వ కర్మలు హతమార్చి తన సన్నిధికి తీసుకుపోతాడు. ఇది ఆర్త ప్రపత్తి. వైకుంఠంలో ఉన్నా నీవే, ఇక్కడున్నా నీవే. నేను మరణించేది ఈ ఒక్కసారే. చావు ఎప్పుడు వస్తే ఏమి? - అని నిబ్బరంతో ఉండడం దృప్తప్రపత్తి. ముముక్షువు భరన్యాసం చేసిన పిదప [illegible] చేస్తే, క్షమించమని భగవంతుని కోరడం ప్రాయశ్చిత్త ప్రపత్తి.

ఈ ప్రపత్తి ఫలం మోక్షం. ఈ ఫలప్రాప్తికి విరుద్ధమయిన విషయాలను ముముక్షువు తెలుసుకోవాలి. వీటిని విరోధి స్వరూపాలంటారు. ఇవి ఐదు : ఆత్మ స్వరూప విరోధం, పరస్వరూప విరోధం, ధర్మ విరోధం, ఉపాయ విరోధం, భాగవత విరోధం. ఈ శరీరం నేను; నేను చేసే పనులు నా కోసమే, నేనే యజమానిని - అనే అహంకార మమకార స్వామ్యాలు ఆత్మస్వరూప విరోధం. శ్రీమన్నారాయణుని కన్నా అధికుడు ఉన్నాడనుకోడం, రామకృష్ణాద్యవతరాలు సామాన్య మానవులని, అర్చావతారాలు మట్టి బొమ్మలని అనుకోడం పరస్వరూప విరోధం. కోరరాని కోరికలు కోరడం, ఫలాపేక్షతో పనిచేయడం, తన కడుపు నింపుకోడం ధర్మ విరోధం. ప్రపత్తి శక్తిని సందేహించడం ఉపాయ విరోధం. అన్నిటికన్నా పెద్ద విరోధం భాగవత విరోధం. భగవంతుడు తన యెడల అపరాధాన్నైనా క్షమిస్తాడుగాని, భాగవతాపచారం క్షమించడు.

ఈ ప్రపత్తికి అర్హతపొందడానికి చేసుకోవలసిన సంస్కారాలు ఐదు : వీటిని పంచ సంస్కారాలంటారు. "తాపః పుండ్రః తథానామమంత్రో యాగశ్చపంచమః' ఈ శరీరం నాది కాదు. పరమాత్మనిది. అతని సొమ్ము, సంసారం తరించడానికిఅతడు నాకు ప్రసాదించాడు. అతనికైంకర్యానికి వినియోగించాలి - అనే భావంతో గుర్తుగా శంఖచక్ర చిహ్నాలను భుజాలపైవేసుకోడం తాపసంస్కారం, నొసట, దేహంలోని ఇతర ప్రాంతాలలోను తిరుమణి తిరుచూర్ణాలతో పుండ్రాలు ధరించడం పుండ్రసంస్కారం. వైష్ణవుడైనవాడు భగవద్భాగవతులయెడ పూజ్యభావంతో ఉండాలిగనుక కులవిద్యా ధనమదాలు వదలుకొని, తాను అందరికన్నా తక్కువ వాడనని చెప్పడానికి తన పేరుకు దాస అనే బిరుదు చేర్చుకోవాలి. దాసత్వాన్ని త్రికరణ శుద్ధిగా ఆచరణలో పెట్టాలి. ఇది దాససంస్కారం. మంత్రోపదేశం పొందడం నాల్గవ సంస్కారం. శ్రీవైష్ణవులకు మూల, ద్వయ, చరమశ్లోకాలనేని ప్రధానమైన మూడు మంత్రాలు, మూల మంత్రాన్ని అష్టాక్షరి అంటారు. ఓమ్ నమో నారాయణాయ - ఇది మూల మంత్రం. నారాయణునికి నమస్కారం అని దీని అర్థం. రెండవదైన ద్వయమంత్రం 'శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయనమః' అనేది శ్రీమన్నారాయణుని పాదాలను శరణు పొందుతున్నాను శ్రీనారాయణునికి నమస్కారం - అని రెండు వాక్యాలతో ఉన్నందున ద్వయమన్నారు. దీనికి మంత్ర రత్నమని పేరు.

'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ,
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ'

అనేది చరమశ్లోక మంత్రం. అన్ని ధర్మాలూ వదలి నన్నే శరణు పొందు. నేను నిన్ను సకల పాపాలనుంచి విముక్తుణ్ణిచేస్తాను. శోకింపకు - అని దీని అర్థం, మోక్షోపాయాలలో కడపటి అది ఉపదిష్టమైనది గనుక దీనికి చరమ మంత్రమని పేరు. ఐదవ సంస్కార మైన యాగానికి అర్థం, దేవపూజ. ముముక్షువు భగవత్పూజ తప్పక ఆచరించాలి. ప్రతిదీ భగవంతునికి అర్పించాలి. ఇది దేవపూజా యజ్ఞం.

పంచసంస్కారాలు పొందిన పిదప శ్రీమన్నారాయణుని పొందే ఉపాయం అనుష్ఠించి, విరోధిపంచకాన్ని పరిహరించి అపునరావృత్తి రహితమైన మోక్షం పొందాలి.

భగవద్రామానుజుల తర్వాత శ్రీ వైష్ణవులలో తెంగలై, వడగలై అనే భేదాలు ఏర్పడ్డాయి. ద్రావిడ దివ్య ప్రబంధానికి ప్రాధాన్య మిచ్చే శాఖ తెంగలై. వేదానికి ప్రాముఖ్యమిచ్చే శాఖ వడగలై. తెంగలై సంప్రదాయం వారికి భక్తి ప్రపత్తులు మోక్షసాధనాలు కావు. భక్తియోగం కృత్రిమం. క్లిష్టం, ప్రపత్తి ఆకించనత్వ మూలకమై మనుష్యుని అసామర్థ్యం వెల్లడిస్తుంది. కనుక ఈ భక్తిప్రపత్తులు కాక భగవంతుని నిర్హేతుక కటాక్షంతో విశ్వాసంతో జీవించడమే మోక్షసాధనం. భగవంతుని అనుగ్రహానికి హేతువు లేదు. ఉంటే అది దివ్యమే కాదు. భగవత్సేవకంటే భాగవత సేవగొప్పది. శ్రీకి శేషిత్వంలేదు. ఆమె పురుషకారరూపిణి, కృపామూర్తి. ద్రావిడ దివ్యప్రబంధాలే ప్రమాణాలు. వడగలై సంప్రదాయం వారికి భక్తి ప్రపత్తులు మోక్షసాధనాలు భగవత్కృప సహేతుకం. భగవత్కృప నిర్హేతుకమంటే భక్త్యాదులు సాధనాలు కాకపోతాయి. వాటిని వదలితే మానవులు భ్రష్టులవుతారు. భగవదనుగ్రహమే ముక్తికి హేతువయినా, ఆ అనుగ్రహార్హతను జీవుడుసాధించుకోవాలి, లక్ష్మీదేవి నారాయణునిలాగ విభువు, శేషి. శ్రీ విశిష్టుడైన నారాయణుడే ముక్తిదాత. నిజానికి పరతత్త్వం ఒక్కటే అయినా లోకరక్షణకై ద్వంద్వమైంది ఈశ్వరి, ఈశ్వరుడు పుష్ప పరిమళాల వంటివారు. వేదోపనిషత్తులు, ద్రావిడ దివ్య ప్రబంధాలు ప్రమాణాలు.

ఈ రెండు వాదాలకూ కారణం శ్రీ మన్నారాయణుడే ఉపాయోపేయ భూతుడు- అనే వాక్యం. ఉపాయానికే ప్రాధాన్యమివ్వడం ముక్తికి హేతువని, భగవత్కృపాకటాక్షం సహేతుకమని వడగల్ సంప్రదాయుల వాదం. ఈ ప్రప

త్తిని మర్కటకిశోరన్యాయంతో పోల్చుతారు. పిల్లకోతి తల్లిని అంటిపెట్టుకొని ఉంటూ, అటు ఇటు తిరుగుతూ తల్లినే ఆశ్రయించి ఉంటుంది. తెంగలై సంప్రదాయానికి ఉపాయమే ప్రధానం, అది నిర్హేతుక కృపాకటాక్షం. ఈ ప్రపత్తిని మార్జాల కిశోరన్యాయంతో పోల్చుతారు. తల్లి పిల్లి నడవలేని తన కూనలను నోటకరచుకొని సురక్షితచోటికి తీసుకుపోతుంది.

ఈ శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని ప్రజాసామాన్యానికి అందజేయడానికి విస్తృతకృషి పదసాహిత్యం ద్వారాను, తక్కిన వివిధ సాహిత్య ప్రక్రియల ద్వారాను జరిపిన మొదటివారు తాళ్లపాకవారు తర్వాత పేర్కొనదగినవారు మరింగంటి వారు. వీరివల్ల తెలుగుదేశంలో ముఖ్యంగా తెలంగాణాలో వైష్ణవానికి విశేషవ్యాప్తి కలిగింది. ఈ విషయాలను ప్రస్తుత గ్రంథంలో దర్శించవచ్చును.

మిత్రులు శ్రీపెరుంబూదూరు శ్రీరంగాచార్యులవారు మరింగంటివారి వైష్ణవ సాహిత్యాన్ని "మరింగంటి వారి సాహిత్యసేవ" అనే శీర్షికతో సిద్ధాంత వ్యాసం రచించి డాక్టరేట్ పొందారు. వీరిది గొప్ప పరిశోధన. ఈ గ్రంథంలో ప్రవేశిక, కావ్యావతారికలు, ఆంధ్రకావ్యసాహితి, సంస్కృత కావ్యసాహితి, లాక్షణిక మర్యాద, తాత్త్విక దృక్పథము-అనే ఆరు అధ్యాయాలలో మరింగంటి వారి రచనలను వివిధ దృక్కోణాలతో విశ్లేషించారు. అలభ్య రచనలో, స్తోత్రములు, తిరునామములు-మంగళహారతులు, అగ్రహార భూదాన పత్రములు, మరింగంటి వారి కృతులలో పేర్కొనబడిన గ్రామములు - అని ఐదు అనుబంధాలు పొందుపరిచారు.

మల్లినాథుడు అన్నట్టు అమూలంగాని, అనపేక్షితం గాని ఈ పరిశోధనలో లేదు. పట్టు కత్తరించినట్టు సమ్మసరిగా, విషయైక దృష్టితో సాగింది రచన.

ద్విపద పాల్కురికి సోమనాథోపజ్ఞం. అతడు తరువోజ పాదాన్ని రెండుగా విభజించి బసవుని రెండు పాదాలన్న భక్తితో ద్విపద నడిపాడు. దీనిని ఈసడించకండి వేదంతో సమానమని పాఠకులకు విన్నవించుకొన్నాడు. (వివరాలకు పరిశోధన సోమనాథ సంచిక చూడగోరినాను.)

మన హరికథకు మూలం మహారాష్ట్రుల కీర్తనకల ఏకనాథ్ మొట్టమొదటివాడు ఈ ప్రక్రియకు. హరిగుణగణాలను కీర్తించడం, అతని కృపాకటాక్షానికి ఉదాహరణంగా ఏదైనా భక్తచరితం చెప్పడం అని ద్విభాగాత్మకం ఈ హరికథ,

తిరునామములకు పక్కనే ఉన్న కన్నడ వైష్ణవంలోని "దేవరనామ" సంప్రదాయం ప్రోద్బలకమేమో! నాథమునులు దివ్యప్రబంధాన్ని నాలాయిరంగా వింగడించిన పిదప తమిళ భక్తుల రచనలు ఆగిపోయాయి. తర్వాత భక్తి ప్రచారం ఇతర భాషలలో ఎక్కువయింది. కన్నడంలో పంపని కాలానికే జైన భక్తిగీతాల రచన ఉందని పరిశోధకులంటారు. అన్నమాచార్యులకు చాలముందే- దాదాపు మధ్వాచార్యుల సమకాలంలోనే హరిసర్వోత్తమత్వం కీర్తించే గేయాలు కన్నడంలో 'దేవరనామ' పేర అవతరించాయి.

ముక్త పదగ్రస్త రచనాపద్ధతి తమిళంలో ముఖ్యంగా దివ్య ప్రబంధంలో అతి ప్రాచీన పద్ధతి. అందాది - (అంత + ఆది) అనబడేవన్నీ అలాటివే.

శ్రీవైష్ణవులకు పరమ ప్రాప్యాలయిన దివ్యదేశాలు నాలుగు. భగవద్రామానుజులు అవతరించి విద్య నభ్యసించిన కాంచీప్రాంతం, భగవద్విషయాలు అధ్యయనం చేసిన తిరుమల, శ్రీవైష్ణవ సిద్ధాంత ప్రచారం మొదట ప్రారంభించిన మేల్కోటె, సాయుజ్యం పొందిన శ్రీరంగం కనుకనే

'శ్రీరంగ మంగళమణిం కరుణా నివాసం
శ్రీ వేంకటాద్రి శిఖరాలయ కాలమేఘమ్,
శ్రీహస్తిశైల శిఖరోజ్జ్వల పారిజాతం
శ్రీశం నమామి శిరసాయదుశైలదీపమ్.'

అని శ్రీవైష్ణవులు ఈ నాల్గింటిని - శ్రీరంగ, శ్రీవేంకటాద్రి శ్రీహస్తిశైల (కాంచీ), యదుశైలా (మేల్కోటే)లను అనుదినం స్మరిస్తారు.

శ్రీమాన్ శ్రీరంగాచార్యులవారి పరిశోధన ప్రవణతకు వివేచన విశ్లేషణ వైభవానికి ప్రతి పుటా తార్కాణం ఇట్టి మహాధ్వరం నిర్వహించినందుకు వారిని అభినందిస్తూ, భగద్రామానుజులు సాయించినట్టు భక్తిరూప అయిన శేముషి ఇంకా ఎన్నో మహాకావ్యాలు నిర్వహింపజేయగలదని ఆశంసిస్తున్నాను.

ప్రమోద ఉగాది
గాంధీనగర్
హైదరాబాద్
27-3-90

భాషా సేవకుడు
—తిరుమల రామచంద్ర

**కోదాటి నారాయణరావు గారు**
హైదరాబాదు.

# అభినందన

డాక్టర్ శ్రీ రంగాచార్యులు గారు తాము విశేష శ్రమకోర్చి పరిశోధన చేసిన "మరింగంటి కవుల సాహిత్యసేవ" అనే ఈ పుస్తకానికి నా అభిప్రాయాన్ని వ్రాయమని కోరినారు, నేను ఈ పుస్తకాన్ని ఆమూలాగ్రంగా చదివినాను. శ్రీ రంగాచార్యులవారు దీన్ని రచించడం సామాన్యమైన పనికాదు. ఏదో ఒక విషయాన్ని తీసుకుని పరిశోధించటమే చాలా కష్టమైనపని. అటువంటప్పుడు ఏదో ఒకవ్యక్తి సాహిత్య సేవ లేదా ఒక గ్రంథ పరిశీలనకాక 14వ శతాబ్దం నుంచి నేటిదాకా వివిధ ప్రదేశాలలో నివాసం ఏర్పరచుకొన్న మరింగటి వంశీకుల వద్దకు వెళ్ళి వారివద్దనున్న గ్రంథాలను సేకరించి సమాచారాన్ని తెలుసుకొని వీటన్నిటినీ పరిశీలించి పరిశోధించి గ్రంథస్థం చేయడం సామాన్యమైన పని కాదు. అనుభవం గలవారికి వీరు పడినశ్రమ అర్థం అవుతుంది. ఇందుకు శ్రీ ఆచార్యుల వారిని నేను హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. ఇది మరింగంటి వారి వంశానికి చేసిన సేవకాదు - ఆంధ్ర వాఙ్మయానికి చేసిన సేవ. వీరి ఈ సేవ చిరస్థాయిగా నిలువ గలదని నా విశ్వాసం.

మరింగంటివారు తెలంగాణాలోనే కాక యావదాంధ్ర దేశంలోనూ ప్రసిద్ధి వహించిన పండితులు, కవులు మాత్రమేకాక ఆచార్యవర్యులు కూడాను, ఆంధ్ర వైష్ణవులలో మరింగంటి వారిదే పెద్ద "ఆచార్య పీఠం" అనుకుంటాను. వీరిశిష్య పరంపర ఆంధ్రదేశం నలుమూలలా వ్యాపించి ఉన్నది. వీరిలో అనేకులు తమ ఆచార్యవరులకు అగ్రహారాలను, భూములను, సమర్పించుకుని తరించినారు. వీటన్నిటిని ఈ గ్రంథంలో విశదీకరించినారు.

14 వ శతాబ్దం నుండి 20 వ శతాబ్దాంతం వరకు గీర్వాణాంధ్ర భాషామతల్లి మరింగంటి వారి వంశాన్ని ఆశ్రయించుకుని ఉన్నారు. ఆంధ్రదేశంలోనేకాక యావద్భారత దేశంలో కూడా ఇంతదీర్ఘకాలం సాహిత్యం, కవితా ప్రతిభ, ఒక వంశాన్ని అంటిపెట్టుకుని ఉండటం, కానరాదు. ఇతర దేశాల సంగతి నాకు తెలియదు కాని - ఇంతటి ప్రతిభా సంపన్నమైన వంశం వారు పుట్టుకు

నాకు ఎక్కడా కానరాలేదు. ఇక గురుపరంపరలో మరింగంటి
స్థానాన్ని ఈ గ్రంథంలో విపులీకరించక పోయినా అక్కడక్కడా స్ప
పోలేదు. వీరి ఆచార్యత్వాన్ని గురించి "మరింగంటివారి ముద్ర భుజం
వీపుతప్ప"టనే సామెత ఒకటి ప్రచారంలో ఉన్నది. అంటే కేవలం
కుటుంబాలకాక సామాన్య కుటుంబీకులు కూడా వీరి శిష్యపరంపరలో
రన్నమాట. వారు సమాశ్రయణ సందర్భాలలో తప్తముద్రల వేడిని భ
పోయినా ఆదాహ్నలం వదిలేవారు కాదు. శిష్యులుతప్పించుకుని పారి
భుజాలమీద కాకున్నా వీపుమీదనయినా చక్రాంకితం చేసేవారు కాబో
సామెతలోనిఅంతరార్థం సామాన్య ప్రజానీకంలో కూడా వీరి ఆచార్యత్
బలంగా ఉండేదని, తెలుస్తున్నది.

మరింగంటివారి వంశం కేవలం ఏదో ఒక మండలానికి గానీ,
నికి గానీ పరిమితమై లేదు. బహుశ ఒకచోట కలవారికి మరొకచోట
పూర్వీకుల గురించి వివరంగా తెలియని దశలో కూడా వీరు ఉండి
ఆట్టి సందర్భంలో వీరిచరిత్రనుండి సేకరించిన సమాచారాన్ని స
చేయడం, ఒక పెద్దపని.

మరింగంటి వారి పాండిత్యం సర్వతోముఖమైనది. దశరథ
చరిత్ర తెలుగులో మొదటి నిరోష్ఠ్య ప్రబంధం, దానితర్వాత కేవల
కాకుండా ఓష్ఠ్యపు, తద్భవ శబ్దాలు కూడా ఉపయోగించకుండా అ
చ్ఛాంధ్రనిరోష్ఠ్య సీతాకల్యాణం రచించినారు. ఇంతే కాకుండా సంస్కృ
కొన్ని రచనలున్నవి. వీరిసన్మానాలు సత్కారాలూ కేవలం జమీం
దారులనుండి మాత్రమే పొందినవికావు —, కుతుబుషాహీ పరిపాల
ఆంధ్ర భాషాభిమానిగా పేరొందిన మల్లిక్ ఇబ్రాహింషా ఆస్థానంలో
ఉచితమైన స్థానం లభించింది. నాటినుండి నేటివరకు అందరుకా
రయినా, పండితులు కవులు ఈ వంశంలో ఉన్నారు. మున్ముం
సంప్రదాయం కొనసాగగలదని నా విశ్వాసం.

మరింగంటివారి వంశంలోని కొందరితో నాకు వ్యక్తిగతమై
ఉన్నది. అంతే కాకుండా మరింగంటి వారికి మొఖాసాగా ఇవ్వబ

పురం మా గ్రామానికి అనతి దూరంలోనే ఉన్నది. ఈ అగ్రహారీకులలో చాలా మంది నాకు పరిచయస్థులున్నారు. ఆ గ్రామంలో నేడు ముంగొండ వారు ఎవరూ లేరు. దేశంలో నలుమూలలా చీలిపోయినారు. విరంచరి విపులంతో పెద్ద వంశవృక్షాన్ని కూడా వీరు దీనిలో వేసినారు. దీనిని బట్టే ఈ గ్రంథంలోని సమాచార సేకరణకు శ్రీరంగాచార్యుల వారు పడినశ్రమ ఎంతటిదో విశదం అవుతుంది.

మఱింగంటి వారి వంశంలో వలె శతాబ్దాల తరబడి భాషాకోవిదులు, ఉన్న రీతిలో కాకున్నా తెలంగాణాలోని శ్రీవైష్ణవ కుటుంబాలలో మూడు నాలుగు తరాల వరకు పండితులుగా కొనసాగిన కుటుంబాలు అనేకం ఉన్నవి. వారి రచనలు, ముద్రితం కాకపోవచ్చును. అయినప్పటికి తాళపత్రాల గ్రంథాల రూపంలో తిరునామాలు, మంగళహారతుల రూపంలోనూ వ్యాప్తిలో ఉన్నవి. అటువంటి పండితుల రచనల గురించి పరిశోధన జరుపుటకు కావలసిన సామగ్రికి, సూచనప్రాయంగా ఒక రచనకు శ్రీరంగాచార్యుల వారు పూనుకుంటే సంస్కృతాంధ్ర భాషలకు శ్రీవైష్ణవ ఆచార్యులు చేసిన సేవ వెలుగులోనికి రాగ లదు. అని నా సూచన. ఇది ఉచితం అనుకుంటే శ్రీరంగాచార్యులవారు స్వయం గానో తమ మిత్రుల ద్వారానో, శిష్యులద్వారానో ఈ పని చేయిస్తారని ఆశిస్తూ మరొకసారి శ్రీరంగాచార్యుల వారిని, వీరి గొప్పనైన ఈ కృషికి అభినందిస్తు న్నాను.

1-1-336/16 చిక్కడపల్లి
హైదరాబాద్-

—కోదాటి నారాయణరావు

తిర్థం శ్రీధరమూర్తి గారు
తిర్థం,
చిత్తూరు జిల్లా.

# ఆమోదము

**ప్రవేశిక :**

> శ్రీ మరింగంటి వంశేఽస్మిన్ వేద వేదాన్త పారగాః,
> సర్వత్రయ సునిష్ణాశ్చ జయన్తి కవయః సదా.

శ్రీ రంగనాథ దయాపాత్రమై విలసిల్లిన మరింగంటి వంశము ఒక సుందర సాహితీ వనము. అందలి మనోహరములు, వర్ణరంజితములు అయి వెల్లివిరిసి, పరిమళము వెదచల్లు కుసుమములు ఎన్ని ! అవి అన్నియు భగవదా మోదముకు, రసికావళుల ఆహ్లాదమునుగూర్చి అలరింపజేయుచుండుట ప్రశంసా పాత్రమైయున్నది.

రఘువంశ్యులందరును విఖ్యాత వీరులైనట్లు, మరింగంటి వంశజులు విశిష్ట విద్వత్కవులుగా వెలయుట సృష్టియందలి చమత్కారము. రఘువీరులను కవికుల గురువు కాళిదాసును, మరింగంటి కవులను శ్రీమాన్ శ్రీరంగాచార్యులును అభివర్ణించి, వివేచించి కృతకృత్యులయిరి.

పదునాలుగవ శతాబ్దమునుండి నేటిదాక తామరతంపరగా విస్తరిల్లిన "మరింగంటి కవుల సాహిత్యసేవ" బహుముఖమైనది. కవులు పలువురు, వారి [illegible] అపారము. ఆ కవులలోను, వారి రచనములలోను తరతమ భేదములు [illegible], వారందరిలోను, కొన్ని ముఖ్యమైన సమాన ధర్మములు కానవచ్చుట [illegible] సమష్టి రూపమున పరిశోధన గ్రంథము సంతరింపబడినది. కావున తత్ప్రా[illegible]యు వదభిముఖముగా సాగును. విభిన్నజాతుల పూవులు మాలారచనమున విశిష్టతను అపాదించుకొన్నట్లు, వైవిధ్యముతో కూడిన ఆయా కవుల కృతుల సమాహారమైన సాహిత్యము సహృదయానంద సంధాయియై సమాదరింపబడు [illegible].

**ఆచార్య పీఠము :**

మఱింగంటి కవులు స్వయం ఆచార్యపురుషులు. కావున వీరు శిష్యులకు సమాశ్రయణము, తత్త్వోపదేశము కావింతురు. విశిష్టాద్వైత సంప్రదాయ ప్రవర్తకులగుటవలన వీరికి ఉభయవేదాంతముల అధ్యయన అధ్యాపన ఆచరణ ప్రచారములు నిత్యానుసంధానములు, కావున వీరు తద్విషయము నందు సావధానులై యుండుట యనివార్యము.

> శ్రీభాష్య కృత్యాద సేవా ధురీణుండు,
> పరతత్త్వ సిద్ధాంత భావుకుండు ...... (పు. 48)

ఈ పద్యము వీరి శ్రీ సంప్రదాయ నిష్ఠను చాటును.

ఆచార్య పురుషుల కర్తవ్యములలో పరమత నిరాకరణ పూర్వక స్వమత స్థాపనము ప్రధాన కర్తవ్యమై యున్నది. దీనికి కావలసిన వేదవేదాంత ముల యందు, దర్శనములయందు కూలంకషమైన పాండిత్యము వీరికి పూర్ణ ముగా ఉండుట వలన వీరు ప్రతివాదిభయంకరులై కీర్తిగాంచినట్లు ఈ పద్యము ద్వారా విదితమగుచున్నది.

> శాస్త్ర నిషిద్ధాన్య జన కాలకూటంబు,
> కుటిల కుతర్కా-శి గుండె దిగులు... (పుట 58)

**విద్వత్కవులు :**

అన్నిటిని మించి మఱింగంటివారికి శాశ్వతకీర్తిని సముపార్జించి పెట్టినది కవిత్వము. అది అనుపమమైనది. అందులకే "సుకవితా యద్యస్తి రాజ్యేన కిం?" అని స్వానుభవముతో ఎలుగెత్తి చాటినాడు భర్తృహరి. కవితకు ప్రతిభా వ్యుత్పత్తులు కావలయును. ప్రతిభ దైవదత్తమైనది. ఇక, నిరంతర బహు గ్రంథావలోకనమువలనను, బహుశ్రుతులతోడి నిరంతర సాంగత్యమువలనను వ్యుత్పత్తి సాధ్యమగును. పాండితి కొరవడిన కవిత నీరసము. అందులకే "విద్వత్కవయః కవయః, కేవల కవయస్తు కేవలం కపయః" అను అభాణకము పుట్టినది. ఈ కవుల సంస్కృతాంధ్రభాషా కవితలకు అలంబనమైన వ్యుత్పత్తిని మరూర్చిన యంశములివి:

శ్రీభారతాది ప్రసిద్ధ గీర్వాణాంధ్ర
భాషామయశ్లోక పద్యపఠన, మున... (పుట. 48)
ఈ పద్యము తెల్పును.

ప్రతిభా ప్రతిఫలనమగు కవితాశక్తి కేవలము దైవానుగ్రహ లబ్ధమని ఆయా కవులు తమ కృతులలో ఆశ్వాసాంత గద్యమునందు "గట్టిగా" పేర్కొని యున్నారు.

"ఇది శ్రీమత్ప్రసన్న కర్పరగిరి నృసింహ కరుణా కటాక్ష వీక్షా సంలబ్ధ సరసకవిత్వ విద్యాపయః పయోనిధాన" (పు 124)

కవితా సుందరి యొక్క లాస్యగతులు అనేకములు. దానిలో ఒక పదహాళి అవధానము "అవధాన మెఱుంగని సత్కవిత్వమున్" మంచి కవికి అవధానము ఆవశ్యకమని. తిరుపతి వేంకటకవుల యభిమతము. అవధానము ఒక విశిష్ట కవితాప్రక్రియ. దీనికి అసాధారణమైన ధారణాశక్తి, సద్యః స్ఫూర్తి ధారాపాత తుల్యమగు ఆశుకవితా పాటవము అనునవి మూలద్రవములు. ఇవి నృసింగంటి కవులయందు కాననగును.

"గురుమూర్ధన్య శతావధాన బిరుదాంకున్..."

"సరస శతపద్య లేఖిని విరచనోక్తి గల..."

"వినుత శతఘంట బిరుదాంక విజయుఁడైన" (పు. 29)

కవిత వ్రాయవచ్చును. లేదా ఆశ్వాసువుగాను చెప్పవచ్చును. కాని దానితో తృప్తి కలుగదు కాబోలును కొందరికి.

"ఆశుకవిత్వంబు నల్లితేనే సరా? చిత్రప్రబంధముల్ చేయవలదె?"
(రాధికా 8-14)

అని ముద్దుపళని యొక్క ధీరమైన ప్రశ్నలు. ధ్వనికి ఎంతమాత్రమును ఐరసువారు కారు నృసింగంటి కవులు చూడుడు.

"ఆశుకవితావ్ధ భాషావధాన చిత్ర
బంధపద్య చతుర్భద్రికా నిరోష్ఠ్య
పాదగోపన గీతప్రబంధ కృతుల
మోహమును జేసె శ్రీజగన్నాథ గురుఁడు" (పు. 310)

ఇంతకు మించి, యీ కవుల నిరోష్ఠ్యాది రచనా విశేషములను గూడ గమనింపవచ్చును. (పు. 108 - 122).

ఏవంవిధ కవితా పాండిత్యములు గల కవులకు బిరుదులు, రాజమాన్యతలు కొరవడునా? చదువులతల్లి సరస్వతిచేతనె బిరుదు పడసిన కవి యొక్క ఘనత సామాన్యమా!

"శతఘంటరాయ సులతా"
నీతఁడె యనం దగునటంచు నిచ్చెందోఁపన్;
శతధృతిరాణి యొసంగెను
నేతులితమగు 'బిరుదు' సింగరాచార్యులకపుడున్". (పు. 88)

శ్రీనాథ మహాకవికి 'కవిసార్వభౌమ' బిరుదమున్నట్లు ప్రసిద్ధి.

"కర్ణాట క్షితి భూషక్రియా శక్తిరాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమ బిరుదు" (చాటువు)

మహాప్రతిభాశాలియైన సింగరాచార్యులును కవిసార్వభౌమ బిరుద విభ్రాజితులై రాణించుచున్నారు.

"ఆంధ్రభాషా నిరోష్ఠ్య మహాప్రబంధ
రాజి రచనా ధురీణుఁ, గర్ణాటరాయ
లబ్ధ 'కవిసార్వభౌమ' కల్యాణ బిరుద
శాలి మరుసంటి సింగరాచార్యుఁ దలఁతు (పు. 19)

అఖిల విద్యాధికుఁడయిన వారికి రాజపూజ్యత, అగ్రహారాది సన్మానములు లభించుటలో ఆశ్చర్యములేదు. నాటి రాజుల రసికతకు, ఔదార్యమునకు అవి నిదర్శనములు.

"హయదంతి మణి భూషణాదు లందితి వక్ష్య
పతి గజపతి నరపతుల చేత" (పు. 80)

"రాజరాజైన మల్కిభరాము చేత
ధారుణీ జను లెన్నఁగా దత్తమైన
యాదవాకిళ్ళ పురిని ప్రఖ్యాతి నొదవ
నివిచి యుండిరి సంపదల్ నివ్వటిల్ల'
(పు. ౨౨)

**సాహిత్య రాశి :**

"ఆకారణబంధులు గారె సత్కవుల్" అని కవుల గురించి కవి సూక్తి. మరింగంటి కవుల కావ్య (కవేః ఇదం) సృష్టి అపారమైనది. వైవిధ్య పూర్ణమైనది. జ్ఞాన విజ్ఞాన ప్రదమైనది. ఈ కృతి సంచయములో ప్రబంధములు, స్వపద కృతులు, నాటకములు, యక్షగానములు, శతకములు, హరికథలు, స్తుతులు, చాటువులు, తిరునామ, మంగళహారములు, అచ్చతెనుగు కావ్యములు, నిరోష్ఠ్యాది నిర్బంధ గ్రంథములు ఇత్యాదిగా కలవు. కొన్ని సంస్కృత గ్రంథములును కలవు. వీనిలో కొన్ని గ్రంథములు ముద్రణ భాగ్యము నందినవి. అముద్రిత గ్రంథములును చాల కలవు. గ్రంథ సంపాదన కార్యము దుష్కరమైనది.

సామాన్యముగా అముద్రిత గ్రంథములలో తాళపత్ర గ్రంథములు ప్రాచీనములు. కాగితపు ప్రతులు అర్వాచీనములు. తాళపత్ర గ్రంథములు శిథిలములు, క్రిమిదష్టములుగా నుండును. వాని యందలి అక్షర సంకేతములు, గొలుసుకట్టు వ్రాతలు చదువరులకు మనఃక్లేశమును అపాదించును. అగమ్య గోచరమగు తత్పరిశీలనము "తాళీదళ సంపుటప్రకర కాంతార" ప్రవేశముగా పెద్దన ఉపేంద్రుడు సంభావించెను.

"వ్రాలా శత్రులు, తప్పులు
దొంగా గలవు, శబ్ద సంగతు లెరుగన్,
గేలిం బెట్టక, నవ్వక
పోలంగా దిద్దరయ్య బుధజనులారా!"

పై లేఖకుని పద్యము వలన తాళపత్ర గ్రంథ లేఖన విధానమును కొంత వరకు గ్రహింపవచ్చును. ఈ స్థితిలో, వ్రాతప్రతులను సంపాదించి, క్రమకోర్చి, చదివి, పాఠనిర్ణయము గావించుకొని, పరిష్కరించుట బహుప్రయాసముతో కూడినకార్యము. ఆచార్యులవారు ఈ పనిని సమర్థముగా నిర్వహించి యున్నారు. "నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు" అను సుభాషితము వీరి యీ విషయమున సమన్వయింపదగును.

ఈ సిద్ధాంత వ్యాసమందు మరింగంటి కవుల సాహిత్య పరిచయము ఈ విధముగా కావింపబడియున్నది :

(1) గ్రంథనామము, (2) గ్రంథ స్వరూపము ( తాళపత్రము/ముద్రితము), (3) ప్రతియొక్క కాలము, ప్రాప్తిస్థానము, (4) గ్రంథ పరిమితి (సంపూర్ణము/అసంపూర్ణము), (5) కవి పరిచయము, (6) వస్తుపరిచయము, (7) కథాసంగ్రహము, (8) మూలము, (9) కవి కావించిన మార్పులు, (10) వర్ణనములు, (11) అనుకరణములు (12) కృతివైశిష్ట్యము మొదలగు వవి ౦స్తరభీతిచే ఒక అంశమును చూపెదను.

శ్రీకృష్ణశతానందీయము. ఇది యొక మూడాశ్వాసముల ప్రబంధము. ాటాకు పుస్తకము. మధ్య మధ్య జీర్ణమైయున్నది. ఇందలి కథకు మూలము ్యాసభాగవతములోని ఒక చిన్న సన్నివేశము. ఇందులో వచ్చు మాయాబ్రహ్మ థ మూలమునందు అస్పష్టము. ఈ గ్రంథశోధకులు బ్రహ్మవైవర్త విష్ణు గర్గ ురాణాదులను చూచిరి. ఎందును మూలము కానరాలేదు. వీరరాఘవవ్యాఖ్య ంందు ఉన్నట్లు పసికట్టిరి. కళాపూర్ణోదయమునందలి మాయారంభ సామ్య ంను చూపిరి. "ఈ వింతకథను గ్రహించి ప్రప్రథమముగా తెనుగున ంబంధీకరించినది శ్రీకృష్ణ శతానందీయకర్తయే" (పు. 159) అని సిద్ధాంతము ిించిరి. ఇది కదా నిజమైన పరిశోధనము! ఇట్లే - నిరోష్ఠ్య, అచ్చాంధ్రనిరోష్ఠ్య ఫనామ - విషయములందు మరింగంటివారి ప్రాధాన్యము నిరూపితమైనది.

**అనుకరణము :**

కవులు, పూర్వకవీంద్రుల కావ్యములను పలుమారు చదివి ఆనందించి యుందురు. తత్కవితా గౌరవముచేతను, గుణవిశేషముచేతను కావ్యగత భావములనుగాని, పదబంధములనుగాని తరువాతి కవులు అనుకరించుట కనుపట్టుచున్నది. మహాకవి కాళిదాసు వ్యాస వాల్మీకి మునుల కవితను అనుకరించి యుండుట ప్రసిద్ధము. అట్లే మఱింగంటి కవులును అనుకరించి యున్నారు. శ్రీనాథుడు తాను ఏ గ్రంథమును ఏ ప్రాయములో వ్రాసెనో పేర్కొన్న ప్రసిద్ధ పద్యమిది.

సీ. 'చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాఁడు
రచియించితిని మరుద్రాట్చరిత్ర......' (కాశీ. 1-6)

దీనికనుకరణమా అనునట్లు - ఈ క్రింది పద్యము ——

సీ. పదియేండ్లవాఁడనై బహుచమత్కృతియైన
కల్యపిళ్ళను రాయచరిత మొకటి,
వ్రాసితి పది యొక్క వత్సరంబున నేను
'నంద నందన శతానంద' మొకటి... (పు. 45)

వేరొకటి

సీ. శతలేఖినీ పద్య సంధానధౌరేయు
ఘటికాశత గ్రంథ కరణధుర్యు...' (నరస. 1-13)

"శతలేఖినీ పద్యసంధాన నిపుణుండు,
ఘటికా శత గ్రంథ కల్పితుండు,
బంధాష్ట కవిత ప్రబంధ నిర్మాణుండు,
నేకసంధోదిత శ్రీకరుండు,...' (పు. 94)

పై నరసభూపాలీయ పద్యమునకు మఱింగంటి కవియొక్క ఈ పద్యము బింబముగా తోచుచున్నది,

**సాహిత్య సేవ :**

డాక్టరు పట్టమునకు సిద్ధాంతవ్యాసమును సమకూర్చుటకు 'సూక్ష్మములో మోక్షము' అన్నట్లు ఏదో ఒక ముద్రిత గ్రంథమునుగాని, సరళవిషయమును గాని గ్రహించుట సామాన్యముగా కానవచ్చుచున్నది. ఈ స్థితిలో ఒక వంశము నకు చేరిన, శతాధికముగా గల ప్రాచీన కవుల కృతులను సంపాదించి సిద్ధాంత వ్యాసమును సిద్ధపరచుటకు నడుము కట్టుట సాహసకార్యమై కనుపట్టుచున్నది. కారణము వీరు - మరింగంటి కవులవలె శ్రీవైష్ణవ మతానుయాయులు. పైగా, ఇదివరలో కొంతవరకు మరిగంటి కవుల కావ్యముల పరిచయములను పత్రికా ముఖమున గావించి కొన్నింటిని ప్రకటించియున్నారు. ఈ విధముగా పేటి కాంతర్గత రత్నములవలె నుండు ప్రాచీన కృతులకు అనాలోక యోగము వంటి జనాలోకయోగమును కల్పించుటయె యథార్థముగా మరిగంటికవుల సాహిత్యము నకు వీరు గావించు సేవ.

కం. కవి కావ్యము విరచించును,
నవరసరసికుండు దాని నాణెముఁ దొగడున్;
అవనీజము కుసుమించును,
పవనుఁడు నెత్తావి దెసలఁ బర్వఁగఁ జేయున్.

తీర్థం
చిత్తూరు జిల్లా

తీర్థం శ్రీధరమూర్తి

# —కృతస్మృతి

—కాకతీయ విశ్వవిద్యాలయం నుండి 1989 లో డాక్టరేట్ పట్టమును సంపాదించి పెట్టిన నా 'పరిశోధన వ్యాస' గ్రంథమిది.

—'మరింగంటి కవుల సాహిత్యసేవ' అనే ఈ విషయంపై 'పరిశోధన'కు ప్రవేశం కల్పించిన కాకతీయ విశ్వవిద్యాలయ ఉన్నతాధికారులు—

—సిద్ధాంత వ్యాసానికి పర్యవేక్షకులుగా నుండి అనేక సూచన లిచ్చిన డా॥ కోవెల సంపత్కుమారాచార్యులుగారు

—నా కృషి 'పిహెచ్.డి'కి తగినదని ఆమోదాన్ని తెల్పిన ప్రొఫెసర్. ఎమ్. సుబ్బారెడ్డి గారు (తిరుపతి) ప్రొఫెసర్ తంగిరాల వెంకట సుబ్బారావుగారు (బెంగుళూరు)—

— పరిశోధన కాలంలో ఎంతగానో తోడ్పడిన కాకతీయ విశ్వవిద్యాలయం తెనుగు శాఖలోని ఆచార్య వర్గం—

—కావలసిన పుస్తకాలనిచ్చి సూచనలతో సహకరించిన-పెద్దలు-శ్రీయుతులు ప్రొ॥ బి. రామరాజు, ప్రొ॥ వేటూరి ఆనందమూర్తి, బి. ఎన్. శాస్త్రి, కపిలవాయి లింగమూర్తి గారలు, మిత్రులు - ప్రొ॥ రవ్వా శ్రీహరి, మరింగంటి పురుషోత్తమాచార్యులు, డా॥ రత్నయ, డా॥ మాడభూషణం రంగాచార్యులు, డా॥హరిహరనాథ్, డా॥ చించాపట్టణం శ్రీరంగాచార్యులు, ఎమ్.వి. రాజగోపాల్ గారలు—

—అనేక సాహితీ విషయాలను తెల్పి మంగళాశాసనము లొసంగిన మా పితృపాదులు శ్రీమాన్ శ్రీ రాఘవాచార్యులు గారు. నా అభ్యుదయానికి ముఖ్యులైన అగ్రజులు శ్రీమాన్ ప్రొఫెసర్ ఎస్. లక్ష్మణమూర్తిగారు.

—వివిధ ప్రాంతాల్లో సంచరించినప్పుడు, తోడ్పడిన మరింగంటివారు. వారి బంధువులు. శిష్యులు—

—అవసరమైన గ్రంథాలను పరిశీలించుకొనుటకు అనుమతించి - సహకరించిన - ఆం.ప్ర.ప్రా.లి.పు. భాండాగారం అప్పటి డైరక్టర్ శ్రీ వి. వి. యల్. నరసింహారావు గారు.

—పరిశోధన చేయటానికి అనుమతించిన రాష్ట్రప్రభుత్వ ఉన్నత విద్యాశాఖ వారు -

—అన్నిటికి ముఖ్యమైన చక్కని వాతావరణాన్ని కల్పించి పరిశోధన నిరాటంకంగా సాగటానికి తోడుపడగావున్న ల.సౌ. నా అర్ధాంగి, గ్రంథముల వెతికి అక్షరముల నందించుటలో ప్రధానులైన మాచిరంజీవులు శ్రీనివాస మూర్తి, వేదవ్యాస్, వైజయంతి -

—సిద్ధాంత వ్యాసాన్ని ముద్రణకు అనుమతించిన కాకతీయ విశ్వవిద్యాలయ ఉన్నతాధికారులు -

—ఈ పుస్తకానికి అమూల్యమైన అభిప్రాయాల నొసంగిన సాహితీమూర్తులు శ్రీ. రామరాజుగారు, సంపత్కుమారాచార్యులుగారు, తిరుమల రామచంద్రగారు, కోదాటి నారాయణరావుగారు, తీర్థం శ్రీధరమూర్తిగారు-

—తక్కువధరకు కాగితాన్ని సమకూర్చిపెట్టిన శ్రీమాన్ మరింగంటి వెంకటరాఘవాచార్యులు (Dy. G.M. పరిశ్రమల శాఖ. A.P) గారు -

—నిర్ణిద్ర దృష్టితో గ్రంథముద్రణ పర్యవేక్షణ మొనర్చిన పెద్దలు-శ్రీమాన్ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారు, ఆత్మీయులు పాండురంగయ్యగారు,

—సిద్ధాంత వ్యాసరచనకు ఉపకరించిన గ్రంథముల పత్రికల రచయితలకు సంపాదకులకు -

—ముఖపత్రాన్ని సిద్ధమొనర్చిన చిత్రకవితా సుధామధురైన మిత్రము "సుధామ"

—గ్రంథాన్ని ముద్దుగా ముద్రించటంలో శ్రమించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ పి. శ్రీనివాస్, ఆయన సిబ్బంది-

ఇంకా ఎందరో పెద్దలు-మిత్రులు- అందరికీ కృతజ్ఞుడను-

నాయీకృషికి సహృదయులు ప్రమాణము.

> 'అఖిల భువన జన్మస్థేమ భంగాదిలీలే
> వినత వివిధభూత వ్రాత రక్షైకదీక్షే
> శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
> మమభవతు పరస్మిన్ శేముషీ భక్తి రూపా'

పాలెం 509215
ప్రమోద ఉగాది
27-3-90 మంగళవారం.

విధేయుడు
శ్రీరంగాచార్య

# విషయానుక్రమణిక

# భూమిక

## పరిధి – ప్రకాశిక

ఒక కుటుంబమునం దొక గొప్ప కవి యుండవచ్చును. ఒక వంశము మొత్తములో నిద్దరు ముగ్గు రుండవచ్చును. వారివలన ఆ కుటుంబము ఆ వంశము ఉద్దీప్త మగును. తర తరాలుగా వారినీ గూర్చి చెప్పుకుందురు. కాని ఒక కుటుంబ మంతయు-వంశ మంతయు-విద్వత్తవి షయమైన సన్నివేశములు చాల తక్కువ. తాళ్ళపాక వారి కుటుంబము ఇందు కరుదైన ఒక ఉదాహరణము. వంశము విషయమున చెప్పుకున్నచో మరింగంటి వారి వంశమే ఈ విధముగా కన్పించును. ఈ వంశమున కాద్యులైన చెన్నయాచార్యుల (క్రీ. శ. 1400 ప్రాంతం) నుండి నేటివరకు వీరిలో దాదాపు క్రమము తప్పక అనేక మంది కవులు, విద్వత్కవులు బహు ముఖముగా సాహిత్య సేవ చేసినారు. ఇందులో గమనించ వలసిన మరి యొక విశేష మున్నది. ఈ వంశము ఆచార్య పీఠము. ఉభయ వేదాంతములలో నిష్ణాతులై, శిష్య శ్రేయస్సు కోరి దేశ సంచారము చేయుచు, భారత భాగవత రామాయణాదులను సాంప్రదాయిక గ్రంథములను ప్రవచనము చేయుచు విశిష్టా ద్వైత ప్రచారమును, భక్తి ప్రపత్తి భావములను విస్తరింప చేసినది. ఇంకొక విశేష మేమన దేశకాల భేదము లేకుండ ఈ నాటి వరకు వీరి కావ్యము లన్నియు దైవాంకితములే తప్ప నరాంకిత మొక్కటియు లేదు. అందును అనేక కావ్యములు నరిసెనగండ్ల నృసింహాంకితములే! నల్లగొండ జిల్లా ఒక విధముగ నృసింహ క్షేత్రము. ఈ మండలమున నరసింహ క్షేత్రములధికము, నృసింహావతారము ప్రహ్లాదుని భక్తి ప్రపత్తులకు ప్రతీక. విశిష్టాద్వైతమునకు భక్తిప్రపత్తులు పరమ విషయములు.

ఒకవైపు ప్రవచన రూపముగా, మరియొక వైపు వివిధ కావ్య నిర్మాణ రూపముగా సంప్రదాయమున రంకితమైన ఇంతటి సుదీర్ఘ వంశము మరి యొకటి కన్పించదు. ఈ వంశము వివిధ శాఖలుగా వివిధ కుటుంబములుగా తెలంగాణ

మున విరివిగా, ఇతరత్ర అరుదుగా వ్యాపించి యున్నది. ఐనను ప్రతి శాఖ - ప్రతి కుటుంబము అంతయో ఇంతయో అనువంశిక సంప్రదాయమును పాటించు చునే యున్నది. ఈ విశేషములు కారణముగా మణింగంటి వంశము వారి సాహితీ సేవను గూర్చి విపులముగా పరిశోధన చేయవలయు నన్న నా కోరిక ఈ నాటిది కాదు.

మణింగంటి రాఘవాచార్యుల వారు రచించిన **'కేశవస్వామి శతకము'** నాకీ వంశ సాహిత్యముతో మొదటి పరిచయము కల్గించినది. నన్నాకర్షించిన ఆ శతకములోని విశేషములతో "మణింగంటి రాఘవాచార్యులు - కేశవస్వామి శతకము" అను నా వ్యాసము 1968 డిసెంబర్ నెల 'భారతి' లో అచ్చయినది. దానిని చూచి ప్రఖ్యాత చరిత్ర పరిశోధకులు పండిత ఆదిరాజు వీరభద్రరావు గారు మెప్పుదలతో వ్రాసిన లేఖలో ......ఇట్లే మణింగంటి వారి రచనలను సంపాదించి పరిచయం చేయండి. చాలా విషయాలు వెలుగులోకి రాగలవు." అనిరి. వారి సూచన నాకొక ఆదేశమై, స్పష్టాస్పష్టముగ నున్న నా కోరికను సువ్యక్తముగా బలపరచినది.

నాటినుండి మణింగంటి కవుల గ్రంథ సేకరణను గూర్చి, సాహిత్య సేవను గూర్చి నా పరిశ్రమ మొదలైనది. **'భారతి'**, **'ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక'**, **'ఆంధ్రభూమి'**, **'ఆంధ్రపత్రిక'** మొదలైన పత్రికలలో ఈ వంశీయుల కావ్యముల కొన్నిటిని గూర్చి, చాటువులు - స్తోత్రముల గూర్చి వివిధ వ్యాసముల వ్రాసినాను. ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ వారు నా పరిష్కరణతో సింగరాచార్యుల **'దశరథరాజ నందన చరిత్ర'** ను రెండు పర్యాయములు (1971, 1980) వెలువరించిరి. ప్రథమముగ నేను నల్లగొండ జిల్లా నుండి సేకరించిన చాటువులను **'చాటు పద్య రత్నావళి'** పేరున 1979 లో ప్రచురించిరి. వేంకట నరసింహాచార్యుల **'శాలాంక నందినీ పరిణయము'**ను నా పరిష్కరణతో ప్రకటించిరి. ఇవి గాక **'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము'** (సింగరాచార్యుల కృతి) వేంకట నరసింహాచార్యుల (ద్వితీయ) వారి **'షట్చక్రబంధూపాఖ్యానము'** అను స్వయముగా ప్రచురించినాను.

ఇన్నిటి 'పీఠిక'లలో అప్పటికి నా దృష్టికి వచ్చిన మేరకు వారి వారి జీవిత సాహితీ విశేషములను చేర్చితిని.

చాటుపద్య సేకరణకై నల్లగొండ జిల్లాలో విస్తృతముగా పర్యటన చేయుచున్నప్పుడు మరింగంటి వారి వంశ విస్తృతిని, సాహిత్య విస్తృతిని, వైవిధ్యమును గూర్చి మరింత సమాచారము లభించినది. దీనితో నేను ఉత్సాహపడి ఇతరత్ర కూడా వ్యాపించియున్న వారి రచనలను దాదాపుగా ఇటీవలి వరకును సంపాదించినాను.

ఇదంతయు **'మరింగంటి కవుల సాహిత్య సేవ'** అను శీర్షికతో నా పరిశోధనకు వస్తువైనది.

ఏ ఒక్క కవినో, ఒక కావ్యమునో, లేదా ఒక ప్రక్రియనో ఉద్దేశించి పరిశోధన చేయుటకును ఒక విశాల వంశము ప్రవచించిన సాహిత్యమును గూర్చి చేయుటకును భేద మున్నది. ఈ సాహిత్యము అనేక కావ్యములతో, వివిధ ప్రక్రియలతో విస్తృత మైనది. అందువలన వీటి నన్నింటిని గురించి వివరించు కొనుటలో విస్తృతికి అవకాశము తక్కువై, ప్రధానముగా ప్రక్రియా స్వరూపమును, కావ్యములో గమనించ దగిన వస్తు చిత్రణ విశేషములను ప్రదర్శించుటకు మాత్రమే అవకాశ ముండును.

ఈ **'భూమిక'**పై ఈ సిద్ధాంత వ్యాస నిర్మాణము జరిగినది.

**వంశమును** గూర్చిన విశేషములు, వంశములోని విద్వత్కవుల పరిచయము మొదటి అంశము. ఇవి ఆ వంశీయుల సాహితీ సేవకు **'ప్రవేశిక'** 'మరింగంటి కవుల సాహిత్యసేవ' ప్రధానాంశముగా గల దీనియందు **'చరిత్ర'** వివరించుట విస్తృతి యగునన్న భావన కల్గినది. తత్కారణమున వీరి అగ్రహార మైన 'కోరుకొండ' ఇతర అగ్రహారములు, రాజమండ్రిలోని 'మరింగంటివారి వీథి' శిష్యులైన 'సురభి' 'మేరెడ్డి' వారి విషయములు - ఏతత్సంబంధములు ప్రస్తకము కాలేదు. **కావ్యావతారికల** విశేషములతో మరింగంటి వారి సాహిత్య పరిచయము, రచనా విశేష స్వరూపాదులు ఆరంభ మగును. ఈ కవుల కావ్య

ముఖ వివిధ ప్రక్రియల రూపమున సంస్కృతాంధ్రములయందు సుమ
**'ఆంధ్ర కావ్య సాహితి'**ని గూర్చి మొదట, **'సంస్కృత కావ్య సాహి**
గూర్చిన విచారణ తర్వాత సాగి, ఒక్కొక్క ప్రక్రియలోని రచనలు అనుశీ
బడినవి. ఇచ్చట కవులకు గాక కావ్యములకే ప్రాధాన్యము. ఈ కవుల కా
భేదముల వలన ఏర్పడిన భాషా విశేషాదులు **'లాక్షణిక మర్యాద'** గా
ప్రవర్తింపబడినవి. మఱింగంటి కవులు కేవలము కావ్యము కొరకు కావ్య
గాక, విశిష్టమైన దృక్పథముతో ప్రత్యేక ప్రయోజనము నుద్దేశించి అ
విధములుగా కావ్యముల రచించినారు. ఈ కారణముగా మొత్తము ఈ
**'శాస్త్రీయ దృక్పథము'** చివరగా నిరూపింపబడినది. వంశమును గు
కావ్యముల గూర్చిన మరికొన్ని విశేషములు, కొన్ని అముద్రిత రచ
**'అనుబంధము'**గా చేరినవి.

ఇది ఈ **'సిద్ధాంత గ్రంథ నిర్మాణ స్వరూపము.**

నిజమునకు సింగరాచార్యుల వారి వంటి ఏ ఒక కవియో, 'ఆ
నందసీ పరిణయము' వంటి ఏ ఒక కావ్యమో ప్రత్యేక పరిశోధనాంశ ము
దగినవి. మరి అట్టి కవు లనేకులు, అట్టి కావ్యము లనేకములు, వారు నిర్
హించిన ప్రబంధ యక్షగానాది వివిధ ప్రక్రియ లన్నియు ఈ గ్రంథమున ఒక్క
చోట ప్రస్తుతీకరించినచో *మఱింగంటి కవుల సాహితీ సేవా సమగ్రస్వరూపము
అవగతమై, అనంత కాలమున ప్రత్యేక వ్యక్తి కావ్య విషయ పరిశోధన
అవకాశము కలుగు నన్న ఉద్దేశ్యము ఈ నిర్మాణమునకు వెనుక నున్నది.

మఱింగంటి వారు తెలంగాణములో-అందున నల్లగొండ జిల్లాలో-వ్యాపించి
యుండుటచే తెలంగాణమున ఒక వంశము సాగించిన నిరంతర సాహిత్య సృష్టి,
తత్ప్రయోజనము వ్యక్తము చేయుటయు ఈ నిర్మాణములోని ఒక ప్రధానాంశము.

---

* 'మఱింగంటి'-అని శకటరేఫయుక్తము. దీనిని వ్యవహారము ననుసరించి సాధురేఫయుక్తముగా కూడ వాడినాను.

మరింగంటివారి ఇష్టదైవము



సిరిసెనగండ్ల లక్ష్మీనృసింహుల సన్నిధి

వీరంతయు ప్రతి సంవత్సరము తమ తమ గురువులను సందర్శించి వారి నుండి సంప్రదాయ బోధనలను గ్రహించుట, చక్రాంకన ధారు లగుట, ఆత్మీయ నిం యుప శిష్యులను నేటికిని కొనసాగుచున్నది.

ఒక్కమాటలో చెప్పవలయు నన్న తెలంగాణమున వీరి శిష్యులు లేని గ్రామములు తక్కువ.

ఒకనాటి సీమా విభాగములలో తెలంగాణమున 'దేవరకొండ సీమ' చాల పెద్దది. ఇప్పటి మహబూబ్‌నగర్ జిల్లాలోని అధికభాగము ఆ నాడు ఈ సీమలో చేరియుండెను.

మరింగంటివారు మొదటినుండియు దేవరకొండ సీమను చెందినవారు కావున ఈ ప్రాంతములో వీరికి శిష్యు లధికము.

'సీమ'లు, 'నాడు'లు పద్ధతి మారి జిల్లాలవారీగా రాష్ట్రపద్ధతి ఏర్పడిన పిమ్మట ఒక ప్రాంతము (సీమ) నకు చెందిన గ్రామములు మరియొక జిల్లాలో చేరినవి. ఈ కారణము వలన - ఆ నాడు మరింగంటి కవులు తమ కృత్యాదులలో చెప్పిన గ్రామములలో కొన్ని నేడు గుంటూరు, కృష్ణా, మహబూబ్‌నగర్, వరంగల్ జిల్లాలలో కలవు.

మరింగంటి వారికి శిష్యులు-అభిమానులు లొసగిన అగ్రహారములు, వసతులు లేనిపక్షమున వలస జీవనోపాధి నిమిత్తము వీరు విడివడి, వేర్వేరు ప్రాంతములలో స్థిరపడినారు. దీనితో పాటు వారి 'శిష్య కవిలె'లను విభాగించుకొనిరి. వీరిలో కొందరికి ఆ ప్రాంతంలో ఇట్లు నూతనశిష్యు లేర్పడినారు. (కరీంనగర్, శ్రీకాకుళం, విశాఖపట్టణం ఉభయ గోదావరులలో వీరు కలరు).

పూర్వము నుండి ప్రస్తుతము మరింగంటివారు నివసించు జిల్లాలు వారి గ్రామములు ఇట్లు గలవు.

1. కరీంనగర్ జిల్లా : వేములవాడ, పల్లి, వ్యాసవాడ, గూడెం, ధర్మపురి, పోతుగల్లు, కరీంనగర్.
2. కృష్ణా జిల్లా : నూజివీడు, మొఖాసా కల్వపూడి, గుడివాడ, జగ్గయ్యపేట, విజయవాడ, లక్ష్మీపురం, తిరువూరు, బందరు.

**ఖమ్మం జిల్లా** : నేలకొండపల్లి, మొండ్రాయి, మధిర, దుమ్ము గూడెం, ఎఱ్ఱబోయినపల్లి, ఖమ్మం, పేరువంచ, కల్లూరు.

**తూర్పుగోదావరి జిల్లా** : కాకినాడ, చిత్రాడ, పాలకొల్లు, సర్పవరం.

**నల్లగొండ జిల్లా** : కనగల్లు, అనుముల, యాదవాకిళ్ళ, సూర్యాపేట, హుజూర్‌నగర్, వాడపల్లి, మిర్యాలగూడెం, నరసింహాపురం, దొండపాడు, యాదగిరి గుట్ట, వలిగొండ, ఇందిరాల, నల్లగొండ.

**మహబూబ్‌నగర్ జిల్లా** : రంగాపురం, కోనాపురం, గంగాపురం. జిలార్‌ఖాన్‌పల్లి, రఘుపతిపేట, కొండనాగుల, మహబూబ్ నగర్.

**మెదక్ జిల్లా** : ధర్మాజిపేట, సిద్ధిపేట, సంగారెడ్డి.

**వరంగల్లు జిల్లా** : మానుకోట, మల్లంపల్లి, దివిటిపల్లి, మునిగలవీడు, బుట్టారెడ్డి గూడెం, గుండంరాజు పల్లి, ఇంచెర్ల, పత్తిపల్లి, పెంచికలపేట, వరంగల్లు, నెల్లికుదురు.

**విశాఖపట్టణం జిల్లా** : భీమునిపట్నం, గుజ్జువాడ, సింహాచలం.

**శ్రీకాకుళము జిల్లా** : శ్రీకూర్మము, బొబ్బిలి, శ్రీకాకుళము.

**హైదరాబాదు జిల్లా** : సీతారాం బాగ్, కేశవగిరి, గడ్డిఅన్నారం, సైదాబాద్ కాలనీ, వనస్థలిపురం, సికింద్రాబాదు, కొంగర (అర్బన్).

పూర్వులు గ్రామ ప్రాంతముందే నివాసముగా చేసికొని, వంశవృత్తినే ధర్మముగా భావించి - దానికితోడు కవితా సంపత్తిని అలంబనముగా తమ జీవితమును గడపినారు. రాను రాను వంశవృత్తులైన శిష్య సందా కాలక్షేపము (పురాణ ప్రవచనము) మొదలగు వానిపై ఆదరము తరువాత వచ్చిన యువతరము ఆంగ్ల విద్యాభ్యాసముచేసి ఉద్యోగముల

యందు స్థిరపడుట వలన పల్లెలలోని కుటుంబములు పట్టణములకు తరలిపోయి నవి. ఉద్యోగముల యందు బదిలీలు మొదలగు వానితో ఒకే కుటుంబము విచ్ఛిన్నమై చెల్లాచెదురై నివాసము ఏర్పాటు చేసికొనవలసి వచ్చినది. ఇట్టి అనేక కారణములవలన మరింగంటివారు అనేక ప్రాంతములయందు స్థిరపడినారు.

గృహ నామముల గూర్చి పరిశీలించునప్పుడు. అవి వారి పూర్వులు నివసించిన గ్రామమో, ఆ ప్రాంతమో, ఒక మహాపురుషుని పేరనో, వీరత్వమునకు విద్వత్తునకు చిహ్నములుగానో ఉండును.

శ్రీ వైష్ణవుల గృహ నామముల యందు పై పద్ధతులు ఒకటి రెండున్నను వీనితో మరికొన్ని పద్ధతులు కన్పట్టును. అవి :

**ఆచార్య నామము :** శ్రీ భాష్యం, వేదాంతం. (శ్రీ మద్రామానుజుల వారికి శ్రీ భాష్య రచనవలన భాష్యకార బిరుదము వచ్చినది.)

**ఆచార్యపీఠ నామము :** భట్టరు, శేషము, సముద్రాల, జానమాపుల్ల.

**ఆచార్యులు నివసించిన ప్రాంతము, గ్రామము :** కందాళ, సంపత్కుమార, ఊరుకుగట్టు.

**శ్రీ విష్ణుక్షేత్ర నామములు :** తిరుమల, శ్రీరంగము, (ఇదియే తిరువరంగము తిరునగరము) గోవర్ధనము, శ్రీ పెరుంబూదూరు, కోవెల, సింహాద్రి.

**ఆచార్య సంబంధ - పౌరుష నామములు :** నల్లాన్ చక్రవర్తుల, అమ్మంగి వాది, ప్రతివాద భయంకర, కొడము సింహం.

ఇట్లు గృహ నామము లేర్పడినవి. మరికొన్ని తమిళ సంప్రదాయ పద్ధతి ననుసరించి ద్రుతాంతముగను, హలంతములుగను కలవు.

ఉదా :- అణ్ణన్, కందాడై, కోయిల్ కందాడై.

ఇక **మరింగంటివారి గృహ నామము** - మొదట నిది 'ఆసూరి', తర్వాత మరింగంటి చేరి ఆసూరి మరింగంటి యైనది. శ్రీమద్రామానుజుల వారి గృహనామము కూడ 'ఆసూరి' (ఈ పేరు గల గ్రామము తమిళనాడులోనున్నది).

ప్రారంభమున వీరు ఆచార్యుల వారి గృహనామమైన '**ఆసూరి***[1] నే ధరించి, తరువాత '**మఱింగంటి**'యను నామ మేర్పడుటకు గల కారణమును తమ రచనలలో నిట్లు చమత్కరించినారు :

"శ్రీలొప్పఁ బంద్రెండు వేల త్రిదండి స
న్న్యాసులు, సప్త సహస్ర సంఖ్యు
లేకాంతి జనవరు, లేకాంతి వరులు దె
బ్బదినాల్గు పేరుఁ బఱఁగినట్టి
గురుచంద్రు లొక లక్ష తిరునామ ధారులు
నలర దిగ్విజయార్థమై గమించి
యనుకూలుర గ్రహించి యన్యుల బోధించి
చెనటుల శిక్షించి శ్రీమతంబు
బూని శేషాంశ సంభవులైన లక్ష్మ
ణార్యు లష్ట దిశల్ గలయంగ నిలిపి
తిరిగి శ్రీరంగధాముని ధృతి భజించి
చేర వచ్చిన నా స్వామి చెంగలించి."

శ్రీరంగనాయక స్వామి లక్ష్మణ దేశికుల వారివైపు చూచి—

కంటిన్ లక్ష్మణ మునివరుఁ
గంటిన్ గూరేశ దేశిక స్వామి - మఱిం
గంటి నదెవ్వరన - 'మఱిం
గంటి' మహాన్వయము దనరె గణ్యంబగుచున్'

('దశరథ...' 1-15-16)

శ్రీమద్రామానుజులవారి వెంట - సాధు భట్టారకులు, కూర నాయకులు, ముదలియాండాన్ మొదలైనవారు శ్రీరంగనాయకస్వామి వద్దకు రాగా, వారిని స్వామి చూచి మిమ్ములగంటిని, మీ వెంట వచ్చిన యీ ఘనుల '**మఱింగంటి**'ని అని పల్కఁగా, అది వీరి గృహనామముగా మారి '**ఆసూరి భట్టరు**'**తో** చేరి '**ఆసూరి భట్టరు మరింగంటి**' యైనదని తెల్పిరి.) ఈ విషయమే - వీరి వివిధ కృతులలో నిట్లు గలదు :

'మును రంగశాయి యతిపతిఁ
గనుఁగొని కూరాధినాథుఁ గాంచి' మఱిం గం
టి' నదెవ్వరన నా శో
భనగతి నాసూరి సాధుభట్టరుఁ డలరెన్'

'పరమ కృపచేత శ్రీరంగపతియె యిట్టు
లానతిచ్చిన శ్రీసూక్తి యన్వయమున
నిల 'మఱిం గంటి' వారను నింటి పేరు
గురు శిఖామణు లెన్నఁగాఁ బరిఢవిల్లె' (సీతా...1-44, 46)

'మునురామానుజ మౌళిఁ గాంచి యటు పై మోదంబు చేకూర భ
ర్త నిరీక్షించుచు సాధుభట్టగురు మూర్ధన్యున్ 'మఱిం గంటి' నం
చనతోక్తిన్ మము గన్న రంగపతివై యారూఢి రక్షింపు మీ
యనవద్య ప్రతిభా ధురంధర! అయోధ్యా రామ! సీతాపతీ!'
('తారక బ్రహ్మ...' 2)

సింగరాచార్యుల తర్వాత గల కవులు ఈ విషయమును—

'కంటిన్ గూరకులేశుని
గంటిన్ దాశరథి మొదలు ఘన దేశికులన్
గంటిన్ వీరెవరో! మఱిం
గంటిని యని రంగవిభుఁడు కాంక్షనడుగఁగన్' ('జనక...'1-27)

**శశవైరి వైభవ దివాకరము నందు-**

'కృత్వాదిగ్వలయం పునర్గతవతో రామానుజస్యాంతికమ్
పార్శ్వే కూరవరేణ సాక మనుగం శ్రీ సాధు భట్టారకమ్'
దృష్ట్వా రంగపతి స్త్వభాషత 'మఱిం గంటీ'తి వాచా స్వయమ్
తస్మా త్తత్పద భూషితం కుల మభూ దాసూరి సాధో ర్భువి.' (4)

**తాలాంక నందినీ పరిణయమున**

'కంటిమి మిముఁ గూరేశులఁ
గంటిమి మీ వెంట వచ్చు ఘను లెవరో 'మఱిం
గంటి' మనిపల్కె నది మా
కింటికి పేరుంటగా మహిన్ రహి కెక్కెన్' (1-95)

అని తమ వంశ నామమును గూర్చి తెల్పగా, వారణాసి అచ్యుతరామకవి **'సురభాణీ పరిణయము'** నందు -

> '................లక్ష్మణ ముని
> గంటి కూరేశుల గంటిని 'మఱిఁ
> గంటి' పిలెవరన గర్గె నప్పటినుండి
> 'మఱిఁగంటి' యన నింటి గురుతు మఱి - ప
> రాశరాహ్వయ భట్టరు ప్రబల కరుణ
> చేత 'భట్టరు'సను పేరు చెందుట 'మఱి
> గంటి భట్టరు' వారని గలిగె నింటి
> పేరు నాసూరి సాధు భట్టారకుండు' (1-34)

అని - వీరికి మొదట 'భట్టరు' వారని - ఈ కారణమున 'మఱింగంటి' చేరి, 'భట్టరు మఱింగంటి'వా రైనారని తెల్పెను.

**ఇక చాటువుల ద్వారా** తెలియు విషయము.

> 'వింటిన్ మీ చరితంబు సూక్తులను నే విశ్వాంతరాళంబులన్
> గంటిన్ దేవరవార్ల బృందమును కాంక్షల్ దీరగా నే 'మఱిం
> గంటిన్ శ్రీ యతిరాజ పుంగవ మహాకారుణ్య పీఠా! యిదే
> వంటన్ నీరు జనించుచుండె చనఁగా కూరేశదేవా! నమో! *2

అని శ్రీరంగ నాయకులే పల్కిరట!

> 'బలువిరి రాక్షసావళియుఁ బ్రైఁబడి కాలుని కంపె రాముఁడున్,
> బలువిడుగుం 'దరూరు' లను పైనము 'బూరుగు గడ్డ' నైఘరో
> చిలిచిత్రమైన కాస 'సంతెఁగౌం' 'నల్లని' వారు జంపరా
> గలరిక 'చింతపట్ల' 'మఱిఁగంట్ల'ను బెట్టక సీత నిమ్మరా' *3

గినియందు చివరి చరణమున **'మరిఁగంటి'** కలదు, మిగిలిన వానిలో ఒక యర్థమున శ్రీ వైష్ణవ గృహనామములు (మరిఁగంటివారి బంధువులు) మరియొక యర్థమున యుద్ధఘంమి చెప్పబడినది.

వీని యన్నిటివలన - శ్రీ రంగనాథుల వారి ఆజ్ఞాపనకు ఫలితముగానే వీరి యింటిపేరు 'మఱింగంటి' యైనట్లు తెలియుచున్నది.

మహబూబ్‌నగర్, నల్లగొండ జిల్లాలలో 'మరికల్లు' అను పేరుగల గ్రామములున్నవి. 'పానుగల్లు' - పానుగంటి, ఆమనగల్లు, ఆమనగంటి తాటికల్లు, తాటికంటి యైన విధముగనే మరికల్లు - మరికంటి యగును. గ్రామ నామము గృహనామముగా స్థిరపడుట సహజము. వీరి గృహనామమైన 'మరింగంటి', ఇట్లేర్పడినదే !

'మరికల్లు' గ్రామములు చరిత్ర ప్రసిద్ధమైనవి, ప్రాచీనములు.*4 వీరి పూర్వు లెవరో ఈ గ్రామమున నివసించియున్న కారణమున వీరు మరింగంటి వారైనారు.

నేటికిని ఈ వంశమువారు ఏ ప్రాంతమున నివసించినను వారి ఇంటి పేరులో పూర్వ నివాస గ్రామము చేరి ప్రచారమైనది. ఉదా :- వరంగల్లులో నున్న మణవాళాచార్యులు గారి పూర్వులని' నరసింహాపురము. వీరు మల్లంపల్లి చేరి తర్వాత వరంగల్లులో స్థిరపడినారు. 'నరసింహాపురం మల్లంపల్లి మరింగంటి వా'రని - వీరికి ప్రసిద్ధి. ఇట్లే రంగాపురంలో నున్నవారు 'యాదవాకిళ్ళ స్తంభాద్రి మరింగంటివారు', నూజివీటివారు 'కనగల్లు మరింగంటి వారు', నరసింహాపురం వారు 'యాదవాకిళ్ళ మరింగంటి వారు', గంగాపురం వారికి 'అనుముల మరింగంటి వారని' ప్రచారము.

ఈ విధముగనే మరికల్లు నుండి వచ్చిన వీరి పూర్వులు 'మరింగంటి' వారైనారు, దీనినే వీరు తమ గ్రంథములయందు చమత్కరించిరి. కాని గృహ నామమైన పూర్వ గ్రామమును పేర్కొనలేదు.

తరువాత నేటి హుజూర్‌నగర్ తాలూకా 'యాదవాకిళ్ళ' గ్రామము వీరి నివాసగ్రామ మైనది. దీనికి కొలది దూరములో నున్న వాడపల్లి నృసింహాలయము నకు మరింగంటి వారే స్థానాచార్యులు. సింగరాచార్యుల వారికి మల్కిభరామ్‌చే 'యాదవాకిళ్ళ' అగ్రహారముగా దాన మీయబడినది.*5

వీరి పూర్వులలో మాధవాచార్యులవారికి ఇరువది మంది పుత్రులు. ఆ నాడు ఇంత సంతానమును తెలంగాణమున 'పుట్టెడు సంతాన'మనుచుండిరి. వింశతి పుత్రులలో పదకొండవవారైన చెన్నయ గారు(శేషావతారము)యాదవాకిళ్ళనుండి

వెళ్ళి దేవరకొండ తాలూకా పణకరాజుపల్లి చేరి - తన మహిమలచే అచట దైవముగా వెలసినారు. వీరికి నాల్గవ తరమున (ప్రపౌత్రుని పుత్రుడు) జన్మించిన తిరువేంగళాచార్యులకు ఎనిమిదిమంది కుమారులు. అప్పలాచార్యులు, జగన్నాథాచార్యులు, సింగరాచార్యులు వీరిలో ప్రసిద్ధులు.

అప్పలాచార్య సోదర వర్గము తమ విద్యాబల ప్రౌఢిచే గోలకొండరాజు మల్కిభరామ్ వద్ద ఆశ్రయమును సంపాదించి, అగ్రహారముల పొంది, సత్కృతులైనారు.

సింగరాచార్యుల తర్వాత వీరి నివాసస్థానము యాదవాకిళ్ళ నుండి మారినది. కొందరు జగ్గయ్యపేట, నూజివీడులలోను, మరి కొందరు 'సిరికొండ' (సూర్యాపేటతా॥) చేరి అచ్చటి నుండి వచ్చి 'నరసింహపురము'లోను స్థిరపడిరి.

సింగరాచార్యుల పౌత్రులైన పరాంకుశాచార్యులు, భట్టరాచార్యులు కల్వకుర్తి తాలూకా 'రంగాపురము'నకు వచ్చి, అప్పుడీ ప్రాంతమున అధికారము నెరపుచున్న 'గున్న' గృహనామము గల రెడ్డిదొరల ప్రాపకము సంపాదించిరి. అట్లు స్థిరపడిన ఈ సోదరద్వయము గున్న పాపిరెడ్డికి రక్షకులు, సలహాదారులైనారు. వీరి అండవలన పాపిరెడ్డి తనపై అధికారులను (నవాబులను) సైతము లెక్కచేయక ఈ పరగణాను పరిపాలించినాడు.

మహావీరులైన ఈ సోదరులు గున్న పాపిరెడ్డికి అండగా యుద్ధమునకు బయలుదేరునప్పుడు ఏక కాలమున ఒక్కొక్కరు బల్లెం, డంక, డాలు ధరించి ఐదారుగురు ఎత్తవలసిన 'జజ్జాయి'ని అవలీలగా పైకెత్తుకొని రొమ్ముకు దట్టించి పేల్చేవారట. ఈ కారణమువలననే వీరికి 'జజ్జాయి మఠంగంటి' వారని ప్రతీతి కల్గినది. ఈ వీరుల జ్ఞాపక చిహ్నముగా 20 సంవత్సరముల క్రితము వరకు రంగాపురము మఠంగంటివారి గృహమున పెద్దకత్తి, బల్లెము, డాలు ఉండెడివి. వీనిలో ఒక్కొక్క దానిని ఇద్దరు మనుష్యులు బలవంతముగా లేపెడివారు [6*].

ఆనాడు-భట్టరాచార్య పరాంకుశాచార్యుల శౌర్యమునకుమెచ్చి, వారియందు గల ఆదరాభిమానములతో గున్న పాపిరెడ్డి 160 ఎకరాల భూమిని వీరికి ధారాదత్త మొనర్చినాడు [7.*] ఇప్పటికిని ఈ భూమి రంగాపురము మఠంగంటివారి అనుభవములో గలదు. ఆ నాటినుండి నేటివరకు రంగాపురము 'గన్న' వారు మఠంగంటి వారి శిష్యులే !

పరాక్రమవంతులైన ఈ సోదరుల సంతాన పరంపరలో ఒక శాఖ 'రంగాపురము'న స్థిరపడగా - మరి కొందరు 'కసగల్లు' ప్రాంతమునకు వెళ్ళినారు. ఈశాఖకు చెందినవారే షోడశప్రబంధనిర్మాత వేంకట నరసింహాచార్యులు. అలాంకనందినీ పరిణయ కర్తయైన వేంకట నరసింహాచార్యులు. ఇచ్చటి నుండి మరల కొందరు అనుములు, సిరికొండ, భీముని పట్టణము, శ్రీకాకుళములకు వెళ్ళి అచట స్థిరపడినారు.

యాదవాశిక్కనుండి వచ్చి నల్లగొండ సమీపములోని 'బంగారు గడ్డ' గ్రామమున స్థిరపడిన వారిలో తిరువేంగళాచార్యులుగారు ఒకరు. వీరు శిష్య సంచారార్థమై నూజివీడు చేరికొని అచట భగవద్విషయ కాలక్షేపము చేయుచుండగా అదే సమయమున తీర్థయాత్రలను ముగించుకొని తిరిగి వచ్చుచున్న కరీంనగర్ జిల్లా 'వేములవాడ', 'పల్లి' దేశముఖులు నూజివీడులో ఆచార్యులవారిని గూర్చి విని, వారిని సందర్శించుకొని తమ ప్రాంతమునకు విచ్చేయ వలసినదిగా వారిని, ప్రార్థించి, సగౌరవముగా 'పల్లి'కి తీసికొనిపోయి, అగ్రహారాది వసతులను గూర్చి అచటనే వీరికి స్థిర నివాసమును ఏర్పాటు చేసినారు. ఈ తిరువేంగళాచార్యులవారి పరంపరయే నేటి వేములవాడ [8] మడింగంటివారు.

హైదరాబాదు చెన్నరాయని గుట్ట (చాంద్రాయణగుట్ట) పైనున్న మడింగంటివారు బొబ్బిలినుండి దాదాపు నాలుగు దశాబ్దములకు పూర్వ మిచటికివచ్చిరి. అప్పుడా ప్రాంతమున కీకారణ్యములో నున్న ఈ పర్వతముపై చెన్న కేశవస్వామిని ప్రతిష్ఠించి, దానికి 'కేశవగిరి చెన్నరాయని గుట్ట' అని పేరు పెట్టినారు. ఈ దేవుని పేర ఆనాడు స్థానికులైన పెద్దలు గోలకొండ నవాబు మంత్రి (ఎవరో?) 600 ఎకరముల భూమిని దత్తము చేసిరి. నేటికిని మడింగంటివారే దీని అధిపతులు.

వీరి వద్ద గల వంశవృక్షము సింగరాచార్యుల వారి పితామహుల నుండి వేరయినని. "శ్రీరంగమునుండి నేరుగా మేము బొబ్బిలికి చేరినాము" అని వీరు చెప్పుదురు [9].

సింగచార్యుల తండ్రి తిరువేంగళాచార్యుల నాడు 'ధర్మపురి'కి చెందిన మణింగంటివారు 350 సం.ల క్రితము వరంగల్ జిల్లా '**నెల్లికుదురు**' గ్రామమునకు వచ్చి, తరువాత 'మునిగలవీడు'లో స్థిరపడినారు.

ఇట్లు వివిధ గ్రామములలో వివిధ రకములుగా నున్న వీరియందు కొందరిలో ఆచార్య పీఠ పద్ధతి కలదు.

తెలంగాణమున ప్రశస్తి వహించి పెద్దవైన ఆచార్య పీఠములందు '**కందాళ**,' '**భట్టరు**', '**మరింగంటి**', '**సముద్రాల**' ముఖ్యమైనవి. పూర్వాచార్య పీఠములైన '**వానమామలై**', '**పరకాల**', '**అహోబిల**' నాను పీఠములు ప్రసిద్ధములు. పీఠాధిపతులైన వీరు దేశసంచార మొనర్చి సంప్రదాయ ప్రచారమొనర్చుటకు వ్యవధి యుండనందున వారి శిష్యవర్గమున కొందరికి ఆ బాధ్యతల నప్పగింతురు. అధిపతుల ఆదేశానుసారము శిష్యులు వివిధ ప్రాంతములయందు సంచరించుచు విశిష్టాద్వైత విషయ ప్రచార మొనర్చుచు సంప్రదాయ పరిరక్షణ బాధ్యత వహింతురు. వీరికి పీఠాధిపతుల వలెనే గౌరవ సత్కారములు జరుగును.

పైన పేర్కొనిన 'కందాళ' మొదలైన ఆచార్యపీఠము లిట్టివే ! వీనిలో మణింగంటి వారి పీఠము అగ్రేసరమైనది. ఎందరికో తప్త చక్రాంకన ప్రదానము చేసి విశిష్టాద్వైత విషయముల సులభముగా తెలివిడి చేయుటకు వీరు సంప్రదాయ విద్యతో కవితా సంపత్తిని జోడించి అనేక ప్రాంతములయందు ఎందరినో తమ శిష్యులుగా చేసికొనిరి. నేటికిని ఈ శిష్యవర్గము వేష భాషా సంప్రదాయములయందు విశిష్టాద్వైత పద్ధతులనే పాటింతురు.

మణింగంటి వారు యజుశ్శాఖాధ్యయులైన శ్రీ వైష్ణవులు. మౌద్గల్య గోత్రులు. ఆంగీరస భార్మ్యశ్వ *[10], మౌద్గల్య జార్మ్యశ్వ త్రయార్షేయులు. ఆపస్తంబ సూత్రులు. వీరి సంబంధ బాంధవ్యములు తెలంగాణముననే గాక ఇతర ప్రాంతములలోను విస్తరిల్లి - దరూరు, **కోవెల**, **కందాడ**, **శేషము**, **గోవర్ధనము**, **చించా పట్టణము**, కండ్లకుంట, **గోమఠం**, **నలంధిఘళ్ (నలదిగ)**, **ముడుంబ**, **భట్టరు**, **తిరునగిరి**, **నెమిలికొండ**, **కంయాల**, **కారంపూడి**, **నల్లాన్ చక్రవర్తుల**, **ఓలేటి**, **వంగల**, **కొడుమ సింహం** - గృహనామములు గల వారితో నేటికిని బంధుత్వములు గలవు.

వీనియందు ముదుంబ, నల్లంచెఘళ్, చించాపట్టణము, వరూతు వారి బాంధవ్యములు వీరికి చాల ప్రాచీన కాలము నుండి యున్నవి. సింగరాచార్యుల వారి ముర్తాత తండ్రి శేషరూపియైన చెన్నయాచార్యులు. వీరి తల్లి నల్లందిఘళ్ వారి యింటి ఆడపడుచని—

'పాయక నలందిఘళ్ నా
రాయణ జియ్యరుని మేనయల్లుండై - య
త్యాయత కీర్తుల మించెన్
ధీయుత మణిగంటి చెన్నదేశికుఁ డెలమిన్' (సీతా. 1-43)

అను ఈ పద్యము వలన తెలియుచున్నది.

ఇట్లే ముదుంబ చించాపట్టణము వారి బంధుత్వముల గూర్చి **'జనకీ సుతాభ్యుదయ'** (1-20), **'క్షత్రబంధూపాఖ్యానముల'** యందు (1-26-88) గలదు.

వివిధ ప్రాంతముల యందు స్థిరపడిన మణింగంటి వారి కుటుంబములు వారి శిష్యులను విభాగించుకొని ఒప్పందము పత్రములు వ్రాసికొనిరి. దాని ప్రకారము ఈ నాటికిని-

శిష్యుల గుర్తుకై వీరు ఏర్పరచుకొనిన పద్ధతి :

1. **యాదవాకిళ్ళ మణింగంటి :** సింగరాచార్యుల విభాగములో ఉందురు. దీనిలో రంగాపురము వారు చేరుదురు.
2. **కనగల్లు మణింగంటి :** వేంకట నరసింహాచార్యులు (బాలాంబ... కర్త) అనుముల, భీముని పట్నం - సూర్యా పేట మొఖాసా కల్వపూడి- వారు.
3. **నరసింహాపురం మణింగంటి:** అప్పల దేశికులవారు ముఖ్యులు. దీనిలో మానుకోట, దివిటిపల్లి, గందంరాజుపల్లి వారు చేరియున్నారు.
4. **మల్లంపల్లి మణింగంటి :** నరసింహాపురంనుంచి మల్లంపల్లికి చేరినారు.

5. **మునిగలవీడు మఱింగంటి** : వీరు ధర్మపురి నుండి వచ్చి వరంగల్ జిల్లా 'నెల్లికుదురు' చేరుకొని తర్వాత, మునిగల వీడులో స్థిరపడి 'మునిగల వీడువా'రైనారు.
6. **బొబ్బిలి మఱింగంటి** : హైదరాబాదు చెన్నరాయని గుట్టపై యున్న వీరికి-ఆంధ్ర మఱింగంటి వారని, 'బొబ్బిలి వార'ని ప్రసిద్ధి.
7. **పల్లి, వేములవాడ మఱింగంటి:** కరీంనగరం జిల్లా మాత్రమే.

ఈనాడు కుటుంబములు పెరిగి విడివడుటవలన ఈ విభాగముల నుండి మరికొన్ని విభాగము లేర్పడినవి*11.

మఱింగంటి వారు ఏ ప్రాంతమున స్థిరపడినను వారి ఆచారమును సంప్రదాయ పద్ధతులను విడనాడలేదు. విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకై వీరి శక్తియుక్తులను ప్రదర్శించి, ఎందరో జమీందారులను, దొరలను, మక్తా దారులను, ధనవంతులను భక్తుల గావించి వారి ఆదరాభిమానముల - ప్రోత్సాహము వలన ఎందరినో శ్రీవైష్ణవ మతాభిమానులుగా నొనర్చిరి. ఈ విషయమున ఇతర ప్రాంతములకన్న తెలంగాణా ప్రాంతమున వీరు చేసిన కృషి ప్రత్యేక మైనది.

గోలకొండ నవాబులకన్న పూర్వమునుండి తెలంగాణా ప్రాంతమున అధికారము నెరపిన మహమ్మదీయులు ఇచటి ప్రజలను బలవంతముగా తమ మతములో చేర్చుకొనుచుండిరి. దీనికి అధికారులైన ముసల్మాను రాజుల అండదండలు లభించినవి. ఇట్టి పద్ధతి హైదరాబాద్ పోలీసు చర్య జరుగువరకు కొనసాగినది. ఆ నాడు హిందువులైన వారిలో కొందరు పెద్దలు, ధనవంతులు, అధికారులు సైతము తమ వేష భాషలను మహమ్మదీయాధికారుల కనువుగా మార్చికొని, వారి లపువు ఆజ్ఞలతో వర్తించుచు, చిన్న వర్గాల జనమును బలవంతముగా తురక మతములో చేర్పించుచు అధికారుల మన్ననలను పొందుచుండిరి*12.

పూర్వమునుండియు శైవ, వైష్ణవ మతములు అన్యమత పరివర్తనమును నిరసించి వానివాని పద్ధతుల ద్వారా ప్రజలను వైదిక మతాభిమానుల చేయ గలిగినవి.

శ్రీవైష్ణవులు కేవలము పాండిత్య ప్రకర్షతోనే గాక, దేశికవితా పద్ధతి బరగిన కీర్తనలు, గేయములు, పురాణ, హరికథా కాలక్షేపాదులతో ప్రజలను తమవైపు త్రిప్పికొని, శ్రీమతప్రచార మొనర్చుచు, సంకటకాలమున తమను తాము రక్షించుకొని ప్రజావాహినిని పరధర్మమార్గముచకు వెడలనీయలేదు.

వీరి ప్రచారములో ఆళ్వారుల బోధనలు, శ్రీ రామానుజ సూక్తులు, దివ్య ప్రబంధ మాధురి భక్తజనులకు సులభముగా తెలియునట్లు శతక, యక్షగాన ద్విపద రచనలతోబాటు నూతన ప్రక్రియయైన గేయ రూపమగు తిరునామము రచించి - వీనిద్వారా సంప్రదాయ విశేషములను ప్రచార మొనర్చిరి.

వీరు ఈ కార్యక్రమములను విష్ణ్వాలయములందే గాక వీరి నాపటిం గౌరవించిన పెద్దల గృహములలో - 'చందనగోష్ఠి', 'కాలక్షేపము'ల పేరి ఏర్పాటు చేయించి, ఎందరికో సులభరీతిని విశిష్టాద్వైత సాహితీ సంప్రదాయము వెల్లడి చేసిరి.

ఈ రకమైన పద్ధతులు తెలంగాణమున భట్టరు, కందాళ, సముద్రా పీఠముల ద్వారా జరుగుచున్నను, వీరిని మించి మరింగంటివారు మారుమూల గ్రామములలో సంచరించుచు, జీర్ణదేవాలయోద్ధరణ మొనర్చి, ప్రజలలో భక్తి భావమును నెలకొల్పుచు ఎందరినో తమ శిష్యులుగా చేసికొని, ప్రతి దేవాలయము నందును పాంచరాత్ర నిత్యార్చనా పద్ధతిని పటిష్ఠమొనర్చి, వీని నిర్వహణమునకై భక్తు లొసంగిన అగ్రహారాదుల గ్రహించి, తెలంగాణ మంతటను తమ ముద్ర వేయగలిగినారు.

దీనివల్ల సాంఘికముగా వైదిక మతవ్యాప్తి జరిగి, విధర్మీయ పరివర్తన తగ్గిపోయినది.

మరింగంటివారి కాలక్షేప భాగవత గోష్ఠులు, తిరునామములు నేడు పూర్వ మంత విరివిగా ప్రచారమున లేకున్నను, ఇప్పటికిని వీరి శిష్యసంచార సమయ మున పెద్దలద్వారా దాని వైభవము వ్యక్తమగును. నల్లగొండ, మహబూబ్‌నగర్, కరీంనగర్, వరంగల్ జిల్లాలలో నున్న వృద్ధులైన వీరి శిష్యులకు భగవద్విషయక తిరునామము లెన్నియో నేటికిని కంఠపాఠముగా గలవు.

తెలంగాణమున ఈ నాడు ఎచ్చట భాగవత గోష్ఠులు జరిగినను వాని యందు అనుసంధానము చేయబడు తిరునామ-మంగళహారతులలో మఱింగంటి వారివే అధికము!

ఈ విధముగా పూర్వము నుండి ఆచార్యపీఠస్థులై మఱింగంటివారు శ్రీమత ప్రచార, సంరక్షణముల నిమిత్తము తమ శక్తియుక్తులతో పాటు అనేక ప్రక్రియలలో గ్రంథ రచన మొనర్చి సాహితిసేవ చేసినారు.

## సూచికలు

1. మఱింగంటివారి వంశము మౌద్గల్య మహర్షి నుండి ప్రారంభమైనది. మౌద్గల్యుని పుత్రుడు ఆసూరి కేశవాచార్యులు. ఈయన కుమారుడు ఆసూరి సాధుభట్టారకుడు. ఇచటి నుండియే వీరు 'ఆసూరి'ని ధరించి ఆసూరి భట్టరువారై - 'మఱింగంటి' వలన 'ఆసూరిభట్టరు మఱింగంటి' యైనట్లు 'నృకంఠీరవాభ్యుదయము', 'సురతాణీ పరిణయము'ల ద్వారా తెలియు చున్నది. ఈ మౌద్గల్య మహర్షి నల చక్రవర్తికి అల్లుడు, ఇతని భార్య 'నాలాయిని'. మఱుజన్మలో ఈమెయే ద్రౌపది యైనది.
2. ఈ పద్యము ఆసూరి కేశవ కృత మని మణవాళాచార్యులుగారు తెల్పిరి.
3. 'బంధు రామాయణము' లోనిదని మఱింగంటి రామచంద్రాచార్యులుగారు వినిపించిరి.
4. క్రీ.శ. 1178నాటి 'భీమదానకర్ణుని మామిళ్ళపల్లి శాసనము' నందు, నేటి అచ్చంపేట తాలూకా 'మరికల్లు' గ్రామమును మామిళ్ళపల్లి నృసింహ స్వామి పేర దానమొసంగినట్లు కలదు. ఇప్పుడీ గ్రామము 'గట్టుతుమ్మెన' వద్ద (అచ్చంపేట తా॥) నున్నది, H. A. S. S. No. 19, పుటలు 61, 62.
5. 'గోదావధూటీ పరిణయము', 'దశరథ రాజ నందన చరిత్ర'-కవి వంశ వర్ణనలో ఈ విషయము తెల్పబడినది.
6. మఱింగంటి రంగ కృష్ణమాచార్యులు గారు (రంగాపురము) చెప్పిన విషయము.

7. ఈ విషయమును రంగాపురము మటింగంటి వారే గాక-ఈ గ్రామమున గల గున్న బాలకృష్ణారెడ్డి, రంగారెడ్డి, సీతారామరెడ్డి గారలును చెప్పిరి.
8. మటింగంటి శ్రీరంగాచార్యులవారి ద్వారా సేకరించిన సమాచారము.
(సీతారాం బాగ్)
9. హైదరాబాదు బర్కత్‌పురాలోనున్న మటింగంటి శ్రీనివాసరంగాచార్యులు గారు తెల్పిన విషయము, వీరివద్ద ఈ సమాచారమునకు సంబంధించిన ప్రాచీన పత్రములు గలవు.
10. మౌద్గల్య గోత్రులలో నాలుగు రకముల ప్రవర లిట్లున్నవి.
ముద్గలాదీనామ్ - 1. ఆంగిరస - భార్మ్యశ్వ - మౌద్గల్య
(భార్మ్యశ్వస్యస్థానే భార్మ్యశ్వ ఇతి విభినాః)
2. తార్క్ష్య, భార్మ్యశ్వ, మౌద్గల్య.
3. ఆంగిరస, తార్క్ష్య, మౌద్గల్య.
కేచిత్ భారుణ్య, తార్క్ష్య, మౌద్గల్య ఇతి వదంతి, అపరో న లభ్యతే:
'గోత్రప్రవర సంగ్రహము' 41వ, 42వ పుటలు.
11. నల్లగొండ, వరంగల్, కరీంనగర్ జిల్లాలలోని మటింగంటి వారివద్ద గల 'శిష్య సంచార ఒప్పందం' పత్రాలను బట్టి ఈ విభాగములు చేయ బడినవి.
12. 'చిల్లర దేవుళ్ళు', 'పట్లవజ్వాల' నవలలలో ఈ విషయములు వివరింపబడి నవి.

## 2

# కవి పండితులు

*ఆంధ్రభాషా నిరోష్ఠ్య మహాప్రబంధ
రాజి రచనా ధురీణు కర్ణాటరాయ
లబ్ధ 'కవి సార్వభౌమ' కల్యాణ బిరుద
శాలి మణుకంటి సింగరాచార్యు(దలతు' (రాజనీతి రత్నాకరము)

గోలకొండ సుల్తానులు తమ యాస్థానమున సంస్కృతాంధ్ర కవి పండిత వర్గమును పోషించి వారి గ్రంథములలో కొన్నిటిని అంకితము బొంది తెలుగు ప్రభువులుగా కీర్తింపబడినారు. ఆ నాడు గోలకొండ సుల్తానుల వద్ద నున్న ఉన్నతోద్యోగులు సైతము సాహితీప్రియంభావుకులై కృతి కన్యల వరించుట యొక విశేషము. వీరి యందరి ఆదరాభిమానములతో వర్ధిల్లిన సంస్కృతాంధ్ర కవులలో గణేశుడు, తెలగన, అద్దంకి గంగాధరుడు, సారంగు తమ్మయ్య, నేబతి కృష్ణమంత్రి, కందుకూరి రుద్రకవి మొదలైన వారు గలరు. వీరితో పాటు ఎందరో ఉర్దూ - పారసీకకవులు ఈ ఆస్థానమున పేరు గాంచిరి. అట్టి వారిలో 'తబయా', 'జుహూరీ', 'నుస్రతీ' ముఖ్యులు. మరియొక విశేష మేమన - మల్కిభ రామ్‌గా ప్రఖ్యాతుడైన ఇబ్రహీం ఖుతుబ్‌షా ఉర్దూ పారసీకములయందే గాక తెలుగులోను కవిత్వము చెప్పినట్లు ప్రతీతి. *1

కవితా రసికుడైన ఈ రాజుచే సమాదరింపబడిన ప్రౌఢ కవి పండిత వర్గమునందు మరింగంటి కవులలో ప్రఖ్యాతులైన జగన్నాథాచార్యులు, అప్పలాచార్యులు, సింగరాచార్యులు కలరు*1B.

ఈ సోదర త్రయమునకు పూర్వము ఈ వంశమున దైవాంశ సంభూతులు, తపస్సంపన్నులు, ప్రసిద్ధులైన కవి పండితులు కొందరున్నట్లు వీరి రచనల వలన తెలియుచున్నది. అట్టి వారిలో ఈ క్రిందివారు ముఖ్యులు:

## 1. చెన్నయాచార్యులు

సింగరాచార్యులకు పూర్వము ఆరవ తరములో* (క్రీ. శ. 1380 ప్రాంతము) నున్న ఈయన మహా ప్రభావ సంపన్నుడు. మాతృగర్భమునుండి వెలువడునపుడు సర్పరూపిగా కన్పడి మాయమై మనుష్య రూపమును దాల్చి చిన్నతనము నుండియే అనేక మహిమలను జూపుచు దైవ సమానుడుగా పరిగణింపబడెను.

కొంత కాలము తర్వాత దేవరకొండ తాలూకాలోని అజుమాపుర గ్రామ సమీపమున గల పర్వతముపై నివాస మేర్పరచుకొని భక్తులచే పూజ లందుచు చరమ కాలమున మరల శేషాకృతి దాల్చిన చెన్నయాచార్యుల గూర్చి ఆ ప్రాంతమున అనేక కథలు ప్రచారమున గలవు.

అజుమాపుర శైలముపై శ్రీ దేవాలయమున గల పుట్టయందు చెన్నయగారు శేషరూపిగా నున్నాడని విశ్వసించుచు ఆ పుట్టయందు పాలుబోసి మ్రొక్కుకొనుట ఇచటి ప్రజలలో నేటికిని గల యొక ఆచారము. వీరి పేరు తలచిన మాత్రముననే వ్యవసాయ భూములయందు - పశువుల మందయందు - గృహములందు సంతానబాధలు తొలగిపోవునని వీరికి గల ప్రగాఢ విశ్వాసము. వీనికి తోడు ప్రతి కుటుంబమున నొకరికి 'చెన్నయ' పేరు పెట్టుటయు కలదు.

మరింగంటివారు - చెన్నయాచార్యులను తమ వంశమున అవతరించిన 'అనంతాళ్వార్' అందురు. వీరిలో చెన్నయాచార్య నామధేయముల కిదియే కారణము. ఇక ఈ వంశ కవుల రచనలలో చెన్నయ గారిని గూర్చి - దశరథ రాజనందన చరిత్రమున (1. 18-20, 22) ఇట్లు గలదు :

అతనికి ఫలించె 'సకల రాజాధిరాజ
రాజ మకుటాగ్ర ఘటిత చిరత్నరత్న
బహుళ నీరాజనాభి విభ్రాజితాంఘ్రి
సరసిజుడు చెన్నయాచార్య చక్రవర్తి'



తన జననీ గర్భంబున
జనియించెడి వేళ నొక భుజంగము కవయ
కనుబట్టి యనంతాళ్వా
రను పేరన్ బరగి చెన్నయార్యుం డలరెన్

'చెలిమి గజేంద్రవల్లభునిచేత సపర్యలు గొంటఁ, గాన బె
బ్బులి రదనంబు లూడ్చి వడిఁ బోనిడుటల్, తళిహ్రప్రసాదమున్
గెలచగు బ్రహ్మచైత్యునకు బెట్టుటలున్ జెను దాము ముక్తి, కిం
పలరఁగ బంపుటల్ గల మహాత్ముఁడు చెన్నగురుండు భాసిలెన్'

వేదశాస్త్ర పురాణ విద్యల నలరారు
చక్రవర్తుల గెల్చి విక్రమించె
నవని బండొమ్మంద్ర యన్నలతోఁ బుట్టి
హరు లీల ఫాలాక్షుఁ డగుచు నలరె
శ్రీమతంబు ప్రసిద్ధిఁ జేసెనీ మణవాళ
యతికి సమానుఁడై యతిశయిల్లె
సూరి నలందిఘాళ్ నారాయణస్వామి
భాగినేయసత కీర్తి పరిఢవిల్లె

పొలి పైతంబు ముగుదు లబ్ధముల తెల్ల
నింటి కొంగుగ విలసిల్లినిట్టి చెన్న
గేశిసనదు తనూజులై తిరుమలయ్య,
భట్టరుఁడు, సింగరప్పఁడు ప్రబలి రందు'

**శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణమున** (1-49-50) ఇట్లు కలదు :

తగ ననంతాహ్వా రన దనరినట్టి
యురగపతి సంతతిగ తల్లి దుద్భవించె
వినుఁ గుణవర్తి ప్రత్యక్ష విష్ణుమూర్తి
చారుతర శ్రీశి చెన్నయాచార్య మౌళి.'

"సిరుల దేవరకొండకు చేర్వ 'పణక
రాజుపల్లియ' గట్టుపై రాజు లెన్న
శ్రీ మణింగంటి చెన్నదేశిక శశాంకు
డహహా! మణిం గంటి చెన్నరాయం డన వెలసె"

అని సింగరాచార్యులు తెల్పగా - బహు గ్రంథకర్తయైన **వేంకట నరసింహాచార్యులు** ఇట్లు తెలిపెను :

'కఠిన పాషండ జన మద లుఠిత బౌద్ధ
వని నతి బలాహకౌఘ ఝంపాని లోర్వి
వర మకుట ఘటిత విలాసి చరణ యుగళ
నరసింహుడు చెన్నయాచార్య చక్రవర్తి' (చల్వ... 1-24)

'గురుతరంబైన దేవరకొండసీమ
యందు- నణ్మాపురంబను నగ్రహార
మెలమి నార్జించి యప్పురి యందు-చెన్న
రాయకోవెల గట్టించె రమ్యముగను' (నృకం...1-38)

ఇవే విషయములు వీరి ఇతర కృతులయందును తెల్పబడినవి;

**'శఠ వైరి వైభవ దివాకరము'** నందు ఇట్లు కలదు :

తదీయ సుతవింశతౌ నిఖిల వేదశాస్త్రావళీ
స్వయంవరణ లక్షితా సదృశ వైభవాడంబరః ।
నిశోదయవశా స్ఫురత్ కృణ సహస్ర శేషాకృతి
ప్రవర్తన మహత్త్వథా స్ఫగతి చెన్నగుర్వగ్రణీః ॥ 12

పన్నద్విపార్చిత పదాంబురుహోపనీత
కాష్ఠాల దారుణ తమః పదతీర్థదానాత్ ।
రక్షో మహాభుజగయో రతిశ ద్విరుంభం
శ్రీ చెన్నదేశిక వరః కథ ముక్తి గణ్యః ॥ 13

శ్రుతి ప్రభృతి విద్యయా విజిత చక్రవర్తి ప్రభో
నృసింహ ఇవ పారదృగ్వరవరర్షి సాహాయ్యకృత్।
బభౌ భువి నలంతిఘళ్ యతి వరేణ్య నారాయణ
శ్వశ్రు ప్రియ తనూభవ స్సపది చెన్నయార్య ప్రభుః॥ 14
దేవతా క్షితిభృత్సిమ్ని ఫణిరాజపలీ గిరౌ।
స్వయం వ్యక్తో మఱింగంటి చెన్నయార్యో విరాజతే॥ 15

అని వీరి విద్యా ప్రభావాదులు వర్ణింపబడినవి.

మఱింగంటి వారికి - చెన్నయాచార్యులవారు సాక్షాత్ శేషావతర మనియే విశ్వాసము. వీరి సర్పరూప జన్మ విశేషముల గూర్చి వారు మిక్కిలిగా చెప్పుదురు.

చెన్నయాచార్యుల వారి జన్మ విషయము నమ్మదగినట్టిదే యనుటకు ఇట్టి సన్నివేశములు మరికొన్ని గలవు, వానిలో—

1. త్రీల సారస్వతమున 'పాము పాట'గా ప్రఖ్యాతినందిన 'ధర్మాంగద' కథ ఇట్టిదే - చాల ప్రాచీనమైనది.

2. వరంగల్ జిల్లా రాయపర్తి గ్రామమున నాలుగు శతాబ్దములకు పూర్వము - 'ఇరువంటి' వారనే వైదిక కుటుంబమున ఒక స్త్రీ నవ మాసములు గర్భమును మోసి కృష్ణసర్ప పరివేష్టితు డైన శిశువును ప్రసవించెను. ఆ సర్ప రాజమును వారు కన్న కుమారునివలె ప్రేమించి పోషించుచు ఉపనయనాది సంస్కారముల నొనరించిరి. 25 సంవత్సరముల వయస్సువరకు జీవించిన ఆ సర్పరాజము ఇంటివారి యేమరుపాటున ఒకనాడు 'దాలిగుంట' యందు పడి మరణించినది. ఉపనీత సర్పము కావున వారు దానికి శ్రాద్ధ కర్మల చేసినారు. దేహము వీడిన ఫణిరాజు ఇంటి వారికి స్వప్నమున గన్పడి తన పేరును గృహ నామముగా మార్చుకొనవలసినదని కోరెను. అప్పటినుండి 'ఇరువంటి' వారు 'ఫణిభట్ల' వారుగా మారిరి నేటికిని ఈ కుటుంబములవారు ఆంధ్ర తెలంగాణ ప్రాంతముల యందు గలరు. రాయపర్తి గ్రామమున ఫణీంద్రుడు జన్మించిన స్థల మిదియే యని గ్రామస్థు లిప్పటికిని చెప్పుదురు' ३*.

3. మరియొక కథ - సూర్యాపేట తాలూకా 'రేపాల'లో జరిగినది. 180 సం.లకు పూర్వము ఈ గ్రామమున 'తిరుమల' గృహనామముగల వైష్ణవుల గృహమున జన్మించిన శేషాచార్యుల వారు పుట్టుకతో సర్పరూపి. ఆ సమయమున అందరి ప్రార్థనలవల్ల శేషుడు మానవాకృతి దాల్చినాడు. అందుకే వారి పేరు శేషాచార్యులుగా నిర్ణయించిరి. వీరు పెరిగి పెద్దవారైనను లౌకిక విషయముల పట్టించుకొనక నిరంతరము ధ్యానముద్రలో మౌనిగా నుండువారు. వశ్యవాక్కులైన ఆచార్యులవారి సందర్శనార్థము ఎందరో వచ్చి పోవుచుండిరి. దైవరూపముగా భావింపబడు ఆచార్యులవారు విచిత్రజీవులు. వారు ఏ మాట పలికినను అది తప్పక జరుగుచుండెను. వీరిని భోజనమునకు రమ్మని పిలిచిన వచ్చి కూర్చుని ఎంత పెట్టిన అంత తినువారు. 'చాలు ముగించండి' అనినచో ముగించి లేచేవారు.

ఒకమారు రేపాల నృసింహస్వామి సందర్శనార్థమై కీసర రుక్కమ్మగారు విచ్చేసి, శేషాచార్యుల వారి వద్దకు వెళ్ళినదట! ఆచార్యులవారి అర్ధాంగి లోనికి వెళ్ళి 'దొరసాని గారు మీ దర్శనార్థము వచ్చినారు.' అనుటకు బదులు పొరపాటున 'దొరవారు వచ్చినారు' అని చెప్పినది. రుక్కమ్మరావు గారు ఆచార్యులవారి సన్నిధికి వెళ్ళగనే 'రాజ్యాధికార ప్రాప్తిరస్తు'అని ఆమెకు మంగళాశాసన మొసంగినారు. వీరి వాక్ప్రభావమువలన అచిరకాలములోనే రుక్కమ్మరావు గారికి వైధవ్యము సంప్రాప్తించి, పురుష సంతతి లేనందున ఈమెయే 'మునగాల రాజా రుక్కమ్మారావు'గా వ్యవహరింపబడినది. అనంతరము వీరి పరంపరలోనే 'నెల్లిబుదురు' నుండి దత్తుగా వచ్చి క్రీ. శ. 1883లో రాజా నాయని వెంకటరంగారావు గారు 'మునగాల - నడిగూడెం' ఎస్టేటుకు అధిపతులైనారు *4.

తిరుమల శేషాచార్యులవారిని గూర్చిన కథలు రేపాల, మునగాల, సిరికొండ నరసింహాపుర ప్రాంతమున ప్రచారములో గలవు.

4. నల్లగొండ జిల్లాలోని 'శ్రీరామకవచం' గృహనామముగల స్మార్త కుటుంబము నందును ఇట్టి సర్పజన్మ విషయమే గలదు. నేటికిని వారి పెళ్ళిళ్ళయు నాగ వల్లి యుతములు.

నాగపూజ, నాగజాతి ప్రాచీనములు. కాని సర్పరూపమున మానవుడు జన్మించి ప్రతిభ జూపుట ఆశ్చర్యకరమైన విషయము. పైన తెల్పిన కథలవలన ఇట్టి పుట్టుక యథార్థమే యని విశ్వసింప వీలగుచున్నది. కావున మఱింగంటివారు తెల్పిన చెన్నదేశికుల జన్మ, ప్రతిభా ప్రాభవాదులు కట్టుకథలు కావు. నేటికిని వారిని 'శేషావతారము'గా ఎందరో పూజించుట ప్రత్యక్ష సాక్ష్యము.

## 2. తిరువేంగళాచార్యులు :

చెన్నయాచార్యులకు ఐదవ తరములోనున్న వీరు సింగరాచార్యుల జనకులు. ఆ నాడు విశిష్టాద్వైత సంప్రదాయ పరిరక్షణ, ప్రచారము లొనర్చిన ఈ తిరువేంగళాచార్యులవారిని గూర్చి వారి కుమారుని రచనలయందేగాక అనంతర కవుల రచనలయందును విశేషముగా తెల్పబడినది. వానియందు—

'కమనీయమై యొప్పు కలిమికి రారాజు
గాంభీర్య గరిమకు కంధి రాజు
రూప సౌందర్యాదిరూఢికి రతి రాజు
కడు ధైర్యలక్ష్మికి గట్లరాజు
ఘనతర సత్కాంతి కళలకు ద్విజరాజు
తథ్య వాక్యములకు ధర్మరాజు
విరివిగ సద్భోగ వితతికి సురరాజు
ఘనభాగ్య గరిమకు కమలరాజు,
పరమ ద్రావిడ యామూరి పంశరాజు
గురుతరం బైన మౌద్గల్య గోత్రరాజు
చతుర మఱిగంటి వేంగళాచార్యరాజు
రాజరాజాధి దేశిక రాజరాజు.' (సీతా. 1.55)

అని వీరి ప్రభావము వర్ణితము. ఈ తిరువేంగళాచార్యులవారు ఆ నాడు వివిధ ప్రాంతములందు సంచరించి, అనేక విష్ణ్వాలయములకు సంప్రోక్షణాదు లొనర్చి ఉద్ధరించి, ఆ యా సన్నిధులయందు శ్రీవైష్ణవ స్వాములు తీర్థప్రసాద పరిగ్రహణ మొనర్చుటకు వీలు కల్పించినారు*5. ఈ కార్యక్రమమున వీరు ఏ ఏ దేవాలయములు సేవించినది ఈ పద్యమువలన తెలియును:

'దాపున నా యనంతగిరి, ధర్మపురీస్థలి, యూరుగొండ, గం
గాపురి, బ్రహ్మరాజపురి, కర్పర, రేబలె - యెండబెట్ల - బా
దేపలి యాదియైన హరితీర్థములన్ గురురాయ పట్టణ
స్థాపకుఁడై చెలంగె బుధసమ్మతి వేంగళనాథుఁ డెంతయున్'

(సీతా... 1-56)

దీనియందు తెల్పబడిన అనంతగిరి,ఊరుగొండ, బ్రహ్మరాజపురి, కర్పర, రేబలె నల్లగొండ జిల్లాలోను, ధర్మపురి కరీంనగర్ జిల్లాలోను, గంగాపురము, బాదేపల్లి మహబూబ్‌నగర్ జిల్లాయందును గలవు. ఈ గ్రామాలలో అప్పటి ప్రాచీన విష్ణ్వాలయములు నేటికిని నిత్య పూజా కైంకర్యములతో నిలిచి యున్నవి.

వీనియందు గంగాపురము చరిత్ర ప్రసిద్ధమైన దివ్య స్థలము. ఇప్పటికిని స్థానిక లక్ష్మీ చెన్నకేశవాలయమునకు మఱింగంటి వారే స్థానాచార్యులు. ఒక నాడు 'ఆవంచ సీమ'లో చేరియున్న ఈ గ్రామమున గల దేవళమునకు చెన్నయాచార్యుల వారి తండ్రి మాధవాచార్యులవారు అధిపతి యని -

'సిరుల రంజిల్లు నావంచ సీమయందు
నలరు గంగాపురాఢ్యుఁడై వెలయు చెన్న
రాయు కోవెల కధిపుఁడై పాయ కచట
గరిమతో నిల్చె మాధవ గురువరుండు' (నృకం... 1-29)

అను పద్యము తెల్పుచున్నది. తిరువేంగళాచార్యుల వారి వరకు దీనితో పాటు పైన తెల్పబడిన గ్రామములో గల దేవాలయములకు పునస్సంప్రోక్షణాదుల అవసర మేర్పడినది. పాంచరాత్రాగమోక్త విధానముగ ఈ కార్యక్రమముల నిర్వర్తించి తిరువేంగళాచార్యులవారు 'గురురాయ పట్టణ స్థాపకుఁ'డని కీర్తిగాంచిరి. ఆ నాడు వీరు పొందిన అగ్రహారములు, నిర్మాణ మొనర్చిన దేవ మండపముల గూర్చి **విష్వక్సేన ప్రభాకరమున** నిట్లు తెల్పబడినది :

'అందముగాఁగ నీ పృథివియందుల నుండెడి సీమలందులా
నింధిర చేతి బంతి వలె నింపగు దేవరకొండ సీమలోఁ
బొందుగఁ బన్కురాజు పలిభూధర మందిరుఁడైన శౌరి కిం
పొందఁగ దివ్యమంటపము భూజను లెల్ల నుతింపఁ జేసియున్'

అమ్మహాస్థలి సర్వాగ్రహారముగను
సీమ నేలెటి సద్ధర్మ శీలులొసఁగ
సకల సామ్రాజ్య వైభవ సౌఖ్యలీల
నలరియుండెను తిరువేంగళార్య ఘనుఁడు' (1-51-52)

చెన్నయాచార్యుల వారి తరువాత సుమారు 100 సంవత్సరములకు తిరువేంగళాచార్యులవారు 'పణకరాజు పల్లె కోవెల ముఖమంటప నిర్మాణమును చేయించినారు. ఇప్పటికిని ఆ ప్రాచీన నిర్మాణ మట్లే యున్నది.

ఇట్లు తిరువేంగళాచార్యుల వారు ఆ నాడు శ్రీమత ప్రచార -సంప్రదాయ పరిరక్షణముల నొనర్చి 'చారు యశుఁడు' 'దేశిక రాజరాజు'గా కీర్తింపబడినారు.

వీరికి గల ఎనిమిది మంది పుత్రులలో అప్పలాచార్య, జగన్నాథాచార్య, సింగరాచార్యులు సుప్రసిద్ధులు. వీరిలో——

## 3. అప్పలాచార్యులు :

ఖుతుబ్షాహీ సుల్తానుల సంస్థానమున మఱింగంటి వారి పేరు తెలియుట ఈయన తోడనే ప్రారంభము. తిరువేంగళాచార్యులవారి అష్ట పుత్రులలో జ్యేష్ఠులు అప్పలాచార్యులు. వీరి సోదరులు వేంకటాచార్యులు, నరసింహాచార్యులు, కోనేటి రాయలు, జగన్నాథాచార్యులు, సింగరాచార్యులు, రంగాచార్యులు, నరహరి ఆచార్యులు.

తిరువేంగళాచార్యుల వారి కాలము నుండి వీరు 'ఓడపల్లి' (వాడపల్లి) నృసింహాలయమున స్థానాచార్యులై యుండి - 'యాదవాకిళ్ళను' అగ్రహారముగా పొందినారు*6. తిరువేంగళాచార్యుల తరువాత ఈ సోదరులలో కొందరు నేటి మహబూబ్‌నగర్ జిల్లాలోని 'రంగపురము'నకు తరలివచ్చి అప్పుడా ప్రాంతము నందు ప్రసిద్ధులైన 'గున్న' గృహనామము గల రెడ్డి దొరల ఆదరాభిమానము లకు పాత్రులైనారు. వీరిలో అప్పలాచార్యులు మల్కిభరామ్ ఆస్థానమున ప్రఖ్యాతుఁడై 'ముగ్గురు రాజులచేత మొక్కులు గొన్నట్టి ఘనవత్సమానుఁడు'గా (దశ-1-30) కీర్తింపబడెను. అప్పలాచార్యులు తనకు గల సాహితీ పరిచయము, రాజకీయ విజ్ఞతల వలన తెలగన యయాతి చరిత్రను అమీనుఖానుకు కంకిత మిప్పించ గలిగినాడు. ఈయనను గూర్చి తెలగన -

'తనకున్నిచ్చలు మ్రొక్కు వారిని సిరుల్ దైవారగాఁ జల్లి చూ
పున నెల్లప్పుడు జూచి మన్పగల పెంప్రోడన్ 'మణింగంటియ
ప్పన' గారిన్ మదిలోని మాట తెలియం బాటించుచుం గాంచినన్
గని యా మేటి తలం పెరింగి పొసఁగంగా నన్ను మన్నించుచున్'

పిలిచి పొన్నికంటి తెలగన్న నీ జేయు
నచ్చతెనుఁగుఁ గబ్బ మన్ని యెదల
మించి వెంయఁగా నమీనుఖానున కిచ్చి
పుడమిలోన సిరులఁ బొగడఁ గనుము' (యయాతి...1,9-10)

అనినట్లు తెల్పెను. తెలగన దృష్టిలో అప్పలాచార్యులు 'పెన్ప్రోడ' కావున ఆనాడు రచయిత 'పలుకుబడి' ఎంతటిదో తెలగన కృత్యంకిత విషయమున వ్యక్తమగుచున్నది.

జగన్నాథాచార్యులు అప్పలాచార్యులను గూర్చి **శ్రీ రంగనాథవిలాసము** (1-61) నందు ఇట్లు తెలిపెను :

సిరుల రాజసభా ప్రసిద్ధ లక్షణ సార్వ
భౌముఁడై వెలయు నప్పల గురుండు-' అనెను.

సింగరాచార్యులు అప్పలాచార్యులను 'సాహిత్యలక్షణ చక్రవర్తి', 'ఉభయ భాషా కవిత్వధుర్యుఁ'డని వారిపై గల భక్తి భావము నిట్లు వెల్లడించెను:

'రాజ పూజితు', 'వేదశాస్త్ర ప్రవీణు'
సరస 'సాహిత్య లక్షణ చక్రవర్తి'
'నుభయ భాషా కవిత్వధుర్యుని' మదగ్ర
జన్ము మణిఁగంటి అప్పలాచార్యుఁ దలఁతు' (దశ...1-8)

వేంకట నరసింహాచార్యులు తన కృతు లన్నిటి యందును అప్పలాచార్యుల నిట్లు పేర్కొనినాడు :

'వారణ వాహ మర్త్యపతి వర్గముచేతను మ్రొక్కులందుచున్
మీఱినయప్పలార్యులును...'
జనక, 1-80

'అఖిల విద్యాధికుం డప్పల దేశికుల్' చాంబ. 1-40

'నరనాగ సైంధవ నాథులు మది మెచ్చు
నమిత ప్రభావు( డప్పల గురుండు' కల్య. 1-32

'వేదశాస్త్ర శ్రౌతవిద్వత్సభలయందు
మెప్పులందిన ఘనుం డప్పలార్య' నృకం. 1-39

ఈ విధముగనే వీరి యితర రచనలయందును వర్ణింపబడెను. మహాప్రతిభా వంతులుగా తెలియుచున్న అప్పలాచార్యుల రచనలను గూర్చి మాత్రము ఎవ్వరును తెల్పలేదు.

## 4. జగన్నాథాచార్యులు :

ఇటీవల 'శ్రీరంగనాథ విలాసము' లభించుట వలన మంతెంగంటి కవులలో జగన్నాథాచార్యులే మొదటి కవి యైనాడు.

సింగరాచార్యులు తన రచనలలో—

'సరస శతపద్యలేఖినీ విరచనా శక్తిగల జగన్నాథ సూరి' (దశ.1-30)

'వినుత శత ఘంట బిరుదాంక విజయుఁడైన జగ్గగురు కాంతుడు' (సీతా. 1-59)

అని జగన్నాథాచార్యులను గూర్చి తెల్పినాడు.

వీరి సమకాలమువాడైన నేబతి కృష్ణమంత్రి జగన్నాథాచార్య విషయమును మరికొంత తెల్పినాడు. ఆ పద్యము—

'గురుమూర్ధన్య శతావధాన బిరుదాంకున్ ద్రావిడామ్నాయ త
త్త్వ రసజ్ఞున్ పటు సంస్కృతాంధ్ర రచనా దక్షున్ హయాధీశకం
ధర సంలబ్ధ సువర్ణవృష్టి యుతు కర్ణాట క్షమాభృత్సభాం
తర పూజ్యున్ మరుకంటి వేంగళ జగన్నాథార్యుఁ గీర్తించెదన్' (రాజనీతి... 1-8)

జగన్నాథ, సింగరాచార్య లుభయులును 'శతఘంటాపధాను'లు. వీరిలో జగన్నాథాచార్య కవి 'కర్ణాటక్షమాభృత్సభాంతర పూజ్యుడు', కుతుబ్షాహీలనాడు ఒక గోలకొండవవి కర్ణాట రాజసభయందు గౌరవింపబడుట తెలుగువారికి గర్వ

రంగవల్లభుఁడు మఱెంగంటి నని 'మఱిం
గంటి' వంశఖ్యాతి గాంచినావు
సకల దుర్గాధినాయకు లర్థిఁ బ్రియశిష్యు
లై పూజ సేయ పేరై మెలంగి

'వరల వడపలి సీమలో వరదరాజ
నగరి తంగేటి సీమ చెన్నాపురంబు
నగ్రహారంబులుగ గాంచి యశము గనవె
సరస గణ్యా జగన్నాథ గురువరేణ్యా!' 1-20

అనినట్లు తెల్పి. దీని తరువాత గల పద్యములలో సహోదరులను - తన పాండితీ ప్రతిభాదులను గూర్చి -

'సిరుల రాజసభా ప్రసిద్ధ లక్షణ సార్వ
భౌముఁడై వెలయు నప్పలగురుండు
పాషండ వేదండ పంచాస్య సారంగ
పటిమ పేర్వడిన వేంకట గురుండు
జ్ఞాన వైరాగ్య నిష్ఠా పరాంకుశ యోగి
విద్వేత్త యగు పెద్ద వేంగ గురుఁడు.
శ్రీరంగముఖ్య విశేష దివ్యస్థలా
నూన సంచారియౌ కోనగురుఁడు.
వరజుఁడై మించ, సుకవితా గురుఁడు సింగ
గురుఁడు రంగప్ప నరసింగ గురుఁడు పుత్త్రు
లగుచు సేవింప కీర్తి హెచ్చుగ మెలంగి
నాఁడ మఱిగంటి వరజగన్నాథగురుఁడ.' 1-61

'నిరుపమ శతలేఖినీ వాక్య నిర్మాణ
చతురాత్మ! అవధాన చక్రవర్తి!
కరిపతి హయపతి నరపతి సన్మాన్య
వితత షడ్భాషా కవిత్వ ధుర్య!

కరుణాంబునిధి! యాశుకవితా పితామహా!
వేదవేదాంత ప్రవీణ హృదయ!
దర్శనమాత్ర పుస్తక బహుశ్లోక సం
గ్రాహివాచక సురత్రాణ బిరుద!
ద్రావిడామ్నాయ తత్త్వపారగ! నృసింహ
ఘనకృపాలబ్ధ పల్యంకికా గజాశ్వ!
అని బుధులు ప్రస్తుతింపఁ జెన్నలరువాఁడ
నయ వినయ భూషణుఁడ జగన్నాథ గురుఁడ.' 1-62

అని తెల్పుకొనిన - జగన్నాథాచార్యుల రచన 'శ్రీరంగనాథ విలాసము' మాత్రమే లభించినది.

## ౫. సింగరాచార్యులు :

'ఆశుకవి,' 'శతఘంటావధాన,' 'అష్టభాషాకవితావిశారద', 'శారదాప్రస[illegible] వివరణ' బిరుదాభిరాముడైన సింగరాచార్యులు మతింగంటి కవులలో ప్రసిద్ధుడు.

ఈ కవి బహు విధగ్రంథ నిర్మాతయైనను వానిలో దశరథ రాజ నందన చరిత్ర, షడ్వాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము, తారకబ్రహ్మ రామశతకము-అను రచనలు మాత్రమే లభించినవి.

దశరథరాజ నందన చరిత్రయందు - తనను గూర్చి -

'వర పంచాయు జనావళీ హృదయ సద్వాంఛార్థకృ ద్వేంకటే
శ్వర సంపూర్ణ కృపాసుధామిళిత వీక్షా మాధురీ మార్గ వి
స్ఫురితైక దిన ప్రబంధరచనా స్ఫూర్జద్వచశ్శ్రీకుఁడన్
నర నాగాశ్వ నృపాల సభ్య గణితుండన్ సింగరాచార్యుఁడన్'-1-63

అని తెల్పుకొనెను. సింగరాచార్యులు "ఏకదిన ప్రబంధ రచనా వచశ్శ్రీ" క[illegible] [illegible]దను విషయము అతిశయోక్తి గాదు. శారదానుగ్రహమున బాల్యము నుండి[illegible] అనేక గ్రంథములను రచించి తన కవితా ప్రాగల్భ్యమును నిరూపించుకొని[illegible] ఈ కవి జగన్నాథాచార్యుల వలెనే 'శతఘంట కవన చక్రవర్తి'. అలవోకగా '[illegible]' చెప్పఁగలడు, అష్ట భాషాకవిత్వము నందును ప్రఖ్యాతుడు. [illegible] తన [illegible] ఇట్లు తెల్పుకొనెను.

సింగరాచార్యులు ఏ వయస్సులో ఏ గ్రంథమును వ్రాసినది- 'సీతా కల్యాణము' లోని ఈ పద్యముల వలన తెలియుచున్నది.

'సిరుల తొమ్మిదియేండ్ల 'వరదరాజస్తుతి'
'శ్రీరంగ శతకంబు' చెప్పినావు.
పదియేండ్ల నాడును బహు చమత్కృతులచే
'చక్రలాంఛనవిధి' చెప్పినావు.
యెలమితో పదునొకండేండ్ల బాలుఁడవయ్యు
'కవికదంబ' రచన గాంచినావు.
వరుసతో పన్నెండు వత్సరంబుల వేడ్క
'శత సంహితను'ను తెన్గు జేసినావు.

రమణ పదమూడు నేండ్లను 'రామకృష్ణ
చరిత' మెల్ల తదీయ సంశ్లేష మొదవ
నాంధ్ర భాషగ విరచించి తౌరభువిని
శబ్ద శాసన బిరుదాంక శాలివగుచు'

వరుస పధ్నాల్గు పదిహేను వత్సరముల
సరసకవితాష్టభాషా విశేషకృతుల
సరణులేర్పడ 'నాటక శాస్త్ర' మెల్ల
గరిమ విరచించితివి గాదె! కవులు నెన్న'

'అనఘ ! 'ప్రేమాభిరామ' 'ధనాభిరామ'
కావ్యములు జాతి వార్తలు గడలు కొనఁగ
ద్విపదలుగ జేసితివి కవి నృపతులెన్న
బూని షోడశవత్సరంబులనె మొదల.'

'నలయాదవ రఘు పాండవ'
సలలి తురీయార్థ కావ్య సంశ్లేష కృతుల్
యెలమి దశసప్తహాయన
మలవడు కాలంబునందు నతిమధురోక్తిన్

బసర పద్దెనమిది వత్సరమ్ములనాఁడు
'సకల అలంకార సంగ్రహమ్ము'
'రాకాసుధాపూర్ణ' 'రసపుష్పగుచ్ఛంబు'
'నాంధ్ర భాషాభూషణా'ఖ్య కృతులు.

విరివిగా రచియించి, వెలయ పంచాష్టమి
హాయనంబులనాడు నఖిల శబ్ద
కవిత నేరలు శిరః కంపంబు గావింప
ఘన శబ్ద శాస్త్రాది కల్పనంబు
నెలమిగావించి తిరువది యేండ్లనాడు
ఘన నిరోష్ఠ్యాది వింశతి కావ్యములను-
విలసిత ప్రౌఢి నిర్మించి వెలసితీవు
సింగరాచార్య కవిరాయ! శ్రితవిధేయ' I, 16-20

ఈ పద్యముల ప్రకారము-రచనలు వానిని రచించినప్పటి కవి వయస్సు-

| | | | |
|---|---|---|---|
| 1. | వరదరాజ స్తుతి | 9 | సం॥ వయస్సు |
| 2. | శ్రీరంగ శతకము | | |
| 3. | చక్రలాంఛన విధి | 10 | ,, |
| 4. | కవి కదంబము | 11 | ,, |
| 5. | శతసంహిత | 12 | ,, |
| 6. | రామకృష్ణ విజయము (ద్వ్యర్థి) | 13 | ,, |
| 7. | అష్టభాషా విశేషకృతులు (?) | 14 | ,, |
| 8. | నాటక శాస్త్రము | 15 | ,, |
| 9. | ధనాభిరామము | | |
| 10. | ప్రేమాభిరామము | 15 | ,, |
| 11. | నలయాదవరాఘవపాండవీయము | 16 | ,, |
| 12. | సకలాలంకార సంగ్రహము | 17 | ,, |
| 13. | రాకాసుధాపూర్ణరసపుష్ప గుచ్ఛము | 18 | ,, |
| 14. | ఆంధ్ర భాషా భూషణము | 19 | ,, |
| | నిరోష్ఠ్యాది వింశతి కృతులు-వీనిలో | ,, | ,, |
| 15. | దశరథరాజనందన చరిత్ర | ,, | ,, |
| 16. | శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము | ,, | ,, |
| 17. | తారక బ్రహ్మరామ శతకము | ,, | ,, |

వీనితో కవి తెల్పని నిరోష్ఠ్యాది వింశతి కృతులలో 15, 16, 17 సంఖ్యాగల గ్రంథములను పరిగణింప వచ్చును

సింగరాచార్యులు సాహిత్య మండలి వివిధ ప్రక్రియలలో తనకు గల ప్రతిభను, తత్సంబంధ కృతులను గూర్చి ఇట్లు తెలిపెను:

'భారతీ సంప్రశ్న భావార్థ వివరణ
రాజిత శత ఘంట రాయ కవన
శబ్దశాసన ధుర్య శత లేఖినీ పద్య
ఘటికా శత గ్రంథ కల్పనీయ
అష్ట ప్రబంధ భాషాష్ట బంధాభిజ్ఞ
ఏక సంధోచిత శ్లోక గ్రహణ
భాసుర తత్సమ భాషా విశేషజ్ఞ
చతుర నోష్ఠ్య నిరోష్ఠ్య కృతి ధురీణ
అమిత వ్యస్తాక్షరీ ప్రబంధాంక సింగ
రార్య! రమ్మని చేరి యౌదార్యమునను
సరస సౌరభ మృదు పుష్ప సరులొసంగి
కరుణ నిట్లని బల్కెను గారవమున' [సీతా...1-13]

దీని వలన 'భారతీ సంప్రశ్న భావార్థ వివరణుడు' ('భారతీ ప్రశ్న వివరణ' యని గద్యలలో), 'శత ఘంటావధాని', 'శత లేఖినీ పద్య రచనా చణుడు' అను బిరుదములు సింగరాచార్యుల కున్నట్లు తెలియుచున్నది.

**చల్లపిళ్ళ రాయ చరిత్రమున** – సింగరాచార్యుల సహజ ప్రతిభావము, బహు గ్రంథ నిర్మాణ ధురీణత ఇట్లు చెప్పబడినవి :

[illegible] లేఖని పద్య సంధాన నిపుణుండు
[illegible] కల గ్రంథ కల్పితుండు
[illegible] కవిత ప్రబంధ నిర్మాణుండు
[illegible] సంశోధిత శ్రీకరుండు
చతురర్థ సంశ్లేష సందర్భ కావ్యుండు
[illegible] కోష్ఠ్య నిరోష్ఠ్య గ్రాంథికుండు
[illegible] సద్గ్రంథ విరచనా దక్షుండు
[illegible] ప్రశ్న పటిష్ఠుండు
[illegible] పాండిత్య సాధనుండు
[illegible] విద్యా వివేక ఘనుండు
[illegible] రాజేంద్ర భూషిత శుభ గుణుండు
'[illegible] ధీయుడుండు సింగర గురు వరుండు'. 1-88

[illegible] ప్రామాణ్యము లైన ఈ కవి రచనలలో నేటికిని లభింపనివే [illegible] గ్రంథు.

**కాలము :**

సింగరాచార్యులు తనను గూర్చి తెలుపుకొని నప్పుడు 'నర నాగాశ్వ [illegible] సత్కృత [illegible]' ననినాడు. దీనిలో[3] 'నరపతులు', 'గజపతులు', 'అశ్వపతులు' ఉన్నారు.

[illegible] సామ్రాజ్యము ఉచ్ఛ దశలో నున్నపుడు నరపతులు గాని, [illegible] గాని [illegible] ప్రసిద్ధులుగా లేరు. వారి సామంతులో, లేదా వారి [illegible] సింగరాచార్యులను గౌరవించి యుందురు. అశ్వపతు లైన గోలకొండ [illegible] ఈ కవి అగ్రహారాది సమ్మానము లందినట్లు చెప్పబడిన [illegible] యథార్థములే!

[illegible] లైన అప్పలాచార్యుల పలుకుబడి, సింగరాచార్యుల స్వయం [illegible] మల్కిభరామ్ ఆస్థాన ప్రవేశమునకు దోహదకారు లైనవి. [illegible] కవి పండిత పోషణమున గణనీయుడు కావున సింగరా-

చార్యులు క్రీ. శ. 1520-1590 సంవత్సరముల మధ్య ఇబ్రహీము ఆస్థానమున ప్రవేశించినచో అప్పటికి కవి వయస్సు 40 సంవత్సరములుగా నుండును. దీని ప్రకారము క్రీ. శ. 1520-1590 మధ్య కాలమున ఈ కవి జీవించి యుండును. బాల్యము నుండియే కవిత చెప్పి ప్రతిభావంతుడై 'శత ఘంటావధాని' బిరుదము నందిన సింగరాచార్యులు రాజాస్థానమున రాణించినాడు. ఇట్టి పాండితీ ప్రకర్షయే విజయనగ రాస్థాన గౌరవమునకు ఆస్కార మైనది. కావుననే 'రాజనీతి రత్నాకర' కర్త—

'ఆంధ్ర భాషా నిరోష్ఠ్య మహా ప్రబంధ
రాజి రచనా ధురీణు కర్ణాటరాయ
లబ్ధ కవి సార్వభౌమ కల్యాణ బిరుద
రాలి మణికంటి సింగరాచార్యు దలంతు.' (9)

అనినాడు.

మరియొక విషయము - సింగరాచార్యులు అబ్దుల్ కరీం (క్రీ.శ. 1540) కచేరిని వర్ణించుచు ఉత్పలమాలికను చెప్పినట్లు - శేషాద్రి రమణ కవులు తెల్పినారు.* ఇబ్రహీం కుతుబ్‌షా సోదరులలో నొకడైన ఈ అబ్దుల్ కరీం- ఖుసు బుద్దీన్ అనే మరియొక యగ్రజుని దుర్మార్గముల నరికట్టిన వాడు. కావ్య రసికుడు. అరబీ-పారసీ మొదలగు భాషలయందు ప్రావీణ్యము కలిగిన అబ్దుల్ కరీం - మల్కిభరామ్ రాజ్యమునకు రాక పూర్వము - జంషీడ్ చివరి దశలో (క్రీ. శ. 1540-1549) రాజ్యాధికారమును నెరపినవాడు. ఈ సంధి కాలమున సింగరాచార్యులు అబ్దుల్ కరీమ్‌చే సత్కృతుడైనందుకు కృతజ్ఞతా సూచకముగ కచేరి వర్ణన చేసియుండును. దీని ననుసరించి చూచినను మల్కిభరామున్‌కు ముందు నుండియే గోలకొండ రాజులకు సింగరాచార్యులు పరిచితు డని తెలియుచున్నది. మల్కిభరామ్ రాజ్యాధికార బాధ్యతల వహించిన తరువాత సింగరాచార్యులు ఆస్థాన కవిగా గౌరవింపబడి అగ్రహారాదుల పొందినాడు. ఈ విషయము ను కవి తన గ్రంథములో తెల్పకున్నను తరువాతి కవులు పేర్కొనినారు.

పై కారణముల వలన సింగరాచార్యుల కాలము క్రీ. శ. 1520-1590 గా భావింప వచ్చును.

## అగ్రహార, సమ్మానములు :

అప్పలాచార్య, జగన్నాథాచార్య, సింగరాచార్యులు ఆ నాడు-

'వర నాగాశ్వ నృపాలం శేఖరులు నానా రత్న భూషావళుల్ -
వరగాందోళిక ఛత్ర చామర తతుల్ తోరంబుగా నీయఁగా
సిరు లింపొందుచు వానపల్లి నగరిన్ జెన్నొందు చున్నట్టి శ్రీ
వర [illegible] కోవెల స్థలికి స్థానాచార్యులై యుండఁగన్'

(గోదా. 1-31)

వారికి 'యాచవాపిక' గ్రామము అగ్రహారముగా నీయబడినట్లు-

'[illegible]మైన మల్కిభరాము చేత
ధాతు[illegible] దత్తమైన
యాచవాపిక పురిని ప్రఖ్యాతి నొందవ
[illegible] సంపదల్ నివ్వటిల్ల'.

(వ్వ. 1-38)

[illegible] ఈ యగ్రహారము సింగరాచార్య కవితో [illegible] ఇదే విషయము (నృసిం. 1-40)

'[illegible] గోలకొండ నగరాధ్యక్షుఁడు మల్కిభరాము పాదుషా
[illegible] నిలిచి మోద మెలర్పఁగ నా సభాస్థలిన్
[illegible] మెచ్చఁగను హాటక సన్మణి భూషణాదు లిం
[illegible] గైకొనియుం బొల్పుగ నుండెను 'యాచవాపిలి'న్

[illegible] స్పష్టముగా గలదు. దీనితో పాటు సింగరాచార్యులకు-

'[illegible] మల్కిభరాము పాద్ష
[illegible] ప్రౌఢికి నిచ్చ మెచ్చి
[illegible] గద్యాణ వారణాది
[illegible] విరతు లింపుగ నొసంగ'

(విష్ణు. 1-56)

[illegible] వ్యవసాయ మొనర్చెను.

## ప్రతిభా గురుడు:

నేటికిని మఱింగంటి వంశమువారు సింగరాచార్యుల ప్రతిభా పాండితీ ప్రభావముల గూర్చి అనేకములైన కథలను చెప్పుదురు. అట్టి వానిలో 'శారదా ప్రశ్న వివరణ' బిరుదమును గూర్చి -

సింగరాచార్యులకు శారద వశ్యురాలై పది తరాల వరకు మీ యింట దాస్యము చేయుదు నని బల్కి, తన మాటను నిలుపుకొనదలచి సింగరాచార్యు లను పరీక్ష చేయు తలంపుతో— 'ఇఱుక', 'కొఱుక', 'నఱుక', 'పెఱుక' అను నాల్గు పదముల నిచ్చి, వీనితో పద్యమును చెప్ప మనినదట. కవి వెంటనే-

'ఇఱుక రాదు చేత నిసుమంత నిప్పైన
కొఱుక రాదు ఇనుము కొంచెమైన
నఱుక రాదు నీరు నడిమికి రెండుగా
పెఱుక రాదు బావి పెల్లగిలగ!'

అని పూరించెను. అప్పటినుండి సరస్వతి వీరికి వశ్యురాలైనది. కాని- శారద యొసగిన ఈ ప్రశ్న ఎంత కష్టమైనది? దీనిని పూరించినందుకే సింగరాచార్యు లకు 'శారదా ప్రశ్న వివరణ' బిరుదము లభించెనా ? అని అనుమానము. సరస్వతి జటిలమైన సాహితీపరమగు ప్రశ్నము నీయగా దాని నిగూఢ యుక్తి యుక్తముగా సమాధానించి శారదా ప్రశ్న వివరణు లాయెనేమో? దీనిని గూర్చి-

'ముదమున సస్మదీయ కుల ముఖ్యకరుండగు సింగరార్యులన్
సదయత గాంచి భారతియు చక్కఁగ వేయు సమస్య భావముం
గొదుకక తెల్ప మెచ్చి యటు గూర్మి నొసంగిన మాట సప్పునన్
విదితముగా సహస్రకలు వేడ్కఁగ మద్గ్రహ సీమ నుండుచున్!'
(గోదా. 1-15)

అని ఈ పద్యమున తెల్పబడగా 'శ్రీ రామానుజాభ్యుదయము'న సింగరా చార్యులకు 'శత ఘంటావధాని' బిరుద మేర్పడుటకు గల కారణము ఇట్లు తెల్పబడినది:

'అతఁ డిటు లష్ట భాషలను నాచ కవిత్వ మహా ప్రబంధముల్
చతురముగా ఘటింపఁగను శారద మెచ్చి పరీక్ష చేయఁగా
కుతుకముతో సమ స్యొకటి గుంభిత మొప్పఁగ నీయ నాతఁడున్
కౌతుకక పూర్తిచేయ విని కోవిద యుక్తికి చాల మెచ్చుచున్.

శత ఘంట రాయ సుల్తా
నితఁడె యనం దగు నటంచు నిచ్చెన్ దోఁచన్
శతధృతి రాణి యొసంగెను
నతులిత మగు బిరుదు సింగరార్యుల కపుడున్' (1.44.45)

జగన్నాథ, సింగరాచార్య సోదరులు అవధాన ప్రక్రియల యందు అతి క్లిష్టమగు పరీక్షల నెదుర్కొని నిష్ణాతు లనిపించు కొనినారు. వారి కెదురైన విషమ పరీక్షలను-

'తెలలను నీటి లోపలను దీపపు కాంతిని యొంటి వెన్నెలన్
పరపగు దర్పణంబులను బ్రాసెటి గంటపు ఛాయ చూడ నా
ధరణి నరేంద్ర సత్సభల ధైర్య మెలర్పఁగ జగ్గయార్యులున్
పర కవి సింగరార్యు లనువంద వచింతురు వాక్ ప్రగల్భతన్'
[జనక. 1-40]

జంట అవధాన కవులుగా పూర్తి చేసినారు. నేడు శతావధానములలో కంఠ ధ్వనిని గుర్తించుట, వ్రాసిన విషయమును చూడకయే చెప్పుట అను పద్ధతులు ప్రచారములో నున్నవి. నేత్రావధానము ఒకటి కలదు. ఖుతుబ్‌షాహీల నాడు మరింగంటి సోదరులు పై పద్యమున తెల్పబడిన కఠిన పద్ధతులు గల అవధానములు చేసి తమ ధిషణా చాతుర్యమును నిరూపించినారు.

సింగరాచార్యుల గృహమున నిరంతరము సరస్వతి నివసించిన దనుటకు ఈ వంశము వారు తెల్పు మరియొక కథ యిట్లు గలదు:

వీరు 'దాశరథి రాజ నందన చరిత్ర' వ్రాయుచున్నపుడు కొందరు పండితులు కూడబలుకుకొని వాదమున వీరి నోడించవలె నను తలంపుతో విచ్చేసిరట. గృహ ప్రాంగణమున నొక పరిచారిక కన్పడగా 'ఆచార్యుల వారు

ఏమి చేయుచున్నారు ?' అని ఆమెను ప్రశ్నింపగా, పరిచారికా రూపమున నున్న శారద "దశరథ రాజ నందన చరిత్రను లిఖించుచున్నారు"- అని నిరోష్ఠ్య కృతికి నిరోష్ఠ్య సమాధాన మొసంగినదట ! దానికి వచ్చినవారు 'ఆచార్యుల వారి పరిచారికయే యింత ప్రతిభావంతురాలైనప్పుడు - కవి గారి విషయము చెప్ప పని లేదని' పల్కి వారిని దర్శింపకయే మరలి పోయిరట.[*9]

కవితా విషయముననే ఇంతటి ప్రతిభ చూపిన సింగరాచార్యులు ఎందరో వ్యాధి గ్రస్తులను, గ్రహ బాధా బాధితులను తమ చేతి 'తీర్థము' తోనే ఆరోగ్య వంతులుగా చేయువారు. శారదారాధకులే గాక నిరంతర నరసింహోపాసకులైన వీరియందు అట్టిశక్తి గలదు (పేరు సైతము సింగర-సింహ-'నరసింహ' అని గదా!). ఈ కారణముననే మరింగంటి వారియందు సింగర, నరసింహ నామములు ఎక్కువగా గలవు.

ప్రతిభామూర్తి యైన సింగరాచార్యులను **సురతాణీ పరిణయ** కర్త—

"ఆ యెనమంద్రు విద్యల మహాత్ములు వారలలో నిరోష్ఠ్య రా
మాయణ ముఖ్య వింశతి మహా శుభ కావ్య నిబంధనాఢ్యుఁ డ
త్యాయత కీర్తిమంతుఁడు శతాధిక ఘంట కవిత్వ చిత్ర ధౌ
రేయుఁడు సింగరార్యుఁడు ధరిత్రిని జెన్నలరెన్ మహోన్నతిన్"

అని పేర్కొనెను.

## 6. వేంకటాచార్యులు :

ఇతడు సింగరాచార్యుల సోదరుడు. ఈ వంశ కవుల వివిధ రచనలలో వేంకటాచార్యు లిట్లు పేర్కొనబడెను :

'నిగమ చేత స్తంత్ర నిపుణార్థ సంపత్తి నతిశయిల్లు వాఁడు'
(సీతా. 1-59)

'పాషండ వేదండ పంచాస్య సారంగ పతిమ' (శ్రీరంగ. 1-61) గలవాడు. 'చతుర్వేదాధ్యయన చక్రవర్తి (విష్వ. 1-54). 'ఉభయ వేదాంతార్థ విభవుఁడు (సృకం. 1-39).

## 7. నరసింహాచార్యులు :

'సంగీత నాటక స్వరకల్ప సాహిత్య చిత్రకవితు,' డైన (సీతా- 1-59) ఈయన సింగరాచార్య సోదరులలో నొకడు. 'షడ్దర్శన స్థాపనాచార్యుడు' (విష్వ- 1-54). 'అష్టాంగ యోగ మంత్రార్థ సంసిద్ధి' కలవాడు (నృకం. 1-39). 'నరనాథ పూజ్యుడు' (శ్రీరామ. 1-40). 'సకలాలంకార కవితా ప్రవీణుడు (చల్వ- 1-34).

## 8. కోనేటి రాయలు :

ఇతనిని గురించిన కొన్ని విషయములు 'వంశ పరిచయము'న తెల్పనైనవి. 'శ్రీరంగ ముఖ్య విశేష దివ్య స్థలానూన సంచారి' (శ్రీరంగ. 161), 'కుపిత మాయావాద గురు శాస్త్ర హరణ పారగుఁడు' (దశథ. 1-80), 'కవితా ధురీణుఁడు' (నృకం. 1-89) నైన కోనేటి రాయలు అగ్రజులైన సింగరాచార్యుల వలెనే ప్రతిభావంతుడు. 'తెలుగు వ్యాకరణ పద్యములు' రచించినట్లు తెలియుచున్నను, నేడది అలభ్యము.

ఇట్లు సింగరాచార్య సోదర వర్గమున ఆరుగురి ప్రతిభా పాండిత్యములు తెలిసినవి. సింగరాచార్యుల తరువాత 'శ్రీరంగనాథ విలాసము' (వీరి సోదరుల రచనలలో) మాత్రమే లభించినది.

## 9. వేంకట నరసింహాచార్యులు (ప్రథమ)*[10] :

సింగరాచార్యుల పుత్రుడైన ఈయన 'హరివాసర వ్రత మహాత్త్వము'ను రచించినట్లు **జాంబవతీ కుమార శృంగార విలాసమున** నిట్లు తెల్పబడినది:

'ఆ మణింగంటి శ్రీ సింగ రార్యమణికి
కాంత యగునట్టి లక్ష్మాంబ గర్భమునను
బూర్ణ రాకా నిశాకరు పోల్కెలర్ప,
గలిగె వేంకట నరసింహ ఘన యశుండు.'

'సర్వ శాస్త్రార్థ బోధన చతుర చిత్తుఁ
డుభయ వేదాంత భావజ్ఞుఁ డురు పదార్థ
బంధు రాంధ్ర ప్రబంధ తాత్పర్య బోధ
కత్వ నిపుణాత్ముఁ డతఁడు వాక్పతి దలంప!'

"సరసత నగ్గురు మణి 'శ్రీ
హరి వాసర వ్రత మహత్త్వ'మను బంధ మనో
హర ఘటనా గుంభన మొ
ప్ప రచించెన్ రసికు లెల్ల భళి భళి యనఁగా!" (1-43-45)

అలభ్య గ్రంథములలో ఈ 'హరివాసర వ్రత మహత్త్వము' (ఏకాదశీ మాహాత్మ్యము) ఒకటి!

ఈ గ్రంథకర్త ప్రతిభా పాటవమును గూర్చి—

శబ్ద శాస్త్ర వివక్ష శాయ జాలక కుంద
కుమత విద్వాంసుల గుండె దిగులు
నిగమాంత ధర్మంబు లెఱుఁగ జాలక పెన్గు
మూర్ఖ వాదులకును ముక్కు కొయ్య
నాట కాలంకార నైపుణం బెరుఁగని
కపట పాండిత్యుల కంటి నెలుసు
షడ్వింశతి చ్ఛంద సరణు లెఱుఁగక బదరు
వికటంపు కవులకు వెన్ను తరటి

యనఁగ విలసిల్లి కర్ణాట కాంధ్ర ద్రవిడ
పాండ్య మహరాష్ట్ర మగధ భూపాల పూజ్యుఁ
డైన మఱిగంటి నద్వంశ్యుఁ డిద్ధ గుణుఁడు
నవ్య శుభదుండు వేంకట నరస గురుఁడు. (చాౕ. 1-41)

అని తెలుపబడినది.

వేంకట నరసింహాచార్యుల ప్రతిభాదులకు మెచ్చి, సంప్రదాయమునకు సంతసిల్లి ఆ నాఁడు శిష్యులు వానపల్లి సమీపమున అగ్రహార మొసంగినట్లు -

'శ్రీయుత రామరాజ కుల సింధు హిమాంశుడు శంకరాఖ్య దే
శాయి మనః ప్రమోదమున చక్కగ తంగెడ సీమయందు - స్వ
శ్శ్రీయము చేత చెన్నెసగు 'చెన్నయ పాలెము' నిచ్చె దాన రా
ధేయుడు సత్యుదారుడతి ధీరత వేంకట నారసింహురున్'
(జాంబ. 1-46)

అని తెల్పెను. దీనిలో పేర్కొనబడిన 'రామరాజు' వంశము వారు కరణాలు. ఇప్పటికిని 'చెన్నయ పాలెము'లో నున్నారు. 'తంగెడ' గ్రామము నేడు చిన్న పల్లె. మట్టపల్లి నృసింహ క్షేత్రము గల కృష్ణకు ఆవలి తీరము. 'తంగెడ', 'చెన్నయపాలెము', 'వాడపల్లి', 'మట్టపల్లి' కృష్ణాతీరమున గల గ్రామములు. వీనియందు 'వాడపల్లి', 'మట్టపల్లి' ప్రసిద్ధ నృసింహ క్షేత్రములు. నేటికిని రామరాజు వంశమువారు మరింగంటి వారి శిష్యులు. చెన్నయపాలెము లోని భూమి ఇప్పటికిని మరింగంటి వారి అనుభవములో గలదు.

## 10. వేంకట నరసింహాచార్యులు (ద్వితీయ) :

సింగరాచార్యుల తరువాత అనేక గ్రంథములను రచించి ఈ వంశమున కీర్తనీయు డైన వేంకట నరసింహాచార్యులు రంగమాంబా వేంకటాచార్యుల పుత్రుడు, సింగరాచార్యుల శాఖలో, నేరుగా ఆరవ తరమున*11 క్రీ.శ. 1680 లేదా 1770 'కనగల్లు'లో నివసించి తరువాత నేటి మిర్యాలగూడెం తాలూకా 'అనుముల' గ్రామమునకు వెళ్ళి స్థిరపడిన ఈ కవి సంస్కృతాంధ్ర ద్రావిడ కవితా సమర్థుడు.'షోడశ మహా గ్రంథ బంధు రాలంకార నిర్మాణ ధురీణుడు', వేంకట నరసింహాచార్యులు తన కృతుల నన్నిటిని విశిష్టాద్వైత విషయ కథా ప్రధానములుగా రచించి కృత్యాదులలో తన పూర్వులను, వారి ప్రతిభా పాండిత్యములను తెల్పుటయేగాక, ఆ నాడు వారి కీయబడిన అగ్రహారాదులను వివరించి మరింగంటి కవులను గూర్చి తెలిసికొనుటకు అవకాశమును కల్పించినాడు.

ఈ కవి పూర్వులు వేద వేదాంత విద్యా నిష్ణాతులు. విశిష్టాద్వైతమున కీర్తి గాంచిన వారు. తండ్రియైన వేంకటాచార్యులు-

'శ్రీభాష్యకృ త్పాద సేవా ధురీణుండు
పరతత్త్వ సిద్ధాంత భావుకుండు
నిగమాంత సద్ధర్మ నిర్ణయ శీలుండు
సకల రహస్యార్థ సంగ్రహుండు
నఖిల భాగవ తార్చ నాసక్త చిత్తుండు
బుధ జన స్తుత మంత్ర బోధకుండు
వసుధ చాతుర్వర్ణ్య వర శిష్య నికరుండు
నిరుపమ సద్ధర్మ నియత లోక్యుఁ

డహి నగాధీశ సచ్చరణాబ్జ మధుర
పాన మత్త ద్విరేఫోపమాన హృదయుఁ
డనఁగ విలసిల్లె శ్రీ వేంకటార్య సుతుఁడు
సరస గుణశీలి వేంకటాచార్య మౌళి!' (చల్వ. 1-47)

అని పితృపాదుల వ్యక్తిత్వమును వ్యక్తీకరించినాడు.

కవి తోబుట్టువైన సింగరాచార్యులు ద్రావిడ వేద సమర్థుడు, 'సంస్కృతాంధ్ర వాగ్విదిత మహా ప్రబంధ పదవీ పరిశోధకుడు', 'భాగవతోచిత సేవన క్రియా మానసుడు' ('చల్వ. 1-49).

వేంకట నరసింహాచార్యుల స్వప్నమున కుల దైవమైన సిరిసెనగండ్ల నృసింహస్వామి కన్పడి——

'శ్రీ భారతాది ప్రసిద్ధ గీర్వాణాంధ్ర
భాషా మయ శ్లోక పద్య పఠన
మున లేఖనమున తన్మృఖ్యార్థ బోధన
మున కావ్య సాహిత్యమున తదుభయ
సమధిక చ్ఛందోఽర్థ సంప్రదాయ జ్ఞాన
మున భాణ నాటకములను శబ్ద
శాస్త్ర ద్వయంబున శబ్దార్థ దేవ నా
నాలంక్రియా సమూహముల మూల

మంత్ర మంత్రార్థ గీతార్థ మార్గముల స్వ
రూప సంపాదక గ్రంథ రాశి చింత
నముల భాషా ద్వయ కవిత్వ విమల కల్ప
నాదులం దెల్ల రఁడు నిపు ణాతిశుతివి' (శాంబ. 1-11)

లనెను. దీనివలన కవికి సాహిత్యమందలి వివిధ ప్రక్రియలలో గల నైపుణ్యము, సంప్రదాయ సంబంధమైన మంత్ర, మంత్రార్థ (తిరుమంత్రము, తిరుమంత్రార్థము), గీతార్థము (శ్రీభాష్యము) లందు వీని ఉపదేశ శక్తి, సంస్కృతాంధ్ర భాషా ద్వయ కవిత్వ కల్పనా ప్రౌఢి వ్యక్త మగుచున్నవి.

కవి తాను కావ్య, భాణ, నాటకముల రచించినట్లు తెల్పుకొనినను, నేడు కొన్ని ప్రబంధములు మాత్రమే లభించుచున్నవి. అవి :

1. జానకను తాభ్యుదయము
2. గోదా వధూటి పరిణయము
3. విష్వక్సేన ప్రభాకరము
4. శ్రీ రామాను జాభ్యుదయము
5. నృకంఠీర వాభ్యుదయము
6. క్షత్రబంధూపాఖ్యానము
7. కాండవతీ కుమార శృంగార విలాసము
8. శ్రీకృష్ణ శరానందీయము
9. చిలువ పడగ దేని పేరణము
10. శ్రీకృష్ణ తులాభారము
11. మిత్రవిందో పాఖ్యానము
12. అలంకార కృష్ణ విలాసము
13. రఠి మన్మథాభ్యుదయము
14. రాఠవ ప్రద్యుమ్న రాజీయము

వీనిలందు 2, 6 సంఖ్యలు గల గ్రంథములు ముద్రితములు. 8, 9, 11, 12, 13, 14 సంఖ్యలు గలవి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున (మదరాసు)లో నున్నట్లు కేటలాగుల సమాచారము. మిగిలిన గ్రంథములు నాశన మైనవి.

సింగరాచార్యులు రా నే యే వయస్సులో ఏ యే గ్రంథములను ప్రాసిన 'సీతా కల్యాణము' (1. 16-20) న తెల్పినట్లుగనే ఈ కవియు-

> 'పదియేండ్ల వాఁడనై బహు దయిర్కృతి యైన
> 'శల్య పిళ్ళను రాయ చరిత' మొకటి
> వ్రాసితి పది యొక్క వత్సరంబున నేను
> 'నంద నందన శతానంబ' మొకటి
> పది రెండు వర్షముల్ పరగ 'నలంకార
> కృష్ణ విలాస' మన్ కృతియు నొకటి
> యై దై మ మూడును హాయనంబులలోన
> 'జనకరాయని బిడ్డ చరిత' మొకటి...' (వి-వ్యా...' 1.31)

అని తెల్పెను. దీనియందు మొత్తము గ్రంథములు తప్పు బడలేదు. పేర్కొన బడిన వానిలో 'నంద నందన శతానందము' అనగా 'శ్రీకృష్ణ శతానందీయము', జనకరాయని బిడ్డ చరితమే 'జనకసు తాభ్యుదయము', లేదా 'విదేహ రాజ కన్య కాభ్యుదయము'.

వేంకట నరసింహాచార్యులు తన రచనలను గూర్చి ఇంత స్పష్టముగా తెల్పినను గ్రంథాంత గద్యలయందు 'వేంకట నరసింహాచార్య' అని యున్నను, 'సమగ్ర ఆంధ్ర సాహిత్యము' (8 వ సంపు. 262 వ పుట), దీనిపై వచ్చిన గ్రంథ సమీక్ష (భారతి 1966 ఫిబ్రవరి)యు (పద్యముస కవి తెల్పుకొనిన) ఈ గ్రంథములను సింగరాచార్యుల రచన లనియే వివరించినవి సాహిత్య ఎకాడమీ వారి 'యయాతి చరిత్ర' పీఠిక (పుటలు 7-37) లోను, ఇటీవల వచ్చిన 'సాహిత్యావలోకనము' నందును 'చిలుక వడిగ దేని పేరణము' సింగరాచార్య రచనగా తెల్పుట పెద్ద పొరపాటు.*12

కవి దేవరకొండ సీమయందు ప్రసిద్ధి గాంచిన 'దేశముఖు', 'దేశాయీ'ల చేత సత్కృతు డైనట్లు

> 'మేలొ దేవరకొండ సీమగిరి నా మిన్నందు సర్కారునన్
> చాలా ప్రౌఢిమ మించి దేశముఖు దేశాయీలు విద్వత్కవుల్
> కైలారాతి గురు ప్రభావుఁ డనుచున్ సంతోషముం జెందఁగా
> శ్రీ లీలాధిపు సత్కటాక్షమున నే నెన్నొంది తిద్ధాత్రిలో' (జాంబ 1.64)

అను పద్యము వలన తెలియుచున్నది.

నేడు అనుముల గ్రామమున కవికి ఎనిమిదవ తరమునకు చెందిన మోహనాచార్యులుగా యున్నారు. వీరి యింటి ఆడుపడుచు రాఘవమ్మ (రాగమ్మ) గారు అచ్చంపేట తాలూకా 'రాకొండ' గ్రామమున కలదు (వయస్సు 70 సం॥). ఈమె తమ పూర్వుల గూర్చిన కథల నెన్నిటినో చెప్పును. వారి వారి గ్రంథ ములలోని పద్యములను వినిపించును. వీనిలో నేటికిని ముద్రణము కాని పుస్త కములలోని పద్యము లుండుట ఆశ్చర్యము!

## 11. నరసింహాచార్యులు :

ద్వాదశ సూరులలో నొకరైన నమ్మాళ్వారుల వైభవ వర్ణన ముఖ్యముగా చేసికొని సంస్కృతమున 'శఠవైరి వైభవ దివాకర'మను అలంకార శాస్త్ర గ్రంథమును రచించిన ఈ కవి క్రీ. శ. 1700 ప్రాంతమున 'అనుముల' గ్రామములో నుండెను.

మరింగంటి వారిలో పూర్వుడైన చెన్నయాచార్యుల వారికి (సర్వ్వోపాధి) గల తిరుమలాచార్య, భట్టరాచార్య, సింగరాచార్య లను ముగ్గురు కుమారులలో భట్టరాచార్యుల శాఖయందు 'శతఘంటావధాని' సింగరాచార్య పరంపరయు, తిరుమలాచార్యుల శాఖలో ఈ కవి పరంపరయు గలవు.

వంశవృక్షము ననుసరించి చూడగా 'శఠవైరి...' కర్త సింగరాచార్యుల తరువాత ఆరవ తరములో నుండి, షోడశ ప్రబంధ నిర్మాత యైన వేంకట నరసింహాచార్యులకు సమకాలమువా డగును ఉభయులది ఒకే గ్రామము.

నరసింహాచార్యుల పౌత్రులైన ముగ్గురిలో అప్పలాచార్యులు ఒకరు. వీరు నరసింహాపురమును చేరి అచ్చట ప్రస్తుతము గల కోదండ రామాలయమును నిర్మాణ మొనరించినారు. 'అప్పల దేశికులు'గా ప్రసిద్ధులైన వీరు సుమారు క్రీ.శ. 1760 ప్రాంతమున నుందురు. ఈ నాడు 'మానుకోట', 'గుండంరాజుపల్లి' గ్రామములలో నున్న మరింగంటి వారు నరసింహాపురం అప్పల దేశికులవారి పరంపర అని వీరి వద్ద గల వంశవృక్షముల ద్వారా తెలియుచున్నది.

ఇట్లు సింగరాచార్యుల తరువాత మరింగంటి వారు వేర్వేరు గ్రామములలో రపడినారు.

'శరవైరి...' కృత్యాదియందు గల వంశ వివరణలో గ్రంథకర్త - ర్వమునుండి తన వరకు గల వారిని (కేవలము తన శాఖనే) మాత్రమే ర్కొనినాడు. కాని సింగరాచార్య కవి ప్రసక్తి చేయలేదు

వీరి పూర్వులలో నొకరైన తిరుమలాచార్యులను గూర్చి 'యత్సద ంగణ దేశం పరిచరితవతీ స్వయం గిరాం దేవీ' (8వ శ్లో.) అనినాడు. దీని ఎన సింగరాచార్యులకు పూర్వము నుండియే (తాతగారి నుండి) గృహమున రస్వతి వసించుచున్నట్లు తెలియుచున్నది.

తిరుమలాచార్యుల పుత్రుడైన అనంతాచార్యులను గూర్చి -

'అనంత గురు రిందిరా రమణ దర్శన స్థాపన
క్రియాసు రుచే పదాంబురుహ నిక్వణ న్నూపురః।
అనంతముఖ సమ్మిళ ద్గరళ తాప నిర్వాపణం
విధాతు మివ యన్ముఖే న్యవస దద్భుతం భారతీ॥'

, వీరి వైష్ణవ మతాభినివేశమును వశ్యవాక్త్వమును వ్యక్తపరచి, ప్రపౌత్రు వేంకట నరసింహాచార్యుల సంస్కృత విద్వత్తు అవధాన విషయముల నిట్లు నాడు :

'తస్మాద్వ వేంకట గురు ర్నరసింహ సూరిః
ప్రాదుర్బభూవ నిఖిలై రవధాన ఫేట్లైః।
విద్యా వధూ నటన దేశిక సార్వభౌమః
భూమౌ వృథా చనవభిః పల స్వం మహత్త్వమ్॥' (23 వ శ్లో.)

కవి తండ్రియైన వేంకటాచార్యులు—

'సత్త్వైక వాసః నరసావతారో
నిజాంతరంగోజ్జ్వల పేశలాయాః।
దేవే పయోరాశి రివాత్మ విద్యా
నిధి ర్బభూవం భువి వేంకటార్యః॥' (25 వ శ్లో.)

పరమ సాత్త్వికుడు, సరసుడు, శేషశాయి వంటి ఉజ్జ్వలమగు అంతరంగము గలవాడు, విద్యా వారిధి యైన తండ్రితో పాటు తన పినతండ్రులైన నృసింహాచార్య, అనంతాచార్యులను గూడ నిట్లు వర్ణించినాడు:

'సాయం సంభ్రమణా నట న్నిటల దృగ్జ్మార్గాంతర స్వర్ధునీ
రంగ త్తుంగ తరంగ సంఘ సచివః శ్రీసూక్తి యుక్తాననః।
రాజ ద్రాజ సభా విలాస వలభీ విభ్రాన్త కీర్త్యంగనా
మంజీర క్వణిత కంధరో జితవృదుగ్రంహో **నృసింహో** గురుః॥' (26)

'సద్య ఏవ నవ లేఖినీ లస
ద్గద్య పద్య రచనా నిరంకుశః।
విష్టపే భవ **దనంత దేశిక**
స్తర్క కర్కశ తరాహ వోద్భటః॥' (27)

అని వీరి వాక్శక్తిని రాజసభలయందలి గౌరవమును తెల్పుటతో అనంతాచార్యులను 'నవ లేఖినీ లస ద్గద్య పద్య రచనా నిరంకుశుని'గా తెల్పెను. 'శత లేఖినీ పద్య సంధాన ధౌరేయము' వలె 'నవ లేఖినీ...' కలదేమో! ఈ పద్ధతిని నరసింహాచార్యులే పేర్కొనెను.

సగౌరవముగా తన పూర్వుల గూర్చి యిట్లు తెల్పిన గ్రంథకర్త స్వవిషయమును (ఒక్క శ్లోకములోనే).

'తత్ర వేంకట గురోః కుమారకః
సర్వ విద్వ దభిసంధ్య సద్వచః।
శ్రీ నృసింహ ఇతి నామభాగహమ్
కుర్మి విస్ఫుర దలంకృతిం కృతిమ్॥ (28)

అని మాత్రమే తెల్పెను.

శఠకోప నామాంతరు లైన నమ్మాళ్వారుల వైభవ ప్రకాశనమును నూరు శబ్దాలంకారములతో చేసి, గ్రంథాంతమున-

'ఇత్థం శత మలంకారాః
మయాస్మిన్ ప్రతిపాదితాః।
ప్రౌఢా మాధునికానాం చ
మత మాలోచ్య సర్వశః॥

అనెను. నరసింహాచార్యులు సంస్కృతమున అలంకార శాస్త్ర గ్రంథరచన మొనర్చి మరింగంటి కవులలో ప్రత్యేకత నాపాదించు కొనినాడు.

## 12. అప్పల దేశికులు :

మరింగంటి వారు వెంకయాచార్యులు, సింగరాచార్యుల తరువాత అప్పల దేశికుల వారిని భక్తి ప్రపత్తులతో తలంతురు. 'వేదాంత దేశికుల వారి వలె వీరును అవతార పురుషులు; తమ వంశమును పావన మొనర్చిన వారు'- అని వీరి విశ్వాసము.

అప్పల దేశికులు 200 సంవత్సరములకు పూర్వము 'నరసింహపురము'లో నుండిరి. నేడు 'గుంగంగారుపల్లె', 'మానుకోట'లలో నున్న మరింగంటివారు దేశికుల పరంపరకు చెందినవారని వీరివద్ద గల వంశవృక్షము ద్వారా తెలియుచున్నది.

'శతప్లైరి వైభవ దివాకర' కర్తయైన నరసింహాచార్యులకు అప్పల దేశికులు పౌత్రులు. క్రీ. శ. 1680, 1700 ప్రాంతమున 'శతప్లైరి...' కర్త యున్నట్లు ఆ కవి పరిచయమున తెల్పనైనది. ఆయన పౌత్రుడైన దేశికులు క్రీ. శ. 1740-1760 ప్రాంతమున జీవించియుండెను. వంశవృక్షము ననుసరించి లెక్కించినచో- మానుకోటలో నున్న కృష్ణమాచార్యులుగారు (వీరి వయస్సు 64 సం.) దేశికుల వారికి 7వ తరమువారు. అప్పుడు క్రీ. శ. 1780 యగును. ఇది కూడ పైన చెప్పబడిన కాలమునకు సరిపడుచున్నది.

అప్పల దేశికుల పుత్రులు వేంకటాచార్యులు, అగ్రజుడు నరసింహదేశికులు. కృష్ణమాచార్య, నరసింహ దేశికుల [illegible] కుమారులు. మానుకోటలో నున్న కృష్ణమాచార్య, నరసింహాచార్య [illegible] కృష్ణమాచార్య పరంపరకును, [illegible] గుంగంగారుపల్లెలోని [illegible] నరసింహ దేశిక పరంపరకును [illegible]. అప్పల దేశికుల [illegible] నరసింహ దేశికుల వరుసలో 'నర సింహాచార్యులు' [illegible] (80 సం.) గారు.

కొంత కాలము తుంగతుర్తిలోను, మరి కొంత కాంత కాలము నరసింహాపురములోను నివసించిన అప్పల దేశికులు ఆ నాటి వితరణ శీలుర తోడ్పాటుతో నరసింహాపురమున శ్రీ కోదండ రామాలయమును నిర్మాణ మొనరింపగా వీరి అగ్రజులైన నరసింహ దేశికులు శ్రీ గోదా సన్నిధిని ఏర్పాటు చేయించిరి.

అప్పల దేశికులు సంస్కృతాంధ్రముల యందు పట్టమైన పాండిత్యము గలవారు. ఉభయ వేదాంత నిష్ణాతులు. నిరంతర భగవద్ధ్యానమే వీరి కాల క్షేపము. స్థానిక భక్తులే గాక ఆ నాటి దేశముఖులు, జమీందారులు, మునగాల సంస్థానము వారు దేశికులను సమ్మానించి, అగ్రహారాది దానము లొసంగిరి.*13 కవితా వ్యవసాయమే ముఖ్యమైనను. దేశికులు చెప్పిన భగవద్విషయిక మంగళ హారతులు, తిరునామములు అనేకము గలవు. ఇందులో కొన్ని మాత్రమే లభించినవి.

హీనితో సంతృప్తి చెందని అప్పల దేశికులు తామే ప్రతిష్ఠించిన తమ దైవము శ్రీరామ చంద్రస్వామిని వర్ణించుచు మృదు మధుర శైలిలో 28 శ్లోకములతో 'శ్రీరామ పాద స్తుతి'ని, శ్రీ వైష్ణవులు పరమ పూజ్యురాలుగా భావించి తరించు 'ఆండాళ్'ను గూర్చి 112 శ్లోకములతో 'శ్రీ గోదా స్తవము'ను రచించిరి. తుంగతుర్తి తాలూకా 'అర్వపల్లి' గ్రామమున వెలసిన నృసింహ స్వామిపై స్రగ్ధరా వృత్తములతో ప్రౌఢ శైలిలో 'అర్వపల్లీ నృసింహమ్' అను మకుటము గల స్తోత్రమును, 'స్తంభగిరి' (ఖమ్మముమెట్టు) నృసింహస్వామిని గురించి 'స్తంభగిరీ భువన గోచరం శరీ' అను మకుటముతో మరియొక స్తోత్రమును చెప్పినారు.

అప్పల దేశికులు బహు గ్రంథ నిర్మాత యని ప్రసిద్ధి; కాని, పైన పేర్కొనిన రచనలతో బాటు కొన్ని తిరునామములు, మంగళహారతులు మాత్రమే లభించినవి.

తెలంగాణ ప్రాంతమున భగవద్భాగవత గోష్ఠులందు అనుసంధానము చేయబడునట్టి తిరునామ, మంగళహారతులలో అప్పల దేశికులవే యధికము.

## 13. వేంకట రాఘవాచార్యులు :

'కేశవస్వామి! భాస్వ త్కిరీట గామి!' యను మకుటముతో సీసపద్య శతకమును రచించిన యీ కవి 'తాలాంక నందినీ పరిణయ' కర్త యైన వేంకట నరసింహాచార్యుల కగ్రజుడు. ఈ సోదరు లిరువురును క్రీ.శ. 1800-1880 మధ్య కాలములో 'కనగల్లు' గ్రామమున నివసించుచుండిరి.

ఈ శతకము మహబూబ్‌నగర్‌జిల్లా జడ్చర్ల తాలూకా గంగాపురమున14 వెలసిన శ్రీ చెన్నకేశవ స్వామిని గూర్చి చెప్పినది. దీనితో పాటు 'మనకేమన కేశవ సేవ చేయుమా!' అను మకుటముతో 'క్షమా వింశతి'ని (ఇరువది పద్యములతో) చెప్పిరి గంగాపుర సమీపమున గల 'గుండూరు', 'అవంచ' గ్రామములలోని వైదిక కుటుంబముల వారికి పీని యందలి పద్యములు చిన్నతనమునుండి కంఠస్థములై యున్నవి. గంగాపుర దేవాలయమున కూర్చొని కవి యీ శతకమును వ్రాసినట్లు ఈ ప్రాంతమున ప్రచారము గలదు.

108 సీస పద్యములు గల శతకము చివర కవి తనను గూర్చి యిట్లు చెప్పికొని నాడు :



ఇది వృషాద్రి స్వామి పద భక్తి నిరతుండ
తత్కృపా లబ్ధ మేధా నిధుండ
గురుతర మౌద్గల్య గోత్ర సంజాతుండ
శ్రీవాస గురు పాద సేవకుండ
నిండి పే రిల మనెంగంటి వారసుచుండ
భాస్వ న్నృసింహార్య పౌత్రకుండ
మహి భావనార్య కుమా రాగ్రగణ్యుండ
వేంకట రాఘవా ర్యాంకితుండ-

నేడు, నా తుది నోము లన్నియును బండ
పూని శతకం బనెడు పుల్లె పూల దండ
కూర్చి యర్పించి తిదె నీకు మెడను నిండ
కేశవ స్వామి! భాస్వ త్కిరీట గామి!

గురునాథ శతక రచనా కాలమును గూర్చి —

> శాలివాహన గత శక వర్షములు వసు
> ఋషి గిరి శశి సంఖ్య రూఢి నడవ
> ప్రభవాది షష్టి సంవత్సరాంత స్సంస్థి
> తానంద నామాబ్ద మవని గడవ
> తలఁపఁగా దగు దారి తలను పేర్మెల నిండు
> పున్నమి రోజున ప్రొద్దు పొడవఁ
> గేశవ పుర చెన్నకేశవ శతకంబు
> నింపు నా మది నాతఁ డుండి నుడువఁ
>
> వస్తుత స్తుతి మధురామృతంబు కడవ
> గా ఫలించిన నరు లఘౌఘములు గడవ
> నిరిగి కల్యాణ కరణ భోగములు గుడువ
> కేశవ స్వామి...... (108)

దీని ప్రకారము శతక రచనా కాలము ఆనందనామ సంవత్సర మార్గశిర శుద్ధ పౌర్ణమి ఇందువారము(శ సం. 1778. తేదీ 11-11-1856)అగుచున్నది.*15 ముద్రితమైన శతకములో 'దారి నెలఁత' అను పాఠము గలదు. దీనిని 'దారి తలను' అని దిద్దిన మార్గశీర్ష మాస మగును (దారి=మార్గము, తల=శీర్షము). ఇది ఇచ్చిన తేదికి సరిపడును.

ఈ శతకము 1856 వ సం॥రము లోను, 'తాలాంక...' 1867 లోను రచింపఁబడినవి. వేంకట నరసింహాచార్యులు (తాలాంక నందినీ పరిణయ కర్త) ఆశ్రితులైన రామానుజాచార్యులను గూర్చి —

> గురు తపో ధారి సంతత కువలయాప్తుఁ
> డుచిత కళానిధి సత్సంగ తోత్సవుండు
> విష్ణు పద సక్త హరుడు కవి ప్రియుండు
> [illegible] మాయన్న వంటి వాఁడు 1-64

'గురు నియామకము చేకొని ధర్మ దీక్షచే
నారామ పదమునం దధివసించె
దాన వారి ప్రభా తతి దిగ్భరణం జేసి
శంకర ధర్మ శాసనత మించె
కడు జడధి క్రోధ గర్వం బపనయించి
మిత్ర జాత స్నేహ పాత్రత గానె
షడ్గుణ ఫల రసాస్వాద నామోదియై
యంగదాది బహూకృతిం గ్రహించె

వాద కోవిద దుష్ప్రతివాది పంక్తి
ముఖ విభంగ యశః ప్రాప్తి ముదితుం డయ్యె
చిత్ర కావ్యుండు మౌద్గల్య గోత్రజుండు
రాఘవార్యుండు రెండవ రాఘవుండు' (1-56)

అని రెండు పద్యములను అన్నగారి విషయమున శ్లేషించినాడు. ప్రథమ పద్యమున చంద్రునకు - కవి చంద్రునకు (శతకకర్త), తరువాతి పద్యమున రామాయణ కథను, రాఘవుని పేర్కొని తన యగ్రజుడు రాఘవుడు కావున 'రాఘవార్యుండు రెండవ రాఘవుండు' అని చమత్కరించెను.

ఇంత గొప్పవారైన అగ్రజుల కృపయే తన మనుగడకు ముఖ్యమని వారి వైదుషీ వ్యక్తిత్వములను ——

'సరస గుణాకరుం డఖిల శాస్త్ర వివేక మనోజ్ఞ సుందరుం
డురు కరుణాకరుండు వినయోజ్జ్వల శీలం డనూన కీర్తి సం
భరితుడు రంగనాయకి తపః ఫల మూర్తి మదగ్రజుండు నా
గరికత కంటి కెప్ప వలె గాచిన వేంకట నారసింహుండున్' (1-58)

అని వ్యక్తీకరించుటయే గాక అశ్వాసాంత పద్యములలో గురువుగారితో పాటు, అన్నగారిని కూడ స్మరించినాడు. ఆ పద్యములు:

'ఇది శ్రీ శేషధరోపమాన సుషమేభేంద్రాద్రి హృత్సర్వ టో
ధద శ్రీమత్కనగంటి గోప విభు బద్ధ శ్రీ మణింగంటి కో
విద శ్రీ రాఘవ వర్య సోదర సుధీ విద్వన్నృసింహార్య కం
ఠద తాలాంక సుకంఠిని పరిణయాఖ్యానంబు పంచాశ్వాసమై' (5-382)

ఇవియే గాక 1-328, 2-294, 3-177, 6-240 పద్యములలోను వీరి ప్రశస్తి గలదు.

రాఘవాచార్యుల పౌత్రుని పుత్రుడైన వేంకట నరసింహాచార్య కవి (1902-1961) తన పూర్వుల స్తుతించు సందర్భమున —

'సంస్కృతాంధ్ర కవిత్వ సాహిత్య చతురుడై
పరవాది భీకర పటిమ గాంచి,
అంత్య నియమంబుతో భక్తి యవఘళింప
కేశవ స్వామి శతకంబు శ్రీశు నెడలఁ
జెప్పె మఱి కొన్ని గ్రంథముల్ చెన్ను మీర!
సరస గుణ హేళి రాఘవాచార్య మౌళి!' (మాలతీ వసంతము 1-10)

అని ఈ కవి 'మరి కొన్ని గ్రంథముల' వ్రాసినట్లు తెలిపెను. కాని, అవి యేవియు లభింపలేదు. కేశవస్వామి శతకము ముద్రితమై ప్రచారములో గలదు.

## 14. వేంకట నరసింహాచార్యులు (తృతీయ) :

'తాలాంక నందినీ పరిణయ' కర్తయైన యీ కవి రంగనాయకీ భావనాచార్యుల పుత్రుడు. 'కేశవ స్వామి శతకము'ను రచించిన వేంకట రాఘవాచార్యులకు సోదరుడు, ప్రౌఢ కవి, 'కనగల్లు' గ్రామ నివాసి.

ఈయన సింగరాచార్యులకు గల ఆరుగురు పుత్రులలో ప్రథములైన భావనాచార్యుల పరంపరకు చెందిన వాడు. కాని, తన 'తాలాంక నందినీ పరిణయ' ము[illegible] వంశ వర్ణన చేయు సందర్భములో ప్రాచీనుడైన సాధు భట్టారకుల [illegible], వెంకటనే ప్రపితామహు డైన భావనాచార్యుల నుండి తన వరకు గల [illegible] చెప్పెను కాని సాధు భట్టారక, భావనార్యుల మధ్య మరి కొందరు [illegible] వంశ వృక్షములో సింగరాచార్య ప్రశక్తియే లేదు.

కేశవ స్వామి శతక రచన క్రీ. శ. 1856 వ సం॥న జరిగినట్లు కవియే [illegible]. 'తాలాంక...' కర్త ఈయన సహోదరులు కావున ఒకే సమయమున జీవించి యున్నవారు. అప్పుడు వీరి కాలము 1800-1880 మధ్య అని [illegible]

ఇక 'తాలాంక నందినీ పరిణయము' తాళపత్ర ప్రతి చివర 'గ్రంథ లేఖన తిథి' పద్య మొకటి వ్రాయబడి యున్నది —

'కలియుగ శాలివాహన శకంబులు వేద రసాచ లేందు సం
ఖ్యల జన నందు నాంగిరస హాయన భాద్రప దాఽసి తాష్టమిన్
గలిత మృదూక్తి నీ సరస కావ్యము పూర్ణముగా రచించె న
ల్పలఘుడు శేష శైల శిఖరాగ్ర విహారి లసత్కృపా మతిన్'

అని. దీని ప్రకారము(వేద. 4, రస. 9, అచల 7, ఇందు-1) శాలివాహన శక వత్సరము 1794, క్రీ.శ. 1872 అగును. (అంగీరస భాద్రపద బహుళ అష్టమి 24-9-1872 అగును). 'రస' యనినపుడు '6' వేసికొనినచో 1764 అగును. కాని ఇది క్రీ. శ. 1842 ప్లవ సంవత్సరము అగుచున్నది గాని అంగీరసకు సరిపడుటలేదు.

తాటాకు పుస్తకము తృతీయాశ్వాసము చివర "ఈశ్వర నామ సంవత్సర నిజ జ్యేష్ఠ బహుళ పాడ్యమీ భౌమ వాసరము సాయంకాలము వరకు 'తాలాంక నందినీ పరిణయ' తృతీయాశ్వాసము'-౹16 అని వ్రాయబడినది. ఇది 26-6-1877 వ తేదీకి సరిపడును. అనగా అంగీరసలో గ్రంథము రచింపబడగా ప్రత్యంతరము ఈశ్వర సంవత్సరమున(5 సం.ల తర్వాత) వ్రాసికొనిరి. దీని ప్రకారము క్రీ.శ. 1872 గ్రంథ రచన. క్రీ శ. 1877 ప్రత్యంతర రచన యని తెలియుచున్నది.

'గోలకొండ కవుల సంచిక'(411 వ పుట)యందు ఈ కవి పరిచయమున కాలము శా. శ. 1764, క్రీ. శ. 1842 అని తెల్పుటకు పైన తెల్పిన 'కలియుగ...' పద్యమే ముఖ్యాధారము కావచ్చును.

ఈ కవి కాలము తెలిసికొనుటకు మరి యొక పద్ధతి గలదు నేడు 'కనగల్లు'లో నున్న శ్రీనివాసాచార్యులు(వయస్సు 80 సం.) 'తాలాంక' కర్తకు 6వ తరములో గల వ్యక్తి. 1937 నుంచి తరానికి 30 సం.ల వంతున లెక్కించినచో కవి కాలము క్రీ.శ. 1807 అగును. తరము 25 సం॥ల చొప్పునలెక్క గట్టినచో 1687 కాగలదు.

ప్రబంధ రచన వరకు కవి వయస్సు 35 సం. లని భావించినచో- 1807 + 35 = 1842, 1837 + 35 = 1872. వీనిలో 'కలియుగ...' పద్యమున తెల్పిన ప్రకారము 1872, 1842 వచ్చినవి. ప్రత్యంతర రచన 1877 అని కలదు. కావున 'తాలాంక నందినీ పరిణయము' 1872 లో రచింపబడినది. వీని నన్నిటి ననుసరించి పరిశీలన చేయగా 'కలియుగ...' పద్యము కవి వ్రాసికొనినదే కాని లేఖకునిది కాదని తెలుచున్నది.కేశవ స్వామి శతక రచన 1856, 'తాలాంక...' రచన 1872 అనుటలో ఎట్టి విప్రతిపత్తియును లేదు. దీని వలన కవి కాలము 1800 - 1880 కాగలదు.

వేంకట నరసింహాచార్యులు సర్వ త్రయ*[17] కైంకర్య నిష్ఠా గరిష్ఠుడు, ఉత్కృష్ట లక్షణానవద్య విద్యా విలాసుడు. ప్రబంధ నాటక కృతికర్త. మరింగంటి కవులలో అధికులు సిరిసెనగండ్ల నృసింహ స్వామికే తమ రచనల నంకితమొనర్చిరి, ఈ కవి మాత్రము 'వృషాచలేశున కుదారత, గౌరత' కావ్యకన్య నొసంగినాడు.

శృంగార ప్రధానమై ఆరాశ్వాసములు గల 'తాలాంక నందినీ పరిణయము'ను గూర్చి యొక కథ ప్రచారమున గలదు.

కవి యీ గ్రంథమును రచించునప్పుడు వ్రాసిన తాటియాకులను గృహామునం దొక ప్రక్క గాలికి పెట్టినారట. ఎప్పుడో వీరి యింటి పాడి గేదె వచ్చి వానిలో కొన్నిటిని భక్షించినది. కవి దీని కెంతగనో బాధపడి వెంటనే గేదెను శపించుచు పద్యము చెప్పినాడు. వీరి వాక్శక్తివలన గేదె మరణించినది. అప్పటి నుండి ఈ శాఖ మరింగంటి వారికి బఱ్ఱెలు అచ్చిరాటు లేవు.

కవి చెప్పిన ఈ పద్యము లభింపలేదు. చరమ జీవితమున 'కనగల్లు'లో తా ననుభవించిన బాధలను తెల్పుచు చెప్పిన 9 చరణముల శార్దూలము, శిష్య సంచారమునుండి తిరిగి తమ గ్రామమునకు వచ్చుచుండగా మార్గ మధ్యమున వీరిని చోరులు దోచుకొనిన విషయమును గూర్చి చెప్పిన సీసమాలిక - ఈ రెండును మాత్రమే లభించినవి ('చాటువులు' అను ప్రకరణమున వాని వివరము లీయబడినవి).

కవి తాను 'బంధ నాటక కృతి' నిర్మాత నని తెల్పుకొనెను. 'తాలాంక నందినీ పరిణయ' మను ప్రబంధము, 'ఇందిరాల గోదా పారిజాత' మను (యక్ష గానము) కృతి మాత్రమే వీరి రచనలుగా లంభించుచున్నవి.

తాలాంక నందినీ పరిణయ ప్రారంభమున కవి 'వంశావతార వర్ణన'లో తన పూర్వులైన వారి ప్రతిభా పాండిత్యముల గూర్చి తెల్పినాడు. అట్టి వారి యందు కవి ప్రపితామహుడైన భావనాచార్యులు-

'తనదు వాక్ప్రౌఢ సిద్ధాంత సూక్తులు జగ
ద్గురునకు వజ్ర పంజరము లాయె
తన రచించిన ప్రబంధ కథా సుధా నిధుల్
దాస్య కోటికి భాగ్య ధనము లయ్యె
తన చేయి సంతత దాన ధారా సుధల్
పండితాళికి మెట్ట పంట లయ్యె
తన యశశ్చంద్రికా ధవళ రుక్తతి - ధరా
తరుణి కైశిక పుష్ప దామ మయ్యె

తనదు జిహ్వాంచలంబు వాగ్వనిత కెపుడు
మంగళోత్తుంగ మణి నృత్త రంగ మయ్యె
ననఁగ చెలువొందె విమత సంహతి విదారి
జన మనోహారి భావనాచార్య సూరి!' (1-40)

ఇట్టి వీరి రచన లేవియో తెలియరాలేదు. కవి పితామహుడు నరసింహా చార్యులు. ఈయన దురితౌఘ దూరుడు, వాది మత విభేదనుడై సాక్షాత్ నృసింహ స్వామినే స్ఫురింపచేయు వాడు. ఆయన -

'తగ నాంధ్ర సంస్కృత ద్రావిడ కవితా స
మర్థుఁడై యే మహామహుఁడు చెలఁగ
శాస్త్ర ప్రసంగ వచశ్శక్తి కుమతుల
కే దేశికుండు హృద్భేది యయ్యె

నిష్కారణ కృపా పరిష్కార హృదయుఁడై
యే సూరి మణి చేతనేచ్ఛ దీర్చె
శ్రీ సదాచార్య సేవాసక్తి సంతతం
బే గురుం డతి వీతరాగి యయ్యె

శేష భూధర వర సర్వ శేషి గుణ వి
శేష మహిమా ప్రవచన నిశ్శేషిత స్వ
దోష ధిషణానుసక్త సంతోష లసద
శేష శుభ సింధువరుఁడు నృసింహ గురుఁడు!' (1-48)

వీరి తర్వాత తన పితృపాదులు భావనాచార్యులను గూర్చి —

'శాస్త్ర నిషిద్ధాన్య జన కాలకూటంబు
కుటిల కుతర్కాళి గుండె దిగులు
విజ్ఞాన శూన్య దుర్విమతాళికిని మిత్తి
వెక్కరులకు నుక్కు ముక్కు కొయ్య
వికట మాయావాదులకు బొమ్మ గాలంబు
బౌద్ధ శాసన బృహ ద్ధ్వానుమూర్తి
చార్వాక మత తమ శ్ఛట భాస్కర ద్యుతి
క్రూర జైనేభ కంఠీరవంబు

సకల వేదాంత శాస్త్ర ప్రసంగ పాళి
సంభృతాఖిల సౌశీల్య సద్గుణాళి
కుటిల దుర్మద శైలేంద్ర కటక పటల
చటుల దంభోళి భావనాచార్య మౌళి!'

'భాషా సతీ కచ భరముపై వలగొన్న
తెలి పూవు దండలై తనకు దనరి
ఘన హలాయుధు నీలి కాశ పెందట్టిపై
శుభ్రాంశుక స్ఫూర్తి చుట్టుముట్టి
ప్రమథనాథుని కంఠ భాగంబునకు గంధ
పాటీర పంకమై ప్రభ నొసంగి
యోష ధీశ్వరుని పెన్నుఱమున వన్నెల
మగఁటాల పతకమై సొగసు బొలిచి.

మహిని మాలిన్య గతుల నిర్మలులఁ జేసి.
హార నీహార కర్పూర హీర తార
పారద క్షీర డిండీర దారు కీర్తి
నలరె నౌద్గల్య భావనాచార్య కీర్తి!' (1-48)

అని ఇట్లు తన పూర్వుల ప్రభావమును తెల్పినాడు.

## 15. వరద దేశికులు :

అప్పల దేశికుల సమకాలము వారని ప్రతీతి గల దేశికుల రచన లేవియు (గ్రంథములు) లభించలేదు. కొన్ని మంగళ హారతులు, తిరునామములు మాత్రము గలవు.

'ప్రపన్న గానామృతము' నందు గల 'మరింగంటి వారి రచన', కర్తృత్వము తెల్పబడని 'తిరునామములు' వరద దేశికుల వారివే!

సర్వసంగ పరిత్యాగియైన దేశికులు మితభాషి. జపానుష్ఠాన యోగపరుడు. 'నరసింహాపురము', 'రేపాల' దేవాలయములే వీరికి నివాస స్థానములు. సంస్కృతాంధ్రములయం దసమాన పాండిత్యము గల దేశికుల ముక్తక రచనలు (శ్లోకములు, పద్యములు) అనేకములు గలవని యందురు; కాని అవి అలభ్యములు.

వీరు పూరించిన 'సమస్య' గా 'రాజ మరాళ కుంతలకు రాజీర మత్త గజేంద్ర మధ్యకున్' అనునది దొరకి లభించినది. ('చాటువు'లలో దీనిని గూర్చిన వివరణ గలదు).

## 16. నరసింహ దేశికులు :

అప్పల దేశికుల శ్రీ రామచంద్ర ప్రతిష్ఠ చేసిన ప్రాంతమునకు తమ యగ్రజులైన నరసింహ దేశికుల పేర 'నరసింహాపురము' నేర్పాటు చేయించినారు. దీనికే 'అప్పల నరసింహాపురము'*18 అని మరి యొక పేరు ప్రచారమున గలదు.

నరసింహ దేశికులు మహాప్రభావ సంపన్నులు. అనేక తిరునామ, మంగళ హారతులలో వీరి ప్రసక్తి గలదు.

నరసింహాపుర శాఖయందు అప్పల దేశికుల కుమారుని పేరు, పౌత్రుని పేరు కూడ నరసింహ దేశికులే! వీరియందు దేశికుల యగ్రజుండు పెద్ద నరసింహ దేశికులనియు, పౌత్రులైన నరసింహ దేశికులకు చిన్న నరసింహ దేశికులనియు ప్రచారములో గలదు. ఉభయులును భగవద్విషయ 'తిరునామములు' రచించినారు. (తిరునామ మంగళహారతుల ప్రకరణములలో వివరణము లీయబడినవి)

## 17. రామానుజాచార్యులు :

'యాదవాకిళ్ళ', 'కనగల్లు' గ్రామములనుండి విశాఖపట్టణము, శ్రీకాకుళ ప్రాంతములకు వెళ్ళి స్థిరపడిన మరింగంటి వారిలో ఈ కవి కుటుంబము గంజాం జిల్లా 'గుజ్జవాడ'లో అగ్రహారీకులుగా నుండిరి.

వారణాసి అచ్యుతరామ కవి తన 'సురతాణీ పరిణయ' ప్రబంధ ప్రారంభమున పేర్కొనిన ముగ్గురు గురువులలో రామానుజాచార్యులు అధికముగా వర్ణింప బడినాడు.

అచ్యుతరామ కవి తెలిపిన 'వంశ వర్ణన' ప్రకారము రామానుజాచార్యులు సింగరాచార్యుల తరువాత 8 వ తరమున నున్నాడు. దాని ప్రకారము వీరున కాలము క్రీ.శ. 1880 కాగలదు. సురతాణీ పరిణయము 'శాలివాహన శకాబ్దిస్ రసాగ క్షమాధర చంద్రాంచిత సంఖ్య కాంతర లస న్మానవోన్నతానంద వత్సర సత్కార్తిక శుక్ల సప్తమిని భాస్వత్సౌరవారంబునన్' (6 వ ఆశ్వాసము చివర) పూర్తిచేయబడినది. అది శా. శ. 1776, క్రీ. శ. 1854 అగును.

అచ్యుతరామ కవిని రామానుజాచార్యులు పిలిపించి 'శిష్య వాత్సల్యమును ప్రవర్తించి', 'అష్టుఁడతోఁగను సభను రంజిలి' సురతాణీ పరిణయమును ప్రబంధముగా రచింపుమని ఆదేశించినట్లు (సురతాణీ పరిణయకర్త) తెల్పెను(1,19-26)

దీనివలన అచ్యుతరామ కవి గ్రంథ రచన జరుగుచున్నప్పుడు రామానుజాచార్యులు జీవించియున్నాడు కావున 1700 - 1780 ఈ కవి కాలము. 'సింహాద్రి నృపంచాస్యు ఇలవేలుపు'గా గల రామానుజాచార్యులు శ్రీరామ

నాటకము (యక్షగానము) 'గణ చతుర్థ్యుపాఖ్యానము' అను గ్రంథములు రచించెను. వీనియందు నాటకము ముద్రితమైనది; రెండవకృతి అలభ్యము. రామానుజాచార్యులను గూర్చి '**సురతాణీ పరిణయము**'న నిట్లు గలదు :

'అతఁడు గుణశాలి రిపు వన వితతి కీలి
భవ్య మణిగంటి భట్ట రన్వయ సుధోర్మి
మాలి, తారా మనోహారి, మహిత విద్వ
దబ్జ గణ హేళి రామానుజార్య మౌళి!' 1-19

'ఆ రామానుజ సర్వవిద్వ సరస వ్యాపార మూహింప నె
వ్వారున్ జాలరు దాని నేమి యుక తేవం బుక్క తద్బాటు వా
క్సారస్యంబు గ్రహించి నిక్కముగ జక్కన్ దాని తాత్పర్య మె
వ్వారైనన్ వచియించిరేని ధరలో వారే కవి గ్రామణుల్!' 1-54

'రహి మీటంగ ననంతమూర్తి యిపు డీ రామానుజాచార్యుఁడై
మహిలోన న్వెలసిల్లె గాని యెడ ప్రేమన్ శిష్య పాఠంబులన్
బహు తర్కాధిక దివ్య శాస్త్ర విలస ద్వాదంబులన్ గల్పనా
మహిమన్ వేయి ముఖంబు లున్న పగిదిన్ మానొందునే నిత్యమున్' 1-55

'విఖ్యాతి గణ చతుర్థో
పాఖ్యానాది ప్రబంధ బంధన కవిరా
ణ్ముఖ్యుఁడు తారా వినుత స
మాఖ్యుఁడు రామానుజార్య మణి కేవలుఁడే ?' 1-56

వంశావతార వర్ణన గల 32-65 పద్యములలో పీరిని విద్యా భోగ భాగ్య దాతృత్వముల గూర్చియు, వీరి అర్ధాంగిని గూర్చియు వర్ణన గలదు.

అద్యుతరామ కవి గురువుగారి గణ చతుర్థ్యుపాఖ్యానమునే తెల్పినాడు కాని శ్రీరామ నాటక ప్రసక్తి చేయలేదు.

## 18. చెన్న కృష్ణమాచార్యులు :

'బహుళ శతక కర్త' యని పేరు గాంచిన యీ కవి 'తాలాంకనందినీ పరిణయ' కర్తయైన వేంకట నరసింహాచార్యుల పుత్రుడు.

'గోలకొండ కవుల సంచిక' యందు 'ఈ కవి 80 సంవత్సరములు క్రింది వాడు'(899వ పుట) అని కలదు. దాని ప్రకారము క్రీ.శ. 1854 అగును. ఈ కవి పౌత్రుడైన శ్రీరంగాచార్యులు 1910 లో జన్మించి 1965 లో పరమ పదించెను. మనుమనికి వెనుక మూడవ తరములో నున్న చెన్న కృష్ణమాచార్యులు క్రీ.శ. 1860 లో నున్నట్లు దీనివలన తెలియుచున్నది. గోలకొండ కవుల సంచిక తెల్పిన కాలమును, ఇదియు దాదాపు సరిపడును.

అనేక శతకములను రచించినా డను ప్రచారము గల ఈయన కృతులలో ఒక్క 'యాదగిరి నృసింహ శతకమే' లభించు చున్నది.

## 19. వేంకట నరసింహాచార్యులు :

చెన్న కృష్ణమాచార్యుల కుమారుడైన యీ కవి క్రీ.శ. 1820 ప్రాంతమున జన్మించినారు. వీరి కుమారుడే 'కనగల్లు' నందు, **'శారదపత్ర గ్రంథ నిలయము'ను** స్థాపించిన శ్రీరంగాచార్యులు. చెన్న కృష్ణమాచార్యులు 'అనిరుద్ధ విలాసము'ను (యక్షగానము) రచించినాడు. ఇది అలభ్యము. 'గోలకొండ కవుల సంచిక' (410 వ పుట) లో ఈ కవి పరిచయము కలదు.

## 20. లక్ష్మణ దేశికులు :

మణవాళాచార్య రంగమాంబల పుత్రుడైన ఈ కవి సుమారు క్రీ.శ. 1804 వ సంవత్సరమున నరసింహాపురములో జన్మించెను. బాల్యావస్థలోనే స్వగ్రామమును వదలిన ఆచార్యుల వారికి వరంగల్ జిల్లా 'జఫర్‌గడ్' (వేలుపుగొండ) గ్రామమున ఉపనయనము జరిగెనది. కొంత కాలము తర్వాత పిదుమర్తి నరసింహాపురమునకు వెళ్ళి శ్రీమాన్ మరింగంటి నరసింహ దేశికులవద్ద పంచ సంస్కారములను పొంది విద్యాభ్యాసము నారంభించిరి అనంతరము వరంగల్ జిల్లా 'నెల్లి కుదురు'నకు చేరుకొని పరమ భాగవత శిఖామణులని ప్రసిద్ధి గాంచిన శ్రీమాన్ పాదభూషణం శ్రీరంగ దేశికుల సన్నిధిని'తిరుమంత్ర', 'భగవద్విషయ', వేదాంత గ్రంథముల నభ్యసించిరి. ఈ సమయములోనే సూర్యాపేట తాలూకా 'గోరెంట' గ్రామములో నున్న అగ్రహారీకులు కిడాంబి ఉరూరి లక్ష్మీనరసింహాచార్యులు గారు తమ పుత్రికయైన లక్ష్మీ నరసమ్మను

లక్ష్మణాచార్యులవారి కొసంగి వివాహము చేసి తోరంటలోనే జామాతకు గృహ భూ వసతుల గల్పించి నివాసము నేర్పాటు గావించిరి. పది సంవత్సరములపాటు ఇచట నివసించిన దేశికులవారు రంగ దేశిక శిష్యులు వరంగల్ జిల్లా మల్లంపల్లి నివాసులైన మక్తేదారులు ఉత్తమ రాజు కొండలరావుగారి కోరికపై మల్లంపల్లికి చేరిరి (ఈ కారణముగనే వీరికి 'మల్లంపల్లి మరింగంటి వా'రని ప్రసిద్ధి). ఇచ్చట వీరికి తగిన వసతుల నేర్పాటు చేయించిన ఉత్తమరాజు వారు తామే గాక ఇంకెందరిచేతనో శ్రీభాష్య, భగవద్విషయములను ఆచార్యుల వారి ద్వారా సేవింపచేసిరి.

అవకాశము కలిగినపు డెల్ల లక్ష్మణ దేశికులు వరంగల్లు, ఖమ్మం, నల్లగొండ జిల్లాలలో సంచరించుచు, దివ్యమైన కంఠముతో భగవద్విషయ కాలక్షేపమును తమ తిరునామానుసంధానములను గావించువారు.

దేశికుల వారు సంస్కృతాంధ్ర ద్రావిడములయందు మంచి పాండిత్యము గలవారు. అయినను వీరిది ఎక్కువగా ప్రవచన పద్ధతి. చివరి వరకు అదే ధోరణి కొనసాగినది. దీనివలన లక్ష్మణాచార్య నామము లక్ష్మణ 'దేశికులు'గా ప్రచారమై స్థిరపడినది.

వీరు రచించిన **'తిరునామములు'** 136 లభించినవి. ఇందులో భగవద్రామానుజ వైభవమును వర్ణించు 108 (అష్టోత్తరశతము) 108 దివ్య తిరుపతులను దృష్టియం దుంచుకొని రచించినట్టివి మిగిలిన 27లో భగవద్విషయ, వరవర ముని, శ్రీ శఠకోపుల గూర్చి చెప్పబడినది.*[10]

లక్ష్మణ దేశికులు కేవలము తిరునామ రచన భగవద్విషయ కాలక్షేపము లతో పాటు మధ్య మధ్య కొన్ని సంస్కృత స్తోత్ర రచనము లొనర్చినారు. వానిలో నొకటి వేల్పుగొండ నృసింహ స్వామిని గూర్చి 'దేవాద్రి ప్రభు మీశ ధాతృ వినుతం లక్ష్మీనృసింహం భజే!' యను మకుటము గల స్తోత్రము. ఇది పూర్తిగా లభించలేదు. 'గోలకొండ కవుల సంచిక' (337 వ పుట) యందు ముద్రింపబడిన నాల్గు శ్లోకములే మిగిలినవి.

వీరి రచనలుగా 'కారికావళి', 'సూక్తి రత్నమాల', 'శ్రీరామానుజాష్టో త్తర శతము' అను 'గోలకొండ కవుల సంచిక' తెల్పగా, తరువాతి పరిశోధకులు ఈ విషయము నిట్లే వ్రాసినారు *20 కాని ఇవి'ఏవీ వీరు వ్రాయలేదు. వ్రాసినట్లు వినలేదు' అని దేశికుల కుమారులు మణవాళాచార్యులు గారు చెప్పిరి. 108 తిరునామములనే రామానుజ అష్టోత్తర శత మని పరిశోధకులు పేర్కొనినారు. మిగిలినవి ఎవరి రచనలో?

గ్రంథముల విషయముననే గాక వీరి కాల నిర్ణయము గూర్చియు **'గోలకొండ కవుల సంచిక'** పొరపాటు పడినది. 'వయస్సు' 65 సంవత్సరములు'గా పేర్కొనెను. 1934 లో ముద్రింపబడిన 'గోలకొండ కవుల సంచిక' నాటికి లెక్కించినచో (65 సం) వీరి జనన కాలము 1869 కాగలదు. 1934 నాటికి మల్లంపల్లి తత్పరిసరములయందు లక్ష్మణ దేశికు లెవ్వరును లేరు. రచనలవలెనే కాలమును గూడ ఎవరిదో వేసినట్లున్నారు. లక్ష్మణ దేశికులు 1864 వ సంవత్సరమున జనించినట్లు వారి కుమారులే చెప్పుచున్నారు.

పరమ భాగవతులైన దేశికులు తొర్రూరు, కొత్తపల్లి, కొండూరు, పెంగ కుర్తి మొదలైన ప్రదేశములలో భగవద్విషయ కాలక్షేపము చేసి ఘన సన్మానము లందినారు.

వీరు రచించిన తిరునామములను శ్రీ రామానుజుల అవతార స్థలమైన శ్రీ పెరుంబూదురు కోవెలలో స్వయముగా పఠింపవలె నని భావించిరట. దైవ సంకల్పము మరొక విధమైనది. ఆచార్యులు గారు తమ 74 సంవత్సరాల వయస్సున 1980 లో పరమపదించిరి.

"శ్రీమాన్ రంయాల వేంకటాచార్యులు గారు పన్నెండుగురు శ్రీభాష్య భగవద్విషయ వేత్తలకు జరిపించిన బ్రహ్మర థోత్సవములో వీరొకరు కావటం వీరి బ్రహ్మ వేత్తృత్వమునకు నిదర్శనము" అని వారి కుమారులు తెలిపిరి. ('తిరునామములు' iii పుట. పీఠిక.)

లక్ష్మణ దేశికుల వారికి అర్గురు కుమారులు వీరితో మూడవవారైన మణవాళాచార్యులు గారు (83 సం.) సంస్కృతాంధ్రముల యందును

జ్యోతిషమునను పండితులు. తండ్రిగారి చిరునామును సంరక్షించి ముద్రణ చేయించినారు. నాల్గవ కుమారులు పీతాంబరాచార్యులు గారు పంచాంగ కర్తగా ప్రఖ్యాతి గాంచినారు.

లక్ష్మణ దేశికులు పరమపదించిన తర్వాత ఈ కుటుంబము వరంగల్లులో స్థిరపడినది.

## 21. జగన్నాథాచార్యులు :

కల్వకుర్తి తాలూకా రంగాపుర గ్రామ వాసుడైన ఈ కవి రామానుజాచార్య, లక్ష్మినరసమ్మల కుమారుడు. బాల్యమున పితృపాదుల వద్ద సంస్కృతాంధ్ర సాహిత్యముల యందు పరిచయము పొందిన తర్వాత జగ్గయపేటకు వెళ్ళి, ఆ నాడు ప్రసిద్ధ కవి పండితులుగా పేరు గాంచిన సంపన్ముదుంబ లక్ష్మి నరసింహాచార్యులవారి వద్ద కావ్య, నాటక, ఛందో, వ్యాకరణముల నభ్యసించి, కవితా రచనమున గురువుగారిచే ప్రశంసల నంది, తిరిగి స్వగ్రామమును చేరిరి.

ఆచార నిష్ఠ, పాండితీ ప్రాభవములు గలిగిన ఆచార్యులుగారు మహబూబ్ నగర్, నల్లగొండ, వరంగల్లు జిల్లాలలో నున్న శిష్యులకు పంచ సంస్కారము లొనర్చి, విశిష్టాద్వైత విషయముల బోధించుటతో పాటు సంస్కృతాంధ్ర కావ్య, నాటక విషయములను నేర్పువారు. ఈ విధముగా వీరివద్ద సాహితీ పరిచయము నందిన శిష్యులలో కొందరు 'కాట్రు', 'ఎల్లికల్లు', 'బూపల్లి', 'దేవరకొండ' లలో గలరు.

జగన్నాథాచార్యులు ప్రౌఢ కవి. సంస్కృతాంధ్రములందు అలవోకగా కవిత్వమును చెప్పువారు. వీరి రచనలు :

1. యాదగిరి లక్ష్మి నరసింహ సుప్రభాతము
2. బీజాక్షర పంచ రత్నములు
3. వ్యాజ స్తవమ్
4. యాదగిరి నరసింహ శతకము

5. తత్త్వ తిరునామములు
6. సూతక శిక్ష
7. శ్రీకృష్ణ చరిత్ర
8. ఆచార్య తారా మాల.

వీనిలో మొదటి నాల్గింటిని కలిపి 1922 వ సంవత్సరమున [illegible] విజ్ఞాన ప్రచారిణీ ముద్రణాలయమున వీరతాయల రామారావు గారు ముద్రణ చేయించిరి.

'శ్రీకృష్ణ చరిత్ర' యక్షగాన పద్ధతికి చెందిన లఘుకృతి. దీనిని విరోధి కృత్ శ్రావణ బహుళ సప్తమీ రోహిణీ నక్షత్రమున రచించినారు. ఈ గ్రంథము లలో 'యాదగిరి లక్ష్మీనరసింహ సుప్రభాతము', 'తత్త్వ తిరునామములు'లో కొన్ని మాత్రమే లభించినవి.

రంగస్వామ్యాచార్యులవారు చరమ దశవరకు సాహితీ వ్యాసంగము చేసి [illegible] ధాత సంవత్సర ఫాల్గుణ బహుళ దశమినాడు (మార్చి 1986) స్వగ్రామమైన 'రంగాపురము'లో పరమపదించినారు.

## 22. వేంకట రామానుజాచార్యులు:

కేశవస్వామి శతకకర్త యైన వేంకట రాఘవాచార్యుల పౌత్రుని పుత్రుడైన [illegible] రాఘవాచార్యులకు ఈయన అగ్ర సుతుడు (ఐదవ వేంకట నరసింహాచార్యుల అగ్రజుడు).

సంస్కృతాంధ్ర భాషా పారంగతులైన ఆచార్యులవారు క్రీ.శ. 1936 వ సంవత్సరమున '[illegible]' నుండి వెళ్ళి, కృష్ణాజిల్లా 'మొఖాసా కల్వపూడి' యందు [illegible] ఏర్పరచుకొనిరి.

వీరు తమ పూర్వుల రచనయైన 'కేశవస్వామి శతకము'ను ముద్రణ (1934) చేయించుటయే గాక, స్వయముగా 'శ్రీ వీరాచల క్షేత్ర మాహాత్మ్యము' ([illegible] శ్రీరామ చంద్ర వైభవము) అను ప్రబంధమును 5 ఆశ్వాసములుగా రచించి (1945), మరి కొంత కాలము తర్వాత (1947లో) 'రాఘవ శతకము'ను చెప్పినారు. ప్రబంధము నేటికిని ముద్రణ కాలేదు. శతకము 1948 లో [illegible].

వీరు శిష్య సంచార సమయములు దివ్య ప్రబంధ కాలక్షేపములతో పాటు సాహిత్య సంబంధములైన ఉపన్యాసముల నొసంగి ఎందరికో వినియోగ దీని వేశమును కల్గించినారు.

చరమ దశలో 'శ్రీభాష్య సారము' (తెలుగు) రచింప ప్రారంభించి 1972 వ సం.మున తమ కుమారులైన సీతారామాచార్యుల వద్ద 'కుథరవల్లి'లో పరమపదించిరి.

## 23. వేంకట నరసింహాచార్యులు (ఐదవ) :

రాఘవాచార్య, నరసమాంబల గర్భ శుక్తి ముక్తా ఫలముగా క్రీ శ. 1902 వ సం.ము కనగల్లులో జన్మించిన వేంకట నరసింహాచార్యులు ఈ వంశమున ఇదే పేరు గల కవులలో ఐదవవారు.

బహు గ్రంథకర్తలైన కవిగారి విద్యాభ్యాసమునకు కనగల్లు వీథి బడిలో శ్రీకారము చుట్టబడిన తరువాత ఆరు సంవత్సరముల వయస్సులో అన్నగారైన వేంకట రామానుజాచార్యులతో కలిసి ద్వారకాతిరుమలకు వెళ్ళి, కొంత కాలము విద్యాభ్యాస మొనర్చి శిష్య సంచార కారణముగా తమ తాత, తండ్రులతో కలిసి అనేక గ్రామములలో సంచరించుచు, కల్వకుర్తి తాలూకా జూపల్లికి చేరి శిష్యులైన రంగినేని వారి కోరికపై తమ పెద్దలతో అచ్చట కొంత కాలము నివసించినారు.

విద్యాభ్యాసమున మిక్కిలి పట్టుదల గల ఆచార్యుల వారు ఆనాటి ప్రాంతమున అందుకు తగిన సౌకర్యములు లేని కారణముగా - ఏలూరుకు ఇరువది మైళ్ళ దూరమున తమ బావగారైన గారమతం రంగాచార్యుల వారినివాస గ్రామ మగు 'తెంపల్లి'కి చేరుకొని, వారివద్ద సంస్కృతాంధ్ర సాహిత్యములను - కొంత ఆంగ్లభాషను- అభ్యసించి, ఇచటనే పద్య రచనము కూడ నారంభించిరి.

వేంకట నరసింహాచార్యుల వారికి 1923 వ సంవత్సరమున ఆండాళ్ళమ్మ గారితో వివాహము జరిగినది. పదునాల్గేండ్ల దాంపత్య జీవితము గడిపిన వీరి యర్ధాంగి 1942 వ సంవత్సరమున పరమపదించుటచే కవిగారి జీవితము అంధ

భాషకు గురియైరి. కావ్యామృత రసాస్వాదనా పరవశులైన వీరు బాల్యమును దిగ ప్రాంగణమున రచనా వ్యాసంగమును సాగించిరి.

శిష్యుల కోరికపై వీరు 'మోతె', 'సిరికొండ' గ్రామములయందు నివసించుటకు వెళ్ళి, తమ కనుకూలముగా లేనందున, అచ్చట సంతానముతో సంచార మారంభించి అనేక గ్రామములను సంచరించినను ఎచ్చటను స్థిర నివాసము ఏర్పాటు కాలేదు. తమతో పాటు - చిన్నవారైన సంతానముతో సహా కవితా వ్యాసంగము చేయుచు 1952 వ సంవత్సరమున సూర్యాపేటలో ఒక యింటిని ఖరీదు చేసి దానిలో స్థిరపడిరి.

మరింగంటి వారి ఆనవాయితీ ప్రకారము బాల్యము నుండియే పింగళి [illegible] నుగ్రహము సంప్రాప్తించి నందున పదునాల్గు సంవత్సరముల ప్రాయము న 'శ్రీరంగాపుర సత్యనారాయణ శతకము'ను చెప్పిరి. తరువాత రచింప బడిన ఆచార్యుల వారి వివిధ ప్రక్రియలకు చెందిన రచనల లిస్టు గలవు :

1. శతకములు : — రచించిన సంవత్సరము

| | రచన | సంవత్సరము |
|---|---|---|
| 1. | శ్రీరంగాపుర సత్యనారాయణ శతకము | 1912 |
| 2. | శ్రీరాఘవ శతకము | 1925 |
| 3. | గోపాల చూడామణి శతకము | 1928 |
| 4. | మానస ప్రబోధ శతకము | 1946 |
| 5. | శ్రీమత్తిరుమలాపుర భోగసుందర సీతారామ శతకము | 1948 |
| 6. | తిరుమల వేంకటేశ్వర అంత్య ప్రాస నియమ శతకము | (అలభ్యము) |
| 7. | శ్రీరంగాపుర సత్యనారాయణ శతకము(మరి యొకటి) | 1950 |

2. ప్రబంధములు :

| | రచన | సంవత్సరము |
|---|---|---|
| 1. | మాలతీ వసంతము | 1934 |
| 2. | సీతోద్వాహము | 1950 |
| 3. | చిత్రవింద | (అముద్రితము) |

**3. నాటకములు :**

| | |
|---|---|
| 1. కూర్మ నారాయణ చరిత్ర | 1934 |
| 2. సుమాలినీ పరిణయము | 1945 |
| 3. సుచిత్రాభ్యుదయము | 1950 |
| 4. శశి కళ | 1950 |
| 5. పద్మవ్యూహము (అలభ్యము) | ? |
| 6. అనిరుద్ధ విలాసము ,, | ? |
| 7. లలిత | ? |

**4. ప్రహసనములు :**

| | |
|---|---|
| 1. సుందరీ విలాసము | 1926 |

**5 యక్షగానములు :**

| | |
|---|---|
| 1. ప్రద్యుమ్న విజయము | 1935 |

**6. హరికథలు :**

| | |
|---|---|
| 1. సత్యనారాయణ వ్రతము | 1938 |

**7. స్తోత్రములు :**

| | |
|---|---|
| 1. ఉర్లుగొండ లక్ష్మీ నృసింహ స్తోత్ర తారావళి | 1948 |
| 2. శ్రీరంగాపుర సత్య దేవ స్తోత్ర తారావళి | 1957 |
| 3. శ్రీ గోదా దేవీ స్తవము (అలభ్యము) | ? |
| 4. కళ్ళచెర్వు సీతారామచంద్ర స్తోత్రము (అలభ్యము) | ? |
| 5. ఆచార్య స్మృతి ,, | ? |

**8. స్మృతి రచనలు :**

| | |
|---|---|
| 1. రాజా రాఘవరాజు రంగరాజు స్మృతి | 1957 |

**9. ఇతరములు :**

| | |
|---|---|
| 1. దుర్యోధన (ఏకపాత్రాభినయము) | (అముద్రితము) |
| 2. ప్రాస్తావిక పద్యములు | ,, |

కవిగారి యిన్ని రచనలలో ఒక్క 'మానస ప్రబోధ శతకము' (భార్యకు అంకితము) తప్ప మిగిలిన వన్నియు దైవాంకితములే!

వీరి కృతులను ముద్రణ చేయించిన అభిమానులు, శిష్యులలో తెలంగాణము వారే గాక, కృష్ణా, గుంటూరు, ఉభయ గోదావరి జిల్లాల వారును గలరు.

వివిధ ప్రక్రియలకు చెందిన గ్రంథముల రచించుచు, కవిగారు తీరిక సమయములో శ్రావ్యముగా భారత, భాగవత, రామాయణ పురాణ కాలక్షేపములను చేయుచు ఘన సమ్మానముల నందిరి.

నిత్య జీవితమున అనేక బాధల ననుభవించుచు సమయము నంతయు సరస్వతీ సమారాధనకే వెచ్చించి బహు గ్రంథముల రచించిన ఆచార్యులవారు 5-9-1981 వ తేదిన నల్లగొండలో పరమపదించిరి.*21

వీరి ఏకైక కుమారుడు పురుషోత్తమాచార్యులు పరంపరాగతమైన కవితా వ్యవసాయమును కొనసాగించుచు, సూర్యాపేట డిగ్రీ కాలేజీలో ఆంధ్రోపన్యాసకులుగా నున్నారు.

## 24. రంగ కృష్ణమాచార్యులు :

జగన్నాథాచార్యుల (1881 - 1936) నల్వురు కుమారులలో జ్యేష్ఠులైన రంగ కృష్ణమాచార్యులు 1908 వ సంవత్సరం కీలక పిత్రమావాస్య నాడు గోపాపురమున జన్మించినారు.

బాల్యము నుండియు తండ్రిగారి వద్దనే సంప్రదాయ విద్యతో పాటు సంస్కృతాంధ్ర సాహిత్యముల నభ్యసించి, కవితా రచనమున పితృపాదుల మెప్పును పొందిన ఆచార్యుల వారు ఈ క్రింది గ్రంథములను రచించినారు:

1. యాదగిరి లక్ష్మీ నృసింహ తారా మాల.
2. కృష్ణ లీలా తరంగిణి (నాటకము).
3. మదన విజయము (హరికథ).
4. సౌగంధికా సంగ్రహము (యక్షగానము)
5. పాశుపతాస్త్రము (యక్షగానము).
6. భజన రత్నావళి కీర్తనలు.

ఇవన్నియు అముద్రితములు. వీనిలో 2, 3, 4 సంఖ్య గల కృతులు లభింపలేదు. 3-1-1987 న పరమపదించిన కవిగారు మిగిలిన రచనల నైనను ముద్రణ చేయించు కొనలేని నను అశక్తతకు బాధపడుచుండిరి.

## 25. శ్రీరంగాచార్యులు :

'కనగల్లు' నివాసు లైన ఆచార్యుల వారు. వేంకట నరసింహాచార్యుల (ఐదవ) సహోదరులలో నొకరు. ఉర్దూ, పారశీకముల యందు ప్రావీణ్యము గల వీరు సోదర సాహచర్యమున సంస్కృ తాంధ్రముల నభ్యసించిరి.

అనేక కారణముల వలన తమ సహోదరులు స్వగ్రామమును వదలి ఎచ్చ టెచ్చటనో స్థిరపడినను వీరు మాత్రము **'కనగల్లు'లోనే నివసించిరి.** తమకు గల భాషాభిమానము, పూర్వులు ఆరాధించి పెంచిన భాషా మతల్లిపై గల గౌరవములతో మరింగంటి వారివే గాక ఇతర కవుల తాళపత్ర లిఖిత గ్రంథముల నెన్నిటినో సంపాదించి తమ గృహమును **'తాళపత్ర గ్రంథ నిలయము'**గా నొనర్చిన ఆచార్యుల వారు ఎన్నియో గ్రంథములను సంరక్షించినారు.

'గోలకొండ కవుల సంచిక'ను సిద్ధము చేయునప్పుడు సురవరం వారికి, శేషాద్రి రమణ కవులకు ఆ ప్రాంతమున గల ప్రాచీన, అధునిక కవుల సమాచారము నందించినది వీరే! ఈ సమయములోనే వీరి వద్ద గల కొన్ని తాళపత్ర గ్రంథములను దూపాటి వెంకట రమణాచార్యుల వారు 'మరల పంపింతు' నని తీసికొని వెళ్ళి, ఎంత కాల మైనను ఊయక పోగా ఆచార్యులవారు బాధపడి ఆనాడు పెద్దలైన వారిద్వారా వానికై యత్నించి విఫల శ్రము లైనారు.

గోలకొండ కవుల సంచిక (302 వ పుట) యందు 'కవి పరిచయము'లో వీరిని గూర్చి 'కవి తమ వివరము లేవియు తెలుప లేదు' అని వ్రాసి, వెంకట రమణాచార్యుల వారు ముద్రించగల నని ఇచ్చిన వీరి 'రాష్ట్రమాత' అను ఖండకావ్యము నుండి ఒక పద్యమును ప్రచురించిరి (310 వ పుట).

వీరివద్ద తెచ్చిన గ్రంథములలో తాలాంక నందినీ పరిణయము, చిలువ పడిగ జేని పేరణము, శ్రీకృష్ణ శతానందీయము, ఇందిరాల భాగవతము,

శాల్మలీ కంద సంవసందన విలాసము అనునవి లక్ష్మణరాయ పరిశోధక మండలికి చేరినవి. 'రాష్ట్రి మాత' జాడ నేటికిని తెలియదు.

శ్రీ రంగాచార్యుల వారు మిక్కిలి శ్రమపడి పెద్దల సాయముతో 1956 వ సం.ములో గోదా వధూటీ పరిణయ మను ప్రబంధమును ముద్రణ చేయించినారు.

వీరి 'రాష్ట్రి మాత'తో పాటు ప్రాస్తావిక పద్యములు కూడ లభించుటలేదు.

ఒక నాడు తెలంగాణమున మారుమూల పల్లెలో వందల తాళపత్ర గ్రంథములు సేకరించి రక్షించిన ఆచార్యుల వారు 1965 వ సం.ములో పరమ పదించిన తర్వాత వానిని సరిగా చూచువారు లేక కొన్ని చెదిరి పోయినవి; మరి కొన్ని పరహస్తగతము లైనవి.*22

## 26. చెన్న కృష్ణమాచార్యులు :

మహబూబ్ నగర్ జిల్లా 'గంగా పురము' లోని శ్రీ లక్ష్మీ చెన్నకేశ వాలయము పడు ప్రాచీనమైనది. చతుష్షాహీల పరిపాలనకు పూర్వము నుండియే మరింగంటి వారు దీనికి స్థానాచార్యులు. ఆ పరంపర నేటికిని కొనసాగుచున్నది.

చెన్న కృష్ణమాచార్యులు - తన తండ్రియైన గోవిందాచార్యుల వారి నుండి వచ్చిన స్థానాచార్యత్వమును వహించి తమ కవితా పాండితీ ప్రతిభలచే దానికి మరింత గౌరవ మాపాదించినారు.

కల్వకుర్తి తాలూకా వంగూరు గ్రామవాసు లైన చిందాపట్టణం లక్ష్మణా చార్యుల వారు ఈ ప్రాంతమున పేరు గం కవి పండితులు. ఆ నాడు వీరివద్ద చెన్న కృష్ణమాచార్యులు విద్యాభ్యాస మొనర్చి సంస్కృతాంధ్ర సారస్వతముల యందు గురువుగారిచే మెప్పులు పొంది, కొన్ని గ్రంథములను రచించినారు. కవిగారు జీవించి యుండగనే ఇవి ముద్రితమైనవి కాని లభించుట లేదు. ఆ గ్రంథములు:

1. మీనాంబర వరద వేదీశ్వర శతకము
2. మొగిలిగిద్ద సీతారామ శతకము

3. వల్లెం వీరరాఘవ శతకము
4. జీమూతవాహన చరిత్ర (యక్షగానము)
5. ధర్మాంగద చరిత్ర ,,

వీనిలో ధర్మాంగద చరిత్ర (కవి వ్రాసి యుంచుకొనినది) యొకటి లభించినది.

వీరు కవితా వ్యాసంగముతో పాటు గంగా పురమున నొక పాఠశాలను, దీని కనుబంధముగా 'చెన్న కేశవ గ్రంథాలయము'ను స్థాపించి స్వయముగా నిర్వహించుచు ఎందరికో విద్యా భిక్షను ప్రసాదించినారు.

ఈ సమయములోనే వీరికి సురవరం ప్రతాపరెడ్డి గారితో చను వేర్పడినది. ఆచార్యులవారి కృషిని ప్రశంసించి రెడ్డిగారు ఎన్నో గ్రంథములను 'చెన్న కేశవ గ్రంథాలయమున కొసంగిరి. అప్పటి జాగీరు గ్రామము కదిరీలోని పాఠశాలయే ఈ నాటి జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాల యైనది. కాని, విలువైన ఆ గ్రంథాలయము నేడు పేరు కైనను లేదు.

వీరికి ఏడు తరాల పూర్వము నుండి ఎవరి కెందరు మగ పిల్లలు కలిగినను వారిలో ఒక్కరు మాత్రమే జీవించుట పరిపాటి యైనను, వీరి కిద్దరు కుమారులు కలిగి పెద్దవారై నేటికిని ఉద్యోగములలో నున్నారు.

1947 నవంబరులో (రజాకార్ల అల్లరుల సమయము) వీరికి సాంసారికమైన కొన్ని యిబ్బందులు ఏర్పడగా మిత్రుని సాహాయ్యమున యాదగిరి గుట్టకు చేరుకొని (మామగారి వద్దకు) వ్యాధిగ్రస్తులై బాధపడుచు రన్ని వారణార్థము 'యాదగిరిలక్ష్మీ నృసింహ శతకము'ను చెప్పి, సర్వధారి భాద్రపద శుద్ధ సప్తమి గురువారము (9-9-1948) నాడు పరమపదించిరి.

వీరి కుమారులైన గోవర్ధనాచార్యులు, శేషాచార్యులు అధ్యాపకులుగా పని చేయుచు దేవాలయ స్థానాచార్యత్వ బాధ్యతల నిర్వహించుచున్నారు. ఉభయులను సాహిత్య పరిచయము గలవారు. పద్య, వచన కవితలను వ్రాయుదురు.

## 27. రామాచార్యులు:

కనగల్లులో తాళపత్ర గ్రంథ నిలయమును స్థాపించిన శ్రీ రంగాచార్యుల సోదరుడైన యీ కవి 1930 ప్రాంతమున దుమ్ముగూడెము వెళ్ళి అచ్చటనే స్థిరపడినారు.

సంప్రదాయ విద్యా నిష్ణాతులైన ఆచార్యులవారు భద్రాచలము తాలూకా దుమ్ముగూడెములోని సీతారామాలయాభివృద్ధికై ఎంతో కృషి చేసిరి. ఆ సందర్భముగా ప్రతి వారిని ఒక 'కాణీ' (డబ్బు) ఈయవలసినదిగా యాచించుచు అనేక గ్రామముల సంచరించినందున వీరికి 'కాణీ కవి', 'కాణ్యాచార్య'లను పేర్లు ప్రసిద్ధమైనవి. భగవత్సేవయందు నిమగ్నులై యుండు ఆచార్యులవారు తీరిక చేసికొని 1. మల్లూరి నృహరి శతకము, 2. విరివింటి వేణుగోపాల శతకము, 3. కాణీకవి కన్నీటిధార, 4. బుద్ధిలేని కథ అను పద్యకృతులను రచించిరి. వీనిలో 2,4 సంఖ్య గల రచనలు అముద్రితములు. ఇవి లఘుకృతులే యైనను కవితా పాటవముతో కూడియున్నవి. రామాచార్యులవారు భగవత్సేవ, కవితావ్యాసంగము లొనర్చుచు 18-11-1986 వ తేదీన దుమ్ముగూడెములో పరమపదించినారు

## 28. లక్ష్మణాచార్యులు :

వేంకట నరసింహాచార్యుల (ఐదవ) కనిష్ఠ సోదరులైన వీరు చిన్ననాటనే విద్యాభ్యాసము నిమిత్తము వెళ్ళి, సింహాచలము, విజయనగరములయందు సంస్కృతాంధ్రముల నభ్యసించి, సుప్రసిద్ధ హరికథా కథకులు పెద్దింటి సూర్యనారాయణ భాగవతార్ సన్నిధానమున హరికథలు చెప్ప నేర్చి వారి ఆదేశము మేరకు క్రీ.శ. 1935 వ సం॥ము విశాఖపట్టణము జిల్లా భీమునిపట్నంలో స్థిరనివాస మేర్పరచుకొనిరి. ఈ లక్ష్మణాచార్యులుగారు 'గీముపుర లక్ష్మీ నరసింహ శతకము', 'శబరీ సపర్య', 'హనుమ న్నుతి', 'శ్రీ సత్యసాయి చరిత్రము' (6 ఆశ్వాసములు) అను గ్రంథముల రచించిరి.

గురువుగారైన పెద్దింటి వారి శిక్షణమున అలవడిన 'హరికథ' వీరికి కీర్తి ప్రతిష్ఠలను చేకూర్చినది. ఎన్నియో హరికథలను పండిత పామర జనరంజకముగా చెప్పి, అనేక సన్మానము లందినారు 75 సంవత్సరాల వయస్సు

గల ఆచార్యుల వారు నేటికిని కవితా రచన మొనర్చుచు భీమునిపట్నములో నున్నారు.

## 29. నరసింహాచార్యులు :

కోనాపురము నుండి వచ్చి 1940 ప్రాంతమున కల్వకుర్తి తాలూకా 'రఘుపతి పేట'లో స్థిరపడిన ఆచార్యులవారు సంస్కృతాంధ్రములయందే గాక ఉర్దూలోను కవిత్వమును చెప్పెడివారు. ఈ కవి **'మండోదరీ పరిణయము'**, **'అలమేల్మంగా పరిణయము'** అను హరికథలుగా రచించి కల్వకుర్తి తాలూకా రామగిరి శ్రీ రామచంద్రున కంకిత మొసంగిరి.

కవిత్వమును చెప్పుటతో పాటు హరికథా కథకులైన నరసింహాచార్యులు గారు దేవరకొండ, కల్వకుర్తి, మహబూబ్‌నగర్‌లలో అనేక పర్యాయములు సమ్మానింప బడినారు.

## 30. సీతారామానుజాచార్యులు :

1917 వ సంవత్సరమున జన్మించిన ఆచార్యుల వారు సంస్కృతాంధ్రాంగ్ల ద్రావిడ విద్యా నిష్ణాతులు. ఉన్నత విద్యా పట్టభద్రులు, వరంగల్లు, ఖమ్మం జిల్లాల లోని పాఠశాలల యందు జూనియర్ కళాశాలల యందు తెనుగు అధ్యాపకులుగా పనిచేసి నేడు ఖమ్మంలో విశ్రాంతి నందుచున్న వీరు నిరంతరం విద్యా వ్యాసంగ మొనర్చుచున్నారు.

బాల్యమున అమరవాది నీలకంఠ సోమయాజులు గారు, కాప్పూరి వెంకట రావు గారల వద్ద సంస్కృతాంధ్రముల నభ్యసించిన ఆచార్యుల వారు తరువాత తె.కం. గోపాలాచార్యుల వారి సన్నిధిని ఉపనిష దుపదేశమును దేశికాచార్యుల వారి వద్ద శ్రీభాష్యోపదేశము నంది. సంప్రదాయ విద్యయందు నిష్ణాతులైనారు.

ఒకవైపు ఉద్యోగ బాధ్యతల నిర్వహించుచు మరియొక వైపు విశిష్టాద్వైత విషయ ప్రవచనములను కొనసాగించుచు నేటికిని ఎడతెరిపి లేని గ్రంథ రచన మొనర్చుచున్న సీతారామానుజాచార్యుల వారు పలు రకములుగా రాణించి పెద్దలు, విద్వాంసుల చేత **'కవి కిశోర'**, **ఉపనిషద్విద్యా విశారద**,

బిరుదముం నంది సింహతలాటాంకృతులైనారు నేటి వరకు ముద్రితమైన వీరి వివిధ రచన లిట్లు గలవు :

1 **పరతత్త్వ పరిశోధన** (32 బ్రహ్మ విద్యలు), 2. **పది ఉపనిషత్తులు** (గీత పద్యములుగా), 3. **సౌభాగ్య సుందరి** (కావ్యము), 4 **తిరు మంత్రార్థము** (అనువాదము), 5. నెమిలె కృష్ణుని **'రాస క్రీడ'** (గేయము), 6. **తిరుపూరు రంగనాయక సుప్రభాతము**, 7. **అన్నపురెడ్డి వేంకటేశ్వర సుప్రభాతము**, 8. **కన్యకా పరమేశ్వరీ సుప్రభాతము**, 9. **వాసవి పురాణ సంగ్రహము**, 10. **వల్లభ భాయ్ పటేలు**, 11. **నిజాం ఆక్రమణ** (10-11 బుర్రకథలు) కలవు.

అముద్రిత రచనలు: 1. **''పురాణ కథలు'**(108), 2. **గీతోపన్యాసములు**, విశిష్టాద్వైత విషయములను సులభ రీతిని తెలియచేయు 'పరతత్త్వ పరిశోధన' మను గ్రంథమును కిడాంబి కృష్ణమాచార్యుల వారితో కలిసి రచించినారు.

నేటికిని ఉత్సాహ వంతులై విశిష్టాద్వైత సభల యందును, సాహితీ కార్యక్రమములందును సీతారామానుజాచార్యులు వారు పాల్గొని ఎందరినో ఉత్తేజి తుల నొనర్చుచున్నారు. ఇది వీరి భాషా పాండితికి ప్రవచన రీతికి ప్రబలోదా హరణము.

## 31. శ్రీరంగాచార్యులు :

ఈ నాడు విశిష్టాద్వైతమును భారత భాగవత రామాయణ విశేషములను గూర్చి సభా రంజకముగా సంస్కృతాంధ్రములయందు దనర్గళముగా నుపన్య సించుటతో పాటు 'భగవద్విషయ కాలక్షేపము' నొనర్చు కొద్దిమంది పండితు లలో గణనీయులైన ఆచార్యులవారు కరీంనగర్ జిల్లా వేములవాడలో (16-2-1933 వ తేదీన) జన్మించినారు చిన్ననాడు తండ్రిగారైన అప్పలా చార్యుల వారివద్ద సంప్రదాయ విశేషముల నభ్యసించి హైదరాబాదులోని 'సీతా రాంబాగ్ సంస్కృత పాఠశాల' (ఇప్పుడు ఎస్.వి వి.వి.ఎస్ కళాశాల) లో చేరి శ్రీమాన్ కోయిల్ కందాడై అప్పన్ శఠకోప రామానుజాచార్య స్వామి వద్ద గురుకుల క్లిష్టులై, సంస్కృత సాహిత్యము, తర్క వ్యాకరణ విశిష్టాద్వైత వేదాంత శాస్త్రములను క్షోదక్షమముగా నభ్యసించి, అదే పాఠశాలలో అధ్యా పకులుగా చేరి, నేటికిని ఎందరికో విద్యా ప్రదాన మొనర్చుచున్నారు.

[ | నిరంతర అధ్యయన శీలురైన శ్రీరంగాచార్యులవారు - ఆంధ్ర విశ్వ విద్యాలయ 'సాహిత్య విద్యా ప్రవీణ' (1958), 'హిందీ సాహిత్య రత్న' (1964) పట్టముల నంది ఉస్మానియా విశ్వ విద్యాలయము నుండి సంస్కృతాంధ్రములలో ఎం.ఏ పరీక్షలలో ఉన్నత శ్రేణిలో నుత్తీర్ణు లైనారు. 1962 లో మైసూరు మహారాజా వారి అధ్యక్షతను మైసూరులో జరిగిన తర్క విద్యా సదస్సులో పాల్గొని 'నవీన తర్క విద్వాన్' బిరుదము నందిరి. తిరుపతి వేద శాస్త్రాగమ విద్య త్సదస్సులో వీరికి 'విశిష్టాద్వైత వేదాంత విద్వాన్' బిరుద మీయబడినది. ఇవే గాక అంధ్రరాష్ట్రములోని అనేక విద్వత్సదస్సులలో సమ్మానింపబడి బిరుదము లందిన ఆచార్యుల వారు మృదు మధుర శైలిలో భగవ ద్విషయ ప్రవచనము చేయుటయందు నిష్ణాతులు. కావుననే వీరి ప్రవచనము జరుగని దేవాలయము, విశిష్టాద్వైత సభ తెలుగునాట అరుదు. వీరి యసదృశ వాగ్ధాటికి పరవశులై ఉభయ వేదాంత విద్వత్స్థల యందు 'మహోపన్యాసక', 'ప్రవచన వాచస్పతి' బిరుదము నొసంగిన శ్రీమ ద్రామానుజ చిన్న జీయర్ స్వామివారు ప్రతి వర్షము వీరిని విశిష్టముగా సమ్మానించుచున్నారు.

ఉద్యోగ విధి నిర్వహణ మొనర్చుచు సంప్రదాయ విద్యా ప్రచార దక్షులైన ఆచార్యుల వారు నల్లగొండలోని 'రామగిరి శ్రీగోదా సుప్రభాతము', 'పద్మాష్టకము' అను సంస్కృత రచనల గావించిరి. వివిధ సందర్భములలో చెప్పబడిన సంస్కృత శ్లోకములు, తెలుగు పద్యములు అనేకములు గలవు. ఇవన్నియును అముద్రితములు. ఇటీవల వీరు రచించిన 'పద్మాష్టకము' లోని కొన్ని శ్లోకములు దీనిలోని స్తోత్ర విభాగమున గలవు.

హైదరాబాదు సుర భారతీ సమితివారు ఆచార్యుల వారిని 'విశిష్ట సంస్కృత పండితులు'గా సమ్మానించి, వీరిచే 'భాగవత రత్నములు' వ్రాయించి ప్రకటించిరి.

ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము వారు 'అలంకార మణిదర్పణము'ను ఎరి సిరేష వ్యాఖ్యతోను, ఆంధ్రానువాదముతోను ప్రచురించినారు.

'భక్తి-నివేదన'లోని 'భాగవత గోష్ఠి', ఆకాశవాణి హైదరాబాదు కేంద్రము ద్వారా 'సంస్కృత పాఠము'లు వీరి సుబోధశైలి ప్రవచనమునకు తార్కాణములు.

## 32. పురుషోత్తమాచార్యులు :

సూర్యాపేట డిగ్రీ కళాశాలయందు ఆంధ్రోపన్యాసకులుగా నున్న వీరు వేంకట నరసింహాచార్యుల (బడివ) కుమారులు. బాల్యమున తండ్రిగారివద్ద వ్యాకరణచ్ఛందోలంకార కావ్య నాటక శాస్త్రముల నభ్యసించిన ఆచార్యులవారు 1951 నుండి పద్య రచన మొనర్చుచున్నారు. వీరి యాదగిరి లక్ష్మీనరసింహ శతకము, వేంకటేశ్వర శతకము, శ్రీ గోదాదేవి ముద్రితమై కవి పండిత ప్రశంసల నందినవి. సంస్కృతాంధ్రముల యందే గాక ఆంగ్లభాషయందును ప్రావీణ్యము గల శ్రీ పురుషోత్తమాచార్యులు షెల్లీ, బైరన్ మొదలగు వారి కొన్ని కవితా ఖండికలను తెనుగు చేసిరి. అనేక కవి సమ్మేళనములందు పాల్గొని సమ్మానము నందిన వీరు నిరంతర సాహితీవ్రతులు. సూర్యాపేటలో నున్నారు.

పూర్వము నుండి నేటి వరకు ఈ వంశమున గల కవి పండితుల గూర్చి తెల్పనైనది.

అత్యాధునిక ప్రక్రియలైన 'వచన కవిత', 'కథానిక' మొదలగు వాని యందు రచనా వ్యవసాయము సాగించుచున్న మరి కొందరు ఉద్యోగ రీత్యా వివిధ ప్రాంతములలో గలరు.

పూర్వ పద్ధతిని సంస్కృతాంధ్ర ద్రావిడ సాహిత్యముల నభ్యసించి వాని యందు నిష్ణాతులై జ్ఞాన వయోవృద్ధులైన వారున్నారు. కాని వీరు కవితా వ్యాసంగ మొనరింపలేదు.

ప్రాచీన సాహితీ సంప్రదాయములు ఇట్టి వారియందు నిలిచి ఏత దక్షిణానుత్తైన అధునికుల కుపకరించుచున్నవి.

### సూచికలు :

1A. కుతుబ్షాహి 'సుల్తానులు- ఆంధ్రసంస్కృతి' గ్రంథములో, కుతుబ్షాహి సుల్తానుల కాలములో ఉర్దూ సాహిత్యము' - ఆదిరాజు వీరభద్రరావు పంతులు గారి వ్యాసము - పుటలు 38-41.

18. ఇబ్రహీం కుతుబ్షాను మొదటి సారి 'మల్కిభరామ్' అని చెప్పినది కూడా మరింగంటి వారే! వీరినుండియే ఆయన మల్కిభరాము డైనాడు.
2. బ్రహ్మరాజ పురి నేడు దేవరకొండ తాలూకాలోని బొమ్మరాజు పల్లె, పణకరాజుపల్లి, అజ్మాపూర్ పల్లె ఈ మూడు గ్రామములు కలిసినది. ఇది బొమ్మరాజు పల్లిగా వ్యవహరింప బడుచున్నవి.
3. 'ఇంటి పేర్లు' - ఆంధ్ర జ్యోతి వార పత్రిక 28-3-85 'ఫణిభట్ల' వారిని గురించి - ఫణిభట్ల రాజేశ్వరి తెల్పిన కథ.
4. 'చిన్ననాటి జ్ఞాపకాలు' - కోదాటి నారాయణరావు గారు, పుటలు 24-26,
5. శ్రీ 'విష్ణ్వాలయముల' యందు ఆళ్వారుల ప్రతిష్ఠ. వారల ప్రతిష్ఠ జరిగిననే కాని శ్రీవైష్ణవ స్వాములు తీర్థ ప్రసాదములు పరిగ్రహింపరు.
6. శ్రీ గోదా వధూటీ పరిణయము 1-87, 88.
7. 'కుతుబ్షాహీ సుల్తానులు - ఆంధ్ర సంస్కృతి' అను పుస్తకములో 'నేబతి కృష్ణయామాత్యుడు' అను వ్యాసమునందు వి. రామరాజుగా రొసంగిన పద్యము, పు. 99.
8. పై పుస్తకములో - 'అచ్చతెనుగు పాదుషా-అబీను ఖాను' అను వ్యాసము, శ్రీ. నిడుదవోలు శివ సుందరేశ్వరరావు. పు. 182.
9. ఈ కథలను గూర్చి వెంకట రామానుజాచార్యులు గారు (మొకాసా కలువపూడి), నృసింహాచార్యులవారు (వరంగల్లు) వివరించిరి.
10. ఈ వంశమున కవులుగా తెలిసిన వేంకట నరసింహాచార్యులలో ఈయన ప్రథముడు. తరువాత వచ్చు ఈ పేరు గల కవులకు ద్వితీయ, తృతీయ అని చేర్చబడినది.
1. తరానికి 25 సం.ల చొప్పున లెక్క గట్టినచో క్రీ. శ. 1080, 80 సం.ల చొప్పున లెక్కించినచో 1710 అగును.
2. ఇట్టి పొరపాటు 'గోలకొండ కవుల సంచిక'తో ఆరంభమై నేడు వచ్చుచున్న గ్రంథములలో చేరినది.
3. వరంగల్లు జిల్లా 'కేసర' నుండి వచ్చిన పెద్దు నడిగూడెము (మునగాల) సంస్థానము నేర్పరచినారు. వీరిలో కేసర నరసింహారావు అప్పల దేశిమలవారి కిచ్చిన 600 ఎకరాల 'అగ్రహార ఖాందాన పత్రిక' యందు 'నరసింహాపురము'ను నిర్మింప వలసినదిగా తెలిపిన దానిని కోరి యున్నారు. ఆ నాడు కేవల ద్రవ్యములతో ఆలయము నిర్మాణ మొనర్చి అన్న

గారి పేరు, అగ్రహార దానము చేసినవారి పేరు కలిసి వచ్చునట్లుగా నేటి 'నరసింహా పురము' ఏర్పాటైనది ఈ అగ్రహార పత్రిక కాలము ఫసిలీ 1197 (క్రీ. శ. 1787).
మరియొక 'అగ్రహార పత్రిక' (వేల్పుగొండ దేశముఖ్ పిరాలెడ్డి చెన్న కృష్ణారెడ్డిగారు దానము చేసినది) కాలము-శా.శ. 1727 (క్రీ. శ 1805).
ఈ రెండును అనుబంధములో ఈయబడినవి.

14. గంగాపురమునకు మాయాపురము, కేశవ పురము అను నామములు పురాణ ప్రసిద్ధములని 'గంగాపుర మాహాత్మ్యము పీఠిక (పుట. 8) యందు సురవరం ప్రతాపరెడ్డి గారు తెల్పిరి.

15. 'గోలకొండ కవుల సంచిక' (410వ పుట) 'ఈ కవి కాలము 60 సం॥ క్రిందట' అని తెల్పెను దాని ప్రకారము క్రీ. శ. 1874 అగును.

16. ఈ పద్యము "ఈశ్వర నామ..." వ్రాత. ఆం. ప్ర. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునగల తాటాకు పుస్తకము (ACC 4648 Call No. T. 3. 104) నందు మాత్రము కలదు.

17. భగవన్నిష్ఠ, భాగవత నిష్ఠ, ఆచార్య నిష్ఠ వీనిని పర్వత్రయ మందురు.

18. 'రాజా నాయని వెంకట రంగారావు బహద్దర్ గారు' - శేశవ పంతుల నరసింహశాస్త్రి గారి వ్యాసము - 'తెలుగు వైతాళికులు' I వ భా. 87 వ పుట.

19. 'తిరునామములు' అను గ్రంథముగా శ్రీమాన్ మణవాళాచార్యులు 1885 లో ముద్రించినారు.

20. 'మరింగంటి కవులు' - సి. రామరాజు గారి వ్యాసము, ఆంధ్రభూమి (... పత్రిక ప్రారంభోత్సవ సంచిక) 30-9-1960. విజ్ఞాన సర్వస్వము - మీ ఇదే వ్యాసము, 6 వ సం. 755 వ పుట.

21. 'మరింగంటి (చతుర్థ) వేంకట నరసింహాచార్యుల రచనల సమగ్ర పరిశీలనము' అను విషయముపై ఉస్మానియా విశ్వవిద్యాలయమున సిద్ధాంత వ్యాసము సమర్పించి మాడభూషి రంగాచార్యులు గారు 1985 లో పిహెచ్. డి., పట్టము నందిరి.

22. 'మన ప్రాచీన తాళపత్ర గ్రంథములు - వాని దుఃస్థితి' - వ్యాసము - ... పత్రిక - 1967 స్వాతంత్ర్య దినోత్సవ సంచిక - రచన - శ్రీరంగాచార్య.

# 3

# సాహితీ వైవిధ్యము

మరింగంటి కవుల సంస్కృతాంధ్ర కృతులు ప్రక్రియా పరముగ నిట్లు గలవు. వీనియందు లభ్య గ్రంథముల గూర్చి 'ప్రక్రియా వివేచనము'న, అలభ్య రచనల గురించి అనుబంధమున పరిచయము చేయబడినది.

## 1. ప్రబంధములు :

| | |
|---|---|
| **1. జగన్నాథాచార్యులు** | 1. శ్రీరంగనాథ విలాసము (అము.) |
| **2. సింగరాచార్యులు** | 1. దశరథ రాజనందన చరిత్ర |
| | 2. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము |
| **3. వేంకట నరసింహాచార్యులు (ద్వితీయ)** | 1. జనక సుతాభ్యుదయము (అము.) |
| | 2. శ్రీరామానుజాభ్యుదయము ,, |
| | 3. నృకంఠీరవాభ్యుదయము ,, |
| | 4. విష్వక్సేన ప్రభాకరము ,, |
| | 5. గోదా వధూటీ పరిణయము |
| | 6. శ్రీకృష్ణ శతానందీయము (అము.) |
| | 7. జాంబవతీ కుమార శృంగార విలాసము ,, |
| | 8. ఛత్రబంధ రామాఖ్యానము |
| | 9. చల్లపిళ్ళ రాయ చరిత్ర (అము.) |
| | 10. చిలువ పడిగ రేని పేరణము ,, |
| **4. వేంకట నరసింహాచార్యులు (తృతీయ)** | 1. బాలాంక సంపసి పరిణయము. |

| | |
|---|---|
| 5. వేంకట రామానుజాచార్యులు | 1. ఫల్గాన రావల క్షేత్ర మాహాత్మ్యము (అము.) |
| 6. వేంకట నరసింహాచార్యులు (ఐదవ) | 1. మాలతీ వసంతము<br>2. నీలోద్వాహము<br>3. మిత్రవింద (అము.) |
| 7 లక్ష్మణాచార్యులు | 1. శ్రీ సత్యసాయి చరిత్ర (అము.) |

**2. ద్విపద:**

| | |
|---|---|
| 1. వేంకట నరసింహాచార్యులు (ద్వితీయ) | 1. శ్రీకృష్ణ తులాభారము (అము.) |

**3. యక్షగానములు :**

| | |
|---|---|
| 1. రామానుజాచార్యులు | 1. శ్రీరామ నాటకము |
| 2. రంగకృష్ణమాచార్యులు | 1. సౌగంధికా ప్రసవ సంగ్రహము (అము.) |
| 3. వేంకట నరసింహాచార్యులు (ఐదవ) | 1. ప్రద్యుమ్న విజయము (వీథి నాటకము) |

**4. నాటకములు :**

| | |
|---|---|
| 1 వేంకట నరసింహాచార్యులు (ఐదవ) | 1. కూర్మనారాయణ చరిత్ర<br>2. సుమాలినీ పరిణయము<br>3. సుచిత్రాభ్యుదయము<br>4. శశికళ<br>5. లలిత (అము.) |
| 1. చిన్న కృష్ణమాచార్యులు | 1. ధర్మాంగద (హాముపాటి) |
| 2. వేంకట నరసింహాచార్యులు (ఐదవ) | 1. సుందరీ విలాసము (ప్రహసనము) |

**5. శతకములు :**

| | |
|---|---|
| 1. 1. సింగరాచార్యులు | 1. తారక బ్రహ్మ రామ శతకము (అము.) |

| | |
|---|---|
| 2. **అప్పలాచార్యులు** | 1 యాదగిరి నరసింహ శతకము (అము.) |
| 3. **వేంకట రాఘవా చార్యులు** | 1. కేశవ స్వామి శతకము |
| 4. **వేంకట నరసింహాచార్యులు** | 1. యాదగిరి నృసింహ శతకము (అము) |
| 5. **వేంకట రామానుజాచార్యులు** | 1. రాఘవ శతకము |
| 6. **వేంకట నరసింహాచార్యులు (ఐదవ)** | 1. గోపాల చూడామణీ శతకము |
| | 2. రాఘవ శతకము |
| | 3. మానస ప్రబోధ శతకము |
| | 4. కళ్ళచెర్వు సీతా రామచంద్ర శతకము. |
| | 5 శ్రీమ త్తిరుమలాపుర భోగ సుందర సీతరామ శతకము. |
| | 6. శ్రీరంగాపుర సత్యనారాయణ శతకము |
| 7. **రామాచార్యులు (శాణికవి)** | 1. మల్లూరి నృహరి శతకము. |
| 8 **లక్ష్మణాచార్యులు** | 1. భీమపుర లక్ష్మి నారసింహ ప్రభు శతకము. |
| 9. **పురుషోత్తమాచార్యులు** | 1. యాదగిరి లక్ష్మి నారసింహ ప్రభు శతకము. |
| | 2. శ్రీ వేంకటేశ్వర శతకము. |

## 6. హరికథలు :

| | |
|---|---|
| 1. **వేంకట నరసింహాచార్యులు (ఐదవ)** | 1. సత్యనారాయణ వ్రతము |
| 2. **రాఘవాచార్యులు** | 1. శ్రీ వేంకటాచల మాహాత్మ్యము. |
| 3. **నరసింహాచార్యులు** | 1. సుందోపరీ వివాహము. |

## 7. లఘు కృతులు :

| | |
|---|---|
| **వేంకట రాఘవాచార్యులు** | 1. క్షమా విరంతి. |

2. వేంకట నరసింహాచార్యులు (ఐదవ) — 1. ఉర్లుగొండ లక్ష్మీ నృసింహ స్తోత్ర తారావళి, 2. శ్రీరంగాపుర సత్యదేవ స్తోత్ర తారావళి, 3. శ్రీశ్రీశ్రీ రాజా రాఘవరాజు రంగరాజు స్మృతి

3. లక్ష్మణాచార్యులు — 1. శబరీ సపర్య, 2. హనుమ న్నుతి

4. రామాచార్యులు (కాణికవి) — 1. కాణికవి కన్నీటి ధార

5. రంగ కృష్ణమాచార్యులు — 1. భజన రత్నావళి (అము.)

6. పురుషోత్తమాచార్యులు — 1. శ్రీ గోదాదేవి

## 8. తిరునామములు :

1. సింగరాచార్యులు, 2. నరసింహ దేశికులు, 3. అప్పల దేశికులు, 4. లక్ష్మణ దేశికులు, 5. జగన్నాథాచార్యులు, 6. రంగకృష్ణమాచార్యులు.

## 9. మంగళ హారతులు :

1. నరసింహ దేశికులు, 2. అప్పల దేశికులు, 3. రాఘవాచార్యులు, 4 లక్ష్మణాచార్యులు, 5. వేంకట దేశికులు, 6. లక్ష్మణ దేశికులు.

## 10. చాటువులు:

1. వరద దేశికులు, 2. వేంకట నరసింహాచార్యులు (ద్వితీయ), 3. వేంకట నరసింహాచార్యులు (తృతీయ), 4. జగన్నాథాచార్యులు, 5. శ్రీరంగాచార్యులు.

## సంస్కృత రచనలు ;

1. నరసింహాచార్యులు — 1. శతవైరి వైభవ దివాకరమ్(అము.) (అలంకార శాస్త్రము)

2. అప్పల దేశికులు — 1. శ్రీరామ పాద స్తుతిః, 2. శ్రీ గోదా స్తుతిః, 3. అర్వపల్లీ నృసింహ స్తోత్రమ్, 4. నృసింహ స్తోత్రమ్, 5. స్తంభగిరి లక్ష్మీనరసింహ స్తోత్రమ్

| | |
|---|---|
| 3. లక్ష్మణ దేశికులు | 1. నృసింహ స్తోత్రమ్ |
| 4. జగన్నాథాచార్యులు | 1. యాదగిరి నృసింహ సుప్రభాత స్తోత్ర పంచ రత్నాని |
| 5. శ్రీరంగాచార్యులు | 1. పద్మాష్టకమ్ |

## అలభ్య రచనలు :

వీరి అలభ్య రచన లధికముగా గలవు. ఆ యా గ్రంథకర్తలు తెల్పినవి కొన్ని, అనంతర కవులు తెల్పినవి మరి కొన్ని. అవి:

| | |
|---|---|
| 1 సింగరాచార్యులు | 1. వరదరాజ స్తుతి,<br>2. శ్రీరంగ శతకము<br>3. చక్రలాంఛన విధి<br>4. కవి కదంబము<br>5. శత సంహిత<br>6. రామకృష్ణ విజయము<br>7. అష్ట భాషా విశేష కృతులు<br>8. నాటక శాస్త్రము<br>9. ప్రేమాభిరామము<br>10. ధనాభిరామము<br>11. నల యాదవ రాఘవ పాండవీయము<br>12. సకలాలంకార సంగ్రహము<br>13. రాకా సుధాపూర్ణ రస పుష్పగుచ్ఛము<br>14. ఆంధ్ర భాషా భూషణము, నిరోష్ఠ్య కృతులు (?), చాటువులు, |
| 2. కోనేటి దేశికులు | 1. తెలుగు వ్యాకరణ పద్యములు |
| 3. వేంకట నరసింహాచార్యులు (ప్రథమ) | 1. హరివాసర వ్రత మహత్త్వము |
| 4 వేంకట నరసింహాచార్యులు (ద్వితీయ) | 1. పద్మినీ కన్యకాభ్యుదయము<br>2. రతి మన్మథాభ్యుదయము<br>3. మిత్రవిందోపాఖ్యానము |

4. కృష్ణ విలాసము
5. తారక బ్రహ్మ రాజీయము
6. చాటువులు.

5. వేంకటాచార్యులు
1. మల్లారి చరిత్ర (మంజరీ ద్విపద)

6. వేంకట నరసింహాచార్యులు (తృతీయ)
1. ఇందిరాల గోదా పారిజాతము (యక్షగానము)

7. వేంకట నరసింహాచార్యులు (చతుర్థ)
1. అనిరుద్ధ విలాసము (యక్షగానము)
2. శ్రీరామాను జోదాహరణము

8. జగన్నాథాచార్యులు
1. ఆచార్య తారా మాల,
2. శ్రీకృష్ణ చరిత్ర (యక్షగానము)
3. సూతక శిక్ష
4. తిరునామములు

9. సింగరాచార్యులు (అనుముల)
1. బభ్రువాహన విజయము (హరికథ)

10. వేంకట నరసింహాచార్యులు (ఐదవ)
1. శ్రీ గోదా దేవి స్తవమ్
2. ఆచార్య స్మృతి
3 పద్మ వ్యూహము (సైంథవ వధ) నాటకము
4. అనిరుద్ధ విలాస ప్రబంధము
5. అనిరుద్ధ విలాస యక్షగానము
6. తిరుపతి వేంకటేశ్వర శతకము

11. చెన్న కృష్ణమాచార్యులు
1. జీమూతవాహన చరిత్ర (యక్షగానము)
2. మీనాంబర పరవసేదీశ్వర శతకము
3. మొగిలిగిద్ద సీతారామ శతకము
4. వట్టెం వీరరాఘవ శతకము

ఇవి వీరి అలభ్య రచనలు (64). 'అనుబంధము'నందు వీనిలో కొన్నిటిని గూర్చి తెలిసిన సమాచార మీయబడినది.

# II

# కావ్యావతారికలు

## 1

## అవతారికా వివేచనము

సంస్కృత కావ్యములు ఇతివృత్త కథనములతోనే ఆరంభ మగును. దానికి భిన్నముగా తెనుగులో కావ్యములకు ఇతివృత్తారంభమునకు ముందొక అవతారికను చేర్చు సంప్రదాయము విశిష్టమైనది. కన్నడమున కూడా ఇట్టి సంప్రదాయము కన్పించును.*[1] సంస్కృత నాటకములలోని నాంది ప్రస్తావనలు ఈ విధమైన అవతారికా రచనకు కన్నడ తెలుగు కవులను ప్రేరేపించి యుండ వచ్చును. ఏది యేమైనను కావ్యమున కనుబంధింపబడిన ఈ అవతారికలు సాహిత్య పరముగా మాత్రమే గాక కృతి కర్తలను గూర్చి, కృతి భర్తలను గూర్చి వారికి సంబంధించిన చారిత్రకాంశములను గూర్చి తెలిసికొనుటకెంతగనో ఉపకరించుచున్నవి.

తెనుగులో మొదటి కావ్యావతారిక నన్నయ గారిది. ఇందులో కావ్య రచనోద్దేశ్యము, కావ్య రచనా స్వరూపము ప్రతిపాదించుట ప్రధానమైన అంశము. తరువాతి కావ్యముల అవతారికలను బట్టి చూచినచో నన్నయ గారి అవతారిక ప్రాథమిక దశనే సూచించును. కావ్యావతారికకు ఒక విధమైన నిర్దిష్ట రూపము నిచ్చి ఇందులో పేర్కొనబడవలసిన విషయము లివ్వి యన్నట్లుగా స్పష్టమైన రూపమును మొదటి సారిగా నన్నెచోడు డిచ్చినాడు. తిక్కన 'నిర్వచ నోత్తర రామాయణము' దాదాపు దాని ననుసరించినది. తరువాతి వారి కావ్యముల యందు అరుదుగా ఏ ఒకటి రెండు చేర్పులో మార్పులో తప్ప పై అవతారికలే అనుసరింపబడినవి.

సామాన్యముగా తెలుగు కావ్యావతారికలయందు కన్పించు అంశములు - దేవతాస్తుతి, కావ్యమునకై కృతిభర్త కృతికర్తను అభ్యర్థించుట - కావ్య ప్రశస్తి - సుకవి (పూర్వ కవి) స్తుతి - కుకవి నింద - కృతిభర్త వంశ ప్రశస్తి - షష్ఠ్యంతములు అనునవి.

ఈ అంశములలోనే ఇమిడియో, ఇనుడకనో కవులు కావ్య కవిత్వ విషయమున తమ అభిప్రాయములను సూత్ర ప్రాయముగా వ్యక్తీకరించుట కన్పించును. కృతికర్త నరుడైనపుడు మాత్రమే అతని వంశావతార వర్ణన యుండును కాని భగవంతుడైనచో ఉండదు. ఒక్క సంకుసాల నరసింహ కవి మాత్రము తన కావ్యమును శ్రీరంగ నాథున కంకిత మిచ్చుచు, శ్రీరంగనాథావతార గాథను చర్చించినాడు (1.80-91). భగవదంకితమైన కావ్యములలో కృతికర్త వంశ పరిచయము సామాన్యముగా నుండదు.

ఈ విధమైన అనేకాంశములతో విశిష్టమైన అవతారికలు మరింగటి కవుల కావ్యములలో మరి కొంత విశిష్టముగా కన్పించును.

మరింగంటి కవులు శ్రీవైష్ణవ సంప్రదాయ నిష్ఠులు. భక్తి, ప్రపత్తి భావ ప్రచారకులు ఈ అంశములను వీరి అవతారికలను గూర్చి వివరించుకొను సందర్భమున గుర్తుంచు కొనవలయును

వీరి అవతారికలలోని అంశములు క్రమముగా పరిశీలింపబడుచున్నవి:

## 1. ఆరంభ శ్రీకారము :

తెలుగులో కావ్యము లన్నియు శ్రీకారముతో ఆరంభింప బడినవి. ఈ నియమము సంస్కృతమున కన్పించదు. కాని తెలుగు ప్రబంధములకు ప్రేరకములుగా భావింప బడుచున్న కిరాతార్జునీయ, శిశుపాల వధ కావ్యములు శ్రీ శబ్దముతో ఆరంభ మగుచున్నవి. సంప్రదాయముగా మాత్రము ఇది నిలబడ లేదు. తెనుగున శ్రీకారముతో కావ్యము నారంభించుట నన్నయ గారి నుండి ఆరంభమైనది. లాక్షణికులు శ్రీకారముతో కృతి నారంభింప వలయు నని లక్షణము నేర్పరచుటకు నన్నయగారే ఆధారము.

శ్రీకార ప్రయోగమునకు కారణము చెప్పుచు అప్పకవి—

'వేదముల కెల్ల నోంకార మాది యైన
కరణిఁ గృతులకు నెల్ల శ్రీకార మాది
గాన కవివరు లెల్లరు దానిఁ దక్క-
నితర వర్ణంబు లిడరు సత్కృతుల మొదల' 2-354

అన్నాడు. భాస్కర రామాయణము మాత్రము శ్రీకారముతో గాక 'రాముని శుభ చరితమ్ము'ను అని రేఫతో (రామ శబ్దముతో) కన్పించును. అప్పకవి ఈ శబ్దమును అమర వాచక మని చెప్పుట (2-364) లో సామంజస్యము లేదు. శ్రీరాముడు అమరుడు కాడు. అది గాక భాస్కర రామాయ ణావతారికను గూర్చి ఇప్పటికే సందేహము లున్నవి. శ్రీకారముతో కావ్యము నారంభించుటయే గాక ముగించుటయు నన్నెచోడుని కుమార సంభవమున కన్పించును. అనంతర అవతారికలయందు ఈ అంశము ఐచ్ఛికముగా నైనది.

మరింగంటి కవులు పూర్వ కవు లందరి వలెనే తమ కావ్యములను శ్రీ కారముతోనే ఆరంభించినారు. శ్రీ కారము కేవలము శుభప్రద మన్న తాత్పర్యము వరకే వీరి ప్రయోగము పరిమితము కాదు. ఇచ్చట శ్రీ కారము మూడు వర్ణముల సంపుటి అని గాక లక్ష్మీ దేవికి మౌలిక నామము.

శ్రీ వైష్ణవ సంప్రదాయ ప్రవర్తకులలో శ్రీమద్రామానుజుల గురువు గారైన శ్రీ యామునుల వారు 'స్తోత్ర రత్నము' నందు '**శ్రీ రిత్యేవ చ నామ తే**.' అన్నారు. లక్ష్మి మొదలైన నామము లెన్నో యుండవచ్చును. కాని ఆమె మౌలిక నామము 'శ్రీ' అని మాత్రమే! అని వారి నిర్ధారణ. శ్రీ వైష్ణవ సంప్రదాయమున 'శ్రీ' స్థానము అత్యున్నత మైనది. నారాయణుని తర్వాతి స్థాన మామెది. ఆమె కృపా మూర్తి; లోకోద్ధరణము స్వామి కన్న వాత్సల్యగుణము ముందే ఆమె యందును. ఇంతింత యని చెప్పరానిది ఆమె మహిమ. అందుకే యామునుల వారు 'చతుశ్శ్లోకి' లో—

'యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభు
ర్నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః',

అన్నారు. రామానుజుల వారు 'గద్య త్రయ' మందలి శరణాగతి గద్య'లో 'శ్రీ' ప్రార్థనము చేసి ఆమెకు శరణాగతు లైనారు. శ్రీ, శ్రియః పతులు నిత్య ద్వంద్వము. ఒకరిని విడిచి మరి యొకరుండరు. శ్రీ విరహితుడైన నారాయణుడు లేడని శ్రీవైష్ణవ సంప్రదాయము. 'శ్రీ' వల్లనే ఆయనకు వైభవము.

వేదాంత దేశికుల వారు స్తోత్ర భాష్యమున 'చతుః శ్లోకి' ని గూర్చి వ్రాయుచు, నాల్గవ శ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు—

'తత్ర లక్ష్మ్యా అపి సత్తా భగవ దధీనా, భగవత స్తు వైభవమ్ రత్న ప్రభా పుష్ప పరిమళ న్యాయేన లక్ష్మ్యాయత్తమ్' (పు. 20) అనిరి.

తిరుమంత్రార్థమున - 'పెరియ పిరాట్టియారాలే పేరాగై యావదు ఇవళ్ పురుషకార మానా లల్లదు ఈశ్వరన్ కార్యం శెయ్యానెనాగై' (లక్ష్మీ దేవి వల్లనే మోక్షము కలుగును. ఈమె పురుషకారము లేనిదే ఈశ్వరుడు ఏ కార్యమును చేయడు) అని చెప్పబడినది.

నారాయణుని యందు లక్ష్మి అనపాయిని. ఈ విషయమునే జనక సుతాభ్యుదయ కర్త వేంకట నరసింహాచార్యులు—

> 'హరి కనపాయియై జగము లన్నియుఁ బ్రోవ హితంబుఁ దెల్పఁగా
> నురమున గ్రాలు కౌస్తుభపు టుజ్జ్వల సన్మణి రాణ మొదలం
> చిరపుగ నిల్చి తేజరిలు యిందిర సత్కరుణా కటాక్షముల్
> నెలయఁగ మా నివాసమున నిల్చి శుభంబు లొసంగు గావుతన్!'

అని - హరియందు ఆమె అనపాయినీత్వమును, ఆమె పురుషకార లక్షణమును ప్రధానీకరించినారు.

సంప్రదాయమున శ్రీ దేవి కున్న యీ పరమ ప్రాధాన్యము, ప్రామాణ్యము తమ కావ్యములను శ్రీ కారముతో ఆరంభించుటకు కారణమైనది. మణింగంటి వారి విషయమున మరియొక బ. వత్తర మైన కారణము కూడ నున్నది. వీరి కావ్య విషయములో కావ్య సంప్రదాయము, శ్రీవైష్ణవ సంప్రదాయము రెండును కలిసి వచ్చుట ఒక విశేషము.

## 2. దేవతా స్తుతి :

సాధారణముగా తెలుగు కావ్యములలో దేవతా స్మరణము సందు హరి హర బ్రహ్మలు వారి భార్యలు కన్పింతురు. శైవులైనచో శివుని, వైష్ణవులైనచో విష్ణువును మొదట చెప్పి మిగిలిన వారిని తరువాత చెప్పుట దాదాపుగా అన్ని కావ్యములందును కన్పించును. కాని శ్రీవైష్ణవ సంప్రదాయ నిష్ఠ గల కవుల కావ్యములందు శ్రీమన్నారాయణ దేతర దేవతా స్తుతి యుండదు. అన్య దేవ తారాధనము, అన్యశేషిత్వము ఈ సంప్రదాయమున ఒదుగనిది. అందుకనియే మరింగంటి కవుల కావ్యములయందు శ్రీమన్నారాయణ స్తుతి మాత్రమే కన్పించును.

నారాయణ స్తుతి యనగా తదవతార స్తుతియు కావచ్చును. మరింగంటి కవుల ఇలువేల్పు సిరిసెనగండ్ల లక్ష్మీ నృసింహస్వామి. పిదిలో కొందరికి శ్రీనివాసుడు ఇష్ట దైవము. 'శ్రీరామ, వేణుగోపాల, కేశవ' స్మరణము కూడ కొన్ని యవతారికలలో కన్పట్టును. అయినను ప్రధానులు లక్ష్మీ నృసింహ, శ్రీనివాసులే! పీరిద్దరికి అభేదము పాటించబడినది. శ్రీ కృష్ణదేవరాయలు శ్రీవేంకటపతికి ఆంధ్ర విష్ణువునకు అభేదమును పాటించి—

'అంకితమో యన నీ కిం
వేంకట పతి యిష్టమైన వేల్పగుటఁ దది
యాంకితము సేయు మొక్కొం-క
సంకేతముగా కలఁడ దనన్నేఁగానే' (ఆము క్త - 1-16)

అని చెప్పిన విషయము ఇచట గమనింపదగినది.

దశరథరాజ నందన చరిత్రయందు సింగరాచార్యులు —

"సిరి వరించిన మేలు గిరి ధరించిన కేలు
దనరు వాఁడు శుభో క్తి నొనరు వాఁడు
చిలువరాయని పాన్పు నలువ పాయని కాన్పు
గలుఁగువాఁ డసురుల కలఁగు వాఁడు
పులుఁగు తత్తడి పొవ జిలుఁగు పుత్తడి కొక
గట్టువాఁ డమరులఁ బట్టువాఁడు
తెలి దిన్నెపై అచ్చ మెలిగొన్న యెద పచ్చ
మెలయువాఁడు కృపాబ్ధి నెలయువాఁడు

హాటక నిశాట వక్షః కవాట వాట
పాట నోద్భట శతకోటి పటల చటుల
శిత నఖంబుల వాఁడు లక్ష్మీ నృసింహుఁ
డెలమి మా యిలువేలుపై నిలుచుఁ గాక!"

అని లక్ష్మీ నృసింహ వర్ణన చేయుటే గాక ఆశ్వాసాంత గద్యయందు "ఇది శ్రీ మత్కర్పరాచల లక్ష్మీ నృసింహ వేంకటేశ్వర" అనినారు. ఇట్లు శ్రీనివాస లక్ష్మీ నృసింహులకు కిచట అభేదము.

శ్రీరామానుజాభ్యుదయ కర్త సైతము—

"శ్రీ కమలా వధూటి నెదఁ జేర్చి వయారముగా వృషాద్రిపై
ప్రాకట మొప్పఁ దా నిలిచి భాసిలు వేంకట భర్త లీలన
స్తోక దయాంబు రాశి యనఁ దోఁచెడి సిర్సనగండ్ల గహ్వరిం
జేకొని యుండు లక్ష్మి నరసింహులు మమ్ముల్ఁ బ్రోచుఁ గావుతన్!"(1-1)

అని వృషాద్రిపై నిలిచిన స్వామికిని, సిరిసెనగండ్ల లక్ష్మీ నృసింహునకును అభేదము చెప్పినారు (ఈయన కృతు లన్నిట ఈ పద్ధతియే గలదు).

మరింగంటి వారికి ఈ ఉభయుల యందు తిక్కనగా రన్నట్లు 'భేదము లేని భక్తి' అయినను శ్రీ వేంకటేశ్వర స్వామిని గూర్చిన ఆసక్తికి మరియొక ముఖ్య కారణము కలదు.

శ్రీవైష్ణవుల కార్య క్షేత్రములు ముఖ్యముగా మూడు : అవి కంచి, శ్రీరంగము, తిరుపతి. వీనియందు కంచి వరదరాజులు అష్టాక్షరీ స్వరూపులు. శ్రీరంగ మందలి రంగనాథుఁడు సాక్షాన్నారాయణమూర్తి శేషాచల స్వామి చరమ శ్లోకార్థము.*2

శ్రీ రామానుజుల వారు దాదాపు తమ సగము జీవితకాలమును శ్రీరంగ మందనే గడిపినను శ్రీవైష్ణవ-క్షేత్రము లన్నిటను ప్రపత్తి యున్నను వృషాద్రి పతియందే వారి మనస్సు మిక్కిలిగా లగ్నమైనట్లు కనిపించును. వారు తమ శ్రీభాష్యారంభమున —

"అఖిల భువన జన్మ స్థేమ భంగాది లీలే
వినత వివిధ భూత వ్రాత రక్షైక దీక్షే ।
శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
మమ భవతు పరస్మిన్ శేముషీ భక్తి రూపా॥"

అని ప్రార్థించినారు.

శ్రీ వేంకటేశ్వర స్మరణ ఆళ్వారు, దివ్య ప్రబంధములయందు విస్తృతముగా కన్పించును. ఈ కారణమువలన కావచ్చును-మరింగంటివారు శ్రీ వేంకటేశ్వరుని తమ యిష్టదైవమైన సిరిసెనగండ్ల నృసింహునిగా భావించి స్తుతించినారు.

భగవంతు డెంతయో భక్తుడును అంతే-సాంప్రదాయికముగా! ఒకప్పుడు వీరి స్థానమే కొంత మిన్న యేమో అనిపించును. ఈ దృష్టితో మరింగంటి వారి కావ్యములయందు శేష, గరుడ, విష్వక్సేన, పంచాయుధ మూర్తి, ఆళ్వారుల స్తుతి కన్పించును. 'శతవైరి వైభవ దివాకరము'నందు మాత్రము లక్ష్మీస్తుతియే గలదు. కాగా శేష, గరుడాదు లను పెరు స్తుతించుటలోని విషయములు గమనింపదగినవి.

## 3. శేష స్తుతి :

ఆళవందార్ స్తోత్రమున యామునుల వారు ఫణిపతికి ప్రముఖ స్థానమిచ్చి రెండు శ్లోకములతో వర్ణించిరి (39,40). శ్రీమద్రామానుజుల వారు 'వైకుంఠ గద్య' యందు 'శేష శేషాశనాది సర్వం పరిజనమ్' - అని నిత్య శేషుడైన దివ్య భోగిని నుతించినారు. వేదాంత దేశికులు తమ 'స్తోత్ర భాష్యము'న అనంతుని గూర్చి—

'గంధర్వాప్సరస స్సిద్ధాః స కిన్నర మహోరగాః।
నాంతం గుణానాం గచ్ఛంతి తే నానంతోఽయ ముచ్యతే'॥

అని వివరించిరి.

మరింగంటి కవుల ప్రతి గ్రంథములోను విధిగా చేయబడిన 'శేష స్తుతి' యందు ఆళవందార్ స్తోత్ర ప్రభావ పడినను.

'నివాస శయ్యాసన పాదుకాంశుకో
పధాన వర్షాతప వారణాదిభిః।
శరీర భేదై స్తవ శేషతాం గతై
ర్యథోచితం శేష ఇతీర్యతే జనైః'॥ (40 వ శ్లో.)

ఈ శ్లోకము - వీరి శేష స్తుతికి ముఖ్యమైనది. అందుచే **'విష్వక్సేన ప్రభాకరము'** (1-4) నందు—

'పరవశు సింధురాట్సుతకు వారిజ పత్ర విశాల నేత్రకున్
నిరతము భక్తి యుక్తుల నివాసము శయ్యయు నాతపత్రమున్
గరిమను పీఠ పాదుకలుగాఁగ సపర్యలు చేయుచుండు నా
యురగ గణాధినాయకుని యుల్లమునం భజియింతు నెప్పుడున్!'

అని చెప్పబడినది. వీరి శేష స్తుతికి సంప్రదాయ రీత్యా ఈ కారణము ఉన్నను, ఇప్పుడు మరి యొక విషయము గమనింపవలెను. మరింగంటి వారి పూర్వులలో చెన్నయాచార్యులు శేషరూపి. అనంతాళ్వారు అని వీరికి ప్రసిద్ధి. నేటికిని మరింగంటి వారిలో శేష పూజ, శేష నామము లుండుటకు ఇది యొక కారణము. ఇట్లు రెండు విధములైన కారణములు వీరి 'శేష స్తుతి'యందు కలవు.

## 4. గరుడ స్తుతి :

వేదాంత దేశికుల వారు **'గరుడ దండకము'**, **'గరుడ స్తుతి'** **'గరుడ పంచాశత్తు'ల** యందు గరుడాళ్వారుల శక్తిని గొప్పగా వర్ణించినారు. 'కాంతా స్తోత్రము'న 'వేదాత్మా విహగేశ్వరః' అని ఈయనకు సర్వ వేదమయత్వము చెప్పబడినది.

శ్రీ మహావిష్ణువునకు వైకుంఠ నివాసమున శేషుని కైంకర్యము. (సేవ) ప్రయాణాదులందు గరుడుని కైంకర్యము వివక్షిత మైనది. 'ఆళవందార్ స్తోత్రము'న—

'దాస స్సఖా వాహన మాసనం ధ్వజః
య స్తే వితానం వ్యజనం త్రయీమయః ।
ఉపస్థితం తేన పురో గరుత్మతా
త్వదంఘ్రి సమ్మర్ద కిణాంక శోభినా' ॥ (41)

అని గరుడాళ్వారులను గూర్చి చెప్పబడినది.

శ్రీ కృష్ణ దేవరాయలు 'పతగ సమ్రాట్ పతత్ర ప్రభంజనములు, వృజిన తూలౌఘముం దూల విసరుగాత' అని గొప్పగా వర్ణించెను. మరింగంటి వారి కృతులయందు సుపర్ణుడు వర్ణింపబడినాడు.

శక్రబంధ భూపాలాళ్యానమున (1-4)

'అజిరాకారు నజాండ కోటి జలధ రాంతర్వ్యాసుఁడౌ మేటికిం
ధ్వజమై వాహనమై వితానమునునై దాస్యానువర్తుండు నై
వ్యజనంబై హితుఁడై మనోజవయుఁడునై వజ్రిప్రభా హాసుఁడై
యజితుం డైన పతంగారా ట్కులమణిన్ ఆత్మం బ్రతిష్ఠించెదన్'

అను స్తుతియందు యామునుల వారి 'దాస స్సఖా వాహన...' శ్లోక ప్రభావము గలదు.

## 5. విష్వక్సేనస్తుతి :

శ్రీ మహావిష్ణు సన్నిధియందు వర్తించు నిత్య సూరులలో అనంత, గరుడ, విష్వక్సేనులు ముఖ్యులు, వీరియందు విష్వక్సేనులు ప్రథమ స్థానమున నుందురు.

శ్రీ సంప్రదాయమైన విశిష్టాద్వైతము తొలుత నారాయణుడు లక్ష్మి కుపదేశింగా ఆమె విష్వక్సేనుల కిచ్చినది. వీరి ద్వారా ఆళ్వారాచార్యుల కుపదేశింపబడిన యీ సంప్రదాయము మిక్కిలి ప్రచారమైనది. కావున ఇట్లు శ్రీవైష్ణవమున విష్వక్సేనులకు ప్రాధాన్య మేర్పడెను.

శ్రీవైష్ణవులు సకల కర్మాంగములయందు విష్వక్సేనుని పూజింతురు. ఈయన చతుర్బాహువు. శంఖ చక్ర గదా ధరుడు సూత్రవతీ నాథుడు. వేత్ర పాణి. విశ్వ రక్షా పరాయణుడు. విష్ణు సేనానాయకుడు. విఘ్న నాశకుడు. పాంచరాత్రాగమములయందు విష్వక్సేన ప్రశంస చేయబడినది

ఆళవందార్ స్తోత్రమున—

త్వదీయ భుక్తోజ్ఝిత శేష భోజినా
త్వయా నిసృష్టాత్మ భరేణ యద్యథా।
ప్రియేణ సేనాపతినా న్యవేది తత్
తథానుజానన్త ముదార వీక్షణైః॥ (42)

అని విష్వక్సేనులను 'శేష భోజి' గా చెప్పిరి. అసలు పేరు శ్రీశ భోక్త్రోజ్ఝిత శేష భోజనులు (శేషాశనులు). శ్రీమద్రామానుజులవారు **'శరణాగతి గద్య'** మందు 'శేష శేషాశన...' పరిజన పరివృతునిగా శ్రీమన్నారాయణుని వర్ణించు నప్పుడు విష్వక్సేనులను 'శేషాశనులు'గా పేర్కొనిరి.

ఇట్లు శ్రీ సంప్రదాయ ప్రవర్తకులు సర్వ విఘ్న నాయకులు నైన విష్వక్సేనులు శ్రీమన్నారాయణుని వద్ద ప్రముఖులు. ఈ విషయము లన్నిటిని గమనించిన మరింగంటి కవులు తమ కృతులయందు సూత్రవతీ నాథుని ప్రార్థించిరి.

'జనకిసు లాభ్యుదయము' నందు-

'వేత్ర ధరున్ రమాశ్రితుని విక్రమ శీలుని కంధిరాట్స్నుతుం
చిత్రిత కర్ణ కుండలుని శ్రీశుని దాసుల నేలు నేతనుం
చిత్ర విచిత్ర భూషణుని జిత్ర విభాకర దివ్య తేజునిన్
సూత్రవతీ సతీ పతిని సుందర గాత్రుని నే దలంచెదన్' (1-4)

అని విష్వక్సేను నుతి చేయబడినది. ఈ గ్రంథకర్తయే **'విష్వక్సేన ప్రభాకరము'** ను రచించి నూతన కథా వస్తువును తెలుగు సాహిత్యమునకు పరిచయము చేసినాడు.

## 6. పంచాయుధములు :

శ్రీమన్నారాయణునకుగల పంచాయుధములు మహా ప్రభావవంతమైనవి. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ మొనర్చు స్వామికి ప్రధానములైన ఈ పంచాయుధములు జీవకోటియందు చేరి భగవత్పరిచర్యను చేయుచున్నట్టివి. వీనిలో ఒక్కొక్క ఆయుధము ఒక్కొక్క తత్త్వమునకు ప్రతీకగా ప్రసిద్ధమైనవని దేశికుల వారు స్తోత్ర భాష్యమున ఇట్లు వివరించిరి :

'కౌస్తుభః స చ జీవ తత్త్వాభిమానీ; అపి శబ్దేన అపరిమితాని దివ్యాభరణాని సంగృహ్యాతే. రథాంగాదయః పంచ మనస్తత్త్వ తామసాహంకార సమ్యగ్జ్ఞాన బుద్ధి తత్త్వ సాత్త్వికాహంకారాభిమానిత్వేన ప్రసిద్ధాః*4' (91 వ పుట)

**'శరణాగతి గద్య'** యందు శ్రీ మహావిష్ణువును రామానుజుల వారు—

'అచింత్య శక్తి శంఖ చక్ర గదాసి శార్ఙ్గా ద్యసంఖ్యేయ నిత్య నిరవద్య నిరతిశయ కల్యాణ దివ్యాయుధః' అని వర్ణించినారు.

శ్రీనాథ మహాకవి **'భీమేశ్వర పురాణము'**న (4-48) పంచాయుధములను జీవము గలవానిగా - 'దివ్యాయుధములైదు ధృత చేతనంబులై శత్రు సంహారంబు సంస్తుతింప' అని వర్ణించెను. శ్రీవైష్ణవమునందు ముఖ్యమైన పంచ సంస్కారముల*5 లో మొదటిది 'సమాశ్రయణము' (తాపము). దీనివలన ఆ వ్యక్తి ప్రపన్నుడగును.

మరింగంటి కవులయందు పంచాయుధముల గూర్చి పైన చెప్పిన విషయములతో పాటు పంచ సంస్కార పద్ధతియందు గల 'చక్రాంకనము' (తప్త ముద్రా ధారణ) కూడా ముఖ్యముగా స్ఫురించినది. అందువలననే రెండు విధముల భావనతో పంచాయుధ స్తోత్ర మొనర్చినారనవచ్చును.

**'దశరథ రాజ నందన చరిత్ర'** యందు తప్ప మిగిలిన వీరి సర్వ రచనల యందును ఒక పద్యమున వీని స్తుతి కలదు. **'శాలాంక నందినీ పరిణయము'**న మాత్రము ఐదు పద్యములలో పంచాయుధ వర్ణన చేయబడినది.

## 7. ఆళ్వారులు :

ద్రావిడ వేదముగా పరిగణింపబడు దివ్య ప్రబంధముల చెప్పి లోకము నకు మహోపకార మొనర్చి 'శ్రీ' మత వ్యాప్తికి ముఖ్యులైన పన్నిద్ద రాళ్వారులు వైష్ణవమున పరమ పూజ్యులు. వారి స్థానము విశిష్టమైనది. శ్రీ కృష్ణదేవరాయలు 'మోక్షైద్యా మతిని', 'ఎప్పు' లైన, 'పన్నిద్దరు సూరుల' తలంచినాడు (1-10). వైష్ణవ కవులు, వైష్ణవాభిమాన కవులు తమ రచనలయందు ఆళ్వారుల పేర్కొనుచు గలరు. మఱింగంటి వారు దివ్య ప్రబంధములను అధ్యయనము చేసి, అందలి విషయములను తమ సంప్రదాయ ప్రచార సమయమున అభిమాను లకు బోధించి, వారిని తదభిముఖులుగా నొనర్చిన ఉభయ వేదాంత ప్రవర్తకులు. అందువలన తమ రచనల యందు తప్పని సరిగా ఆళ్వారులను నుతించినారు.

ఆళ్వారుల స్తుతి తరువాత చెప్పవలసినది 'ఆచార్య స్తుతి'. దీనినే 'గురు పరంపర' యని అందురు. ఇది మూడు విధములు :

1. శ్రీమన్నారాయణుని నుండి రామానుజుల వారి వరకు
2. రామానుజుల వారినుండి మణవాళ మహాముని వరకు
3. మణవాళ మహాముని నుండి స్వాచార్య పర్యంతము -

ఇట్లు శ్రీమన్నారాయణునితో ఆరంభమైన గురు పరంపర స్వాచార్య పర్యంతము కొనసాగు చుండును. ఆచార్యుల వద్ద చక్రాంకితు లైనవారు స్వాచార్య పర్యంతమైన కొన్ని శ్లోకములను (తనియలు) ఆచార్యులనుండి ఉపదేశ మందు ఉపదేశము వానిని పఠించుట శ్రీ వైష్ణవమున గల ఒక ఆచారము. వానియందు—

'లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమాం।
అస్మ దాచార్య పర్యన్తాం వందే గురు పరంపరామ్'॥ (కూరనాథులు)

అను రీ పద్ధతి యుండును.

శ్రీవైష్ణవ సంప్రదాయ కవుల రచనలయందు ఆళ్వారుల స్తుతి తర్వాత ఆచార్య స్తుతి యుండుట అరుదు.*6 ఇది కేవలము శ్రీవైష్ణవ సంప్రదాయము కావున మఱింగంటి వారు విధిగా చేసినారు. వారి రచనలలో ఆళ్వారుల రామానుజ [illegible] పరంపరము___

'వాసి డెబ్బది వాల్గు సింహాసనము, గురుపుం భజింతు రుద్రుఘను పరిధవిల్ల' (సీతా...1-8) అని ఈ పద్ధతి పాటింపబడినది.

## 8. కవి స్తుతి :

వీరి గ్రంథముల యందు శివ, వ్యాస, వాల్మీకుల నుతియే కలదు. తెలుగు కవులను పేర్కొనకపోవుట ఆశ్చర్యము. 'సత్కవుల' అని మాత్ర మన్నారు. ద్వితీయ వేంకట నరసింహాచార్యులు తన అన్ని రచనలయందును సింగరాచార్యులను నుతించినాడు. ఇతర తెలుగు కవుల ప్రసక్తి లేదు. సంస్కృత కవులయందు వ్యాస, వాల్మీకులను స్తుతించెను. ఈ విధముగనే ఆధునికులైన ఈ వంశ కవుల కవి స్తుతి గలదు. 'భల్లాత కాచల...' కర్త మాత్రము వావిలికొలను సుబ్బారావు గారికి నమస్కృతులు తెల్పెను.

**కుకవి నింద :** తెలుగు కావ్యములందలి కుకవి నింద సుకవుల విఖ్యాతిని కల్గించుటయే గాక వారి వ్యక్తిత్వమును, కవితా మరమును వెల్లడి చేయును. ఈ పద్ధతి ననుసరించిన కవులు తమ ప్రతిపక్షులను నిందించుటకో, కావ్య క్రమానుగతాచారముగనో దీనిని వ్రాసియుందురు.

కుకవు లనగా నిట్టి వారని లాక్షణిక నిర్వచనము లేదు. నిర్వచించు టకును వీలు లేని తెనుగునందలి యీ నిందా సంప్రదాయము క్రమముగా నియతముగా నున్నట్లు లేదు.

సంస్కృతమున భట్ట బాణుడు మాత్రము కుకవి నిందను చేసియుండు (1-4.5.6). తెనుగున ప్రప్రథమ 'కుకవి నింద' నన్నెచోడుని కుమార సంభవమున గలదు. అనంతరము కొందరు కవులు దీనిని అన్య దూషణ, స్వ గుణో త్కర్ష సూచకముగ భావించియో, అప్రస్తుత మనియో విసర్జించిరను, మరి కొందరు విడువరాని కవి సమయముగ - నియమముగా - 'కుకవి నింద'ను చేసిరి. వీరి దృష్టిలో కాకవులు అనేక విధ విశేషణములతో చిత్రింపబడిరి. తెనాలి రామకృష్ణుడు 'కొందెపుం గవుల రవణె యడగించి' ——

'కాన దోషాత్మ యయిన కుకవుల కలన
గరిమ వహియించు కవిరాజు కావ్య మహిమ' (1-15)

అని - సుకవులకు కుకవులవలన కలుగు గొప్పతనమును చెప్పెను.

మరింగంటి కవులు కుకవి నిందను నియత మొనర్చిరి. తిక్కనగారు కుకవులను 'దుర్వీటు' లనగా (నిర్వచనోత్తర రామాయణము 1-6) సింగరాచార్యులు వీరిని 'జార కోటి'లో చేర్చి—

'అరయ శబ్ద హీన మగునట్టి పదస్థితి గల్గి పై నలం
కారము లెవ్వి చేరుటక క్రమ్మిన శయ్యల సంధి దెల్పుచున్
గౌరవ వృత్తి నర్థముం గాననికాకవి జార కోటి ని
స్సారము చేయఁగా వటె వెసన్ ద్విజరాజ కళా సమృద్ధిచేన్'

(దశరథ రాజ నందన చరిత్ర, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము - రెంటియందును)

వేంకట నరసింహాచార్యులు (ద్వితీయ) వీరిని 'వికారులు', 'జారులు', 'ఆశా గళ స్తన సమానులు', 'కుక్కలు', 'అంధులు', 'ఖాద్ ఖావ్'లు అని పలురకములుగా నిందించెను.

'ఇంగిత మెఱుఁగక సత్కవి
యొంగిళ్ళను గురుచునట్టి యేపుం రీతిన్
ముంగిళ్ళ నుండి మొఱిగెడి
దొంగగు కాకవికి సుకవి తొలఁగునె యెందున్' (నృకం...1-12)

(ఏపి = కుక్క, దీనిని 'ఏపి'గా ప్రయోగించినాడు)

సత్కవుల యెంగిళ్ళను (వారి పద్య భాగములను దొంగిలించినవారు) తిని, తమ యింటి ముంగిటుల యందు మొఱుగు (వృథా ప్రగల్భముల పలుకు) నట్టివారు కుక్కలైన కుకవులు. వీరికి సత్కవియైన వాడు తొలగవలసిన అవసరము లేదు.

'సంతి శ్వాన ఇవాసంఖ్యా జాతి భాజో గృహే గృహే।
ఉత్పాదకా న బహవః కవయః శ్శరభా ఇవ॥' (1-5)

అను హర్ష చరిత్రము నందలి 'శ్వాన' కుకవులు పై పద్యమున గలరు.

తాళాంక నందినీ పరిణయ కర్త వీరిని 'హీన జారు'లని శ్లేషలో —

'సురుచిర వృత్త నేమములు జూడక హీన కథా ప్రసక్తిచే
గురు లఘు వర్ణ నిర్ణయము గొంటెము లేక పదార్థ సంగ్రహ
స్థిర మతి సత్ప్రబంధ రుచి దేలక శయ్యలు విశ్రమ స్థలం
బెఱుఁగక హీన జారుల క్రియం దగు దుష్కవులం గణింతురే?'

అన్నినాడు, సింగరాచార్యుల 'అరయ శబ్ద హీన...' పద్యమునకు ఇది అనుకరణముగా నున్నను, శ్లేష వలన కవితా నియమము, జారులు, దుష్కవులు చిత్రింపబడినారు. వసుచరిత్ర కారుడు ( 1-11 ). 'భావం బెక్కడ లేక వృత్త నియమాపాయంబుఁ జింతింపక.........' అని 'కుకవి ప్రణీత కృతి సామాన్యాకృతి' వలె నుండు నని శ్లేషించి, కవితా లక్షణ మును వ్యక్తపఱచెను. ఈ పద్య ప్రభావము 'తాళాంక...' కర్తపై బడి. కుకవులు హీన జారు లైనారు.

రెండు పద్యములలో కుకవులను పేర్కొనిన ఈ గ్రంథకర్త—

'తమకై తాము వికల్ప నార్థ గత శబ్దంబుల్ దగం గూర్చి ప
ద్యములన్ గొన్ని సభన్ వచింప నెద విద్వద్వర్యులుం బూర్వ ప
క్షము గావించిన నోరు మూతురు తమిం గన్నంబులో తేల్చిటు
కుట్టకన్ మీటిన గొంగ బంటయిన గ్రుక్కన్ మిన్నగా నుందురే'
(1-27)

అని కొంగరు తేలు కుట్టిన సామెతను వ్యక్తపరచి ఆ నాడు జరుగు చుండిన విద్వత్సభలలో కుకవులు పూర్వపక్షము చేయు కవివరునకు సమాధాన మీయ లేక నోరు మూసికొని తేలు కుట్టిన దొంగలవలె నున్నా రని తన భావమును వ్యక్తీకరించెను.

సత్కవి యైనవాని కవిత్వ మందలి రస స్థితి నూహించి గ్రహించ లేని అల్ప బుద్ధి, ఈర్ష్యాళువు ఎట్లుండునో 'కుకవి నింద' తెల్పుచున్నవి. వీని వలన కవుల కవితా మతములు రమణీయము లగు పద్యముల ద్వారా నిరూపితమైనవి.

"కుకవి నిందఒక ప్రత్యేక రీతిగానే చాలా కాలం ప్రవర్తించింది. కుకవులు అనే వారు విడిగా ఒక తెగేమీ కాదు. కావ్య దోషాలన్నిటి స్వరూపమే కుకవి. దీనివల్ల రచయిత పరిహరించ వలసిన కావ్య దోషాలు తెలియవస్తాయి. కనుక ఇదీ సాహిత్య విమర్శలో భాగమే!" - (తిరుమల రామచంద్ర గారు - 'తెలుగు పరిశోధన' 1. పుట 94)

**కవితా పరామర్శ:** కవుల స్వీయ కవిత్వాతిశయము, కవితా తత్త్వము, కవిత్వ తారతమ్యము మొదలగునవి దీనివలన తెలియును. మరి కొందరు లాక్షణిక సంప్రదాయమును కూడ నీ సందర్భమున వ్యక్తపరచినారు.

కవితా పరామర్శ యనునది స్వీయ కవితా పరామర్శ, కేవల కవితా పరామర్శ యని రెండు రకములుగా పరిశీలింపవచ్చును. కవి తన కృతి ప్రేరేపనని మూలమున గాని, స్వయముగా గాని స్వకీయ కవితను గూర్చి చెప్పినది స్వీయ కవితా పరామర్శ. కావ్య నిర్మాణ కర్మఠుడైన కవి పాటింపదగు సార్వకాలికమైన సాహిత్య ధర్మముల వివరించుట కేవల కవితా పరామర్శ యన బడును.

నన్నయ, తిక్కన, శ్రీనాథుడు, సంకుసాల నరసింహకవి స్వీయ కవితా ప్రశస్తిని విపులముగా నొనర్చిరి దీనితో పాటు కవితా ప్రశస్తిని గూడ తెల్పిన వారిలో తిక్కన, గోపరాజు, మొల్ల, ప్రౌఢకవి మల్లన మొదలగువా రున్నారు. వీనివలన సాహిత్య చరిత్రకు, సాహిత్య విమర్శకు ఎంతో ఉపకార మగును.

మరింగంటి కవులయందు పైన తెల్పిన రెండు పద్ధతులను గలవు. స్వప్నమున దర్శన మొసంగి, కృతిపతియైన శ్రీపతి (సిరిసెనగండ్ల స్వామి) "వత్సా! నీవు ఇంత పండితుడవు, ఇన్ని కృతులు రచించితివి, దీనిని నా కంకిత మిమ్ము" అని యిట్లు పలికి కని కవితా శక్తిని తెల్పు పద్ధతి వీనిలో అధికము. తమ కవిత్వ పద్ధతి యిట్టిది అని తెల్పిన సందర్భములు స్వల్పము.

సింగరాచార్యులు తన రెండు కృతులయందును—

'వర వందారు జనావళీ హృదయ సద్వాంఛార్థక ద్వేంకటే
శ్వర కారుణ్య కృపా సుధా మిళిత పీఠా మాధురీ మార్గ వి
స్ఫురితైకైక దిక ప్రబంధ రచనా స్ఫూర్త ద్వచః శ్రీకుడన్
నర నాగాశ్వ నృపాల సభ్య గణితుండన్ సింగరాచార్యుడన్!'

అని తెల్పుకొనెను. (దీనివలన ఈయన ఏక దిన ప్రబంధ రచనాధురీణు డని వ్యక్తమగుచున్నది) 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము'నందు—

> 'అలవడె దన్నులం దలచె దయల్లడ సీయక, ఘూర్ణ రాంగనా
> గురు కుచ యుగ్మముం దలె నిగూఢము గాక, తెనుంగు దేశపుం
> గరిత దనుం గనన్ వలె నొకానొక యించుక( గానుపించ(గా
> సరసులు మెచ్చ( జెప్పెదను సత్కవి శబ్ద పటుత్వ వైఖరిన్'*7 1-40

కవితా రచన మొకర్తు ననెను. సత్కవి ప్రయోగోచితమైన శబ్ద పటుత్వ పద్ధతి తన కిష్ట మని కవి అభిప్రాయము. లభించిన రెండు నిరోష్ఠ్య కృతుల యందును ఈ విధమైన రచన కాసాక్కారము కల్పించినాడు. 'దశరథ...'కుకవి నింద సందర్భములో చెప్పిన 'ఆరయ శబ్ద హీన...' ఇత్యాది పద్యము సైతము సింగరాచార్యులకు గల కవిత్వాభిప్రాయమును వెల్లడి చేయుచున్నది. ఆశ్వాసాంత గద్యయందు 'సలలిత మృదు మధుర వాగ్వైఖరీ ఝురీ ధురీణ-' అని చెప్పుకొనెను. ఎచ్చటను కూడ 'ప్రౌఢ' శబ్దమును గూర్చిన ప్రసక్తి లేదు.

వేంకట నరసింహాచార్యులు (ద్వితీయ) తన ప్రతి రచనయందును కవితా పద్ధతిని గూర్చి యిట్లు తెల్పెను: 'శశ్వ పిక్ష—'లో 'సకల సుకవి జనానంద కందళితము', 'నృకంఠీరవ—'లో 'లోకాధ్యక్షులు స్వాంతమందుల నాలోచించి మోదింప', 'జాంబవతీ...' లో 'వవః స్ఫురణ కల్పిత శబ్ద పటుత్వ శయ్యా సంభావన వృత్తి నొప్పు ననపద్య మహా సుకవీంద్ర హృద్య మోదావహము', జనక సుతాభ్యుదయము'న 'ఘనులగు సత్కవుల మదికి కౌతుక మొదవన్', 'సరసిజ చను బాల వృష్టి సత్కవు ణిరస', ఆశ్వాసాంత గద్యలయందు- 'కవితా విచిత్ర', 'బంధురాలంకార నిర్మాణ పావీణ', 'సంస్కృతాంధ్రోదిత మృదు మధుర లలిత కవితా విచిత్ర','సరస మృదు మధుర కవితా వైభవ'— అని ఇట్లు తెల్పుకొనెను.

తన రచన సత్కవుల మదికి ఆనందమును కల్గించవలెను. శబ్ద పటుత్వము, శయ్యా సౌభాగ్యము గల రచనయే అందరికిని ఆమోద యోగ్య మని కవి భావన.

**తాలాంక నందినీ పరిణయము :** కవి వృషాచలేశున కర్పించిన 'రస స్వర భాస్వర' యైన కావ్య సుందరి—

'ఉరుతర' 'కంధ'వేణి లస 'దుత్పల' లోచన 'చంపకా'ంగి భా
సుర తను మధ్య రమ్య 'వశి' సుందర 'వృత్త' నితంబ 'గీత' వి
స్తర బహు 'మత్త కోకిల'— (1-29)

(కవి చెప్పినా కావ్యమందు 'మత్తకోకిల' లేదు)

దీనిని 'కవితా కల్పన కల్ప భూరుహ సమాఖ్య ఖ్యాతిచే మద్గురు ప్రవరానుగ్రహమే నిధానముగ గన్పట్టన్', 'నియమన ప్రౌఢిన్ బుధు ల్మెచ్చ' 'అవనిన్ నిమ్మకు నీర మెక్కు- గతి-' (1-28) రచించితి నని ఆచార్యానుగ్రహ ప్రాముఖ్యమును తెల్పినాడు. తనకు—

చారుత రార్థ బోధనల శయ్యల రీతుల శబ్ద వృత్త్యలం
కారములన్ రస స్ఫురణ కల్పనలన్ మృదు నర్మ గర్భ గం
భీర తర ధ్వని స్ఫురణ భేదములన్ గుణ దోష సూక్ష్మ వి
స్తారములన్ గ్రహించి కవితల్ రచియించుట-' ఇష్టము. (2-54)

శృంగార ప్రబంధమైన 'తాలాంక నందినీ పరిణయము'న ఈ పద్ధతులు గలవు. మిగిలిన కవులు 'పూర్వకవి ప్రోక్త మార్గంబున కవితా రచన కుపక్రమించి'నట్లు తెల్పుకొనిరి.

**నరాంకిత వైముఖ్యము:** ఈ వంశ కవు లెవ్వరును తమ రచనలను నరాంకిత మొనరించ లేదు. సింగరాచార్యులు, జగన్నాథాచార్యులు మానవాంకిత కృతి విషయ ప్రస్తావన చేయకున్నను, ద్వితీయ వేంకట నరసింహాచార్యులు మాత్రము ప్రతి రచనయందును దీనిని గూర్చి వ్రాసెను. పోతనగారి 'బాల రసాల సాల' పద్యము ననుకరించుచు—

'కలిమి నెలంత కోడలగు కావ్య సుగంధిని రాజ కోటికై
యలరుచు నమ్మి భాడ్గపు నౌచ చరించుట కంటె సత్కవుల్
మెలకువ హాలికుల్ నగుట మేలది యంతటి కోపకున్నచో
నిలపయి భిక్షమెత్తుకొన హెచ్చు నిజోదర పోషణార్థమై' (జనక-1-10)

అని నరాంకిత మొనర్చు కవులను తీవ్రముగా నిందించినాడు. దీనియందు వారు 'ఖాడ్కావు లైనారు'. ఇది 'ఖాద్ ఖావ్' అని తెలంగాణములో అతి నీచముగా వాడబడు ఒక తిట్టు.

తన యభిప్రాయము ననుసరించి సకల శబ్ద వాచ్యుడైన సర్వేశ్వరునకు అర్పితము చేసిన కావ్యమే శ్రేష్ఠమైనది. దానిని గూర్చి —

'హరి నామాంకిత కావ్యం
బరయఁగ నిహ పరములకు నతి సౌఖ్య మగున్
నర నామాంకిత కావ్యం
బరయఁగ నిహ పరములకు నతి దూష్య మగున్!' (జనక-1-12)

అని తెల్పెను. మహా భాగవత శిఖామణి పోతన గారు—

'హరినామ స్తుతి చేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచి భ్రాజితమైన మానస సరః స్ఫూర్తిన్ వెలుంగొందు, శ్రీ
హరి నామ స్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్య దుర్మలినవత్కాకోల గర్తాకృతిన్'
(1 వ - స్కం. 9 ప.)

హరి నామ స్తుతి గల కావ్యము, అది లేని కావ్యము ఎట్లుండునో తెల్పిరి. వేంకట నరసింహాచార్యుల రచనపై ఈ పద్య ప్రభావమే గాక, ముఖ్యముగ తన గ్రంథము లన్నింటిని దైవాంకిత మొనర్చుటకు నమ్మాళ్వారుల సూక్తి కూడ కారణము.

'తిరువాయ్ మొజి' యందు సర్వ ప్రాప్యుడైన శ్రీమన్నారాయణునకు గాక మానవ మాత్రులకు కృతి సంకితము చేయుట కృతికర్తకును అతని కవిత్వమునకును దోషము సంభవించు నని - తృతీయ శతక నవమ దశక మందు 10 వ పాశురములలో ఈ విషయము హెచ్చరింపబడినది. వానిలో- 'వమ్మిన్ పులవీర్ నుమ్మై వరుత్తికై- కెయ్తుమ్ మినో... తిరుమాలుక్కు- చ్చేరుమే' (6 వ పాశురము)—

"ఓ బుద్ధిమంతులారా! నా పలు కాంకింపుడు. మీరు కష్టించి కూలి చేసి బ్రతికినను మంచిదే గాని తుచ్ఛులకు మీ కవిత నర్పింపకుడు. మీ కవితా గుణముల కలరి విమ్మ ధన ధాన్యములతో తులతూగునట్లు చేయగల సంపన్ను లెవ్వ రెవ్వరును లేరు. శ్రియఃపతి కాక మిగిలిన దేవతలను మీరు స్తుతించినను మీరు వారిపై ఆరోపించిన గుణములు వారియందుండవు గాన ఆ కవిత్వము కూడ అట్టి గుణములు గల శ్రియఃపతికే చెందును"*8 అను ఆళ్వారుల శ్రీసూక్తిని గమనించిన వీరు కృతిని నరాంకితమొ ట్లొనర్తురు ?

శ్రీవైష్ణవాభిమాని యైన సంకుసాల నరసింహ కవి కృతులను నరాంకిత మొనర్చు పద్ధతిని గర్హించి రాజులను 'పిశాచ జనులు', 'జీవ చ్ఛవములు'-ఇత్యాదిగా పేర్కొని (1-24) నరాంకిత రచనను గూర్చి యిట్లనెను :

'నర గుణాంకిత మయ్యెనే సరస కృతియు
దూష్యమగు బుని ధృత గత దుగ్ధ మట్లు
హరి గుణాంకిత మయ్యెనే నసదు కృతియు
హార సూత్రంబు గతి హృదయంగమంబు!' (1-26)

తాళ్ళపాకవారు, మరి కొందరు కావ్యముల నరులకు కృతి నొసంగుటను గర్హించిరి. భగవద్భక్తులైన మరింగంటివారు 'నిజ దార సుతోదర పోషణార్థము' దారు లనుభవించినను దైవభక్త మగు కవితా లతాంగిని 'ప్రభు దురాత్ముల' చేతిలో పెట్టలేదు.

జగన్నాథాచార్యుల నుండి ఆధునికుల వరకు గల ఈ వంశ కవులు కవిత్వమును మహోత్తమ కళగా భావించి, తమ రచనలు సర్వ జన సుబోధకములుగా నుండవలెనని తలంపున ప్రజల వాడుకలో గల పదములను అధికముగా గ్రంథస్థము చేసి వానికి ప్రామాణికత గల్పించిరి. తెలంగాణ పాంచలి (ముఖ్యముగా నల్లగొండ మహబూబ్‌నగర్ జిల్లాల) మాండలికములను, ఉర్దూ పదములను ప్రయోగించి శ్రీవైష్ణవ సంప్రదాయ పారిభాషిక పదములను చేర్చి, సాహితీ పరముగా వానికి వన్నె కూర్చిరి

సంస్కృతాంధ్ర భాషలయందు దపార పాండితీ మూర్తులైన వీరు తమ రచనలయందు హృద్యమైన శైలికి తావిచ్చి వర్ణనా నైపుణ్యముతో కృతుల నిర్మించినారు.

వీరియందు నిరోష్ఠ్య - శుద్ధాంధ్ర, నిరోష్ఠ్య - అచ్చాంధ్ర కావ్యకర్త లున్నారు. 'ఆంధ్ర కావ్య సాహితి' యందు ప్రబంధములను గూర్చియు 'లాక్షణిక మర్యాద' యందు పద ప్రయోగము, ఛందస్సు మొదలగు వానిని గూర్చియు తెలుపబడినది.

## సూచికలు :

1. తెలుగు కావ్యావతారికలు - 3 - 10 పుటలు
2. 'చైతన్య లహరి' - శ్రీకృష్ణదేవరాయలు గూర్చి పుట్టపర్తి వారి వ్యాసము, 150వ పు.
3. 'చైతన్య లహరి' - శ్రీకృష్ణదేవరాయలు గూర్చి పుట్టపర్తి వారి వ్యాసము 150వ పు.
4. విష్ణువు ధరించు కౌస్తుభము జీవ తత్త్వమును అభిమానించునది) పంచాయుధములలో 'చక్రము' - మనస్తత్త్వము, 'శంఖము' - తామసాహంకారము, 'ఖడ్గము' - సమ్యగ్ జ్ఞానము, 'గద' - బుద్ధి తత్త్వము, 'ధనుస్సు' - సాత్త్వి కాహంకా రాభిమానత్వములుగా ప్రసిద్ధ మైనవి.
5. తాపము (శంఖ చక్ర ముద్రా ధారణ), పుండ్రము, నామము, మంత్రము యాగము - అను నివి పంచ సంస్కారములు.
6. తాళ్ళపాక వారి రచనలయందు 'ఆచార్య స్తుతి' నియత మైనది.
7. వైచరాజు వెంకట నాథుని పంచతంత్రమున ఇట్టి పద్యము కలదు. వీరి యందరికి మూలము 'సకల కథా సార సంగ్రహము'లోని ఈ శ్లోకము.

   'నో ఘూర్జరీ స్తన ఇవాలితరాం నిగూఢః
   న ద్రావిడీ స్తన ఇవాతితరాం ప్రకాశః।
   అర్థో గిరా మపిహితః పిహితశ్చ కశ్చిత్
   సౌరభ్య మేతి మహారాష్ట్రి వధూ కుచాభః'॥ (శ్లో. 850

8 'శ్రీ శఠకోప వాఙ్మధ' స్తుతీయ శతకము - సుధామాధురి వ్యాఖ్య

# 2

# రచనా విశేష స్వరూపము

## నిరోష్ఠ్య సాహితి :

తెలుగు సాహిత్యమున ప్రసిద్ధమగు చతుర్విధ కవితలలో 'నిరోష్ఠ్యము' శబ్ద చిత్ర రచనగా*[1] చెప్పబడినది.

నాచన సోమన **ఉత్తర హరివంశము** నందు—

'చని చని గాంచె నంత... సంగత శృంగ రథాంగ నత్తటిన్' (1-108) అని యొక పద్యము వ్రాసి నిరోష్ఠ్యమును గ్రంథస్థ మొనర్చిన తెనుగు కవులలో ప్రథము డైనాడు.

తెలుగులో ప్రప్రథమముగా కావ్య మంతయు నిరోష్ఠ్యముగా రచించిన కవి సింగరాచార్యులు. ఆయన '**దశరథ రాజనందన చరిత్ర**' ప్రారంభమున—

'మును రామాయణము న్నిరోష్ఠ్యముగ నింపుల్ మీఱ శాకల్లె మ
ల్లన దా సంస్కృత భాషఁ జేసె నన నాలాగున్ దెపుల్ నిండఁగా
వినుటే గాని ధరిత్రిలో నిజముగా వీక్షింపలే దిట్టిదేఁ
దెనుఁగుం జేసెద భూమిపై కవిజనాధ్యక్షుల్ (ధీరుల్) ప్రశంసింపఁగన్'

1-32

అని శాకల్లె మల్లన నిరోష్ఠ్యముగా సంస్కృతమున రామాయణమును రచించ తన నాటికి అది నామ మాత్రావశిష్ట మైనట్లు తెల్పి, 'కవిజనాధ్యక్షుల్' ప్రశంసించు నట్లు తాను తెలుగున నిరోష్ఠ్య రామాయణము వ్రాయుచున్నా ననెను.

ప్రథమ ద్వ్యర్థి కావ్యకర్త యైన పింగళి సూరన సైతము రాఘవ పాండవీయమున—

'రెండర్థంబుల పద్య మొక్కటియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం; దద్గతిఁ గావ్య మెల్ల నగునే నోహో! యనం జేయుదే
పాండిత్యంబునఁ నందునుం దెనుఁగు కబ్బం బద్భుతం బంద్రు, ప
క్షుం దెవ్వా డిల రామ భారత కథల్ జోడింప భాషాకృతిన్?' 1-10

అని తెల్పి, తనకు పూర్వము భీమన ద్వ్యర్థి కావ్యమును చెప్పినట్లు ప్రతీతి గలదు గాని 'అంఋ నొండేమియు నే యెఱ న్నిలుచు పెవ్వరుగాన' రనెను. (రాఘవ పాండవీయము 1-11).

ద్వ్యర్థియందు సూరన రాఘవ పాండవీయము వలెనే నిరోష్ఠ్యమున సింగరాచార్యుల దశరథ రాజ నందన చరిత్ర ప్రప్రథమ రచన యైనది.

ఒక నూతన ప్రక్రియయందు గ్రంథ రచన మొనర్చు కవి తనకు పూర్వ మీ పద్ధతితో వచ్చిన కృతుల పరిశీలించి రచనోద్యుక్తుడగుట సహజము సింగరాచార్యుల వరకు తెనుగున నిరోష్ఠ్య కావ్యములు లేవు. అప్పటప్పట గల ఈ పద్ధతి పద్యములు, సంస్కృత సాహిత్య మందు అరుదైన నిరోష్ఠ్య రచనల పరిశీలన ప్రభావము ఆచార్యుల వారి 'దశరథ రాజ నందన చరిత్ర'కు ప్రోత్సాహకమై యుండును.

ప్రప్రథమ నిరోష్ఠ్య కృతి యైన దీనియందు సింగరాచార్యులు నిరోష్ఠ్య నియమమున అనుసరించ వలసిన పద్ధతుల తెల్పలేదు కాని **'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కళ్యాణము'**న మాత్రము —

'అరయ 'క గ చ జ ట డ త ద' నా 'య ల స హ
ర ద్వయమె' గాని యొండక్షరముల నొలుపు
మఱియు నొత్తొత్వములు కొమ్ము మాముడియును
వలవ దామీద సుర భాష నిలుప రాదు' 1-88
అని అచ్చతెనుగున కవసరమగు నిరోష్ఠ్య పద్ధతిని తెల్పెను.

అనోష్ఠ్యము లనగా ఉచ్చారణ సమయమున పెదవితో సంబంధము లేకనే పలుకబడు నట్టి వర్ణములు.

సంస్కృతమున **'సిద్ధాంత కౌముది'** అక్షరోత్పత్తి స్థానముల తెల్పు సపుడు 'ఉపూపధ్మానీయానా మోష్ఠౌ' అనెను. ఉ, ప, ఫ, బ, భ, మ, ఉపధ్మానీయము (ప, ఫలకు ముందుండు అర్థ విసర్గ సదృశము ꞉ప, ꞉ఫ) అను నీ యక్షరములు ఓష్ఠ్యములు; వ కారము దంతోష్ఠ్యము.

ప, ఫ, బ, భ, మ, వ అనునవి పెదవుల సాయమున పలుకబడుటచే ఇవియే ఓష్ఠ్యము లని భావింప బడుచున్నవి. కాని వర్ణోత్పత్తి స్థానముల [illegible] 'ఉ ఊ' లు కూడా ఓష్ఠ్యములే యగును. వీని ననుసరించి ఉత్వ విశిష్ట వర్ణ[illegible] ములు సైతము ఓష్ఠ్యములే! వీనికి తోడు బిందు పూర్వకము లైన అంతస్థములు (య, ర, ల, వ), ఊష్మములు (శ, ష, స, హ) కూడ ఇందులో చేరును.

వీని ప్రకారము అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఐ, ఋ, ౠ, క, ఖ, గ, [illegible], ఙ, చ, ఛ, ఛ, జ, ఝ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, [illegible], ష, స, హ, య, ర, ల, ళ, ఱ అను అక్షరములు అనోష్ఠ్యములు.

నిరోష్ఠ్యమునకు లక్షణము చెప్పిన వారియందును, నిరోష్ఠ కావ్య క[illegible] యందును వీని విషయమున కొంత భేదాభిప్రాయము కన్పించుచున్నది. [illegible] మహాకవి తన **"దశ కుమార చరిత్ర"** యందు 7 వ ఉచ్ఛ్వాసమున నిరో[illegible] రచన మొనర్చెను*[2] (160 వ పుట) దీనిలో బిందు పూర్వక స కారము[illegible] కలవు. ఇవియే గాక 'ఉ, లు 2, వ లు 2, 1 భ, 1 ప' ఉన్నవి దండి దృష్టి[illegible] బిందుపూర్వక అంతస్థములు ఊష్మములు నిరోష్ఠ్యములైనవే!

తెనుగు లాక్షణికులలో చిన్నకోట పెద్దన కావ్యాలంకార చూడా[illegible] (6-44) యందు —

'పంచమ వర్గాక్షరముల
వంచించి హితోచితార్థ వంతంబులు గా
పించిన కబ్బము వీనుల
కంచితమై యది నిరోష్ఠ్య మన నొప్పారున్'

అనినాడు.

దీనియందు బిందు పూర్వక 'శ', 'ష', 'స', 'హ' లు, 'వ' కారము, 'ఛ', 'ఢ', 'ఞ', 'ఓ', 'జౌ' - వీనిని కూడిన హల్లులు తెల్పబడలేదు.

ఇతని నిరోష్ఠ్య లక్ష్యమైన 'చాళుక్య క్షితి నాథు...' (6-45) పద్యము నందు 'ఓ'కారములు 3, 'ఉ'కారములు 18 కలవు.

కావ్యాలంకార సంగ్రహము (4-89) నందు 'ఓష్ఠ్య నిరోష్ఠ్య సంకరము'న కుదాహరణముగా నీయబడిన 'భూనాథోత్తము లంభ భంజన హరీ భోగాభిరామ క్రియా...' పద్యమున 'నో', 'నూ'లు అనోష్ఠ్యములుగా పరిగణింపబడినవి*3

అప్పకవి (4-89) పా. ఫా. బా. భా. మా. వా. యను ఆరు లిపులు లేనిది నిరోష్ఠ్యమని తెల్పి, లక్ష్యముగా 'సర హర్యక్ష దయాకర...' పద్యము నొసంగెను. దీనియందు ఓష్ఠ్యములుగా పరిగణింపదగిన 'రు', 'తు'లు కలవు (గరుడతురంగ...)

చిత్రకవి పెద్దన లక్షణ సార సంగ్రహములో (8-181-182)—

కలయ 'నో', 'జా', లుకార, వకారములను
నల 'ప' వర్గంబు మాని మిగిలిన లిపుల
నమర పద్యంబు రచియింప నది నిరోష్ఠ్య' మని చెప్పి

'తనరంగ నే దలంచెద'- పద్యమును లక్ష్యముగా నిచ్చెను. ఇతర లాక్షణికులు చెప్పని 'ఒ', 'ఓ', 'జౌ', 'ఉ' 'ఊ'లను పెద్దన తెల్పినను, బిందు పూర్వక 'శ', 'ష', 'స', 'హ'ల ప్రసక్తి లేదు.

సింగరాచార్యులు 'సీతా కల్యాణము'లో తెల్పిన (1-38) 'అరయ' 'క గ చ జ' అను పద్యము నందు 'ప', 'బ', 'వ'లు, 'ల' ద్వయము లేవు. 'మాముడి' యను దాని కన్న 'ప, బ, మ, వ'లు అగపడును. దీనియందు అచ్చ తెనుగున కవసరములగు నిరోష్ఠ్యముల మాత్రమే చెప్పుట వలన 'శ,ష,స, హ'ల ప్రసక్తి లేదు.

## దశరథ రాజ నందన చరిత్ర - నిరోష్ఠ్యము :

1917 వ సంవత్సరమున ప్రథమముగా ముద్రింపబడిన దశరథ రాజ నందన చరిత్రను అప్పటికి వారికి లభించిన తాళపత్ర గ్రంథములు ఆధారముగా పరిష్కరించిన గ్రంథ సంపాదకులు ప్రథమాశ్వాసము 56 వ పద్యమునుండి 76 వ పద్యము వరకు కుండలీకరణము (బ్రాకెట్టు) నుంచి "ఈ గురుతుల మధ్య నున్న పద్యము లక్కడి కథ శిథిలమై పోవుటచే దిరుగ వ్రాయంబడియె, నిందలి తప్పు లొప్పులు పరిగ్రహింప వేడెద" - ఇట్లు లేఖన కర్త, అని తెల్పిరి. అప్పటి వీరి పరిష్కరణలో కేవలము 'ప-ఫ-బ-భ-మ-వ'లు మాత్రమే ఓష్ఠ్యములుగా గణింపబడినవి. నిరోష్ఠ్య నియమ విరుద్ధము లగు వర్ణములు అధికముగా చేరినవి. వీనికి తోడు ముద్రణ స్ఖాలిత్యములును గలవు.

ఆంధ్ర ప్రదేశ సాహిత్య ఎకాడమీ వారు ఈ గ్రంథమును రెండు పర్యాయములు (1971, 1979) ముద్రించిరి. 1971 నాటి ముద్రణలో ప్రథమ ముద్రణ ప్రతి పాఠము లధిక భాగ మట్లే యున్నను, 1979 ముద్రణలో వీని యందలి కొన్ని పాఠములు సవరింప బడినవి.

**'తెలుగులో నిరోష్ఠ్య రచన - దశరథ తనయ 'చరిత్ర' అను సిద్ధాంత** వ్యాసమును సమర్పించి 1985వ సం.న ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి పి.హెచ్.డి. పట్టము నందిన డా॥ వి. రత్నయ్య గారు తమ సిద్ధాంత వ్యాసమున దశరథ రాజ నందన చరిత్రయందు నిరోష్ఠ్య నియమము పాటింప బడని పదముల జాబితా నిచ్చిరి. వానిలో పదాది, పదమధ్య, పదాంత ఉత్వ విశిష్ట వ్యంజనసహిత పదములు 180, బిందు పూర్వక సకార యుక్తపదములు 50 కలవు. వీరు 1979 నాటి ముద్రణ ప్రతిని పరిశీలించినచో ఈ పదముల సంఖ్య చాల భాగము తగ్గెడిది.

వీరి సిద్ధాంత వ్యాసమునందలి కొన్ని పదములు వానికి సవరణలు. ఈ పదములు 1979 నాటి ప్రతిలోనివి—

| సిద్ధాంతవ్యాస మందలి పాఠములు | చూపిన సవరణలు |
|---|---|
| 1-46 బలాహిత | ఘబాహిత (ము.ప్ర) తలాహిత (తా.) |
| 1-124 సంరాజిత | సద్రాజిత ,, పాఠాంతరము. |
| 4-58 శూకలు | శేకలు - కాని, ౪. 65-86 పద్యములు 'తా.'లో లేవు. |
| 4-96 సుకట | 'కటక' (ము.ప్ర.) పాఠాంతరము. |
| 5-304 నుండఁగ | 'నిండఁగ' పాఠాంతరము. |

పై రిచ్చిన పదములలో అనేకములకు 'పుట్‌నోట్స్'లో సవరణ లున్నవి. మరి కొన్ని ప్రథమ ముద్రణలో సంస్కరింపబడని, తాటాకు పుస్తకములో లేని పదములు.

ముద్రిత ప్రతికి - తాళపత్ర గ్రంథ పాఠముల భేదము తెలియుటకు ఒక ఉదాహరణ : ముద్రిత ప్రతిలో—

'సురలను దోడుకొంచు నరి సూదనుఁడై తనరారు నిందిరా
ధరుఁడు జెలంగు...' అను చంపకమాల స్థానమున (1-86).

తాళపత్ర ప్రతియందు సీస పద్యము-

రాకా శశాంక నీరంధ్ర చంద్రిక లెల్లఁ
గలయ నేకాకృతి గాంచె ననఁగ
నాళీక గేహినీ నాథ దేహచ్ఛాయ
సకలాశ లందంద సాగె ననఁగ... ఇత్యాది పలుకు. ఇప్పటి ముద్రిత ప్రతిని తాళపత్ర గ్రంథముతో సరిపోల్చి చూడ, పంచి పాఠములే గాక కొన్ని పద్యములకు బదులు వేరే పద్యము లున్నవి. ము.ప్ర. లోని కొన్ని (అధిక) పద్యములు దీనియందు లేవు.

ఈ ప్రకారము సింగరాచార్యులవారి రచించిన రెండు నిరోష్ఠ్య రచనలను పరిశీలింపగా 'ఉ', 'ఊ'లు ఉత్వ విశిష్ట వ్యంజనాక్షరములు కూడ ప్రయోగింపబడలేదని నిర్ణయింపవచ్చును. ఇటీవల వచ్చిన 'సీతా రాఘవ చరిత్ర' *4 యందు కేవలము ప, ఫ, బ, భ, మ, వ లు మాత్రమే ఓష్ఠ్యములుగా భావింపబడినవి.

**వ్యాప్తి :** దశరథ రాజ నందన చరిత్ర తరువాత నిరోష్ఠ్య నియమముతో పాటు మరి కొన్ని నియమములు గల రచనలు బయలుదేరినవి. ఉదా - తంగెడ గంగనామాత్యుని **'అచ్చాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన హరిశ్చంద్ర నలోపాఖ్యానము'** (ము. 1898), శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి, **శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిరూష్మ నిర్వచ నైకాదశాక్షరీ శాకుంతలము** (ము. 1936).

సంస్కృతమున అలంకార శాస్త్రములయందే గాక కొన్ని కావ్యముల యందును మచ్చునకు నిరోష్ఠ్య రచన చేయబడినది. గ్రంథమున అధికముగా (ఒక ఉచ్ఛ్వాసమున) నిరోష్ఠ్యముగా రచించిన వారిలో దండి ముఖ్యుడు. తరువాత ప్రత్యేక గ్రంథములు వచ్చుటే గాక శాసనములందును ఈ ప్రక్రియ వ్యాప్తి చెందినది.

## కావ్యములు

1. నిరోష్ఠ్య రామాయణమ్ — శాకల్లె మల్లన
2. సుగంధి కుంతలా పరిణయమ్*5 — స్వామి దీక్షితులు (అము.)
3. కంస నిధనమ్*6 — శ్రీరామ కవి
4. నిరోష్ఠ్య రామాయణమ్*7 — కవికంఠీరవ కృష్ణమాచార్యులు (ము.)

## శాసనములు

మహబూబ్‌నగర్ జిల్లా బూదపుర **శాసనము***8 నందు కన్పించు చిత్ర కవితా రీతులలో నిరోష్ఠ్య విభాగము కూడ కలదు. అది 'కేదారాతత శీలి శాం బనహ' - ఇత్యాది అసమగ్ర శ్లోకము. శాసన కాలము క్రీ. శ. 1216.

సిద్ధేశ్వర గుట్ట **శాసనము** - పూర్తిగా నిరోష్ఠ్యము, లఘుకృతి*9.

# 2. శుద్ధాంధ్ర నిరోష్ఠ్యము

సింగరాచార్యులు దశరథ రాజ నందన చరిత్రనే గాక 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము'ను కూడ వ్రాసి తన ప్రతిభా పాటవమును నిరూపించుకొనినాడు.

సంస్కృత సమ పదముల విసర్జింపగా మిగిలిన స్వల్ప పదములు అచ్చ తెనుగు రచన కాధారములు. అచ్చ తెనుగు రచనయే శ్రమ కల్గించు ననిన, దీనికి తోడు 'నిరోష్ఠ్యము' చేరిన మరింత శ్రమ యగును.

సంస్కృతాంధ్ర వర్ణమాల యందు అనోష్ఠ్యములుగా పరిగణింప బడిన అక్షరములే స్వల్పము. వీని నుండి అచ్చ తెనుగున అనోష్ఠ్యములు మరింత తక్కువ. పరిమిత మైన యీ వర్ణములతో కావ్య రచన చేయుట కవికి కత్తిమీద సాము వంటిది.

అచ్చ తెనుగు నిరోష్ఠ్యమున చేరు అక్షరములు - అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఐ, క, గ, చ, చ̄, జ, జ̄, ట, డ, త, ద, న, య, ర, ఱ, ల, స, హ- అనునవి.

**'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము'** నందు సింగరాచార్యులు శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నియమమును గూర్చి-

'అరయ 'క గ చ జ ట డ త ద' నా 'య ల స హ
ర ద్వయమె' గాని యొండక్షరములు నొంటవు
మఱియు నౌ త్వోత్వములు కొమ్ము మాముడియును
వలవ దామీఁద సురభాష నిలుపరాదు' (1-38)

అని తెల్పి ఇది శ్రమైక సాధ్యము కావుననే —

'తఱుమక ప్రతిపదముల - ప (తఱుచు' 'తా.' పాఠము)
ల్మఱు నరయుచు సముచితోక్త మార్గంబులనున్
దెలుఁగులఁ దెలియుచు నర్థం
బెలుఁగఁగఁ దగు నుభయ సంధు లెనయుట కతనన్' (1-37)

అని ఈ పద్ధతిలో అచ్చతెనుగు నిరోష్ఠ్య రచన అర్థ మగు ననెను.

సింగరాచార్యులు చెప్పిన పద్ధతులనే 'చిలుక పడగ జేని పేరణము'న వేంకట నరసింహాచార్యులును తెల్పినాడు. ఈయనగారి నిరోష్ఠ్య కృతి కానరాదు. కేవలము అచ్చ తెనుగును గూర్చియే కలదు.

అచ్చాంధ్ర నిరోష్ఠ్య కావ్య రచన ఎంత శ్రమ కలిగించునో తెలియుట కొక ఉదాహరణ :

కవిసింహ పోకూరి కాశీపతి గారు **'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన హరిశ్చంద్రోపాఖ్యానము'**ను 1921 వ సంవత్సరమున ముగించి దానిని గద్వాల రాజా వారికి అంకితము చేయు తలంపుతో వెళ్ళగా, రాజావారు "గద్వాల సంస్థానమున సీతారామ భూపాలురు మరికొంద రున్నారు గ్రంథాంకిత పద్యమున ప్రత్యేకముగా దాని నంకిత మొసంగు వత్సరము వచ్చునట్లు పద్యము వ్రాయవలసిన" దని పరీక్ష పెట్టిరట. కవిగారి కిది విషమ పరీక్ష యైనది. అచ్చ తెనుగు, నిరోష్ఠ్యము రావలెను. శాలివాహన, విక్రమార్క, ఫసిల్-దుర్మతి పందొమ్మిది వందల ఇరువది ఒకటి. వీనిలో ఓష్ఠ్య వర్ణములు (బోల్డ్ టైపులో ఉన్నవి) వచ్చును. అప్పుడు—

"తెల్ల లేడిగా దక్షి కల్గగా దయి జేయ (౧౯-౨౧)
నేను క్రీస్తు సనిన యేండ్ల నెన్న
నిండు తొంటి యంజక్రింద నాల్గంకెల
యేడు తొడరి తీర్చినాడ దీని" (1-63)

అని చెప్పిరి. అంజ = పాదము. తొంటి నాల్గంకెల యేడు = మొదటి పాదమున గలనాల్గంకెలలో (౧-౯-౨-౧) క్రీస్తు శకము చెప్పబడినది. అది 1921, దీనికి పండితు లాశ్చర్య పడి కవి చాతుర్యమును కొనియాడి గ్రంథమును రాజా వారి కంకిత మిప్పించినారు.*10

ఈ ప్రక్రియ ఇట్టి శ్రమైక సాధ్యమైనది కావుననే అచ్చాంధ్ర నిరోష్ఠ్య కావ్య కర్తలు తమ రచనల నియమమును గూర్చి వివరించిరి.

సింగరాచార్యులు, వేంకట నరసింహాచార్యులు తమ అచ్చ తెనుగు కృతులయందు 'సురభాష నిలుప రాదు' అని చెప్పినను 'పేళ్ళు తెలియుట కొఱకై' దాని నుపయోగించినారు. ఇట్టి సంస్కృత పదములు సింగరాచార్యుల రచనయందు 50. **'విలువ పడగ తేని పేరణము'**న 80 కలవు (ఉదా - సీత, ఋష్యశృంగ, దుర్యోధన, హస్తిన)

నిరోష్ఠ్యము, శుద్ధాంధ్ర నిరోష్ఠ్యము - ఈ ఉభయ పద్ధతులకు చెందిన కృతులు కథా వస్తు పరముగ నిట్లు కలవు.*11

రామ కథా పరములు: 13, హరిశ్చంద్ర: 5, నల: 2, కుశ: 1, నృగ:1, సౌరంధ్రీపరి: 1, శాకుంతలము: 1, శతారి చరిత్ర: 1. యతిరాజ చరిత్ర: 1,

శతకములు: 5, నక్షత్రమాలిక: 2, మొత్తము 32; సంస్కృత నిరోష్ఠ్యములు 4 కలిపిన - అవి 37 అగును.

ఇంకను అముద్రితములుగను, అజ్ఞాతములుగను ఉన్న సంస్కృతాంధ్ర నిరోష్ఠ్య కృతు లెన్నియో!

లభించిన వానియందు రామ కథా రచనలే యధికము. ఇది సింగరాచార్యులకు ముందు వెనుకల గల నిరోష్ఠ్య సాహితి!

## సూచికలు :

1. చతుర్విధ కవితల గూర్చి చూ. 'తెలుగు ఛందో వికాసము, 209-225 పు. మరియు 'లక్షణ శిరోమణి' యందు' 'చిత్రకవితా నిర్దేశము' 3-247.
2. రాజ కన్యా సంసర్గముచే మంత్రగుప్తుని పెదవులు దంత క్షతములై నందున తన సంచార విశేషములను నిరోష్ఠ్యముగా చెప్పినాడు.
3. ఈ పద్యమున 'జంభభంజన' బదులు 'జంభజంభన' అనిన 'ఓష్ఠ్య నిరోష్ఠ్య సంకరము' కుదురును. ఒక ఓష్ఠ్యాక్షరము వెంటనే ఒక నిరోష్ఠ్య అక్షరము వచ్చుట ఓష్ఠ్య నిరోష్ఠ్య సంకరము. ఈ పద్ధతి 'జంభ భంజన' అనినప్పుడు కుదురదు.
4. శ్రీ మోతుకూరి సత్యనారాయణ 'సీతా రాఘవ చరిత్రము'న ఈ పద్ధతి కలదు. చూ. 'సీతా రాఘవ చరితము - ఒక సమీక్ష', 'సమాలోచన' పత్రిక (రాజమండ్రి) - సం. 1 సం. 4, పుటలు 32-34, తేది. 1-11-1970, రచన శ్రీరంగాచార్య.
5. అడయార్ గ్రంథాలయ కేట్లాగు Vol. V No. 1008 D. C.
6. Bhandarkar Oriental Research Institute No. 46.
7. విజ్ఞాన సర్వస్వము - 4 వ భా. తెలుగు సంస్కృతి, 1170 వ పుట.
8. తెలంగాణ శాసనములు, 1 వ భా. శాసన సంఖ్య 21, పుట 58.
9. 'మానవల్లి కవి - రచనలు' 372 - 374 పు.
10. 'బ్రహ్మశ్రీ పోకూరి కాశీపత్యవధానులు గారు' డా॥ హరి శివకుమార్ వ్యాసము - 'అక్షరార్చన' 196 వ పుట.
11. వీనిని గూర్చిన వివరములకు 'దశరథ రాజ నందన చరిత్ర' - 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము' - పీఠికలు చూడనగును.

# 3. అచ్చతెనుఁగు

శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము, చిలువ పడగ జేని చరితము మఱింగంటి కవుల శుద్ధాంధ్ర కావ్యములు. శుద్ధాంధ్ర మనగా అచ్చ తెనుగను తాత్పర్యముతో వీరు వ్యవహరించినారు. కాని లాక్షణికు లెవ్వరును 'శుద్ధాంధ్రము' ను 'అచ్చ తెను' గని చెప్పినట్లు కన్పింపదు.

అప్పకవి శుద్ధాంధ్రమును చెప్పినాడు కాని అది అచ్చ తెనుగు కాదు. 'చింతామణి' సంప్రదాయము ననుసరించి అప్పకవి భాషను తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్య భేదములతో నాలుగు విధములుగా చెప్పి, వీనిలోని దేశ్యమును రెండుగా విభజించినాడు.

అవి : 1 శుద్ధాంధ్రము, 2. అన్యదేశజాంధ్రము.

'ఆంధ్ర దేశ పుర స్థాయు లైన సకల
జనములకు మఱుంగు దేశంబు లేక
తేట తెల్లమిగాఁ బల్కు మాట లెల్ల
నవని శుద్ధాంధ్ర దేశ్యంబు లనఁగఁ బడును.' 1-106

ఇది శుద్ధాంధ్రమునకు అప్పకవి నిర్వచనము. ఈ నాలుగు విభాగములలో గాక అచ్చ తెనుగును అప్పకవి విడిగా నిట్లు చెప్పినాడు.

'నెలకొను సంస్కృత తత్సమ
ములు దొరలక తజ్జ దేశ్యముల మాటను సం
ధిలి కేవలాంధ్రములు నా
నలరుఁ గృతుల నచ్చ తెనుఁగు లాంధ్రు తెలుఁగునన్' 1-110

సులభముగా చెప్పినచో 'సంస్కృత సమేతరం బయిన యీ భాష యచ్చ యనంబడు' (ఆచ్ఛిక-1 వ సూ.) అనిన సూరి సూత్రము రూపొందును. చిన్నయ సూరి కూడా అచ్చ తెనుగును భాషా విభాగములలో చేర్చలేదు.*[1] చింతామణి సూత్రము ననుసరించి బాల వ్యాకర్త భాషా విభాగములను తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్యము లొనర్చినాడు. ఇచ్చట గమనింపవలసిన అంశము - అచ్చ తెనుగులను శుద్ధాంధ్రము అని గాక కేవలాంధ్రము లని అప్పకవి యనుటలో కేవలాంధ్రములకు, శుద్ధాంధ్రములకు భేదము నెంచినట్లు కన్పించును.

భాషా విభాగములో కేతన సంప్రదాయము కూడ ఒకటి యున్నట్లు కన్పించును. ఈయన అచ్చ తెనుగుతో కలిపి భాషను ఐదు రకములుగా విభజించినాడు.

> 'తత్సమంబు నాగ, తద్భవం బన, నచ్చ
> తెనుఁగు నాఁగ, మఱియు దేశ్య మనఁగ,
> గ్రామ్య భాష నాఁగఁ గల వైదు తెలుఁగులు...' -19

కేతన ననుసరించి విన్నకోట పెద్దన, కూచిమంచి తిమ్మకవి మొదలైన వారు అచ్చ తెనుగును కూడ చెప్పిరి. కాని దేశ్యమునకు అచ్చ తెనుగునకు భేదమును చెప్పలేక పోయినారు. వారు అచ్చ తెనుగులుగా, దేశ్యములుగా ఉదాహరించిన పదములలో పలుచోట్ల వ్యత్యాసము లున్నవి. మొత్తము మీద పరిశీలించినచో కావ్యములందు ఉపయోగింప బడునట్టి - నిత్య వ్యవహారమున అంతగా లేనట్టి దేశ్య పదములు అచ్చ తెనుగులుగా భావింపబడినట్లు కన్పించును.

ఈ సందర్భమున అప్పకవి చెప్పిన 'తెనుఁగు మఱుఁగులు','ప్రెంఁదెనుఁగు' అనునవి కూడ గమనించ దగినవి. అప్పకవి యిచ్చిన ఉదాహరణములను బట్టి సంస్కృత సమస్త పదములకు అర్థమైన దేశ్య పదముల సమాసములు 'తెనుఁగు మఱుఁగు'లని చెప్పవచ్చును. ''అబ్ధి మేఖల కుదయించి నట్టి తనయ'' అనుదానికి ''కడలి మొలనూలి చేడియ గనిన పడుచు.'' (అప్ప - 1-112) అనినచో అది 'తెనుఁగు మఱుఁగు'. నిత్య వ్యవహారమున కడలి మొదలైన పదము లుండవచ్చునేమో కాని ఈ విధమైన సమాసకరణ ముండదు. కేతనాదుల దృష్టితో చూచిననిది 'అచ్చ తెనుగు'కావచ్చును.

లాక్షణికుల మతములో అచ్చతెనుగు స్వరూపము స్పష్టాస్పష్టముగ నున్నను*శి కవుల విషయమున మాత్రము అస్పష్టత లేదు. కాని ఒకటి నిజ మనిపించును. అచ్చతెనుగు కావ్యము వ్రాయుట అనునది ఒక విశేషముగా వారు గ్రహించినా రనగా, అచ్చతెనుగు సాధారణ వ్యవహారమునకు భిన్నమును,దూర మైనదియు అనుట స్పష్టము.

అచ్చ తెనుగు రచనను ఒక ప్రత్యేక ప్రక్రియగా భావించిన ఈ కవులు అప్పకవి చెప్పిన పద్ధతిలో సంస్కృతస మేతరమైన భాష నంతటిని అచ్చ తెనుగగా స్వీకరించిరి. చిన్నయసూరి 'ఋ, ౠ, ఌ, ౡ, ః, ఖ, ఛ, ఠ, థ, ఫ, ఘ, ఝ, ఢ, ధ, భ, ఙ, ఞ, శ, ష లు సంస్కృత సమంబులంగూడి తెనుఁగున వ్యవహరింపబడు' - (సంజ్ఞా-4) అనెను. ఈ విధముగా ఈ అక్షరములు అచ్చ తెనుఁగులో నుండవు. మిగిలినవానితోనే అచ్చతెనుగు రచన సాగును.

శుద్ధాంధ్రము అనునది అచ్చ తెనుగునకు సంస్కృతీకరణము. అచ్చాంధ్రము అని కూడ వ్యవహారములో కన్పించును. ఈ విధమైన అచ్చ తెనుగులో ఒక పద్యము వ్రాయుటయే విశేషముగా భావించిన కాల మున్నట్లున్నది. ఇందు కుదాహరణముగా నాచన సోమనాథుడు- తత్సమ, తద్భవ, దేశ్య మయమైన తెనుగు కావ్యములో అచ్చ తెనుగు పద్యములను చమత్కారావహముగా తన ఉత్తర హరివంశమునందు ఉపయోగించినాడు. ఆ పద్యము లివి :

'ఏనిక తోలు పచ్చడము...' 2-171

'తాలు కాటు మెఱుఁగుల...' 2-172

సోమనాథుని కన్న ముందు ఇట్టి పద్య రచనము లేదనుటకు వీలు లేదు. పాల్కురికి సోమనాథుడు 'వృషాధిప శతకము'లో ఇట్టి పద్యము నొక దానిని రచించినాడు. అది 'బలు పొదు తోలు సీరయును ...' ఇత్యాది. అయిన ఇచ్చట గమనించ తగినది ఈ పద్యములోని భాష సంస్కృత సమేతరమైనది. కావున ఇది అచ్చ తెనుగు. సోమనాథుడు మాత్రము దీనిని 'జాను తెనుంగు' అని పద్యములో చెప్పినాడు.

అచ్చ తెనుగనకు జాను తెనుగు పర్యాయ పదమా ? 'జాను' అనగా అందమైన దని యర్థము. అర్థ భేదమును బట్టి అచ్చ తెనుగు, జాను తెనుగు పర్యాయపదము లగుటకు వీలు లేదు. జాను తెను గనగా దాని స్వరూప మేమి? అనునది ఇప్పటికిని చర్చనీయాంశముగా నున్నట్లే కన్పించుచున్నది.*[3] అది యేమైనను పద్యములోని భాషా స్వరూపమును బట్టి అచ్చ తెనుగు పద్యమును మొదటిసారిగా ప్రయోగించిన కవి పాలకురికి సోమనాథుడు.

ప్రయోగాత్మకముగా రచింపబడిన ఈ పద్యములే కావ్య మంతయు అచ్చ తెనుగున రచించినచో మరింత చమత్కారముగా నుండు నన్న భావనకు ప్రేరణ కలిగించి యుండును. గోలకొండను పరిపాలించిన ఖుతుబ్షాహీల పరిపాలనమున ఈ ప్రేరణము ఫలించి సమగ్రమైన అచ్చ తెనుగు కావ్యము ఆవిర్భవించినది. విభాషీయులు, విధర్మీయులునైన మహమ్మదీయుల పోషణలో ఈ విధమైన ఒక ప్రత్యేక ప్రక్రియా రూపము ఆవిష్కృత మగుట తెలుగు సాహిత్య చరిత్రలో ఒక ఆసక్తి కరమైన విషయము.

ఇబ్రహీం ఖుతుబ్షా ఆస్థానములోని పొన్నికంటి తెలగన 'యయాతి చరిత్రము', మరింగంటి సింగరాచార్యుల 'శుద్ధాంధ్రనిరోష్ఠ్య సీతా కల్యాణము' ఈ ప్రక్రియను ఆరంభించిన ఆది కావ్యములు. సింగరాచార్యులు శుద్ధాంధ్రముతో పాటు నిరోష్ఠ్యముగ కూడ కావ్యమును రచించి మరింత ఆశ్చర్యమును కల్గించినాడు. వీరి ననుసరించి అనంతర కాలమున అనేక కావ్యములు వచ్చినవి. వీటిలో నిరోష్ఠ్యత్వమే గాక, నిర్గద్య, నిరూష్మ, ద్వ్యక్షరి కావ్యములు కూడ రచించి ఆ యా కవులు తమ భాషాశక్తిని ప్రదర్శించినారు.*[4]

అచ్చ తెనుగు కావ్యములను రచించుటలో కవులు కొన్ని పద్ధతుల ననుసరించి నట్లు కన్పించును. అవి :

1. కావ్యములలో వ్యక్తి నగరాదుల నామములు సంస్కృతమున కొట్టుకుపోగా వాటిని మాత్రము యథాతథముగ స్వీకరించినారు.

ఉదా :- రాముడు, దుర్యోధనుడు, అయోధ్య, హస్తిన, గంగ, యమున.

2. వ్యక్తుల నామములను కూడా అచ్చతెనుగు లోనికి మార్చుట.

ఉదా :- జరాసంధుడు = [illegible], [illegible] = [illegible].

తెలగన, సింగరాచార్యులు మొదటి పద్ధతి ననుసరించినారు. వ్యక్తి, స్థల నామములను కూడా అచ్చతెనుగుగా మార్చినచో కావ్య పాఠకుల కిబ్బందిగా నుండును. ఇది వీరి కావ్యములందు తొలగినది. రెండవ పద్ధతి కావ్యములలో ఈ క్లిష్టత పెరిగినది.

'దిశల జను లెల్లఁ బొగడఁగ దశరథ నందన చరిత్ర'ను రచించి నిరోష్ఠ్య కావ్య రచనకు, శుద్ధాంధ్ర నిరోష్ఠ్యముగా సీతాకల్యాణమును రచించి ఈ విధమైన రచనకు సింగరాచార్యు లాద్యుడైనాడు. ఈ వంశమున మరికొంత కాలమునకు వేంకట నరసింహాచార్యు లను కవి 'చిలువ పడగ జేని చరిత్రము'ను రచించినాడు.

ఈ గ్రంథముల విశేషములు 'కావ్య ప్రబంధ సాహితిలో' వివరింపబడినవి.

## సూచికలు :

1. బాల వ్యాకరణమునందు సంజ్ఞా పరిచ్ఛేదమున 19-22 సూత్రములు.
2. దీనికి సంబంధించిన విపుల చర్చ 'లక్షణ సార సంగ్రహము' పీఠిక (సమీక్షణము) యందు గలదు. పుటలు 12-19.
3. 'జాను తెనుఁగు' అను గ్రంథమున ఈ విషయము కలదు.
4. 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము' పీఠికలో ఈ పద్ధతికి చెందిన గ్రంథములను గూర్చి తెల్పబడినది.

# III

# ఆంధ్ర కావ్య సాహితి

## 1

## ప్రబంధములు

### 1. శ్రీరంగనాథ విలాసము :

మరింగంటి కవులయందు (ఇప్పటి వరకు) సింగరాచార్యులే ప్రథము లని భావించు ఆంధ్ర సాహితీ చరిత్ర కారుల యభిప్రాయము సరి గాదని 'శ్రీరంగనాథ విలాసము' వలన తెలియుచున్నది.

సింగరాచార్యుల అగ్రజులలో నొకరైన జగన్నాథాచార్యులు ఆరాశ్వాస ముల పరిమితిగా నీ ప్రబంధమును రచించి శ్రీరంగ నాయక స్వామికి కంకిత మొనర్చెను. పేరును బట్టియే యిది శ్రీరంగ నాయక క్షేత్ర మహిమాభివర్ణన రచన యని గ్రహింపవచ్చును.

> 'హరిహయ బ్రహ్మ రుద్రాదు లభినుతింప
> కరుణ యుంచక సుబుధులకు గాని వేల్పు
> మంద చిత్తుండ నైన నా మె(?)కటి నైన
> కహహ! యారించుటలు చోద్య మయ్యె నిపుడు'. (1.88)

అని దీనిని తన ప్రథమ కృతిగా జగన్నాథాచార్యులు చెప్పినాడు. కవి యీ గ్రంథ రచన మొనర్చుటకు గల కారణముల నిట్లూహింప వీలున్నది. శ్రీరంగము సాక్షాద్వైకుంఠము, సిద్ధ క్షేత్రము. శ్రీ వైష్ణవులకు పరమ ప్రాముఖ్యముగల దివ్య సన్నిధి. శ్రీమద్రామానుజులవారు ఇచటి ధామోన్నత గోపురము నెక్కియే అందరకును మంత్రోపదేశ మొనర్చి ముక్తులను గావించినారు.

సంస్కృత గరుడ పురాణమున శ్రీరంగ మహత్త్వము 100 అధ్యాయములలోను, బ్రహ్మాండ పురాణమున 9 అధ్యాయములలోను గలదు. ఇది శతాధ్యాయి సంహిత. శత సంహిత యని దీనికి నామాంతరము.

పింగళి సూరన గారుడ సంహితను తెనిగించినాడు. (కళా. 1-14)
సింగరాచార్యులు 'శత సంహితను తెన్గు చేసి' నట్లు తెల్పెను. (సీతా-1-14)

'ఆమ్నాయ చమత్కార సారము సనాతన గారుడ సంహితా శతాధ్యాయి తెనుంగు జేయ' అని కట్టా వరదరాజు తన శ్రీరంగ మాహాత్మ్యమునందు వివరించినాడు. భైరవ కవి, మరి కొందరు శ్రీరంగ మహత్త్వముల రచించిరి *[1] ఇంతటి పవిత్రము, ప్రఖ్యాత మైన యీ కథను జగన్నాథాచార్య కవి ప్రబంధీకరించినాడు.

సింగరాచార్యులు శత సంహితను తెన్గు చేసితి నన్నాడు కదా! సోదర ద్వయమున ఎవరి ప్రభావము ఎవరిపై గలదో! ఇరువురును ఏక కథా విషయమే ప్రబంధీకరించినారు.

శ్రీరంగ నాథ విలాస మందలి ఆశ్వాసాంత గద్య యిట్లున్నది :

'ఇది శ్రీమ త్సృసన్న కర్పరగిరి నృసింహ కరుణా కటాక్ష వీక్షా సంలబ్ధ సరస కవిత్వ విద్యా పయః పయో నిధాన నృప త్రయ సింహాసన, విద్వన్మణి జేగీయమాన, శతావధాన శత లేఖినీ సార్వభౌమ బిరుద భూషణ, జగజ్జన మనో రంజన సంభాషణ, మౌద్గల్య గోత్ర పవిత్ర మరింగంటి వేంగళాచార్య పుత్ర, వినయలక్ష్మి సనాథ, జగన్నాథ గురు ప్రణీతం బైన శ్రీరంగనాథ విలాసం బను మహా ప్రబంధంబునందు షష్ఠాశ్వాసంబు సర్వంబును' *[2]

## 2. దశరథ రాజనందన చరిత్ర :

శ్రీమద్రామ కథను నారద మహర్షి ద్వారా వాల్మీకి తెలిసికొని దానిని శ్రీరాముని దివ్యమంగళ చరిత్రముగా, శ్రీమద్రామాయణముగ రచించెను.

వాల్మీకి మహర్షి రచన ప్రపంచమందలి ప్రతి భాషలోనికి అనువదింప బడినది. అక్షర జ్ఞానము గల ప్రతివారిచే భేదము లేని భక్తితో పఠింప బడుచున్న రామాయణము సకల జన ప్రీతి పాత్రమైనది.

లౌకిక జీవనము చేత కాలుష్యము చెందిన మనస్సు కావ్య రసానందము వలన పరిశుద్ధమై సంస్కారవంత మగును. కావుననే సర్వ రస నిలయము, వేదోపబృంహితము అగు రామాయణ కావ్యము భక్తికి, జాతి సంస్కారమునకు ఉపాదేయముగా నిల్చినది.

ఇక, తెనుగు వారికి శ్రీరాము దక్షిణాన దైవము. సీతమ్మ తల్లిగను, శ్రీరాముడు తండ్రిగను వీరి హృదయములలో నిల్చియుందురు. అందుకే శ్రీరామాలయము లేని పల్లె పట్టు లరుదు. జనులయందు రామ నామము బహు వ్యాప్తము. అరచేత వైకుంఠ మిచ్చినను, అరకాల ముల్లు గ్రుచ్చుకొనినను తెనుగు వారి కొన నాలుకపై శ్రీరామ నామమే తాండవించుట సర్వ సాధారణము.

సాహితీ పరముగా ఇతర భాషల విషయ మటుండ సంస్కృతాంధ్ర భాషా దురంధరులైన ఆంధ్ర మహాకవుల చేతిలో శ్రీరామ కథ అనేక ప్రక్రియలలో వృద్ధి చెందినది.*3

తెనుగు సాహిత్యమున చిత్ర కవితా పద్ధతికి చెందిన 'నిరోష్ఠ్యము' నందు ప్రప్రథమ కృతి నిర్మాణ మొనర్చి రామకథను చెప్పిన ఘనత 'శత ఘంటావధాన' సింగరాచార్యులకే దక్కినది.

ఈయన బహు విధ గ్రంథ నిర్మాత. వానియందు మూడు రచనలు మాత్రమే నేటికి లభించినవి. అవి : **దశరథ రాజ నందన చరిత్ర. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము, తారక బ్రహ్మ రామ శతకము.** వీనియందు శతకము అముద్రితము.

**దశరథ రాజ నందన చరిత్ర** (నిరోష్ఠ్య కృతి) మొత్తము 6 ఆశ్వాసములు. 929 గద్య పద్యములలో నున్న యీ గ్రంథము నేటికి మూడు పర్యాయములు ముద్రితమై*4 ప్రచారమున గలదు.

సింగరాచార్యుల వరకు తెనుగున నిరోష్ఠ్య గ్రంథ రచన లేదు కాని అచ్చటచ్చట కొన్ని నిరోష్ఠ్య పద్యము లున్నవి. సంస్కృతమున శాకల్య మల్లన నిరోష్ఠ్య రామాయణమును రచించినట్లు వినికిడి, సింగరాచార్యు లీ విషయమును —

'మును రామాయణము న్నిరోష్ఠ్యముగ నింపుల్ మీఱ శాకల్య మ
ల్లన దా సంస్కృత భాష చేసె నన నాలాగున్ చెవుల్ నిండఁగా
వినుటే గాని, ధరిత్రిలో నిజముగా వీక్షింపలే దట్టి దేఁ
దెనుఁగుం జేసెద భూమిపై కవి జనాధ్య(?)క్షుల్ ప్రశంసింపఁగన్' (1-32)

అని తెల్పెను. భీమన రాఘవ పాండవీయము వలెనే మల్లన రామాయణము కాల గర్భమున దాగియున్నది.

కవి యిష్టదైవ మైన కర్పరాచల స్వామి స్వప్నమున గన్పడి నిరోష్ఠ్య గ్రంథరచన మొనర్పు మని ఆదేశింపగా తాను దీనిని రచించుచున్నా నని ఇట్లు తెల్పుకొనెను:

'సముదీర్ణ స్థితి వేంకటేశ్వరుఁడు నా స్వప్నంబునన్ షోడశా
బ్దములన్ మాణవ కాకృతి న్నిలచి, 'వత్సా! యాంధ్ర భాషా నిరో
ష్ఠ్య మహా కావ్య మొనర్పుమీ!' యనిన సత్యారూఢి మేల్కాంచి మో
దమునం జెప్పితి భూమిపై కవి జనాధ్యక్షుల్ ప్రశంసింపఁగన్' (1-31)

'దశరథ రాజ నందన చరిత్ర' కథా భాగమునందు మాత్రమే నిరోష్ఠ్య నియమము పాటింప బడినది.

వాల్మీకి రామాయణము, అధ్యాత్మ రామాయణముల అనువాదమైన దీని యందలి కథా ప్రణాళిక యిట్లు గలదు :

**ప్రథమాశ్వాసము :**

సంస్కృత బాలకాండలోని 29 వ సర్గ వరకును గల విషయముతో ముగి యును. దశరథుని పుత్రకామేష్టి, దాశరథుల జననము, విశ్వామిత్రాగమనము, ముని వెంట రామ లక్ష్మణుల పయనము, తాటకా హననము.

**ద్వితీయాశ్వాసము :**

బాలకాండలోని 32 వ సర్గనుండి అరంభము (119వ పద్యము వరకు). 120-158 పద్యములలో అయోధ్యాకాండము పూర్తియైనది. జనకుని యాగము, విశ్వామిత్రుడు గంగానదిని గూర్చి మున్యాశ్రమముల గూర్చి రామ లక్ష్మణులకు తెల్పుట, అహల్యా శాప విమోచనము, శివధను ర్భంగము, సీతా కల్యాణము,

పరశు రామ గర్వ భంగము, కైక వరములు, శ్రీరాముని అరణ్యావాసము. భరతుడు రాముని వద్దకు వచ్చుట.

**తృతీయాశ్వాసము :**

అరణ్యకాండ కథతో ప్రారంభము. 69 వ పద్యమునుండి కిష్కింధకాండ మొదలైనది, శూర్పణఖ కర్ణ నాసికాచ్ఛేదనము, ఖర దూషణ వధ, మారీచ వధ, రావణుడు సీత నపహరించుట, సీతకై రామ లక్ష్మణు లన్వేషించుట. జటాయు సందర్శనము, హనుమ త్సుగ్రీవులతో మైత్రి, వాలి వధ, సీతాన్వేషణమునకు హనుమంతుని ప్రయాణము, వివిధ దిక్కులకు కపి సైన్యము వెడలుట లంకలో సీతను చూచివచ్చినట్లు, లంకా దహనము జరిపినట్లు వాయుసూతి రామునకు తెల్పుట, రావణాసురుని ఆలోచన, మంత్రుల హిత బోధ.

**చతుర్థాశ్వాసము :**

సుందర కాండ 133-144 పద్యములలోను, 145-164 పద్యములలో యుద్ధకాండ విషయమును గలవు. రావణునకు విభీషణుని హిత బోధ. విభీషణుడు రాముని శరణు జొచ్చుట, సముద్ర బంధనము, రామునికి రాక్షస వీరులతో సమరము, కొందరి మరణము, రావణునితో యుద్ధము.

**పంచమాశ్వాసము :**

యుద్ధమున కుంభకర్ణుని మరణము, లక్ష్మణ మూర్ఛ, రావణుని ద్వితీయ సమరము, అగస్త్యుడు రామునకు దివ్యాస్త్రముల నిచ్చి అదిత్య హృదయము నుపదేశించుట, రావణ మరణము, విభీషణ పట్టాభిషేకము, రాముడు సీతా యుక్తుడై బయలుదేరి ఆమెకు లంకను చూపుచు అయోధ్యా నగరము చేరి పట్టాభిషిక్తుడగుట.

ఇవి దీని యందలి ముఖ్య విషయములు.

**దశరథ రాజ నందన చరిత్ర** యందలి పద్యశైలి, వర్ణనలు సమచిత ముగా నున్నవి. వానిలో **జనక రాజదాని వర్ణన :**

'చని యగ్రస్థలిఁ గాంచె సంత జనక క్ష్మాకర్త రాడ్ధానిదాఁ
గనకాలంకృత చిత్ర రాజి సదనాగ్ర స్థాన సంధాన కే
తన చేలాంచల నిర్గతానల శిఖాత్యంత తాహతాకాశ ర
త్న నిశా నాయక నాక దేశ తటినీ ధారాధరాళిం దగన్!' 2-55

**వర్షా వర్ణన :**

'పేరకా ఛిన్న నిగంత శాఖి యు.ఱ నిర్ఘాతాహతాంగాళియై
హరి నాగేంద్ర కరాతి చండ శర ధారాశ్లేష శేషాహి శే
ఖర గండస్థలియై ఘనాఘన తటి ద్గర్జాతిరేక స్థితిన్
ధర యెల్లం జడి నిండ సాగె జన చింతా కారణ స్థానియై.' **3-103**

**యుద్ధ వర్ణన :**

'కట చరణాధరాధర సఖ స్తన కీకస కర్ణ నాసికా
నిటల కరాస్య దంత కచ నేత్ర కటీర గళాస్య జంఘికా
చ్చట లసిధారలన్ క్షితిజ శాఖించే దెగి జన్యధాత్రి సం
తటిఁ గలయంగ ద్రెళ్ళె రట దైత్య హరీశితలేక చర్యలన్' **4-98**

ఈ విధమైన వర్ణనలు మరి కొన్ని గలవు.

**అనుకరణము :**

'సీతగా దిది దైత్య శేఖర! నీ కేల
నల్లిన యట్టి నీలాహి గాని
సీతగా దిది దైత్య శేఖర! నీ నెత్తి
కట్టె జాతిన యట్టి యశని గాని...
యైన నాగాథ లాలించి యతని గృహిణి
నతని కిచ్చిన గాదె నీ యంగ రక్ష!' **4-16**

అను పద్యము 'భాస్కర రామాయణము' లోని 'నీ కంఠార్పిత కాల పాశము' అను పద్యానుకరణ. దశరథ రాజ నందన చరిత్ర 1 వ ఆ. 55-75 పద్యములు 'శిథిలమై పోవుటచే తిరుగ వ్రాయఁబడియె'నని ప్రథమ ముద్రణ పరిష్కర్తలు చెప్పిరి ఇటీవల నాకు లభించిన తాళపత్ర గ్రంథములో వాని స్థానమున మంచి పద్యము లున్నవి.

అట్టి వాని కొక యుదాహరణ:

'సురలను దోడుకొంచు నరిసూదనుఁడై తనరారు నింద్రిరా
ధరుఁడు చెలంగు నీరనిధి తట్టుకు వేగ నుతించు చుండఁగా
నెఱ్ఱఁగి సరోజ లోచనుఁడు నీ సుర లుండిన చెంత కేగు దెం
చి రహిని నిల్చనన్ నతిని జేసిరి నిర్జరు లెల్ల సంతటన్!' **1-64**

దీనియందు ఓష్ఠ్య వర్ణములు (బోల్డ్ టైపులో సూచితములు) అధికముగా నున్నవి. పరిష్కర్తలు 'ప' వర్గాక్షరముల మాత్రమే నిరోష్ఠ్యములుగా గణించి సందున 'తిరుగ వ్రాయబడిన' పద్యము లిట్లయినవి.

దీనికి తాటాకు పుస్తకములో గల పద్యము- ఇదే సందర్భము:

'రాకా శశాంక నీరంధ్ర చంద్రిక తెల్లఁ
గలయ నేకాకృతి గాంచె ననఁగ
నాళీక గేహిని నాథ దేహ ఛ్ఛాయ
సకలాశ లందంద సాగె ననఁగ
త్రిదశ సంగతి యెడతెగనీక సంతాన
నగ రాజి యంతట నాటి రనఁగ
హార హీర ఛ్ఛట లద్ది దిన్నెలఁ జేసి
జగతికి సరిగాఁగఁ జలచి రనఁగ

కానఁగా నైన నా తెల్ల కడలి చెంత
సంచితాహ్లాద నియతి రాయంచ డిగ్గి
యష్ట దిగ్గాజ కీర్తన లతిశయిల్ల
సృష్టి రక్షణ కర్త దా నిలిచె నంత'

ఇట్లే మరికొన్ని పద్యములకు తాళపత్ర గ్రంథమున పాఠాంతరము లున్నవి.

సింగరాచార్యుల తరువాత ఈ ప్రక్రియ యందు మరికొన్ని నియమము లతో గ్రంథములు వచ్చినవి.

ఒకరు వేసిన మార్గముపై పయనించుట సులభము. కాని ప్రథమముగా మార్గ నిర్మాణము చేయుటయే శ్రమతో కూడినట్టి పని. తర్వాత ఆ బాటలో ఎన్నో మార్పులు తేవచ్చును. నగిషీలు చెక్కవచ్చును.

నిరోష్ఠ్య రచనకు దారి వేసిన శిల్పి సింగరాచార్యులు.

## 3. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము :

నిరోష్ఠ్య గ్రంథ రచనమే సాహస కార్యము. దానికి తోడు అచ్చ తెనుగు నిరోష్ఠ్యము. ఇట్టి నియమ పూర్వక రచన కవికి కత్తి మీది సాము వంటిది.

సింగరాచార్యుల యీ కృతి 3 ఆశ్వాసములు, 301 గద్య పద్యములు గలిగి, రామ కథ సంక్షేపముగా చెప్పబడి నట్టిది.

ఇప్పటి కిది రెండు పర్యాయములు ముద్రితమై వ్యాప్తిలో నున్నది.

తన గ్రంథ రచనను గూర్చి కవి—

'చెప్పరానట్టి కావ్యంబు చెప్పఁ బూని
నాఁడ సుద్ధత గతి చేత నడచి నడవ
ములు విచారింపకే యర్ణవముల దాటఁ
జేరు సాహసి దొడ్డ కొంచెంబు లనునె?'

'తొలుతటి సుకవులు ఘనులై
యిల నంధ్ర నిరోష్ఠ్య కావ్య మేలా చేయం
దలఁచరొకొ నాఁ బ్రసిద్ధముఁ
గలుగఁగ నొనరించు కొలకు గావలె నరయన్!' (1-34, 35)

అని - అచ్చ తెనుగు నిరోష్ఠ్యమున తనదే ప్రథమ కృతి అనియు, అప్పటి వర కెవ్వరును అట్టి రచన మొనర్పకపోవుటవలన సాహసించి తాను ఆ పని చేయుచున్నా ననియు తెల్పినాడు.

'ఇల కవితా ప్రయాస మగు నెన్నికమై యుభయార్థ కావ్యముల్
గల విపు డట్ల విన్నయది గద్దిక ముందర గల్గ నేర్చునే?
దెలుఁగు నిరోష్ఠ్యపుం గృతి యిదే మఱి తక్కఁగ నిప్పటందులన్
గలుగదు వింట లేదె! యిఁక కాఁగల జాడల నెన్న నేటికిన్' (1-36)

అనెను. అప్పటికి ప్రచారమైన ఉభయార్థ కావ్యములు (రాఘవ పాండవీయ, హరిశ్చంద్ర నలో పాఖ్యానములు?) కలవు, అచ్చతెనుఁగున నిరోష్ఠ్యము నందు తనదే ప్రథమ రచన యని తెల్పినాడు.

దశరథ రాజ నందన చరిత్ర యందు తెల్పని నిరోష్ఠ్య నియమము దీని యందు (1-87,88) తెల్పబడినది.

('శుద్ధాంధ్ర నిరోష్ఠ్యము'న వీనిని గూర్చి గలదు)

కవి దీని నచ్చ తెనుగున రచించినను కొన్ని పేళ్ళను మాత్రము 'తెలియ కొఱకై' 'సురభాషల నిలిపితి' నన్నాడు (1-39). అందు వలననే - గ్రంథమున 'దశరథ, గాధేయర్షి, ఋష్యశృంగ, అహల్య, తాటక, జనక-ఇత్యాది 60 సంస్కృత పదములు గలవు.

సింగరాచార్యుల వరకు తెనుగున శ్రీరామాయణములు వచ్చినవి. ప్రబంధములను ప్రచారమున గలవు. వానిని పరిశీలించి తనదైన ప్రత్యేక రీతిని కథా కథనమే ముఖ్యముగ భావించి, నియమ యుక్త రచనగా శ్రీరామకథ నిట్లు సంక్షేపించెను:

**ప్రథమాశ్వాసము :** సాకేత నగరి, దశరథవర్ణన, నారదుని యాజ్ఞచే ఋష్య శృంగర్షిని రప్పించి శాంత నిచ్చి వివాహము చేసి, దశరథుడు సుతేష్టి నొనర్చుట.

**ద్వితీయాశ్వాసము :** విష్ణువు వర్ణన, దేవతలు రావణు దుశ్చర్యల గూర్చి విష్ణుమూర్తికి విన్నవించుట, శ్రీరామాదుల జననము, వీరు పెద్దవారై విశ్వామిత్రుని వెంట కానల కేగి, అహల్యా శాప విమోచనము, తాటకా హననము నొనర్చిరి.

**తృతీయాశ్వాసము :** సీతా స్వయంవరము, రాముడు సీతను గ్రహించి మరలి వచ్చుచుండగా పరశురామ గర్వ భంగము, శ్రీరామ వనవాసము, సీతాపహరణ, రావణ వధ. సీతాయుక్తుడై రాముడు సాకేతమును చేరుట.

కథ యంతయు మిక్కిలి సంక్షేపము చేయబడినను, ప్రజల యందు వ్యాప్తమై యున్న ఋష్యశృంగ కథ, అహల్యా వృత్తాంతములను అధికముగా వర్ణించి సింగరాచార్యులు తెల్పినాడు.

ముఖ్యకథ లైన వనవాసము, సీతాపహరణము, రామ రావణ యుద్ధము, శ్రీరామ పట్టాభిషేకము ఒకటి రెండు పద్యములలో చెప్పబడెను. మరి కొన్ని సన్ని వేశములు పదముల ద్వారానే తెల్పబడినవి. ఉదా :- శూర్పణఖా వృత్తాంతమును 'ఒక్కైన శాస్తి', శబరీ ప్రసక్తిని 'చెంచెత' అనుట.

**కవితా శైలి :**

ఋష్యశృంగుడు వేశ్యల హావ భావ విలాసములకు వశుడైన తరువాత ఇట్లున్నాడు:

> 'తెలియక లెస్స సందె తఱి దీర్చఁగ నేఱక ఆకలాన నా
> కలి యుడిగించనేఱ కెద గాడిన కాకల నాలి జాలిచే
> నిలిచిన దారి నిల్చి గననేఱక నల్కత లింత లేక చెం
> తలఁ దిరుగాడ సాగె జడదారియగా వెసరేగి డిందఁగన్' 1-106

దీనియందు ముసికుమారుని చింత చిత్రింప బడినది. అహల్య శాప విముక్తయై రాము నెదుట లిచ్చినప్పు డిట్లు గిలదు :

> 'జిగి చన్గట్టసియాడ, తీఱియిన లేచెక్కిళ్ళ ఫక్కి న్నిగ
> న్నిగ లీనంగ, కడాని రంపె సిరి డాల్మిండంగ, కై చిన్నియల్
> తెగలై నల్లిప లాని చక్కఁగ చిలిత్వేయ, న్నెరా సిగ్గెదం
> దగులన్ రానెలఁ జేరి తాళ్ళకడ చెంతన్ సాగిలె న్నాతి దాన్!' 2-63

సింగరాచార్యు లీ కావ్యమును 'అనేక మహాకవి వాఙ్మయోపకా రావహ మైన' (1-21) దిగా భావించి, 'సరసులు మెచ్చ చెప్పెదను సత్కవి శబ్ద పటుత్వ వైఖరి' (1-104) నని తెల్పినాడు.

సంస్కృ తాంధ్రముల యందు రామకథను చెప్పిన కవులలో కొందరు దీనిని భక్తికి స్వీకరింపగా, మరి కొందరు శబ్ద చమత్కార చిత్రకవితా రచనకు ఎన్నుకొనిరి.

సింగరాచార్యులు 'సీతా కల్యాణము'ను భక్తితో పాటు చిత్ర కవితా యుత మొనర్చినాడు.

## 4. జనకసు తాభ్యుదయము :

బహు గ్రంథ నిర్మాత యైన వేంకట నరసింహాచార్యులు (ద్వితీయ) 'జనకసు తాభ్యుదయ'* మను పేర 6 ఆశ్వాసములు, 2830 గద్య పద్యములలో శ్రీ రామాయణ కథను ప్రబంధీకరించినాడు.

---

* దీని నుండి 18 వ నెం. వరకు ద్వితీయ వెంకట నరసింహాచార్యుల రచనలు.

కవికి తన రచనలకు 'అభ్యుదయ' పదాంకితముగా నామకరణము చేయుట యిష్టము. అందుకే 'శ్రీ రామానుజాభ్యుదయము', 'శ్రీ నృకంఠీర వాభ్యుదయము' అని నట్లుగనే దీనిని 'జనకసుతాభ్యుదయ' మనెను.

ఈ గ్రంథమును కవి తన పదమూడవ యేట రచించినట్లు 'ఐదైదు మూడును హాయనంబుల లోన జనకరాయని బిడ్డ చరిత మొకటి.' అని 'చిలువ పడగజేని ప్రేరణము'న తెల్పినాడు.

> 'అఖిల రామాయ ణార్థంబు లన్ని యేక
> కృతిని ఒనగూడు నట్లుగా కృతి రచింతు
> సకల సత్కవి దేశికుల్ స్వాంతమందు
> నెగ్గు లెన్నక క్షమియింపుఁ డెలమి కృపను'. 1-7

తన యీ రచనలో అఖిల రామాయణ విషయములను ఒక చోట చేర్చి చెప్పబడినవి. దీని యందలి మరొక ముఖ్య విషయము: శ్రీ రామ జననమునుండి రామాయణమున జరిగిన ప్రధాన సన్నివేశముల సంవత్సర, మాస, తిథుల తెల్పుట. 'జనకసుతాభ్యుదయ' రచనకు రామాయణములతో పాటు రామ కథ గల పురాణములు కూడ కవి పరిశోధించి నట్లు —

> 'వర వాల్మీకి వశిష్ఠ వామన శుక బ్రహ్మాండ వారాహ భా
> స్కర యధ్యాత్మ నృసింహ నారద యగ స్త్య స్కంద సాత్త్విక శ్రీ
> హరి పద్మోత్తర తార్క్ష్య తార శశి యాజ్ఞేయాది పౌరాణముల్
> పరిశోధించి రచింతు రామ కథ నే ప్రఖ్యాతిగా నిద్ధరన్!' 1-19

అను పద్యమున తెల్పుకొనెను. పిని ఎన్నింటిని పరిశోధించి శ్రీ రామ కథను చెప్పుటయందు గల కవి యుద్దేశ్యము—

> 'మహిజకు రాఘవేంద్రులకు మానుష లీలలు చెందకుండనే
> విహితములైన శాస్త్రముల వేమఱు జూచియు సమ్మతంబుగా
> సహితుల తేటి వాచకులకునై యటు భక్తిని చెప్పలేదు ని
> మ్మహి గల యార్య శేఖరులు మానస మందుర మెచ్చ చెప్పెదన్!' 1-20

అను పద్యము వలన వ్యక్త మగుచున్నది.

రామ కథను కవి యిట్లు చెప్పుట విశిష్టాద్వైతాభిమానము, 'దీర్ఘ శరణాగతి' తత్త్వమే ముఖ్య కారణము లైనను రచనా ప్రణాళిక మాత్రము వింతగా గలదు. తెనుగున ఇట్లు సర్వ విషయ సమాహారముగా శ్రీ రామ చరితమును చెప్పిన వారు అరుదు.

సింగరాచార్యుల **తారక బ్రహ్మ రామ శతకము**న ప్రతి పద్యమునకు ముందు అనేకము లైన రామాయణ పురాణ విషయములు, వేద విషయములు ఉదాహరింపబడి, వానికి సమన్వయ రూపముగా రామ కథా కథనము చేయబడినది. అట్టి గద్య పద్యాత్మక విశేష రామ కథా శతకమును చూచి జనకసుతాభ్యుదయము వ్రాయ బడినది.

శతకమునందు "ఇక్కడ నుండి రామాయణ షట్కాండ కథలు శోధించి సీతా రాములకు మానుష లీలలు పట్టకుండా శాస్త్ర సమ్మతాలుగా భక్తి వాదాన చెప్పుట కాకుండా పెద్దల మనస్సులకు వచ్చేటట్టుగా చెప్పినారం... కొన్ని పద్యాలలో పురాణ కథలే ఇమిడి యున్నవి—". 'రామ జన్మ హేతు త్రయమ్', 'వాల్మీకి రామాయణే' అను శీర్షికలను పద్యములు చెప్పబడినవి.

ఈ గ్రంథకర్త శతక పద్ధతిని పూర్తిగా గ్రహించి తన ధీశక్తి నుపయోగించి యీ ప్రబంధమును రచించి శ్రీ రామాయణ సాహిత్యమునకు ప్రత్యేకత చేకూర్చెను.

కవి యనేక గ్రంథముల పరిశీలించి చెప్పిన యీ రామ కథయందు వాల్మీకీయము, అధ్యాత్మ రామాయణము ఒక పరుసలో గ్రహింపబడలేదు. పురాణ సంబంధ కథలు, ఆ యా పాత్రల పూర్వ జన్మలు, శాపములు, తన్మోక్షములు వివరముగా గలవు.

వీని యన్నిటికిని సాక్షాద్విష్ణువైన శ్రీరాముడే కారణ మని కవి భావన. 'జనక సుతాభ్యుదయము'న కొన్ని ప్రసిద్ధ శ్లోకముల కనువాదము ఈ విధముగా గలదు :

'చరితం రఘునాథస్య శత కోటి ప్రవిస్తరమ్'- ఇత్యాది శ్లోకము.

'సతతము రాముని చరితము
క్షితిలో ననుదినము నరులు శేముషులందుం
గౌతుకక నొక్కొక వర్ణము
మతిఁ దలఁచినఁ బాతకములు మానుట యరుదే!' 1-68

శ్రీమద్రామాయణము బాలకాండ (18 వ సర్గ 8 వ, 9 వ శ్లోకములు) యందు-

'తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ।
నక్షత్రేఽదితి దైవత్యే స్వోచ్చ సంస్థేషు పంచసు॥
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా విందునా సహ।
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోక నమస్కృతమ్'॥

అని శ్రీరామ జననమును గూర్చి చెప్పబడినది. ఈ విషయమును 'జనక...' కర్త యిట్లు తెనిగించెను:

'మధుమాసంబున మేష శుద్ధ నవమీ మధ్యాహ్న కాలంబునన్
విధుఁడున్ గీష్పతి (ముఖ్యులైన) గ్రహముల్ చేదించ కుచ్చ స్థలిన్
ప్రథితంబై విలసిల్లఁగా నదితి తారన్ సౌమ్య వారంబునన్
మధు విద్వేషణుఁ డుద్భవిల్లె నపుడా మార్తాండ వంశాధ్యుఁడై' 1-309

ఇదే సందర్భమున 'చంపూ రామాయణము' బాలకాండలో -

'ఉచ్చస్థే గ్రహ పంచకే సురగురౌ సేందౌ నవమ్యాం తిథౌ...' ఇత్యాదిగా చెప్పబడిన శ్లోక పూర్వభాగము సైత మీ పద్యమున కొంత అనువదింపబడెను.

గుహుడు శ్రీరామ చంద్రుని నదిని దాటించుటకు ముందు ఆ స్వామి పాద ప్రక్షాళన మొనర్చెను. లేనిచో రామ పాద ధూళి వలన తన నావ కూడా మానవాకారము దాల్చునని ఆతని భావన!

అధ్యాత్మ రామాయణమున ఈ విషయము ఇట్లు వర్ణింపబడినది :

'క్షాళయామి తవ పాద పంకజం - నాథ! దారు దృషదోః కి మంతరమ్?
మానుషీ కరణ చూర్ణ మస్తి తే పాదయో రితి కథా ప్రథీయసే'
'పాదాంబుజం తే విమలం హి కృత్వా పశ్చా త్పరం తీర మహం నయామి
నో చేత్తరీ సద్యువతీ మలేన స్యా చ్చే ద్విభో విద్ధి కుటుంబ హానిః'

దీనిలోని ముఖ్యభావము వచ్చునట్లు ఈ గ్రంథ కర్త ఇట్లు చెప్పెను:

'చనుటకు మీ పదాబ్జములు క్షాళన జేయక గాని నావ పై
నిను మొద లెక్కనీను విను! నిదగు దివ్య పదంబనేది యీ
వనజము సోకి ప్రస్తరము వారక భామిని యయ్యె మున్ను; గా
పున నిది దారు నిర్మితపు టోడయు నట్లగు నంచు బల్కెడన్!' (3-128)

**అనుకరణలు :** దీనియందు అనేక సందర్భములలో సుప్రసిద్ధ ప్రబంధానుకరణము గలదు. అట్టివాని యందు కొన్ని—

ఆంధ్ర మహా భారతమున (ఆది. 1-9) 'ఏయది' హృద్య మపూర్వం జేయది' యను పద్యము ఏ సందర్భమున చెప్పబడినదో - అదే విధముగా ఇందులో కూడ చెప్పబడెను:

'ఎయ్యది యిహ పర సౌఖ్యం
బెయ్యదియును నఘ వినాశ, మెయ్యది పుణ్యం
బెయ్యది పూర్వ చరిత్రం
బెయ్యది స్మరణానుకూల్య మెయ్యది యిలలో?' (1-65)

పూర్వ చరిత్ర మైన రామాయణమును సవ విధ భక్తులలో నొక టైన స్మరణమున కనుకూలముగా నుండు ననెను. సామాన్య జనులు రామ నామ స్మరణ చేసి 'నామ స్మరణే ధన్యోపాయమ్' అందురు: దీనిని కవి యిట్లు పేర్కొనెను :

**దశరథ రాజ నందన చరిత్ర** (1-53) యందు సంతతి లేని కారణమున దశరథుడు బాధపడుచు ఇట్లనుకొనును :

'కరి ఘట లేల? చిత్ర గణికా చ్ఛట లేల? హిరణ్య శాటికా
హరి ధన ధాన్య రత్న ఘటితాచ్ఛ దలంక్రియ లేల? నర్థిశల్'

దీనియందును ఆదే సందర్భమున ఆ భావ మిట్లు విశదీకరింప బడెను :

'కరి నిచయంబు లేల? ఘన కత్తళ జాలిము లేల? నవ్య సుం
దర యరదంబు లేల? రిపు దర్పితు లైన భటాళి యేల? భా
సుర తనులైన యట్టి కుల సుందరు లేల? సుఖించుటేల? నీ
సురుచిర రాజ్యమేల? నిల సూనులు గల్గని రాజకోటికిన్.' (1-279)

'గంధపు కొండ నెత్తముల గందువ నేలకి తీవ యిండ్లలో- ...' ఇత్యాది భైరవ కవి **శ్రీరంగ మహాత్మ్య పద్యము** (2-50) నకు-

'చందన శైల నెత్తముల చంపక సూన గృహాంగణంబులన్
సుందర కల్ప తల్పముల సుస్థిత నంది రతి శ్రమంబులన్
జెందెడి దేవతా మణుల చెక్కుల గల్గు జవాది వాసనల్
ముందుగ నంది పీచె నటు మోదిత వేసవ శీత వాయువుల్!' (2-316)

అని ప్రతిబింబముగా చెప్పబడినది. భైరవుని 'చెంచు గుబ్బెతల'ను దీనియందు 'దేవతా మణుల' చేసినాడు.

**కళా పూర్ణోదయము** (4-87) న వర్షా వర్ణన పద్యము :

'మిగుల జగంబు బెగ్గడిల మించె తదుద్ధత వృష్టి యద్భుతం
బగుచు ఘనాఘనౌఘ సముదగ్ర నిరర్గళ ఘర్ఘ రార్భటి.'

దీనికి 'జనకసు తాభ్యుదయము'న-

'జగములు బెగ్గటిల్లగను సాంద్ర సువృష్టి మహాద్భుతంబుగా
నగుచు ఘనాఘ నౌఘము లుదగ్ర నిరర్గళ ఘర్ఘ రార్భటీ
గగన ఘనాద్భుర స్రవిత గర్భిత నిర్భత జర్ఘరీ భవ
న్నగ నిగళ చ్ఛిలా కణ ఘణంఘణ ఘోషణ భీషణంబుగన్' (4-8)

ఇట్లే-మను, వసు చరిత్రలు రామాభ్యుదయాది రామ కథా రచనల అను కరణములను కొన్ని కన్పట్టును.

**వర్ణనలు :** ఈ గ్రంథమందలి వర్ణనల పరిశీలింప 'వర్ణనా నిపుణః కవిః' యనునది వేంకట నరసింహాచార్యులకు తగును. ప్రతి చిన్న విషయమును వర్ణింప బడినది. ప్రబంధమున వార సతుల వర్ణన చేయని వారు అరుదు. దీని యందలి వార కాంతలు 'భుజగ శయాను' భక్తి గలవారు. కవి వారి నిట్లు చిత్రించెను :

'వలరాజ గురు జన వర్ధిత సద్ధర్మ
వర్తన తమ కుల వర్తనముగ
కౌతుకక శ్రీధరు కోరి భజించుటే
యనిశంబు తమ జిహ్వా కాస్పదముగ
పంచాయు ధాంచిత లాంఛనంబులె తమ
భుజ యుగ్మముల కెల్ల భూషణముగ
భగవ దనుగ్రహ ప్రాప్తి తార్థమె తమకు
యోగ్యమౌ పోషక భోగ్యములుగ

మోదమును కర్పు రాంబక మూల్యముననె
ధ్యాన మెప్పుడు భుజగ శయాను నందె
గాని యితరమ్ము లెఱుఁగ మిన్కాయమునను
ననుచు విహరింతు రవ్వీటి వార సతులు' 1-267

దీనియందలి 'గురు జన', 'శ్రీధర', 'పంచాయుధ', 'భగవ దనుగ్రహ', 'కర్పుర', 'అంబక', 'మూల్య', 'భుజగ శయన' పదములు వార సతికి, భక్తునకు వర్తించునట్లు శ్లేషింపబడి అటు విష్ణు వర్ణన తల్లాంఛనములు, ఇటు వెల యాలి పద్ధతి అన్య పురుషాసక్తి చెప్పబడినవి. శ్రీ వైష్ణవ మందలి 'పోష్య', 'పోషక' భావము దైవానుగ్రహపరముగ తెల్పి, వారసతులకు 'పోషకత్వము' వీని యన్నిటి వలన సమకూడునని చక్కగా వ్యక్తపరచెను.

6వ ఆశ్వాసమున యుద్ధ వర్ణనమే యధికము. కవి యీ సందర్భమున తిక్కన గారిని అదర్శముగా గ్రహించి తన వర్ణనల విస్తరించెను.

దశాననుడు లక్ష్మణునిపై ప్రయోగించిన బాణము లిట్లున్నవి:

'మూటను రెంట నాల్గిటను ముప్పది యేనిట నేబదారిట
న్నూటను తొంబదాయిటను నూరు శతంబుల లక్ష కోటుల
న్నోటమి లేక నార్చుచును నుజ్జ్వలమై దనరారు నమ్ములా
న్నాట నిశాట నేత నరనాథ సహోదరు నేసె గ్రుక్కఁగా.' 5-564

లక్ష్మణుడు వీని నన్నిటిని 'విష్ణు రథ సాయకము న్నిగుడించి' దున్మినాడు. ఈ ప్రబంధమున కొన్ని అచ్చ తెనుగు పద్యము లున్నవి. ఆ ప్రక్రియపై కవికి గల యభిమానమున కివి నిదర్శనములు. అందుకే తరువాత 'చిలువ పడిగ తేని పేరణము'ను (అచ్చ తెనుగున) వ్రాసినాడు.

అగస్త్య వర్ణనము :

'కన్ను గానక తన్ను కాల దన్నిన వాని
పెను పాపగను నెల నునుపు వాని
వేయి చేతుల తేని పెతల బెంచిన వాని
నెట్టన నతుకాల మట్టు వాని
నేల జేజేతేండ్ల చాల తినియెడి వాని
మెటం కుండను కడిగ గ్రింగు వాని
నేటి టోటుల రెల్ల కూటువ యగు వాని
కొడుకక నొక గ్రుక్కఁ గొనిన వాని,

నేల సమపడ జముకడ నిలుచు వాని
కడయు గనరాని పుడుకను టొడయు వాని
పడతికై వేడి సిరులను బడయు వాని
నిచ్చలును కుడిచి కుడువక నెగడు వాని' (3-220)

ఈ గ్రంథకర్తకు విచిత్ర రీతి పద్యముల చెప్పుట యందు మక్కువ గలదు. ఆంధ్ర మహా భారతము ఉద్యోగ పర్వము (2-37)న గల ప్రసిద్ధ మగు 'ఒకటిఁ గాని రెంటి నిశ్చల యుక్తిఁ జేర్చి' ఇత్యాది పద్యమున కనుకరణగా

అఱింటిని*1 వహించి యాఱింటి*2 వర్జించి
యాఱింటి*3 కెక్కుడై యతిశయించి
యైదింట*4 హితుఁడునై యైదింటి*5 కహితుఁడై
యైదింటి*6 కెక్కుడై యర్హ మొంది
నాల్గింటిలో*7 మెల్గి నాల్గింటికిని*8 హెచ్చి
నాల్గింటి*9 నొసఁగెడి నాథుఁ డగుచు
మూటిని*10 సృజియించి మూటను*11 వర్తించి
మూటి*12 కతీతుఁడై ముదము తోడ

రెంటి*13 నందక నంటి*14 వేరొంటి *15యగుచు
నలరు చుండెడు నారాయణాఖ్య మహిమ
వినఁగ వేడుక బొడమె మా మనములందు
శ్రోత సవనేత! సద్గుణోపేత! సూత! (1-66)

అని సంఖ్యా చమత్కృతిగ నారాయణ వైభవముచెప్పబడినది. నారాయణ మంత్రము వలె వారి ప్రభావము మిక్కిలి ప్రభావవంత మైనందున కవి యిట్లు చెప్పెను. పద్యములోని సంఖ్యలకు వివరణము.

(1) జ్ఞాన, శక్తి, ఐశ్వర్య, బల, వీర్య, తేజస్సులు (2) కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు, (3) జీవుడు, పుద్గలము, ధర్మము, అధర్మము, కాలము, ఆకాశము, (4) పంచ ప్రాణములు, పంచశక్తులు. (5) అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశములు, (6) పంచ కోశములు, (7) సంకర్షణ, వాసుదేవ, ప్రద్యు, మ్నానిరుద్ధులు చతుర్వ్యూహములు, (8) మనో బుద్ధి చిత్తాహంకారములు, (9) చతుర్విధ పురుషార్థములు, (10) సత్త్వ రజ స్తమో గుణములు, (11) సృష్టి స్థితి లయములు, (12) దృక్ దృశ్య ద్రష్టలు, (13) జనన మరణములు, (14) సత్తు, చిత్తు, (15) ఆనందము.

**కాలక్రమ సూచిక :**

'జనకసుతా భ్యుదయము'నందు శ్రీరామ కథా సన్నివేశములు జరిగిన కొన్ని ముఖ్యమైన తిథులు (సంవత్సర, మాస, తిథి, వారములు) గలవు. వానిలి

కొలను వారి 'సుందరము', 'అయోధ్య' (2వ భాగము) వివర కొన్ని యిట్టి తేదీ లీయబడినవి. రెంటియందును నవి దాదాపు సమానముగా నున్నవి. తెనుగున నిట్లు తెల్పిన వారు అరుదు.

'జనక...' లోని పద్ధతి :

| ఆశ్వాసము | పద్యము | |
|---|---|---|
| 1 | 220 | శార్వరిలో బాలిక గం పేటిక మిథిలకు చేరును. |
| | 309 | విలంబి చైత్ర శుద్ధ ౯ మీ సౌమ్య వారము శ్రీరామ జననము. |
| 2 | 5 | చైత్ర శు ౨ యా యాగమునకు మంచి ముహూర్తము. |
| | 45 | శుభకృత్ చైత్ర శు ౨ యా శుక్రవారము సూర్యోదయ కాలము యాగభూమిని దున్నుట. |
| | 48 | కార్తీక శు ౧౨ శీ శుక్రవారము ఉత్తర ఫల్గుణి యందు జనకునకు బిడ్డ గం పెట్టె లంభించును. |
| | 142 | కీలక ఫాల్గుణ శు. ౧ మీ గురువారము మూలా నక్షత్రమున సీతా స్వయంవరము, |
| | 237 | సౌమ్య ఫాల్గుణమున జనకుని వాజపేయము. |
| | 242 | విశ్వావసు చైత్ర శు ౫ మీ రామలక్ష్మణాదుల కుపనయనము, |
| | 268 | సౌమ్య మాఘ బ ౨ యా సోమవారము రామ లక్ష్మణులు విశ్వామిత్రునితో వెళ్ళిరి. |
| | 297 | మాఘ బ ౧౪శీ శనివారము దివ్య శస్త్రాస్త్ర ప్రయోగోప సంహార మంత్రములు ముని వలన దాశరథులు పొందుట. |
| | 337 | మాఘ బ ౧౪ శీ శనివారము మధ్యాహ్నము అహల్యా శాప విమోచనము. |
| | 392 | ,, ,, ,, జనక యాగ పరిసమాప్తి. |
| | 406 | ఫాల్గుణ శు ౧౫ మీ ఉభయులకు ముహూర్తము బాగున్నది. |
| | 450 | ,, బ. ౧౩శి రాజకుమారుల మిథిలా నిర్గమనము. |
| | 508 | సాధారణ చైత్ర శు ౨ యం బుధవారము అయోధ్యా ప్రవేశము. |

| ఆశ్వా. | పద్యము | |
|---|---|---|
| 8 | 18 | దుందుభి చైత్ర శు ౯ మీ మేష లగ్నమున రామాభిషేక నిర్ణయము. |
| | 112 | ,, ,, ,, మధ్యాహ్నము రాముడు వనమున కేగుట. |
| | 188 | ,, ,, ,, ౯ మీ చిత్రకూట ప్రవేశము. |
| | ,, | ,, ,, ,, ౧౩ శీ దశరథాస్తమయము. |
| | 175 | ధాతృ చైత్ర శు ౯ మీ అయోధ్యకు వత్తునని రాముడు చెప్పను. |
| | 276 | యువ వైశాఖ బ ౧౦మీ సాయంకాలము శూర్పణఖ కర్ణ నాసికా చ్ఛేదము. |
| | 351 | ,, జ్యేష్ఠ శు ౧మీ ఉదయ వేళ కనక మృగ ప్రవేశము. |
| | 491 | ,, ,, ,, అపరాహ్ణము సుగ్రీవునకు సీత సొమ్ములు దొరకుట. |
| | 580 | ,, ,, శు ౮ మీ వాలి మరణము. |
| 4 | 56 | యువ మార్గశిర బ ౧౩ శీ మంగళవారము సుగ్రీవుడు రాముని చేరుట. |
| | 71 | ,, పుష్య శు ౧ మీ బుధవారము సీతాన్వేషణకై వానర సేన వెళ్ళుట. |
| | 74 | ,, పుష్య శు ౩ యా శుక్రవారము కపులు మాల్యవంతము చేరుట. |
| | 82 | ,, మాఘ- స్వయంప్రభ గుహలోనే వానరుల నివాసము. |
| | 147 | ,, ఫాల్గుణ శు ౧౩శీ సౌమ్య వాసరం సాయంకాలం హనుమ సువేలాచలమును చేరుట. |
| | 355 | యువ ఫాల్గుణ శు ౧౫ మీ గురువారం ఉదయము మధు వనమున కపి సేన చేరుట. |
| | 387 | ,, ,, శు ౧౫ మీ మధ్యాహ్నము మాల్యవంతమును దాటుట. |
| | 387 | ,, ,, శు ౧౫ మీ సాయంకాలము లవణోదధి ఉత్తర దిక్కును చేరుట. |

అశ్వా. పద్యము

| | | | | |
|---|---|---|---|---|
| | 442 | ,, | ,, | బ. ౨ యా విభీషణుడు రాముని శరణు జొచ్చును. |
| | 476 | ,, | ,, | బ. ౪ తి వారధి నిర్మాణ ప్రారంభము ౮ మికి పూర్తి. |
| 5 | 119 | ,, | ,, | భానువారము ఉత్తరాషాఢ అభిజి న్ముహూర్తమునందు లంకా ప్రాకారముపై దండయాత్ర. |
| | 435 | ,, | ,, | బ.౧౦ మీ అతికాయాది యోధుల మరణము. |
| | 567 | ,, | ,, | బ ౧౧ శీ . సాయంకాలము నుండి ౧౩ శీ సాయంకాలము వరకు ఇంద్రజి ల్లక్ష్మణ యుద్ధము. |
| | 720 | ,, | ,, | బ. ౪౦ స్యా అరుణోదయమున రామ రావణ యుద్ధారంభము. |
| | 748 | ,, | ,, | చతుర్థ యామమున వరకు రావణు బలము తగ్గును. |
| | 781 | ధాత చైత్ర శు ౨ య విభీషణ పట్టాభిషేకము. | | |
| | 851 | ,, | ,, | శు ౯ మి సాకేత నగర ప్రవేశము. |
| | 894 | ,, | ,, | శు ౭ మీ ధరాపాలనకై శ్రీరామునకు ముహూర్తము. |

'జనకిసు తాభ్యుదయ' కర్తకు గల బహు గ్రంథ పరిశీలన కిది యొక నిదర్శనము. ఇట్లు వివిధ విషయ సమాహారమై శ్రీరామ కథా సర్వస్వముగ రచింపబడిన యీ అముద్రిత కృతి (తాళపత్ర ప్రతి) ప్రత్యేకముగ పరిశీలింప దగినది.

## 5. శ్రీరామానుజాభ్యుదయము :

విశిష్టాద్వైత మతాచార్యుల యందు శ్రీమద్రామానుజులు (1019-1139) నాయక మణి వంటి వారు; అత్యంత దయాంతః కరణులు.

తమిళ సంస్కృత విశిష్టాద్వైత గ్రంథములయందు వీరిని గూర్చి విశేషముగా గలదు. అట్టి వానిలో 'అరాయిరప్పడి', వార్తామాల, 'గురు పరంపర',

'ప్రపన్నామృతము', 'దివ్యసూరి చరిత', 'హరి సమయ దీపము , 'పెరియ తిరుముడి అడైవు' ప్రసిద్ధములు. వీని యాధారముతో తెనుగు నందు దివ్య సూరి చరితము', 'ఆచార్య సూక్తి ముక్తావళి', 'సకల జీవన సంజీవనము' వెలువడినవి. ఆధునిక కాలమున శ్రీరామానుజుల వారిని గూర్చి అనేక గ్రంథ ములు వివిధ ప్రక్రియలలో వచ్చుచున్నవి.

వేంకట నరసింహాచార్య కవి సంస్కృత ద్రవిడ గ్రంథ పరిశీలన మొనర్చి 1560 గద్య పద్యములతో, 3 ఆశ్వాసములలో (తృతీయాశ్వాసము పూర్తిగా లేదు) 'శ్రీరామానుజాభ్యుదయ' నామమున ప్రబంధీకరించి, దీనిని వర వర మునులు అష్ట దిగ్గజాచార్య పురుషులకు విస్తరించి చెప్పినట్లు తెల్పెను.

సంస్కృతాంధ్ర భాషా వైదుష్యము సంప్రదాయాభినివేశము గల యీ గ్రంథకర్త సరళ పద సమన్వితముగ ప్రబంధమును తీర్చిదిద్దుట యందు కృతకృత్యులైనను మధ్య మధ్య సమాసయుత రచన అంత్య ప్రాసానుప్రాసాది శబ్ద గమక రచన మొనర్చి పూర్వ కవుల 'ప్రబంధ ప్రౌఢ వాసనా సంపత్తి'ని సొంపుగా కూర్చెను.

వీనికి తోడు తన యితర రచనల వలెనే దీనియందును దేశీయ పద ములు, లోకోక్తులు, పలుకుబడులు అధికముగా ప్రయోగించి, విశిష్టాద్వైత సంప్ర దాయ ప్రవచన రచన గావున తత్సంప్రదాయ పదములను సందర్భోచితముగ ప్రయోగించి ప్రబంధమునకు విశిష్టత చేకూర్చినాడు.

గ్రంథకర్త శ్రీ మద్రామానుజ కథను దాదాపు పూర్తి చేసినను 'తృతీయా శ్వాసము' ముగింపబడ నందున ఒక అసమగ్రత యేర్పడినది. దీనియందు చెప్పబడని విషయములలో - కూరేశుల దృష్టి యోగము, ఆయన అంధరకు మోక్షమును ప్రసాదింపవలసిన దని శ్రీరంగనాయకులను ప్రార్థించుట, యమక రత్నాకర శ్రీనివాస స్తవముల రచన, శ్రీరామానుజులు పరాశర భట్టరు చేయు పనులను ఎంబారున కప్పగించి తిరుక్కురుకప్పిరాన్ పిళ్ళచే తిరువాయ్ మొళికి వ్యాఖ్య వ్రాయించుట. ముఖ్య శిష్యుల గూడి యతిరాజుల వారు శ్రీరంగ మునకు విచ్చేసి సంప్రదాయ రహస్య విషయ కాలక్షేప మొనర్చుచు తమ యవ తార పరిసమాప్తిని శిష్య వర్గమునకు తెల్పి, పరమపద వాసు లగుట - ఇవి అసమగ్ర భాగములో నుండవలసిన విషయములు.

తెనుగున శ్రీరామానుజ కథా కథన రచనలందు కొన్ని స్వల్పమైన చేర్పులు, మార్పులు కన్పడు విధముగనే ముఖ్య కథకు భంగకరములు గానట్లు ప్రస్తుత ప్రబంధమున కొన్ని విషయములు వివరింపబడి, మరి కొన్ని సంక్షిప్త పరచ బడినవి. (ఆచార్య సూక్తి ముక్తావళి, History of Sri Ramanuja అను గ్రంథములం దున్న భిన్నముగా నీ విషయము లున్నవి).

1. రామానుజుల వారిని తంత్రియే యాదవ ప్రకాశకుల కప్పగించి విద్యావంతుని చేయు మని వేడును.
2 యాదవ ప్రకాశలు తీర్థయాత్ర నెపమున రామానుజులను వెంట నిడి కొని వెళ్ళి భయంకరాటవిలో వదలివేయును.
3. భార్య చేష్టలకు విసిగి ఉదయవరులే సన్న్యాసమును స్వీకరించినారు.
4. అత్తుళ్ళాయమ్మ వద్ద దాశరథి సంరక్షకుడు కూరేశు డీమెను వివాహమాడును.
5. రామానుజులు ఒక్కసారి మాత్రమే కాశ్మీరమున కరిగి శారదా దేవిచే తమ శ్రీభాష్య ప్రశంస విందురు.
6. తిరుమల శ్రీనివాస సన్నిధిని శ్రీరామానుజ సేవలే తెల్పబడినవి.
7. ధనుర్దాస నామమునకు బదులు 'ఉత్తమ క్షత్రియుడు' అని చెప్పి అతని భక్తి పరీక్షకు అంపశయ్యను ఏర్పాటు చేయించిరి.
8 పూర్ణార్యు కూరేశులు స్వయముగా నేత్రోత్పాటనము గావించుకొనిరి.
9. యాదవాద్రి స్వామి విషయము (3.358-450) విపులముగా గలదు.

**కవితా శైలి** :- సులభ శైలి ప్రబంధముగా చెప్పబడిన దీనియందు మధ్య మధ్య ప్రబంధ మార్గానుకరణ కలదు. అందు కొక ఉదాహరణ:

'హేమ సన్నిభ ధామ, ధామ సంయుత హేమ
హేమ ధామ సురత్న ధామములును,
చిత్ర జాలక సూత్ర, సూత్ర జాలక చిత్ర
మణి వితానాంచిత మండపములు

రాగ పద్మ సమాగ మాగ పద్మ పరాగ
సంతతాక్రాంతిత సౌధములును
పాకశాసన లోక, లోక శాసన ప్రాక
భాసుర ప్రాకార భవనములును
నాగ శాసన మరకత నవ్య ఖచిత
ద్వార గేహాళి వేదికా భార భరిత
తప్త గాంగేయ సంలిప్త దర్శనీయ
సోమ మణి యన శ్రీహరి ధామ మమరు' 1-80

అని పరమ పదమును వర్ణించెను.

శ్రీ వైష్ణవమునందు తదారాధన (దైవారాధన) కన్న తదీయారాధనకే (భాగవతారాధన)కే ప్రాముఖ్యము. భాగవత రూపమున విష్ణువు చరరూపిగా వచ్చినట్లు దీని యుద్దేశ్యము.

ఇదే విషయ మీ పద్యమున చెప్పబడినది :

కంజాక్షునకు చేయు కైంకర్యముల కంటె
నధికంబు స్వాచార్యునందు చేయు
కైంకర్యమును, సంతసంబె సాధిక్యంబు -
వైదేశికంబుగా వచ్చునట్టి
పరమ భాగవ తౌఘ భావుకం బరసియు
కైంకర్య మొనరింప ఘనుల మహిమ
సరసి వర్ణింపఁగా సబ్జ సంభవు కైన
శేషాహి కైనను శక్యమగునె?
యనుచు యతి నేత యీ రీతి నానతిచ్చు
వాక్య సంగతి నా సభవార లెల్ల
వీను లలరంగ రెన్నగా వినియు మదిని
సంతసించిరి తమ తమ స్వాంతములను. 2-275

విశిష్టాద్వైత విషయము చెప్పవలసి వచ్చినప్పుడు కవి పెద్ద పెద్ద వచనము రచించెను. వర్ణనములకు వచన మనుగుణముగా నుండును. శ్రీ రామానుజుల జన్మ తిథి విషయమున తారతమ్యము ప్రదర్శింపబడినది. పూర్వాచార్యులు చెప్పిన ఉడయవరుల తిరునక్షత్ర తనియ యందు—

'చైత్ర మాసే శుక్ల పక్షే పంచమ్యాం గురు వాసరే-' అని యుండగా ఈ కవి దీనిని 'పర షష్ఠి గిప్పతి వాసరమున-' (1-213) లని తెనిగించెను. మాస వార నక్షత్రములు సరిగానే యున్నవి, తిథి మారినది.

శ్రీమద్రామానుజుల జీవితమును గ్రంథస్థము చేసి ఈ కారణమున విశిష్టాద్వైత విషయముల వివరించుట గ్రంథకర్త యుద్దేశ్య మని ప్రబంధ రచనా పద్ధతి వ్యక్తపరచును.

## 6. నృ కంఠీర వాభ్యుదయము :

వేంకట నరసింహాచార్య కవి అనేక రామాయణములను, రామ కథ గల పురాణములను పరిశోధించి రామ కథాసర్వస్వముగ 'జనకసు తాభ్యుదయము'ను చెప్పినట్లుగనే సాత్త్విక, రాజస, తామస పురాణములను, సంహితలను సంస్కృత హరివంశ భాగవతములను పరిశీలించి, 'శ్రీ నృసింహ జయమున్ శాస్త్రోక్త మార్గంబుగా లోకాద్యత్ఖులు స్వాంతమందులను నాలోకించి మోదించ'నట్లు (1-71) 'నృ కంఠీర వాభ్యుదయ' ప్రబంధమును 1019 గద్య పద్యములును, 4 ఆశ్వాసములును గల గ్రంథముగా రచించి నృసింహావతార ప్రాముఖ్యమును నిరూపించెను.

ఎట్టన నృసింహ పురాణము 'బ్రహ్మాండాది పురాణోక్తం బయిన' శ్రీ నరసింహావతారమును చెప్పగా, పోతన భాగవతము (7 వ స్కం.) సంస్కృత భాగవతము ననుసరించినది.

సాత్త్విక పురాణములు శ్రీహరి యందరి కన్న మిన్న యని చెప్పుచుండగా తామస పురాణములు దీనిని అభ్యంతరించును. శరభ రూపి యైన శివుడు నృసింహుని కోడిపోయి శరణు వేడినట్లు లైంగికీయ త్రిపురీయ ప్రశ్నములు, ఆగ్నేయ

పురాణ చత్వారింశ దధ్యాయము, గరుడ పురాణమున అష్ట నవతితమాధ్యాయము, నారసింహ పురాణము, అగ్ని పురాణోత్తర ఖండము, ఉత్తర కూర్మము, పద్మ, వామన పురాణముల యందు వివరముగా గలదని వాని నుండి యనేకములగు ఉదాహరణము లిచ్చుచు (1-98) కవి నృసింహావతార కథను చెప్పినాడు. దీనిని దిలీపునకు వశిష్ఠుడు చెప్పినాడని సూతుడు శౌనకాది మహర్షులకు వినిపించెను.

ప్రబంధ పరమేశ్వరుని నృసింహ పురాణము అహోబిల క్షేత్ర మాహాత్మ్య ప్రతిపాదనము ముఖ్యముగా చేసికొనినది. ఈ గ్రంథకర్త నృసింహావిర్భావము, స్వామి కృత్యములు, భిల్లాంగన (చెంచులక్ష్మి)తో వివాహము,గరుడాద్రి యనబడు అహోబిలమున స్వామి నివసించు విషయములను ముఖ్యముగా చెప్పెను.

దీనియందు మొదటి రెండాశ్వాసములలో నృసింహావిర్భావము, శరభ రూపు డైన శివుని యుద్ధమున నృసింహ స్వామి యోడించుటయే ముఖ్యము. మిగిలిన రెండాశ్వాసములలో సరోవరమున రుక్మ పుష్పములయందు నీలాంశగా జనించిన బాలిక(ఈమెయే వసంత; తరువాత భిల్లాంగన)ను చెంచులు పెంచుట, నృసింహ స్వామి వేట, చెంచు రూపమున స్వామి వసంతను పరిణయ మాడుట-ఈ విషయము అధికముగా వర్ణింపబడినవి.

'నృ కంఠీర వాభ్యుదయ' కర్త నృసింహావతార ప్రాముఖ్యమునకు పురాణాదుల నాధారముగా గ్రహించి కథా కథనమున ఎఱ్ఱన, పోతనల ననుకరించి నాడు. కాని కొన్ని సందర్భములను మార్చినాడు. అట్టి వానిలో -

1. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు దితియందు కశ్యప మహర్షికి కలిగిన సంతాన మనెను (1-108). భాగవతమునందు వీరు భద్రానుభద్రు లను పేరులు గల రుద్రానుచరులు. భూత గణ ప్రేరితులై జనించినా రని కందు (3-479). నృసింహ పురాణము వీరిని దితి సుతు లనెను (1.105.106).

2. హిరణ్య కశిపుడు బ్రహ్మ వరమున దిక్పతుల జయించి జంభాసురుని పుత్రిను వివాహ మాడినాడు (1-117). ఈమె పేరు తెల్ప బడలేదు. ఎఱ్ఱన కూడ హిరణ్యకశిపుని భార్యపేరు చెప్పలేదు. పోతన 'లీలావతి' యనెను (7-102).

నారదీయ పురాణ కర్త ఉత్తానపాదుని బిడ్డయైన కల్యాణి హిరణ్యకశిపుని భార్య యనెను (8.122).

'నృకంఠీరవాభ్యుదయము'నను పురాణ కథలే ఆధార మని కవి తెల్పినను, తృతీయ, చతుర్థాశ్వాసము లందలి 'చెంచుకత' శ్రీ వేంకటేశ్వరుని గూర్చిన చెంచిత కత వలెనే కలదు. తెనుగున ఇట్టి కథలకు వాసంతికా పరిణయ, గరుడాచల యక్షగాన కథలు ప్రాణము పోసినవి. సవతుల పోరుకు గరుడాచలము ప్రసిద్ధి.

లోకమున ఆటవిక జాతులు నిరసింప దగినవి కావని ఆటవికులు సైతము అందరి వంటివారే యని నిరూపించుట ఈ కథలయందలి వస్తుధ్వని.

ఇట్టి వానిని గ్రహించిన యీ గ్రంథకర్త వాసంతీ, నృసింహుల పరిణయమును ఆటవికుల మధ్య వైదికముగా జరిపించి వారి కానందమును కల్గించినాడు. దీనివలన సాంఘికముగా ప్రచారమం దున్న చెంచిత కత నృసింహస్వామి చరిత్రతో కలసి సుప్రతిష్ఠిత మైనది.

**వర్ణనలు :** ఎఱ్ఱన, పోతనల నాదర్శముగా గ్రహించిన యీ గ్రంథకర్త నాల్గు సందర్భములయందు సుదీర్ఘ వచనముల వ్రాసి ప్రౌఢశైలిని వ్యక్తపరచెను. వీనియందు 1-169 స్తంభోద్భవ వచనమున గీతాక్షర పూరిత రచన గలదు. దీనివలన కవికి మంత్రశాస్త్రమునందు గల ప్రవేశముతో పాటు నృసింహోపాసకు డని భావించుట కవకాశము గలదు. ఉదా : "భైరవారావ రరరరణ ఝణఝణ ఝుణఝుణ ఘుంకార ఘుంఘుం ఘణాత్కార వంవం వహోంకార లలలలం లకార క్షక్షక్షకార గగగగ గకార్కార హాంహ్రీంహ్రీం నృసింహాహ్వానం ఖకఖకఖకారాది మహా మంత్ర వర్ణంబులు" అని గలదు.

**భాగవతము** (7-297) లోని "వక్షః కవాటంబు వ్రక్కలు చేయుచో ఘన కుఠారంబుల కరణి నొప్పు"- అను దానిని—

'కనక కశిపు వక్ష ఘటిత కవాటంబు వ్రక్కలించు కుఠార వైఖరగ' (1-181) అని అనుకరించినాడు.

**'కళాపూర్ణోదయము'** (2-70) నందలి 'కౌండిన్యాత్రి మరీచి...' యను మునుల పద్యము దీనియందు యథాతథముగా గలదు.

"సాంద్రతర చంద్రికా పయోబ్ధీంద్ర సుంద
రాంక పంకజ దృక్సముదంకృ తాతి
రాజమా నాభి లోరగ రాజ తౌల్య
భ్రాజియై తేజరిల్లెను రాజు మింట!" 3-127

అను 'చంద్రికా వర్ణన' పద్యమును సాంద్రతర చంద్రికగా నుంచినాడు,

వివిధ సందర్భములలో కవి యనేక వర్ణనల చేసి తన వర్ణనా శక్తిని నిరూపించెను. పద్యానుకరణమున 'మను చరిత్ర', 'భాగవతము'ల ప్రభావ మధికము.

**మనుచరిత్ర** - 'పంకజముఖి కప్పుడు మై
నంకురితం బయ్యె......'

**నృకంఠీరవ** - 'పంకజ గంధికి తనువున
నంకురితం బయ్యె...' 3-161

**భాగవతము** - 'చదివించిరి నను గురువులు...' 7-166

**నృకంఠీరవ** - 'చదివించిరి నను నొజ్జలు...' 1-135

ఇట్లు కొన్ని పద్యములు ప్రతిబింబముగా ననుకరింప బడినవి.

భక్త పాలనకై నృసింహుడుగా భగవంతు డవతరించినాడు. దశావతార ములయం దిది యొక్క ప్రత్యేకత ఇతర అవతారములలో భక్తపాలన మానుషం గికము; నృసింహావతారము దానికి భిన్నము.

నృసింహ స్వామికి సంబంధించిన వివిధ విషయముల గమనించి వేంకట నరసింహాచార్యు లీ ప్రబంధమును రచించినాడు (ఇది తాళపత్రప్రతి, అము ద్రితము).

## 7. విష్వక్సేన ప్రభావకరము :

శ్రీ వైష్ణవమున విష్వక్సేనునకు పరమ పూజనీయ స్థానము గలదు. ఆయన నుతియే విష్ణు స్తుతి. నారాయణ మంత్ర పునశ్చరణము వంటిది. విశిష్టాద్వైతమున ముఖ్యులగు ఆళ్వారాచార్యులకు విష్వక్సేనులే శ్రీమన్నారాయణ మంత్రోపదేశ మొనర్చి వారిచే దానిని వ్యాపక మొనర్చిరి. అందుకే విష్ణు సర్వ సైన్యాధిపతి వైకుంఠవాసి యైన విష్వక్సేనుని విఘ్న నివారణార్థమై శ్రీ వైష్ణవులు పూజింతురు.

విష్ణువునకు గల విష్వక్సేన నామము ('విష్వక్సేనో జనార్దనః-అమరము') సైన్య పర మైనది. ఈ విష్వక్సేనుడు నిత్యసూరి నివహాధిప సైన్యాధ్యక్షుడు. స్తోత్రమున 'చతుర్బాహుః శంఖ చక్ర గదా ధరః' - అని యుండుటచే విష్ణువునకు గల అర్చా ప్రాముఖ్యము విష్వక్సేనున కున్నట్లు వ్యక్త మగుచున్నది. విష్ణు సహస్ర నామ స్తోత్రమున 'యస్య ద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః...' శ్లోకము నందు విష్వక్సేనుని పారిషదులు విఘ్న నివారకు లని గలదు.

శ్రీవైష్ణవ కవులు, శ్రీవైష్ణవ సంప్రదాయాభిమాన కవుల రచనలయందు పంచాయుధములను, ఆళ్వారులను స్తుతించుటతో పాటు విష్వక్సేన స్తుతియు ఉండుట గమనించ దగిన విషయము.

ఇట్లు విశిష్టులైన విష్వక్సేనుల గూర్చి తెనుగున ప్రత్యేకముగా నెవ్వరును కావ్య రచన మొనర్పలేదు వేంకట నరసింహాచార్యులు సహజమైన తమ సంప్రదా యాభినివేశముతో 8 ఆశ్వాసములు, 780 గద్య పద్యముల యందు 'విష్వక్సేన ప్రభావరము' అను పేర ప్రబంధీకరించెను (ఇది తాళపత్ర ప్రతి, అముద్రితము.)

దీనిని సూతుడు శౌనకాది మహర్షులకు చెప్పెను.

**కథా విషయము :** బ్రహ్మ 'కుంతల' యను స్త్రీని సృజించి దుర్వాసుని తపోభంగమున కంపగా, ముని కోపగించి ఆమెను 'మానవాకృతి దాల్చి వన నిధిని పొందుదువు గాక!' యని శపించెను. కుంతల సువర్చలా నామముతో

మానవాకృతి దాల్చి సముద్రుని పరిణయ మాడును. వీరికి తులా రాశి పూర్వాషాఢా నక్షత్రమున విష్వక్సేనుడు జనించును.

ఇంద్రునకు 'శశి' వలన కలిగిన కూతురు సూత్రవతిని జలంధరు డను రాక్షసుడు హరింప యత్నింపగా విష్ణువు, ఇంద్రుడు, విష్వక్సేనుడు కలసి అతనిని సమయింతురు.

తరువాత సువర్చలా, విష్వక్సేనుల వివాహము జరుగును.

గ్రంథకర్త యీ కథకు మూలమును తెల్పలేదు. విషయము చిన్నదే కాని, వివిధ వర్ణనల వలన మూడాశ్వాసముల ప్రబంధ మైనది.

గీర్వాణ, పూర్వ గీర్వాణులకు మధ్య గల వైరమును కినియందు 'స్త్రీ' కారణమున (సువర్చల) భీషణ యుద్ధముగా చిత్రించినాడు. విష్ణుభక్తు లెవ్వరైనను వారిని రక్షించుట శ్రీమన్నారాయణుని విధి. ఇంద్ర, సముద్ర, విష్వక్సేనుల విషయమున నిది యథార్థమై రాక్షస హనన కారణ మైనది.

దుర్వాసుని తపస్సును విఘ్న పరచుటకు సృజింపబడిన 'కుంతల' ముని శాపగ్రస్తయై సువర్చలగా మారుట, ఆమె పుత్రుడు విష్వక్సేను డగుట కథకు ముఖ్యము. ఇంద్రుడు వరించి పరిణయ మాడిన 'శశి' రాక్షస పుత్రిక. వీరి కూతురు సూత్రవతి. ఇట్లు దివ్యాదివ్యములతో కథ ముడివడి యున్నది. కుంతల శాపము వరకే దుర్వాసుని ప్రసక్తి గలదు. నారదుడు రెండు ముఖ్య సన్నివేశములలో వచ్చి తన కలహ ప్రియత్వమును చాటును. దివస్పతి యైన యింద్రుడు అంతటికి విష్ణువే బాధ్యు డని నమ్మి మనుగడ సాగించును. సముద్రుడు మానవాకృతిని దాల్చినది కేవలము సువర్చలను వివాహ మాడుటకే!

విష్వక్సేనుడు దేవరాక్షస సమరమున ఎవ్వరును చంపలేని రాక్షసులను తన పావకాస్త్ర ప్రయోగమున ఖండించును.

రాక్షసుల దుశ్చర్యలు తెలియుటకై తృతీయాశ్వాసమున వారి సమరమును వివరముగా వర్ణించుటలో ఈ కవి దిక్కన ననుసరించినాడు.

ప్రబంధమున వర్ణనలకు ప్రాముఖ్య మిచ్చెను. సాంఘికాచారములు విపులముగా గలవు. అట్టి వానిలో అల్లుని వెదుకుటకై కూతురు గల తలిదండ్రుల బాధలు, వివాహ వర్ణన అనునవి ముఖ్యములు. విష్వక్సేనుని వివాహమును లౌకికముగనే జరిపించినాడు. ఎదురుకోలు, తలంబ్రాలు, మాంగల్యము, అప్పగింతలు, సాగసంపుట, వడి బియ్యము మొదలగు సన్నివేశముల చెప్పినాడు. శోభనము అతివేలముగా వర్ణింపబడినది.

**వర్ణనలు :** కుంతలం దుర్వాసుని వద్దకు వెళ్ళి తన చెలికత్తెలతో కలిసి వివిధ రాగముల నాలపించినది. వానిని కవి యిట్లు కూర్చి తనకు గల సంగీతాభిమానమును వ్యక్తపరచెను :

'శ్రీరాగ' మూహింపు కీర సన్నిభ వాణి !
'పున్నాగ' పాడవే సన్నుతాంగి !
'మాళవి' సేయవే మధుర సుధాధరి !
'కాంభోజి' యనగదే కంబుకంఠి !
'భైరవి' చేయవే పంకజ దళ నేత్రి !
'భూపాల' మూహింపు పువ్వు బోణి !
'మోహన' బాడవే ముకుర గండస్థలి !
'హిందోళ' యనగదే సుందరాంగి !
'మేఘ రంజని' బాడవే మించుబోణి !
'మలహారిని' బల్కు హాయలుగా కలభయాన !
'ఘూర్జ' రూహింప రాదటే కుందరదన !
యలరి 'కల్యాణి' యనరాదె హరి సుమధ్య' ! 1-120

సూత్రవతికి ఉద్దీపన కలిగించిన వెన్నెల గుంపు లిట్లున్నవి :

'ప్రాక్కకుప్ గిరి కన్య భ్రాంతిచే నలుచను
ధరియించు మందార దామ మనగ
నంతరిక్ష ధ్వాంత మను సౌధమునఁ గట్టు
జగజంపు మురార్యాల సర మనంగ
కలికి చీకటి లేమ కైశికమందుల
దగ గట్టు సంపెంగ దండ లనఁగ... (అనుగ్రహము)

యామినీ కాంత కటి తటమందు మెఱయు
జిలుగు బంగారు జిలిబిలి చేల మట్లు
పొంది కలరెడు మల్లెపూ పందిరట్లు
కలికి వెన్నెల గుంపు లాకసము గప్పె' 8.288

**అనుకరణలు :** మనుచరిత్రములోని 'నిడుద పెన్నేటి గుంపు...' పద్యము.

'సగరు ముమ్మనుమండు సత్వ గరిష్ఠుండై
వెయ్యేండ్లు తపము గావించు చోటు ...' 1-121

అని కొద్ది భేదముగా అనుకరింపబడినది.

**మనుచరిత్ర మందలి** (1-141) 'అమ్ముతై మరుహాజారమ్ముతై...' యనునది

'కమ్ముతై మరుకేళి కిమ్ముతై పొద లుండ
వేరె కొట్టంబులు వేయవలదు...' 2-40

అని అనుకరింపబడినది. ఇవియే గాక మరి కొన్ని సుప్రసిద్ధ పద్యముల ప్రతిబింబములు దీనియందు కలవు.

సకల విబుధ ప్రౌఢ సైన్యాధినాథుడైన విష్వక్సేనుని కథను కవి ప్రబంధీకరించి తెనుగు సాహితి కొక విశిష్ట కావ్యమును పరిచయ మొనర్చినాడు.

## 8. గోదా వధూటీ పరిణయము :

ఆండాళ్ నామమున ప్రసిద్ధయైన గోదాదేవి పన్నిద్దరాళ్వారులయం దున్న ఏకైక స్త్రీమూర్తి. శ్రీకృష్ణుని గూర్చి ఈమె పాడిన ముప్పది పాటలే 'తిరుప్పావు' అను దివ్య ప్రబంధము. విశిష్టాద్వైత సంబంధములైన సంస్కృత, ద్రావిడ గ్రంథములందు ఈమెను గూర్చి విశేషముగా గలదు.

తెనుగు సాహిత్యమున రాయల 'అముక్తమాల్యద' గోదా కథను రమ్య ఫణితిని వర్ణించినది.

మూడాశ్వాసములతో, 506 గద్యపద్యములలో 'గోదా వధూటీ పరిణయము' పేర వేంకట నరసింహాచార్యులు 'శృంగార ప్రబంధము'గా రచించెను.*[6] గోదాదేవి కథను చెప్పువారికి 'ప్రపన్నామృతము', 'గురు పరంపరా ప్రభావము' లందలి విషయమే ముఖ్యాధారము. గోదా వధూటీ పరిణయ కర్త తన ప్రబం

ధమునకు మూలమును చెప్పలేదు. దీనిని శ్రీరంగమున తిరుమామిడి మంద పమున శ్రీభాష్యకారులు చతుస్సప్తతి సింహాసనాచార్యులకు చెప్పుచున్నట్లు గ్రంథకర్త పేర్కొనెను.

రాయల కృతి 'ఆముక్త మాల్యద' యైనను దానియందు ఇతర కథలు గలవు. వీదో ఒక విధముగా వానికిని, గోదా కథకును సంబంధము కూర్చబడినది. ఇట్టి పద్ధతిని గమనించిన యీ కవి ప్రత్యేకముగా గోదా వైభవమును వర్ణించెను.

**కథా విషయము :** సనక సనంద సనత్కుమారుల శాప వశమున శ్రీవిష్ణు లోకము నందలి విష్ణు దౌవారికులు హిరణ్యాక్ష, హిరణ్యకశ్యపు లగుదురు. హిరణ్యాక్షుని బాధల పడలేక భూదేవి విష్ణువుకు మొరపెట్టు కొనగా ఆయన ఆ రాక్షసుని జంపి భూదేవిని వరము కోరుకొమ్మనును. అందు కామె నిఖిల చేత నోద్ధరణమునకై భూలోకమున నుద్భవింతు ననును.

ముకుంద పత్తియార్ దంపతుల కుమారుడైన భట్టనాథుడు విష్ణు భక్తుడు. స్వామి యానతి ననుసరించి పాండ్యరాజ సభలో వాదించి గెలుపొంది విశిష్టాద్వైత మత స్థాపన మొనర్చి తిరిగి రాగా, పిరాట్టి (లక్ష్మి) సంతసించి ఆయనకు బిడ్డగా మార దలచి తులసీ వనమునందు బాలికగా విష్ణుచిత్తునకు లభించును. ఆమెయే 'గోద'. గోదాదేవి పెరిగి యౌవనవతి యగుట, స్వామికి మాలికా సమర్పణ, శ్రీరంగనాథ స్వామి ఆమెను పరిణయుట, వివాహము దీని యందు గలవు.

దీనిని ఆచార్యుల వారు వివిధ వర్ణనలతో మూడాశ్వాసములుగ చెప్పిరి. గోదాదేవి సాక్షాల్లక్ష్మి; పరమాత్మ నితో నైక్యము నభిలషించిన జీవాత్మ. శ్రీరంగ నాథుని దివ్య సౌందర్యమును భుక్త ముక్తసుమ దామముచేతను, పరమాత్మను రమణీయ కావ్యమాల చేతను బంధించిన ధన్య చరిత.

ఈమెను మొదట సామాన్య బాలికగా భావించిన భట్టనాథుడు శ్రీరంగ నాయకుల అభిభాషణము వలన యథార్థమును తెలిసికొని తన భాగధేయమునకు ముదమంది పరమాత్మను దర్శించిన ధన్యజీవి !

మూల గ్రంథములలో లేకున్నను రాయలు గోదాదేవి చెలిక త్తెలుగా స్రగ్విణి, మరాళిక, ఏకావళి, హంసిని, మనోజ్ఞలను కల్పించెను

'గోదా వధూటి...' యందు 'చామర గ్రాహిణి' యను పరిచారిక శ్రీరంగ నాయక స్వామి పంపగా వచ్చి, గోదాదేవి వద్ద నున్నట్లు ఈ గ్రంథ కర్త చెప్పినాడు.

కవిగారు గోదాదేవి విరహము, వివాహము, సంభోగముల వర్ణించునప్పుడు ఆమె దైవాంశను విస్మరించి, సామాన్య మానవాంగనగా వర్ణించి, శృంగార ప్రబంధ నామమును సార్థక మొనర్చిరి.

కథకు మూలభూత మైన శ్రీరంగమును శ్రీవిష్ణు స్థాన మైన శ్రీవైకుంఠమును వర్ణించి (1.57-64), గోదాదేవి కోరిక ననుసరించి విష్ణుచిత్తుల వారిచే 108 విష్ణు క్షేత్రముల (2.36-44) వర్ణింప జేసి, నగర, వసంతర్తు, ప్రాత, స్సాయం సంధ్యలు, చంద్రోదయమును విపులముగా వర్ణించెను.

రాయలు విష్ణుచిత్తుని 'ద్వయ సద్మ పద్మ వదను' డనగా (1-77) ఆచార్యుల వారు —

'అనుదిన ప్రవృద్ధుడై భట్టనాథుండు
ఇతర శాస్త్ర గ్రహణ కిచ్చ పడక
మది నహర్నిశంబు మనుమంత్ర రాజమౌ
ద్వయమె తారకము గనితర మతిని' 1-104

అని 'ద్వయ' మంత్రమును మనుమంత్ర రాజముగా విశేషించిరి.

యామినీ వర్ణన నెపముతో సంఘమున గల దుష్ట వర్తనలైన స్త్రీలను - (8.30)

'దిమ్మరులై యిల్లిల్లు తిరుగు చుండెకి లేప
వదుని వంకలు పెట్టు వన్నెలాడి
అతి షండు దగునట్టి యవగుణు నిల్లాలు
శివసత్తి వావుల దిపురుటోతు
వయసు నందునె పుష్పవతి గాని కాంతయు
కల్యాణమే కాని కన్య పడుచు
వసివంత వేషియై వ్యభిచారి యగు నింతి
సుర విక్రయము చేయు సుందరాంగి

బుద్ధి హీనుండు నగునట్టి వృద్ధు భార్య
విరుల సేప్రొద్దు నమ్మెడు విప్రుమోషి
పీర లందరు యామినీ వేళలందు
వేడ్క కింపైన విటులను వెదకి కొనుచు-' తిరుగుచున్నా రనెను.

శ్రీ గోదాదేవి జనన కాలమును (1-189)—

'భాను కుళీర యుక్తమయి భాసిలు నావడి మాసమందునన్
భూనుత శుక్ల పక్షమున పుబ్బనె లార దినార్ధ మందులన్
మానవ బాలికాకృతిగ మంచి శుభోదయ వేళ లందునన్
సూనశరాభ దేహమున సోయగమున్ దసుకొత్త నింపుగన్'- అని తెల్పెను.

దీనికి -

'కర్కటే పూర్వఫల్గుణ్యాం తులసీ కాననోద్భవామ్।
పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగ నాయకీమ్॥'

అను ఆండాళ్ తనియ మూలము.

కవి యితర కృతుల కన్న దీనియందు ఛందస్సును శబ్ద ప్రయోగ విషయమును, వ్యాకరణ నియమములను లెక్కింపక యథేచ్ఛగా వ్యావహారిక పదములను ప్రయోగించెను.

## 9. శ్రీకృష్ణ శతానందీయము :

శ్రీమహాభాగవతము నందలి యొక సన్నివేశమును గ్రహించి విచిత్ర హాస్య కథా కృతిగా రచింపబడిన యీ గ్రంథము 3 ఆశ్వాసములు. 550 గద్య పద్యములు గలిగి అముద్రితముగా నున్నది (తాళపత్ర ప్రతి). శ్రీకృష్ణావతారమునకు చెందిన పలు రచనలను చదలు శ్రీమహాభాగవతము (10-11వ స్కం.), బ్రహ్మ వైవర్త పురాణము, విష్ణు పురాణ, గర్గ భాగ వతాదుల యందు చిత్రింపబడి రసిక జన నూస సాహ్లాద కరములుగా నున్నవి.

ఈ గ్రంథకర్త భాగవత దశమ స్కంధమున (502-505 పద్యములు) గల బ్రహ్మకృత శ్రీకృష్ణ గోవత్సాపహారణ కథా భాగమునుౘ7 గ్రహించి దాని యందు పోతన గారి భాగవతమున లేని భాగమును ప్రబంధీకరించెను.

**కథా విషయము :** జనమేజయునకు సర్పయాగానంతరము శుక మహర్షి యీ కథను చెప్పును

బ్రహ్మ వద్దకు నారద మహర్షి వెళ్ళి భూలోక విశేషములు తెల్పుచు శ్రీ కృష్ణుని క్రీడల వర్ణించి ఆయన బకాసురుని, అఘాసురుని సంహరించి, గో, గోపాలుల రక్షించిన విధము దెల్పి, "భూలోకమున కృష్ణుడొక బ్రహ్మ యైనాడు; దానివలన నీకు అవమానమే జరుగుచున్న" దని తెల్ప, విధాత భూలోకమున కరిగి చూడదలచి సరస్వతికి చెప్పి బయలుదేరును.

గోవర్ధనాచల ప్రాంతమున గోవులతో నున్న గోపాలకుల చూచి తన ప్రభావమును నిరూపించుటకై వారిని, గోవులను అదృశ్యము చేయును. దూరముగా నున్న గోపాలురు వచ్చి కృష్ణునకు జరిగిన విషయము తెల్ప, ఆయన తెలియని వాని వలె నటించి గోప వేషమున అడవి అంతయు గాలించి బ్రహ్మ యున్న తావును గమనించి తాను బ్రహ్మ వేష ధారియై సరస్వతి వద్దకు వెళ్లును.

తన పని ముగించుకొని వచ్చిన అసలు బ్రహ్మను సత్యలోక ద్వారపాలురు లోనికి పోనీయక 'నీవు మాయావేషధారి'వని నిరోధింతురు. సరస్వతి వచ్చి ఆయనను కొనిపోవగా ఇరువురు బ్రహ్మలు వాదించుకొందురు. తరువాత భూలోకమున కుభయులు వచ్చి బృందావనము విడిది చేయగా మాయా బ్రహ్మ తన నిజ రూపమును చూపి బ్రహ్మను ఆశ్చర్య పరచును. విధాత దాచిన గో, గోపాలురను రప్పించి కృష్ణుని మహత్త్వమును గొనియాడి వెళ్ళిపోవును.

దీనిని కవి తన సహజ వర్ణనా చాతుర్యమున పెంచి కళాపూర్ణోదయ మందలి రంభ, మాయారంభల సన్నివేశము వలె చిత్రించినాడు.

**కథా మూలము :** పోతన భాగవతమున బ్రహ్మ గోవులను, గోపాలకులను మాయము చేసినట్లు గలదు కాని, కృష్ణుడు మాయబ్రహ్మగా మారినట్లు లేదు.

సంస్కృత భాగవత వ్యాఖ్యలలో వ్యాసాచార్య కృతమైన శుక పక్షీయాఖ్య వ్యాఖ్యయందు ఒక్క శ్లోకమున ఈ విషయము చెప్పబడగా దీని ననుసరించి వచ్చిన 'వీర రాఘవీయ చంద్ర చంద్రికాఖ్య వ్యాఖ్య' దశమ స్కంధ త్రయో

దశాధ్యాయమున 'వత్సాపహార ఘట్టః' అను శీర్షికను సంక్షిప్తముగా మాయా బ్రహ్మ కథ చెప్పబడినది. వీరరాఘవీయ వ్యాఖ్యా విషయ శ్లోకములను 'భావార్థ దీపికా వ్యాఖ్య పేర్కొనగా భావ ప్రకాశికా వ్యాఖ్య వీరరాఘవీయ విషయమునే యథాతథముగా నిచ్చినది.*8

వీని యన్నిటి వలన తెలియున దేమన పోతనగా రనుసరించిన సంస్కృత భాగవతము నందు పాఠముల భేదముచే ఈ కథ ప్రక్షిప్తమైనందున వారి దృష్టి పడలేదు. వీర రాఘవీయ వ్యాఖ్యయందు గల కథా భాగము :

'బ్రహ్మాపి స్వాసనస్థేన చతురాస్యేన శౌరిణా।
మోహితైః స్వ పుర ద్వారైః పరిభూతో న్యవర్తత॥'(శ్లో 46. పు 62)

'తతః కిం వృత్త మిత్యపేక్షాయా మాహ బ్రహ్మేఒపీతి వత్సాన్, స్వత్స పాలాంశ్చ తిరోధాపయిత్వా బ్రహ్మాపి స్వస్థానం గతః. తత్ర స్వస్యాసనే స్థితేన చతుర్ముఖ రూపేణ శౌరిణా మోహితై ర్ద్వారపాలైః పరిభూతః పరమేష్ఠీ స్వాసన మధితిష్ఠ త్యేవ. క స్త్వ మాగతోఒసీ త్యేవం పరిభవం ప్రాపిత స్తతో న్యవర్తత'. అని గలదు.

ఈ వింత కథను గ్రహించి ప్రపథమముగా తెనుగున ప్రబంధీకరించినది 'శ్రీకృష్ణశతానందీయ'కర్తయే!*9

తెనుగు భాగవత కథను గ్రహించి సంస్కృత భాగవత విశేష వ్యాఖ్యల యందు గల విషయమును జోడించి వర్ణనలు, సంభాషణలు మొదలగు వానితో నిట్లు చిత్ర కథా ప్రబంధ మొనర్చిన యీ కవి తన కథా కథన శక్తిని ప్రదర్శించెను.

నారదుడు బ్రహ్మవద్దకు వెళ్ళి శ్రీకృష్ణుని గూర్చి ఇట్లు తెల్పును—

'వనర నీవు మున్ను వ్రాసిన గంతయు
ననుభవింప చేతు వంగరికిని-
యుర్వి నీదు నాజ్ఞ నుల్లంఘనము చేసి
ప్రతి యొనర్చె తానె బ్రహ్మ యనుచు!' (1వ ఆశ్వా.)

అని చెప్పగా విధాత భూలోకమునకు వెళ్ళి చూడ సిద్ధపడును. అతని వెంట సరస్వతి వత్తు నని పల్కగా అనేక నీతులు చెప్పి ఆమెను వారించెను (ఆమె ఇతని ననుసరించినచో మాయా బ్రహ్మ ప్రసక్తికి అవకాశ ముండదు).

'అటవి చరించు వేళ, గురు నందను విద్యలు నేర్చు నత్తఱిన్
పటిమగ శత్రు వర్గములపై చను చోట తపస్సమాధి యు
త్కటముగ నుండు నచ్చటను ధారుణి మాయను బంద్రు గావునన్
దటుకున ముద్దురాంద్రతౌను ధర్మము గాదు చనంగ మానినీ! (1వ ఆ.)

ఇట్లు అనేక విధముల (15 పద్యములలో) వాణికి బోధ చేయును. మాయా బ్రహ్మ వేషమున సత్యలోకము చేరి శ్రీకృష్ణుడు 'రాబోవు అసలు బ్రహ్మయే మాయ బ్రహ్మ, కృష్ణు డా వేషమున రాగలడు, కావున అతనిని వారించవలె'నని చెప్పచు—

'విశ్వమున గల్గు చౌషష్టి విద్య లెల్ల
నేర్చి బ్రహ్మాండమునకు తానె నేత యనుచు
మగువ! యాతఁడె యాతఁడు మద మరాళ
మెక్కి వచ్చుచు మెఱగు నల్దిక్కులందు.' (2-ఆ)

అని ముందుగనే ఆమెకు హెచ్చరిక చేసి జాగ్రత్త పడినాడు. సరస్వతీ గృహా మున ఉభయ బ్రహ్మలు తారసిల్లినారు. వాదము ప్రతి మించినది. ఈ సన్నివేశ మున కళాపూర్ణోదయము నందలి రంభ, మాయారంభల సంభాషణ ననుకరించి, యిట్లు వాదింప చేసినాడు :

'నీ వెవ్వఁ డనినచో నీ వెవ్వఁ డనునను
నౌరౌర యనఁగ నౌరౌర యనుచు
బ్రహ్మ నే రా యన బ్రహ్మ నే రా యను
నిక్కకురా యన నిక్క కనుచు
నోయి పోపో యన నోయి పోపో యను
కాని మ్మటన్న కాని మ్మటంచు
మద మణంచెద నన్న మద మణంచెద నను
లేలె మ్మటన్న లేలె మ్మటంచు

పరుల మగువల శాసింప వలవ దనిన
పరుల మగువల శాసింప వలవ దనుచు
వాద మొనరించె బ్రహ్మతో నాది బ్రహ్మ
వాణి వందన్న వడలక వార లిట్లు' (3 ఆ)

కళా పూర్ణోదయము (3-207) న 'ఒట్టు సుమీ యన్న ఒట్టు సుమీ యంచు...' అను పద్యమునకు ఇది పూర్తి యనుకరణ.

ఈ గ్రంథమున పుర, సముద్ర, నదీ, ఋతు, యుద్ధ, గో, గోపాల వర్ణనలు విపులముగా నున్నవి. చిత్రకవిత చెప్పబడలేదు.*10

ఆటాకు పుస్తకము మధ్య మధ్య జీర్ణమైయున్నది.

## 10. జాంబవతీ కుమార శృంగార విలాసము :

సహాంగి దుర్యోధనుల పుత్రి యైన లక్షణను జాంబవతీ శ్రీకృష్ణుల కుమారుడు సాంబుడు పరిణయ మాడుట ముఖ్యేతివృత్తముగా గల యీ కృతి 5 అశ్వాసములతో, 162 గద్య పద్యములతో కూడి ఉన్నది. ఇది అముద్రితము (తా. ప్ర.).

కవి యీ కథను సూతునిచే శౌనకాది మహర్షులకు చెప్పించెను.

**విషయము :** ఉద్యాన వనమున విహరించుచున్న 'లక్షణ' సాంబుని గూర్చి చెలికత్తె యైన 'మందహాస' ద్వారా తెలిసికొని అతని పొందు గోర యత్నించును. ఇంతలో అమరు నారదుడు ప్రత్యక్షమై సాంబుని పొందు టకు నారాయణ మంత్ర జపము చేయవలె నని బోధించి చెప్పును. ఒక సంవత్సరము తరువాత లక్షణకు స్వప్నమున సాంబుడు కన్పడి రతిదేల దేల్చి పోగా, మందహాస కీ విషయమును లక్షణ తెల్పును.

దుర్యోధనునితో మందహాస సంప్రదించి లక్షణా స్వయంవరము నేర్పాటు చేయించగా, కురురాజు బలరామున కీ విషయమును తెలియ పరచక పోవుటవలన దీనిని గమనించి సాంబుని వద్ద కొక బ్రాహ్మణుని రాయబారిగా పంపి పను

వివాహ మగునట్లు చేయు మని ప్రార్థించును. విప్రుని వలన సమాచారము నంది సాంబుడు బయలుదేరి మాయా విద్యచే స్వయంవర మండపమున ప్రవేశించి, లక్షణను వివాహమాడి, ఆమెను గైకొని వెళ్ళుచుండ దుర్యోధనాదులు సమర మొనర్తురు. నారదుని వలన సాంబుని విషయమును తెలిసికొని బలరాముడు బయలుదేరి తన హలముచే హస్తిన నుద్ఘాటింప యత్నించును. భీష్ముడు దుర్యోధ నునితో మాట్లాడి బలరాముని కోపము నుపశమింప చేసి - కురురాజు తాలాంకుని శరణు వొచ్చునట్లు చేయును. అనంతరము లక్షణా, సాంబుల వివాహము వైభవ ముగా జరిగినది. బంధువర్గము కల్యాణ భోజనము లొనర్చినారు.

తాళపత్ర గ్రంథమున 5 వ ఆశ్వాసము పూర్తిగా లేదు. ఇది వివాహ భోజనముల వద్ద ఆగిపోయినది. లక్షణా సాంబులు ద్వారక చేరుట, వీరి శృంగార లీలా విలాసములతో ఈ కావ్యము ముగింపబడి యుండును.

**మూల కథ :** తెనుగు సాహిత్యమున సాంబ విలాస, సాంబోపాఖ్యాన ములు యందు లక్షణను సాంబుడు పరిణయ మాడిన కథ ముఖ్యము. 'లక్షణా కల్యాణ', 'లక్షణా పరిణయము' లు శ్రీకృష్ణుని అష్ట మహిషులలో నొకర్తుక యైన 'లక్షణ' పరిణయమును చెప్పినవి. అందుకే కవి తన గ్రంథమున కీ పేరు పెట్టినాడు (సాంబ శబ్దము శివుని పేర్లలో నొకటిగా ప్రసిద్ధి యైనందున కూడ ఇట్లు మార్పు చేసినాడేమో!)

భాగవత దశమ స్కంధ ఉత్తర భాగమున (556-593 పద్యములు) గల చిన్న కథ సాంబోపాఖ్యానమున కాధారము. జాంబవతీ...' కర్త భాగవత కథను కొన్ని మార్పులు చేసి ప్రబంధోచిత వర్ణనలతో తన గ్రంథమును పెంచినాడు.

సంస్కృత భాగవతము మూలము (3-1-30) శ్రీధరీయ వ్యాఖ్యయందు సాంబుడు పూర్వ జన్మమున పార్వతీ గర్భ సంజాతు డని గలదు. ఈ విష యము తెనుగు భాగవతమునందును, భాగవతము ననుసరించి చెప్పిన సాంబ కథా గ్రంథములందును చెప్పబడ లేదు. విశిష్టాద్వైతాభిమాని యైన 'జాంబవతీ-' కర్తయు ఈ విషయమును పేర్కొన లేదు.

ఆంధ్ర భాగవతమునందు లక్షణకు చెలికత్తె యున్నట్లు గాని, బ్రాహ్మణ రాయబారము గాని లేవు. 'జాంబవతీ-' కర్త వీనిని ప్రత్యేకముగా చెప్పినాడు. 'మందహాస' యను చెలికత్తె, రాయబారియైన విప్రుడు లక్షణా పరిణయ ముఖ్యులుగా చిత్రింపబడిరి. బ్రాహ్మణ రాయబార ఘట్టము పోతనగారి రుక్మిణీ కల్యాణము నందలి బ్రాహ్మణుని కనుకరణము.

కవి యీ ప్రబంధమున వర్ణనలకు ప్రాధాన్య మిచ్చి తన నైపుణ్యమును ప్రదర్శించుటకో యనినట్లు ప్రౌఢ శైలిని సుదీర్ఘ వచనముల నధికముగా రచించెను. ఉత్కలికా ప్రాయము లైన యీ వచనములు శైలియందు 'కాదంబరి'ని, రచనా ప్రభావమున 'శరణాగతి గద్య','శ్రీరంగ నాథ గద్య'లను స్ఫురింప చేయును. ఇట్టివి ఇరువది వచనములున్నవి. వీనికి తోడు శ్లిష్ట బంధము లైన పద్యముల రచించినాడు. అందు కొక ఉదాహరణ :

'శర ధారా శత ధార వక్ష కర వాచాలోచ నాతీక ని
ర్భర ధారా ధర దార ఘోర తర శోభా భాసమానంబు భీ
కర హుంకార మహాద్విష ద్వర శిరస్కారోక్తి గర్జా ప్రభు
స్వర మా సైన్యము గ్రాలె నాలమున భూషారు క్తటి త్కాండమై'(3-42)

సైన్య వర్ణనము గల యీ పద్యము కవి బ్రహ్మ యుద్ధ వర్ణన సూతగా గొని రచించినది.

బలభద్ర వర్ణనమున-శేషాంశ సంజాతు డైన అయన వివిధ నామములను శబ్ద శ్లేషచే నిట్లు తెల్పెను.

'శేషత్వ మాత్మ విద్వేషవ ద్వాత్రవ
ప్రాణాని లావహారతలు దెలుప
కామపాలత్వ మిష్టామి తాలశక్య దు
స్తర మనోరథ పూర్తి కరతదెలుప
రేవతీశత్వ మా త్రిభువ నాంతర చర
త్ప్రాణి షణాహ్లాద పరత దెలుప
నీలాంబరత్వ మనేర మిత్ర బుధార్య
తారా శతాధారతై బెలుంగ

ద్వాపర సృష్టి శ్రీశావతార మని యి
జాపు లభినుతిఁ జేయ శేషాంశమున ద
యాప్తి వసుదేవ తనయుఁడై యవతరించి
యుల్లసిందును బలభద్రుఁ డొప్ప మిగుల' (1-998)

**అనుకరణలు :** దీనియందలి వర్ణనలు అధిక భాగము వసుచరిత్ర ననుకరించినవి. మరి కొన్ని భాగవత ప్రభావమునకు లోనైనవి. అట్టి వానిలో కొన్ని—

'కేళీ సరో భంగ పాళీ లసూత్తుంగ
డోలా పరంపర లూగి యూగి
బాలామి లారామ డోలాగమ స్తోమ
శాలా పథంబుల సాగి సాగి...' 1-115

ఇత్యాది వారణా పుర విహరణ గంధవహ వర్ణనము శైలి, భావముల యందు వసుచరిత్రను గుర్తుచేసి—

'ఏలా లతా జాల డోలా సమాలోల బాలామణీ గాన భాసురముల' స్ఫురింప జేయును.

వసు... (2-58) 'ఈ లలంటి బోరాడు పేరాశము జవాది' అనునది,
జాంబ... (2-78) అరామ సగ మెన్న తారామణుల మించు
నారామ సడుచక్కి సరుగ వలయు
నో పాటలాధరి లాపానలము గుంద
నా పాటలావని కరుగ వలయు...'

వసు... (3-170) 'ధ్యానంబు హృదయ వా స్తవ్య కుటుంబికి
నావాహనము జగ ద్వ్యాపకునకు...'

జాంబ... (2-107) 'ధ్యానంబు పుండరీకాక్ష నందనునకు
నా వాహనము సుమ స్యందనునకు...'

బహు గ్రంథక ర్తయైన యీ కవి పద్యము లొక దానితోనివి మరియొక దానిలో గలవు.

'శ్రీ భారతాది ప్రసిద్ధ గీర్వాణాంధ్ర...' (1-11) ఇత్యాది పద్యము విష్వక్సేన ప్రభాకరమున గలదు.

'అలరుచు నిట్లనెం జెలి...', 'తమి రాహంక్రతి మాన్పి చందురుడు...' (జాంబ-1.207.276) అను పద్యములు 'నృకంఠీవ వాత్యుదయము (8.201.288) నందు చేరినవి. రెంటికిని సందర్భము సమానము.

ప్రభావతీ ప్రద్యుమ్న కథను మననము చేసికొని భాగవతమున గల చిన్న కథను గ్రహించి వేంకట నరసింహాచార్య కవి గంభీరార్థోద్య త్పద శుంభ త్పద్య ప్రబంధ శోభన రచనారంభ కుతూహలము' (1-66)న, 'విస్తార గభీ రార్థ చారు శబ్దాలంకార పద పద్య శుంభదవారిత వాగ్జృంభణము' ల (1-18), 'జాంబవతీ కుమార శృంగార విలాసము'ను రచించి తన కథా వర్ణనా శక్తుల నిరూపించు కొనినాడు.

## 11. క్షత్రబంధు ధూపాఖ్యానము :

వేంకట నరసింహాచార్యులు భారత, భాగవత, రామాయణముల నుండియే గాక విష్ణు కథా ప్రాధాన్యము గల పురాణముల నుండియు కథల గ్రహించి వానిని సంప్రదాయానుకూలముగా ప్రబంధీకరించి తన గ్రంథముల యందు వస్తు వైవిధ్యమును ప్రదర్శించెను.

అట్టి వానిలో 'క్షత్రబంధు ధూపాఖ్యానము' పేర్కొనదగినది. దీనియందు 3 ఆశ్వాసములు, 970 గద్యపద్యములు ఉన్నవి. 1964 లో ఇది ముద్రితమై నది.

**కథా విషయము :** అయోధ్యా నగర పాలకుడైన సుధర్ముని పుత్రుడు క్షత్రబంధుడు బాల్యమునుండి దుర్మార్గుడు. రాజ్యాధికారము ప్రాప్తించిన తర్వాత ఇతని దుష్కృత్యములు అధిక మైనవి. ప్రజా కంటకుడగుటయే గాక క్షత్రియోచి తము గాని మృగ మాంస భక్షణము చేయుచు, కొంత కాలమున కది లభింపక పోవుట వలన మనుష్య మాంస భక్షణము చేయుచు, ముని శాపముచే రాక్షసు డగును. కొన్ని వత్సరము లిట్లు గడచిన తరువాత వ్యాస శిష్యుడైన పుండరీ

కుని కారణమున నితని శాపము తీరి మరల రాజ్యాధికారము వహించి సత్ప్రభువుగా నుండును. ముఖ్యమైన యీ కథను గ్రంథకర్త అనేక వర్ణనలను, విశిష్టాద్వైత సంప్రదాయ విషయములను జోడించి, ద్వయ మంత్ర ప్రాధాన్యమును నిరూపించుచు, దాని వలననే క్షత్రబంధుడు ముక్తుడైనట్లు తెల్పెను.

**మూలము:** కవి దీనిని 'భవిష్యోత్తర పురాణోత్తర ఖండంబున వర్ణింపబడిన క్షత్రబంధూపాఖ్యానం బను నితిహాసంబు' (1-105) అని తెల్పి, 'విబుధ వితతికి వీనుల విందు గాఁగ' 'ఆంధ్రాభాషను రచింతు' నన్నాడు. (1-15)

1. విశిష్టాద్వైత సంప్రదాయ గ్రంథములయందు

   'పాపిష్ఠః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చ పుణ్యకృత్।
   ఆచార్యవత్తయా ముక్తౌ తస్మా దాచార్యవాన్ భవేత్॥'

   అనునట్టి ఆచార్య కృపా కటాక్షమే జీవుని మోక్షమునకు ముఖ్యమైనదను ఆచార్య ప్రశస్తిని తెలియబరచు సందర్భమున చెప్పబడినది (రహస్య త్రయము'న). దీనియందు క్షత్రబంధుడు దుర్మార్గుడు కాగా ఆచార్యులైన పుండరీకుని వలన మోక్షము నందినట్లు గలదు.

2. ఆంధ్ర మహాభాగవతమున 'క్షత్రబంధుం డను వాడును బ్రాహ్మణార్థంబు ప్రాణ పరిత్యాగంబు జేసి నిర్మలం బగు యశంబు వడసె' నని దశమ స్కంధ ఉత్తర భాగము నందు (722 వ వచనము) చెప్పబడినది.

3. మహాభారతము అనుశాసనిక పర్వమునందు (4, 46-53) క్షత్రబంధుని దర్శన సంభాషణముల వలన ఒక మాలవాని శాపము దీరి అతని ముందటి జన్మమైన బ్రాహ్మణత్వ మందినట్లు గలదు.

4. 'విలక్షణ మోక్షాధికార నిర్ణయ' మను గ్రంథమున 27వ, 28వ పుటలు) మాంసాహారి యైన క్షత్రబంధున కనుదినము మాంసమును తెచ్చి యిచ్చు భృత్యవర్గము ఒకనాడు అది లభింపనందున పసిబిడ్డ మాంసమును తెచ్చి యిచ్చిరి. దానిని తినినది మొదలు నర భక్షణ కుపక్రమించి, ప్రజలను చంపుచున్న క్షత్రబంధువునకు నారదుడు కన్పడి నరుకునపు డెల్ల 'గోవింద' నామోచ్చారణ చేయు మని తెల్పె, తత్సంకీర్తనముచే నారాజు ముక్తుడు డాయెను. ఇచట నారదు డను సదాచార్యుని వలన క్షత్రబంధునకు ముక్తి కలిగినట్లు చెప్పబడినది.

**మార్పులు :** ఈ గ్రంథకర్త భవిష్యోత్తర పురాణ కథను తెనిగించుచున్నా నని తెల్పి సూతునిచే శౌనకాది మహర్షుల కీ కథను వినిపింప చేసినాడు. చిన్నదైన కథా వస్తువును అనేక సన్నివేశముల కూర్చి సంప్రదాయ ప్రవచనమునకు అధిక ప్రాధాన్య మిన్పుట వలన కథా విస్తృతి పెరిగినది. దీనియందు భారత, భాగవత కథా విషయమును గ్రహింపక 'విలక్షణ మోక్షాధికార నిర్ణయ' మండలి విషయమును తీసికొని దానిని కొంత మార్చి చెప్పెను. గ్రంథారంభమున సూతుడు శౌనకాది మహర్షులకు తెలిపిన విషయ మంతయు (1.47-105) విశిష్టాద్వైత సంప్రదాయ గ్రంథములయందు గల దానిని వివరించుటే!ఆచార్యుల వారి సంప్రదాయ విద్యా నిష్ఠాత్వమున కిది యొక నిదర్శనము.

క్షత్రబంధుని బాల్యము, దుశ్చర్యలు, రాజ్యపాలన, ప్రజల బాధలు, ప్రభువు మాంస భక్షణ, భక్ష్యాభక్ష్య వివేచన, మునుల యుపదేశము, రాక్షసత్వ మావేశించిన క్షత్రబంధుడు గ్రామముల నిర్ధూమ ధామముల చేయుట, రాజ్యమున కరువు, అడవుల యందు తిరుగుచున్న రాజునకు వ్యాస శిష్యుడు పుండరీకుడెదురగుట, క్షత్రబంధుని పరీక్ష, పుండరీకుని కృత్రిమ మరణము, మంత్రోపదేశమునకు రాజు పరితపిల్లుచుండగా దొమ్మరి దానికి మంత్రాక్షరములు లభించిన విషయమును తెలిసికొని ఆమెను వెదకుచు వెళ్ళిన క్షత్రబంధుడు దొమ్మరి వద్ద భృత్యునిగా చేరి మంత్రాక్షరము లున్న తాటంకమును పొంద యత్నించుచుండ, అదే సమయమున ఆ రాజ్య పాలకుడైన రాజు కూతురును బ్రహ్మరాక్షసి ఆవేశింప ఆచార్య భక్తి గల క్షత్రబంధుని వలన ఆమెకు స్వస్థత చేకూరును. రాజు సంతోషించి అన్నదాన మొనర్చి దొమ్మరుల ఆటను ఏర్పాటు చేయగా అప్పుడు క్షత్రబంధునకు దొమ్మరి దాన నిర్ణాళిరణమున గల మంత్రాక్షరములు లభించ వానివలన నితడు ముక్తుడగును. బ్రహ్మరాక్షసి వదలిన రాజపుత్రితో వివాహమై తిరిగి తన రాజ్యమునకు వచ్చి ప్రజాపాలన చేయుచుండును

ఇది ఆచార్యులవారి క్షత్రబంధుని విషయము. ఈ కథను తెల్పుచట్టిదే 'తిరునామము'ల*11యందు 'తిరుమంత్రపు పాట' యొకటి గలదు. మంత్రము హరిదాసునకు గాక వేశ్యకు లభించగా భగవంతుడు గోపాల వేషమున ధర్మరాజు ద్వారా ప్రయత్నించి హరిదాసున కుపదేశించినట్లు తెల్పబడినది. గ్రంథ విషయమునకు దీనికి పాత్రల భేదమే కాని ఫలితము రెంటియందును సమానమే!

## కథాకథన పద్ధతి :

దీనియందు విశిష్టాద్వైత విషయ ప్రవచన మధికమైన దురవగాహముగా నుండుననని ప్రబంధానుకూలమగు వర్ణనలు, నూతన సన్నివేశములను కూర్చి ఈ ఉపాఖ్యానము నొక ప్రబంధ మొనర్చెను. అందుకే క్షత్రబంధుని దుశ్చర్యలు అతనికి రాక్షసత్వ మావేశించి నప్పుడు ప్రజల భయము, రాజ్యస్థితి, దుష్ట ప్రభు పాలనను చిత్రీకరించినాడు. ఈ సందర్భమున వర్ణింపబడిన కరువు 'కవిగారి' 'దేవరకొండసీమ' స్థితి! (1-162-170)

వ్యాసానుమతిచే పుండరీకుడు క్షత్రబంధు నన్వేషించినపుడు అనేక విష్ణు క్షేత్రముల సంచరించి ఒక దేవాలయ ప్రాంతమున క్షత్రబంధుని గని అతని ప్రపన్నునిగా నొనర్చి, శ్రీరంగ ప్రాంతమున కృత్రిమ తనువును వదలెను. అష్టాక్షరీ ద్వయ మంత్రములు శ్రీమన్నారాయ ణాధీనములు. శ్రీరంగనాయక స్వామి సాక్షాన్నారాయణుడు. ఈ కారణమున కవి పుండరీకుని ఇచట మాయము చేసి క్షేత్ర ప్రభావమును నిరూపించెను.

రాజున కవసరమైన మంత్రరాజము దొమ్మరి దానికి లభించినది. అందు వలన కవి వీరి వేష భాషా ప్రవర్తనలను, నీచ జార చేష్టలను వివరముగా వర్ణించి ఆ నాటి దొమ్మరుల చిత్రీకరించినాడు. దేవరకొండ, మిర్యాలగూడెం ప్రాంతములు దొమ్మరులిప్పటికి నిట్లే గలరు. వీరి మధ్యన నీచవృత్తి నొనర్చుచు క్షత్రబంధుడు కాలము గడుపుట దైవ పరీక్షయే యని వ్యాసునిచే చివరకు చెప్పించెను.

కథయందు ముఖ్యమైన మలుపు చోళరాజ పుత్రికి బ్రహ్మరాక్షసి ఆవేశించుట. ఈ సందర్భమున భూత తాంత్రికుల పద్ధతులు వివరింపబడినవి. ఇది లేనిచో క్షత్రబంధునకు రాజ ప్రాసాద ప్రవేశము లేదు. దొమ్మరుల ఆటచే మంత్రాక్షరము లున్న కర్ణాభరణము లభించుట ఇచటనే! దీనివలన క్షత్రబంధుడు విముక్తు డైనాడు.

బ్రహ్మరాక్షస వృత్తాంతమును ప్రవేశపెట్టుట శ్రీరామానుజుల వారి జీవితమున జరిగిన యిట్టి సన్నివేశమునే గాక, తమ పూర్వులైన చెన్నయాచార్యుల మంత్ర ప్రభావమును వ్యక్తీకరించుటకే యనిపించును.

జీవుడు పరిశుద్ధమైన భక్తితో ఈశ్వరుని యందు భార ముంచిన (స్వప్రయత్నము లేకయే) భగవంతు డాతనికి మోక్ష మిచ్చు నను తెంగల వైష్ణవ సంప్రదాయము క్షత్రబంధుని యందు నిరూపింపబడినది.

**వర్ణనలు :** ప్రబంధ పద్ధతి వర్ణనలతో ఇతర సాంఘిక విషయములు దీనియందు గలవు.

క్షత్రబంధుని దుష్ట పాలన ఇట్లున్నది :

'బ్రహ్మస్వములు వేగ బల్మిచే గ్రహియించి
యగ్రహారంబుల నిగ్రహించి
పరదైవ తోత్సవాల్ పఱగ కుండఁగ జేసి
యర్చక స్వాస్థ్యము లపహరించి
నవనార్జితాసక్త సకల ద్రవ్యంబులు
ముచ్చుల చేతఁ దెప్పించు కొనియు
వైశ్య కర్షక జన వర్గంబులను బట్టి
నెట్టింది నొప్పించి తిట్టి కొట్టి
యదయుఁ డన్యాయ విత్తంబు నార్జితంబు
చేయు దితరుల మేలును సేముపందు
నైప కా మేలు తన హస్త సంగతంబు
నైన దాకను నారాట మందుచుండు!'

దీని ద్వారా కవి క్రీ.శ. 1700 తర్వాత తెలంగాణమును పాలించిన యిట్టి పద్ధతి రాజుల క్రౌర్య వర్ణనను సూచించినాడు.

సంచార జాతికి చెందిన భిక్షుకులు, దొమ్మరులు ప్రయాణమున వాడు వస్తువులతో నిట్లు కదలినారు —

'దారు వులూఖలాల్ దగుహాగ ముసలముల్
గడ్డపాఱలు గుదెల్ మడ్డుకత్తి
చిలుకు టలుకుల గదల్ సింగిణీ తరకసల్
వాలు కత్తులు నుర్లు, వలలు టోప్కు

మేకుల గుదులును మోకుల కట్టలు
చాపల చుట్టలు దీప సుడెలు
చాప సంచుల యందు సర్వ ధాన్యంబుల
నించి గార్దభవోష్ట్రి నికరమునను
మీద నజ చర్మ నికరముల్ బాదుకొల్పి
బాల వృద్ధుల హాటిపై బరగ చేర్చి
యామ్య ముఖముగ నందరు నరుగ దలంచి
తూర్ణ యానులు దొమ్మరుల్ తూగి నడువ' (8-19)

తన ఇతర కృతుల యందు వలె పూర్వ కవుల పద్యానుకరణములు దీనియందును గలవు.

క్షత్రబంధుని వృత్తాంతము నాధారము చేసికొని అనేక విషయములు చెప్పబడిన యీ గ్రంథములో- సంప్రదాయ విషయ ప్రవచనమున అనేక శ్లోక ములు సందర్భానుగుణముగా తెనిగింపబడినవి. కవికి గల బహుముఖ విజ్ఞాన మును వ్యక్తముచేయుటకు వివిధ విషయములు, సాంఘికాచారములు, సంచార జాతులైన దొమ్మరులు మొదలగు వారిని గూర్చి గలదు.

## 12. శల్వపిళ్ళ రాయ చరిత్ర :

మేల్కోట, యాదవాద్రి యను నామాంతరములు గల తిరునారాయణ పురమున వెలసిన శల్వపిళ్ళ స్వామినే సంపత్కుమారులు, తిరునారాయణ స్వామి యని యందురు. వీరి మాహాత్మ్యము, విచిత్ర లీలలు, క్షేత్ర మాహాత్మ్య మును తెల్పునట్టి ఈ గ్రంథము 8 ఆశ్వాసములు. 1010 గద్య పద్యములు గలది. అముద్రితము (తాళపత్ర ప్రతి).

శల్వపిళ్ళ చళ్ళపిళ్ళ, చెలపిళ్ళ నామములతో వ్యవహరింపబడు నారాయణ స్వామి శ్రీమద్రామానుజుల వారిచే అర్చింపబడిరి. మైసూరుకు కొలది దూరమున గల యీ క్షేత్రము తెనగల్, వడహల్ సంప్రదాయముల కూడలి. కల్యాణ, వైకుంఠ, పరాశర, మైత్రేయ, ధనుష్కోటి, యాదవ, లోకపావన, పాండవ తీర్థము లని ఎనిమిది కోనేర్లు గల యిచట తాయారు సన్నిధి యెదుట నుండు

మండపములో నొక స్తంభము నందు అంగుష్ఠ ప్రమాణ మాత్రమైన ఉదయవరు లుందురు. వీరిని జ్ఞాపకముగా సేవింపనిచో యాత్ర సఫలము గాదని వాడుక!

చల్లపిళ్ళ స్వామి వారికి జరుగు ఉత్సవములలో ముఖ్యమైనవి గరుడ సేవ, వైరముడి యుత్సవములు.

వేంకట నరసింహాచార్య కవి ఇట్టి క్షేత్ర విషయ కథను గ్రహించి జనుల వాడుకయందు గల బీబీ నాంచారు (నాచ్చియాల్) కల్యాణ వృత్తాంతమును ముఖ్యముగా చేసి యీ ప్రబంధమును రచించి, చరిత్ర, పురాణ విషయ మిశ్రముగా ఒక గాథకు రూపమును కల్పించెను.

శ్రీరంగ మాహాత్మ్య కథ వలెనే ఇదియును*12 ప్రసిద్ధము. రెండును పురాతన గాథలు. దైవ లీలాభివర్ణన కావ్యములు.

శల్యపిళ్ళ రాయ చరిత్రమున దక్షిణ హిందూ దైవము ఔత్తరాహ ముస్లిం కన్యను పరిణయ మాడినట్లు చెప్పి మత భేదముల ఛేదించి, సమానత్వ మును స్థాపించుట ముఖ్యమైన విషయము.

ఈ గ్రంథకర్త సంప్రదాయములతో పాటు సాంఘిక విషయమును దీని యందు ప్రతిపాదించినాడు.

**కథా విషయము :** మధురా నగర పాలకుడైన యదురాజు రంగ మన్నారు స్వామిని ప్రతిష్ఠింప దలచి నారద మహర్షి సలహా ననుసరించి శ్రీరంగ మన్నారు విమానమును (గోపురము) లలో నొక దానిని కిరీటమువలె ధరించి వచ్చుచుండగా పథి శ్రమ నివారణార్థమై నేటి యాదవాచల ప్రాంతమున దానిని దించి కొంత సేపటి తర్వాత తిరిగి గ్రహింపబోగా నది కదలక 'నేను ఇచటనే వసింతును నా పేర నిచట యాదవాద్రి యనబడును. పూర్వము యదు శైలము నకు నే నిచ్చిన మాట నిల్ప దలచితిని' - అని విమాన మధ్యగతుడైన స్వామి వాక్కును యదు రాజు విని, చేయునది లేక స్వామి నచటనే ప్రతిష్ఠించి ఉత్స వాదుల నిర్వహించుచుండును. ఈ యదురాజు వంశజుడే శ్రీకృష్ణుడు. ఒకనాడు శ్రీకృష్ణుని యర్చగల నందుకొను చున్న యాదవాద్రీశుని వద్దకు గరుత్మంతుడు కిరీటము నొకదానిని తెచ్చి సమర్పింపగా అది యాదవాచల స్వామికి సరిపడినది.

వైనతేయుని సేవకు మెచ్చిన ఆ స్వామి కృష్ణుని వాహన మగునట్లు గరుడుని ఆదేశించును.

కౌరవ వంశమున ధర్మరాజు తరువాత ప్రచేతసుక్కుడు ప్రభువై రాజ్య పాలన మొనర్చుచుండును. ఒక ముని శాపమున నితని పుత్రులు మ్లేచ్ఛు లగుదురు. వారిలో నొకడు 'సుల్తాను' నాముడు. ఇతడే డిల్లీ నగర నిర్మాత. సంతాన రహితుడైన యితనికి దైవ చేష్టగా సరోవరమున నొక బాలిక లభింప అల్లారు ముద్దుగా పెంచుచుండును.

అనంతరము రాజు దండయాత్ర, దేవాలయాల దోపిడి, నిచుళాపుర స్వామి విగ్రహమును దొంగిలించుకొని వచ్చి కూతున కియ్యగా దాని నామె మక్కువతో నుంచుకొని క్రీడించుచుండును.

శ్రీరామానుజ జననము, దేవాలయముల సంప్రోక్షణ, సుల్తాను వద్ద గల విగ్రహమును తెచ్చుటకు పరివారముతో వెళ్ళిన రామానుజుల వారిని సుల్తాను పరీక్షించుట, విగ్రహమును పరిగ్రహించి తెచ్చి, ప్రతిష్ఠింప యత్నించుట, సుల్తాను కన్యను సంపత్కుమార స్వామి పరిణయ మాడ నిచ్ఛగించి 'ఆమె లక్ష్మీ, మానవాంశగా నిట్లవతరించినది' అని పల్కి అందర నాశ్చర్య పరచి బీబీని వివాహ మాడును.

ఆ విగ్రహ రూపమున నున్న సంపత్కుమారుడే చెళ్ళ పిళ్ళ స్వామి. సుల్తాను బిడ్డయే బీబీ నాంచారుగా మారిన లక్ష్మి.

**మార్పులు :-** వేంకట నరసింహాచార్య కవి యీ ప్రబంధమున సంప్రదాయానుకూలముగా కథను కొద్దిగా మార్చినాడు.

'యాదవాద్రీశ వైభవము', 'ఆచార్య సూక్తి ముక్తావళి' యందు చెప్ప బడిన సన్నివేశముల నీయన గ్రహించి మరి కొన్నిటిని వర్ణించి కథను పెంచెను.*13

తాళ్ళపాక తిరువేంగళ నాథుని 'శల్యపిళ్ళ రాయచరిత్ర' మను యక్ష గానమున*14 కథ మరియొక రకముగా నున్నది.

మేల్కోటలోని శల్యపిళ్ళ రాయని భక్తులు తమ విద్యా బల ప్రౌఢిచే డిల్లీ రాజును మెప్పింతురు. దీనికి ముస్లిం మత గురువులు ప్రభువును కోపగించి మేల్కోట దేవ విగ్రహమును తెచ్చి కోటలో పడవేయ మందురు. రాజు దండ యాత్ర, భక్తుల బాధ, మేల్కోట స్వామియే స్వయముగా భక్తులకు దర్శన మిచ్చి తాను ఒక వత్సరము డిల్లీపని వద్ద నివసించి వత్తు ననును.

తండ్రి తెచ్చిన విగ్రహముతో రాజకన్య క్రీడించుచుంట శల్యపిళ్ళ స్వామి ఆమెను లక్ష్మ్యంశగా తెలిసికొని పరిణయ మాడ నిశ్చయించుకొనును. ఢిల్లీ సుల్తాను విగ్రహము నపహరించిన విషయము శ్రీరంగమం దున్న రామాను జులవారు తెలిసికొని దానిని తెచ్చుటకై పరివారముతో వెళ్ళగా ముస్లిం మత గురువులు అనేక మంత్ర తంత్రముల ప్రయోగింతురు. అవి వైష్ణవ భక్తులపై పని చేయనందున సుల్తాను వీరికి వశుడై రామానుజ శక్తిని పరీక్షించి విగ్రహము నొసంగ నుద్యుక్తుడు కాగా, సతి సమేతముగ నా స్వామి రామానుజుల వారి యంకతలమును చేరి విగ్రహ రూపము దాల్చును. రాజు దీనిని గమనించి రామా నుజ దాసుడై, తన బిడ్డ యదృష్టమునకు సంతసించి విగ్రహముతో తన బిడ్డను పల్లకీయం దుంచి, తిరునారాయణ పురమునకు చేర్చును.

ఇట్లు యక్షగాన విషయము కొలది మార్పుల చేసినను శల్యపిళ్ళ కల్యాణ వృత్తాంతమును చెప్పలేదు. ప్రబంధ కర్త కల్యాణ మొనర్చి యవన కన్యను స్వామివారి దేవేరులలో నొకర్తుకగా చేసెను.

పండిత వాదము, ముస్లిం మత గురువులు, మంత్ర తంత్రములు మొదలైన లౌకిక విషయములను ప్రబంధ కర్త గ్రహింప లేదు.

సరోవరమున దాలికా రూపముగ లక్ష్మి యవతరించుట, ఈమె కారణమున తురుష్క ప్రభువు దుష్కృత్యము లధికమైనవి. సంపత్కుమార స్వామి తన లీలలచే రాజును మార్చ దలచినాడు. ఇట్టి ప్రభావవంత మైన కార్యములన్నియు శ్రీరామానుజుల వారి ద్వారా జరిగినట్లు ప్రబంధీకరణము. యక్షగానమున కన్న ప్రబంధములోనే రామానుజ పాత్ర చక్కగా పోషింపబడినది. అందు కనుగుణ ముగా సన్నివేశములు కల్పింప బడినవి. ప్రబంధ కర్త సంప్రదాయమునకు,

యక్షగాన కర్త లౌకికత్వమునకు ప్రాధాన్య మొసంగి తమ కథా కథన శక్తిని ప్రదర్శించిరి.

ప్రబంధ కర్త 'శ్రీరామానుజాభ్యుదయము'న (3.358-405) కల్వపిళ్ళ రాయని కథను, దీనియందు రామానుజ చరిత్రను (2.4-14) చెప్పినాడు. కవికి యీ రెండు కథంపై గల మక్కువ కిది యొక నిదర్శనము.

శ్రీరామానుజుల వారు యవన రాజుపై దండయాత్ర చేయుట కవికి గల యుద్ధ వర్ణనా నైపుణ్యమును చాటుటకే యన్నట్లు తోచును సుల్తానీ, కల్వపిళ్ళల వివాహము వివరముగా వర్ణింపబడినది.

వీరి యితర రచనలయందు వలెనే దీనియందును మన్మథ, మలయానిల, చంద్ర, దూషణ, భూషణ లున్నవి. ఆ యా వర్ణనలయందు పూర్వ ప్రబంధ పద్యానుకరణము అధికము.

1-58-75 మధురాపుర వర్ణనమున 'మను', 'వసు' చరిత్రములు, 'ఆముక్తమాల్యద' ప్రభావము కలదు. రాయల పుష్పలావికలతో వోటిపడుచు మధురా పుర పుష్పలావిక లిట్లున్నారు:

'కలకంఠి! నీ దండ క్రయ మెంత?' యనినను
'నలువియె నా దండ విలువచేయ?'
'కమ్మతావులవిరుల్ గల్గవే మీయెడ?'
'కమ్మలావిరులిడ కల్గుటరుదె'
'కప్పిదాచిన గుచ్ఛకములె కావలె!' నన్న
'యీవి చల్లక నవి యీయఁ దగునె?'
'కౌదలేని వేడ్క నీ గోరంట మన సాయె'
'కౌదువేమి నీవె మున్నె నగరాదె!'
యనుచు నీ రీతి నవ్వుచు హర్షముగను
విటుల వాక్ప్రౌఢి మహిమల విధము తెల్ల
నరసి యతివలు ప్రతిభాష రాకు చపుడు
పుష్ప ఇమ్మను నుందు రప్పురము నందు. (1-74)

వసుచరిత్ర యందలి 'తన యశో విశద ముక్తా సౌధ పాళి...'ని రామా వర్ణనమున కవి ఇట్లు చెప్పెను :

'తన కీర్తి విస్ఫూర్తి ధారుణీ లలనకు
కమనీయ ధవ కాంచుకంబు గాఁగ
తన స్వాంత మంభోజ తన యాధినేతకు
క్రీడా మనోహర గృహము కాఁగ
తన నికేతన సముదాయ మంభోజాత
పాణికి నర్తన పట్టుగాఁగ
తన సద్గుణావళి వనజ సంభూతాంధ్ర
పేటికి నవరత్న కోటి గాఁగ
విశ్వ విశ్వంభరాస్థలి వినుతి గాంచె
నఖిల గురుజన సంఘంబు లతిశయింప
రంగనాయక కరుణా తరంగుఁ డగుచు
రమ్య తరముగ యతివర రాజరాజు!' (3.13)

పెద్దన గారి వరూధినీ రోదన ప్రభావము అనంతర కవులను వదలిపెట్ట యదుశైల వల్లభుని విగ్రహము కన్పడనందున యవన కన్యక శ్రీరాగ

---

'భావభ వాంబక ప్రకట బాధ భరింపఁగ లేక ఫుల్ల రా
జీవ విరాజమాన ముఖ సీమ పటం బిడి బాష్పముల్ కుచ
గ్రావములం దొరంగ కలకంఠ కులాకుల కాకలీ ధ్వనిన్
శ్రీ వర రాగ మూని సరసీజ ముఖీ మణి యేడ్చె మిక్కిలిన్' (3.189)

ఈ ప్రబంధ కర్త యవన కన్యచేత ఏడ్పించినాడు.

వేంకట నరసింహాచార్య లీ గ్రంథమున భక్తి, వీర, శృంగారములను పోషించినారు. యవనరాజు దైవభక్తియే గాక శ్రీరామానుజుల వారి యాద శ స్తోత్రము కవి భక్తి రస పోషణకు నిదర్శనములు. రామానుజుల వారు స్క- ప్రభువుపై దండయాత్ర చేయుట, విపులముగ యుద్ధవర్ణన వీరరస కలు.

శల్యపిళ్ళ స్వామి, యవనాంగనల కలయిక (అనంతరము పెండ్లి). శోభ నముల వర్ణించునప్పుడు గల శృంగారమున దైవభావము విస్మరింపబడి మానుషమే ముఖ్య మయినందున అది అధిక మైనది.

సాంఘిక సంప్రదాయ విషయ సమ్మిశ్రితమైన 'చల్వపిళ్ళ రాయ చరిత్రము' వర్ణనా ప్రధానమైన కథా కావ్యము.*[15]

## 13. చిలువ పడగ తేని పేరణము :

సింగరాచార్యుల అచ్చతెనుగు కావ్యము తరువాత వీరి వంశమున వచ్చిన మరియొక అచ్చాంధ్ర ప్రబంధమైన 'చిలువ పడగ తేని పేరణము' 8 ఆశ్వాసములు, 1140 గద్య పద్యములు గల అముద్రిత(తాళపత్ర ప్రతి*) గ్రంథము. దీనికే 'చిలువ పడగ తేని చరిత' మని మరి యొక పేరు.

కథా భాగమే గాక కృత్యాద్యంతములు, పాత్రల నామధేయములు సైతము అచ్చ తెనుగుననే చెప్పి వేంకట నరసింహాచార్యులు తనకు గల భాషా వైదుష్యమును నిరూపించుకొనినాడు.

**ముఖ్య కథ :** కళింగ రాజైన చిత్రాంగునకు రూపవతి యను భార్య కలదు. వీరి సంతానము 'శుభాంగి'. స్వయంవరమున దుర్యోధనుని శుభాంగి వరించగా ఇరువురు రథారూఢులై హస్తినాపురమునకు వెళ్ళుచుండ జరాసంధుడు ఈర్ష్యచే (శుభాంగి తనను వరించనందున)కురురాజుపైకి యుద్ధమునకు వెళ్ళను బలరాముని ప్రోద్బలమున కర్ణుడు యుద్ధమున పాల్గొని జరాసంధుని బంధించి రాగా, దుర్యోధను డతనిని మన్నించి విడిచివేయును.*[15] అనంతరము శుభాంగీ దుర్యోధనుల వివాహము ఘనముగా జరిగినది. వీరికి కలిగిన సంతానమే 'లక్షణు' డను కుమారుడు', 'లక్షణ' యను కూతురు.

**కథా కథనము :** కవి యీ కథ మహా భారతములో గల దనెను. చిత్రాంగుడు, అతని రాజధాని, శుభాంగి జననము, బాల్య యౌవనములు, ఆమె మన్మథావస్థలు, శైత్యోపచారములు, స్వయంవరము, అనేక దేశాగతరాజవర్ణన, దుర్యోధన వర్ణన, యుద్ధము, వివాహము, భోజనములు, శుభాంగి దుర్యోధనుల శృంగారక్రీడలు-వీనిని విపులముగా వర్ణించి అచ్చతెనుగున కవి పొత్తమును పెంచినాడు.

కవి కల్పన యిట్లున్నను చెప్పిన కథయందు మాత్రము అనేక వర్ణనలు చేయబడినవి.

**వర్ణనలు :**

'ఆరయుచు తెనుగుల పదములు
తరమక నిరుమాలు లరసి తాల్మితొ నుడువన్
సరగున పదములఁ దగు బిగి
తలఁ గలియఁగ వలయు దీని తెలఁ గేర్పడఁగన్' (1 వ ఆ.)

అని తన పద ప్రయోగమును గూర్చి కవి అభిప్రాయము. అచ్చతెనుగును అర్థము చేసికొనుటయే శ్రమ. దానికి తోడు సుప్రసిద్ధ సంస్కృత పదములను అచ్చముగా తెనిగించిన పాఠకునకు మరింత శ్రమ తప్పదు, దీనియం దట్టి పదము లనేకము లున్నవి. ఉదా : కర్ణుడు - ప్రాఁజదుపుల మేటి కన్నట్టి బిడ్డ, అంజన-గౌర గొంగని పేరు గల మేటి గరిత ఇత్యాదులు.

'నెలఁత నేల బళ్ళ నేర్పున దిద్దుచు
నక్కరాలు బలుక నమర వ్రాసె
గొప్ప వొయ్యి చూచి గొబ్బున చదువంగ
నేర్చె, నాట పాట నేర్పెలర్ప' (1 వ ఆ.)

ఇది శుభాంగి విద్యాభ్యాసము. 'నేలబళ్లు' అనగా నేలపై ఇసుకపోసి వానిపై అక్షరముల వ్రాసి దిద్దించు పాఠశాలలు. తెలంగాణ మందలి వీధి బడుల పద్ధతి. వొయ్యి-పుస్తకము. ఇదే వహి, బహి (ఖాతా పుస్తకము) యైనది. నేటికిని పల్లెటూరి జనము పుస్తకమును 'వొయ్యి' యందురు. శుభాంగి సౌందర్యమును వర్ణించుచు కవి ఇట్లనినాడు :

'ననవాలు వాని యాలును
ననవాలుని మామ యాలు నలువని యాలున్
ననవాలు నయ్య యాలును
ననవాలుని గొంగ యాలు నాతికి సరియే?' (3 వ ఆ.)

రతి, రోహిణి, సరస్వతి, లక్ష్మి, పార్వతి - వీరి సౌందర్యముల మించినది పద్మాంగి! ఇక - చంద్రవర్ణన :

'వలిగొండ యల్లుని తలను మెలఁగెడి పువ్వు
మేను లేని వజీరు మేనమామ
జిడ్డు పదలికి గిల్లు బిడ్డను తోఁబుట్టు
జడదారి కన్నునఁ బొడము కందు
పంటఁ బొడమెడి యట్టి పంట పైరుల ఱేఁడు
తమ్ముల చెలికాని దంటకాడు
మూఁడు వీడులు మున్ను ముప్పు జేసిన మేటి
తేరుకు దాపలై తిరుగు గిల్ల

వేలుపుం బువ్వుపేరున వెలయు జోడు
చలి వెలుంగును, తెలి ముద్దు కలువ ఱేఁడు
పేదవారింట్ల రేయిని బెట్టు దివ్వె
యనఁగ రేఱేఁడు తొల్కాడలందుఁ బొడమె!' (2 వ ఆ.)

ఈ పద్ధతి వర్ణనలే గాక స్వయంవర, యుద్ధ, వివాహాదులు, భీష్మ, ద్రోణ, దుర్యోధనులు చక్కగా వర్ణింపబడిరి.

కవి తన అచ్చతెనుగు తనమును పాత్రల నామములకు పర్యాయ పదముల కల్పించుటలో నిరూపించెను. ఇట్టివి చిన్న చిన్న సమస్యల వలె మెదడునకు మేత పెట్టినట్లుండుటచే నిది యొక్క ప్రహేళికా కావ్యము వలె మారి అచ్చతెనుగు కృతులయందు ప్రత్యేకత సంతరించుకొనినది. అందుకే కవి ఇట్లు చెప్పుకొనెను:

'అచ్చ తెనుఁగుల బాసల నందు కబ్బ
మెండునుం గల దండుల పాటి మొదవు
నట్టి యాంధ్రపు గుత్తిని బట్టి నుడువు
లెల్ల నీ కబ్బమందుల నమరఁజేతు' (1 వ ఆ.)

## 14. తాలాంక నందినీ పరిణయము :

మహా భారతమున లేని కొన్ని విషయములను గ్రహించి వానిని 'మహా భారత ప్రోక్త'మనియో, 'మహా భారతాంతర్గత'మనియో తెల్పి ప్రబంధ రచన ఒనర్చిన కొందరు కవులు గలరు. ఇందుకు తత్కథా వ్యాప్తియో, వస్తు ప్రాముఖ్యమో వీరికి ప్రేరణము కలిగించియుండును.

వేంకట నరసింహాచార్యుల (తృతీయ) 'తాలాంక నందినీ పరిణయము' కోవకు చెందిన రసవత్ప్రబంధము.

కవి యీ కథను పావనుఁడు పరాశరాత్మజుని వల్లను 'నాకు ఒనించినట్లు ధన వడగా వచింతు' (1-75) ననినాడు, కాని యిది సంస్కృతాంధ్ర భారతములయందు లేని ఒక చక్కని కథ.

తాలాంకు డనగా బలరాముడు (తాలాంకో, ముసలీ, హలీ-అమరము). అతని కూతురు శశిరేఖ. ఈమెకు అభిమన్యునితో జరిగిన పరిణయ వృత్తాంతమే 'తాలాంక నందినీ పరిణయము'.

ఇది 'ఉత్పాద్యము', 'ప్రఖ్యాతి'చే 'మిశ్ర' కథగా తీర్చి దిద్దబడి రసవత్ప్రబంధమైనది. 6 ఆశ్వాసములు, 1620 గద్య పద్యములు గల యీ కృతి (ముద్రితము) శశిరేఖాభిమన్యుల వివాహము ద్వారా మేనరికపు చుట్టరికము నకు గల ప్రాముఖ్యమును వ్యక్తము చేయును.

**కథా ప్రాచుర్యము :** తెలుఁగు సాహిత్యమున ఇదే వృత్తాంతమును ప్రబంధ, నాటక, యక్షగాన, జానపద రీతులలో చిత్రించిన కవులు పలువు రున్నారు.*[16] ఈ కథ మరాఠీ సాహిత్యమున కూడా ప్రచారములో నున్నది. వారు దీనిని వత్సల కథగా వ్యవహరింతురు.*[17]

**కథా భేదములు :** ఒకే కథను గ్రహించి భిన్న కాలముల యందు పలువురు కవులు చెప్పుట వలన కథా కథనమునందు కొన్ని మార్పులు, చేర్పులు ఏర్పని సరిగా సంభవించును.*[18]

శశిరేఖాభిమన్యుల కల్యాణ గాథను చిత్రించిన పలు విధములగు రచనలలో నిట్టి భేద పద్ధతులు గలవు. వానియందు అప్పప్పకవి 'శశిరేఖా పరిణయ' ప్రబంధము ముఖ్యమైనది. దీనికి 'తాలాంక నందినీ పరిణయము'నకు కథా కథనమున స్వల్పమగు భేదములు కొన్ని యిట్లు గలవు :

**'తాలాంక...' కథ :** తీర్థయాత్రలకు బయలుదేరిన సవ్యసాచి ఉలూపి చిత్రాంగదలను పరిణయ మాడి రైవతకోత్సవమున సుభద్రను వరించి తిరిగి వచ్చిన యనంతరము రాజసూయము, మాయా ద్యూతము, రాజ్య విసర్జన జరుగును. పాండవు లడవుల కేగుచు సుభద్రాభిమన్యులను ద్వారకలోనే యుంతురు. ఇదే సమయమున శశిరేఖ జన్మించగా తొట్టెలో నున్న బాలికను చూచి రేవతీ బలరాములు అభిమన్యున కీమె నిచ్చి మేన సంబంధము చేతు మని యందురు.

ఒకనాడు నారదుడు ద్వారకకు విచ్చేసి శశిరేఖాభిమన్యులకు కల్యాణము జరుగుట తప్పదని పల్కి, నేరుగా దుర్యోధనుని వద్దకు వెళ్ళి లక్ష్మణ కుమారునకు శశిరేఖ తగిన వధు వని నచ్చచెప్పి బయలుదేరును. కురురాజు బలరామున కీ వార్తను తెల్పి, లగ్న నిశ్చయమునకై విప్రుల పంపించును.

దుర్యోధనుని ప్రయత్నములు సుభద్ర తెలిసికొని అన్నయైన బలరాముని వద్దకు వచ్చి తన కోడ లనుకున్న శశిరేఖను వేరొకరి కిచ్చుట తగదని పల్కి ప్రాధేయపడగా, బలు డామె మాటల తిరస్కరించి కటువుగా ప్రత్యుత్తర మొసంగును. మానసిక క్షోభను భరింపజాలని సుభద్ర కుమారునితో గలిసి పాండవు లున్న యడవికి వెళ్ళుచుండగా, మార్గ మధ్యమున ఘటోత్కచాభిమన్యులకు యుద్ధము జరుగును, నారద మహర్షి విచ్చేసి వారిని శాంతింపజేసి, మీరుభయులు సోదరు లని తెల్పగా, ఘటోత్కచుడు తల్లి వలన జరిగిన విషయమును తెలిసికొని లగ్న వేళకు శశిరేఖను తెత్తు ననెను.

వీరి యుద్ధమునకు పూర్వమే అభిమన్యుని వద్దకు శశిరేఖ పెంపుడు చిలుక వచ్చి బలరాముని యంతః పుర విషయములను, శశిరేఖ అభిప్రాయము లను లేఖ ద్వారా తెల్ప, దానికి సౌభద్రుడు ప్రత్యుత్తర మిచ్చి, తప్పక శశిరేఖను వివాహ మాడగల నని చెప్పను.

బలుని యంతఃపురము వివాహ సంరంభములో నుండ ఘటోత్కచుడు మాయా విద్యచే లోనికి ప్రవేశించి, శశిరేఖను మంచముతో లేవనెత్తుక వచ్చి సుభద్ర కప్పగించి, తాను మరల అంతఃపురమును జేరి శశిరేఖగా మారి, వివాహ వేళయందు అందరిని బాధించును. దీనిని తెలిసికొనిన బలరాముడు జరిగిన దానికి చింతించి శ్రీకృష్ణునితో మొర పెట్టుకొని, ద్వైత వనమున నున్న సుభద్రాభిమన్యుల తోడ్తెచ్చి, శశిరేఖాభిమన్యులకు వైభవముగా వివాహము జరిపించును.

ఈ సమయమున ధర్మరాజాదులు అజ్ఞాత వాసమునను, అర్జునుడు ఇంద్రుని వద్దను ఉన్నందున వివాహమునకు రాజాలక, తదనంతరము ఉత్తరాభిమన్యులకు వివాహము జరిపించి సంతృప్తి చెందుదురు. వేంకట నరసింహాచార్యుల యీ కథ **అప్పప్ప కవి రచనలో** కొంత మారినది.

పాండవుల వెంట సుభద్రాభిమన్యు లడవికి వెళ్ళగా, శ్రీకృష్ణుడు వారిని తీసికొని వచ్చును. ఉద్యాన వనమున విహరించు అభిమన్యుని వద్దకు చిలుక రాగా, దానిని గైకొనుటకు విచ్చేసిన శశిరేఖను అభిమన్యుడు బలాత్కరింప యత్నించును. వేదవ్యాసుడు ఘటోత్క చాభిమన్యుల అభిజాత్యమును తెల్పినాడు. శశిరే ఖాభిమన్యుల విషయము ధర్మరాజాదులు తెలిసికొని (వివాహమునకు ముందు) బాధపడినారు. అడవి నుండి తిరిగి వచ్చిన సుభద్ర బలరామునితో-శశిరేఖను తన కుమారున కీయవలె ననెను 'తాలాంక...' కర్త కన్న అప్పప్ప కవి కొంచెది పూర్వుడు. ఈ విషయమైన అనేక కథలను జన ప్రచార గాథలను గమనించి వేంకట నరసింహాచార్య కవి సన్నివేశములను ఔచిత్య వంతములుగా చేసి, కథను నడిపినాడు.

నారదుడు బలరామ దుర్యోధనులకు వియ్యము పేరు చెప్పి కయ్యము కల్పించి, శ్రీకృష్ణుని ద్వారా ఈ సమస్య పరిష్కార మగునట్లు చేసినాడు. ఘటోత్కచుని అభిమన్యునకు పరిచయము చేసి, అతని ద్వారా కార్యము సఫల మగునట్లు యత్నించిన కలహాశన పాత్ర దీనిలో ముఖ్యమైనది. ఘటోత్కచుడు తమ్ముని కొరకై తెగించుటకు కౌరవ వైరము తోడైనది.

సుభద్ర- అభిమానవతి, రోషవతిగా చిత్రింపబడి, తన పంతము నెగ్గించు కొనిన వ్యవహార దక్షురాలైన స్త్రీమూర్తి.

శ్రీకృష్ణున కన్ని విషయములును మొదటనే తెలిసినను, బలరామ దుర్యోధనుల గర్వభంగానంతరమే తన ప్రయత్నముల చేసి సంతసించినాడు. 'తాలాంక' కర్త సంఘమున ముఖ్యమైన మేనరిక మను ఆచార పద్ధతిని ముఖ్యముగా చేసికొని అనేక వర్ణనలతో నీ ప్రబంధమును కూర్చెను.

**వర్ణనా చమత్కృతి :** కథ చిన్నదే యైనను ప్రబంధానుకూల మగు వివిధ వర్ణనలతో నిడి పెరిగి కవికి గల శబ్దార్థాలంకార ప్రీతికి, శ్లేష కవితా నైపుణికి ఈ రచన మిక్కిలి తోడ్పడినది.

భూమికి 'రత్నగర్భ' యను పేరు ప్రసిద్ధము ('జగతీ రత్నగర్భా చ- అసురము). కవి దానిని తన ప్రౌఢోక్తి చమత్కృతిచే నిట్లు చెప్పెను :

'పురవర సౌధ వీథుల నవోఢలు వామన గుంత లాడు న
త్తఱిఁ జెయి చింది భూ నిపతితం బగు రత్నము లెల్ల పౌరు లే
ర్పరపక ద్రొక్కఁగా ధరణి పాదుకొనన్ వసుధా వధూటి ని
వ్వరుసను 'రత్నగర్భ' యని వాడిరి లోకములోన పండితుల్!'
(1-106)

దీనియందు 'రత్నగర్భ'ను చమత్కరించుటే కాక, 'వామనగుంత లాట' పేర్కొనబడినది.

శశిరేఖ యౌవనమును వర్ణించుచు కవి యొక సాంఘిక పద్ధతిని గ్రంథస్థము చేసినాడు. ఆ పద్యము:

'ఆ యబలామణీ తను గృహంబున కాపుర మున్న శైశవ
ప్రాయము న మ్మరుండు చలపాది తనంబున నిల్లు వెళ్ళఁగా
ద్రోయఁ దలంచి తోడుతనె దొంతుల కుండ యురంపు వాకిటన్
వేయు గతిన్ కుచంబులు నవీన రుచిం జనియించె బోటికిన్!' (2-74)

ఒక యింట గలవారు పోట్లాడి వేరగు నపుడు 'దొంతుల కుండల'ను బైట వేసికొను పద్ధతి యొకటి కలదు. మన్మథుడు విచ్చేసి 'శైశవము'ను ఇల్లు వెళ్ళగొట్ట దలచి శశిరేఖ 'వక్షోజము' లను దొంతుల కుండలను బైట వేసినాడు. అవి 'ఉరము' అను వాకిట బడినవి.

ఇక, వర్ణ చమత్కృతితో శశిరేఖ అవయవము లిట్లున్నవి:

'కంధరం' బెదిరించి కచ భరంబున కోడె
దెస చెడి తను తానె దిశలు బ్రాకె,
రహి 'కింశుకము' పాణి రక్తి గైకొన నోడి
యందంద పురి విచ్చి క్రిందఁ గూలె.
'లహరు' లా త్రివళితో సహజంబుగా నోడి
ప్రతికూల మెనయుచు భంగ పడియె,
'సారసం' బా వనచ్ఛాయ నోపక నోడి
పగలు పెంపున పంక భరిత మయ్యె

మొదలు వర్ణ చ్యుతిని బొంది తుది నురోజ,
వాక్య మధ్యమ హాస సంపద లభించె
'నన్యథా చింతితం కార్య' మన్న చోట
'దైవ మన్యత్ర చింతయే' త్సరణి గాఁగ! (2-88)

దీనియందు 'కంధర', 'కింశుక', 'లహరి', 'సారసము'లు క్రమముగా 'కచ', 'పాద', 'వళి', 'ముఖము' లకు విశేషణములు. అవియే 'మొదటి వర్ణ చ్యుతి'ని పొందిన నిట్లగును.

'కంధరము-కచ భరము', 'ధరము - ఉరోజము' (మొదటిదైన 'కం' వర్ణము చ్యుతి నందినది. ఇట్లే మిగిలిన ప్రథమాక్షరములు).

'కింశుకము-పాణి రక్తిమ' 'శుకము - వాక్యము', 'లహరులు - త్రివళి', 'హరులు-మధ్యమము' (సింహ నిభ మధ్య), 'సారసము- ముఖము', 'రసము-హాసము'లకు చెప్పబడినవి. ఇట్లు 'సీసము'లో నున్నవానిని గీతమున గల వానికి క్రమాలంకార పద్ధతిని చేర్చుకొనిన పద్యము నందలి వర్ణ చమత్కృతి తెలియును. అందుకే కవి పద్యార్థ విషయమై 'అన్యథా చింతితం కార్యమ్ - అన్యత్ర చింతయేత్' అనినాడు.

ముఖమును నిండు చంద్రునితో పోల్చుట కవి సమయము. దీనిని సంఖ్యా పద చమత్కృతిగా నిట్లు చెప్పినాడు :

'బాలిక కా పితామహుఁడు ఫాల తలంబున ఒంటు బెట్టియున్
మేలగు కర్ణ యుగ్మ మెలమి న్నవకంబుల వ్రాసి భ్రూ యుగం
బోలి గనంబడం బదునొకం డిట ముప్పదిగా గణింపఁగా
నా లలి మోము నిండునెల యామిని వర్ణన జేయు టబ్రమే!' (2-98)

శశిరేఖ ముఖము నిండు చంద్రుని వలె గాక 'నిండు నెల'గా నున్నది· ముప్పది రోజులు గల మాసము నిండు నెల. దీనికి కవి కల్పన యిట్లున్నది :

| | | | |
|---|---|---|---|
| ఫాల తలము - ఒంటు అనగా | ౧ | అకారము | 1 |
| కర్ణయుగ్మము-నవకము అనగా | ౯+౯ | ,, | 18 |
| భ్రూ యుగము-పదునొకటి అనగా | ౧౧ | ,, | 11 |
| | | | 30 |

ఈ అంకెలను కూడిన 30 అగును. నిండు నెలకు రోజులు ముప్పది. అందుకే ఆమె మోము 'నిండు నెల'!

దీని యందు 'ఒంట బెట్టి' కలదు. తెలంగాణ పల్లెటూరి బళ్ళలో సంఖ్య లను ఒంట్లు (1, 2, 3 మొ.) అని, అ, ఆ లను ఓనమా లని యనుట పరిపాటి! శశిరేఖ యను బాలికకు పితామహుడు - తాతగారు (బ్రహ్మ) - ఒంట్లు దిద్దబెట్టి నవకముల వ్రాసినాడు, సంఖ్యల నన్నిటిని గణింప నేర్పినాడు. ఫలితము 30 వచ్చెను. ఇట్లు ఒక నాటి వీథిబళ్ళ విద్యా పద్ధతి కూడ ఈ పద్యమున తెల్పబడి నది. 'ముకుంద విలాసము' నందు భద్రాదేవి వర్ణన ఇట్లే గలదు (2-98) :

'అనువై నెన్నుదు రొంటుగాఁ బదునొకండై కన్బొమల్ జంటగా
ఘనతం బోల్పఁగ రెండు తొమ్మిదులు నై కర్ణ ద్వయం బొప్పఁగాఁ
గన బూర్ణ స్థితి బర్వ లీల నెసఁగంగా నింతయుం గూడ దా
దినసంఖ్యం దిలకింప నిండు నెలగా దీపించు మో మింతికిన్!'

దీనియందు కేవలము సంఖ్యా చమత్కృతి చేయబడగా 'తాలాంక...' కర్త ఉభయ చమత్కృతులు చూపినాడు.

బహు విధములైన చమత్కృతులు గల పద్యములు 'తాలాంక...'లో అధికము. తన ప్రబంధము 'గంభీర సుధా రుచిర పూర మధుర మధు సంభరిత స్ఫురితోక్తు'లు (4-72) గలది. తాను 'బంధ నాటక కృతి' (8-177) నిర్మాత. కావున 'తాలాంక...' యందు నాటకీయతకు తావిచ్చెను.

చిన్ననాడే తన కుమారునకు శశిరేఖ నీయగల మని పలికిన రేవతీ బలరాములు మాట తప్పి, కన్యను లక్ష్మణ కుమారున కీయ నిశ్చయింపగా అప్పుడు సుభద్ర —

మాకు గల లేమిఁ జూడకు
మా ! కురుపతి సంపదలకు నచ్చెలు పడ కీ
చీఁకటి వెన్నెల గాదా ?
లోకుల సంపదలు క్షణములో చెడు హెచ్చున్!' 4-85

అని బలరామునకు లోక వృత్తిని దెల్పినది. ఈ మాటలు నచ్చని తాలాంకుడు 'విరూపాక్షుండు బోలెన్ చల ద్ఘన రౌద్రాకృతిగా మారి, సుభద్రను—

'కూటికి పేదలై యొరులకుం గల బిడ్డల నాస చెందు టి
పాటి ఫలంబు నీకు గల భాగ్యము లెల్ల భుజింప కోడలిం
కేటికి కొంపల న్విడిచి యేకత కాలుడవుల్ చరింపు మీ
బోటుం కిచ్చుకంటె తెగు బుద్ధిని నూతిని ద్రోయు టొప్పగున్!'

నీకున్న వారె కన్న చి
కాకులఁ బడి కూడు కోక కాసకు తిరుగన్
సౌకర్య మైన కోడలు
లేకున్నం గొలుత కళవళింతె నదేమో! (4-89-90)

అని కర్ణ కఠోరముగా బల్కినాడు.

పద్యమున 'గేహము', 'తిండి' అనవచ్చును. కాని కోపముతో పల్కువారు. 'కొంప, గోడి' 'కూడు, గుడ్డ' అందురు. యథార్థ భావ స్ఫురణమునకు లోక ప్రవృత్తిని వ్యక్తపరచుటకు కవి యిట్టి పదముఁ బ్రయోగించెను.

ఈ ప్రబంధమున జల క్రీడలు, విరహము, చంద్ర, మన్మథ దూషణ భూషణములు, దోహద క్రియలు, యుద్ధము, వివాహము, ఋతు వర్ణనలు విపులముగా గలవు. భారత, భాగవత, రామాయణములే గాక ప్రసిద్ధ ప్రబంధముల అనుకరణములును మిక్కిలిగా నున్నవి.

సాంఘికేతివృత్తమును ప్రబంధీకరించిన యీ కవి తదనుగుణముగా అనేక జాతీయములను, లోకోక్తులను ప్రవేశపెట్టి బహు విధాలంకారములతో కావ్య కన్యకకు సిందురనమును చేకూర్చెను.

తన కృతి 'వాగ్భూష ణాస్పద' మైన దని కవి యిట్లు తెల్పినాడు :

'ఇది శేషాచల నాయ కాంఘ్రి యుగళీ హృష్టాత్మ శ్రీ వాస వ
ర్య దళ ద్వేంకట రామచార్య గణి యపీయ స్వచ్ఛ మౌద్గల్య వం
శ్యదమో భావన వర్య పుత్ర నరసింహాచార్య వాగ్భూషణా
స్పద తాలాంక సునందినీ పరిణ యాఖ్యాన ద్వితీయం బిలన్ (2-294)

(ప్రతి అశ్వాసాంతమును పద్యముచే ముగించి ఒక క్రొత్తదనమును గూర్చిన రాపసం 'ఆముక్త' పద్ధతిని ఈ కవి పాటించినాడు).

## 15. భల్లాతకాచల క్షేత్ర మాహాత్మ్యము :

చెరంగల్లు జిల్లా జనగామ తాలూకాలో నున్న సుప్రసిద్ధ శ్రీరామ చంద్ర క్షేత్రమగు 'జీడికల్లు'ను గూర్చి వ్రాయబడినట్టి దీ గ్రంథము. భల్లాతక మనగా జీడి ('వీరవృక్షో ఒరుష్కరోఽగ్నిముఖీ భల్లాతకీ త్రిషు' - అమరము). జీడి కల్లునకు సంస్కృతీకరణ మిది.

గ్రంథకర్త యైన వేంకట రామానుజాచార్యులు ఈ క్షేత్రస్వామి భక్తుడై నందున తనవిమానముతో దీనిని రచించినట్లు కృత్యాదియందు తెల్పుకొనెను.

అయిదు ఆశ్వాసములు, 250 గద్య పద్యములు గల యీ ప్రబంధము (అముద్రితము)నకు కవిగారు వ్రాసి యుంచుకొనిన ప్రతియే నాకు లభించినది దీనికి మూలము "బ్రహ్మాండ పురాణ ఉత్తరఖం డాంతర్గత ఉమా మహేశ్వర సంవాద మను భల్లాతకాచల క్షేత్ర మాహాత్మ్యమను."

**విషయము :** శివ పార్వతుల సంభాషణ రూప మైన దీనిని సూతుడు శౌనకాది మహర్షులకు చెప్పెను. కాశీ క్షేత్రమున శివునకు శ్రీరాముడు ప్రత్యక్షమై రామతారక మంత్రము నుపదేశించి తాను భక్తుల సందర్శనార్థము సర్వాంతర్యామిగా దారు, శిలా రూపముల దాల్చి వర్తింతు నని బల్కి, అంతర్థాన మగును. శ్రీరాముడు కనక మృగాన్వేషణ చేయుచు ఈ ప్రాంతమునకు వచ్చి, తన పాదాంగుష్ఠముచే నీటిని సృజింప చేయగా, ఆ జలము బంగరు లేడిపై బడ గంధర్వ రూప మందిన హరిణము "కౌశిక శాపము నీ వలన తీరిన" దని పల్కి, వెడలి పోవును. అప్పటి నుండి అది 'లేడి బండ' యైనది.

చంద్రగుప్తుని సంతాన మైన బాలచంద్ర, చంద్రమతులు చిన్న నాటనే దూరమై వయస్సు వచ్చిన తర్వాత కలిసికొని (అన్నా చెల్లెలు వరుస గుర్తుకు రాక) ఉభయులు వివాహ మగుదురు. వెంటనే వారి వస్త్రములు జీడి నూనె వాసన గల్గి నూనెతో తడియును. అశరీర వాణి 'మీరు ఒకే తల్లి సంతానము. వివాహము తగదు. ఏ క్షేత్రమున మీకు పూర్వ స్థితి కల్గునో ఆ క్షేత్రము మీ కంటిన జీడి పేర ప్రసిద్ధమగు'నని పల్క, వారు అనేక క్షేత్రముల సంచరించుచు ఇచటికి వచ్చి స్నానము చేయగా, నిష్కళంకులైనారు. వారు మునిగినదే జీడిగుండము. వారి పేరనే ఇది జీడికల్లు క్షేత్ర మాయెను. ఇది ప్రబంధ కథ

తరువాత శ్రీరామ నామ మహిమ, జీడికల్లు దేవాలయ విషయములు గలవు.

**కథా భేదము :** 'వీరాచల (జీడికంటి) క్షేత్ర మాహాత్మ్యము' పేర జీడికంటి దేవస్థానము వారు ప్రచురించిన గ్రంథమునందు ఈ కథ 'బ్రహ్మాండ పురాణమందలి గౌతమీ మాహాత్మ్య కథా విభాగము'న గలదు. దీనియందలి విషయము మరియొక విధముగా నున్నది. 1. శ్రీరాముని బాణ ప్రహారముచే కనక మృగము శాపము దీరి చిత్రరథు డను గంధర్వుడుగా మారును. అతని కోరిక మేరకు రాముడు తన పాదాంగుష్ఠ తాడనమున నీటిని పుట్టించును. ఇది 'లేడిబండ' యైనది. 2. వీరు డను ముని యిచట తప మొనర్చుచుండ రాము డతనిని సందర్శించి తన పాదుకల నిచ్చి అనుదినము పూజింపు మనెను. అది ముని పేర వీరాచలమైనది. 3. జీడితో సమానమైన పాపములు చేసిన వారెవరైనను ఇచటి గుండము నందు స్నానము చేసిన అవి పటాపంచలగును. ఇవి

జీడి గుండములు. 4. భృగు మహర్షి శాపమున చంద్రగుప్తుడు రాజ్యభ్రష్టు డగును. చంద్రమతీ, బాల చంద్రులు అనేక తీర్థముల సేవించుచు ఈ స్థలమునకు రాగా వారి పాపములు క్షాళనమైనవి ఇప్పటి రెండు గుండములును వారి పేర వెలసి నట్టివే! 5. ''కథం పిరాదలో నామ జాతో భల్లాతకాదలః, భల్లాత కాఖ్య కాసారౌ తత్ర వా కేన కల్పితమ్'' - అని పార్వతి శివుని ప్రశ్న వేయగా అమెకు సమాధానమే ఈ క్షేత్ర వృత్తాంతము.

ఈ విధముగా రెండు గ్రంథములలోను ఉన్న కథ యిది. వేంకట రామానుజాచార్య కవి విషయమును ప్రబంధీకరింప దలచి మరియొక విధముగా చెప్పినాడు.

దీనియందు వర్ణనలు లేవు. కేవలము కథయే చెప్పబడినది. ప్రతి ఆశ్వా సము కొద్ది పద్యములలోనే ముగింపైనది. కవి వ్రాయునప్పుడు మధ్య మధ్య కొట్టి వేతలు, సవరణలు చేయుట వలన పద్యములు సరిగా తెలియుట లేదు. కొన్ని పద్యము లసమగ్రములు. 4 వ ఆశ్వాసములో 8 వ పద్యము 29 చరణ ముల సీస మాలిక. దీనియందు సమస్త విష్ణు క్షేత్ర నామములును గలవు. ఒక పెద్ద వచనము (4-19) న శ్రీరామస్తుతి చేయబడినది.

**గ్రంథ రచనా కాలము :** గ్రంథమును గూర్చి కవి యిట్లు వ్రాసెను :

'ప్లవ వర్షంబున నుత్తరాయణమునన్ వైశాఖ శుద్ధంబునన్
భవితంబౌ విది యేందువార ధరణిన్ భల్లాత కాద్రీశు రా
ఘవు పాదంబుల కంకితం బిడియె మౌద్గల్యాన్వ యోద్భూత రా
ఘవ సూరి ప్రథమాత్మజుం డయిన వేంకట్రామ దాసుం డిలన్'

'భువి దివి తారకాటవులు భూరి సరోవర సాగరాగముల్
రవి మొదలౌ గ్రహంబులు సురర్షులు నుండెడు నంత కాల మా
ప్రవిమల కీర్తి శాలి రఘురాముఁడు మత్కృతి కన్యకా మనో
ధవుఁ డయి ప్రోఁచు గాక వివిధత్వ మెలుంగని ప్రేమ దృష్టితో!'

## 16. మాలతీ వసంతము :

వేంకట నరసింహాచార్యుల (ఐదవ) ప్రబంధములలో నిది ప్రసిద్ధమైనది. 5 ఆశ్వాసములు, '580 గద్య పద్యములు ఉన్న యీ రచన 1949 వ సం.ములో రచింపబడి ముద్రితమైనది.*[19] కవి' 'హరి కృపా పూర్ణ ప్రభావాప్తి సజ్జన మోదావహ సత్కవిత్వ రచనాసక్తుడై' - 'మానసీయులైన బుధులకు మోదావహముగా రమ్య ఫణితిని ఈ కృతి నిర్మాణ' మొనర్చి శ్రీకృష్ణున కంకిత మిచ్చెను.

**ప్రబంధ కథ :** భద్రపు రాధీశు డైన మణిభద్రునకు ప్రభావతి యను భార్య గలదు. సంతాన రహితులైన వీరికి 'ఫలసిద్ధి' మహర్షి అష్టాక్షరీ మంత్రము నుపదేశింప తత్ఫలముగా వసంతు డను కుమారుడు కలుగును. మంత్రి పుత్రుడైన బుద్ధిసాగరునితో గలిసి విద్యాభ్యాస మొనర్చి రాజోచిత విద్యల నేర్చి పెద్దవాడై జైత్రయాత్రకు బయలుదేరి మధ్యేమార్గమున భరద్వా జాశ్రమము చేరి, మునివలన అనేకాస్త్ర ప్రయో గోపసంహార విద్యల నేర్చి, 'మాయా వినాశినీ' మంత్రమును పొంది, వీరి ఆశ్రమ ప్రాంతమున దుష్కృత్యము లొనరించు చుండు రక్తదంతు డను రాక్షసుని సంహరించును. దానికి ముని సంతసించి, 'నీవు త్వరలో ఒక సుందరిని వివాహ మాడగల' వని ఆశీర్వదించి వసంతుని సాగనంపగా తిరుగు ప్రయాణమున ఆ రాజకుమారుడు కుంతల దేశ సమీపోద్యాన వనమున విశ్రాంతి నందుచుండగా తద్రాజ్య పాలకుడైన ఉదయార్కుని కూతురు 'మాలతి' యచట వీణవాయించుచు కన్పడును ఉభయులును పరస్పరము ప్రేమించు కొందురు. వసంత చెలికత్తె మదనమంజరి రాకుమారుని స్నేహితుడు బుద్ధిసాగరుడు. వీరి విషయమును ఉదయార్కునకు తెల్పి, మాలతీ వసంతోద్వాహ మొనర్తురు— ఇది దీనియందలి విషయము.

ప్రబంధ కథ కల్పితము. రాజులకు ధర్మ పోషణ ముఖ్య విధి యను దానిని వసంతుని ద్వారా నెరవేర్చిన కవి యితనిని ధీరోదాత్త నాయకునిగా చిత్రించినాడు. మిగిలిన పాత్రలు సైతము తమ తమ విధి నిర్వహణమున దీక్షగా నున్నట్లు పోషింపబడినవి.

ప్రబంధానుకూలమైన వర్ణన లన్నియు గల యీ 'మాలతీ వసంతము'న సముద్ర, మధుపాన, దూత్య, శైల వర్ణనలు మాత్రము లేవు. వీనికి అవకాశము లేనందున కవి వర్ణించరేదేమో !

శృంగార వర్ణన లున్నను అనౌచిత్యమున కాస్కారమును కలిగించలేదు.

**సూర్యోదయ వర్ణన :**

'పూర్వాశ యను కాంత ముఖమున గీలింప
పొసఁగిన కుంకుమ బొట్టనంగ
హరుని పాదాబ్జంబు లర్పింప సుమచేత
బూనిన దాసాని పూవనంగ
గురుతర కాఠిన్య కుచ హేత నీరజా
స్త్రముల మొక్కలు దీర్చు సాన యనఁగ
ఘన తర క్రోధుఁడై దనుజుల పరిమార్ప
శౌరి ప్రయోగించు చక్ర మనఁగ
చటుల భయదోగ్రమౌ తమః పటల మడఁప
గోరి దివి యొడిన ఫిరంగిగుం డనంగ
చిత్త మలరించు పగడఁపు గుత్తి యనఁగ
సుర విభుని దిక్కు బాలోష్ణ కరుఁడు బొడిచె' (1-146)

**మున్యాశ్రమ వర్ణన :**

'కనియెన్ ముందఁట యజ్ఞ కర్మ ఫల భాగ్య శ్రేయ సంధాన స
ద్ఘన నిష్ఠా పరిధానమున్, మహిత వేదాధ్యాత్మ విజ్ఞాన భా
జనమున్, సంచిత పుణ్య గాథ వచనా సౌలభ్య సన్మాన పా
వన తార్కాన్విత తాపసోత్తమచ యావా సాశ్రమ స్థానమున్!' (2-47)

## 17. నీలోద్వాహము :

అచ్చతెనుగు రచనలకు గౌరవ ప్రఖ్యాతుల గలుగఁజేసిన కవి సార్వభౌముడు కూచిమంచి తిమ్మన. 'నీలా సుందరీ పరిణయ'మను అచ్చ తెనుగు ప్రబంధము కవి పండిత ప్రశంసలు నందినది. తిమ్మనకు పూర్వము ఎల్లన (హరివంశము పూర్వ భాగము 106 116 పు). పోతన (భాగవతము 10 వ

స్కం. 555-557 పు), నాళ్ళపాక తిరుగళ తిమ్మయ (అష్టమహిషీ కల్యాణము, 5 వ ఆశ్వా. 258-261 పు. సత్యకీర్తి వివాహ వర్ణన) ఈ కథను చెప్పిరి. ఏక కథా విషయమును గ్రహించి చెప్పిన వీరి రచనల యందు కొలది మార్పులు గలవు.

వీనిని పరిశీలించిన వేంకట నరసింహాచార్యులు (ఐదవ) హరివంశ కథా పద్ధతిని గ్రహించి కొద్ది మార్పులతో 'నీలోద్వాహము'ను 4 ఆశ్వాసము లతో, 450 గద్య పద్యములతో ప్రబంధీకరించెనట్లు స్పష్టమగును.

**ప్రేరేపణ:** కవిని ఈ గ్రంథ రచనకు ప్రేరేపించిన సన్నివేశము: రంగాపుర గ్రామ కరణము రుద్రవరపు వేంకట రామకృష్ణ శర్మ అర్ధాంగి కామేశ్వరమ్మకు సత్యనారాయణ స్వామి ఆవేశించగా తదాలయ ధర్మకర్త ఆడవి కొలను కామేశ్వరరావు ఈ కవిని సత్కరించి గోపాలకృష్ణ కథా ప్రాధాన్యముగ సత్యనారాయణ స్వామి నంకితముగా కృతి నిర్మాణ మొనర్చవలసిన దని ప్రార్థింప, ఆచార్యులవారు దీనిని రచించి వినిపించి కామేశ్వరమ్మకు ఆరోగ్య మును కల్గించిరి. ఇది యంతయు కవి తెల్పిన విషయము. 1950 వ సం.న రచింపబడిన యీ గ్రంథము 1956 వ సంవత్సరమున ముద్రితమైనది.*20

**మార్పులు:** కవి దీనియందు చేసిన మార్పులలో ముఖ్యమైనవి :; నీల జన్మించినపుడు నందాదులు కుంభకుని యింటికి వత్తురు. యుక్త వయస్క యైన నీలను కుంభకుని యింట ఆతిథ్య సమయమున శ్రీకృష్ణుడు ప్రథమ పర్యాయము చూచును.

ఇదే సమయమున ఆమె పుష్పాపచయము నొనర్చుచుండగా ఏకాంతమున కృష్ణుడు సమీపించి పరస్పరము ప్రణయ భావముల వెల్లడించుకొందురు.

మిథిల యందు వృషభముల ఆగడముల నరికట్టిన వానికి తన బిడ్డ నొసంగి వివాహము చేయగల నని చాటించును.

ఈ విధమైన మార్పులు ప్రబంధ కథా కథనమునకు పుష్టి నిచ్చినవి. నగర, ఋతు, వన, వివాహ, ప్రయాణ, సూర్యోదయ, నాయకాభ్యుదయ, విప్ర

లంభ, వివాహ, యుద్ధ వర్ణనలు చేయబడిన 'యీ గ్రంథము'నందు శృంగారము ముఖ్య రసము; సన్నివేశానుగుణముగా వీర, రౌద్ర, హాస్య రసములు పోషింప బడినవి.

కదళీ, ద్రాక్షా పాకములతో గూడియున్న దీని యందలి పద్య శైలి చూడుడు:

**నీల యౌవనము - ముఖ వర్ణన (2-24) :**

'తరుణి ముఖాబ్జముం గని సుధాకరుఁ డెంతయు సిగ్గునొంది - భా
సుర రుచిరత్వ హైన్యమున జొక్కుచు మిక్కిలి కృష్ణ పక్షమం
దఱయఁగ గానరాక తప మద్భుత రీతి నొనర్చి రత్నుల
స్ఫురణత శుక్ల పక్షమున బొల్పు వహించు నటంచు దోఁచెడిన్!'

**ప్రకృతి వైపరీత్యము (4-51) :**

'కుల శైలంబులు క్రుంగె సప్త జలధుల్ ఘూర్ణిల్లె - తారా గణం
బిల రాలెన్ దిశ లంధకార మయమై యేర్పాటు లేకుండ సం
కలనం బందె, జగంబు లద్భుత బలోత్సాహంబు లొప్పార నా
జలజాతాక్షుఁడు సప్త గో వృషములన్ చంచద్గతిం దాకుచున్'

## 18. మిత్రవింద :

శ్రీకృష్ణుని ఐదవ పట్టమహిషి యైన మిత్రవిందను గూర్చి ఇంతకు ముందు తెనుగు సాహిత్యమునకు పరిచయము చేసిన వారిలో తాళ్ళపాక తిరువేంగళనాథుడు (అష్ట మహిషీ కల్యాణము 5వ ఆ. 249-252 పు.), రెడ్డిపల్లె ముద్దరాజు, పోతన, కాళకవి గలరు.*21 వేంకట నరసింహాచార్యులు (ఐదవ) దీనిని అవసాన కాలమున (60 వ యేట) ఆరంభించి, ప్రథమాశ్వాసమున 104 గద్య పద్యములు, ద్వితీయాశ్వాసమున 20 గద్య పద్యముల వరకే వ్రాసెను. దీని లిఖిత ప్రతి కవిగారి కుమారుని వద్ద (సూర్యాపేట) గలదు.

**కథ :** శ్రీకృష్ణుని మేనత్త యైన రాజాధిదేవికి మిత్రవింద యను కూతురు, విందానువిందు లను కుమారులు గలరు. యుక్త వయస్సు వచ్చిన మిత్రవిందకు సహోదరులు స్వయంవరమును చాటింప మేనబావ యైన

శ్రీకృష్ణుడు విచ్చేసి రాజుల నోడించి స్వయంవరమున ఆమెను వరించి, స్వపురమునకు చేరి పరిణయ మాడును. ఇది మిత్రవింద కథలోని ముఖ్య విషయము.

వేంకట నరసింహాచార్యులు దీనిని పెంచి వ్రాయ దలచి శ్రీకృష్ణ పరిపాలన, బలరామ సాత్యకుల సాంగత్యము మొదలగు వర్ణనంతో కథను ప్రారంభించెను.

శ్రీకృష్ణుడు ద్వారకయందు బలరామ సాత్యకులతో కలిసి రాజ్యము పరిపాలించుచుండగా మధురా నగర పాలకుడైన ఉగ్రసేనుడు కృష్ణుని వద్దకు అక్రూరుని పంపి, గోప గోపీ జనము శ్రీకృష్ణ దర్శనార్థము ఎదురు చూచుచున్నందున అతనిని తీసికొని రమ్మనును. అక్రూరుడు కృష్ణుని దర్శించి ఉగ్రసేనుని కోర్కెను వివరింపగా హరి సమ్మతించి రథారూఢుడై సపరివారముగా మరుసటి దినము బయలుదేరి మధురకు వెళ్ళుచుండ, మార్గమున యమునా నది వీరి నెదుర్కొని కృష్ణాగమనమున కుప్పొంగి సంతోషమును వ్యక్తపరచును ... ఇంత వరకే ప్రబంధము గలదు.

బాల్యము నుండి కవితా వ్యాసంగ మొనర్చిన యీ కవి భవిష్యత్తును భావించినట్లు ద్వితీయాశ్వాసమున ఈ క్రింది పద్యమును వ్రాసి రెండు దినముల తరువాత పరమపదించెను.

'పతి సంశ్లేష సుఖానుభూతి గొను వాంఛ త్యాతురా గోన్నతిన్
ధృతి మీఱన్ యమునా లతాంగి పరమ ప్రీతిన్ విలాస క్రియన్
చతురత్వంబున స్వాగతం బిడుచు నిష్ఠన్ కృష్ణుసేవింప స
మ్మతి నూహించెనొ నాగ పెల్లుబికి సన్మానార్థయై యుప్పుచున్' (2-20)

ఈ పద్యము కృష్ణుడు వెళ్ళునప్పుడు ఉప్పొంగిన యమునను గూర్చి నది, కృష్ణుని సేవించుటకు యమున ఆశించి అతని సంశ్లేషమును (అతనిలో లీనమగుట) కోరినది - ఇచట జీవాత్మ పరమాత్మ సంబంధము ధ్వన్యమానము (జీవము - నీరు, పరమాత్మ - కృష్ణుడు).

పరమాత్మనుండి జీవాత్మ సృజింపబడి వేరై సంసారాది కష్ట సుఖముల ననుభవించి మరల (అంతమున) పరమాత్మయందే మగ్న మగును. ఇది మోక్షము సిద్ధించుటకు చివరిదైన గమ్య స్థలము.

కవి కూడా తను వచ్చిన స్థలమునకే వేగముగా చేరి మోక్ష మంద వం యునని భావించి, ఈ పద్యమును వ్రాసి, శాశ్వతముగా కన్నుమూసినాడు.

తన కవితా సర్వస్వమును విష్ణుపుడ కర్పణ మొనర్చి 'పునర్జన్మంబు లేకుండు' నట్లు జననమును సఫలము చేసికొనెను.

'మిత్రవింద' యందు - నగర - ప్రయాణ - సూర్యాస్తమయ - నిశా- సూర్యోదయ-వన-ఋతు వర్ణనలు గలవు.

కరి హయ రథ భటోత్కరములే సంపూర్ణ
అవయవంబుల రీతి నలరుచుండ
సకల వర్ణాశ్రమాచార కృత్యంబులే
భూషణంబుల భాతి బొల్పెసంగ
పరిసరాబ్ధి తరంగ వళులతో నుప్పొంగి
శుక రుతంబను పల్కు సొబగు గుల్క
ఘనమంది రోద్యాన వన పుష్ప వల్లిత
షట్పద ద్యుతి శిరోజముల నొంది

బహుళ వృక్ష లతాంకుర పటము దాల్చి
సుర గజాహ్లాద సౌందర్య గరిమ గలిగి
సకల సౌభాగ్య మను నింపు జవ్వనమున
కన్నె పడుచన ద్వారక యెన్న బడియె. (1-2)

దీనియందు ద్వారకా వర్ణన ప్రస్తుతము. కరి, హయ, రథ, భటులు, వర్ణాశ్రమాచార ధర్మములు, శుక షట్పద రుతములు కూడ అనుసంధింపబడి, సౌభాగ్య కలి, యౌవనవతి యైన కన్నెపడుచును ద్వారకకు సామ్యముగా చెప్పి కవి తన సంలంకార ప్రీతిని వ్యక్త మొనర్చెను.

## 19. శ్రీ సత్యసాయి చరితము :

అనంతపురం జిల్లా 'పుట్టపర్తి' యందు గల భగవాన్ శ్రీ సత్యసాయి బాబా దివ్య చరితమును లక్ష్మణాచార్య కవి 5 భాగములు, 590 గద్య పద్యము లలో రచించి బాబాగారిపై తమకు గల భక్తి ప్రపత్తులు వెల్లడించుకొనిరి.

అముద్రితముగా నున్న యీ గ్రంథమున 1. అవతారము, 2. బాలబాబా, 3. లీలలు, 4. వైభవము, 5. భక్తానుభూతి యను విభాగము లున్నవి. షిర్డీ సాయిబాబా అవతారమే పుట్టపర్తి బాబా యని—

'పుట్టిన నాటినుండి పరిపూర్ణ కళామయ దివ్య శక్తి చే
పట్టిన సత్య సాయి యెదపై కనుపట్టెను షిర్డి సాయి, నే
పుట్టితి పర్తిలో నిటుల పూర్వగతిన్ నను జేరరండు నా
పట్టు విడిల్చికో లగదు భక్త మహాశయులార! మీరలున్.'

అని తెల్పినాడు.

'ప్రకృతిపై నలము ప్రాభాత మధ్యూఖ కాంతి
కాకరం బైన దివాకరుండు
ధరణిపై వెలయు నాధ్యాత్మిక జ్యోత్స్న లం
శాంతముం బలువు శశాంక మూర్తి
విశ్వమ్ముపై బొల్చు విజ్ఞాన వాహినుల్
సారింప జేయు భగీరథుండు
జగతిపై శాంత్యహింసా సత్య సౌం
దర్యములకు కాణాచి యా దివ్య మూర్తి
పరమ కల్యాణ కార్య నిర్వాహకుండు
సరస కారుణ్య భావ వాత్సల్యవాణి
మృదు మధుర వచస్స్నిగ్ధ గంభీరమూర్తి
సత్య సాయీశునకు నమ శ్శతము లివియె!'

అని బాబా గారి ప్రతిభా మూర్తిని చిత్రించినాడు.

గ్రంథకర్త ప్రతి విభాగము చివర బాబాగారిని అనేక విశేషణములతో వర్ణించెను. అట్టి వానిలో—

జన వినుత చరిత్రా! శాంతి సంపత్పవిత్రా!
మనసిజ జిత రూపా! మంజు వాక్యానులాపా!
ఘన తర నభ కీర్తీ!కామితార్థైక మూర్తీ!
దినకర సమ తేజా! దీన కల్పైక భూజా!

గ్రంథాంతమున బాబాగారి ప్రార్థన యిట్లు గలదు;

పర్తి పుర నాథ! సాయి బాబా! నమోఽస్తు
ప్రణత జన లోక! సాయి బాబా! నమోఽస్తు
ప్రథిత గుణ భావ! సాయి బాబా! నమోఽస్తు
భక్త హితలోల! సాయి బాబా! నమోఽస్తు.

## సూచికలు

1. శ్రీరంగ మహత్త్వము - పీఠిక LXXXII-IV పుటలు
2. మహబూబ్ నగర్ జిల్లా మరికల్లు గ్రామమున డా॥ వి. రత్నయ్య గారికి లభించిన యీ తాళపత్ర ప్రతి 'మానుసింగ్ కుమారుడు ధన్ను వ్రాసినది.'
3. 'తెలుగు సాహిత్యములోని రామకథ' గ్రంథమున మరింగంటి వారి రామ కథా రచనలు పేర్కొనబడలేదు.
4. ప్రథమ ముద్రణ-1917, వాణీ ముద్రాక్షర శాల, బెజవాడ. విపుల పీఠికా యుక్తముగ 1970-1979 వ సం.న ఆంధ్ర ప్రదేశ సాహిత్య ఎకాడమీ వారు దీనిని ముద్రించిరి.
5. 'ప్రబంధ కల్పవల్లి' పత్రికలో మొదట ప్రచురింపబడగా తరువాత గుంటూరు గుంటుపల్లి ముత్తయ్య గారు 1910 లో గ్రంథ రూపమున ముద్రించిరి (1980 లో మలిముద్రణము).
6. ముద్రణ 1956, నల్లగొండ (రామగిరి) మహిళా భక్త సమాజము. సంపాదకుడు; ఆసూరి మరింగంటి శ్రీరంగాచార్యులు (కనగల్లు).

7. 'పోతన భాగవతములో పోయిన ఒక కథా భాగము'- శ్రీమాన్ విక్రాల శేషాచార్యుల వ్యాసము, భారతి (1975 మార్చి).

8. వ్యాసాచార్యులు పోతనకు 178 సం. ల ముందటివారు. వేదాంత దేశికుల కాలమున వృద్ధులు- శ్రీ రామానుజ భాష్యమునకు 'శ్రుత ప్రకాశిక' అనువ్యాఖ్యను రచించిరి.

వీరరాఘవాచార్యులు మహబూబ్‌నగర్ జిల్లా 'అమరాబాదు' నివాసి (1709-1775). వీరి 'చంద్ర చంద్రి'కాఖ్య వ్యాఖ్య వనపర్తి సంస్థానము వారిచే 1885 వ సం. న ముద్రింపబడినది.

9. శ్రీకృష్ణ శతానందీయ కథ గల గ్రంథములు : అవసరాల పద్మరాజు 'చంపూ భాగవతము', ఆత్రేయ గోపాల కృష్ణాచార్య 'శోభనాద్రీశ వైభవ కావ్యమ్,' తెనుగున-సంపన్మూడుంబ సింగరాచార్యుల వారి భాగవతము. 'శ్రీకృష్ణ విరించీయము' (అము.) అను పేర శ్రీమతి విక్రాల దేవమ్మగారు ఈ కథనే ప్రబంధీకరించిరి.

10. దీని తాళపత్ర ప్రతులు మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము (Vol. VI page, 2274) నందు, ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ ప్రాచీన లిఖిత పుస్తక భాండాగారమునందు (Acc. No. 4842 Call No. T-8-56) కలవు. హైదరాబాదు ప్రతిని నేను పరిశీలన కుపయోగించితిని.

11. 'తిరునామములు' - డా॥ కిదాంబి, సంఖ్య 54, పుట 49, దీనికి సంబంధించిన కథ 'తెలుగు జానపద గేయ సాహిత్యము' 861-862 పుటల యందు గలదు.

* నా వద్ద గల తాళపత్ర గ్రంథములోని అసమగ్ర భాగములను బి. రామరాజు గారి వద్ద నున్న లిఖితప్రతి ఆధారముగా పూరించినాను.

12. 'సురతాణీ పరిణయము' - యవన కన్యను శ్రీరంగ నాయక స్వామి పరిణయ మాడిన కథ. రెంటి యందును కథ యొకటే! నాయకుని పేరు మాత్రమే భేదము.

13. తాళ్ళపాక వారి సాహితీ పరిశోధకులు డా॥ వేటూరి ఆనందమూర్తి గారి గ్రంథమున దీని ప్రసక్తి లేదు. యక్షగాన సంపాదకులు ఇది తిరువేంగళ నాథుని రచన యనిరి.

14. 'ఆచార్య సూక్తి ముక్తావళి' యందీ కథ సంక్షిప్తముగా నున్నది. 'నారదీయ పురాణము' (2-155-165) శ్రీకృష్ణుని మణికిరీట ధారణగా నీ కథను చెప్పెను. కాని చెల్వపిళ్ళ విగ్రహ ప్రసక్తి లేదు. 'సకల జీవ సంజీవనము' నందు, 'యాదవాద్రీశ స్తోత్రము'న - సంక్షేపముగా ఈ కథ యున్నది.

* ఆం. ప్ర. ప్ర. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునందలి తాళపత్ర ప్రతి (No. 4644, Call No. T-3-193) నా పరిశీలన కుపకరించినది. G.O. M. L. మదరాసు కేటలాగు (ప్రబంధ Vol. IV Part III, R. No. 662) నందు ఒక ప్రతి సూచింపబడినది.

15. ద్రౌపదీ స్వయంవరమునకు వెళ్ళిన దుర్యోధన కర్ణ జరాసంధులలో స్వయంవ రానంతరము కర్ణ దుర్యోధనులు కౌంతేయులపై సమరము సాగించిరి (ఆది పర్వము-7 వ ఆశ్వా, 171,189,194-203 పుటలు).

16. ఆంధ్ర వాఙ్మయ సూచిక (పు. 204,388) తెలుగు జానపద గేయ సాహిత్యము (పు.188,189), ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, (పు. 166,191 1214 224,228,395), తెనుగు నాటక వికాసము (పు.598) వీని యందు పేర్కొనబడని వానిలో- ప్రబంధములు 8, ద్విపదలు 9, యక్షగానములు 13, పాటలు 10, నాటకములు 10, వచనము 1 శశి రే ఖాభిమన్యుల గూర్చి గలవు.

17. నాయని వారి 'సౌభద్రుని ప్రణయయాత్ర'కు శశిరేఖాభిమన్యుల కథ ప్రోత్సాహకము. దీని యందలి 'వత్సల' యే శశిరేఖ.

18. ఆంధ్ర మహా భారత నిఘంటువు, Iవ భా. పు. 445-448.

19. రాజా రాఘవరాజు రంగరాజు ద్రవ్య సాహాయ్యమున ఏలూరు మంజువాణీ ప్రెస్సులో ముద్రింపబడినది.

20. ద్రవ్య దాత రావు సాహెబ్ దాసురాజు వెంకటరావు పంతులు (ఏలూరు)

21. ముద్దరాజు అష్ట మహిషీ కల్యాణములోని వని రెండు పద్యములు ప్రబంధ రత్నావళి (పు. 107) యందు గలవు భాగవతము (౧౦వ స్కం 555 వ, పుట.) రాజగోపాల విలాసము (3.23-55) ల యందు ఈ కథ చెప్పబడినది. కుందుర్తి వెంకటాచలకవి, రావూరి ఎల్లయ, తూము రామదాసు ప్రత్యేక ప్రబంధములుగా 'మిత్రవిందా పరిణయము'ను చెప్పిరి.

# 2
# ద్విపద

## శ్రీకృష్ణ తులాభారము

చతుర్విధ కవితలలో మధుర కవితా శాఖకు చెందిన 'ద్విపద' నామము సంస్కృతము అయినను పద కవితా విభాగమునకు చెందిన 'దేశి' కవిత.

ద్విపదకు మొదటి దశ శివ కవుల రచనలు (బసవ పురాణ, పండితారాధ్య చరిత్రలు). రెండవ దశ రంగనాథ రామాయణ, హరిశ్చంద్రోపాఖ్యానములు. మూడవ దశ తాళ్ళపాకవారి రచనలు.

ఒకనాడు శివకవులు మత ప్రచారమునకు ద్విపదను సాహిత్యాయుధము చేసికొన్నట్లే తాళ్ళపాకవారు ద్రావిడ వేద సారమును తెనుగున కందించి శ్రీ వైష్ణవ మత ప్రచారార్థము ఈ ఛందము నుపయోగించి, దీనిని 'విరాట్ ఛందోఒవతీర్ణ'యనిరి (అష్ట మహిషీ కల్యాణము పు. 7).

ద్విపద రచనను పరాకాష్ఠ దశకు చేర్చి, పరమ యోగులే గాక పరమాచార్యుల వలె విహరించిన తాళ్ళపాక వారు తమ సందేశామృతమును సాహితీ క్షేత్రమునకు పంటలుగా నొసంగినారు.

మత సంబంధ సాహిత్యము ప్రజా సామాన్యము నందు వ్యాపింపవలెననిన ప్రౌఢకావ్య కళా స్పష్టికన్న ప్రజాదరణ పాత్రమగు దృష్టి ముఖ్యము. ఈ ఉద్దేశ్యము కలిగిన శైవ కవులు, తాళ్ళపాక వారు ద్విపద రచన వలన ప్రసిద్ధులైనారు. వీరి ననుసరించి మరింగంటి కవులలో వేంకట నరసింహాచార్యులు సామాన్య జన ప్రచారమున గల శ్రీకృష్ణ తులాభార కథను గ్రహించి

ఏకాశ్వాస పరిమితిగా 1040 'ద్విపద'లలో చెప్పెను. దీనియందు 'వంశ వర్ణనము'లేదు. 'సిరిసెన గండ్లాడి శ్రీశునిపేర' ఇది అంకితము చేయబడినది

'గురు శిఖామణి పెద్ద కొమరుడై యొప్పు
నర సుత వేంకట నారసింహార్య
విరచిత కావ్యమై వెలయు శ్రీకృష్ణ
వర తులాభార సద్వ్రత మహత్త్వంబు
ధరణిపై నాచంద్ర తారార్కముగను
స్థిర తరంబుగ నిలుచు శ్రీ హరి కృపను!'

అని కవి తెల్పెను.

నంది తిమ్మన పారిజాతాపహరణ కావ్యము నందు 5వ ఆశ్వాసములో (54-90 పద్యములు) పుణ్యకవ్రత మను పేర ఈ కథ గలదు.

సంస్కృత హరివంశ కథను ఆధారముగా గ్రహించిన తిమ్మన దీనిని సంక్షేపముగా చెప్పినను, 'తులాభార' ప్రసక్తి చేయలేదు. ద్విపద కావ్య కర్త కొంతవరకు తిమ్మన రచనను అనుకరించినను సన్నివేశములు, కల్పనలు, వర్ణనలతో కథను పెంచి కృష్ణునకు 'తులాభారము' వేయించెను.

ఉభయుల కథా కథన భేదము లిట్లు గలవు:

| | |
|---|---|
| పారిజాతాపహరణము : | సత్యా కృష్ణులు కలిసి యున్నపుడు నారదుడు ఓచ్చేసి పుణ్యక వ్రత విషయమును వారికి చెప్పును. |
| శ్రీకృష్ణ తులాభారము : | ఏకాంతమునందు గల సత్యతో నారదుడు చెప్పును. |
| పారిజాత : | చైత్ర శుద్ధ నవమినుండి నెల రోజులీ వ్రతమును చేయవలెను. |
| శ్రీకృష్ణ : | మార్గశిర శుద్ధ ఏకాదశి నాడు మాత్రమే చేయ వలెను. |

| | | |
|---|---|---|
| పారిజాత | : | దాన మంటప నిర్మాణము, వ్రతము, పతిదానము, ధన మొసంగి సత్య మరల పతిని గ్రహించును. |
| శ్రీకృష్ణ | | నారదుడు చెప్పి వెడలిన కొన్నాళ్ళకు మార్గశీర్ష మాసమున వ్రతారంభము, ఇంద్రాది దిక్పాలకులకు నారదుడే పతిదాన వ్రత విషయమును చెప్పి, అందరిని ఆహ్వానించును. వీరితో పాటు ముని జనులు, బ్రాహ్మణులు విచ్చేయుదురు. కౌరవులు రాగా, శ్రీకృష్ణుడు వారికి తగిన పనులు కేటాయించును (ధర్మజ రాజసూయము వలె). కుబ్జ, ద్రౌపది, రాధ, ప్రద్యుమ్నుడు, సాత్యకి విచ్చేసి వ్రత సంబంధ కార్యము లొనర్తురు. |

రుక్మిణి పతి దాన వ్రతమునకు రాకపోవుటకు సవతుల కయ్యమే కారణమని రేవతీ, ద్రౌపదులు సంభాషించు కొందురు.

వ్రతోద్యాపనానంతరము శ్రీకృష్ణుని దానముగా గ్రహించిన దేవర్షి ఆయనను పుష్పమాలికతో కట్టివేసి విక్రయింప నుద్యుక్తుడు కాగా, ఎవరైన తన భర్తను గ్రహింతురేమో యని సత్యభామ దుఃఖించి భర్త యెత్తు (బరువు) ధన మిచ్చి గ్రహింప ప్రయత్నించును. కాని ఎంత బంగారము, ఇతర ఆభరణము లెన్ని వేసినను కృష్ణుని బరువునకు సరిపడక పోవుటచే ఆమె కుములుచుండగా రుక్మిణీ దేవి వచ్చిన త్రాసు సరియగునని నారదుడే చెప్పును. అప్పుడు సత్య వెళ్ళి రుక్మిణిని బ్రతిమాలి తీసికొని రాగా, ఆమె భక్తితో ఒక తులసీ దళమును తులయం దుంచ నది సమాన మగును. దీని వలన సత్య గర్వభంగము, రుక్మిణి భక్తి ప్రపత్తులు వెల్లడి యైనవి. 'పారిజాత' కర్త 'కృతక వికాస మచ్చుపడి కృష్ణుని పట్టపు దేవి యిందిరా ప్రతినిధి రుక్మిణీ రమణి రాదగదా నని వచ్చె పుణ్యక వ్రతము కనుంగొనంగ—' (5-74) అనెను, దీనికన్న సత్యభామ వెళ్ళి తన భర్తను దక్కింపు మని రుక్మిణిని ప్రార్థించి తీసికొని వచ్చి నట్లు-ద్విపద కర్త చెప్పిన తీరు సమంజసముగా గలదు. తిమ్మన పుణ్యక వ్రత కథకు మూలమును చెప్పలేదు. తులాభార కర్త 'భార్గ వాది స్మృతుల్ బల్కిన విధము' అనెను. పుణ్యక వ్రతము పేర 860 ప్రవరములలో నేదియును లేదు.

ఇది తిమ్మన కల్పితమే! సత్యభామ చేసిన యీ వ్రతమునకు పతిదాన వ్రత మని పేరు. షోడశ దానములలోను, దశ దానములలోను ఇది లేదు. దీనిని సైతము తిమ్మన కల్పించినాడు.

చైత్ర శుద్ధ నవమి వ్రతాచరణకు ముఖ్యమని 'పారిజాత' కర్త చెప్పిన దానికన్న వేంకట నరసింహాచార్యులు చెప్పిన మార్గశీర్షము తగినది. గీతలో శ్రీకృష్ణుడు 'మాసానాం మార్గశీర్షోఽహం' అనెను. చతుర్వింశతి ఏకాదశులలో మార్గశిర శుద్ధ ఏకాదశికి కామిన్యేకాదశి యని పేరు. హరి వాసరము వలె హరి మాసమును, కామిన్యేకాదశిని ఎన్నుకొని ద్విపద కర్త వ్రతమునకు ఒక చక్కటి దినయుక్తము నేర్పరచెను. విజయనగర కాలమున తులా దానములు ప్రచారమున గలవు. తిమ్మన దీనికి పారిజాతాపహరణము నందు నూతన విధానమును కల్పించి, పతిని దానము చేయించి, అతనిని తూచి తీసికొమ్మని చెప్పినాడు. ఇట్టి సంఘటనను ఆయన సత్య గర్వభంగమునకు వినియోగింపగా, 'తులాభార' కర్త—

'యుక్తు లేటికి చాల నుపమింపగాను
భక్తితోను తులసి పత్రితో సమము·
రగ పవిత్రం బన్యతరము గాదంచు
బొగ డొందెను తులసి భూజ రాజంబు
సిరితోడ దీటుగా శ్రీహరి యురము
నిరపుగ చెలువొందు నెపు డెడ లేక
సిరివరు మహిమయు శ్రీ తులసి మహిమ
సరసి జూచిన నొక్క టని నిజం బనుచు—'

తులసీ మాహాత్మ్యమునకు ప్రాముఖ్య మిచ్చి తులాభారమును చేయించెను. ఈ విధముగా ఆచార్యుల వారి రచనయందు ప్రత్యేకతలు గలవు.

శ్రీకృష్ణ తులాభారము నందలి ద్విపద రచన ప్రసన్నముగా సాగినది. ఎచ్చటను దీర్ఘ సమాస రచన లేదు. శబ్దాలంకార పద్ధతులు క్వాచిత్కము. ··గును వ్యక్తి వర్ణనము౹నే గలవు.

'శ్రీ వధూ ప్రాణేశ! సింధు నివేశ!'
'ఓ మానినీ మణి! ఓ మధు వాణి!
ఓ మంజు భాషిణి! ఓ నీల వేణి!'—— ఇత్యాదులు.

ఈయనది ఆఖ్యాన ప్రధానమైన శైలి కావున శబ్దాలంకారములకు అధిక స్థాన మీయలేదు.

రుక్మిణీ దేవిని గూర్చి రేవతి ద్రౌపదితో——

'మఱచితే నీ చిన్ని మఱదలు మహిమ
యెఱి గెఱుంగని మాడ్కి నేల నడిగెదవు
వారందరికి చాల వాదంబు గలదు
పారిజాతము విరి పగలు తీరినవె......
తాకి తల్పగ బోము తరుణి యీ సుద్ది
మాకు నచ్చదు అట్టి మతకరి తనము...'

అని సత్యభామ బుద్ధిని గూర్చి చెప్పినది.

రుక్మిణి సత్య వద్దకు వెళ్ళి రమ్మని బ్రతిమాలగా ఆమె——

'వగల మాటల నన్ను వంచింపఁ దలఁచి
మగువరో! యిటు వచ్చు మాడ్కిగాఁ దోఁచె-' నని బల్కి సత్యకు భర్త యిచ్చిన చనువు, అనేక సిరి సంపదల నేకరువు పెట్టి——

'నోరు పంతము లాడె నొసటిపై వ్రాత
తీరు తప్పి జనుల తిరిపెంబు లడుగు
పాలాయె' నిక దూఱ బనియేమి ఒకరి
జోలి గైకొన నేల జోకతో మిగుల
సిరాడు కడవయు నెఱి ముంత మఱుగు
దూఱిన కైవడి దూర మెంచకను!'

అని, సవతులకు గల సహజ వైర భావమును లోకోక్తులతో వ్యక్త పఱచెను.

కవి యీ కథను 'సూతుడు చెప్పినట్లు శుకుడు జనక మహారాజునకు చెప్పెను' అని తెల్పినాడు. జనకునకు, శుకునకు సంబంధమే లేదు. అందున కృష్ణ కథ జనకునకు చెప్పుట ఎట్లు పదురును? దీనిని జానపదులకు ఆదరము కల్గునట్లు కవి శుక, జనకులను పేర్కొనినాడు. ఇది యొక జానపద కథా పద్ధతి.

ఇప్పటి వరకు అముద్రితముగా నుండి (తాళపత్ర ప్రతి) ద్విపద సాహితీ పరిశోధకులు పేర్కొనని చిత్ర చారిత్రము శ్రీకృష్ణ తులాభారము.

# 3

# యక్షగానములు

## పరిచయము

'యక్షగానము' అనగా యక్షులచే గానము చేయబడునది అని యర్థము. ఇది దేశి సాహిత్య ప్రక్రియ. సంగీత నృత్య తాళాది యుక్తమై జన సంతోష కారక మగునట్టిది. 'యక్ష', 'గాన' ఈ రెండును సంస్కృత శబ్దములు. అయినను సంస్కృత సాహిత్య సంబంధము లేనిది ఈ 'యక్షగానము'. తెనుగు సాహిత్యమున మొట్ట మొదట 'యక్షగానము'ను పేర్కొనిన కవి శ్రీనాథుడు. భీమేశ్వర పురాణములో "కీర్తింతు రెవ్వాని కీర్తి గాంధర్వులు గాంధర్వమున 'యక్షగాన' సరణి" (3-64) అనెను. ఇతనికి ముందున్న పాల్కురికి సోమన 'ఆదట గంధర్వ యక్ష విద్యాధరాదులై పాడెడు నాడెడు వారు' అని పండితారాధ్య చరిత్రలో చెల్పెను. ఇవి ఉత్సవాదులలో ప్రదర్శింపబడు క్రీడలు. వానియందు 'యక్ష' రూపధారు లున్నారు. సోమన వరకు యక్షగాన రూప మేర్పడ లేదు. శ్రీనాథుని వరకు 'యక్షగాన సరణి' వచ్చినది. క్రీడాభిరామమునందు 'జక్కుల పురంధ్రి' వర్ణింప బడినది ('యక్ష' - 'జక్క' యైన దని పరిశోధకులు *1 తాళ్ళపాక చిన్నన్న 'సంకీర్తన లక్షణము'న జక్కుల రేకుల పేర్కొనెను. చిత్రకవి పెద్దన, అప్పకవి తమ రచనలలో *2 'యక్షగానము'ను తెల్పిరి. కాని ఎవ్వరును ఇదమిత్థముగా దీని లక్షణమును చెప్పలేదు. పాల్కురికి సోమన తెల్పిన విషయము ననుసరించి ఆలోచించిన మొదట తెరల చాటున కొయ్య బొమ్మల నిల్పి ఆడించి, తరువాత తోలుబొమ్మల ప్రవేశపెట్టి, ఒకరు చదువు చుండగా మరి యొక దాని కను గుణముగా వీని నాడించువారు. ఇట్టి పద్ధతిని మార్చుకొను దలచి జక్కులే వేషముల వేసికొని స్వయముగా చదువుచు అభినయము చేసినారు. ఇదియే ఒక రకముగా వ్యాప్తి చెంది అభివృద్ధి నంది 'యక్షగానము' కావచ్చును *3

వీని మొదటి దశ కేవలము గేయ రూపకముగా దేశి ఛందముందలి విడి విడి పాటలతో కూడియుండి, దినితోనే కథా కథనము సాగినది. వచనములు స్వల్పము. మధ్య మధ్య సంధి వచనముం వుండెది కలవు. సూత్రధారుడు లేడు. స్త్రీ గాని పురుషుడు గాని హావభావములతో గేయ రూపముగా కథను చదువుచుండిరి. వీని ననుసరించి పరిశీలించిన భీమేశ్వర పురాణము ప్రకారము యక్షగానము గాన రూప స్తోత్రము, క్రీడాభిరామము ప్రకారము గానరూప కథాఖ్యానము*4 అని భావించవచ్చును.

ప్రోలుగంటి 'చెన్నశౌరి సౌభరి చరితము' (1480-1495) మొట్ట మొదటి యక్షగాన మైనను, లభించిన వానిలో కందుకూరి రుద్రకవి 'సుగ్రీవ విజయము'*5 ప్రాచీన తమ మైనది. దీనియందు రగడలు, ద్విపదలు, అర్ధచంద్రికలు, ఏలలు, ధవళములు, శోభనములు, చిన్న 'వచనములు' కొన్ని పద్యములు, గేయములు ఉన్నవి. ప్రబంధము వలె 'శ్రీ' కారముతో అరంభింపబడి, ఆఖ్యాన శైలి కన్న సంవాద శైలికి ప్రాముఖ్య మీయబడినది.

రాను రాను యక్షగానము నాయక రాజుల కాలమున చాల మార్పులు చెందినది. నాటకముల వలె అంక విభాగము, ప్రబంధముల వలె అశ్వాస విభాగము చేయబడి 'యక్షగాన ప్రబంధ' మనబడినది. వీనియందు గేయ ధర్మము కన్న రూపక కళ యధిక మైనది. ఆ నాడు వీని ప్రచారమును బట్టి సంభాషణల ననుసరించి అంక విభజనమొనర్చి ప్రదర్శించి పండిత పామర జన రంజక మొనర్చినారు. కావుననే దేశి పద్ధతిని మార్గ (ప్రబంధ) పద్ధతి ఆక్రమించి - యక్షగానములు వ్యాప్తినందినవి.

నాయక రాజుల తరువాత ఆంధ్ర దేశమున - ముఖ్యముగా తెలంగాణము నందు - యక్షగాన రచనా, ప్రచారములు అధిక మైనవి. ఈ ప్రాంతము యక్షగాన కవులలో చెర్విరాల భాగయ్య 35 యక్షగానముల రచించి సుప్రసిద్ధు డైనాడు.

యక్షగాన కళను సిద్దేంద్రయోగి శిష్యులైన కూచిపూడి వారు గ్రహించి మెరుగులు పెట్టి ప్రదర్శ నానుకూలముగా కొన్ని కథలను సిద్ధ మొనర్చి, 'కూచిపూడి భాగవతము'ల పేర ప్రసన్నులందున వేసికిని ప్రసిద్ధము.

శ్రవ్య కావ్యము కన్న, దృశ్య కావ్యము జనులను మిక్కిలి ఆకర్షించి వాని యందలి విషయములు, సన్నివేశములు వారి మనస్సుల యందు ప్రగాఢమైన ముద్రను వేయును. అందుకే యక్షగానములు, నాటకములు బాగుగా ప్రచారమైనవి. ప్రారంభమున సామాన్య జనుల వినోదార్థము అందు కనుగుణమగు దేశి చ్ఛందములతో రచింపబడిన యక్షగానము తరువాత పండితుల చేతిలో బడి, ప్రబంధ నాటక పద్ధతులకు గురియై నాటక స్వభావమును సంతరించుకొనినది.

మరింగంటి కవుల యక్షగానములు భారత భాగవత రామాయణ కథాత్మకములు మూడు మాత్రమే కలవు. వీనియందు 'ప్రద్యుమ్న విజయము' వీథి భాగవతము. మిగిలిన వానిలో మొట్ట మొదటిది—

## శ్రీరామ నాటకము

తిరుమలాచార్య పుత్రుడైన రామానుజాచార్యులు బహు విధ గ్రంథ నిర్మాత యని 'సురతాణీ పరిణయ' కర్త తెల్పెనను, ఒక్క 'శ్రీరామ నాటకము' మాత్రమే లభించినది.*6 కవి యీ పేరున పూర్తి నాటకమును రచించెనో లేదో తెలియదు. లభించుచున్న ప్రతులయందు లక్ష్మణ మూర్ఛ ఘట్టమునుండి శ్రీరామ పట్టాభిషేకము వరకు కలదు.

వీర రస ప్రధానమైన యుద్ధత శైలి, ప్రౌఢ రచనా పరిపాటి గల పద్య గద్యములు ఉండున్నవి. దరువులు ఎక్కువ. పాత్రల సంవాదాత్మక వచనములు, సంధి వచనములు కొంత వ్యావహారిక భాషా సరళితో రచింప బడినవి. మధ్య మధ్య ద్విపదలు గలవు. భాస్కర రామాయణ ప్రభావ మీ రచనపై మిక్కుటముగా గలదు నూతన సన్నివేశములను కూర్చి కథను పెంచినాడు. అనుర శ్లోకములు అర్థ వివరణముతో సీయబడుట వలన నిది తోలుబొమ్మ లాటలందుపయోగింపబడు రచనగా తోచుచున్నది ఇట్టి పద్ధతి బొమ్మలాటలకు పరిపాటి.*7

"శ్రీరామ నాటకము బొమ్మలాట రామాయణముగా ప్రసిద్ధి పొందినది. దీనిని 'గుజ్జువాడ లక్ష్మణ మూర్ఛ' అని కూడ వ్యవహరింతురు. మాధవ పట్నం బొమ్మలాట వారి లక్ష్మణ మూర్ఛలో ఇందలి పద్యములు దరువులు వినిపింతురు" అని డా॥ జి. నాగయ్యగారు తెల్పిరి *8 రస శిష్యులైన అచ్యుత రామకవి,

దరువూరి అప్పలాచార్యులు ఈ గ్రంథ రచనమున తోడ్పడినట్లు కవి వ్రాసికొనెను. కాని అచ్యుతరామకవి తన 'సురతాణీ పరిణయము'న గురువు గారి 'గణపతు ద్ధ్యుపాఖ్యానము'ను పేర్కొనెను శ్రీరామ నాటక ప్రస్తావన చేయలేదు.

## 2. సౌగంధికా సంగ్రహము

### (సాహస భీముడు)

ఆంధ్ర మహా భారతములోని అరణ్య పర్వము (3, 312-376) నందు గల సౌగంధికా సంగ్రహ వృత్తాంతమును గ్రహించి శ్రీమాన్ రంగ కృష్ణమాచార్యులు పై పేరుతో యక్షగానమును రచించెను. రెండంకములు గల యీ కృతి ప్రారంభమున దేవతా స్తుతులు, సుకవి కుకవి పురస్కారణ తిరస్కరణలు, 2 కందములతో షష్ఠ్యంతములు గలవు. సూత్రధార నటీ సంభాషణమున కవి పరిచయము చేయబడినది. స్వాతంత్ర్యోత్సవ సందర్భము పురస్కరించుకొని ఒక వీర గాథను ప్రదర్శింపదలచి విద్యార్థు లడుగగా కవి దీనిని టంగుటూరి ప్రకాశం పంతులు గారి సంస్మరణముగా రచించినట్లు తెల్పుకొని, తనకు గల దేశభక్తిని చాటినాడు.

దీనియందు సూత్రధారుడు సంధి వచనము ద్వారా ప్రతి పాత్రను పరిచయము చేయును. ప్రారంభమున వసంత వర్ణన, ప్రేక్షకులపై పువ్వుల చల్లుట. బాలకృష్ణ వేషము ప్రవేశించి కథను ఆరంభించుట— ఈ ప్రాచీన సంప్రదాయములు పాటింపబడినవి. కవి దీనియందు 14 ద్విపదలు (పెద్దవి), 16 కందార్థములు, 7 సీసములు, 1 సీసార్ధము, 6 కందములు, 8 తేటగీతులు, 4 చంపకములు, 4 శార్దూలములు, 2 మత్తేభములు, 4 పంచచామరలు, 2 తరలలు, 2 సుగంధులు, రగడ, గీతార్థము, చూర్ణిక, పరాక్ వచనము ఒక్కొక్కటి రచించెను. గ్రంథాంతమున మంగళహారతి, 'గద్య', కృతి సమర్పణ 'ద్విపద'లు ఉన్నవి.

మహా భారతమునం దీ కథ 64 గద్యపద్యములతో గలదు. మూడు నాల్గు పాత్రలతో నడిచిన మూలకథను యక్షగాన కర్త 16 పాత్రల చేర్చి కథను పెంచినాడు. అనేక సన్నివేశములు కల్పింప బడినవి. సంక్షిప్తముగా దీనిలోని విషయము :

**భారతమున :** ద్రౌపదీ భీములు గంధమాదనమున విహరించుచుండగా వాయు వశమున సౌగంధికా ప్రసవము వచ్చి వీరి ముందు పడును. ద్రౌపది కోరికపై అట్టి పుష్పముల తెచ్చుటకు భీముడు వెళ్ళును.

**యక్షగానమున :** గంధమాదన ప్రసక్తి లేదు. కొలువు తీర్చి యున్న ధర్మరాజు వద్దకు నారదుడు వచ్చి ఇంద్రలోక విషయముల చెప్పుచుండును. ఆ సమయమున రామశాస్త్రి, కృష్ణశాస్త్రి వచ్చి, అడవిలో క్రూర మృగ బాధ అధికమైనందున భీముని పంపవలసిన దని కోరుదురు. ధర్మజు నాజ్ఞచే భీముడు బయలుదేరగా వెంట ద్రౌపది వెళ్ళును. అరణ్యమున వీరు విశ్రమించునపుడు సౌగంధికా ప్రసవము వచ్చి వీరిముందు పడును.

**భార :** అడవికి వెళ్ళిన భీము నడ్డగించి హనుమ అతని బల పరీక్షా నిమిత్తము వాలము నడ్డముగా నుంచును. భీముని రామ కథను చెప్పు మని యడుగును.

**యక్ష :** వాల పరీక్ష, రామకథలతో పాటు భీముని ప్రయోగ నైపుణ్యము వ్యక్త పరచవలసిన దని ఆమ్ర ఫలముల పడవేయ వలసినదిగా హనుమ కోరును. దానికి భీము డశక్తుడు కాగా ఆంజనేయుడు తన విషయమును తెల్పి, ఇరువురు పరిచయ మగుదురు.

**భార :** ద్రౌపది ద్వారా భీముని విషయము తెలిసికొనిన ధర్మరాజు రాక్ష సుల వలన అతనికి బాధ కలుగు నని శంకించి ఘటోత్కచుని సాహాయ్యమున గంధమాదన ప్రాంతమును చేరును.

**యక్ష :** ధర్మరాజాదుల శాంతింప చేసి, ఘటోత్కచుడే భీముని వద్దకు బయలుదేరును.

ఇట్లు కొన్ని సామ్యములు రెండిటియం దున్నను, యక్షగాన కర్త నూతన ముగ చేర్చిన విషయము మరికొంత గలదు. అర్జునుడు పాశుపతాస్త్రము నిమి త్తము, భీముడు సౌగంధికాహరణ నిమిత్తము అరిగి నందున ధర్మరాజుతో యుద్ధము చేయవలె నని సంకల్పించిన దుర్యోధనుడు కర్ణ,శకుని,దుశ్శాసనులతో

కలసి బయలుదేరును. వీరి విషయమును ముందుగనే పసిగట్టిన ఘటోత్కచుడు ధర్మరాజుకు చెప్పి, తాను మాయ వేషమున వచ్చేసి సమరమున కర్ణ దుర్యోధనుల బంధించి ధర్మరాజు వద్దకు తీసికొనిపోవును. వారికి బుద్ధులు చెప్పి ధర్మరాజు కర్ణ దుర్యోధనుల విడిపించి పంపించుటకై యత్నించుచుండ - నారద శ్రీకృష్ణులు విచ్చేయుదురు. పరస్పర కుశల వార్తలు, శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, తులాభార విషయములు నారదుడు వివరించును. భీముని విషయము తెలిసి కృష్ణుడే అతని కొరకు బయలుదేరును. సరోవర ప్రాంతమున రాక్షసునితో భీముడు సంగ్రామము చేయుచుండగా - కుబేరుని వద్దనుండి మణిమంతు గను యోధు దరుదెంచి భీమునితో తలపడి మరణించును. ఈ విషయమును కుబేరుడు తెలిసికొని బాధపడి మణిమంతుని బ్రతికించ వలసినదిగా శివుని ప్రార్థించును. శ్రీకృష్ణుడు మాత్రమే గతప్రాణు డైన మణిమంతుని బ్రతికించు నని శివుడు బదులు పలుకగా, కుబేరుడు వచ్చి కృష్ణుని ప్రార్థించుచుండును. ఇంతలో ద్రౌపదీ యుక్తుడై ధర్మరాజు ప్రవేశించి, మణిమంతుని జీవింప చేయవలసిన దని కృష్ణుని కోరును. వారి వాంఛ ప్రకారము మణిమంతుని పునరుజ్జీవితుని చేయగా-నతడు కృష్ణునకు ప్రణమిల్లి 'నేను అగస్త్యు నసుమానించినందువలన శపింపబడి-మానవునిచే మరణించి మీచే మోక్ష మందితి' నని పల్కి, గంధర్వలోకమున కరుగును.

అనంతరము ధర్మజాదులు వలసిన పుష్పముల తెంచుకొని శ్రీకృష్ణ యుక్తులై వెనుదిరిగి వత్తురు.

ఇది యక్షగానములోని విషయము. కవి దీనియందనేక పాత్రల ప్రవేశ పెట్టినాడు. కథారంభము నారదునిచే జరిగినను ఆ పాత్రకు విశేష స్థానము లేదు. మృగయార్థమై వెడలుచున్న భీముని వెంట ద్రౌపది వెళ్ళుట కేవలము పుష్ప నిమిత్తమే యని వ్యక్త మగుచున్నది. దుర్యోధనాదులు యుద్ధము చేయ సన్నివేశ మెందుకు కల్పించబడినదో దీని ప్రయోజనము మాత్రము లేదు. 'ఘోషయాత్ర' యుద్ధమును కవి మరియొక విధముగా నిచట చెప్పి దుర్యోధన పరాభవమును సూచింప దలచెనేమో! నారద శ్రీకృష్ణుల ప్రవేశము, శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, తులాభార విషయములు కేవలము బాసపము సంతోషమునకే

వ్రాయబడి, నాటక విరణమునకు కారణ మైనవి. కృష్ణ పాత్ర ప్రయోజనము కేవలము మణిమంతుని జీవింప చేయుటకే యనిపించును. మాయా విద్యలు, మాయా యుద్ధముల తెల్పుటకు ఘటోత్కచుడు ప్రవేశ పెట్టబడెను. రామశాస్త్రి, కృష్ణశాస్త్రి కేవలము హాస్య మొనర్చుచు భోజన ప్రియులుగా చిత్రింపబడిరి.

వాహుకలో నున్న చిన్న కథను ప్రఖ్యాత కథకు ముడిపెట్టి గ్రామీణ జన సంతోషమునకు వ్రాయబడిన దీ యక్షగానము.

కవి యుద్ధవర్ణమున రగడను, ద్రౌపది శ్రీకృష్ణుని స్తుతించునపుడు దీర్ఘ సమాసయుతమైన చూర్ణికను రచించెను.

తనకు గలఉర్దూ భాషాభిమానమును రాజ ప్రవేశ సమయమున ప్రధానితో నిట్లు వ్యక్తీకరించినాడు :

దరువు - ఏకతాళం :

ధర్మరాజ్ కా సవారీ ఆయా, దర్బార్ కరో జాల్ మియాం
నిర్మల్ మణిమయ నిజసింహాసన్ ధర్మ విచార్యే దర్శన్‌హోతే
చార్ తరఫ్‌సే రోషిని హోనా సబ్ లోగ్ ఆకర్ సలామ్ కర్నా
పటేలు పట్వారి పహరా జవాన్ పట్‌కీ సర్కార్ హుకుం లేలేవ్
దేబ్ న హో ఆతా హై దేవల్‌కో నాపూర్ దేఖ్‌నేకే జరూర్ -
ధర్మరాజ్‌కో సవారీ...................... (28 వ పుట)

తెలంగాణమున వచ్చిన యక్షగానాలలో ఇట్టి రచనా పద్ధతి గలదు. ప్రాంతీయ భాషా ప్రయోగమునకు, ప్రేక్షక జన సంతోషమునకు ఈ విధమైన రచన లొనర్చుట కవుల పరిపాటి (ఉదా: చెర్విరాల బాగయ్య గారి యక్షగానములు). ఘటోత్కచ ప్రవేశ సమయమున - పంచచామరము :

వరే వరే భయంబు దక్కి వచ్చి నా కురంగటన్
విరాన బల్కె దౌర నేను భీమసేను పుత్రుఁడన్
సరాసరిన్ ననుం దలంప చక్క గొచ్చినానురా
కరాసి చేత బూని తింటు గాన దూర ముండరా!

'వరే' బదులు ఒరే! యనవలెను - కాని యతి తప్పును. దక్కగా వచ్చి నాను - అనుటకు 'చక్క గొచ్చినాను'. ఇవి జన వ్యవహారమున గల పద ములు - కవి వానిని యథాతథముగా ప్రయోగించినాడు.*9

కల్వకుర్తి, దేవరకొండ తాలూకాలలో ప్రచార మందిన దీ యక్షగానము.

## 3. ప్రద్యుమ్న విజయము :

వేంకట నరసింహాచార్యులు (ఐదవ) ఇంతకు ముందు పౌరాణిక సాంఘిక నాటకములను రచించి, 4 అంకముల పరిమితి, 10 మంది ముఖ్య నటీ నటులు గల యీ వీథినాటకమును రేపాల లక్ష్మీ నృసింహ స్వామికి అంకితముగా రచించిరి.

కొల్లు పాపయ్యగారి ధన సాహాయ్యమున నిది 1935 వ సం. న ముద్రిత మైనది. కవి నాటకారంభమున ద్రవ్యదాత వంశ ప్రశస్తి చేసి, తన వంశవర్ణన మొనర్చినారు. సంప్రదాయము ప్రకారము దేవతా స్తుతులు గలవు.

తన యితర నాటకముల కన్న భిన్నముగా కవి దీనిని 'వీథి నాటకము'గా రచించెను.

'వీథి' యనగనే మనకు నాటక లక్షణ కర్తలు తెల్పిన 'వీథి' భేదమును స్ఫురింప జేయును. కాని యీ లక్షణమునకును, ప్రస్తుత నాటకమునకును సంబంధము లేదు.

దీనిని వీథియందు (పెద్ద బజారులో) ప్రదర్శించుటకు అనువైన విధముగా రచించినందున వీథి నాటక మనినా నని కవియే తెల్పెను. వీథియందు వేషగాండ్రు (దాసరులు) ప్రదర్శించు ప్రక్రియ యైనందున నిది 'వీథి భాగవతము'. నాటక శబ్దము (నటన వలన) సామాన్యము కావున 'వీథినాటక' మని కవి పేరు పెట్టెను.

రాయల సీమ, 'కన్నడ' దేశము లందలి బయలాటలు, అరవ దేశములోని తెరుకూత్తులు ఇట్లు వీథియందు ప్రదర్శింపబడును.*10 తెనుగునందు దేశి ప్రక్రియా నాటకముగా వీథినాటకము ప్రాచీనముగ కన్పట్టదు. పాలకురికి సోమన 'నాటకము' అను దానితోనే వీని నన్నిటిని చెప్పినాడు.*11 ప్రాచీనమగు యక్షగాన నాటక పద్ధతిలో చేరిన 'వీథినాటక' ప్రదర్శనము నీచ జాతి వారి

నుండి అగ్రవర్ణముల వారు స్వీకరించి, భరతశా స్త్రానుగుణముగా ప్రయోగించినారు.

పండిత పామర జనమును ఆకర్షించి సంతోషింపజేయు వీథి నాటక పద్ధతి*12 పూర్తిగా జానపదమై గ్రామీణుల యందు వ్యాప్తి నందినను రాను రాను పండితుల చేతిలో పడి కవితా ప్రౌఢిమ సంతరించుకొనెను.

సూర్యాపేట తాలూకా రేపాల నృసింహస్వామి యుత్సవ సమయములందు విరివిగా నాటక ప్రదర్శనములు జరుగుచుండును. స్థానిక ప్రముఖుల కోరికపై వేంకట నరసింహాచార్యులు దీనిని రచించి మూడు పర్యాయములు ప్రదర్శింపచేసినాడు.

దీనిలోని విషయము ప్రఖ్యాతమైనది. హరివంశ భాగవతములందు ప్రద్యుమ్న కథ గలదు. సూరన 'ప్రభావతీ ప్రద్యుమ్నము' ప్రసిద్ధము. వీనిని పరిశీలించిన నాటకకర్త కథ నిట్లు చెప్పినాడు :

సభా భవనమున ప్రధాని యువపిష్టుడై హాస్యగాని సంభాషణల వినుచు ముచ్చటించుచుండును. ఇంతలో రాక్షస రాజైన శంబరుడు ప్రవేశించి మంత్రిని రాజ్య విషయమై ప్రశ్న చేయును. రాజైన శంబరుని భార్య 'ప్రమద' విచ్చేసి రాత్రి తనకు కలిగిన స్వప్న మునందలి అశుభ వర్ణనముల నివేదించుచుండగా దేవర్షియైన నారదుడు ప్రవేశించి, శంబరునితో "ద్వారకలో రుక్మిణీ గర్భమున జనించువాడు నిన్ను చంపనున్నాడు కావున వెంటనే ఆ పసికూనను అపహరించి సముద్రమున వేయుము. దానితో నీ మృత్యువు తొలగిపోవును" అని చెప్పి మాయమైపోవును.

ద్వారక యందు రుక్మిణి తన పసికూన నెవరో హరించి రని వియోగ దుఃఖితయై, దాని 'వనమాల'తో మొరపెట్టుకొనును. కృష్ణునకి విషయము తెలిసి విధి వశము తప్పదని గ్రహించి శిశువు నన్వేషింప భటుల నంపును.

రతి తన భర్తను ఎడబాసి సంటులకు బాధపడుచు 'లలిత' యను చెలికత్తెకు వివరించుచుండ కలహా భోజనుడు ప్రత్యక్షమై "మన్మథుడు రుక్మిణీ గర్భమున ప్రద్యుమ్నుడుగా జనించినాడు. అతని మనుగడ తన ప్రాణములకు ముప్పని భావించి శంబరు డా పసికందును సముద్రములో వేయగా మీన మొకటి వును మ్రింగినది. నీవు 'మాయాదేవి' నామమున శంబరుని అంతఃపురము

నందు చేరి, జాలరులు గర్భస్థశిశువు అయిన చేపను రాక్షసునివద్దకు తెచ్చి నపుడు జాగ్రత్తగా రక్షింపవలెను. ఆ పిల్లవాడే పెరిగి శంబరాంతకు డగును" అని రతికి చెప్పి వెళ్ళిపోవును.

ముని వాక్యానుసారము రతి మాయాదేవి నామమున శంబరుని అంతః పురమున నుండి, ఒకనాడు మీన గర్భస్థ శిశువును ఉపాయనముగా పొందును. యుక్త వయస్కుడైన బాలుని రతి (మాయ) ప్రేమించి, తన భావమును వ్యక్త పరచగా అందు కతడు తిరస్కరించి,"నీవు నా తల్లివి, ఇది తగ"దని పల్కగా నారదుడు విచ్చేసి గత విషయముల తెల్పి, "రతియే యీమె; నీవు వివాహము చేసికొనవచ్చు" నని తెల్పగా ఆకాశవాణి ముని వాక్కులు సత్య మని నిర్ధా రించును.

ప్రద్యుమ్నుడు తన యంతఃపురముననే యున్నట్లు తెలిసికొని శంబరా సురు డతనిపైకి యుద్ధ సన్నద్ధుడై వెళ్ళును. ప్రద్యుమ్ను డా రాక్షసుని సంహ రించి, రతి యుక్తుడై రుక్మిణీ కృష్ణుల వద్దకు చేరుకొనును. నారద మహర్షి విచ్చేసి జరిగిన కథను కృష్ణునకు దెల్పి రతి ప్రద్యుమ్నుల పరిచయము చేయగా, వారు రాక్షస వధకు సంతోషించి - ఉభయులకు వివాహ మొనర్తురు. నాటకము శుభాంత మగును.

మూల కథలను కవి నాట కానుగుణముగా మార్చి, పాత్ర పోషణ విషయమున శ్రద్ధ వహించెను.

ప్రద్యుమ్నుడు తనను పెంచిన స్త్రీ మూర్తిని పవిత్ర భావముతో చూచిన మనస్సంయమిగా చిత్రింపబడినాడు.

మాయాదేవిగా మారిన రతి సన్ని వేశానుగుణముగా నటించినను శృంగార భావ ప్రకటనమున చిత్రాంగిని మించుట అతివేలముగా వర్ణింపబడినది. రుక్మిణీ శ్రీకృష్ణులు సామాన్య మానవులుగా నున్నారే కాని ఎచ్చటను వారికి ప్రాధాన్యము లేదు. నారదుడు వచ్చి రతి, ప్రద్యుమ్నులను పరిచయము చేయంవరకు వీరు అమాయక పాత్రలే!

నాటకమున అనుస్యూతముగా నున్న పాత్ర నారదు డొక్కడే! కథా సంవిధాన మంతయు ఇతని ద్వారానే జరిగినది.

కవి యీ నాటకమును 'శృంగార రస ప్రధానముగా' రచించినను సన్నివేశముల బట్టి వీర,కరుణ, హాస్య రసములును పోషింపబడినవి. ప్రేక్షకుల

ఆదరణ కొరకు శృంగార, హాస్యముల ఎక్కువ చేసినాడు. నారదునిచే విష్ణు మహత్త్వ ప్రతిపాదన చేయించి దుష్టశిక్షణ అతని ధ్యేయ మని ప్రవచించెను.

దరువులు, కీర్తనలు ఉన్నను పద్య రచన అధికముగా నున్నది. పల్లెవాసుల పరిభాషా యుక్త మగు వచనముల చేర్చి, ఆనాటి గ్రామ పెద్దలు - దొర, పటేలు, పట్వారీల పేర్కొనినాడు. ఈ పద్ధతి తెలంగాణములోని వీథి భాగవతా లలో మిక్కిలి ప్రచారమున గలదు.

ఆచార్యులవారు ఈ నాటకమును రచించి 'వీథి భాగవత' ప్రక్రియను నిల్పినారు.

## సూచికలు :

1. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుటలు 28.29
2. లక్షణ సార సంగ్రహము, 2-411, అప్పకవీయము, 4-408
3. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పు. 56-57
4. దాక్షిణాత్య సాహిత్య సమీక్ష, 1వ సంపుటము, 204
5. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పు 107
6. గౌతమీ గ్రంథాలయ తాళపత్ర ప్రతి. నెం 98, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున R. No. 966 బొమ్మలాట రామాయణము పేర నున్నది. 1908లో ఎడ్డనపూడి సంజీవయ్య అండు సన్స్ వారు (మదరాసు) ముద్రించినారు. గ్రంథ పరిష్కర్తల చేర్పులు, మార్పు లున్నవి. ఈ నాటక విషయము 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర' (పు. 123 - 125) నుండి కొంత గ్రహింపబడినది.
7. 'బొమ్మలాట - యక్షగానము, ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర-పుటలు 47-58,
8. దాక్షిణాత్య సాహిత్య సమీక్ష, 238 వ పుట.
9. అముద్రితము, కవిగారి భజన రత్నావళితో కలిసి యున్నది. 177 పేజీలు. "నోటు బుక్" సైజు. వీరి సోదరులు మణిగంటి రామచంద్రాచార్యుల ద్వారా లభించినది.
10. దాక్షిణాత్య సాహిత్య సమీక్ష, పు. 217
11. తెలుగు నాటక వికాసము, పు. 167
12. 'యక్షగానములు - వీథినాటకములు' దాక్షిణాత్య సాహిత్య సమీక్ష, పు. 167,

# 4
# నాటకములు

## నాటకములు :

కావ్యము దృశ్య, శ్రవ్య భేదములచే రెండు విధములు. వీనియందు దృశ్యము రూపకము (నాటకము). శ్రవ్య మనగా కావ్య, ప్రబంధాదులు.

రూపకమును-నాటక, ప్రకరణ, భాణ, ప్రహసన, డిమ, వ్యాయోగ, సమవకార, వీథీ, అంక, ఈహామృగము అని పది విధములుగా విభాగించిరి.

తెలుగు నాట స్వతంత్ర నాటక రచన క్రీ. శ. 1860 వ సం న ప్రారంభమై*[1] నేటికి అనేక విధముల అభివృద్ధి నందుచు వ్యాప్తిలో గలదు.

పూర్వులైన మణింగంటి కవులు కొందరు నాటక రచన మొనర్చినట్లు తెల్పికొనిరి కాని, అవి నామ మాత్రావశేషములు.

అధునికులైన వేంకట నరసింహాచార్యులు (ఐదవ) క్రీ.శ. 1930-1960 సం ల మధ్య నాటక రచన మొనర్చిరి. వీరి నాటకములు మొత్తము తొమ్మిది. కాగా లభించినవి ఆరు మాత్రమే।

గంగాపుర నివాసులైన చెన్న కృష్ణమాచార్యులు 1940-42 ప్రాంతము లలో రచించిన మూడు నాటకముల యందు ఒక్కటియే లభించినది.

వీరి నాటకములయందు పద్యము అధికము. కథా వేగమునకు వచనము కన్న పద్యము మిక్కిలిగా తోడ్పడు ననునది ఇరువురి అభిప్రాయము.

ఈ ప్రకరణమున పరిశీలింపబడు వానిలో పౌరాణిక నాటకములు ఐదు, సాంఘికములు రెండు (ఒకటి ప్రహసనము) కలవు.

## 1. కూర్మనారాయణ చరిత్ర :

వేంకట నరసింహాచార్యులు 'పద్మ వ్యూహము', 'ఉషా పరిణయము' అను నాటకముల తర్వాత 1984 వ సం.న రచించిన 5 అంకములు గల యీ రూపకము 'ప్రకరణ' పద్ధతికి చెందును. 5 అంకములు కలిగి విప్ర, వణిక్, సచివ, పురోహితులలో నొకరిని నాయకుని చేసి వివిధ రసముల పోషించుట ప్రకరణ మను రూపక లక్షణము*2 దీనికి సరిపడును. 5 అంకములు గలవు. విప్రుడైన కూర్మనారాయణుడు నాయకుడు. అనేక రస సముపేత మీ కూర్మ నారాయణ చరిత్ర. కృత్యారంభమున శ్రీ వేంకటేశ్వరున కంకిత మీయబడిన విషయము, కవికి శిష్యుడు, కృతిపోషకుడు నైన రంగినేని హనుమంతరావు*3 వంశ వర్ణన. ఆత్మ నామ గర్భిత సీసమాలిక చెప్పబడి, నాందిలో సూత్రధార సంభాషణమున కవి ప్రతిభ, ఇతర రచనల ప్రసక్తి గలదు.

దీనియందు పురుష పాత్రలు 15, స్త్రీ పాత్రలు 2 గలవు. కూర్మ నారాయణుడు నాయకుడు. సుగుణవతి (నాయకుని భార్య) నాయిక. భక్తవిజ యాంతర్గత కథను గ్రహించి రచింపబడిన యీ నాటకమున కూర్మ నారాయణుడు, శ్రీ వేంకటేశ్వర స్వామి, తుకారాం మాత్రమే ప్రసిద్ధులు. మిగిలిన పాత్రలు కల్పితములు.

**దీని యందలి విషయము :** శ్రీ వేంకటేశ్వర భక్తుడైన కూర్మ నారాయణుడు సకుటుంబముగా తీర్థయాత్రకు బయలుదేరి వెళ్ళుచు అరణ్య మార్గమున పయనించు నప్పుడు మాంత్రికు డొకడు కూర్మనారాయణుని బిడ్డయైన హేమవతి సౌందర్యమునకు ముగ్ధుడై, ఆమెను పొందవలయు నను వాంఛతో సర్ప రూప మంది కూర్మనారాయణుని కాటు వేయగా, నతడు పడిపోవును. దీనికి సుగుణవతి విలపించుచుండ - మాంత్రికుడు హేమవతిని పొంద యత్నించు చుండును శ్రీ వేంకటేశ్వర స్వామి మాంత్రికుని గమనించి తన చక్రాయుధముతో నతనిని సంహరించి కుటుంబమును రక్షించును. ఆ ప్రాంతమునం దున్న భక్తుడు తుకారాం వీరిని చూచి ఊరడించి, మంత్ర బలముచే కూర్మనారాయణుని బ్రతికింప, వారందరును ముదమంది రాత్రి యచటనే గడిపి, మరుసటి రోజు జయపురము చేరుకొందురు.

తొండమానుడు జయపుర ప్రభువు. ఇతనికి వినయవంతుడు మంత్రి. వీరసింహు డను దుష్టుడు సేనానాయకుడు. కూర్మనారాయణు డీ రాజాస్థానము నకు వచ్చి కుటుంబ యుక్తముగా తీర్థ యాత్రల చేయుట ప్రమాదముగా నున్నదని బల్కి మూడు మాసముల వరకు తన భార్యా పుత్రాదుల రక్షింప వలసిన దని ప్రభువున కప్పగించి, తాను యాత్రా నిమిత్తము బయలుదేరిపోవుచు మార్గ మధ్యమున విదర్భ నగరమునందు రాత్రి విశ్రమించి యుండగా చోరు లెవరో తస్కరించిన ధనమును కూర్మనారాయణుని వద్ద పడవేసి పోవుదురు. చోరాన్వేషణ మొనర్చు రాజ భటులు సొమ్ముతో నున్న కూర్మనారాయణుని బంధించి కారాగారమున పడవేయుదురు.

జయపురమున మూడు నెలలు గడచుటచే సుగుణవతి సంతానము బాధ లనుభవించు చుండిరి. వీరసింహుడు సుగుణవతి పొందుగోరి తత్ప్రయత్నముగా నామెను వెంటాడుచు, ఒకనాడు భగవదర్చా నిమిత్తము పుష్పములకై ఉద్యాన వనమునకు వచ్చిన ఆమెను బలవంతముగా లొంగదీసికొన నుంకించును. నేర్పుగా సుగుణవతి తప్పుకొని గృహమున కేగి విచారించుచుండ, వీరసింహుడు కోపము పట్టలేక అమె నివాసమున కరిగి హేమలతను, మాధవుని (సుగుణవతి పుత్రుడు) సంహరించును. వేంకటేశ్వర స్వామి వీరిని గమనించి చక్రాయుధ ముచే వీరసింహుని విగత జీవునిగా చేసి, హేమలతా మాధవుల కళేబరములను చెడిపోని విధముగా నుంచి అంతర్ధాన మగును. పరిచారక వేషమున సుగుణవతిని కాపాడుచు విదర్భ ప్రభు స్వప్నమున దర్శన మిచ్చి కూర్మ నారాయణుడు నిర్దోషి యని చెప్పి చెరసాల నుండి విడిపించినది సైతము శ్రీ వేంకటేశ్వరుడే ! సేనాపతి మరణమునకు వగచుచున్న తొండమానునకు హేమలతా మాధవుల విషయము తెలిసి మరింత బాధగా నుండును. ఇంతలోనే కూర్మనారాయణుడు తన కుటుంబమును చూచుటకై తిరిగి వచ్చును. ఆతనికి "మీ కుటుంబము రాణి వాసముతో కలిసి తిరుపతికి వెళ్ళినది, పది దినములలో రాగల"రని రాజు, మంత్రి ఉపాయముగా చెప్పిరి.

జయపుర రాజు కూర్మనారాయణుని సంతానమును జీవింప చేయవలసిన దని వేంకటేశ్వర స్వామిని ప్రార్థింప భక్త వత్సలుడైనస్వామి వారిని పునర్జీవితుల నొనర్చును. రాజు కూర్మనారాయణునకు సంతతి నప్పగించి సంతోషించుచుండ

మాధవుడు స్వర్లోక విషయములను, హేమలత నరక లోక విషయములను రాజాస్థానమున తెల్పి సభాసదుల కాశ్చర్యము కలిగింతురు. కూర్మనారాయణుడు మాత్రము వీరి పునర్జన్మను గూర్చి విశ్వసింపడు. ఆ సమయమున ఆకాశవాణి గత వృత్తాంతమును కూర్మనారాయణునకు వినిపించి, సంశయ రహితుని చేయగా గత మంతయు తన కర్మ, జీవ ప్రారబ్ధ మని పల్కి, రాజానుమతి నంది సకుటుంబముగా తిరుగు ప్రయాణ మొనర్చిన కూర్మనారాయణుడు మధ్యే మార్గమున తుకారామును దర్శించి, స్వపురమును చేరుకొనును.

వేంకటేశ్వర స్వామి కూర్మనారాయణునకు స్వప్నమున గన్పడి 'వరముల కోరుకో' మ్మన తనకు మోక్ష పదవి నొసంగి లోకమునందలి జనము సత్ప్రవర్తన గలవారై సుఖ సంతోషములతో వర్ధిల్లు నట్లు ఆశీర్వదింపు మని ప్రార్థించును.

కవి దీనియందు భగవంతుని యొక్క భక్త పరాధీనతను అనేక రకముల చిత్రించి, 'చక్రి సర్వోపగతుడు' అని రాజునుండి సామాన్యుని వరకు తెలియు నట్లు చేసినాడు.

కూర్మనారాయణుని తీర్థయాత్ర నెపమున భగవ న్మాహాత్మ్యము తెలివిడి చేయించి, సుగుణవతి సౌందర్యము దుర్మార్గ వర్తనుల నాశమునకు కారణ మైనట్లు నిరూపించినాడు.

ఎన్ని అవస్థలు పడినను జీవునకు చివరకు మోక్షమే శరణ్య మని, దీనికై అష్టాక్షర జప మనుష్ఠేయ మని ప్రవచించి, శ్రీమన్నారాయణ ప్రాముఖ్యమును వెల్లడి చేసెను.

నాటకారంభమున కన్పడిన తుకారాం మరల చివరలో దర్శన మిచ్చును. కవి యీ పాత్రవలన సాధించిన దేమియు లేదు సర్వ దష్టుడైన కూర్మనారాయణుని శ్రీ వేంకటేశ్వర స్వామియే ప్రతికింప సమర్థు డైనను, ఆ పని తుకారాం ద్వారా జరిపించినాడు

తుకారాం జీవితమునం దిట్టి సన్నివేశము జరిగిన ట్లాధారము లేదు. పైగా ఈయన మహారాష్ట్రుడు, చారిత్రక వ్యక్తి, శివాజీ కాలమున నున్నవాడు.*4 ఓథలో నున్న తొండమానునకు, ఈయనకు సంబంధము లేదు. తొండమానుడు

తుకారాం కన్న ప్రాచీనుడు. దీని నిట్లు చెప్పుటలో కవి యుద్దేశ్యము ఒక దైవ భక్తుని ప్రభావమును వెల్లడింప చేయుటకే అనిపించును. కాల విపర్యయ విషయమును కవి పరిగణించలేదు.

శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యముల యందు - తిరుపతి కొండపై శ్రీ వేంకటేశ్వరాలయమును కట్టించిన తొండమానుడు మహాభక్తుడు, ఆకాశ రాజునకు సోదరుడు, నారాయణపుర మితని రాజధాని యని చెప్పబడినది.

దీనియందు గల తొండమాను డితడేనా ? అని అనుమానము. ఎచ్చటను తిరుపతి దేవాలయ ప్రసక్తి గాని, శ్రీ వేంకటేశ్వర విషయము గాని ఈ పాత్ర ద్వారా వ్యక్తము కాలేదు. విగతజీవుల బ్రతికించ వలసిన దని వేంకటేశ్వరుని ప్రార్థించుట- కుటుంబము తిరుపతి తీర్థయాత్రకు వెళ్ళినా రని కూర్మనారాయణునకు చెప్పునపుడే ఈ విషయము స్వల్పముగా నున్నది.

కవి నాటకమున పాత్రోచిత భాష నుపయోగించినాడు. సాహెబుల సంభాషణ ఉర్దూలో చేయించుట దీని కొక తార్కాణము.

సామెతలను, సంగీత సాహిత్య విషయములను ప్రవచింపచేసిన గ్రంథ కర్త అనేక పద్యములను, అందున మాలికలను రచించినాడు. దీనివలన ప్రదర్శనకు శ్రమ, నటులెంత మంచివా రైనను - సామాజికులు మాత్రము ఈ పద్ధతిని ఎంతవర కాదరింతురు? అని అనుమానము. బహుశః - తిరుపతి వేంకట కవులు, చిలుకమర్తి వంటి వారి నాటకముల ప్రభావము వీరిపై బడి పద్యముల నధికము చేయించినట్లున్నది. నాటకాంతమున కవి యిట్లు ప్రార్థించుచున్నాడు :

'ధరణిన్ మర్త్యులు జీవ హత్యలను చేతంబందు భావింపకన్
పర విత్తంబుల కాస చెందకను గర్వ స్వాంతులై యుండకన్
పరకాంతల్ తమ తల్లులట్లుగను నీపై భక్తి వాటిల్ల సు
స్థిరతన్ గూర్పంగ వేడువాఁడ ననఘా! శ్రీ వేంకటేశ ప్రభూ!

(121 వ పుట)

## 2. సుమాలినీ పరిణయము

వేంకట నరసింహాచార్యుల రూపకములలో నిది నాల్గవ రచన. తారణ సంవత్సర వైశాఖమున (1945-46) ముద్రింపబడినది. రూపక లక్షణము ననుసరించి సుమాలినీ పరిణయము 'నాటిక' పద్ధతికి చెందును.

స్త్రీ ప్రధానమయిన రూపకమునకు 'నాటిక'యను స్త్రీలింగ నామ ముచితము. దీనియందలి ఇతివృత్తము కల్పితము; 4 అంకముల పరిమితి. ధీర లలితుడు నాయకుడు. శృంగార రసము ముఖ్యము. నాయిక అంతఃపుర కన్య, లేదా సంగీత శాలా కన్య. ప్రకరణ, నాటక సమ్మేళనము వలన కలిగిన 'నాటిక' యందు పంచ సంధులును ప్రయోగింపబడును.*6

ఆచార్యుల వారి యీ కృతి పై లక్షణములు కలిగియున్నది. సుమాలిని అంతఃపుర కన్య ఆమెయే నాయిక. రూపక నామము సుమాలినీ పరిణయము. 4 అంకములు గలవు. వీరవర్మ నాయకుడు. కవి నాటి కారంభమున కృతి పోషకుని*6 18 పద్యములలో వర్ణించి ఒక నామాంకిత సీసమాలికను చెప్పి నాడు. నటీ సూత్రధార సంభాషణము ద్వారా కృతి విషయము, కవి ప్రశంస వ్యక్తము చేయబడినవి. దీనియందు 10 పురుష పాత్రలు, మూడు స్త్రీ పాత్రలు గలవు. శృంగారము ముఖ్యరస మైనను, హాస్య, భక్తి రసములు సందర్భానుగుణముగా పోషింపబడినవి. యుద్ధ వర్ణమున - వీర, బీభత్సము లున్నవి, కవి యితర నాటకములయం దున్నట్లు దీనిలో రాగములు, తాళములు, పాటలు లేవు. కాని ప్రబంధ ఫక్కీలో చంద్ర, మన్మథ వర్ణనలు, శీతలోపచారములు ఉన్నవి.

## నాటక కథ :

సారస్వత పుర రాజైన వీరవర్మ కూతురు సుమాలిని యొకనాడు చెలి కత్తె యైన కమలతో వన విహార మొనర్చుచుండ నారద మహర్షి యచటికి విచ్చేసి, "దండధరుడు నిన్ను పరిణయ మాడు"నని సుమాలినికి చెప్పును. ఆదు కామె''మానవ కన్య నైన నన్ను యముడు పరిణయ మాడుట సంభవమా?'' యని ప్రశ్నించును. ముని అది సంభవమే యని బదులు పల్కి, ఆమెకు యమ సూక్త మంత్రోపదేశ మొనర్చి, 'దీనిని నిష్ఠగా జపించిన ఫలసిద్ధి యగు' నని బల్కి యంతర్ధానమై యమలోకమున కరిగి, ధండధరుని దర్శించి, అచట వివిధములగు శిక్షల ననుభవించుచున్న భూలోక ప్రాణుల చూచి పరితపించి, సంభాష ణావసరమున యమునితో''భూలోకమునందు సౌందర్య రాశి సుమాలిని యను కన్య గలదు. ఆమెను నీవు పరిణయ మాడవలె''నని చెప్పి, చిత్ర పటమును చూపును.

ఇచట సుమాలిని విరహ వేదనా దోధూయమాన మనస్కయై అంతఃపుర మున బాధ పడుచు, చంద్ర, మన్మథ మలయానిల దూషణల నొనర్చుచుండ, చెలికత్తె యైన కమల ఆమెకు బాధోపశమనము చేయును.

ఒకనాడు వీరవర్మ భార్యయైన మణిమాలతో సుమాలినీ పరిణయ విషయ మాలోచించు చుండును. అదే సమయమున అచటి కరుదెంచిన సుమాలిని 'తాను యమ ధర్మరాజును దప్ప అన్యుని వివాహ మాడ' నని ఖండితముగా పలుక, 'ఇది అసాధ్యమైన కోరిక' యని కూతురునకు మాతా పితరులు చెప్పుచుందురు. ఇంతలో దేవర్షి నారదుడు విచ్చేసి "మీ దుహిత కోరిక హిత మైనది. యమ ధర్మరాజే ఈమెను పరిణయ మాడును" అని పల్కి అంతర్హితు డగును.

చిత్రగుప్త యుక్తుడైన యముడు సారస్వత పుర సమీపోద్యాన వనమును చేరి సుమాలినిని స్మరించుచు మన్మథ వ్యథాకులిత చిత్తుడై యుండును. ఇంతలో సుమాలిని తన చెలికత్తెతో కలిసి ఉద్యాన వన ప్రవేశ మొనరింప, నారదుడు చెప్పినది ఈమెను గూర్చియే యని తలంచి సుమాలినిని సమీపించి తన ప్రేమను వ్యక్తపరచును. అందు కామె 'నా తలి దండ్రుల యనుమతి గొని నిన్ను పరి ణయ మాడెద' నని బల్కి, చెలికత్తెను గలిసి స్వగృహమున కరుగును.

ఈ వివాహము నెట్లయినను నిశ్చయింప వలసిన దని యమ ధర్మరాజు చిత్రగుప్తుని ప్రాధేయ పడుచుండగా, సమీపమున నున్న వీరవర్మ కుమారులు సులోల, కువలయులు వీరి సంభాషణముల విని ఎదురుగా వచ్చి, "మీరు వీర వర్మకు శ్రీకృష్ణ సందర్శనము కలిగించినచో సుమాలినితో మీకు వివాహము జరిపించు బాధ్యతను మేము వహింతు" మని బల్కి, "మేము వీరవర్మ పుత్రు లము. ధర్మరాజు వదిలిన యాగాశ్వమును బంధించి తద్రక్షణార్థ మిచట నున్నా" మని చెప్పుచుండగా, అంతలోనే యాగాశ్వ నిమిత్తము కృష్ణార్జునులు, మేఘవర్ణ బభ్రువాహనులు విచ్చేసి అశ్వ సంరక్షకులతో యుద్ధము చేయ నారం భింతురు. సులోల, కువలయులు పాండవ వీరుల ధీ కొని మూర్ఛలచేసి, తమ పరాక్రమమును వ్యక్తపరచి వీరవర్మకే విషయమును తెలియ చేయుదురు.

అర్జునాది యోధుల పైకి బయలు వెడలిన వీరవర్మ కాలుని తనకు సాహాయ్యముగా గొని వారితో సమర మొనర్చుచుండ, అర్జునుడు ప్రయోగించిన

బాణము లన్నియు వ్యర్థము లగుచుండెను. దీనికంతకును యమధర్మరాజే కారణ మని శ్రీకృష్ణుడు గ్రహించి అర్జున పరాభవమున కెదురు చూచుచుండగా, పార్థుడరుదెంచి కృష్ణుని శరణు వేడి రక్షింపు మని ప్రాధేయపడును. నరునకు గర్వభంగ మయినందుకు సంతోషించిన నారాయణుడు "సుమాలినిని పరిణయ మాడుటకు యముడు వేసిన ఎత్తుగడ యిది" యని పల్కి, తాను రథ సారథ్యము వదిలి వీరవర్మపై విజృంభించి, అతని శిరస్సును కాలితో తన్నును. వీరవర్మ కృష్ణ పాద తాడనమునకు ముద మంది, పవిత్రుడ నైతి నని భావించి హరి పాదముల గట్టిగా పట్టుకొని ప్రార్థించును.

దీనికి కృష్ణార్జునులు సంతోషింతురు. యముడును సంతృప్తి చెందును. రణ రంగమున నిహతులైన వారిని శ్రీకృష్ణుడు బ్రతికించి, అందరును కలసి వీరవర్మ పురమునకు వెళ్ళి సుమాలినీ యమ ధర్మరాజుల వివాహమును వైభవముగా జరిపించి, సవనాశ్వమును గొని ఎవరి దారిని వారు వెడలుదురు. ఇది దీనిలోని ముఖ్య విషయము.

కవి నారద, వీరవర్మ, సుమాలినీ పాత్రలను చక్కగా పోషించి కృష్ణార్జును లతో పాటు వీరవర్మ పుత్రులను ఆ యా సందర్భముల ననుసరించి వీర హాస్య రసములకు ప్రతీకలను చేసెను.

యముడు పూర్తిగా మానవాంగనా లోలుడై సంచరించిన విధము ఇతనిని సామాన్య మానవునిగనే భావించునట్లు చేసి, సుమాలినీ యముల వివాహమునకు నారదుడే కారకు డని నిరూపించి, నాటకమందు దేవర్షికి ప్రాముఖ్య మొసంగెను.

పిల్లలమఱ్ఱి పినవీరన జైమిని భారతము షష్ఠాశ్వాసమున వీరవర్మ కథ స్వల్పముగా గలదు. కవి దానిని గ్రహించి నాటకోచితముగా కొన్ని మార్పులు చేసి కథను నడిపించినాడు.

జైమిని భారతమున సుమాలినియే యముని వలచి అతనిని పొందుటకు యమ సూక్తములతో అతనిని ఆరాధించును.

సుమాలినీ యముల వివాహానంతరమే ఆర్జున వీరవర్మలకు యుద్ధమైనది. వివాహమునకు పూర్వము యముడు రాజయక్ష్మనితో కలిసి వీరవర్మ పుర బాహ్యోద్యాన వనమునకు వచ్చును. సుమాలినీ యముల విరహ వేదన లేదు. కృష్ణార్జున బభ్రువాహనులతో ఆంజనేయుడు కూడ యాగాశ్వమునకై పోవును. వీరవర్మ భార్య పేరు సుమాలిని; చెలికత్తె పేరు తెల్పబడలేదు. ఇట్లున్న పురాణ కథను మార్చి కల్పన లొనర్చి కవి నాటక నిర్మాణ మొనర్చెను. అవసరమైన సన్నివేశములను మించి, వన విహారము, చంద్ర - మన్మథ - మలయానిల దూషణములు, యమలోక బాధలు ప్రబంధ రీతిలో వర్ణింపబడి నందున ప్రదర్శనకు ఎంత వరకు తగు ననునదే విచార్యము.

వీరవర్మ శ్రీకృష్ణ పాద తాడనమునకు ముద మందినట్లు కవి తెల్పెను. విష్ణు పాద స్పర్శ ఉత్తమాంగమునకు తగులుట విశిష్టాద్వైతమున పరమ పవిత్ర విషయముగా భావింతురు (దేవాలయముల యందుంచు శఠకోపముపై విష్ణు పాదము లుండుట యిందుకే). శ్రీ మహా భాగవతమున కృష్ణుని పాద వర్ణన విశేషముగా చేయబడినది. వీరవర్మ - కృష్ణ పాద స్పర్శ వలన పవిత్రుడ నైతినని భావించినాడు. ఇచట 'శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే' యని కవి నిరూపించి ఈ కథయందు విష్ణు పారమ్యమును ప్రతిపాదించినాడు.

యమ లోకమున జీవు లనుభవించు బాధల తెల్పి, భూలోకమున ఎట్టి పాపకర్మ లొనర్చిన వారు, అన్యాయములు అక్రమము లొనర్చిన వారు అచట ఎట్లు శిక్షింపబడునది విపులముగా వర్ణించి సంఘమున గల దుర్మార్గ కృత్యము లను, దుర్మార్గులను ఇట్లు వర్ణించెను—

అగ్ని సాక్షిగ గొన్న యతివను విడనాడి
పర కాంతలను గోరు పాపు డితడు,
ధనమున కాశించి తన పుత్రి నొరులకు
విక్రయించిన యట్టి విప్రు డితడు.
తల్లి దండ్రుల కొల్ల కిల్లాలు విలపింప
వేశ్యల వెన్నంటు వెట్టి యితడు,
ద్రవ్యాభిలాషచే ధర్మ దూష్యంబుగా
కూట సాక్ష్యము నిచ్చు కూళ యితడు

ధేనువుల బట్టి చంపెడు హీనుఁ డితఁడు
కనకమును దొంగిలించిన కష్టుఁ డితఁడు
కన్న బిడ్డల పరిమార్చు కఠినుఁ డితఁడు
గాన వీరలు దండ్యులు మౌనివర్య!

తప్పుడు లెక్కల నొప్పించి పౌరుల
కష్టపెట్టుచు నుండు కరణ మితఁడు
భువిని న్యాయాన్యాయముల గుర్తెరుంగక
బాధించు చుండిన ప్రభు వితండు
తన తప్పు లెరుఁగక నదయంబు పర నింద
సలుపుచు నుండెడు తులువ యితఁడు
శాత్రవు లెదురింప సంగర స్థలి వీడి
పారి పోయిన రణ భీరుఁ డితఁడు
ఇట్టి దుర్మార్గు లెందరో యిచట గలరు
నాడు కింకరు లనయంబు నరకమందు
వారి నెల్లర దండింత్రు ఘోరముగను
తెలుప జాలను వేయేల ధీవరేణ్య! (19 వ పుట)

కన్యా విక్రయము, వేశ్యా వ్యామోహము, కూట సాక్ష్యములు, కరణాల కాఠిన్యము, ప్రభుపు దుర్నీతి - మొదలగు వానిని కవి తెల్పి, తనకు గల సమకాలీన సామాజిక దృష్టిని నిరూపించినాడు.

### 3. సుచిత్రాభ్యుదయము :

జైమిని భారతమందలి తామ్రధ్వజ చరిత్రము ననుసరించి నాలు గంకముల పరిమితిగా వ్రాయబడిన యీ నాటకము వేంకట నరసింహాచార్యుల నాటక పరంపరలో ఐదవది. రూపక లక్షణముల ప్రకారము 'సుచిత్రాభ్యుదయము' మిశ్రకథ గలిగిన నాటికా పద్ధతికి చెందును. కాని కథయందు అధిక భాగము (మూడంకములు) యుద్ధమే యున్నందున నానా భావోపేతమై 'డిమ' లక్షణము నకు చెందును ఉన్న ఒకే స్త్రీ పాత్ర ప్రాముఖ్య ప్రాధాన్యములు లేనిది కావున నిది 'వ్యాయోగ'*7 పద్ధతికి చెందును.

కృతి ప్రారంభమున దైవస్తుతి తర్వాత కృతిపోషక వంశ ప్రశస్తి 13 పద్యములయందు చేయబడినది. 'ప్రస్తావన'లో కవి పరిచయము లేదు. నాటకరచనము (1946) వరకు పాటలు, దరువుల పద్ధతి మరుగున పడినది.

అంకమును రంగములుగా విభజించు నూతన పద్ధతి దీనిలోనే కలదు. పదునొకొండు పాత్రలు గల నాటకమున స్త్రీపాత్ర ఒక్కటే గలదు. వీరి యితర నాటకములవలె దీనియందును పద్య రచన అధికము.

కవి వీర రసమును అంగిగా చేసి, భక్తి, కరుణ, బీభత్సములను అంగములుగా ప్రదర్శించినను, భక్తి, కరుణములు ఒకదాని వెంట నొకటి వీరముతో పాటు అనుస్యూతము లయినవి.

### కథా విషయము :

ధర్మరాజు యాగాశ్వము వెంట కృష్ణార్జునులు బయలుదేరి వచ్చుచుండ సవ్యసాచి తనయంతటి వీరుడు లేడని శ్రీకృష్ణునితో చెప్పును. దానిని వినిన కృష్ణుడు అర్జునునకు గర్వభంగ మగునట్లు చేయవలె నని యత్నించు చుండగా నింతలో వారు మయూరధ్వజ పాలిత రత్నపురిని చేరుదురు. ఈ సమయమున పరిసరారణ్యమునందు మిత్రులతో సంచరించుచున్న సుచిత్రుడు (మయూరధ్వజుని పుత్రుడు) యాగాశ్వమును గుర్తించి బంధించును. పాండవ సైన్య మెంత ప్రతిమాలినను అతడు సవనాశ్వమును వదలిపెట్ట నిరాకరించును. ఉభయులకును సమరము తప్పలేదు. సుచిత్రుడు (తామ్రధ్వజుడు) హంసధ్వజునితోను, నరుల ధ్వజుడు నీలధ్వజుని తోడను యుద్ధమునకు తలపడ, బాల వీరుల సమరమునకు పాండవ వీరులు మూర్ఛ నందగా, కృష్ణార్జునులు పోరుటకు సన్నద్ధు లగుదురు. వారిని వారించి బభ్రువాహన, వృషసేనులు యుద్ధ మొనర్ప వారికిని అపజయమే సంప్రాప్తించ, యాగాశ్వము సుచిత్రుని వశ మైనది. దీనిని గమనించి నరుడు యుద్ధము వలదని బాలకులకు చెప్పినను వారు పెడచెవిని పెట్టగా అర్జునుడే స్వయముగా సమరాయత్తుడై వారి బాణ ధారలకు మూర్ఛ నందును. ఇక శ్రీకృష్ణుడు యుద్ధభూమి కరుదెంచగా సుచిత్రు డాతనికి పాదాభివందనము చేయును

కృష్ణుడు దానిని తిరస్కరించి సుచిత్రుని తన్నుచే బొలుడైన యవడు రౌద్రియై కృష్ణుని బంధించి, అతని చక్రమును తీసి చెట్టునకు వ్రేలాడ గట్టి అశ్వమును గ్రహించి రత్నపురి చేరెను.

మూర్ఛనుండి తేరుకొనిన యర్జునుడు గుఱ్ఱము నెట్టయినను సాధించి ధర్మజ యాగము నిర్విఘ్న మగునట్లు చేయుమని శ్రీ కృష్ణుని ప్రార్థించును. అర్జున పరాక్రమ భంగమునకు లోన సంతసిల్లిన కృష్ణుడు అందు కంగీకరించును.

మరునాడు విరువురును బ్రాహ్మణ వేషధారులై మయూరధ్వజుని ఆ స్థానమునకు విచ్చేయగా రాజు విప్ర జన భక్తితో వీరిని పూజించి, "మీ రాకకు కారణమే?'' మని యడుగును.

మాయా వేషధారియైన కృష్ణ ధంయులకు రాజుతో "నా కుమారుని అడవి యందు ఒక సింహము పట్టెనది. మయూరధ్వజుని శరీరములో అర్థ భాగమును భార్యా పుత్రులచేత కోయించి తెచ్చి యిచ్చిన నా కుమారుని వదులునట" అని పల్కగా రాజందు కంగీకరించి శరీర చ్ఛేదనార్థము కుమారుని పిలిపించును. దీనిని తెలిసికొనిన సుచిత్రుడు తానే సింహమున కాహార మగుదు నని పల్కెను. కాని రాజును 'ఆడిన మాట తప్పినవాడ వగుదు' వని కృష్ణ దనుటవలన - తన పూర్వ ప్రతిజ్ఞా నిర్వహణార్థము రంపముతో తన శరీరమును కోయ వలసి నదిగా పుత్రుని కోరును. దాని కతడు సంసిద్ధుడై ఛేదన కుపక్రమింప వారి వ్రతనిష్ఠకు శ్రీకృష్ణుడు సంతసిల్లి నిజ రూప ప్రదర్శన మొసర్చి పూజల నంది, యాగాశ్వమును గ్రహించి, సంతోషించి, యాగ సందర్శనార్థము మయూర ధ్వజ చిత్రసేనుల నాహ్వానించి, ధర్మజ రాజధాని చేరుదురు.

కవి దీనిని ఆధారముగా గ్రహించిన పిసుపీరన జైమిని భారత కథను నాటకీకరణకై మార్పుల చేసినాడు.

పిసుపీరన - యాగాశ్వానుసారి యైన అర్జునుని 'గర్వభంగము'. చెప్ప లేదు. సుచిత్రుడు కృష్ణుని ఓడించెనే గాని బంధించలేదు. మయూరధ్వజుని భార్య కుముద్వతి తానే సింహమున కాహార మగుదు ననగా భర్త దాని కంగీక రించ లేదు.

జైమిని భారతమునందును నాటకమందును, సముచ్ఛ్వాసి అస్వథామ వ్యాగ్రగనే చిత్రింపబడినది.

నాటకమున అర్జునుడు గర్విష్ఠి; దైవశక్తి ముందు తన బలము వ్యర్థమని గ్రహించుటకు 'గర్వ భంగము' ముఖ్యమైనది.

కృష్ణ దాశించిన అర్జున పరాభవమున కనువుగా నాటక సన్నివేశములు కలవు. నాయకుడైన సుచిత్రుడు బాలుడు, పెద్ద పెద్ద యోధులతో సమరము నొనర్చి విజయము నందిన యితని పాత్ర పోషణ చక్కగా చేయబడినది. తండ్రికి బదులు తానే మృగమున కాహార మగుదు నని పల్కి పితృభక్తిని వెల్లడించు సన్నివేశమున సుచిత్రుని ఉదాత్తత్వము చిత్రింపబడినది.

జగన్నాటక సూత్రధారియగు శ్రీకృష్ణుడు ధర్మ సంరక్షకుడైన శ్రీ మహావిష్ణువుగా చిత్రింపబడెను.

ఈ నాటకమునందు వలెనే 'సుమాలినీ పరిణయము' నందును అర్జున గర్వ భంగమే ప్రధానము, రెండింటికి మూలకథ జైమిని భారతము కథా నిర్వహణమున కవి మార్పులు, చేర్పులు చేసి వేర్వేరు విధములుగా దీనిని చిత్రించినాడు.

నాటక పద్య రచనా రీతి కొక ఉదాహరణ:

'ఖలమతి చేత ని న్గడిసి గారియ వెట్టితి తాండనాడితిన్
కలనములోన గెల్చి తురగంబును దెచ్చితి ద్రోహ మొంచకన్
జలజ దళాయతాక్ష! యపచార శతంబు క్షమించి నీ పదం
బులు గొలువంగ చేయు మిక పూర్వ దయా మతి నన్ను మాధవా!
(84 వ పుట)

## 4. శశికళ :

వేంకట నరసింహాచార్యుల నాటకములందు ఆరవదై 'శశికళా సుదర్శనీయ' మను నామాంతరము గల దీనియందు నాలుగు అంకములు (వీనితో రంగ విభజన), 11 పురుష పాత్రలు, 6 స్త్రీ పాత్రలు గలవు. నాటక లక్షణము ప్రకారము 'డిమము' అను పద్ధతికి చెందిన 'శశికళ' యందు

నాయకుడు ధీరోదాత్తుడు, వీర రసము అంగిగా, కరుణ, శృంగార, శాంత, హాస్యము లంగములుగా నున్నవి.

నాటక కథ దేవీ భాగవతము నుండి గ్రహింపబడినది. శ్రీరంగాపుర సత్యదేవునకు అంకితము. 16 పద్యములలో 'కృతి ప్రకాశక ప్రశంస*8' తరువాత నాటక మారంభ మగును.

**కథ :** అయోధ్యా నగర పాలకుడైన ధ్రువసింధునకు మనోరమా, లీలావతి యను నిరువురు భార్యలును, ధీమంత నాముడైన సచివుడును గలరు.

లీలావతీ పుత్రుడు శత్రుజిత్తు దుర్మార్గుడు. ఇతనిని గూర్చి తల్లిదండ్రులు మిక్కిలి బాధపడుచుండగా, ధీమంతుడు రాకుమారుని సన్మార్గుని చేయవచ్చునని వారికి చెప్పి ఊరట కలిగించు చుండును.

ఒకనాడు ధ్రువసింధుని వద్దకు పౌర జనము విచ్చేసి కాననమందు క్రూర మృగబాధల నివారింప ప్రార్థింతురు. వారి మాటను కాదనలేక రాజు మంత్రి చండనాథ యుక్తముగా బయలుదేరి వనమున మృగముల వధించుచుండ, సింహ మొకటి రాజుపై బడి గాయపరచును. రక్త సిక్తాంగుడైన యధిపతిని రథమం దుంచుకొని మంత్రి తిరిగివచ్చి, చికిత్సలు చేయించు చుండును.

దీనిని అదనుగా గ్రహించి శత్రుజిత్తు కొందరు దుష్టులతో కలసి రాజ్యమందు అల్లకల్లోలము రేపి రాజుపైన నిందలు వేయును. కుమారుని దుర్మార్గముల భరింపలేక ధ్రువసింధు డస్తమింప, ధీమంతుడు, మనోరమా, సుదర్శనులు దుఃఖించు చుండగా, లీలావతి, శత్రుజిత్తు, ఇతని మేనమామ యుధాజిత్తు కలిసి రాజ్యాక్రమణకు పథకము సిద్ధ మొనర్చుచు సుదర్శనుని రాజ్యాధిపతిని చేయవలెనను వాంఛ గల ధీమంతుని పట్టి కారాగారమున పడవేయుదురు. సుదర్శనుని యుధాజిత్ అనుచరుడైన కాలనేమి కప్పగించి వధించి రమ్మని పంపి, శత్రుజిత్తు రాజ్యాధిపతియై పరిపాలించు చుండును.

అరణ్యమున సుదర్శనుని చంప యత్నించిన కాలనేమిని వారించి, భరద్వాజ మహర్షి సుదర్శనుని తన యాశ్రమమునకు తీసికొని వెళ్ళి, రక్షణ మొనర్చుచు గారాబముగ విద్యల నేర్పును.

శత్రుజిత్ క్రూర పాలన తన ప్రాణములకే ముప్పని భావించి లీలావతి అయోధ్యను దాటి పోవును. కారాగారము నుండి ధీమంతుడు తప్పించుకొని సుదర్శనుని మాతామహుడైన వీరసేనుని వద్దకు చేరి సుదర్శనుని క్షేమవార్త విని ముదమంది, మరల తన ప్రయత్నములో నుండును.

సుదర్శనుడు కాళికానుగ్రహమున నొక కఠోర కరవాలమును పొంది, తాను తలచినప్పుడు దేవి ప్రత్యక్షమై సాహాయ్యపడునట్లు వరము నంది, భరద్వాజానుమతిని కాశీపురమునకు బయదేరి మార్గమధ్యమునం దొక యుద్యానవనమున విశ్రమించును ఇంతలోనే కాశీరాజైన సుబాహుడు తన కూతురు శశికళకు స్వయంవరోత్సవమును చాటించును; యథాప్రకారము చెలికత్తెతో కలిసి వన విహారార్థము విచ్చేసిన శశికళ ఉద్యానవనమం దున్న సుదర్శనుని చూచి మోహ పరవశయై, మాతా పితరులకా విషయమును తెల్పి, వారతనిని రప్పించి అంతఃపురమున నుంతురు. అచటనే సుదర్శనునకు తన మాతృమూర్తి మనోరమ దర్శనము కాగా, నందరును ముద మందుదురు.

కాశీరాజు ప్రకటించిన స్వయంవరమునకు శత్రుజి, ద్యుధాజిత్తులు ససైన్యముగా విచ్చేసి శశికళను సుదర్శనున కిచ్చు చున్నారను విషయమును తెలిసికొని సమరాయత్తు లగుదురు.

సమయమునకై వేచియున్న ధీమంతుడు సుబాహు, సుదర్శనులకు బాసటగా నుండి యుద్ధమున వారి నోడించి, సుబాహునిచే యుధాజిత్తును చంపించును. శరణు కొచ్చిన శత్రుజిత్తును సుదర్శనుడు మన్నించును. అనంతరము శశికళా సుదర్శనుల వివాహము వైభవోపేతముగా జరుగుచుండ భరద్వాజ మహర్షి విచ్చేసి వారి నాశీర్వదించును.

ధీమంతుని ధీ నైపుణ్యము, కాళికానుగ్రహము - వీనివలన సుదర్శనుడు పితృ రాజ్యాభిషిక్తుడై సుఖముగా రాజ్యపాలన మొనర్చుచుండును.

ఇక - దేవీ భాగవత కథ యిట్లున్నది:

ధ్రువ సింధువు భార్యలు గర్భవతులుగా నున్నప్పుడే కథ ప్రారంభింప బడినది. మృగయార్థ మరిగిన రాజు మృగేంద్రముచే చంపబడగా రాజ్యపాలనకై శత్రుజిత్ పక్షమున యుధాజిత్తు, సుదర్శనుని పక్షమున వీరసేనుడు చేరి సమర మొనర్తురు. మాయా పద్ధతులచే సుదర్శనుని అడవికి పంపి - శత్రుజిత్తు రాజ్యాధికారి యగును. యుధాజిత్తు భరద్వాజాశ్రమమునకు వెళ్ళి సుదర్శను నప్పగించవలసిన దని యడుగు సందర్భమున వశిష్ఠవిశ్వామిత్ర, బలి, ద్రౌపదీ, సైంధవ కథలు చెప్పబడినవి. మంత్రోపాసనా బలముచే సుదర్శనుడు కాశిని ప్రకాశ మొనర్చుకొనును. మనోరమ సుతామాత్య యుతయై పారిపోవుచుండ అరణ్యమున దొంగలు పిరిని పట్టి బంధింతురు. శశికళా సుదర్శనుల వివాహము నకు బ్రాహ్మణుడు మధ్యవర్తిగా నుండి శుభకార్యమును జరిపించును.

దేవీ భాగవతమున గల యీ కథను నాటక కర్త మార్పు లొనర్చి నూతన సన్నివేశముల కూర్చి కొందరి పేర్లను మార్చినాడు.

దేవీ భాగవత మందలి విదల్లుడు - భీమంతు డైనాడు; బలుడు కాలనేమి యైనాడు.

నాటకమునకు నాయకుడైన సుదర్శనుడు ప్రథమాంకము తర్వాత, శశికళ తృతీయ, చతుర్థాంకములందు కన్పింతురు. శత్రుజి, యుధాజి, త్యాగలనే ముఠ దుష్ట చేష్టలు దుర్యోధనాదుల మరపించునట్లు చిత్రింపబడినవి. భీమంతుని ప్రవర్తన రాజభక్తికి ప్రతీకగా గలదు.

ఎప్పుడైనను ధర్మము, సిరి యనునవి మాత్రమే జయించి సత్ఫలము కారణమున లోక రక్షణము జరుగు నని నాటక కథ వలన వ్యక్త మగును.

> 'అన్న దమ్ముల కనికంబు నైకమత్య
> మలరు గావుత! దుర్బుద్ధి కలుగకుండ
> రాజ విశ్వాస పాత్రులై ప్రజలు భువిని
> ధనరుదురు గాక! సర్వదా ధర్మ రతిని!' (100వ పుట)

## 5. లలిత :

పురాణ కథలను నాటకీకరించి ప్రఖ్యాతుడైన వేంకట నరసింహాచార్యులు తన కాలము నాటికి సంఘమున జరిగిన, జరుగుచున్న ఇతివృత్తమును గ్రహించి 1958-60 సం.ల మధ్య రచించిన యీ సాంఘిక నాటకము నేటికిని అముద్రితముగనే యున్నది.

దీనియందు నాలు గంకములు గలవు. 14 పురుష పాత్రలు, 2 స్త్రీపాత్రలు. కథా వస్తువు ఉత్పాద్యము. లక్షణానుసారము 'ప్రకరణ' పద్ధతికి చెందును.*9

నిజాం పరిపాలన చివరి రోజులు తెలంగాణమునకు పీడకల వంటివి. జమీందారులు, మక్తాదారులు, దొరలు - ప్రజలను తమ దుర్మార్గములచే పీడించి పిప్పిచేసిరి. నరరూప రాక్షసులైన యిట్టివారిని గూర్చి తెల్పునదే 'లలిత' యను సాంఘిక నాటకము.

తెలంగాణ ప్రజల వీరోచిత పోరాటము, రజాకార్ల చర్యలు, నిజాం నిరంకుశ పరిపాలనల గూర్చి వచ్చిన గ్రంథములలో*10 శ్రవ్యము అధికము. నాటకమైనచో ప్రజలపై ప్రగాఢ ముద్రవేసి, వారిని కర్తవ్య దీక్షా పరాయణుల నొనర్చును. సామాజికుడు ప్రత్యక్షానుభూతి ననుభవించును. అందుకే కవి ఒక ముఖ్య సాంఘికేతివృత్తమును నాటకీకరించినాడు.

**కథ :** జనార్దనరావు ఒక దుష్ట జమీందారు. ఇతని దివాన్ దుర్గాజీ అధిపతికన్న మిన్న యైనవాడు. భృత్యులైన రామ్‌సింగ్, మస్తానులు తమ దుష్కృత్యములచే జమీందారునకు ప్రీతిపాత్రులుగా నుండిరి.

ఇదే గ్రామమున మోహనరావు, గోపాల మను విద్యావంతులైన ఇరువురు యువకులు జమీందారీలో జరుగుచున్న అకృత్యముల తెలిసికొనుచు, ప్రజలకు ధైర్యము చెప్పి సమయమునకై వేచియుందురు.

జమీందారు బీదలకు అప్పు లిచ్చినట్లు దొంగ పత్రముల సిద్ధ మొనర్చి, బాకీ చెల్లించలేదని వారిని నానా బాధల పెట్టి భూముల స్వాధీన పరచుకొనును.

గ్రామ కరణము సోమరాజు, పెద్ద రైతు గోవిందయ్యను చేయని. బాకీ కొరకు జమీందారుచే అవమానింపబడి తమ యాస్తి నప్పగింతురు. వీని నన్నిటిని గమనించుచున్న గోపాలు జనార్దనరావు నాశ్రయించి దివాణములో ఉద్యోగిగా చేరును. అప్పటికే జమీందారు విషయమును పరిశీలించు గోపాలు - ప్రతి సన్ని వేశమును రహస్యముగా ఫొటోలు తీయుచుండును.

ఆ గ్రామమున గోవిందయ్య, సుందరమ్మల ఏకైక సంతతి 'లలిత'. సౌందర్యవతి యైన ఈమెను తనదానిగా చేసికొనవలె నని జమీందారు పట్టుదల గలవాడై ఎదురు చూచుచు గోవిందయ్యను ఏదో నెపమున బాధించుట గోపాలు నకు తీరని వేదన యైనది.

ఉన్న భూమి జమీందార్ వశము కాగా గోవిందయ్య జీవితము గడచుట ఎట్లని కుమిలి పోవుచుండ తన కున్న కొద్ది భూమిని సేద్యము చేసికొమ్మని గోపాలు ఆశ్రయము చూపును.

మోహనరావు, రామావధాని, రంగాచారి యను వారు కూడ జమీందారు నెదుర్కొనుటకు గోపాలమునకు సహకరించ దలచి, వారు కూడ కొన్ని ఫోటో లను తీసి జాగ్రత్త పరచుచుందురు.

దుర్గాజీ, రామ్‌సింగు లొకనాడు జమీందారును మద్యపాన వివశుని చేసి 'లలిత' సౌందర్యమును గూర్చి వర్ణించి ఆమెను వశపరచుకొను నుపాయమును చెప్పుదురు.

మోహనరావునకు లలితతో గల సంబంధమును దుష్టముగా భావించిన జమీందారు అతనిపై గల వైర భావమును పురస్కరించుకొని మోహనరావును చంపి, లలితను పరిగ్రహింపవలె నను పట్టుదలతో నుండగా, ఈ విషయములు గోపాలు ద్వారా మోహనరావు గ్రహించి జాగ్రత్తపడును.

ఇంతలో జమీందారీ గ్రామ మైన 'రాయినిపేట'లో జరిగిన వివాదమునకు జనార్దనరావు కారకు డైనందున - అతనిని 'అరెస్టు' చేయవచ్చిన అమీన్ గణపతికి, పోలీసులకు జనార్దనరావు మద్యము పోసి, 8 వేలు లంచ మిచ్చి మోహన రావును గూర్చి చెడ్డగా చెప్పి వారిని సాగనంపునట్టి ఈ సన్నివేశమును ఫొటో తీసి. గోపాల్ పదిలపరచును.

ఒకనాడు బాగా త్రాగి మైకములో నున్న జమీందారు లలిత గృహము నకు వెళ్ళి ఏకాంత సమయము లభించిన దని భావించి ఆమెను బలాత్కరింప సంసిద్ధ డగును. ఇదే సమయమున మోహనరావు, గోపాలులు వచ్చి జనార్దన రావును పట్టుకొందురు. మోహనరావుకు జమీందార్ కాల్చిన తుపాకి గుండ్లవలన గాయము లగును. దీనినుండి బయట పడిన జనార్దనరావు - పోలీసులకు 'షికాయత్' చేసి, మోహనరావు లలితతో అక్రమ సంబంధము గలిగి గోవిం దయ్యను చంప ప్రయత్న మొనర్చె నని చెప్పి, అతనిని 'అరెస్ట్' చేయించును.

లలితా, గోపాలులు న్యాయవాదుల వద్ద మోహనరావు నిర్దోషిత్వమును, జమీందారు అకృత్యములను వివరించి, మోహనరావును జైలు నుండి విడిపించు కొని వత్తురు.

కోర్టు హాలులో మోహనరావు లాయరు ప్రసాదు, జమీందారు వకీలు తమిళుడైన సుందరయ్య వాదోపవాదముల చేయుదురు. జనార్దన రావును ప్రసాదు ఎన్నియో ప్రశ్నలు వేసి ప్రత్యుత్తరమును పొందజాలక, తన వాదమున కుపబలకముగా జమీందారు అకృత్యములను తెల్పు పలు రకములైన ఫొటోలను న్యాయాధికారిముం దుంచి, అందరిని ఆశ్చర్య పరచును. వీనిని పరిశీ లించిన న్యాయాధిపతి జమీందారునకు 10 వేల రూపాయీల జరిమానా విధించి, ఎవరి భూములను వారి కప్పగించునట్లు నిర్ణయించును. పాప కృత్యములలో భాగస్వాములైన అమీన్ సాబ్ (S. I.) కు 3 వేల జరిమానా, ఆరు నెలల సస్పెన్షన్, దివాన్, రామసింగులకు మూడు సంవత్సరాల కఠిన కారాగార శిక్ష విధింపబడెను.

జమీందారీ ప్రజలు గోపాలు, మోహనరావు, లలితలను వారి ఘన కార్యములను ప్రశంసించి, తమ కష్టములు తీరినందుకు సంతోషింతురు. జమీందార్ రూపు రేఖలు మారినవి. పెద్దలు, మిత్రుల బలవంతమువలన మోహనరావు లలితను వివాహ మాడును.

శిక్షానంతరము పశ్చాత్తప్తుడైన జనార్దనరావు అన్యాయార్జిత భూసంపదల అసల్‌దార్ల కిచ్చి, జమీందారీ వ్యవహారములను గోపాలున కప్పగించి, తాను జాతీయాభిమానము గలవాడై ప్రవర్తించును.

ప్రజల మధ్య జరుగుచున్న విషయమును కవి నేర్పు
ఈ నాటకమును రచించెను.

దీనియందలి ప్రతి పాత్రయు ఆ నాటి తెలంగాణా
దశను సూచించును. బహుశః నల్లగొండ జిల్లాలోని ఒక
జనార్దనరావుగా చిత్రింపబడి యుండును. భూస్వాములకు
లకు త్రాగుడును వరులై పోలీసులు అనా డెట్లు ప్రవర్తించిరో
పోలీస్ అమీన్ (S. I.) పాత్ర చిత్రింపబడినది.

తెలంగాణమున పోలీసు చర్య జరిగిన తర్వాత ప్ర
న్యమునకు-ముఖ్యముగా విజృంభించిన మహిళా శక్తికి - '
నాటకమున నాయిక, మోహనరావు ధీరోదాత్తు డగు కథా నా
ప్రేక్షక హృదయముల నాకర్షింతురు. జమీందారీ దౌర్జన్య
చర వర్గము వర్ణింపబడిన తీరు సహజముగా నుండి, నాటి
అద్దము పట్టినవి.

మోహనరావు, గోపాలు ఆంగ్ల మిశ్రమగు తెనుగును,
గులు, పోలీసులు ఉర్దూ ఎక్కువైన తెనుగును, రామావధాని,
తమిశ్రము, వైదిక పరిభాషా యుతము నైన తెనుగును
గల 'ప్రాతోచిత భాషా పద్ధతి'కి నిదర్శనము.

> 'ప్రేగులు మాడిపోవ నిరుపేద౦ ఎందరి పుట్టి దేడ్చు
> భోగ విహీనులై నిరతమున్ శ్రమ యందుననుండ
> రాగము లందుచుండిరి ధరాతలమందు జమీనుదారు
> కేగతి కర్షకోద్ధరణ మింతయు నీశ్వర సృష్టి యెట్టిదో!'

## 6. సుందరీ విలాసము :

### (ప్రహసనము)

పరిహాస ప్రధానమైనది ప్రహసనము. దీనియందు పా
శీలా, చేష్టాదులు హాస్య ప్రధానములుగా నుండవలయును.

అచ్చటచ్చట హాస్యమును ప్రయోగింతురు. ప్రహసనమునకు హాస్యమే ముఖ్యము. ఆహ్లాదము స్వల్పము. సర్కసులలోని బఫూన్ చేష్టలు దీనియందలి పాత్రధారుల చేష్టలు సమీప సంబంధము గలవి. సామాన్య ప్రజలకు, అసంస్కారులకు ఆనంద దాయకములైన ప్రహసనములను ఆంగ్లమున ఫార్స్ (farce) అని యందురు. ఈ విధమైన రచనలకు ప్రాచీనములైన 'మిరకిల్' రూపకములు, మిస్టరీ రూపకములు ప్రధానాధారములు.

క్రీ.శ. 1800 వరకు పెద్ద నాటకముల చివర ప్రదర్శించు చిన్న చిన్న రూపకములను 'ఫార్స్' లను వారు. 19 వ శతాబ్ది చివరి వర కివి స్వతంత్ర రూపకములుగా నిలిచినవి. కథా విషయ వైవిధ్యమును బట్టి 'ప్రహసనములు' సంస్కారులను సైత మాకర్షించు నటులకు కందుకూరి, చిలకమర్తి వారి రచనలు సాక్ష్యము.

దశ విధ రూపకములం దొకటైన ప్రహసనము భాణ తుల్యము. ముఖ నిర్వహణ సంధులు, లాస్యాంగములు కలిగియుండును. ఇది శుద్ధము, వికృతము, సంకీర్ణము అని మూడు విధములు.*11

వీనియందు 'సుందరీ విలాసము' వికృత మను పద్ధతికి చెందును.

పౌరాణిక సాంఘిక నాటక కర్తయైన వేంకట నరసింహాచార్యులు 'వైశ్య వేశ్య వధ' యను నామాంతరము*12 గల 'సుందరీ విలాస' ప్రహసనమును 1926 వ సం.ములో రచించి సంఘమున వ్యాపించిన వేశ్యా వృత్తి, దాని కొరకు ధనికు లవలంబించు నీచ మార్గములు, విపరప నీని పరిణామము లెట్లుండునో దీనియందు చిత్రించెను.

నాలుగు రంగములు గల దీనియందు పాత్రల సంఖ్య 12. 'సుందరి' నాయికగా చిత్రింపబడినది. కాని నాయకుడు మాత్రము వలానా యని చెప్పలేము. కవి ప్రబంధ రచన మొనర్చుచు - నాటక రచనకు పూర్వమే (1926) దీనిని రచించి యుండు వలన చంద్రిక, మన్మథ దూషణలు ప్రబంధ రీతిలో గలవు.

**విషయము :**

వేశ్య యైన చంద్రముఖి కూతురు సుందరి సౌందర్య రాశి, ప్రౌఢ, తల్లి నుండి సంక్రమించిన వేశ్యా వృత్తి జీవికగా కలిగి నట్టిది. రామశాస్త్రి-ఇందుశర్మ యను బ్రాహ్మణ మిత్రులలో గృహస్థుగా నున్న రామశాస్త్రి సుందరిని వలచి ఆమెయే తన సర్వస్వ మనుకొనును. ఇందుశర్మ వారించినను అతడు తన పట్టు వీడలేదు.

చంద్రముఖి పూర్తిగా వేశ్య. సుందరి అందుకు వ్యతిరేకి. తల్లి మాత్రము తన కూతురు యౌవనమును ధనముగా మార్చుకొన యత్నించు చుండును. పెద్దిశెట్టి, పుల్లిశెట్టి యను నిరువురు వైశ్యులలో వయస్సు మళ్ళిన పెద్దిశెట్టి వేశ్యా వ్యామోహి. సుందరిని పొందుటకై ఆమె చెలికత్తె ద్వారా ధనమంపి ఎదురుచూచును. సుందరికి తల్లి వేశ్యా వృత్తిని గూర్చి "యుపన్యసించి యౌవనముతోనే ధనికుల ద్వారా ధనార్జన చేయవలయును. పేదవారిని దరి చేర నీయరాదు. రామశాస్త్రి దరిద్రుడు. అతనిని పంపించి ధనికుల నాకర్షింపు" మని చెప్పును. దానికి సుందరి "నేను వేశ్యా వృత్తిని గర్హింతును, తుచ్ఛ ధనము నాశింపను. ఒక వ్యక్తిని పెండ్లాడి గృహస్థురాలిగా నుండ దలచితి" నని ఖండితముగా చెప్పినను, చంద్రముఖి తన యత్నమును మానలేదు. రామశాస్త్రిపై గల మక్కువతో నితరుల దరి జేర నీయని సుందరికి చాందూఖాన్, హుసేన్ అను రక్షక భటులు, శేషగిరి, నారాయణ యను యువకులు ధనమును పంపించి, ఆమె పొందుకై తహతహ లాడుచుందురు.

సుందరి రామశాస్త్రినే వరించినందున అతడు మిగిలిన వారికి శత్రు తుల్యు డాయెను. ధనాశ గల తల్లి బాధల పడలేక సుందరి రామశాస్త్రిని గెంటి వేసినపుడు అతడు చంద్రముఖి నెంతగనో ప్రాధేయ పడును. ఆమె 'రామశాస్త్రి దొంగ' యని చెప్పి గస్తీ జవానులైన చాందూఖాన్, హుసేనుల కప్పగింప వారు శాస్త్రిని జైలులో వేయుదురు. దీనివలన తమ దారి నిష్కంటక మైన దని శెట్టిద్వయము సంతసించి సుందరీ గృహమున కరిగి ధనము నిచ్చి తమ కోరికను వెల్లడింతురు. ఆమె పెద్దిశెట్టిని కొంత రాత్రియైన తర్వాత రమ్మని పంపి, హుసేన్ తెచ్చిన రెండు వేల రూపాయల తీసికొని అతనిని తిట్టి ఇల్లు వెడల గొట్టును. శేషగిరి విచ్చేసి సమయము నేర్పాటు చేసికొని, వేశ్య కొరకు నవరత్న మాలిక తెచ్చుటకై స్వగృహమున కేగును.

ఎప్పటి నుండియో ఎదురు చూచుచున్న పెద్దిశెట్టి రాగా అతనిని తిరస్కరించిన సుందరిని శెట్టి కానుకలొసంగి సంతృప్తురాలిని చేయగా, నిరువురు ఏకశయ్యా గతు లగుదురు. ఇదే సమయమున చాందూఖాన్, హుసేన్‌లు వేశ్యాగృహమునకు వచ్చి ఏకశయ్యాయం దున్న వీరిని చూచి, ఆక్రోశముతో చంపయత్నింతురు. ధైర్యము చాలని హుసేన్ పరుగెత్తి పోగా, చాందూఖాన్ ధైర్యము చేసి తన కత్తికి సుందరిని, శెట్టిని బలి చేసి పలాయితుడు డగును.

వారకాంతల వ్యతిరేకు లైన ఇందుశర్మ, నారాయణులు జరిగిన దానికి చింతించి తమ మిత్రులైన శేషగిరి,రామశాస్త్రుల ద్రవ్య నష్టమునకు పరితపింతురు. వారకాంతల పొత్తు ఎట్టి అనర్థములకు దారితీయునో, ఎంత నష్టమును కలిగించునో వీరి ద్వారా కవి సుదీర్ఘముగా చెప్పించి, ప్రహసనమును ముగించెను.

దీనియందు నాయిక యైన సుందరి వ్యభిచార వ్యతిరేకి. చెలికత్తెయైన నీలవేణి, తల్లియగు చంద్రముఖి - వీరి ప్రోత్సాహము ఈమెను వృత్తిలోనికి దింపినది. ధనార్జనయే ధ్యేయమైనది.

రామశాస్త్రిని చోరునిగా చిత్రించుటయందు తల్లికి సహకరించిన సుందరి వృత్తిలో మోసకత్తెయై ధనము కొరకు కందరిని బాధించగా, మోసపోయిన రక్షకభటు డామెను వధించి, మోసమును మోసము చేతనే జయించును.

రెండు వేలిచ్చిన హుసేను బాధతో నున్నాడు కావున పరుగెత్తుట కన్న చాందూఖాన్ బదులు దానే శెట్టిని, సుందరిని వధించిన బాగుండెడిది. కృష్ణభక్తురాలైన సుందరి శాస్త్రినే వివాహమాడుదు ననినను తల్లి బలవంతము వృత్తిలోనికి దింపిన దని రచయిత ఈ సన్నివేశమును మార్చుటకన్న సుందరీ రామశాస్త్రుల వివాహము జరిపించి, వేశ్యకు గృహిణీ స్థానమును కల్పించిన సాంఘిక చైతన్యమునకు ప్రతీకగా నుండెడిది.

పెద్దిశెట్టిని, చంద్రముఖిని చంపించి అన్యాయము చేసిన వారికిదే గతి యని నిరూపించినచో నాటకము మరింత రక్తిగా మారియుండును. బహు పాత్రాన్వితమైన యీ ప్రహసనమును కవి సుఖాంత మొనర్చినాడు.

'అన్నలు తమ్ములున్ హితులు నాప్తులు బంధువు లెందరో భువిన్
గన్నుల జూచియున్ హితము గానగ చెప్పిన నాలకించకన్
వన్నెలమారి యైన సతివద్దను చేరియు తెచ్చితొంటి నా
పన్నత నేడు వాటిలెను పాప వినాశన! బ్రోవరా! హరీ!
(20 వ పు. 4వ రంగము)

## 7. ధర్మాంగద :

తెలంగాణమున మిక్కిలి భక్తి, శ్రద్ధంతో జరుపుకొను 'బ్రతుకమ్మ పండుగ' యందు 'ధర్మాంగద - పాముపాట' సుప్రసిద్ధము.

అద్భుత సంభరితమై భారతీయ సౌశీల్యము, పాతివ్రత్యముల మహిమను వెల్లడి చేయు ఈ కథ స్త్రీ లోకమున బహుళ ప్రచార మందినది.

చెన్న కృష్ణమాచార్యు లీ కథను గ్రహించి, కొలది మార్పులతో 4 అంకముల నాటకముగా రచించెను. దీనియందు పురుష పాత్రలు 10, స్త్రీ పాత్రలు 6 కలవు. కంద సీస చంప కోత్పలములు కొద్దిగా రచింపబడి, అనేక రాగతాళ యుక్తములగు పాటలు అధికముగా నున్నవి.

1940-45 మధ్య 'కొండపల్లి శంకరయ్య' దీనిని ముద్రించిరట! ఆ ప్రతి లభింపలేదు. కవి వ్రాసి యుంచుకొనిన 'నోట్ బుక్' (ఆద్యంత రహితమైనది) వీరి యర్థాంగి ద్వారా లభించినది. మధ్య మధ్య గంగాపుర చెన్నకేశవ ప్రసక్తి యుండుట వలన చెన్న కృష్ణమాచార్యులు స్థానాచార్యత్వము వహించిన ఆ 'గంగాపుర స్వామి'కి దీనిని అంకిత మిచ్చియుందురు.

## కథా సంగ్రహము :

కాశ్మీర దేశమున కనకాపురి ప్రభువు ధర్మాంగదుడు. ఈయన భార్య ధర్మావతి; నామాంతరము అన్నిలీదేవి. వీరికి చాలా కాలమువరకు సంతానము కలుగలేదు. వయస్సు మైబడిన తరువాత దైవవరముచే ధర్మావతి గర్భమున ఒక సర్పము జనించును. దానికి రాజు బాధపడుచుండ, మంత్రియైన సుందరాంగుడు ఓదార్చి, రాజు గారికి కుమారుడు కల్గెనని

(సర్ప విషయము రహస్య పరచి) నగరమున చాటింపు వేయించెను. కొంత కాలము తరువాత రాజ కుమారునకు వివాహము జరుప నిశ్చయించి, అనుకూల వతి యైన కన్య కొరకు కనేక దేశములు సంచరించుచు సౌరాష్ట్ర దేశమందలి మాణిక్యపుర ప్రభు పుత్రిక సత్యావతిని సుందరాంగుడు నిశ్చయ మొనర్చి, తమ రాజ వంశాచారము ప్రకారము కత్తికే కంకణము కట్టవలె నను ఏర్పాటు చేసి, తన మాయోపాయము కప్పిపుచ్చు కొనెను.

మంత్రి కోరిన విధముగనే సత్యావతిని ఖడ్గమున కిచ్చి వివాహము జరిపించి అత్తవారింటికి పంపగా, ఎంత కాలమైనను ఆమెకు తన భర్త కనిపించలేదు. ఉద్యాన వన విహారార్థ మరిగినపుడు చెలికత్తె వలన సత్యావతి అసలు విషయ మును తెలిసికొని బాధపడి తిరిగివచ్చి, తన భర్తను చూపవలసిన దని అత్తను బలవంత పెట్టెను. దీని కామె నిరుత్తరయై భర్తకు విన్నవించగా ధర్మాంగదుడు ఆలోచనా పరవశు డగును. ఇంతలో అశరీర వాణి "నీవు పాముబుట్టతో తీర్థ యాత్రల చేయుము. అందలి శేషుడు మానవునిగా మారును" - అని సత్యావతికి చెప్పెను.

సత్యవతి అత్త మామల యనుమతి నంది, పాము బుట్టను గైకొని అనేక క్షేత్రముల సందర్శించుచు వాల్మీకి ఆశ్రమమున కరుగగా, ఆయన 'ధర్మపురి యందలి బ్రహ్మకుండమున పాముతో పాటు నీవు మునక లాడిన భర్త నీ ముందు ప్రత్యక్ష మగు' నని బల్కెను. సత్యావతి ధర్మపురి చేరి ముని చెప్పి నట్లు చేయగా నవ మన్మథాకార పురుషుడు ఆమె ముందు ప్రత్యక్షమై, పాము బుట్ట మాయ మగును. జరిగిన విషయము నుభయులు తెలిసికొని మనము భార్యా భర్తల మని సంతసించి, మాణిక్య పురము చేరుదురు.

చాల కాలమునకు అల్లుడు, బిడ్డ వచ్చి రని రత్నాంగుడు సంతోషించు చుండ తన వివాహమైనప్పటి నుండి భర్తను పొందువరకు జరిగిన వృత్తాంతమును సత్యావతి మాతా పితరులకు తెల్పగా, శేషుడే మానవాకృతి దాల్చి తమ యింటి అల్లు డైనందులకు వారు పరమానందము నందిరి.

రత్నాంగుడు వియ్యంకుడైన ధర్మాంగదుని కొంత బాధపెట్ట దలచి 'క అమ్మాయిని అల్లుని వెంటనే మా వద్దకు పంపవలెను. లేనిచో దండయాత్ర చేయగల' నని లేఖ వ్రాసి పంపును. దానికి ధర్మాంగదుడు కింకర్తవ్యతా మూఢుడై యున్న సమయమున - సత్యావతి తల్లి దండ్రుల యనుమతి నం భర్తను గూడి అత్తవారింటికి వెళ్ళను. రత్నాంగుని నుండి రాగల విప నాలోచించుచున్న ధర్మాంగదునకు వీరి రాక సంతోషమును కల్గించును.

రాజు తన మంత్రియైన సుందరాంగునితో సంప్రదించి - మాణిక్య పురవ నుండి సపరివారముగా రత్నాంగుని రప్పించి - సత్యావతీ, కనకాంగుల వైభవముగా వివాహము జరిపించును. ఇట్టి సమయమున అందరును వినుచుం ఆకాశవాణి 'కనకాంగుడు అవతార పురుషుడు, ఆరాధ్యుడు. సత్యావతి స్త్రీ లో మున కాదర్శ ప్రాయురాలు, ఆమె పాతివ్రత్యము గొప్పది' - అని పలుకున

జానపద గేయములందును, ఇతరులు రచించిన ధర్మాంగద నాటకమ అందును గల కథ కన్న ఈ నాటక కథ కొన్ని మార్పులతో గలదు.

'ధర్మాంగద - పాము పాట' ను పూరి నారాయణరాజు (ముద్రి. 1925 1935), గుండు జగన్నాథము (ముద్రి. 1932)గేయ రూపమున చెప్పగా బొమ్మ కంటి నరసింహ కవి 'ద్విపద'లో వ్రాసెను.*13

ఒక వీర పతివ్రత గాథను చెప్పు మని అహల్య గౌతముని యడిగినట్లు నారాయణ రాజు చెప్పగా, సూతుడు శౌనకాది మహర్షులకు చెప్పినట్లు జగన్నాథము తెల్పెను. 'ద్విపద' కృతి అహల్యకు గౌతముడు చెప్పిన 'ధర్మ పురీ మాహాత్మ్యము అనెను

సత్యావతి భర్త సర్ప రూప ముండుటకు బ్రాహ్మణ శాపము కారణమని నారాయణ రాజు రచన. ఒక యాచకుడు నాగాభరణములకు, ధనమును యాచింప 'పుట్టలో నాగభూషణము లున్నవి చెళ్ళు' మని హేళన చేసి నందున ధర్మావతి గర్భమున సర్పము జనించిన దని జగన్నాథము చెప్పెను.

ధర్మావతి పేరు అర్మిలీదేవి యని రెండిటిలోను గలదు కథా విషయమున మరి కొన్ని చిన్న చిన్న మార్పు లున్నవి.

ఈ నాటకము సమగ్రముగ అభినయనంసున పూర్తి విషయములు తెలియుట లేదు. తన భర్త సర్పరూపి యని తెలిసి సత్యావతి తెలిసికొనినది. పాము బుట్టతో వెళ్ళునప్పుడు వాల్మీకి ఆశ్రమము చేరి, అచటినుండి ధర్మపురికి వెళ్ళి, భర్తను పొందిన సత్యావతి మహిమోపేత యని నాటక కర్త చిత్రింపగా పాముబుట్టతో వెళ్ళనున్న కోడలిని అత్తలిదేవి ఈ 'నెపముతో నీవు వ్యభిచరించ దలచితి' వని నిందించినట్లు నారాయణ రాజు చెప్పెను.

నాటకకర్త ఏ విధమైన అనౌచిత్యములు లేని విధముగా రచించినాడు. అన్నిటితోను ధర్మపురి క్షేత్రమే ముక్తి కారణము. కథా ప్రదేశము తెలంగాణ మైనను, ఈ పాట- కథ- ఆంధ్రదేశ మంతటను వ్యాపించినది.

ఇదే విషయము గౌతమీ మాహాత్మ్య నాగతీర్థమున నున్నట్లు క్రీ.శ. 1874 నాటి లక్ష్మీ భీమవరాగ్రహార దాన శాసనము*14 వలన తెలియుచున్నది. దీని ప్రాచీనత ప్రాముఖ్యము లకిది యొక నిదర్శనము. సర్ప రూపమున జన్మించి మానవాకృతి దాల్చి మహిమలు జూపిన వారిని గూర్చి చెప్పుచున్న యాదార్యుల 'పరిచయము'న కొంత గలదు.

వీని యన్నిటిని పరిశీలించినపుడు-మానవ గర్భమునుండి వైశేషిక ప్రసవములయందు సర్ప జననము ప్రకృతి సిద్ధమే యని తెలియును. ఇట్లు జనించిన వారు ఓషధీ పోషక ప్రభావమున యథాక్రమము మానవాకృతి దాల్చి స్వగాత్రులు, దీర్ఘాయుష్మంతులుగ జీవించుట రూఢియైనది.

లభించినంత వరకు కురింగంటి వారి నాటకము లిట్లు గలవు. పౌరాణిక కథలనే గాక, పౌరాణికములు, అద్భుత విషయములు గల సన్నివేశముల గ్రహించి తగిన మార్పు లొనరించి - నాటకముల ద్వారా సులభ పద్ధతిలో-పండిత పామర జన రంజకముగా పురాణ కథాకథన మొనర్చుట వీనియందు గల ప్రత్యేకత!

అట్లే సాంఘిక విషయ రూపకముంతో-తన నాడు సంఘమున వ్యాపించిన పోషింప బడుచున్న జమీందారీ పద్ధతి, వేశ్యల గూర్చిన వ్యామోహము, వీని

వంన సాంఘికముగా జరుగుచున్న అన్యాయము - ప్రాణ ధన నష్టముల గూర్చి వ్యక్త పరచి, ప్రజలు చైతన్యవంతులై వ్యసన దూరులై యుండుట అవసరమని నిరూపింప బడెను. 'ప్రకృతికిన్ ఖాష్య ప్రణేతల్ కవుల్' అనునది నాటక కర్తల విషయమునందు యథార్థము !

## సూచికలు :

1. తెలుగు నాటక వికాసము, పు. 191-192.
2. ఆంధ్ర దశ రూపకము, పు. 76.
3. గ్రంథకర్త శిష్యుడు, కల్వకుర్తి తాలూకా జూపల్లి గ్రామం, వీరి ధన సాయమువలన 1930 వ సం॥లో నాటకము ముద్రిత మైనది.
4. అమ్మర వాహిని, పు. 210.
5. తెలుగు నాటక వికాసము, పు. 76.
6. కవి శిష్యుడు రంగినేని రామచంద్రరావు, జూపల్లి గ్రామం.
7. తెలుగు నాటక వికాసము, పు. 76.
8. రచన 1950; ఈదర వెంకయ్య పట్టాభి రామయ్యల ధన సాహాయ్యమున 1956 వ సం॥న ముద్రింపబడినది.
9. తెలుగు నాటక వికాసము, పు. 74.
10. 'వీర తెలంగాణా-నా అనుభవాలు', 'తెలంగాణ సాయుధ పోరాటం' మొద లైనవి. చూ. వివరములకు 'తెలంగాణ విమోచనోద్యమం' నవల.
11. ఆంధ్ర దశ రూపకము, పు. 78-79.
12. ఆంధ్ర వాఙ్మయ సూచిక 'వైశ్య వేశ్య పథ' అని తెల్పెను. పు. 54(అ), ప్రహసనము. ముద్రితప్రతి తిరుపతి ప్రాచ్య లిఖిత గ్రంథ భాండార మున కలదు.
13. తెలుగు జానపద గేయ సాహిత్యము, పు. 610.
14. భారతి 1969 అక్టోబర్, పు. 7-19, నవంబర్, పు. 4-14. దీనియందు గౌతమీ మాహాత్మ్య శ్లోకము లీయబడినవి. శాసన ప్రకాశకులు శ్రీ ముసునూరి సాంబశివమూర్తి.

# 5
# శతకములు

అనేక ప్రక్రియలంచే విశిష్టమైన తెనుగు సాహిత్యమందు పండిత పామర వృద్ధ బాల జనాదర పాత్రమైనది శతక శాఖ !

వీనియందు పద్య సంఖ్య, మకుట, వృత్త, రస నియమములు ముఖ్యములు*[1] శతక సాహితీ పరిశోధకులు వస్తు వైవిధ్యము ననుసరించి వీనిని విభాగములుగా నొనర్చి వివరించినారు*[2] అద్యతన యుగమున పిల్లి, కాడ్దూము, పకోడి, పొగచుట్ట, చీపురుపుల్ల, విసనకఱ్ఱలపై శతకములు వచ్చినవి.

బహు విధ గ్రంథ నిర్మాతలైన మరింగంటి కవులలో ప్రాచీనుల నుండి ఆధునికుల వరకు శతక కర్తలు గలరు. ముద్రితములు, అముద్రితములు నైన వీరి శతకములు 14 లభించినవి. వానిని ఇట్లు విభాగింప వచ్చును :

**1. శ్రీరామ పరములు :**

1. తారకబ్రహ్మరామ శతకము
2. కల్వచెర్వు సీతారామచంద్ర శతకము
3. శ్రీమత్తిరుమలాపుర భోగ సుందర సీతారామ శతకము
4. రాఘవ శతకము

**2. నరసింహ పరములు :**

1. యాదగిరి నరసింహ శతకము
2. యాదగిరి లక్ష్మీనృసింహ శతకము
3. మల్లారి నృహరి శతకము
4. శ్రీ భీమపుర లక్ష్మీనారసింహప్రభు శతకము
5. యాదగిరి లక్ష్మీనారసింహప్రభు శతకము

3. **గోపాల పరములు :**

   1. కేశవ స్వామి శతకము
   2. గోపాల చూడామణి శతకము

4. **సత్యనారాయణ పరము :**

   1. శ్రీరంగాపుర సత్యనారాయణ శతకము

5. **వేంకటేశ్వర పరము :**

   1. శ్రీ వేంకటేశ్వర శతకము

6. **అనుభవాత్మకము :**

   1. మానస ప్రబోధ శతకము

వీనియందు 18 శతకములు దైవ పరములు, దైవాంకితములు గాగా 'మానస ప్రబోధ శతక' మొక్కటి మాత్రము నరాంకితము (కవి గారి అర్ధాంగికి).

ఈ ప్రకరణమున విభాగానుపూర్విగా పై శతకములను గూర్చి పరిశీలన మొనర్పబడును.

# 1. శ్రీరామ పరములు

## 1. తారకబ్రహ్మరామ శతకము :

మరింగంటి కవుల శతకములలో 'సీతాపతీ శతక' మను నామాంతరము గల 'తారకబ్రహ్మరామ శతకము' మొట్ట మొదటిది. దీనిని రచించిన సింగర ఘంటావధాన సింగరాచార్యులు తన కృతులందు తెల్పిన పద్యములలో (సీస. 1-16, 17) ఈ శతకమును పేర్కొనలేదు.

శతక లక్షణమున మకుట నియమ ప్రకారము దీనిని 'సీతాపతీ శతక' మనవలెను. కాని కవియే 'రంజిలగ తారకబ్రహ్మరామ శతక రాజ మొనర రించితి సమస్త రసికు లెన్న' అనుట వలన 'తారకబ్రహ్మరామ శతక' మనియే నిర్ధారణము.

దీనియందు 'సీతాపతీ!' అను మకుటముతో 106 మత్తేభములు. 7 శార్దూలములు ఉన్నవి. గ్రంథ నామాంకిత సీస పద్యముతో పాటు 'దశరథ రాజనందన చరిత్రము'లోని 'దిశల ఆనులెల్ల, బొగడఁగ' అను పద్యము కలదు. ఇవి మొత్తము 115 పద్యము లైనవి.

సింగరాచార్యులు రామ కథాకథన శీలురు. తెనుగు సాహిత్యమున ప్రత్యేక ప్రక్రియలైన నిరోష్ఠ్య, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య పద్ధతులతో రామకథా కావ్యములను వ్రాసి వానియందు వివరింపని విషయముల కొరకు ఈ శతకమును చెప్పినట్లు దీని రచనా పద్ధతి తెల్పుచున్నది.

'శ్రీ రామచంద్రుడు సాక్షా న్నారాయణుడు. సీత శ్రీమహాలక్ష్మి. వారి కృత్యము లన్నియు దేవతా సంబంధ మైనవి' అని నిరూపించుటకు శతకమున అనేక రామాయణములు సాత్త్వికపురాణముల నుండి దృష్టాంతముల నొసంగుచు సింగరాచార్యుల వారు తన ధిషణా పటుత్వమును ప్రదర్శించి శ్రియఃపతి యైన శ్రీరాముని యందు గల భక్తి, ప్రపత్తులను నిరూపించుకొనిరి. తన రచన కుపబలకముగా వాల్మీకి రామాయణము, నారద, తారకబ్రహ్మ, ఆధ్యాత్మ, ఉత్తర రామాయణములు, వరాహ - పద్మ - నారద - స్కాంద - వామన - బ్రహ్మాండ పురాణములు, సాత్విక బ్రహ్మ విద్యా విలాసము, భాగవతము, హరివంశము, కాశీఖండముల నుండి అవసరమగు భాగములను యథాతథముగా నుట్టంకించెను.

దీనియందు - మధ్య మధ్య పద్యములకు శీర్షిక లుంచి, వాని విషయము పద్యములో తెల్పుట ఒక ప్రత్యేకత.

ఉదా :- "రామునకు హేతు త్రయము", 'లాఁరాహరణ హేతు నిర్ణయ పంచకం', 'చరణ ప్రభావ నిర్ణయం', 'సామర్థ్య నిర్ణయం', 'శరవేగ నిర్ణయం', 'రాముడు ముందరి కాలు వెనుకకు పెట్టిన శంకా నిర్ణయం', 'రాముడు చెట్టు చాటున ఉండి వాలిని వేసినందుకు సందేహ నివృత్తి', 'ప్రపత్తి నిర్ణయం'. 'హనుమత్ప్రభావ నిర్ణయం' అని ఇట్లు ఉప శీర్షికలు గలవు. 78 వ, 84 వ పద్యములకు గల సుదీర్ఘ వివరణలో - రావణ జననము, రామావతారము, కపుల

విధి, అక్షల సంఖ్య గల ఆయుధముల ప్రాణ స్థితి తెల్పబడినది. ఈ శతకమున మరియొక ముఖ్య విషయము తిరునామముల గూర్చి. విశిష్టాద్వైతమున మిక్కిలి పవిత్రము, ప్రచురము నగు తిరునామముల గూర్చి పరిశోధించిన వారు ఇవి కూచిమంచి తిమ్మన నాటికి గ్రంథస్థమై ప్రచారమున గలవని, తిరునామముల పేర్కొనిన వారిలో తిమ్మ కవియే ప్రాచీనుడు, ప్రథముడు అని అభిప్రాయ పడిరి *3 కాని తిమ్మనకు పూర్వుడైన సింగరాచార్యులు (1550 - 1600) ఈ శతకమునందు 'ప్రవర్తన తిర్నామము గాయకోత్తము లయోధ్యా రామ! సీతాపతీ' (111వ పద్యము) అని భగవన్మహిమాభివర్ణనమున 'తిర్నామము' గాయకుల పేర్కొనినాడు. దీని తరువాత గల పద్యములో 'తెల తిర్నామము చందన ప్రసవముల్' అని నుదుట ధరించు నామమును (తిరునామము) తెల్పెను. 111 వ పద్యమున తెల్పబడిన 'తిర్నామము' తిరునామ మను సాహిత్య ప్రక్రియయే కావున దీనిని గ్రంథస్థ మొనరించిన ప్రాచీన కవులలో సింగరాచార్యులే ఆద్యు డగును.*4

కవి యీ శతకమును శ్రీరామ జననము నుండి అవతార సమాప్తి వరకు చెప్పెను. తాను ప్రతిపాదింప దలచిన తారకబ్రహ్మ రాముని గూర్చి విశేష విషయములు కొన్ని పద్యములలో ప్రత్యేకముగా తెల్పినాడు. *5 వాని పద్ధతి యిట్లు గలదు :

"ఇక్కడి నుండి రామాయణం షట్కాండ కథలు శోధించి సీతారాములకు మానుష లీలలు పట్టకుండా శాస్త్ర సమ్మతాలుగా భక్తి వాదాన చెప్పుట కాకుండా పెద్దలకు మనస్సు వచ్చేటట్టు చెప్పినారం. ప్రతి పద్యానకు అర్థం చాలా చెప్పినా వున్నది. కొన్ని పద్యాలలో పురాణ కథలే యిమిడి వున్నవి" అని చెప్పి—

'రామ జన్మ హేతు త్రయమ్ - వాల్మీకి రామాయణే'—

'మొదలన్ హోమపు పిలి హోత్ర మట! యా మూలంబునం దొక్కరుం
డుదయంబై పరమాన్న మిచ్చెనట! తా నుర్వీపుడుం దాని నె
మ్మది కౌసల్యకు బెట్టినం గొనుచు నే మాడ్కి న్నినుం గాంచెనో
యది మర్త్యత్వము గాగ నేర్పునె యయోధ్యా రామ! సీతాపతీ! (21)

అని శ్రీరాముని యమర్త్యత్వమును తెల్పినాడు. ఇట్లే మిగిలిన రెండు పద్యముల యందును 'లోకుల్ మిమ్ము తత్త్వ ప్రవర్తన నూహింపరు మర్త్య బుద్ధిని—' యని రాముని దివ్యత్వ ప్రతిపాదన చేసెను.

"సీతా యాత్ర హేతు త్రయమ్ వరాహ పురాణంలో చెప్పినాడు—ధరణీ వరాహ సంవాదే. రావణాసురుడు పర్ణశాల కడకు రాగా అగ్నిహోత్రుడు వాణ్ణి జూచి సీతా భగవతిని పాతాళ లోకాన తన పెండ్లాలు స్వాహా, స్వధల వద్ద దాచి వచ్చి, సీతకు ప్రతి వేదవతిని యిప్పిస్తే వాడు కొంచు లంకకు పోపుట"

"దివిజార్యగ్రణి పర్ణశాల కడ కేతేరన్ కృశానుండు గాం
చి వడిం జానకి నాత్మ భార్యల కడన్ శేష స్థలిం దాచి వే
దవతిం గల్పన చేయ వాడు గొని సంధన్ లంకకుం బోవు లా
గవితానస్థితి నీదు కీలగు నయోధ్యా రామ ! సీతాపతీ ! (28)

"దశాననుడు దపహరించినది వేదవతినే గాని సీతను కాదు. దీనికి కారణము అగ్నిహోత్రుడు" - అని దీని ద్వారా తెల్పెను.

శ్రీరాముడు రామలింగ ప్రతిష్ఠ చేసిన విషయమును గూర్చి అనేకులకు గల సంశయముల నివృత్తి చేయుటకు పురాణములు, వివిధ 'రామాయణముల నుండి ఎన్నియో విషయముల పేర్కొని, 12 పద్యములతో వివరించి, రాముడు శివలింగ ప్రతిష్ఠను చేయలేదు, అంధులైన జనమే ప్రచారం చేసిరి' - అని బ్రహ్మాండ పురాణే దారుకామాహాత్మ్యే -

"తన చే సంటిన బ్రహ్మహత్య విడ యత్నం బేమిటన్ లేని రు
ద్రుని సేతు క్షితి రావణార్థము జవాత్మల్ నిల్పినా రందు రా
వన భూమి స్థిత మౌని యోషితతి తీవ్ర క్రోధ వాక్యాను వ
ర్తన రూపం బని కాన లేమియు నయోధ్యా రామ! సీతాపతీ!" (48)

"ఈ మొదటి పద్యానకు (98 వ పద్యము) పదకొండు పద్యాలు పద కొండు పురాణాలలోని కథలు భక్త్యావేశాన చెప్పుట కాదు. పెద్దలకు సమ్మతంగా చెప్పినారం. అన్య మతస్థులు వినవచ్చును" - ఇట్లు మిగిలిన పద్యముల యందు అనేక దృష్టాంతములతో ఈ విషయమును తెల్పెను వానిలోని చివరి పద్యము;

'నెన రొవ్వన్ కుం వృద్ధులన్ గురువుల స్నివర్థి పూజింపఁగా
వినుతుత్ చేయుట లెన్న నేరక యయో! వెఱ్ఱిలౌ వృథా కూలి వా
ర్ధిని సేతుక్షితి నిల్పఁ గోరెదరు ప్రోడిన్ మానుషాచార వ
ర్తనకున్ నైజము గాదె మాఁకఁగ నయోధ్యా రామ! సీతాపతీ! (109)

ఈ విధమగు అనేక దృష్టాంతములతో శ్రీరాముడు సాక్షా ద్విష్ణువు, తారకబ్రహ్మ, మానుష లీలల నంట గట్టరా దని ఎన్నియో గూఢార్థములను, యథార్థములను ఉపపత్తులతో నిరూపించి తన సర్వంకష పాండిత్యమును కవి వెల్లడి చేసెను.

శతకము నందలి వచన రచన వ్యావహారికముగా నున్నది. పద్య శైలి మధ్య మధ్య సమాస యుత ప్రౌఢ శైలితో కలదు.

ఉదా:- 'సామర్థ్య నిర్ణయం':

"ప్రతికూలం బగు వారు లేరో! సుకట వ్రాతంబు దా నీ నయ
ప్రతిమాన ద్విప గండ దైత్య మృగరా డ్భల్లూక శార్దూల ప
ర్వత దుర్దాంత వనాంతరస్థముగ నీ వర్తించు సామర్థ్య ము
ద్ధతి సత్యంబని నమ్మియే కద అయోధ్యా రామ! సీతాపతీ! " 20

ఇట్లు చంపూ పద్ధతిగ నున్న ఈ యముద్రిత శతకము తాళపత్ర ప్రతి అచ్చటచ్చట కొంత జీర్ణమైనందున 7, 8, 12, 16, 30, 84 సంఖ్యలు గల పద్యములు, వానికి సంబంధించిన వచనములు అసమగ్రముగా నున్నవి. శతకాంతమున కవి తనను గూర్చి ఒక సీస పద్యమున తెల్పుకొనెను. దీని తరువాత శతకము 'రౌద్రి నామ సంవత్సర చైత్ర బ ౧౨ ఆదివారం వరకు సంపూర్ణము చేయబడినది'- అని వ్రాసిన అకు చివర—

"వసుధ దనరు ప్రణోత్పత్తి వత్సరమున
బరగు సద్భాద్రపద సిత పక్ష సౌమ్య
వాసరంబున వ్రాసితి వర చతుర్ద
శంబు శ్రీ శేషశైలు సుతిందులోన"- అని ఒక పద్యము కలదు.
1980 లో రౌద్రి వచ్చినది గినిని బట్టి లెక్కించగా 1560 లో ఒక రౌద్రి

వచ్చును. ఇది సింగరాచార్యుల కాలమునకు సరిపడినది. ఈ రౌద్రి తర్వాత 10 సం. లకు అనగా 1670 లో ప్రజోత్పత్తిలో ప్రత్యంతరము జరిగి లేఖన మైనది *7 రామ నామ శతకములలో అవతార వైభవము, విష్ణు కథలకే ప్రాధాన్య మిచ్చిన కవులు గలరు. సింగరాచార్యులు కేవలము రామాయణ కథనే ప్రత్యేక పద్ధతిలో శతకమున చెప్పి నూతనత్వ మాపాదించెను.

## 2. శ్రీ కళ్ళచెర్వు సీతారామ శతకము

'కళ్ళచెర్వు పుర సీతారామ చంద్రప్రభో!' అను మకుటము కలిగి, 40 శార్దూలములు, 68 మత్తేభములు గల యీ శతకమున కృష్ణాజిల్లా కళ్ళచెర్వులో వేంచేసియున్న స్వామివారి క్షేత్ర వైభవ ప్రశస్తి వర్ణింపబడినది.

కళ్ళచెర్వు మొఖాసాదారు లైన రాజా చెలికాని వేంకట రామ నృసింహ భాస్కరరావు గారి ప్రోత్సాహమున వేంకట నరసింహాచార్యులు (బడవ) దీనిని వ్యయ సంవత్సర పుష్యమున రచింపగా, సర్వజిత్ (1948) చైత్రము నందు ముద్రిత మైనది.

శతక ప్రారంభమున 86 పద్యములలో కృతిపోషకు డైన భాస్కరరావు గారి వంశ వర్ణన, చివర 2 పద్యములలో మంగళాశాసనము కలదు. 1-30 పద్యములలో కవి తన ఆత్మవేదనను వ్యక్తపరచి ఆత్మాశ్రయ కవితా ధర్మమును పాటించినాడు. 31-60 పద్యములలో శ్రీరామ కథ సంక్షేపముగా చెప్పబడినది. చివరి పద్యమున దశావతార స్తోత్రము కలదు. కవి యితర శతకముల రీతినే దీనియందును పాటించెను.

## 3. శ్రీమ త్తిరుమలాపుర - భోగ సుందర సీతారామచంద్ర శతకము

వేంకట నరసింహాచార్యుల (బడవ) సీస పద్య శతకముల యందు అంత్య ప్రాస నియమముతో రచింపబడి 'భోగ సుందర వరనామ పుణ్యసీమ! తిరుమలాపుర ధామ! వైదేహ రామ!' అను మకుటముతో 100 పద్యములు గల యీ శతకము పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరు తాలూకా తిరుమలాపురమున గల భోగ సుందర సీతారామచంద్ర స్వామిని గూర్చి చెప్పబడినది.

తిరుమలాపుర నివాసి, ఈ దేవాలయ నిర్మాత కనుపర్తి లక్ష్మీనరసింహ మూర్తి పంతులు గారు కవిచే శతకమును చెప్పించి, 1948 వ సంవత్సరమున ముద్రిత మొనరించిరి.

శతక ప్రారంభమున 5 పద్యములలో కృతి పోషక ప్రశంస, 2 పద్యము లలో మంగళాశాసనము, తరువాత 9 పద్యములయందు భక్తాంజనేయ స్తోత్రము చేయబడినవి.

మధ్య మధ్య అలంకారములు, సామెతలు గలిగి యుండి సంక్షేపముగా శ్రీరామ కథను ప్రవచించిన యీ శతకమునందు 31-40 పద్యములు దశావతార వర్ణన, 41-45 ఉర్దూ పద మిశ్ర పద్యములు కలవు.

కవి దీనిని అంత్య ప్రాస నియమముతో రచించుటకు తమ పూర్వులైన వేంకట రాఘవాచార్యుల గారి 'కేశవ స్వామి శతక' ప్రభావమే ముఖ్యము. ఈ రెండు శతకములలోని పద్యములు బింబ ప్రతిబింబములుగా నున్నవి.

**కేశవస్వామి శతకమున** (46 వ పద్యము)—

> "దశరథ రాజ పుత్ర ఖ్యాతి నుదయించి
> గాధేయ సవన రక్షణ వహించి
> తాటకా నామ దైత్య వధూటి ఖండించి
> యల నహల్యా శాప మపనయించి
> భార్గ వానర్గళ దోర్గర్వము హరించి
> జనకాజ్ఞ దండకావని చరించి........"

అను పద్యము ఈ శతకమున (37వ పద్యము)—

> "దశరథ సుతుడవై కుశికాత్మజున కెట్టి
> యూపద లేకుండ నరుల వట్టి
> శివుని చాపము ద్రుంచి సీతను చేపట్టి
> పరశు రాముని బాహు బలము నెట్టి
> రంజిల్లు దండకారణ్య మార్గము జుట్టి
> ఖర దూషణాది రక్కసుల గొట్టి..."

ఇత్యాదిగా అనుకరింపబడినది.

'రాజ ద్రథాంగ ధారా నిర్జిత క్షుద్ర
పరమ యోగి వ్యూహ భావ భద్ర...' (కేశవస్వామి-97)

రాజద్రథాంగ ధారా నిర్జితక్షుద్ర
దేవమానస పదాధీన భద్ర...'

అని యీ శతకము (8 పద్యము) న గలదు.

ఉర్దూ పదములను అంత్య ప్రాసలో చేర్చి చెప్పిన పద్యములలో—

'దాసుల రక్షింప దలతువు హర్వఖు
నీ కృప చూపుమా నీకు లఖు
కలిగె నా కిపు డెంతో ఘనముగా కంబఖు
తమ సేవ నాకీయ దగును షఖు'

అనునది ఒక ఉదాహరణ.

కుటిలారి జన రక్త చటులో గ్ర శిత బాణ
సతతాండ జాధీశ స త్ప్రయాణ!
దాస రక్షిత కార్య తర్పిత గీర్వాణ
కోవిద స్తవనీయ గుణ ధురీణ...' (13)

ఇత్యాది - సంస్కృత పద పూరిత రచన అధికముగా నున్న యీ శతకము వేంకట నరసింహాచార్య కవి శతకములలో ప్రౌఢ చరన.

## 4. రాఘవ శతకము

భల్లాతక క్షేత్ర మాహాత్మ్య కర్తయైన వేంకట రామానుజాచార్యులు - కృష్ణాజిల్లా కళ్ళదెర్వు గ్రామమున నున్న సీతారామ చంద్ర స్వామి వారిని గూర్చి 'రాఘవా!' యను మకుటముతో 108 పద్యములలో ఈ శతకమును చెప్పి అభిమానుల సాయముతో 1948 వ సం॥న ముద్రించిరి.

దీనియందు 27 చంపకములు, 27 ఉత్పలములు, 27 శార్దూలములు, 27 మత్తేభములు ఉన్నవి. చంప కోత్పలములతో మత్తేభ శార్దూలముల కలిపి

శతక రచన చేయుట వృత్త నియమమునకు విరుద్ధ మనిపించును. కవి మాత్రము పీనిని కావలె ననియే వ్రాసినట్లు-

"ధరణిని కళ్ళుచెర్వు పుర ధాముఁగవౌ రఘురామ చంద్ర! నీ
కరుణను గోరి నేను శతకంబు చతుర్విధ వృత్త జాల సుం
దర సుమ మాల గూర్చి ముదంబున నీ గళమందు నుంతు భా
స్కర శశి తారకా స్థిర యశంబుగ సొంతగదయ్య రాఘవా!" (106)

అను పద్యము వలన తెలియుచున్నది.

శతకమున రామకథ ముఖ్యమైనను 88-101 పద్యములలో భాగవత కథ సంక్షేపముగా చెప్పబడినది. 5-14 పద్యములయందు దశావతార వర్ణన గలదు.

'వనజారాయత పత్ర నేత్ర! నిను నే వర్ణింపఁగా బోలుటల్
ఘన చూతాగ్ర ఫలంబు గాంచి తిను కాంక్షన్ హ్రస్వుఁ డత్యుద్ధతిన్
తన హస్తంబున ముట్ట నెంచినటులౌ...' (92)

అని తెల్పుకొనుట - కాళిదాసు 'ప్రాంశు లభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామనః' - అను శ్లోకమును గుర్తు చేయుచున్నది.

శతక శైలి తెలియుటకు రెండు పద్యములు:

'పారావార సుతా పయోధర తటీ పర్యంక నిద్రాయితా!
ఘోరాఘౌఘ విభంగ మంగళ కరా! గోవింద నామాంకితా!
సారాచార విచార! మార జిత సత్సౌందర్య గాత్రాన్వితా!
కారుణ్యామృత సాగరా! మురహరీ! కాపాదరా రాఘవా!' (21)

'దశకంఠాసుర వంశ దావ దహనా! దాసోఽహ మేవం ప్రభో!
విశదానంత బల ప్రతాప కలనా! ప్రీతి ర్భభూవ స్సదా
దశది గ్వ్యాప్త యశో విరాజ చరితా! దామోదరా! పాహి మాం
అశుభాన్ హన్యతు స్వస్తి తేఽస్తనుచు నాహ్లాదించిరౌ రాఘవా!' (80)

ఈ శతకమే కవి ప్రథమ కృతి యైనను పద్య రచన హృద్యముగా నున్నది.

# 2. నరసింహ పరములు

## 1. యాదగిరి నరసింహ శతకము :

అప్పలాచార్యు అను కవి 120 కంద పద్యములలో 'యాదగిరి నరసింహా'! అను మకుటముతో దీనిని రచించెను. తనను గూర్చి—

'మణిగంటి వంశ జాతుఁడ
నరహరి కృప నప్పలార్య నామాన్వితుఁడన్
ధర నీ శతక మొనర్చితి
గిరిధర! నీ పేర యాదగిరి నరసింహా!' (102)

అని తెల్పుకొనెను. ఈ అప్పలాచార్యు లెవరో, ఏ కాలమునకు చెందిన వ్యక్తియో తెలియుట లేదు. అందుకే 'కవి పండితులు' శీర్షికలో చేర్చలేదు, సింగరాచార్యుల అగ్రజుడు ఒక అప్పలాచార్యు లున్నాడు.

శతకము అంత ప్రాచీనము కానందున ఇది ఆయన రచన యనుటకు అవకాశము లేదు. సింగరాచార్యుల పౌత్ర పరంపరలో అప్పలాచార్య నామధేయులు గలరు. వారిలో నొకరు దీనిని రచించి యుందురు. అట్లయిన శతక రచనా కాలము సుమారు క్రీ.శ. 1700 తర్వాత యగును.

అముద్రితముగా నున్న దీని తాటాకు పుస్తకములో నిశ్శి వ్రాత బొంకముగా దోష రహితముగా కలదు. ప్రారంభమున 'శ్రీ సిరి సెనగండ్ల లక్ష్మీ నృసింహాయ నమః' అని యున్నందున నిది దేవరకొండ ప్రాంతమున, అందున సింగరాచార్యుల వరుసలో ఒకరి రచన యగునని భావన!

శతకమునందు నరసింహ వైభవము, అవతార ప్రశస్తి చేయబడినది. 'యాదగిరి నరసింహ స్వామిని సేవించిన సమస్త గ్రహ బాధలు నశించును. ఆయన రోగుల పాలిటి కల్పతరువు' అని అధికముగా వివరించినాడు. పద్యము

లన్నియు సంలక్షణముగా గలవు. దీని యందలి శైలి తెలియుటకు రెండు పద్యములు:

'నరునకు సారథివై, కురు
నరపాలుని ద్రుంచు నీదు నైపుణి నెన్నం
దరమా! విధి కైనను - సుర
గిరి వర సద్ధైర్య యాదగిరి నరసింహా!' (60)

'కోటి శతకోటి పటు నఖ
వాటముచే రిపుని మేను వ్రయ్యలుగా నే
ర్పాటించి రుధిర ముఠలన్
గీటణచవె వైరి యాదగిరి నరసింహా!' (71)

కవి తన రచనను గూర్చి యిట్లు వ్రాసికొనినాడు:

'యతి నెఱుఁగ ప్రాస నెఱుఁగన్
చతుర నలంకార మెఱుఁగ శబ్దం బెఱుఁగన్
మతి జేసినాడ నిది యిం
గితముగ నీ పేర యాదగిరి నరసింహా!' (98)

## 2. యాదగిరి లక్ష్మీనృసింహ శతకము

'యాదగిరి నరసింహా!' అను మకుటము గల ఈ శతకమునందు అంత్య ప్రాస, అనుప్రాస, శబ్ద చిత్ర మయములైన 110 కంద పద్యములు కలవు.

కల్వకుర్తి తాలూకా రంగాపురం నివాసులైన జగన్నాథాచార్యుల వారి పూర్వులలో నున్న వేంకట నరసింహాచార్యులు (క్రీ.శ. 1800) దీనిని రచించెను. శతకకర్త నృసింహోపాసకుడు, వశ్య వాక్కు గలవా డని ప్రతీతి!

తాటాకులలో నున్న యీ కృతిని జగన్నాథాచార్యుల వారు పరిష్కరింపగా, తమ రచనలతో పాటు దీనిని కలిపి బీరకాయల రామారావు గారు ముద్రణ చేయించినారు.*[9] శతక ముఖపత్రముపై -

'శరహా ర్క-విశాఖము ం
క్కర వారగ దీర్చి శతక ర త్నిస్వియుఁగన్
కరము నృహరి కథ నచ్చ
క్కరన జగన్నాథ వర్య కవిని వెలసితిన్,

దిద్దింది శతక మచ్చం
దద్దించి కవి స్నుతించి యహహా! ధరను మేల్
రుద్దింది రామదా వర
కొద్ది న్విడె బిరకాయ దులి యాదగిరిన్"—

అని కలదు. ఈ శతకరచన కవికి గల సంస్కృతాంధ్ర భాషా పాండిత్యమును వెల్లడి చేయుచున్నది. పద్యముల యందు పోతన గారి యనుకరణ మధికము. 40 పద్యముల తరువాత 10 పద్యములలో చతుర్ముఖాకార వర్ణన గలదు దీనియందలి పద్యశైలి—

'అరుణారుణ కిరణోజ్జ్వల
తరుణ చరణ శరణ వరణ దాసోదరణా !
కరుణామృత ధరణాః సిత
కిరణాయిత లపన యాదగిరి నరసింహా !' (2)

'అందమ్ముల కరుణా రస
తుందమ్ముల హసన మాత్ర దృథ చంద్రకళా
బృందమ్ముల నీ కనుఁ గవ
కెందమ్ముల దలఁతు యాదగిరి నరసింహా !' (29)

అర్వక నిర్వయ కృన్మహ
దార్చటి నిర్భిన్న పటు సభాంతః స్తంభా
పిర్భూత దుర్భ రాకృతి
గిర్వటములరు నుతి యాదగిరి నరసింహా ! (48)

శతకము పద్యము లన్నియు ఈ పద్ధతిలో గలవు.

### 3. మల్లూరి నృహరి శతకము :

'కాటికవి' యను నామాంతరము గల వేంకట రామాచార్యులు 'మల్లూరను వెలసు నృహరి మాం పాహి హరే'! అను మకుటముతో 108 కంద పద్యముల పరిమితిగా నీ శతకమును రచించెను.

'కాటిపవి కన్నీటి ధార' యను 'సాహృతి' యందు తెల్పిన భద్రాచలం తాలూకా దుమ్ముగూడెం సీతారామాలయ స్థితి, అర్చకస్వామి యైన కవి బాధలు ఈ శతకము పీఠికలో 25 పుటలయందు వివరింపబడినవి.

దుమ్ముగూడెము నందలి శ్రీరామచంద్ర ప్రతిష్ఠా సమయమున శ్రీ నృసింహ యంత్ర స్థాపన జరిగినది అందువలన నృసింహ మంత్రమును పునశ్చరణ చేయుచు, శ్రీరాముని అర్చించుచు, ఈ శతకమును వ్రాసినట్లు 'ఉపోద్ఘాతము'న (21 వ పుట) కవి తెల్పెను.

ఈ గ్రంథము భక్తులైన పయామయుల కంకితము చేయబడిన దని—

'శ్రీ సీతాత్మారాముని
దాసుల కంకితము 'కాణి' దయజేసెడి భూ
వాసులకు నిడియు భోజ్యము
దోసంబుల నెన్న మనుజు దోసిలి బడకన్'

అని తెల్పెను. శతకమునందు నిత్య వ్యవహారమున గల భాషా శైలియే యెక్కువగా పాటింపబడి దాని కనుగుణముగా యతి ప్రాసలు ప్రయోగింపబడినవి.

కవి తన ప్రతిభను గూర్చి—

'పల్లించ లేదు చదువులు
అల్లరితన మన్న నాకె యమ్మతి మిపుగున్
కల్లోని వార్త చదువుట
మల్లూరను వెలయు నృహరి! మాం పాహి హరీ!' (4)

అని సవినయముగా తెల్పుకొనినాడు ('కలలోని' అనుటకు 'కల్లోని').

'నల్లని కొండ దరిన్, కన
గల్లను గ్రామంబు పూర్వ కాలము, నేడో
అల్లారు దుమ్ముగూడెము
మల్లూరను వెలయు నృహరి......' (6)

దీనిలోని 'పల్లని కొంగ' - పల్లగొంగ, దాని సమీప [illegible] కవి యొక్క స్వగ్రామమైన 'కనగల్లు'.

నృసింహస్వామి వారిని గూర్చి - భయంకర రాకారమును గూర్చి చమత్కారముగా తెల్పి - మూర్జాల కిశోర న్యాయమున తనను రక్షింపు మని యిట్లు వేడుకొనుచున్నాడు :

'చాల్లే నీ వాల్లభ్యము
పిల్లల భయపెట్టు రూపు పెన్ ఘాతము ..
వల్లన్ రాదన రాదా
మల్లూరను వెలయు.........' (౭౮)

'పిల్లి తన నోట పిల్లను
యెల్లాగున నిల్లు నిల్లు త్రిప్పునొ నన్నున్
అల్లాగె త్రిప్పు వేడెద
మల్లూరను వెలయు.........' (౮౯)

కవి యీ శతకమున ఉపోద్ఘాత రూపముగా [illegible] విషయము [illegible] తెల్పెను. హిందూ దేవాలయ స్థితి గతులు, కమిటీ మెంబర్ల అశ్రద్ధ, [illegible] మొదలగునవి వీనిలో ముఖ్యమైనవి.

ఈ 'మల్లూరి నృహరి శతకము' శ్రీ దమ్మపుర సీతాత్మారాను [illegible] [illegible] అర్థ సహాయాపేక్షిత స్తోత్రము- కాటి గ్రంథము [illegible] కుసుమము అని కవి తల్పుకొని, 1905 వ సంవత్సరమున ముద్రించెను.

తన జీవిత కాల మంతయు ఆదాయము లేని [illegible] అభివృద్ధి పరచుటకే శ్రమించి ఏ అభివృద్ధిని చెందని రామాచార్యకవి 18-11-19[illegible] వ తేదీన భద్రాచల మండలం 'మల్లిపేట' గ్రామమున పరమపదించిరి.

## 4. శ్రీ భీమపుర లక్ష్మీనారసింహప్రభు శతకము :

[illegible] పట్టణము జిల్లా భీమునిపట్టణము పర్వతముపై వెలసిన [illegible] నృసింహ స్వామిని గూర్చి లక్ష్మణాచార్య భాగవతార్ చెప్పిన [illegible] నందు 105 శార్దూల, [illegible] పద్యములు గలవు.

కృతికి ఆముఖముగా శ్రీ పెద్దింటి సూర్యనారాయణ దాసు, పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రి, ఇంద్రకంటి సూర్యనారాయణమూర్తి, రొంపిచెర్ల కృష్ణమాచార్యులు తమ అభిప్రాయములను వ్యక్తపరచిరి.

కవి యీ శతకమునందు 28-31 పద్యములలో ఆంధ్రదేశమందలి ప్రసిద్ధ నారసింహ క్షేత్రములను- వానియందు వెలసిన వివిధ నృసింహులను తెల్పి, 76-84 పద్యములలో అవతార వర్ణన చేసెను. 85వ పద్యమున చెళ్ళపిళ్ళ స్వామి వృత్తాంతము తెల్పబడినది. 20 పద్యములయందు కేశవాది నామములు పద్యమున కొకటి చొప్పున - భగవద్వర్ణనా పరముగ గలవు.

పద్యతాగ్రమున దేవళము నిర్మించి స్వామిని ప్రతిష్ఠ చేసిన పూసపాటి విజయరామ రాయలను 'ఆరూఢాస్తి పూసపా డ్విజయరామాభిఖ్య దంతీంద్రు' అని తెల్పి వారి దాన, ధర్మ కార్యములను వివరించెను.

హృత్ప్రభూమిని పవిత్రముగా భావించిన కవి ఈ యార్షభూమిపై జనించుటకు స్వామి నామానుసంధానమే ముఖ్యమని—

'ఏ జన్మాంతర పుణ్య మున్నదియొ సామీ! ఆర్ష భూ పీఠిపై
నా జన్మం బిది ధన్యత న్నిలిచె; నీ నామానుసంధాన మం
దే జీవాభ్యుదయంబు గందు దయ రాదే పాహి! మా మందు నో
శ్రీజానీ! నిను గొల్తు భీమపుర లక్ష్మీ నారసింహ ప్రభూ!' (9)

అను పద్యములో సవినయముగా తెల్పుకొనెను.

దీనియందు అటకట కొన్ని ప్రౌఢ శైలి పద్యములు రచింపబడినవి.

'రక్షోరా ట్ప్రనయాభిరక్ష! అరిషడ్గ వ్రాత హర్యక్ష! లో
క క్షేమాభయ దీక్ష! శాశ్వత వివేక శ్రీ దయాభిక్ష! సం
ఘ ల్లోభాకర కార్య నాశన మహా గంభీరవీక్షా! జగ
చ్చిక్షా దక్ష కటాక్ష! భీమపుర లక్ష్మీ నారసింహ ప్రభూ! (10)

అనునది అట్టి వానిలో నొకటి.

“శ్రీ రామణ్యమునన్ ‘విరాళి’ గనవా ‘శ్రేష్ఠ’ సమస్తృత్తి నీ సాకారంబు
నీ శతకమో స్వామీ!” (102 ప.) యని తెల్పి, తనను గూర్చి -

కంజాక్షా! జనియించినాడను మరింగంట్యన్వయాంభోనిధిన్
పంజాతుం డగు రాఘవాచార్యుని కనిష్ఠాత్మీయ పుత్రుండనై
రంజింపన్ భజియింతు భవ్య కథ తెల్లన్ లక్ష్మణాచార్య గు-
ర్వంజం జే పట్టుము నేడు భీమపుర లక్ష్మీ నారసింహా ప్రభూ! (105)

ప్పుకొనెను. చివరలో శతక ముద్రణ (1958) కు ధన సాహాయ్య మొన
వారికి పద్య రూపకముగా కృతజ్ఞతల వెల్లడించినాడు.

## 5. యాదగిరి లక్ష్మీనారసింహ ప్రభు శతకము

అనేక విధ గ్రంథకర్త లైన వేంకట నరసింహాచార్యుల (బదవ) కుమా
రుషోత్తమాచార్యులు ‘యాదగిరి లక్ష్మీనారసింహ ప్రభూ!’ అను మకుట
08 శార్దూల, మత్తేభములతో శతకమును చెప్పి, 1970 వ సం॥మున
మొనర్చిరి.

శతకమున లక్ష్మీనృసింహ వర్ణన ముఖ్యముగా చేసిన కవి పారలౌకిక
వమును, నశ్వరమైన ప్రాపంచిక సుఖానుభూతులను వివరించి, వైష్ణ
భగవదనుసంధానమే మూలమని ప్రపంచించెను. దీనియందు భారతీయ
హజమైన వైరాగ్యమును గూర్చి అధికముగా గలదు. కవి భగవంతు
భక్తునకును మధ్య గల భేదమును.—

చా నీ మధ్య మనంత మంతర మనంతా! సంతతాభీష్టద సం
నార్ద్రామల వీక్షణామృత దశా దాన స్వభావేజ్య లా
హా నాస్యాంబుజ వైభవ స్మిత లసన్మూర్తీ! మొరాలింపవే!
బ నా దిక్కొకమాయు యాదగిరి లక్ష్మీనారసింహ ప్రభూ! (4)

అని తెల్పి ‘అంతర’ మనంత మనదే యను ‘ఆర్తి’ వ్యక్తీకరించెను.
ఈ సుందర శైలిలోనే రచింపబడినను మరికొన్ని కొంత ప్రౌఢ రచన
లు. అందు కొక ఉదాహరణ:

'ద్వేషోచ్చిష్మ గుపంచిత చ్ఛటల సంధీభూత చిత్తుండనై
దోషారణ్య పథోగ్ర కంటకములందున్ గ్రుగ్గుచున్నాడ నా
పాషాణీ కృత బుద్ధి బాపుము కృపాపారాబ్ధి! యుష్మత్పదా
శ్లేషోత్కాంక్షను దీర్చి యాదగిరి... ... ... " (82)

శతకారంభమున సింగరాచార్యులను నుతించి, మాతా పితృ వందన మాచరించి, తమ కపిలా వంశమును గూర్చి—

'విద్వద్వంద్యులు సుప్రవిల్లి కపిలా విశ్వాంగణం బందు - ప్రో
ద్యద్విద్వైభవ శాలురై మనిసిరా 'రాసూరి' వంశాన్వయుల్
తద్వంశ ప్రభవుండనై సుకృత మొందన్ మత్కృతిన్ యుష్మ దం
ఘ్రి ద్వంద్వంబున నుంతు యాదగిరి... ... ... " (10)

ఇట్లు వివరించి కృతిని స్వామి పాద సన్నిధియం దుంచి, శతకాంతమున తన పితృపాదులు దీనిని చూడక పోయిరే యని తన ఆర్తిని—

'నన్నెంతో ప్రియమారగా బెనిచి పూర్ణప్రేమ వాత్సల్య సం
స్విన్న స్వాంతమునన్ మదీయ కవితా సీమంతినీ లాస్య సం
పన్న శ్రీ గని సంతసించు పితృ దైవం బిందు లేరన్నదే
ఖిన్నత్వమ్మును గూర్చు యాదగిరి... ... ... (106)

అని వ్యక్తము చేసిరి.

ఈ కృతికి కప్పగంతుల వారు, దివాకర్ల వారు, అంబటిపూడి వారు, డా॥ ఎస్. లక్ష్మణమూర్తి గారు అభిప్రాయముల వ్రాసి కవి ప్రతిభను గొని యాడిరి.

పూర్వము నుండి మరింగంటి వారు నృసింహ భక్తులు. తమ రచనల నన్నిటిని ఈ స్వామికే అంకిత మొసంగిరి. పరంపరగా వచ్చు కవితా సంప్రదాయముతో పాటు నృసింహారాధన కలిగిన వీరు తమకు తోచిన విధముగా శతక మూలమున స్వామిని అర్చించి భక్తి ప్రపత్తుల వెల్లడించిరి.

# 3. గోపాల పరములు

## 1. కేశవస్వామి శతకము

మరింగంటి కవుల రచనలయందు మిక్కిలి ప్రచారమున గల యీ శతకము 'కేశవస్వామి! భాస్వత్ఖగేశ గామి!' యను మకుటముతో 108 సీస పద్యములయందు చెప్పబడినది. శతకము చివర 'క్షమా వింశతి' పేరున 20 చంప, కోత్పలములు గలవు. లఘు కృతులలో 'క్షమా వింశతి' కలదు.

తాలాంక నందినీ పరిణయ కర్త అగ్రజుడైన వేంకట రాఘవాచార్యులు జడ్చర్ల తాలూకా గంగాపురమున వెలసిన చెన్నకేశవ స్వామిని గూర్చి ఈ శతకము రచించెను. పూర్తిగా అంత్యప్రాస నియమము*10 గల దీనియందు విష్ణు పారమ్యము, అవతార విశేషములు, శ్రీకృష్ణ గాథలు చెప్పబడినవి. తన రోజులలో మిక్కిలి వాడుకయందున్న ఉర్దూ పదములను కవి స్వేచ్ఛగా ప్రయోగించెను.

శతక ప్రారంభ పద్యము :

'శ్రీ కామినీ మణి నీకు మోహపు టాలు
వైకుంఠ నగరి దేవరకు ప్రోలు
గాలి మేపరి దొరగారు మీ పావాలు
పై గప్పినది మంచి పైడి శాలు
గిరి నెత్తి వ్రేల రక్షించె నీ కొన వ్రేలు
దనుజుల మీది నీ దాడికోలు
నిగమాంత సంతతుల్ నీ నిల్వ టంగీలు
పరులకు దీయ నీ పక్కిడాలు
నీ నిగారంపు పలపు పన్నీని టోలు
కోవిద స్తుతి నీకు దక్కోలు మేలు
కరుణ దాసుని దైన్యంబు కడకు దోలు
కేశవ స్వామి! భాస్వ త్ఖగేశ గామి!'

కవి ఉర్దూ పదములను అంత్యప్రాసలో వాడి పద్యములకు శోభను చేకూర్చినాడు- ఉదాహరణమునకు :

'సకల సురాసురుల్ పెకలించు నీ దాబు
నిఖిలాగమము లెల్ల నీ కితాబు
బలి జగత్త్రియము లేలఁగ నెవ్వఁడు నవాబు
తుద నెవ్వఁ డిచ్చు నీతో జవాబు
నీ మానసమున జనించె నే మహితాబు
వైనతేయుడు నీ సవారి యాబు -
కడ ముట్ట నిన్నెన్న గల్గె నాకుహిబాబు
భూమి లేదిక నన్ను బో ల్గరీబు

నీకు బ్రహ్మాండ ఖాండంబు నిండు గాబు
యెల్ల వేల్పుల బొల్పు నీకే హిసాబు
నీ కటాక్షేక్షణ ప్రాప్తి నాకు జేబు
కేశవస్వామి !.........' (18)

శతక రచనా కాలమును కవి ఇట్లు తెల్పినాడు :

'శాలివాహన గత శక వర్షము ల్వాసు
ఋషి గిరి శశి సంఖ్య లెలమి నడవ
ప్రభవాది షష్టి సంవత్స రాంతర్భూత
మైన యానందాబ్ద మవని గడవ
తలఁపగాఁ దగు దారి తలను పేర్నెల నిండు
పున్నమ రోజున ప్రొద్దు బొడవ
కేశవపుర*11 చెన్న కేశవ శతకంబు
నిండె నా మది నాథ డుంది నుడువ

> తద్గుణ స్తుతి మధురామృతంబు కడవ
> గా భజించిన నరు లఘౌఘంబు గడవ
> కల్గి కల్యాణ కరణ భోగములు గుడువ
> తుదిని మోక్షైక లాభ మొందుటకు దడవ
> కేశవస్వామి!..........' (109)

దీని ప్రకారము ఆనంద సంవత్సర మార్గశిర శుద్ధ పౌర్ణమీ శుక్రవారము 1.11.1856 వ తేదీ యగును. ముద్రిత శతకము నందు 'దారి తలను' బదులు 'దారి నెలంత' యని గలదు, (దారి-మార్గము; తల=శీర్షము మార్గశీర్ష మగును) దీనియందు ఉర్దూపదములు, వ్యావహారిక పదములు అధికముగా నున్నవి. మరిం గంటివారి శతకములలో నిది మకుటాయమానమైనది.*[12]

## 2. గోపాలచూడామణి శతకము :

బహు గ్రంథ నిర్మాతయైన వేంకట నరసింహాచార్యులు (ఐదవ) 'గోపాల చూడామణీ' మకుటముతో 108 మత్తేభ, శార్దూలములతో రచించిన యీ శతకము సముద్రాల నరసింహము (వరంగల్లు) గారి ద్రవ్య సాహాయ్యమున 1930 వ సం॥న ముద్రింప బడినది.

కృష్ణకథా ప్రధాన మైన యీ కృతియందు కవి ధర్మ ప్రాముఖ్యమును గూర్చి యధికముగా తెల్పి భగవద్వైభవమును నిరూపించెను.

> 'క్షీరంబందున నీరు సమ్మిశితమై చెన్నార రాయంచ త
> న్నీరంబున్ విడి క్షీర మేవిధిని వన్నెల్మీరంగాం గ్రోలు నా
> తీరు న్నా దురితాళి లెక్కిడక హృద్వీథిన్ సదా ప్రేమ చే
> కూరన్ మత్కృత సత్కృతుల్ కొనగదే గోపాల చూడామణీ!' (5)

దీనియందలి 'అంచ' భగవంతుడు; క్షీర నీరములు పుణ్య పాపములు. దురితాళి-పాప పుంజము, కవితా పరమగు దోషములు సత్కృతులు - సత్కా ర్యములు, సద్గ్రంథములు అని కవి భావన.

> 'వరశాఖా కిస పుష్ప పుంజములచే పాంథాళి తాపంబు సు
> స్థిర రూపంబున దీర్చు భూరుహము నుద్దీపింప నీ వట్టులే
> పరమప్రీతిం జెలంగ నా కిపుడు త్వత్పాదాశ్రయ చ్ఛాయ చే
> కుఱ చేయ న్మది బూనవయ్య యనఘా! గోపాల చూడామణీ! (19)

# 4. సత్యనారాయణస్వామి పరము

## 1. శ్రీరంగాపుర సత్యనారాయణ శతకము :

వేంకట నరసింహాచార్యులు (ఐదవ) పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడి తాలూకా శ్రీరంగాపురమున వేంచేసి యున్న సత్యనారాయణ స్వామిని గూర్చి 101 శార్దూల, మత్తేభములతో 'శ్రీరంగాపుర దివ్య రత్న నిలయా! శ్రీ సత్యనారాయణా!' యను మకుటముతో ఈ శతకమును రచింపగా, 1956 వ సం. న అది ముద్రింపబడినది.

శ్రీరంగాపుర గ్రామమున రుద్రవరపు కామేశ్వరమ్మ యను భక్తురాలిని సత్యనారాయణ స్వామి యావేశింపగా తదుపశమనార్థము భక్తురాలి కోరికపై యీ శతకము చెప్పబడినది. దీని తరువాత ఈ శతకకర్త 'శ్రీరంగాపుర శ్రీ సత్యదేవ స్తోత్ర తారావళి'ని కూడ రచించెను. (దీనిని గూర్చి 'లఘు కృతుల'లో వ్రాయబడినది).

శ్రీ సత్యనారాయణ శతకమున భక్తి, జ్ఞానముల గూర్చి వివరించి, సత్యనారాయణ వ్రతములోని 5 కథలు ఐదు పద్యములలో తెల్పబడినవి. వాంఛితార్థ ఫలప్రదుడు, సాక్షాద్విష్ణు వైన సత్యనారాయణ స్వామి తలచిన భీషణాగ్ని శీతలముగను, పర్వతములు పరమాణువులుగను, అంభోధులు ఊషర క్షేత్రములుగను, వజ్రము గడ్డిపోచగను మారు నని కవి ప్రవచించి, శతకాంతమున తన పరిచయము తెల్పి, ఒక 'మంగళహారతి'ని చెప్పెను

శతకమును విన్న భక్తురాలికి యథా పూర్వ స్థితి చేకూరినది.

# 5. శ్రీవేంకటేశ్వర పరము

## 1. శ్రీవేంకటేశ్వర శతకము :

'యాదగిరి లక్ష్మీ నారసింహ ప్రభు' శతక కర్తయైన పురుషోత్తమాచార్యులు 105 చంపకోత్పలములలో దీనిని చెప్పి శేషాచలేశునిపై తనకు గల భక్తి ప్రపత్తులను వెల్లడి చేసెను. కవి యీ శతకమున వేంకటేశ్వరుని వైభవమును వర్ణించి, "నిలువు దోపిడి"ని, 'హుండీ ధనము'ను-శ్లేషతో వ్యంగ్యముగా చమత్కరించినాడు. కృతి ప్రారంభమున - తండ్రియైన వేంకట నరసింహాచార్యులను గురువుగా గౌరవించి, వినయ వినమితుడై -

'ఆర్యులు మెచ్చ సత్కృతుల నన్నిటి దీర్చి కృతార్థులై మనో
హార్య వచస్కులై భగవ దంకితముం బొనరించి రెవ్వ రా
చార్యులు తల్లి దండ్రులును సర్వమునై నను సాకి రా నృసిం
హార్యుల చల్వ యీ కవితయై వలచెన్ గను వేంకటేశ్వరా!' (౮)

అని వారిని నుతించి, నా 'యీ కవితకు వారి చలువయే ముఖ్య' మనెను. 'శ్రియః పతి యనుగ్రహమే కవితకు మూలము. తద్భిన్నములు వృథా'యని 11 వ పద్యమున వివరించబడినది.

వేంకటేశ్వరుని లక్ష్మీ వైభవమును గూర్చి-

'గాశిగ బోసికొందువు సరాసరి రోజుకు మూడు మూటలున్
పీశెల నిండు స్వర్ణమును వెండియు రూప్యము లెన్నియైన - నీ
యాశకె మేరలేదు గదః అర్థిని నన్ను సముద్ధరింపఁగా
శ్రీశ! యికే మొసంగుదుః మరేమని వేడుదు వేంకటేశ్వరా!' (41)

అని, భక్తులనుండి వచ్చిన ధన కనకాదుల వలననే నీవు 'శ్రీపతివు' అని చమత్కరించెను.

'నీవు జగన్నిధానమవు నిన్ను మనంబున నెంచుచుండు'... (85) అను పద్యమున సార్వవిభక్తికము పాటింపబడినది.

శతకమునందు అనేక విషయముల తెల్పి, వేంకటేశ్వరుని నిత్య వైభవ శ్రీలను రమణీయముగ వర్ణించి—

'అంకెకు రాని నా కవితయందు కనంబడు నేమొ యెన్నియో
వంకలు వంపులున్ వదుఱ వాని దయామతి త్రోసివేసి, నీ
వంక నిగూఢమై పెనచి వైచిన భక్తిని స్వీకరింపవే
యంకిత మిచ్చు ఈ సముపహారము గైకొని వేంకటేశ్వరా! (104)

అని ప్రార్థించినాడు.

# 6. అనుభవాత్మకము

## 1. మానస ప్రబోధ శతకము

తన కృతుల నన్నిటిని దైవాంకిత మొనర్చిన వేంకట నరసింహాచార్యులు (ఐదవ) ఈ శతకమును మాత్రము తన అర్ధాంగి కంకిత మిచ్చెను. (మణింగంటివారి సాహిత్యమున నరాంకితము చేయబడిన గ్రంథ మిది యొక్కటియే!)

శతక కర్త కళత్రము చిత్రభాను సంవత్సర మాఘ బహుళ దశమి (1942) నాడు పరమపదించినది. అప్పటి వరకు తనతో పాటు జీవితమున కష్ట సుఖముల ననుభవించి తిరిగిరాని దూర తీరముల చేరిన యర్ధాంగి. వీరికి మిగిల్చినది ఇంతలు నంతలు నగు సంతానము, దుఃఖములు మాత్రమే।

భార్యా వియోగ సంజనిత విషాదుడైన కవి మానసిక వ్యథకు లోనై, చిత్త వృత్తికి ప్రశాంతిని చేకూర్చునది మోక్షమే యని వాంఛించి, భక్తితో భగవంతు నాశ్రయింపుటకు 'మనసా! పురుషోత్తము నాశ్రయింపుమా!' యను

మకుటముతో చంపకోత్పలములతో నీ శతకమును రచించి తన హృదయ వేదనను వేదాంత రూపకముగా వెల్లడి చేసెను.

తెనుగు సాహిత్యమున గల దుఃఖ రచనల (స్మృతి రచనలు) ను 'ఎలిజీ' లందుము. వానిలో నీ శతకము చేరినను, వానికన్న దీనిలో నొక ప్రత్యేకత గలదు. కవి మనస్సంశోధన చేయుచు జీవుని దుఃఖ వేదనను, ఇహలోక సుఖముల యందు మానవునకు గల మమకారమును దీనియందు ప్రధానముగా చిత్రించెను. ఇట్టి పద్ధతి స్మృతి రచనలయందు అరుదు.

జీవుడు ఎన్ని సుఖము లనుభవించు చున్నను తృప్తి చెందక మరింత సుఖమునకై యత్నించి, చివరకు నశించును. చరమదశయం దైనను మానవుడు దైవమును గుర్తింపనిచో తుమ్మెద జీవితము వంటి జీవితమని—

> 'కమల మరంద మానుచు సుఖంబుగ నుండెడు షట్పదంబు దు
> ర్భ్రమ గొని హేమపుష్ప రస వాంఛను దేలఁగఁ జేరి తత్పరా
> గము కనులందు రాల మృతిగాంచిన కైవడి నీద కాంక్షతో
> సమసెద వేలః మూఢమనసాః హరిపాదము లాశ్రయింపుమా !' (17)

అని ఈ పద్యమున వ్యక్త పరచెను.

అద్దమును మలినము, గర్భస్థ పిండమును మావి, అగ్నిని ధూమము కప్పివేయునట్లుగనే అజ్ఞానమున కలుగు కోరికలు జ్ఞానమును కప్పివేసి, మానవుని ప్రక్కదారి పట్టించును. కావున భక్తి, జ్ఞాన, వైరాగ్యముల నవలంబించి శ్రియఃపతి పాదారవిందముల సన్నిధికి చేరుటయే మానవ జన్మకు అంతిమోపాయ మని కవి తెల్పెను (48 వ పద్యము).

భార్యా వియోగ వేదనను కవితా రూపముగా వ్యక్తపరచి దాని యందు భగవద్వైశిష్ట్యమును వేదాంత రూపముగా వెల్లడించిన దీ కృతి. కవి దీనిని 1942 లో రచించినను ముద్రణ 1946 లో అయినది.

ఇప్పటి వరకు లభించిన మణింగంటి కవుల వివిధ శతకముల గూర్చి వివరింపబడినది. భక్తియే శతక రచనకు ప్రధాన మని విశ్వసించిన వీరు -

భక్తితో పాటు జ్ఞాన, వైరాగ్య, వేదాంత విషయముల తెల్పి, తమ నాడు ప్రచార మున గల వ్యావహారిక, అన్యభాషా పదములను స్వేచ్ఛగా ప్రయోగించి, వానికి ప్రామాణికత కల్పించినారు.

'శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే'-అనునదే వీరి శతక రచనో ద్దేశ్యము.

## సూచికలు

1. శతక సంపుటము I భా, xvi పుట
2. శతక వాఙ్మయ సర్వస్వము పీఠిక, xiii పుట
3. తిరునామములు - సమగ్ర పరిశీలన, 25, 26 పుటలు
4. ఈ విషయము 'తిరునామములు' ప్రకరణమున వివరింప బడినది.
5. దీనిలోని 1,2,3,6, 42 నెంబరు గల పద్యములు శతక కవుల చరిత్ర (393-395 పుటలు) యందు పేర్కొనబడినవి.
6. ఆక్కేపల్లి జగ్గకవి పంచీకరణ పద్య శతకము చంపూ పద్ధతి గలది. ఆంధ్ర శతక సాహిత్య వికాసము, 15 వ పుట.
7. తాళపత్ర ప్రతి డా॥ ఎమ్. రంగాచార్యుల వారి వద్ద లభించనది (నల్ల గొండ). వీరు దీనిని కనగల్లు నుండి తెచ్చిరి.
8. మరింగంటి పురుషోత్తమాచార్యుల వారు సంపాదించి యిచ్చిరి.
9. ముద్రణ 1922 ఇనుగుర్తి విజ్ఞాన ప్రచారిణీ ముద్రణాలయము. దీనితో పాటు జగన్నాథాచార్యుల వారి సంస్కృత రచనలును కలవు.
10. కేశవపట్నం నరసయ్య జీడికంటి రామ శతకము,' సింగంభట్టు నర సింహరాజు 'యాదగిరీశ స్తోత్ర శతకము,' గోవర్ధనం అళహ సింగరా చార్యుల 'భద్రాద్రి రామ శతకము'- అంత్యప్రాస నియమముతో గలవు.
11. గంగాపురమునకు కేశవపురము, మాయాపురము అని ప్రాచీన నామ ములు గలవు.
12. 'కేశవ స్వామి శతకము - పరిశీలన' భారతి, డిసెంబర్ 1966,

# 6

# హరికథలు

## హరికథ పరిచయము

పూర్వము నుండి మన సాహిత్యమును పరిశీలించినపుడు ప్రతి రాజాస్థానమునను విద్వత్సభలయందు పౌరాణికుడు కన్పడును. నన్నయ గారు నానా పురాణ విజ్ఞాన నిరతుడు.

పురాణమును ఒకరు చదువగా మరియొకరు అర్థమును చెప్పుదురు. లేదా ఒక్కడే చదివి అర్థము చెప్పును. ప్రాచీనమైన యీ పురాణ ప్రవచనము రాను రాను సంగీతమును జోడించి రాగ తాళ లయాన్వితముగా చెప్పుటచే పురాణ కథ హరికథ యైనది. దీనికి సహకార గానము (ప్రక్క వాద్యాలు),వక్తకు చిఱుతలు, తాళాలు వచ్చినవి. పురాణమునకు దీనికి ఇది యొక ముఖ్యమైన మార్పు.*1

నేడు మిక్కిలి వ్యాప్తిలో గలది హరికథా ప్రక్రియ. 'హరి' పదమునకు అనేకార్థము లున్నను 'విష్ణువు'అనునదే రూఢియైనది. ఇక-'కథ' కథ్ధాతు జన్యమైనది. నివేదించు, ప్రకటించు, ప్రదర్శించు, వర్ణించు అని దీనికి అర్థములు గలవు. 'కథ్యతే ఇతి కథా' పరమేశ్వరుని మాధుర్యైశ్వర్య లీలల చెప్పుట కథా పద్ధతి.

ప్రారంభమున హరి సంబంధ కథలకు మాత్రమే 'హరికథ' యని పేరు. రాను రాను శివ సంబంధ కథలను కూడ 'హరి కథ' యనుట పరిపాటియై, అన్ని కథలకు నిలయ మైనది.

హరికథా కథకులకు హరిదాసులు, భాగవతులు, భాగవతార్, భాగవతారిణి అని సామాన్య నామము లైనవి.

హరికథ మన సాహిత్యమునకే గాక మహారాష్ట్రీ కన్నడముల యందును కలదు. అప్పటు ఈ పదము పారిభాషికముగా గాక సామాన్యార్థముననే ఉపయోగింపబడినది.

'హరికథ' సాహిత్య పరముగా భాగవత, హరివంశాదులయందు కన్పడును. నారదుడు 'హరికథా' గానరసికుడు. ఇవన్నియు కేవలము విష్ణు కీర్తనము అను అర్థముననే కలవు గాని ఈ నాడు ప్రచారమున గల 'హరి కథలు' మాత్రము కావు.

తెనుగు నాట ఈ ప్రక్రియ క్రి. శ. 1880-88 సం॥ల మధ్య ప్రారంభమైనది. సుప్రసిద్ధులు ఆదిభట్ల నారాయణ దాసు గారు హరికథకులుగా గజ్జె కట్టినది 1883 వ సంవత్సరమునం దని తెలియుచున్నది.*2. విజయనగరమున కుప్పుస్వామి నాయుడు గారు హరికథను చెప్పగా, విని నారాయణదాసు గారు ధ్రువచరిత్ర హరికథను మొదట చెప్పిరట. దాసుగారికి ముందు హరికథ యున్నది.*3 కాని వీరా ప్రక్రియకు ప్రసిద్ధిని గూర్చి హరికథా పితామహులైనారు.

ప్రారంభ దశలో హరికథలను యక్షగానము లనియే వాడినారు. రెండును దేశీ శాఖకు చెందిన గేయ వాఙ్మయ రచనలు కావున మొదట యిట్లుండి తరువాత హరికథ లైనవి. అజ్ఞాత వారు, బాలాజీ దాసు, చేపూరి ఎరుకయ్య తమ హరికథా గ్రంథములను 'యక్షగానము' లనియే వాడిరి.*4

ఇట్టి హరికథల మూలము మహారాష్ట్ర దేశమని ఆచార్య ద్రోణప్ప గారు అభిప్రాయపడగా*5 ఇది మన నుండియే మహారాష్ట్రమునకు వెళ్ళినదని శ్రీ సీతారామాంజనేయ భాగవతార్ వ్రాసినారు.*6

నేడు హరికథ యనునది సార్వకాలికము, సార్వవర్ణికము, సకల కళా సమ్మేళన శ్రీకమైన కళ. వినోద కారకము, విశ్రాంతి జనకము, సంగీత నృత్య కళల సమ్మిశ్రమై ఉప కథలతో కూడుకొని పండిత పామరజన రంజకముగా వర్ధిల్లుచున్నది. ఈనాడిది యొక కళ, సాహితీ శాఖ.

హరికథకు భక్తితత్త్వము ముఖ్యము. 'శ్రవణం,కీర్తనం'ఇత్యాది నవ విధ భక్తులలో శ్రవణము, కీర్తనము, స్మరణము దీనియందు గలవు. ఆస్తిక్యమును

ధర్మాధర్మ ములను సర్వజన మనోరంజకముగా ప్రవచించుట ఎక్కువ విషయ మును స్వల్ప వ్యవధిలో చెప్పుట దీని ముఖోద్దేశ్యము.

యక్షగానములు, దాసరి భాగవతములు, చిరుతల రామాయణ కథలు, హరి కథలు విజ్ఞాన దాయకములైన దేశి రచనా ప్రక్రియలు. అక్షర జ్ఞాన శూన్యులైన వారి కివి విజ్ఞాన ప్రదాయకములు. ఒకనాడు విజ్ఞాన మనునది ప్రచార కళను ఆశ్రయించియే అభివృద్ధి నందినది. కాని పాతకాలం నాశ్రయించి కాదు. అందు వలననే బుఱ్ఱ కథలు, హరి కథలు, భాగోతాలు మొదలైనవి జానపదుల ఆద రాభిమానములు చూరగొనినవి.

తమిళ దేశమున శ్రీ వైష్ణవులు దేవాలయమునందు జరుపు భగవద్విష యమును కాలక్షేప మనిరి. సత్కథా విషయముగా కాలమును గడుపుట యని దీని యర్థము. ప్రారంభమున ద్రావిడ ప్రబంధ విషయమునకు ఈ పేరున్నను రానురాను భారత, భాగవత రామాయణాది విషయ ప్రవచనము కాలక్షేపమైనది. దీనికి దేవాలయములు రంగస్థలములు. ప్రజలను ఒకచోట చేర్చి, వారిని భక్తి భావ ప్రపూర్ణులుగా నొనర్చుటకు ధర్మ ప్రచారమునకు ఈ పద్ధతి బాగుగా ఉపకరించి నందువలన మారు మూలలలో నున్న సామాన్య ప్రజలకును ఇట్టి విషయముల తెలివిడి చేయుటకు హరికథా రూపమున ప్రచార మారంభ మైనది. దీనివలన భక్తి ముక్తి ముక్తులు సమకూడి ఉభయ దాయకమైనందున కొందరు స్వయముగా విష్ణు సంబంధ కథలను రచించి హరికథలను చెప్పగా, మరి కొందరు ఇతరులు రచించిన వానిని చెప్పుట పరిపాటి యైనది

ఆచార్య పురుషులు, కవులు, పండితులు విశిష్టాద్వైత మత ప్రచారమునకు హరికథను ఉపకరణముగా గ్రహించి కథా రచన మొనర్చిరి. మరింగంటి వారు 'కాలక్షేపము'ల ద్వారా ఎందరినో సద్భావనులుగా చేసినారు. వారు చెప్ప దలచిన విషయమును సామాన్య జన మధ్యమునకు తీసికొని వెళ్ళ దలచి సర్వ జనాదర పాత్రమైన హరికథల రూపముగా రచించి, స్వయముగా కథను చెప్పి, సంప్రదాయ ప్రచార మొనర్చిరి.

లభించిన వీరి మూడు హరికథలు 1930 తర్వాత రచింపబడి ప్రచారమున గలవు. వీనియందు రెండు పురాణ సంబంధమైనవి. మరి యొకటి రామాయణ కథ.

## శ్రీ సత్యనారాయణ వ్రతము

ఆస్తిక జనుల యందు బహుళ ప్రచారము గల వ్రతములలో సత్యనారాయణ వ్రతము ముఖ్యమైనది. శుభకార్య సందర్భమున పర్వ దినాదుల యందు దీని నాచరించుట పరిపాటి.

ఈ గ్రంథకర్తలైన వేంకట నరసింహాచార్యులు గారు (బదవ) సామాన్య జన పరిచిత మగు నీ కథను సర్వజన సుబోధకముగా హరికథా రూపమున 1938లో రచించి 1944వ సంవత్సరమున ముద్రిత మొనర్చిరి.

కృతి ప్రారంభమున ముద్రణ ద్రవ్య దాత దాండిగ నారాయణను (సూర్యాపేట) గూర్చి ఆశీః పూర్వక నామ గర్భిత సీసమాలిక, పది పద్యములలో ఆయన వంశ ప్రశస్తి నొసర్చి, సంప్రదాయము ప్రకారము ఇష్టదేవత, విష్వక్సేన భారతీ స్తుతులు, షణ్ణిద్దరాళ్వార్ల ప్రణుతి, కవి పండిత నమస్సులు కలవు.

వ్రతాచరణమునకు పురోహితుడు సత్యనారాయణ వ్రతములోని కథలను 5 గాని, 7 లేదా 9 వింటిని కాని వినిపించును (అధిక ప్రచారము 5 కథలకే). సమస్త కథలకు నిలయములైన పురాణములే వ్రత కథలకు ప్రసిద్ధి గాంచినవి. స్కాంద పురాణ రేవాఖండ ప్రథమాధ్యాయమున సత్యనారాయణ వ్రత కథ చెప్పబడినది.*7

ఈ గ్రంథకర్త తన కథలో ప్రసిద్ధమైన కాశీ బ్రాహ్మణుడు, కాష్ఠ విక్రేత, ఉల్కాముఖుడు, తుంగధ్వజుడు, వైశ్యుడు — వీరి కథలనే తెల్పెను.

హరికథ కావున రాగములు, తాళములు, దరువులు, కీర్తనలు మిక్కిలిగా రచింప బడినను, మధ్య మధ్య పద్యములు గలవు. వచన భాగ మధికము.

హరికథ కథా విషయమునసే గాక కథకుని బట్టియు ననాచార పాత్ర మగును. వీనియందు సామాన్యముగా భక్తి, జ్ఞాన, వైరాగ్య విషయములు ప్రవచింపబడును. కావున- ఆకర్షణమునకై మధ్య మధ్య పిట్ట కథలు చేర్తురు. వీని వలన శ్రోతకు హాస్యము గలిగి కథా విషయమున అనురక్తు డగును. మరి కొందరు వీనికి తోడు శృంగారమును చేర్చుదురు. ఈ గ్రంథకర్త శృంగార వర్ణనలు మాత్రము అధికముగా చేసినాడు.

సందర్భానుసారముగా సత్యనారాయణ స్వామి మహిమలు, వ్రతము నాచరించు వారికి కలుగు ఫలములను చక్కగా వివరించి, జనుల రోగబాధలు, కారాగార వాసము - వీనిని వర్ణించునప్పుడు సాంఘిక చిత్రణ మొనర్చినాడు. ఇది తననాటి సంఘములో గల వ్యవస్థ అనవచ్చును.

గ్రంథమున తాను కూర్చిన రాగములను, వానికి తగిన గేయములను రచించి ప్రతి పాట చివర గేయ రాగ నామములు వచ్చునట్లు రచించెను. దేవ మహిమను వర్ణించు నప్పుడు గల సీసము రాగమాలిక ఇట్లున్నది:

'పతిత పావనుడైన పరమేశ్వరుని పూజ
లొనరించి తత్కథన్ మనసు 'నాట'
నాలించి తనవార లందరు గొలువంగ
మోదంబుతో కేల బూని 'సురట'
విసరుచు వికసిత విరుల నెత్తావిచే
మీరెడునా 'మలయ మారుతమును'
హరికి ప్రీతిని గూర్చి బరగినదో బాల
రయమున గలుగు 'శ్రీరాగ' మహిమ
పూర్ణముగ నిచ్చి యేలు నా 'మోహ'నాంగు
డమిత సంతోషమును చెందు టిదియె బాగు
నీదు 'భాగేశ్వరి'ని గూడి నెమ్మి మీర
'శ్యామ' సుందరు వ్రతమును జరుపు మనిస' (21 వ పుట)

దీనియందు - నాట, సురట, మలయమారుతము, శ్రీరాగము, మోహన, బాగేశ్వరి - శ్యామ - అను రాగములు తెల్పబడినవి.

చతురవచో నిధియైన గ్రంథకర్త - రాగతాళ లయాన్వితముగా పురాణ ప్రవచన మొనర్చుచు రసోచిత సన్నివేశముల వివరించి ఎందరి మన్ననలకో పాత్రుడైన అనుభవము సత్యనారాయణ వ్రతకథను హరికథగా రచించి చెప్పించినది.

## 2. మందోదరీ వివాహము :

కల్వకుర్తి తాలూకా రఘుపతిపేట నివాసి నరసింహాచార్యులు ఈ కృతిని రామగిరి (కల్వకుర్తి) శ్రీరామచంద్రస్వామి కంకిత మొసర్చెను.*8

దీనియందు తోహర, గీతములు, కీర్తనలు ఎక్కువగా నుండి 6 చంపకములు, 8 కందములు, 10 కందార్థములు చెప్పబడినవి.

దీనిలోని విషయము: రావణుడొకమారు భయంకర తపమొనర్చుచుండగా దేవతలు వెరచి శివునకు మొర పెట్టుకొందురు. శివుడు దశాననుని వద్దకు వెళ్ళి 'నీకోరికల తీర్తును, తపస్సు విరమించవలసిన'దని యనగా నందుకు రావణుడు 'పార్వతిని నా కొసంగు' మని యడుగును. దానికి గరళకంఠు డంగీకరించి పార్వతి నప్పగించగా ఆమెను విమానమందుంచుకొని దశాననుడు వెళ్లుచుండును. దీనిని గమనించిన విష్ణుమూర్తి వృద్ధుని వేషమున వచ్చి రావణునితో 'ఈమె పార్వతి కాదు, నీవు మోసగింపబడితివి' అని చెప్పును. దానిని వినిన రాక్షసపతి నిజ మనుకొని యామెను మేరుగిరి కందరములో దాచి, శిల నడ్డముగా వేసి శివునితో కలహించుటకు బయలుదేరును. ఇంతలో విష్ణుమూర్తి అంతఃపురమున నిద్రించుచున్న మందోదరిని తెచ్చి గుహలో నుంచి పార్వతిని గైకొని వెడలి రావణుడు చూచుచుండగనే శివునకు అప్పగించును. ప్రమథ నాథుని వద్ద పార్వతి లభించనందున వృద్ధుడే మోసగించినాడని రావణుడు క్రుద్ధుడై బయలుదేరి వచ్చి గుహలో నున్న స్త్రీయే పార్వతి యని నమ్మి ఆమెను గ్రహించి పుష్పకమున బయలుదేరి పోవుచుండును. ఆకాశ గమను డైన దశముఖుని వాలి గమనించి 'ఇది లేమి' అని యడుగగా రావణు డతనిని నిందించును. వాల బలముచే

పుష్పకమును క్రిందికి పడవేసిన వాలి రావణునితో యుద్ధము చేసి మూర్ఛిల్ల చేయును.

పుష్పకమునం దున్న యంగనను బలాత్కరించి వాలి సంభోగింపగా ఆ సమయమున జనించిన వాడే అంగదుడు. మూర్ఛనుండి తేరుకొనిన రావణుడు ఈ విషయమును గమనింపక మండోదరిని తీసికొని లంకా నగరమునకు వెళ్ళి, పార్వతిని తెచ్చినా నని సభాసదులకు తెల్పుచుండగా నారదుడు ప్రవేశించి జరి గిన విషయముల వివరించి 'మాహేశ్వరిని తెచ్చుట నీ కసాధ్యము, విష్ణుమాయను ఛేదించ అశక్తుడ' వని పల్కి అంతర్ధానమగును.

రావణుడు పశ్చాత్తాపము చెంది పురోహితుడైన చౌక్కలునితో సంప్రతించి, ఒక సుముహూర్తమున మండోదరిని వివాహ మాడును.

కవి కల్పిత కథకు ప్రాణము పోసి జానపదులకు చమత్కారమును కలిగించుటకై దీనిని చెప్పినాడు.

దశాననుడు పార్వతిని వాంఛించినట్లు గ్రంథ స్థాధారములు లేవు అంగదుడు మండోదరికి వాలివలన గూఢముగా కలిగినా డని యొక ప్రతీతి*[9]. రావణుడు మొదట వివాహ మాడిన మండోదరినే మరల వివాహ మాడుటకు గల కారణమును కవి తెల్పలేదు. విష్ణు మహిమా ప్రభావమును వెల్లడించుటకే యిట్టి కథ చెప్పబడినదని భావింపవచ్చును.

కవి తనకు పరిచితమైన ఉర్దూ భాషను—

తోహార : "అదాబ్బందెగీ రావణాసురా హరిహాయ జీత సవ్వాబ్
ఖుదా తుంకు దౌలత్ దేవే మాఖూలు తేరె రువ్వాబ్"

అని నవాబుల పద్ధతి స్వాగతమును రావణునకు పలికించెను. గుహయందున్న మండోదరిని దశగళుడు చూచి—

'సరసమౌ మెఱుపు తీఁగెను సానబట్టి
నట్టి చూర్ణంబు క్షీరాబ్ధి నమరు మిసిమి
గూర్చి యమృతంబు చిలికించి కొమరు మిగుల
గాఁచి నిర్మించవచ్చు నీ కలికి సఖుడు!'

లని భావించిన ఈ పద్యము - మనుచరిత్ర (1-36) లోని 'నేరచేటి యసల్ దెచ్చి నీరజాప్త......' అను పద్యమును స్ఫురింప చేయును.

కవి గ్రంథాంతమున రామగిరి స్వామి పేర మంగళ హారతిని చెప్పి - తరువాత తనను గూర్చి యిట్లు తెల్పుకొనెను :

> తోహర : "వర మరిగంటి వంశ సంభవుడు నారసింహ ధీవరుడూ
> ఇరవుగ శ్రీరా మార్పణంబుగా నీ కృతి నిచ్చెను ఘనుడూ!"

## 3. శ్రీ వేంకటాచల మాహాత్మ్యము:

వరాహ - బ్రహ్మాండ - భవిష్యదాది పురాణములలో శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యము సువిపర్ణితమై యున్నది. తెనుగు కవులు వానినుండి కొన్ని కథల గ్రహించి స్వకపోల కల్పనలచే పద్య, గద్య, గేయ, నాటకాది రూపములుగా రచించిరి.

క్రీ.శ. 1948 వరకు (సుమారు) కల్వకుర్తి తాలూకా రఘుపతి పేటలో నున్న రాఘవాచార్య లను కవి ఏకాశ్వాస పరిమితముగా శ్రీ వేంకటాచల మాహాత్మ్యమును రచించి శేషాచల పతికే అంకిత మొసంగెను. దీనియందు తోహరలు, కీర్తనలు, కందములు, కందార్థములు, సీస - గీతములు, 8 చంపకోత్పల ములు గలవు. వచన రచన అధికము. కృత్యాదిని లక్ష్మి విష్ణు స్తుతులు, శ్రీ వేంకటేశ్వర ప్రార్థన చేయబడినది. నైమిశారణ్య వర్ణనతో హరికథ ప్రారంభ మగును. చివరిలో కవి తనను గూర్చి ఒక పద్యమును, భగవ దంకితముగా మంగళ హారతిని రచించినాడు.

దీనిలోని కథ : సూతుడు శ్రీ వేంకటాచల మాహాత్మ్యమును మునులకు వివరించును. పూర్వము వేంకటాచల ప్రాంతమున బ్రహ్మ ప్రళయమున హరి శ్వేత వరాహరూపియై హిరణ్యాక్షుని సంహరించి, లోకసంరక్షణార్థము వరాహ స్వామిగా వెలయును. హరి యనుమతిని గరుత్మంతుడు క్రీడాశైలమును తెచ్చి ప్రతిష్ఠింపగా బ్రహ్మేంద్రాది దేవతలు సంతసించి, అచటి పుష్కరిణీ ప్రభావ మును గొనియాడి ఆ పర్వతమునకు శ్రీ వేంకటాచల నామ మొసగిరి.

లక్ష్మీ శ్రీహరులు అనేకములగు తమ మహిమల చూపుచు ఒకనాడు బ్రాహ్మణుల భక్తి శ్రద్ధల పరీక్షింపదలచి విట వేషములతో వారి యాగశాలను ప్రవేశింతురు. వారి భక్తి భావమునకు ముగ్ధులై ప్రత్యక్షమైన లక్ష్మీ, విష్ణువులు వాంఛితముల దీర్చి బయలుదేరుటకు ముందు వారికి తిరుమలలోని కుమారధార, ఇతర తీర్థ మహిమల తెల్పుదురు. పిని తరువాత కంభీణి మహారాజు కథ, ఆత్మారాము డను బ్రాహ్మణుని వృత్తాంతము, మరల కపిల తీర్థోత్పత్తి, సప్తసర తీర్థమహిమలు వర్ణింపబడినవి. తీర్థయాత్రాగత విప్రునకు స్వామి స్వప్నమున ప్రత్యక్షమై కోరికల దీర్చుట, ఒక సంవత్సరము పాండవులు శ్రీ వేంకటాచలమున నివసించుట, శ్రీరామచంద్రుడు ఒక్క దివసము వసించుట తెల్పబడెను. శ్రీరాముని నివాస సందర్భముగా శ్రీరామాయణ కథను సంక్షేపముగా చెప్పినాడు. కపులకు పరమపద నాథుడు ప్రత్యక్షమై ఉపదేశము నొసంగి వారి నందరిని పరమపద గుహయం దుంచును "హరి లీలలు లెక్కింపరానివి, లెక్కింపరా"ని" వని చివరలో తెల్పబడెను.

కవి దీనిని 'ప్రథమాశ్వాసము సమాప్తము' అని ముగించినాడు. కథా కథనము బాగున్నది. ముఖ్యపాత్రల ద్వారా కీర్తనల చెప్పించి, చిన్న పాత్రల ద్వారా వచనము చెప్పించెను. మధ్య మధ్య 'తరువాతి కథను శ్రద్ధగా వినుడి' వంటి వచనములు కలవు. ఇది చిరుతల రామాయణ పద్ధతి. శ్రోతలను తనవైపు ఆకర్షించుకొనుటకు ఒక ఉపాయము. ఇది యక్షగాన రూప హరికథా రచనము.

కవి యీ గ్రంథమున పలుదోట్ల మహబూబ్ నగరం జిల్లా మాండలికము లను, వ్యావహారిక భాషా రూపములను ప్రయోగించినాడు. యాగశాల చేరిన విష్ణు దంపతుల వర్ణన :

> 'ఘన రత్నంబులు చెక్క చెక్క మన బంగారంపు శాల్వొల్లె వా
> టొనరన్ శ్రీకర గంధము న్నలది తాంబూలంబు వక్త్రంబునన్
> దనరన్ బంగరు నంచు దోవతియు చందం బొప్పగా కట్టి శ్రీ
> వనితా రత్నము చేయి బట్టి సవమోాటంబు కేగన్ మునుల్'

(శాలువ వల్లెవాటు = శాల్వొల్లెవాటు. సవనవాటి = సవమోాటము.)

గ్రంథాంతమున తన పరిచయమును సీసమాలికలో తెల్పి 'భాగవత పరమాణుపు రాఘవాచార్యుడు రచించిన హరికథ సమాప్తం అయింది'-అని వ్రాసికొనెను.

## సూచికలు :

1. తెలుగు హరికథా సర్వస్వం, పు-16
2. నా యెఱుక, పు-1, 2
3. "మొదటి హరికథ మునిపల్లె సుబ్రహ్మణ్య కవి గారు 1760 వ సంవత్సరమున రచించిన అధ్యాత్మ రామాయణమని చెప్పవచ్చును." ఆంధ్ర హరికథా వాఙ్మయము, పు-1
4. తెలుగు హరికథా సర్వస్వం, పు-99
5. ,, ,, ,, పు-105
6. ఆంధ్ర హరికథా వాఙ్మయము, పు-29
7. శ్రీ సత్యనారాయణ వ్రతము, 1989వ సం.ము, చందా నారాయణ శ్రేష్ఠి ముద్రణ.
8. 'నోట్‌బుక్' సైజు ఎర్ర కాగితాలపై కవిగారు లిఖించిన ప్రతి - కపిల వాయి లింగమూర్తిగారి ద్వారా లభించినది.
9. ఆంధ్ర హరికథా వాఙ్మయము, పు-12-69, తెలుగు హరికథా సర్వస్వం, పు-99.

# 7

# లఘు కృతులు

సంఖ్యా నిబద్ధ రచనలు క్షుద్ర కావ్యము లని లాక్షణికులు తెల్పిరి. ఈ ప్రకరణములోని 'తారావళులు'*[1] సంఖ్యా నిబద్ధములు. వీనితో పాటు వివిధ విషయ యుక్తములైన చిన్న చిన్న రచనలు ఇట్లు వర్గీకరింపబడినవి :

## 1. స్తోత్రాత్మకములు :

1. జీడికంటి శ్రీరామ పాద వైభవము.
2. క్షమా వింశతి.
3. శ్రీ యాదగిరి లక్ష్మీ నృసింహ తారా మాల.
4. శ్రీరంగాపుర సత్యదేవ స్తోత్ర తారావళి.
5. ఉర్లుగొండ లక్ష్మీనృసింహ స్తోత్ర తారావళి.
6. భజన రత్నావళి.
7. హనుమ న్నుతి.

## 2. కథాత్మకములు :

1. శబరి సపర్య.
2. శ్రీ గోదాదేవి.

## 3. స్మృత్యాత్మకములు :

1. శ్రీ రాజా రాఘవరాజు రంగరాజు స్మృతి.
2. కాణికవి కన్నీటి ధార.

ఈ ప్రకరణమున వీని పరిశీలన గలదు.

# 1. స్తోత్రాత్మకములు

## 1. జీడికంటి శ్రీరామ పాద వైభవము :

అప్పల దేశికుల వారు నరసింహాపురమునకు రాక పూర్వము 'సిరి కొండ'లో నివసించుచు మధ్య మధ్య జీడికంటికి వెళ్ళి శ్రీరామ సన్నిధిని 'కాలక్షేపము' చేయువారు. ఒకనాటి రాత్రి దేశికుల వారికి లక్ష్మణ యుక్తుడైన స్వామి దర్శన మిచ్చి నరసింహాపురమునందు తన పాద ముద్రలు గల చోట దేవాలయ నిర్మాణమును చేపట్టవలసినదని ఆదేశించిరి.

నిద్రనుండి మేల్కాంచిన దేశికుల వారు అశ్వారూఢులై బయలుదేర, ముందు బాట చూపుచు ధనుర్బాణముల ధరించి శ్రీరామ లక్ష్మణులు వెళ్ళుచుండిరి. వారి చిరు గజ్జెల సవ్వడి - ముందు కన్పడు వెలుతురు నందు దేశికుల వారి ప్రయాణము సాగి, స్వల్ప కాలములోనే స్వామివారు చెప్పిన పాద ముద్రలు గల స్థలమునకు రాగా రామలక్ష్మణులు మాయమైనారు.

ఇంతలో తెల్లవారినది. భీకరారణ్య మధ్యమున ఒక శిలపై శ్రీరామ పాద ముద్రలు కన్పడినవి (అవియే నేడు నరసింహాపుర దేవాలయమున గలవు). దేశికుల వారు ఆనంద భరితులైనారు.

ఆ కాలమున ఇది భీకారణ్యము. నడిగూడెం జమీను. అడవిని నరికించి దేవాలయ నిర్మాణ మొనర్చుటకు జమీందారు అనుమతి యవసరమైనది. అప్పటి పాలకులైన కీసర నరసింహారాయలకు దేశికుల వారు జరిగిన విషయమును వివరించి దేవాలయ నిర్మాణమునకు నరసింహరాయలను ప్రోత్సహించగా, ఆయన అందు కంగీకరించి ఆ ప్రాంతము నంతయు దేశికుల వారికి అగ్రహారముగా నొసంగి దేవాలయ నిర్మాణమునకు తోడ్పడెను. వీరి పేరనే 'నరసింహాపురము' ఏర్పాటైనదని ప్రతీతి. దేశికుల అగ్రజులు నరసింహ దేశికులు. వారి పేరు, భూదాత పేరు రెండును కలియునట్లు కూడా గ్రామనామమేర్పడిన దందురు.

జీడికంటి నుండి బయలుదేరిన దేశికుల వారు శ్రీరామ పాదముల గూర్చి చెప్పినది :

'జీడికంటి స్వామి పాదాములూ - మమ్ము
చూడాగ వచ్చిన పాదాములూ
చేడియతో నారసింహ పురంబున
నాడాగ వచ్చిన పాదాములూ-
జీడికంటి స్వామి పాదాములూ-మమ్ము...'

'ముని వెంట నేగిన పాదాములూ - గౌత
ముని సతినీ గాచిన దివ్య పాదాములూ
హరు విల్లు విరచాగ నరిగిన పాదాములూ
జనకు దర్శించంగ చెలగీన పాదాములూ - జానాకి
మునుమున్నె కనుగొని మురిసిన పాదాములూ
గజ సింహ వృషభాది గతులూ జొప్పించంగ
ప్రజలెల్ల మోహించు పాదాములూ- జీడికంటి స్వామి......'

మృగము వెన్నాడిన పాదాములూ - శాఖా
మృగముల పాడీన పాదాములూ
సెగ మించ రావాణ చింతలతో లంక
దిగులొంద నడచిన పాదాములూ జీడికంటి స్వామి......

జయమూతో గూడిన పాదాములూ - సింహా
సన మెక్కి మురిసిన పాదాములూ
నయ నమ్రు సామంత రంజిత మణి మౌళి
జయ రంజితములైనా పాదాములూ జీడికంటి స్వామి......

అరుణాబ్జముల బోలు పాదాములూ - నిరత
మమృతమూ లూరూ శ్రీపాదాములూ
తరు గుల్మ లతలాకు భువి దుఃఖమునూ బాపి
పరగాతి నిచ్చిన పాదాములూ జీడికంటి స్వామి......

కులదైవ మైనా శ్రీపాదాములూ - దోష
ముల జూచి విడువనీ పాదాములూ
అల శేషగిరి శరహరి నారాహరి దేశి
కులా నెడ బాయనీ పాదాములూ
జీడికంటి స్వామి పాదాములూ - మమ్ము చూడాగ వచ్చిన పాదాములూ.
పఠనానుకూలముగా నుండునట్లు వ్రాసి పెట్టబడిన దీనినట్లే యుంచితిని.

తన సర్వస్వము శ్రీరామచంద్రుడే యని విశ్వసించిన అప్పల దేశికుల వారు సంస్కృతమున శ్రీరామ పాదస్తుతిని చెప్పి గేయ రూపమున దీనిని చెప్పి, తమకు గల భక్తి ప్రపత్తుల వెల్లడించిరి.

(ఇది మానుకోటలో మణింగంటి కృష్ణమాచార్యుల వారి వద్ద లభించినది.)

## 2. క్షమా వింశతి :

వేంకట రాఘవాచార్యుల వారు తమ కేశవ స్వామి శతకము చివర 'మనకే మన కేశవ సేవ చేయుమా! అను మకుటమున 20 చంపకోత్పలములలో విష్ణుస్తుతి చేసిన దీకృతి.

సంస్కృతమున పరాశర భట్టరు వారి 'క్షమా షోడశి' కలదు. ఆచార్యుల వారు దానికి వలెనే తమ రచనకు పేరు పెట్టినారు. (వారిది 'షోడశి', వీరిది 'వింశతి') నామ సామ్యమే గాని 'షోడశి' శ్లోకానుసరణము దీనియందు లేదు. రెండును హరినామ స్తుతి కృతులు.

'క్షమా వింశతి' ప్రారంభ పద్యములలో లక్ష్మి-శేష-విష్వక్సేన - శంఖ చక్ర స్తుతుల యనంతరము కవి తమ గురువుగారిని—

'వినుతికి పాత్రమౌ నుభయ వేద సమర్థ సమగ్ర భావ బో
ధన పటిమా ప్రభుత్వ దశ దాసుల నేలఁగ తా మహిం జనిం
చిన గతి శ్రీనివాస గురు శేఖర రూపము దాల్చె చిత్తమా!
కినుక యొకింత లేదు మనకే మన కేశవ సేవ చేయుమా!'

అని శ్రీనివాస గురుశేఖరులు భూమిపై జనించిన అవతారరూప మని వారి విద్యా వైభవాదుల తెల్పినారు. కేశవ స్వామి శతకమున 'శ్రీవాస గురుపాద సేవకుండు' అని వీరినే పేర్కొనెను.

మిగిలిన పద్యములయందు విష్ణువు దశావతారముల దాల్చి, ఆ యా అవతారములలో నొనర్చిన కార్యములను పేర్కొనుచు - స్వామిని క్షమా యాచన మొనర్చిరి. కావుననే 'క్షమా వింశతి' యనినారు. భక్తునకు భగవంతుని చేర దలచినపుడు క్షమ (ఓర్పు) ముఖ్యము. విశిష్టాద్వైతమున మోక్షేచ్ఛా రతునకు కావలసినది క్షమా గుణము. అది ఆచార్య పరిచర్య వలననే లభించును. దైవ సాన్నిధ్యమున చేసిన కాయిక, మానసిక దోషములను భగవత్స్వరూపులైన ఆచార్యులు (గురువు) క్షమా పద్ధతిని మన్నింప గలరు. అందు వలననే పరిచర్యా రూపముగ తమ ఆచార్యులను ప్రారంభమున నుతించి, దైవముతో పాటు గురువును 'క్షమా యాచన' మొనరించినారు.

కేశవ స్వామి శతకమున 'పాపిష్ఠి నరుల వెంబడి బడి యాచించి-యాశచే నరనార్థినై చరించి' (101) ఇత్యాది పద్యమున వ్యక్తీకరించిన భావమునే దీనియందు -

> 'కాలం మతిక్రమించె, నిజ కాయ మపాయము చెందె, సత్య ధ
> ర్మాలయ భావ వృత్తి జనమా విలయించె, నధూర్జనైక దు
> శ్శీల మనుష్య కోటి విలసించె, నిజం బిది నేడు చిత్తమా!
> యేలిక యాత డింక మనకే.........' (10)

అని ఆత్మ వేదనను వ్యక్తపరచిరి.

దయాంబురాశి యైన వాసుదేవుని రూప వైభవమును -

> 'శ్రీ యను పేరిటాలు, రిపుజిత్కరమౌ సుడివాలు, హోమ రూ
> పాయత మైన కాలు, భువనావళి యాతని మాలు, వాసుదే
> వా! యని కొల్వచేయగను వశ్యము నయ్యెడు చిత్తమా! జగ
> ద్గేయ దయాంబురాశి మనకే.........' (13)

అని తెల్పి, ఈ క్రింది పద్యములో భక్తున కుండవలసిన ముఖ్యలక్షణముల పేర్కొని, 'మనః క్రీడ నొనర్పువాడు హరి'-అతనినుండి మన మనస్సు తొలగ రాదు అని ఉపదేశాత్మకముగా నిట్లు ప్రబోధించుచున్నారు :

'ఆగ కసత్యముల్ హరి పదాంబుజ చింతనజేయు మాత్మలో
నొడకు ముక్తిమార్గ విహితోపచిత క్రియలెల్ల కాలమున్
విడకు వొట్టకై పరుల వేడకు మాడకు చిత్తమా! మనః
క్రీడ నొనర్పువాడు మనకే..............' (15)

సర్వ వ్యాపియైన విష్ణువు వివిధ రూపములలో వివిధ స్థలముల యందు వెలసినాడు. అట్టి స్వామిని కవి యిట్లు భావించెను :

'విందు ఘటించె నీలగిరి, విశ్రుత సింహ మహీధరంబునన్
గంధ మలంకరించుకొని గైకొనె దాహము మంగళాద్రిలం
బందు, వృషాద్రిపై దొరతనం బొనరించుట చిత్తమా! యిదే
క్రిందటి మేలుగాదె మనకే మన కేశవసేవ చేయుమా!' 20

ఇరువది పద్యముల ఈ లఘుకృతి ప్రతిపద్య రమణీయమైన అలఘు కృతి!

## 3. శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహ స్తోత్ర తారామాల :

'యాదగిరి వాసా! భక్త చింతామణీ!' - యను మకుటముగ 14 శార్దూలములు, 14 మత్తేభములు గల యీ కృతిని రంగ కృష్ణమాచార్యులుగారు 1950 కి పూర్వము రచించిరి. (వసు.రాయకవి 'భక్తచింతామణి' శతకము ప్రసిద్ధము). కవికి ఎవరో చేసిన క్షుద్రమంత్రముల వలన అనారోగ్యము కలుగగా బాధపడుచు తమ యిష్టదైవమైన యాదగిరి నృసింహస్వామి సన్నిధికి వెళ్ళి మండల దీక్ష వహించి ప్రదక్షిణాదుల వలన ఆరోగ్యవంతులైనారు. ఆ సమయములో చెప్పినవి ఈ పద్యములు. వీనిని తమ 'భజన రత్నావళి' చివరలో వ్రాసిపెట్టు కొనినారు.

కవి తన శరీర బాధా కారణమును గూర్చి నృసింహస్వామితో -

'పగవా రోర్వక దుష్ప్రయోగము లొనర్పం, జాల కష్టంబుబున్
నగుబా టొందఁగ దుష్ట మంత్రముల నన్యాయంబులన్ ద్రోయఁగా
వగ చింటుండక చేరి నీ స్మరణ సేవల్ చేయఁగా పాడదే
సగతిన్ శ్రీ నరసింహ యాదగిరి వాసా! భక్త చింతామణీ!'

అని మొర పెట్టుకొనెను. నృసింహ స్వామిని నమ్మిన ఆచార్యులవారు ఆరోగ్య వంతులై -

> 'క్షేమం బయ్యెను నా మదిం గల చెడల్ క్షీణించె వి్రాంతికిన్
> ధామం బయ్యె రమా మనోహరఁ! నీ ధ్యానంబె వర్ధిల్లె స్వ
> గ్రామం బాత్మను గోరె భక్తి యనురాగం బయ్యు బో; ద్రోలె దు
> ష్కామంబుల్ నరసింహ!. యాదగిరి వాసా! భక్త చింతామణీ!'

అని విన్నవించుకొని తమ స్వగ్రామ మగు రంగాపురమున కరిగినారు. నక్షత్ర మాలికా పరిమిత మైన దీనియందు దశావతారముల నొకే పద్యమున నిట్లు వర్ణించిరి:

> 'హరి! మ మీనము కూర్మ మ్ముక్కిటి నృసింహాకారమున్ వామనా
> దరణన్ భార్గవ రాముడై తపల గాదా రామ భూపాలు వీ
> కరణిన్ కృష్ణ సమాఖ్య బుద్ధ మనగా కల్కాఖ్య రూపంబు లీ
> సరణిన్ శ్రీ నరసింహ యాదగిరి వాసా! భక్త చింతామణీ!

కవి యొక పద్యమున తన పేరును తన గ్రామ నామమును తెలిపి కృతిని శాశ్వత మొనర్చు మనుచు స్వామి నిట్లు ప్రార్థించెను:

> 'మన నైజామున కంబకుర్తి పుర సీమం గల్గు నీ రంగపు
> ర్యను గ్రామస్థుఁడు రంగ కృష్ణకవి తా వ్రాసెన్ మహా భక్తి ప్రే
> మను జేకొమ్ము రమేశ! సంతతము క్షేమం బొప్ప నక్షత్ర మా
> లనుమానింపక నీవు నిద్ధరణితో నాచంద్రతారార్కమున్'

## 4. శ్రీరంగాపుర సత్యదేవ స్తోత్ర తారావళి :

విష్ణు మహిమాభివర్ణనాత్మకమైన యీ రచన శ్రీ రంగాపుర సత్య నారాయణ స్వామికి అంకితము చేయబడినది. 'ప్రథిత రంగాపురీ ధామ! భవ విరామ! సత్కృపానంద మయ భావ! సత్య దేవ!' అను మకుటమున సీస పద్యము లలో చెప్పిన దీనిని సత్యనారాయణ ఆలయ ధర్మకర్తలు అడవికొలను కామేశ్వరరావు గారు 1957 వ సంవత్సరమున ముద్రించిరి. వీరే ఏత ద్రచనకు ప్రేరకులు, కారకు లని కవి కృత్యాది యందు తెల్పుటయే గాక వీరి నామాక్షర ముల పద్యాదియం దుంచి 18 పద్యముల చెప్పెను.

ఇది 'రారావళి'. దీనిలోని విశేష మేమనగా ప్రతి పద్య ప్రారంభాక్షరము నక్షత్ర నామ ప్రారంభాక్షరముతో చెప్పబడుట. ఇట్లు 27 నక్షత్రముల ఆద్యక్షరములు 27 పద్యములలో వచ్చినవి.*2

ఉదా : నక్షత్రములలో 'కృత్తిక' కలదు దీని ఆద్యక్షరము 'కృ'.

'కృ'త యుగంబున లోకతతి లీల నెలకొల్పి'. (౮)

అని పద్యమును 'కృ'తో ప్రారంభించిరి. ఇట్లే మిగిలిన నక్షత్రములు. కృతి పోషకుని గూర్చి చెప్పిన పద్యములలోని మొదటి యక్షరముల కూర్చి చదివిన 'శ్రీమ దడవికొలను కామేశ్వర రావు గారికి స్వస్తి కలుగు గాత-' అని యగును. 'రావు' అనునది ఒకే సీసమున ('రా' సీసము నందు 'వు' గీతమున) చెప్పబడెను 'వు'తో పద్యాది లేక పోవుట వలన నిట్లు చేయబడి 'బాంధ 'వు'లును' అని సీసము చివర గీత పద్యారంభము 'వు'తో కలదు.

ఈ పుస్తకమున భారత, భాగవత, రామాయణ కథలను పేర్కొని అన్నింటికి నీవే కారకుడవు 'మా యందరకును నీవే దిక్కు'అని సవినయముగా ప్రార్థించుట కవి ముఖ్యోద్దేశ్యము చివరి పద్యమున సత్యనారాయణ వ్రతకథా మహాత్త్వమును చెప్పి ఈ పూజ చేసిన కాశీ బ్రాహ్మణుడు, కాష్ఠ విక్రేత, ఉల్కా-ముఖుడు, వర్తకుడు, తుంగధ్వజుడు - తమ వాంఛితముల నెట్లు ఫలింపచేసి కొనిరో తెల్పబడినది.

'పుడమి దేహము నీటి బుడగ చందంబని
పెంపొందు మదిని గుర్తింప నైతి
ఆలు పిల్లలు భృత్యు లాప్తులు బంధుగు
లస్థిరులై బాయు టరయ నైతి
ధన ధాన్యములు వస్తుతతి భోగ భాగ్యముల్
చంచలంబు లటంచు నెంచనైతి
దుర్జన సహవాస సౌహృదమున్ జెంద
సర్వేశ! నిను గొల్వ జాలనైతి

ఇట్టి పాపిని నన్నెట్లు చెట్టబట్టి
కరుణ రక్షింప నెంతువో పరమ పురుష!
ప్రథిత రంగాపురీ ధామ! భవ విరామ!
సత్కృపానంద మయ భావ! సత్యదేవ!' (11)

అని - కవి తన ఆత్మ పరివేదనను వ్యక్తీకరించెను. ఇది 11 వ నెంబరు పద్యము. పద్యాద్యక్షరము 'పు'. 'పుబ్బ నక్షత్రము'ను సూచించును.

## 5. ఉర్లుగొండ లక్ష్మీ నృసింహ స్తోత్ర తారావళి :

సూర్యాపేట తాలూకా కరక్కాయలగూడెం సమీపమున 'ఉర్లుగొండ' గుహయందు వేంచేసి యున్న శ్రీ లక్ష్మీ నృసింహ స్వామిని గూర్చి చెప్పబడిన యీ నక్షత్ర మాలిక భక్తుల ధన సాహాయ్యమున ముద్రింప బడినది.

వేంకట నరసింహాచార్యుల (ఐదవ) 'తారావళి' రచనలలో నిది రెండవది. 1957 - 58 సంవత్సరముల మధ్య రచింపబడినది. సీస పద్య యుతమైన యీ నక్షత్ర మాలిక ప్రతి పద్య ప్రథమ చరణ ప్రారంభాక్షరము నక్షత్ర నామాద్యక్షరముగా గలదు. కవి యిందు 'నక్షత్ర మాలిక'లను సంఖ్యా ర్థము (27) చేయుటయే గాక కృతి నామ సార్థక్యము పాటించుటకై నక్షత్ర నామములను (27) తెలిపినాడు.

శతకమునకు వలె దీనిలోను 'భవ కలభ సింహ! దూరిత పంకి తాంహ! శ్రిత వరద రంహ! గళ దద్రి శ్రీ నృసింహ' అను మకుటము పాటింపబడినది. పద్యము లన్నియు ప్రౌఢ శైలిలో నుండి అప్పల దేశికుల వారి అర్వపల్లి నృసింహ స్తోత్రమును గుర్తింప చేయుచున్నవి. ఉర్లుగొండ నృసింహ స్వామిది ఉగ్ర రూపము. అందు కనుగుణముగా కవి దీని నిట్లు రచించినాడు.

ఉదా—

'ఉరు మదాంధీకృ తాసుర భంజనోద్రిక్త
భూత భయావహా శ్వేతవర్ణ!'

'పూర్వామర స్తోమ భుజ దండ నోద్దండ!
బల విక్రమోపేత బాహుదండ!'

## 6. భజన రత్నావళి :

తెలంగాణమున కీర్తన రూపమైన భజన సాహితిని రచించిన వారిలో రామదాస ప్రఖ్యాతుడైన కంచెర్ల గోపన్న ప్రథమ గణ్యుడు. ఇతని తరువాత తూము నరసింహ కవి, వడ్ల రామదాసు, ఏపూరు హనుమద్దాసు, రాకమచెర్ల వెంకటదాసు, మున్నంకొండ హనుమద్దాసు ప్రఖ్యాతులు. వీరి ప్రభావమువలన రంగ కృష్ణమాచార్యులు తన కవితా పాటవముతో నీ భజన రత్నావళిని చెప్పెను.

నేటికిని ప్రతి పుణ్య క్షేత్రమున, దైవ సన్నిధానమున భజన పరులు భక్తి ప్రపత్తులతో భజనల చేయుచు అనేక రకములైన కీర్తనలను రాగ తాళ లయాత్మకముగా గానము చేయుచు, వారు పరవశులై శ్రోతలైన భక్తులకర్ణ పుటముల కానందమును కలిగింతురు. ఈ కీర్తనలయందు భక్తి ముఖ్యము. దానికి తోడు జీవుడు యోగ మార్గానుగామి యనియు ఇహ లోక సుఖములు శాశ్వతము కావనియు, వానిని త్యజించి భగవంతుని శరణు జొచ్చుటయే మానవ జన్మకు పరమార్థమనియు చాటిచెప్పు తాత్త్విక కీర్తనములే అధికముగా నుండును. ఇవి మనసా! రామా! హరీ! దైవమా! జీవా! అను సంబోధనలతో కూడుకొని వేదాంత విషయములను సులభముగా వివరించును. విద్యా దూరులైన జానపదులను కీర్తన-భజన పద్ధతి అధికముగా ఆకర్షించును. అందువలననే వీని ప్రచారము పల్లెటూళ్ళయందు మిక్కిలిగా గలదు.

మహబూబ్ నగర్ జిల్లా రంగాపురం, కల్వకుర్తి, దేవరకొండ ప్రాంతములలో రంగకృష్ణమాచార్యుల భజన కీర్తనలు ప్రచారమున గలవు. వీనియందు కొన్ని మాత్రమే లిఖిత రూపముగా లభించినవి.

భజన రత్నావళి యందు 66 కీర్తనలున్నవి. ప్రతి కీర్తన చివర ఒక పద్యము చెప్పబడినది. కృత్యాదియందు ఇష్టదేవతా ప్రార్థనము, గణపతి, విష్ణు, విష్వక్సేన-గురు స్తుతులు చేయబడిన తర్వాత 8 కందములలో షష్ఠ్యంతములు చెప్పి, తన గురువును, తండ్రియునైన జగన్నాథాచార్యుల నుతించెను.

కృతి ప్రారంభమున-మహాత్మా గాంధీ భరతమాతకు ఆత్మ సంతృప్తికి కీర్తనలను చెప్పవలసినదిగా బాలబాలికలు కోరినట్లు తెల్పిన కవి దీనిని భారత

స్వాతంత్ర్య లబ్ధి కాలమున రచించి దైవభక్తి, దేశభక్తి పెనవేసికొనిన కృతిగా సిద్ధము చేసినాడు.

అముద్రితముగా నున్న యీ 'భజన రత్నావళి' యందు అనేక తాళము లతో కూడిన 66 కీర్తనలు, 33 కందములు, 3 శార్దూలములు, 4 మత్తేభములు, 5 చంపకములు, 26 ఉత్పలములు, 6 మత్తకోకిలలు, 1 సీసము, 1 తేటగీతి, 1 ఆటవెలది, నామ గర్భిత మంగళ మహాశ్రీ వృత్తాష్టకము, 1 లాలిపాట, 1 మంగళ హారతి (చివర) కలవు.

భజన పరులు కీర్తనలను గానము చేయునప్పుడు అవి రాగ తాళ లయా న్వితముగా సాగుచుండును. వరుసగా వీనిని చదువుట వలన కలుగు అలసట తగ్గుటకు - శైలిలో మార్పునకు మధ్య మధ్య పద్యములు రచింపబడును. ఈ పద్ధతిని రంగ కృష్ణమాచార్యులు కొనసాగించి ప్రతి కీర్తన చివర ఒక పద్య మును చెప్పెను.

భజన రత్నావళి కీర్తనలలో 5 తత్త్వ సంకీర్తనములు, పవళింపు కీర్తన, 1 లాలిపాట, 1 ఆంజనేయ స్తుతికీర్తన, 3 మంగళహారతులను చెప్పి, ఫల శ్రుతి, కవి పరిచయ పద్య గద్యములతో ముగింపబడినది.

దీనియందు కథాత్మకములైన రెండు పెద్ద కీర్తనలు గలవు. వానిలో రామకథ, విష్ణుస్తుతి కల యీ కీర్తన యొకటి—

'భువన పాలన రామ శ్రీకర భూషణా నుత భూషణా
ప్లవగరాట్‌హిత కార్య యింద్రజి భంజనాంబుధి బంధనా
అవనిజా హృదయాధిపా కరుణాక రాశ్రిత జీవనా
దివిజను స్తుత నామ నారద గాన మోహ జనార్దనా
భవ హరాద్భుత రాటకీ ముని బాధకీ తను నాశనా
సవన రక్షణ దక్ష గౌతమ సాధ్వి శాప విమోచనా
శివ శరాసన భంగ జానకి చిత్త రమ్య నిరంజనా
జవ కుఠార మహోగ్ర భార్గవ జన్మ గర్వ విదారణా

కమల నేత్ర యశో విశాల సుధాస్పదా రణ భీకరా
విమల మానస సత్య వాక్య వివేక ధర్మ గుణాదరా
క్రమత రావణ కంఠ ఖండన నామ కోటి తనుర్వరా
అమరనాథ ముఖ స్తుతాయ దశావతార పరాత్పరా
భుజగ తల్ప ఖగేశ వాహన భూసురార్భక దాయతా
అజ హరాది సుపూజితా యనిలాత్మజా పరిపాలకా
సుజన వందిత శూర సమ్మత సూరి సన్నుత పాదుకా
భుజ పరాక్రమ ధీర సంతత పూజితాఖిల తారకా
హరి ముకుంద రమేశ కేశవ యచ్యుతావ్యయ శ్రీకరా
మరువ నీ పద నీరజంబుల మాధవా నను బ్రోవరా!
నిరత భక్త కృపా సముద్రుడ నీకు మ్రొక్కెద వేగరా
ధరణి లోపల రంగ కృష్ణుని దైవ రాముడ వీవెరా'

(కవి దీనికి 'పంచ రత్న ధ్రువ కోకిలా వృత్తము' అని పేరు పెట్టి నాడు. 'తరళ' వృత్త లక్షణమే దీనికి సరిపడును (ఐదు 'తరళ'లు ఇందు గలవు) దేశీయ పద్ధతిలో సరి 2 మాత్రలు తక్కువ గల మిశ్ర గతి రగడ. అక్షర క్రమము (గురు లఘు పద్ధతి), మాత్రా సంఖ్య, అక్షర సంఖ్య దీనికి ప్రధానము.

ముక్తికి ప్రథమ సోపానము భక్తి యని చెప్పుచు అరిషడ్వర్గములను, పంచ వింశతి తత్త్వములను గూర్చి వివరించిన కీర్తన.

'ఎంతో వింత యయెన్ నా మన
సెంతో వింత యయెన్
స్వాంతమందు నా స్వామి గలండని
సంతతంబు గురుడంత వచించెన్ — పల్లవి

అండపిండ బ్రహ్మాండము లన్నియు
నిండియున్న దీ నిజ దేహంబను — ఎంతో...
భానుచంద్రులను బరగెడు నాడుల
స్థాన మధ్యమున స్థానము గాంచిన — ఎంతో...

కామ క్రోధ వికారము లుడిపిన
సామీప్యమునను సాదృశ్యముగను ఎంతో...
కాదనవల దీ కర్మకాండముం
బాధ జనక గురుబోధ నెరింగిన ఎంతో...
ఎంచగరాదీ విలేశ్వరమును
పంచి చూడవలె పంచవింశతిని ఎంతో...
ఇంత కింతకూ ఇది మేలనుచు
మంతనంబునను మరిగి సుఖింపగ ఎంతో...
ఆత్మానందం బది పరిపూర్ణం
నిత్యానందం నిజ ఘనకుందం ఎంతో...
గణనాతీతం కరుణోపేతం
గుణి శ్రీ నాయకు కోరి నులింతం ఎంతో...
ధరణిని రంగ కృష్ణ దాసావరణం
సుర నర మౌనీశ్వర జన తరణం' ఎంతో...

దీని తర్వాత ఒక తేటగీతి—

మనస! నీ వింత కాలంబు మఱచి యుండి
యేల దురవస్థ జెందెదు చాల భువిని
ముక్తి కిరవైన మార్గంబు బుద్ధి నిలిపి
చూడుమా భక్తి గురు శక్తి తోడు బెట్టి'

ఇట్లు తెనుగున చెప్పిన విధముగనే సంస్కృతమునందును గేయ రూపముగా కొన్ని కీర్తనలు చెప్పబడినవి.

ప్రజల మనస్సులయందు ప్రగాఢ ముద్ర వేయునట్టిది గేయ కీర్తన సాహిత్యము కవి వీనిని చెప్పి, తన జీవిత కాలమున వీని ప్రచారమును, ఆదరమును అనుభవించినాడు.

గ్రంథాంతమున తనను గూర్చి-

'ఇల లోపల మునిగంటన్
కుల మందుల రంగ కృష్ణ గురు నామమునన్
వెలసిలి, రంగపురంబున
గల శ్రీహరి నన్ను బ్రోవ కరుణాపరుడై'

అని తెల్పి ప్రబంధమును పరి గర్వతో ముగించెను.

## 7. హనుమ న్నుతి :

విశాఖపట్టణం జిల్లా భీముని పట్టణము (భీమపురము) లో నున్న పంచ ముఖీ హనుమంతుని స్తుతి గల యీ కృతిని శ్రీమాన్ లక్ష్మణాచార్యులు 99 చంపకోత్పలములలో రచించిరి.

తారక బ్రహ్మోపాసకు డైన హనుమంతుడు భగవత్ స్వరూపుడు; సకల భువన స్తవనీయ మూర్తి. రస రసస్య భక్తిచే శ్రీరామచంద్ర సేవా భాగ్యమును బొందిన మహా భక్త శిఖామణి. అట్టి హనుమానుని పరాక్రమాదులను, స్వామి (రామ) భక్తిని దీనియందు వర్ణించుటతో పాటు కవి మధ్యమధ్య శ్రీరామాయణ కథను చెప్పెను.

లక్ష్మణాచార్యులు పోతన భాగవత పద్యశైలిని - ముఖ్యముగా అంత్య ప్రాస పద్ధతిని - దీనియందు ఎక్కువగా అనుకరించెను. కొన్ని పద్యములలో పూర్వ భాగమునను - మరికొన్ని పద్యములలో సంపూర్ణముగాను ఈ అంత్య ప్రాస పాటింపబడినది.

'సుమూర్చసల్ సలిపి కావ్యము కేసరి పట్టి కిచ్చెదన్'(90వ ప.) అనినాడు. దీని ననుసరించియే చంప కోత్పలము లుపయోగింప బడినవి. 84-85-86 పద్య ములలో వాయుజునకు షోడశోపచార పూజ లున్నవి. దీని నుండి కొన్ని పద్యములు—

> 'అతత పుణ్యశాలికి మహాహవ కేళి నిర్జితారికిన్
> ఘాతచయైక మూర్తికి, ప్రమోద విహారికి గర్వ హారికిన్
> పూత కథానులాపికి ప్రఫుల్ల మనోజ్ఞ మనోఒబ్జ ధారికిన్
> పాతక సంచయారికి ప్రభంజన సూతికి మోకరిల్లుదున్' (29)

ఈ పద్ధతి పద్య రచనమే దీనియందు అధికముగా గలదు.

> 'అంగజ దూరు రాఘవ పదాబ్జ మరంద సుధారు మానసా
> భృంగగణ సంచర చ్చకిత భాగ్యవిహారు, సమీర దీప్త స
> ర్వాంగ సముచ్ఛ్వాంచిత బలాధిక దివ్య దనూన మంత్ర ర
> గ్నింగని అంజనీ సుతుని నాత్మజ లేరమునన్ భజించెదన్' (65)

వాయుజుని శౌర్య పరాక్రమాదుల వర్ణించు సందర్భమున వ్రాయబడిన యీ పద్యము ఉత్తర భాగము సమాన ఘటిత మగుచు పవనసూతి పరాక్రమ ద్యోతకముగా నున్నది.

'బుద్ధి ర్బలం యశో ధైర్యం నిర్భయత్వ మరోగతా।
అజాడ్యం వాక్పటుత్వం చ హనుమత్ స్మరణా ద్భవేత్॥'

అను శ్లోకము-

'ధీ విభవ ప్రసాదము, సుధీ జన మోదము, చిత్త శుద్ధియున్,
కీర్తియు, వాక్సమత్కృతి, పటిష్ఠత, పొందతి, ధైర్యమున్, సదా
యీ పియు, పౌరుషంబు విరియించు నెడందయు, భవ్యమౌ యశం
బీవె యటన్న వాయు సుతుఁ డిచ్చు ననూన కృపాంతరంగుఁడై' (17)

అని తెనిగింప బడినది.

హరికథ కథకులు, గ్రంథకర్తలు నైన ఆచార్యుల వారి యీ కృతి యందలి పద్యము లన్నియు సంస్కృతాంధ్ర కవితా ప్రౌఢిమ కలిగి ధారా శోభితములై యున్నవి.

గ్రంథ ప్రారంభమున పీఠస్మృ్రాదకులు కొండూరి సుబ్బారావు గారి వర్ణన 7 పద్యములలో చేయబడినది

1969 సౌమ్య సంవత్సరమున ముద్రింపబడిన యీ రచనను గూర్చి మానాప్రగడ శేషశాయి గారు, పేరి నరసింహ శాస్త్రి గారు, పుణింగంటి పురుషోత్తమాచార్య, సి. హెచ్.జి.వి. తిరుమలాచార్యులు గారు గద్య, పద్యముల యందు అభిప్రాయములు తెల్పిరి.

శతక సంఖ్య పద్యములు, మకుటము లేనందున దీని నీ ప్రకరణ మున చేర్చితిని.

## 2. కథాత్మకములు

### 1. శబరీ సపర్యః

శ్రీమద్రామాయణ మందలి అరణ్య కాండమున (74 వ సర్గలో 32 శ్లోకములలో) శబరి కథ గలదు. లక్ష్మణాచార్యుల వారు ఆ కథను గైకొని వర్ణనలు, కొలది కథావ్యతిరతో 149 పద్యముల కృతిగా దీనిని రచించిరి.

శబరీ వృత్తాంతము భక్తిపూరితమై హృదయంగమ సన్నివేశము గలది. దీని నితః పూర్వము కొందరు ఖండ కావ్యములుగా వ్రాసినారు 3* ఎవరి భక్తి రచనలు వారివి. ఒక్కొకరి రసస్ఫూర్తి, ఆవేదన, సాధన ఒక్కొక రకముగా నుండును. కావుననే శ్రీమద్రామాయణము, తత్సంబంధ కథలు అనేకులచే రచింపబడుచున్నవి.

ఆచార్యుల వారి 'శబరీ సపర్య'లోని విషయము స్థూలముగా నిట్లున్నది:

మతంగాశ్రమ ప్రాంతమున తపస్విని యైన శబరి నివసించుచుండును. మునులు దివ్య లోకమున కరుగుచు ఈమెను శ్రీరామ సందర్శనార్థము ఆయన కాతిథ్య మిచ్చు నిమిత్తము ఆశ్రమవాటి యందే యుంతురు. రామ లక్ష్మణులు సీతాన్వేషణ కార్యక్రమమున సంచరించుచు కబంధుడు చెప్పిన జాడ ప్రకారము శబరీ నివాస భూమికి చేరుదురు. వీరికై చిర కాలముగా ఎదురు చూచు చున్న శబరి పరవశయై 'తన జన్మ ఫలించినది, మోక్షము లభించు'నని భావించి, వారికి ఫలముల నొసంగి ఆతిథ్య మిచ్చినది. రాము డీమె విషయమును తెలిసికొని మతంగాశ్రమ దర్శనానంతరము శబరికి మోక్ష పదవిని లభింప చేయగా ఆమె దివ్యవసన ధారిణియైన యౌవనవతిగా మారి ఇంతకు ముందు మౌను లరిగిన దివ్యపథము ననుగమించి కైవల్య ధామము చేరును. అచటనుండి దాశరథులు బయల్వెడలి ఇతర మార్గమున వెళ్లుదురు.

ఈ వృత్తాంతమును లక్ష్మణాచార్యులు గారు పెంచి, శబరి భక్తిని, ఆచార్య నిష్ఠను ప్రవచించినారు.

రామ లక్ష్మణులు అరణ్య మార్గమున వెడలుచు మతంగాశ్రమ ప్రాంతమును చేరి కొలది దూరమున కన్పడుచున్న ఒక తపఃపరయైన అంగనను—

'పలిత శిరోజముల్ ముఖముపై బడి తూగ, మెయిన్ శ్రమాంబువుల్
దొలుక, పదంబు లట్టిటుల తొట్రిలుచుండ, త్వగస్థి జర్జరీ
నిలయము వీక్షణ ప్రభ ననింద్య తపః పర యంచు దోమ చీ
నెలవుల నొంటి నున్న జననిన్ గనుగొ న్మదె ఎవ్వరో కదా !' (6)

అని శ్రీరాముడు సోదరునితో పల్కుచున్నాడు. దీనియందు శబరి ముదివగ్గు రూపము, తపస్వినీ లక్షణము తెల్పి 'జనని' అని పవిత్ర భావనను వ్యక్తపరచినాడు.

దాశరథుల రాకను గమనించిన శబరి—

''తెలిసి పోయె లేదిందు సందేహ మింక
వార లెవరో కా దాచార్య వరులు పలికి
నట్లు నాదు జన్మమ్ము ధన్య మ్మొనర్ప
వచ్చుచున్నారు రఘుకుల స్వాము లిపుడు! (10)

అనుచు ఆమె తన మనోగత మోక్ష వాంఛను తెలుపుచు 'జన్మమ్ము ధన్య మ్మొనర్ప' అనినది. ఇచట మునులు గురువులు అనక 'ఆచార్య వర్యు'లని కవి తెలుపుట 'ఆచార్య ప్రతిపత్తి'ని సూచించును.

శబరి శ్రీరామ చంద్రునకు ఫలముల నివేదించి—

'తుల్యంబౌనాకొ మత్సమర్పిత ఫలాదుల్ నీకు నీ తల్లి కౌ
సల్యా దేవి యొసంగు నోగిరముతో సాధూత్తమా! అక్షి సా
ఫల్యం బందగ గాంతువేని మదిలో వాత్సల్యపున్ లోతులన్
మూల్యాతీత పవిత్ర జీవికనుగా బుద్ధిన్ దలంతున్ ప్రభూ!' (21)

అనుచున్నది. దీనియం దీమె భక్తి పరాకాష్ఠ నంది తనను కౌసల్యా దేవితో పోల్చుకొని ప్రేమదాత్రి యైన 'జనని'ని మించి లోకమున ప్రేమింప దగినది అన్యము లేదను భావనను ఫల సమర్పణతో శ్రీరామునకు నివేదించెను. అందుకే కవి 6 వ పద్యమున రామచంద్రునిచే ఈమెను 'జనని' యని సంబోధింప చేసినాడు.

'అని యిటుల బల్కి శబరి ప్రత్యంగకంబు
భక్తి భావాన తరళింప పరవశించి
'అన్యథా శరణం నాస్తి' యనెడు భంగి
వ్రాలె రామచంద్రుని చరణాల ప్రేమ' (116)

మోక్షేచ్ఛాజీవి ఆచార్య పాదముల నాశ్రయించి సభక్తికముగా 'అన్యథా శరణం నాస్తి' యనుట ప్రపన్న లక్షణము. ఇచట శబరి శ్రీరాముని గురుపుగా, మోక్షదాతగా నమ్మి ఆయన శ్రీపాదములపై బడి శరణు వేడినది. ఇది ఆమె ప్రపత్తికి నిదర్శనము.

శబరి ఆటవిక జాతికి చెందినదైనను ఆచార్యానుగ్రహము వలన బ్రహ్మజ్ఞా మును పొందినది. భగవదనుగ్రహమునకు ఆచార్య శుశ్రూష మోక్ష హేతువని దీనివలన తెలియును. ఇది శబరి కథలోని పరమార్థము.

ఈ గ్రంథకర్త శబరిని శబరీ నామ నదిగా మారినట్లు చిత్రించెను. రాముడు ఆమె నట్లే ఆశీర్వదించెనట!

'అనుజ్ఞాతా తు రామేణ హుత్వాత్మానం హుతాశనే।
జ్వల త్పావక సంకాశా స్వర్గ మేవ జగామ సా'॥

అని ఈ సందర్భమున రామాయణము (అరణ్య 74.33) లో గలదు. ఆచార్యుల వారు దీనిని మార్చి 'శబరీ నది'ని చేసినారు. ఆ నది పవిత్ర గోదావరి యందు కలిసి శ్రీరామ పాదముల నంటి ప్రవహించుచు భారతీయ జీవితమున స్రోతస్వినిగా మిగిలినది.[*31] ఈ మార్పు ప్రచారములో గల విషయ ప్రాధాన్యమును సూచించును.

శబరి రామ లక్ష్మణులకు ఆతిథ్య మిచ్చి వారికి శ్రీరామ కథను చెప్పును (47-101 పద్యాలు). ఈ విషయము గ్రంథమున పెంపుదలకు కారణ మైనది.

శ్రీరామునకు శబరి యొసంగిన ఫలములు 'ఎంగిలివి కావు'. కేవలము 'ఫల సమర్పణమే' చేసినదని ఆచార్యులవారు ఆలోచించి వ్రాసిరి. శబరి తొలుత ఫలములను రుచి చూచి తరువాత శ్రీరామున కర్పించినట్లు పాద్మ పురాణమున—

'స్వాదు మాస్వాద్య మాధుర్యం పరీక్ష్య పరిభక్ష్య చ।
పశ్చా న్నివేదయామాస రాఘవాభ్యాం దృఢవ్రతా'॥

అను శ్లోకము ప్రకారము శబరి ఎంగిలి చేసిన ఫలములనే దాశరథులకు సమర్పించినట్లు గలదు. ఈ శ్లోకమునదు నేడు ప్రస్తుతము ముద్రణమై ప్రచారమున గల పాద్మ పురాణములో—

'ఫలాని చ సుపక్వాని మూలాని మధురాణి చ।
నివేదయామాస తదా రామవాభ్యాం దృఢవ్రతా॥

అని యున్నది. ఇదియే సరియైన పాఠము, అభిప్రాయము. *[4]వాల్మీకీయ మందును తియ్యని అడవి పండ్లు తెచ్చి పెట్టెననియే యున్నది.

'శబరి'- గ్రంథకర్త పై విషయముల బాగుగా పరిశీలించి సంప్రదాయ పద్ధతిగా ఫల నివేదనమునే చెప్పినారు. ఇది యొక విశిష్ట పద్ధతి. దీనియందు ఆచార్యులవారి సంప్రదాయ వేత్తృతా లక్షణము పరిస్ఫుట మగుచున్నది.

గ్రంథమందలి కథ చిన్నదైనను పద్యరచన, కథాకథన పద్ధతి సంప్రదాయ వివేచనా యుక్తమై యున్నవి.

## గోదా దేవి :

ద్రావిడ వాఙ్మయములోను, సంప్రదాయ గ్రంథములయందును గోదా దేవి కథ వివరముగా ప్రవచింపబడినది.

శ్రీ కృష్ణదేవరాయల 'ఆముక్త మాల్యద' తరువాత అనేకులైన కవులు పద్య, గద్య, గేయ, యక్షగాన, నాటక, హరికథాది రూపములుగా నీ కథను చెప్పి వారి వారి భక్తి ప్రపత్తులను, అనుభూతులను వ్యక్తీకరించినారు.

షణ్ముగంటి వారిలో వేంకట నరసింహాచార్య కవి '**గోదా వధూటీ పరిణయము**', అప్పల దేశికుల వారి '**శ్రీ గోదాస్తుతిః**' వచ్చుచే కాక, వీరి అనేక తిరునామ, మంగళ హారతులయందు గోదా దేవి సంస్తూయమాన యైనది. ఈ 'గోదా దేవి'ని రచించిన పురుషోత్తమాచార్యుల వారి పితృపాదులు - వేంకట నరసింహాచార్యుల వారు సైతము '**గోదా స్తుతి**'ని చెప్పినారు.

'**గోదా దేవి**' యను ప్రస్తుత గ్రంథము 101 పద్యములలో నున్నది. ఆచార్యుల వారు దీనిని ఆ యా విషయ వివరణము ననుసరించి - **1. ఆళ్వారు బాల, 2. ఆముక్తబాల, 3. రాసకేళి, 4. శ్రీవ్రత లీల, 5. కల్యాణ హేల.** అని ఐదు విభాగము లొనరించి వర్ణించినారు. వీరి కృతియందు గ్రంథ పారణ కారణమైన వర్ణనలు లేకపోవుట ఒక విశేషము. అవసరమైనంత మేర కేవలము కథనే రమణీయ రీతిలో చెప్పినారు అందువలననే కథారంభమున—

'తల్లి! యాండాళు! నీ కథావల్లి నిటు ల
మర్చితిని కవితా కళా మంటపమున
పద్య సుమ మంజరుల రస భావ గుణ ప
రీమళములు గుబాళించు కృపను గసవె!'

అని తమ కవితా కళామంటపమున గోద కథా వల్లిని ప్రాకింప దలచి - తల్లతాంతములైన పద్యములను గుబాళింపచేయు మని (వ్యాప్తి చెందింపు మని) తల్లిని ప్రార్థించెను.

శ్రీ విష్ణుచిత్తుల వారికి గోదాదేవి పాలిత పుత్రిక. చాల కాలము వర కామెను మానవ మాత్రురాలిగా భావించిన తండ్రి శ్రీరంగనాథుల వలన యథార్థమును తెలిసికొని ముదమంది 'ధన్యోఽహం' అని సంతసించినాడు. ఇట్టి విష్ణుచిత్తులకు పెరియాళ్వార్ అని మరియొక ప్రసిద్ధ నామము గలదు. వీరి నిష్ఠాపరత్వమును గూర్చి—

'ఆ పురమందు గోపుర పుటావలి ప్రక్కగ కాపురమ్మగా
ప్రాపిత ధీ గుణ ప్రథిత రాగ విభాసిత కీర్తి వేద వి
ద్యా పరతత్త్వ తత్పర కథా సముదాత్త వదాన్య మూర్తియౌ
ఆ పెరియాళువారలు శ్రియఃపతి గొల్చుచునుండు నిష్ఠమై!'

అని తెల్పిరి. రాయలవారు శ్రీవిష్ణుచిత్తులను 'నిష్ఠానిధి' యనిరి. పెరియాళ్వారు గోదాదేవికి బాల్యములోనే పంచ సంస్కారను లొనరించి విద్యాభ్యాసము చేయించినారు. ఆ పద్ధతి—

'పంచ సంస్కార మొనరించి పరసు మంత్ర
మేదొ సుత కుపదేశింప గోద భట్ట
నాథు ప్రేమం శ్రీ ద్రావిడామ్నాయ విధి గ్ర
హించి 'పల్లాం' డటం బాడ పించ సాగె'

దీనియందు శ్రీవైష్ణవ సంప్రదాయ పద్ధతి తెల్పబడినది.

'తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగశ్చ పంచమః' అనునవి పంచ సంస్కారములు. ఇందు 'మంత్రమేదొ' అని కవి తెలిపెను 'మంత్రం గోప్యేన రక్షయేత్'-కదా! కావున తన్మంత్రమును తెల్పలేదు. ద్రావిడ వేదమున

'పల్లాండు పల్లాండు పలగోడి-' అనునది నిత్యానుసంధాన పాఠరము. ఇట్టి సంప్రదాయ విద్యా పద్ధతి గోదాదేవికి నేర్పబడుచున్నది.

స్వామివారు తనకు గోదాదేవి ధరించిన పుష్ప మాలికయే అభిమత మని పల్కినపుడు విష్ణుచిత్తు డాశ్చర్య మగ్నుడై, హర్ష పులకిత గాత్రుడై భక్తికన్న, ప్రపత్తి కన్న న్యాసము ఉత్తరోత్తర సర్వ శ్రేష్ఠమని భావించి—

> 'అపుడు శబరీ ముఖోచ్ఛిష్ట మయ్యె హితము
> ఇదిగో గోదా శిఖోచ్ఛిష్ట మిపుడు ప్రియము
> స్వాదు ఫలముల నెంచి యొసంగె శబరి
> మృదు సరముల ధరించి యర్పించె గోద!'

అని శ్రీరంగనాథులకు విన్నవించు కొనెను. రెండు ఉచ్ఛిష్టములు స్వామి వారికి హితమైనవి. 'పత్రం పుష్పం ఫలం తోయం...' అనిన దాని కనుగుణముగా పీనియందు 'పుష్పము', 'ఫలము' గలవు. ఇట్టి భక్తి విషయమున కవి 'శబరీ', 'గోద'లను ఏకత్ర కూర్చి వారి అమాయిక భక్తిని వెల్లడించెను.

విష్ణుచిత్తులను రంగనాయక స్వామి యనుగ్రహించి—

> 'పరిపూర్ణ ప్రణవాగమ ప్రభవ భవ్య ప్రాభవానందమౌ
> పరమార్థ ప్రతిపాదకం బగు తిరుప్పల్లాండు సాయించి మీ
> పెరియాళ్వా రిరునామ సార్థకముగా ప్రేమార్ద్ర చిత్తంబునన్
> హరి కైంకర్య మొనర్చుమీ సములు లే రాళ్వారు లెవ్వారలున్!'

విష్ణుచిత్తుల భక్తికి ఆళ్వారులలో నెవ్వరును సాటిరారని శ్రీరంగ నాయకులే యనినట్లు చిత్రించుట పెరియాళ్వార్ ప్రాముఖ్యమును వెల్లడి చేయుటకు. కవి నిర్దేశించు కొనిన పద్ధతి యిది.

విశిష్ట కథా వస్తువును పద్య సుమములుగా గోదాదేవికి సమర్పించిన పురుషోత్తమాచార్యులు గారు గ్రంథాంతమున—

'దివ్య దేశాల వైష్ణవ దేవళాల
నాథుని సరి నిత్య సమర్చనముల గొనుచు
వరము లొసగెడు చల్లని సిరి వెలంది!
మము కటాక్షింప రమ్మ! నమస్సు లమ్మ!'

అని సవినయముగా 'అంజలి' ఘటించినారు.

ఈ గ్రంథమును 1985 వ సం॥న శ్రీ యాదగిరి లక్ష్మీ నృసింహ దేవస్థానము వారు ముద్రించిరి.

## 2. స్మృత్యాత్మకములు :

తన కుటుంబమునకు చెందినవారు గాని, స్ఫూర్తి కలిగించిన వారు గాని, ఆప్త వర్గమునకు చెందిన వారు గాని అస్తమించి నపుడు బాధా విపణ్ణ హృదయుడైన కవి దుఃఖోద్విగ్నుడై వెల్లడించు కవితా రూప మగు భావనయే స్మృతి కావ్యము రచన యనబడును.

'స్మృతి'కి స్మరణమే ముఖ్యము. ఇట్టి కృతులయందు విగత జీవుల స్మరణ కవితా వస్తువుగా నుండును. కావున నివి 'స్మృతి' రచనలు. వీనినే ఆంగ్లేయులు అత్యాశ్రయ కవిత యందు 'ఎలిజీ' (elegy) అందురు. వారు దీనిని మిశ్ర స్మృతికే నిర్వచించుకొనిరి.

ఇంగ్లీషు కవులలో 'గ్రే' ఎలిజీకి ప్రథమ ఖ్యాపిక. ఇతని తరువాత మిల్టన్, షెల్లీ, బ్రౌనింగ్, టెన్నిసన్, ఆర్నాల్డ్, గోల్డ్‌స్మిత్ మొదలగు వారు వివిధములగు ఎలిజీలను రచించిరి.*5

ఈ ప్రక్రియ ఇంగ్లీషు కాల్పనిక కవిత్వములో దేశ నాయక పరముగను, మిత్రపరముగను రూపొందినప్పటికి, దీని ప్రభావము తెనుగు సాహిత్యముపై బడి 'శోక గీతము', 'శోక కావ్యము' అని వాడబడినను, ఇవియే విషయ విస్తృతి ననుసరించి 'స్మృతి' గీతము, 'స్మృతి' రచనగా వ్యాప్తి చెందినది.

తెనుగు సాహిత్యమున మొట్ట మొదటి 'స్మృతి' రచన శ్రీనాథుని 'కాశికా విశ్వేశుఁ గలసె వీరారెడ్డి' ఇత్యాది పద్యము. తరువాత అల్లసాని పెద్దన 'ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి' అను పద్యము*. మన ప్రాచీన సాహిత్య

మున స్మృతి కావ్యముల బాట ఏర్పడినది. తెనుగున ఈ ప్రక్రియకు ప్రాచంభ రచనలు వావిలాల వారి 'పితౄవాదనము', 'రుక్మిణీ స్మరణము'. వీనియం దొకటి పితృ స్మృతి రెండవది సతీ స్మృతి. వీని తరువాత వడ్డాదివారి 'సతీ స్మృతి', 'సుత స్మృతి', ఆదినారాయణమూర్తిగారి 'ప్రేయసీ స్మృతి', జగన్నాథ రావుగారి 'మిత్ర స్మృతి' వచ్చినవి.

ఆధుని కాంధ్ర కవులలో రాయప్రోలు వారు మొట్టమొదట నవ్యతా భావనతో గోపాలకృష్ణ గోఖలే నిర్యాణమును స్మృతి కావ్యముగా రచించిరి. అనంతరము బసవరాజు వారి గేయాలు, దువ్వూరి వారి 'సోదరీ స్మృతి', విశ్వనాథ వారి 'వరలక్ష్మీ త్రిశతి', నాయని వారి 'విషాద మోహనము', 'మాతృ గీతాలు' ఈ ప్రక్రియకు వన్నె చేకూర్చినవి.

స్మృతి కావ్యముల వైవిధ్యము ననుసరించి వీనిని 1. దేశనాయక, 2. సతీ, 3 సుతాదిక, 4. ఆప్త స్మృతి రచన లని చతుర్విధములుగా విభజింప వచ్చును.

మతింగంటి వారి స్మృతి రచనలలో మూడు రకము లున్నవి. వేంకట నరసింహాచార్యులు (ఐదవ) తమ యర్థాంగి పరమపదించినప్పుడు 'భార్యా స్మృతి'గా 'మానస ప్రబోధ శతకము'ను చెప్పినారు. వీరే 'ఆప్త స్మృతి'గా 'రాజా రాఘవరాజు రంగరాజు స్మృతి'ని రచించిరి. మూడవది 'కాలికవి కన్నీటి ధార'. ఇది పై పద్ధతులలో చేరని రచన. కవి శ్రీరామ చంద్రస్వామి నిత్యార్చ నల గూర్చి పడిన బాధలు ఆయనను దుఃఖ పరవశుని చేసినవి. అందువలన 'కన్నీటి ధార' పేరు పెట్టబడినది దీనిని 'ఆత్మ స్మృతి' యనవచ్చును. ఇచట కవి తనను గూర్చి తన స్వామిని గూర్చి గతవిషయములను వర్తమాన విషయ ములను స్మరించుకొని బాధా విషణ్ణ హృదయుడైన కారణమే ముఖ్యము. కావున 'ఆత్మ స్మృతి' అని పేరు పెట్టినాను.

'మానస ప్రబోధ శతకము' శతక ప్రక్రియా విభాగమున పరిచయము చేయబడినది. మిగిలిన రెండు రచనలలో—.

## 1. శ్రీ శ్రీ శ్రీ రాజా రాఘవరాజు రంగరాజు స్మృతి :

పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరు తాలూకాలోని గౌరవరము ఎస్టేట్ జమీందారులైన రాఘవరాజు రంగరాజు గారు వదాన్యులు, కవి, పండిత పక్షపాతి. ఎందరి గ్రంథములనో ముద్రణ చేయించినారు.

రంగరాజు గారు 7-4-1956 వ తేదీన అస్తమించిరి. ఇది వారి కుటుంబమున కెంత శోక కారణమో, బంధు మిత్రులకు, కవి పండితులకు అంత తీరని లోటు!

వేంకట నరసింహాచార్యులు గారు రాజుగారికి సన్నిహితులు. దివంగతులైన తమ తండ్రి గారిని గూర్చి యొక చిన్ని పొత్తమును వ్రాయవలసిన దని కుమారులు ఆచార్యుల వారిని ప్రోత్సాహము చేయగా, 48 పద్యములలో వారు దీనిని రచించిరి.

1957వ సం.ము రాజుగారి కుమారు లీ గ్రంథమును ముద్రించి వేంకట నరసింహాచార్య కవిని సన్మానించారు.

ఈ గ్రంథమునకు ఇందుకూరి సత్యనారాయణ రాజు గారు 'అశ్రు తర్పణ' పేర అభిప్రాయమును వ్రాయగా, గ్రంథకర్త వచనములో 'ప్రభువర్యుల స్వీయ చరిత్రము'ను తెలిపి, నీతధ్వంశీకుల దాతృత్వ, విద్యా పోషణాది సద్గుణముల వివరించిరి.

గతించిన తన వారిని గూర్చి కవితా రూపముగా స్మృత్యంకము వెలయించుట సర్వ సామాన్యము. ఆచార్యుల వారికి స్వర్గీయులైన రాజాగారితో గల ఆత్మీయత ఈ కృతికి కారణ మైనది. దీనివలన ఆయన అక్షర రూపము దాల్చి శాశ్వతుడై యుండును. దానినే కవి—

> 'మృత జీవుండవు నీవు నీ చరిత మూర్విన్ శాశ్వతం బౌచు నం
> చిత బుద్ధిన్ ప్రజ లెల్ల వాకొనుచుయే సిద్ధించు, నిశ్చింత నా
> శ్రిత సంరక్షక దైవ శౌరి పద రాజీవంబు లర్చింప జా
> లితి ఓ రాఘవరాజ వంశ తిలకా! శ్రీరంగ రాజ ప్రభూ! (48)

అని గ్రంథాంతమున తెల్పిరి.

పరమ భాగవతులైన రంగరాజుగారు అనేక విష్ణుక్షేత్రముల సేవించి వానియందు దాన ధర్మము లొనర్చి శాశ్వత కీర్తి నార్జించిరి. వానిని—

'నిజభక్తి గరిమచే నిఖిల యాత్రలు చేసి
ధర్మ తత్పర బుద్ధి దనరినావు
తప్త చక్రాంకిత ధారణత్వము నొంది
తిరుమంత్ర పఠనాప్తి దేలినావు
గరుడ మంత్ర ధ్యాన గరిమచే ప్రజలను
సర్పబాధను తీర్ప జాలినావు
శ్రీరామ తారక మూర్తి జపియించి
భవ తారకోన్నతి వడసినావు
కార్య దీక్షను నీవంటి ఘనుడు లేడు
లేడు లేడంచు ముమ్మారు లాడదగును
ప్రాకటంబుగ రాఘవ రాజ వంశ్య!
రమ్య గుణసాంద్ర! శ్రీ రంగరాజ చంద్ర!' (26)

అని వారికి వివిధ మంత్రముల యందు గల భక్తిని నిష్ఠాపరత్వమును కార్య దీక్షను తెలిపినారు.

ఈ గ్రంథకర్త యైన వేంకట నరసింహాచార్యుల వారిపై రంగరాజుగారి కెనలేని భక్తి ప్రపత్తులు! వీరి దర్శనము కాగానే పదిలా వినోదమున కాలము గడుపువారు. ఇట్టి తమ అనుభవములను పది ఎన్నిటినో పేర్కొని రాజుగారి సాహితీ ప్రియత్వము, ఘన సాహాయ్య మొనగూర్చిన గ్రంథములను, గ్రంథకర్త అను తెలిపి, తమ అనుభవములలో నొకదాని నిట్లు వ్యక్తపరచినారు:

'మును నీ దివ్య సభాంతరాళమున నే పూరించు పద్యంబుల
న్విని నే గూర్చిన కావ్య విస్తరము సంప్రీతి న్విలోకించి వీ
క్షణమున్ జేయగ వాసుదేవుని కరాబ్జం బంట నర్పించి పెం
డ్లిని గావించిన నీ యుదార మహిమన్ లెక్కింతు నెల్లప్పు డో
మనుజాధీశ్వర! మన్నన హిత! మహాత్మా! రంగరాజాధిపా!' (16)

దీనిలోని కావ్య విస్తరము నా గ్రంథ 'మాలతీ వసంతము'.

నేపిలిమునకు ఉత్తమ కావ్యమని నిరూపించి సద్గుణ నిధిగా కీర్తి గాంచిన రంగరాజు 'స్మృతి కావ్యము' ఉత్తమ పురుష కథా కథనమునకు తగియున్నది.

## 2. 'కాణికవి' కన్నీటిధార

వేంకట రామానుజాచార్యులవారు తమ ఆత్మవేదనను 27 సీస పద్యములలో నక్షత్రమాలికా రూపమున వెల్వరించిన ఈ రచన 1980 వ సంవత్సరమునందు ముద్రితమైనది.

కృత్యాద్యంతములయందు గల 2 శ్లోకములు, 1 గీతము, 7 కంద పద్యములు కవిని గూర్చి, గ్రంథ ముద్రణకు ధనమొసంగిన వారిని గూర్చి వ్రాయబడినవి.

గ్రంథకర్తయైన వేంకట రామానుజాచార్యులుగారు ఖమ్మం జిల్లా మిమ్మిగూడెమున వేంచేసియున్న సీతారామచంద్రస్వామి వారికి అర్చనాదులను నిర్వహించుటకై 8-8-1947 వ తేదీన ప్రవేశించిరి. అప్పటిలో స్వామి వారికి స్థిరచరాస్తులు లేనందున నిత్యపూజా విధుల నిర్వహణమే శ్రమగా నుండెడిది. దీని నధిగమించు నిమిత్తము ఆచార్యులవారు అక్షయ పాత్రలను, తెచ్చిన దానియందు దైవార్చన జరుపుచు, దేవాలయ నిర్వహణ నిమిత్తము ప్రతివారిని ఒక కాణీ (అప్పటి పైసన్నర) అడిగి ధనమును ప్రోగుచేసి పునరుద్ధరణ నిర్మాణ కార్యక్రమముల నారంభించినారు. దీనివలననే వీరికి 'కాణికవి' యను పేరు వచ్చినదని కవియే—

> ''కాణికవి యనుచు సీతారామరాము
> నిత్య కైంకర్యమున కొక నిత్య కాణి
> నొసగు దని పండ్లు దెఱచి మొక్కొనరి పడుగ
> ఫలితమును బొందకయె కాణి కవిగ నైతి!'

అని చెల్పుకొనెను ఆ నాడు ఆచార్యుల వారికి 30 రూపాయీలు మాస వేతనము. అర్చన నిమిత్తము 30 సేర్ల బియ్యము మిచ్చువారు. దేవాలయ ధర్మ సత్రములో వీరి నివాసము.

కొన్ని సంవత్సరముల తరువాత వీరి మాన్య వృత్తి ఆగిపోయినది. అతి కష్ట దశలో శ్రీరాముల కర్చన, ఆరగింపులు జరుపుచుండగా దేవాలయమును రాష్ట్ర దేవాదాయ శాఖవారు స్వాధీన పరచుకొనిరి దీనివలన అర్చక స్వామి బాధలు అధికమైనవి నివాసముగ నున్న సత్రము ఖాళీ చేయవలసి వచ్చినది. పూజారి అనునట్టి భావనతో వీరిని అనాదరముగా చూచుచున్నారు. దేవాలయము నకు వార్షికాదాయము 10 వేల వరకు పెరిగినను, వీరి దీన దశలో మార్పు రాలేదు.

దేవాదాయ ధర్మాదాయ శాఖ వారు ఏర్పాటు చేసిన 'దేవాలయ కమిటీ' స్వామి వారి కల్యాణోత్సవాదుల గూర్చి, విశేషార్చనల గూర్చి పట్టించు కొనలేదు. ఆలయము వ్యాపార సంస్థ యైనది. ఈ పద్ధతు లన్నియు ఆచార్యుల వారి మనస్సును వికలము చేసినవి. తనను గూర్చి ఎంత దుఃఖ పడినను అన్నిటికి శ్రీరామచంద్రుడే సాక్షి - ఆధారము అని భావించుకొనుచు నిత్యార్చనలు జరుపు చున్నారే గాని సంతృప్తి మాత్రము లేదు.

వీని యన్నిటి చిత్రణము కవి ఆత్మ వేదనగా 'జాలి కవి కన్నీటి ధార'గా రూపు దాల్చినది.

శేషప్ప కవి - 'భూషణ వికాస! శ్రీధర్మ పుర నివాస!' యనగా - వీరు

'భూషణ వినాశ! శ్రీ దుమ్ము పుర నివాస!' అని ప్రతి పద్యమునకు మకుటము నేర్పరచినారు.

అర్చక స్వామిగా దేవాలయమును చేరినప్పటి నుండి తమ పరిస్థితి యెట్లు మార్పు చెందెనో ఈ పద్యము ద్వారా తెలుపుచున్నారు :

'మూడు మూడును నలుబదేడు గూడిన రోజు (3-8-'47)
నీ సన్నిధిని జేర్చి యిచట నుంచి
మొదట జీతము నెలకు ముప్పది ముప్పది
రూకలన్ బియ్యంబు రక రకాల
చందాలచే నీవు సంతోష పడినది
మొదలంట జేసి మున్ముందు నాకు
చెంబు తాంబుర నిచ్చి వెలిగి తమాషగా
శ్వాస బంధన రోగ వార్షికంబు
జేసితివి రామ! యింకేమి చేతు విచట
తేనె బూసిన కత్తి నీ పనిగ తెలుసు

ధూషణ వినాశ! శ్రీ దుమ్ముపుర నివాస!
కావవే నన్ను సీతాత్మ కనుగు రామ!' (2)

దుమ్ముపుర వాసుల యందు గల భక్తి ప్రపత్తులు. వారి నిత్య కృత్యమును రెట్టించి తెల్పుచు ఈ గ్రామమున ధర్మము మాత్రమే లోపించిన దని—

'ఇంటింట యిష్ట దేవీ దేవ పూజలు
పసుపు హర్, సాయి, త్రిమూర్తి వ్రతులు
తిలకింప నాటక దేదీప్య సీనరీ
సినిమాలు డ్యాన్సులు సేవ్య నటులు
పులిహోర శర్కర పొంగళ్ళ రుచి చెప
యిడ్లి పెసర ట్లుప్మ యిరవు గొనియె
హరి పేంప తీర్థంబె యమృతంబుగా గొను
నాష్టలు 'కాఫి', 'టీ' యమృత హవులు

ఘంట దీపంబులకు బదుల్ ధూమ పాన
మంత ధర్మంబు నొక్కటే మాయ మయెను
ధూషణ వినాశ! శ్రీ దుమ్ముపుర నివాస!
కావవే నన్ను సీతాత్మ కనుగు రామ!' (8)

దేవాలయ శాఖవారు ఏర్పాటు చేసిన 'కమిటీ' వారికి అధికార వ్యామోహమే కాని ధార్మికత్వము - భక్తి యనునవి లేవు. వారి పరిపాలన గూర్చి—

'నన్ను నిన్నేలిడి నగు కమిటి మెంబర్ల
వచన చెప్పెద విను వాసుదేవ!
చెంబు యే ప్రసిడెంటు చేసున్న రాంబుర
వైస్ ప్రసిడెంటునా వరలు చిఱుత
లా కార్యదర్శియే యగును క్యాష్కీపరు
ఆశ్వసించి యదెన్న నగును శ్రోత్ర
చేదోడు మెంబరు చెంగుడి రాగంబు
నీ యుదుగురు కమిటి నిలిచి నన్ను
నేలుచుండిరి చరగని నిధిని జూపి
యపచయంబగు భిక్షయో పక్షపాత!
ధూషణ వినాశ! శ్రీ దుమ్ముపుర నివాస......' (20)

సమితి యేర్పడినను కరుణ లేదు. వీరికి పరతంత్ర విష జ్వరేగ నిరంత రము వీరి భిక్షాటన కుపకరించు వస్తు సామగ్రియే వీరి 'సమితి' యంచు ర్లని ఉపమించి తన బాధను వ్యక్తపరచెను.

ఈ విధముగా తాను నమ్మి కొలిచిన స్వామివారికి నిత్యార్చనలు సరిగా జరుగనందులకు పరితపించిన అర్చక స్వామి యగు కవి హృదయము ఈ లఘు కృతి ద్వారా తెలియును.

అనేక బాధల పడి చివరి వరకు శ్రీరామునే నమ్మి 'అన్యథా శరణం నాస్తి' యని భావించిన 'కాణికవి' 18-11-1986 న పరమపదించిరి.

ఇట్లు ఈ పదకొండు లఘుకృతులు వివిధ విషయ సముపేతములై, ఆ యా గ్రంథకర్తల భక్తి ప్రపత్తులను, స్మృతులను వెల్లడి చేయుచున్నవి.

## సూచికలు :

1. 'తారాణాం సంఖ్యయా పద్యైః ర్యుక్తా తారావళీ మతా' ప్రతాపరుద్రీయమ్; కావ్య ప్రకరణము. (శ్లో. 79)
   నక్షత్రములు 27; వీని సంఖ్య ననుసరించి 27 పద్యములతో చెప్పబడిన రచన తారావళి లేదా నక్షత్ర మాలిక, తారా మాలిక.
2. మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారు 'వరాహ నరసింహ శతకము'ను 60 సంవత్సరముల పేర్లు, 27 నక్షత్రముల పేర్లు వచ్చునట్లు రచించిరి.
3. 'శబరి' ఖండ కావ్యము - గుదిమెళ్ళ రామానుజాచార్యులు గారు (ముద్రి. 1950)
   ,, ,, శ్రీ బులుసు వేంకట రామమూర్తి. (ముద్రి. 1984)

3. B చింతా దీక్షితులు 'శబరి' నాటిక యందు ఇట్లే గలదు.

4. వావిలికొలను వారు మందర వ్యాఖ్య (అరణ్య, 689-692 పుటలు) యందు రామునకు శబరి ఎంగిలి చేసిన ఫలముల సమర్పించ లేదని పద్మపురాణ శ్లోకము వేరే విధముగా కలదని నిర్ధారించిరి.

5, 6. 'ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు.' (పుటలు. 450, 451)

# 8

# తిరునామములు – మంగళ హారతులు

## తిరునామములు :

శ్రీ వైష్ణవ సంప్రదాయ పరిభాషయందు 'తిరు' శబ్దముతో చేరిన పదము లధికముగా నుండును.

'శ్రీ' శబ్దమునకు తమిళమున 'తిరు' తత్సమము. ఇట్టి 'తిరు' శబ్దముతో కలిసి వ్యాప్తమైనవి 'తిరు ఆరాధన' (తిరు ఆరాధన), 'తిరు వరంగము' (శ్రీరంగము), 'తిరు వేంకట' (శ్రీ వేంకట) మొదలగునవి.

విశిష్టాద్వైత సంప్రదాయము సంస్కృత ద్రావిడ సాహిత్యములతో ముడివడి యున్నందున 'శ్రీ' శబ్దము 'తిరు'గా వాడబడు చున్నది. దీనికి మరి యొక కారణము కలదు. లక్ష్మీ ప్రాముఖ్య కారణమున శ్రీవైష్ణవ సంప్రదాయము నకు 'శ్రీ సంప్రదాయము' అని ప్రసిద్ధి. శ్రీ సంప్రదాయ ప్రవర్తన సూచకముగా చేర్చు విశేషణము 'తిరు' శబ్దము వాడబడినది*[1] ఇది ప్రచురమై సంస్కృత 'నామము'తో చేరి 'తిరునామము' లోని తొలిపద మైనది.

తమిళ మైన 'నామ' శబ్దమునకు 'ప్రాకాశ్యం' - ఎరిగింపబడిన దని యర్థము.*[2] ఎరుగ దగినది, ఎరిగింపదగినది భగవంతు డొక్కడే కావున అతని నామ శబ్ద వాచ్యు డని ప్రతీతి. ఈ 'నామము' భగవంతుని సకలేతర విలక్షణమునకు*[3] వ్యాప్తి పరచును. ఇట్లు 'నామము' భగవత్పరమైనది.

'తిరు నామములు' శ్రీ సంప్రదాయమైన భగవత్పరమగు కీర్తనలు, ఒక నామమును కీర్తనకు దివ్య నామము అనెడి వారు.*[4] 'విష్ణు సహస్ర నామ స్తోత్రము' నామ సంకీర్తనమైన దివ్య నామమున కుదాహరణము. ఇట్టి నామ సంకీర్తన [illegible] గేయ రూప కీర్తనమైనది.

శ్రీ సంప్రదాయమునకు చెందిన కీర్తనలను పరిమితముగా గ్రహించి - 'దివ్య నామ కీర్తన'లను పరివ్యాప్త మొనర్చురు, 'దివ్య' శబ్దమునకు బదులు 'తిరు' శబ్దమును చేర్చి 'తిరునామములు' అనినారు *5 తొలి దశలోని దివ్య నామ సంకీర్తనము ఇట్లు తిరు నామమై వ్యాప్తి చెందినది.

ద్రావిడ ప్రబంధముల యందు 'వాడి తిరు నామములు*6 గల్గు భగవ ద్భాగవత తోత్సవముల ముగింపు వీని పఠనముతో పూర్తి యగును. ఎవరిని గూర్చి యివి పాడబడునో వారికి సంబంధించిన యంశములే యుండి అట్టి వారు 'చిరకాలము సుఖముగా నుండి మమ్ములను అనుగ్రహింతురు గాక!' అని ఆశంసింప బడును.

తిరునామముల యందును ఆళ్వారాచార్యుల స్తుతి, వారిని గూర్చి మననము చేసికొనుట - మొదలగునవి కన్పింపను. కావున 'వాడి తిరు నామము'ల నుండియు తిరు నామ శబ్దము రావచ్చు నని భావించుటకు వీలు గలదు.

తెనుగు నాట శ్రీ వైష్ణవ సంబంధమైన గీతములు 13వ శతాబ్దమునుండి కన్పించుచున్నవి. త్యాగరాజు, క్షేత్రయ్య, రామదాసు, తాళ్లపాక కవులు, కృష్ణమాచార్యులు - అనేక సంకీర్తనలను చెప్పిరి. వానియందు 'తిరునామములు' లేవు. కాని, కీర్తన పదము ప్రాచీనము. "వచనములు - కీర్తనములు - పదములు ఈ మూడును వాని యంతస్తత్త్వ మొక్కటియే యైనను విశిష్టమైన ప్రత్యేక లక్షణములతో అవి ప్రకాశించుచున్నవి. తిరు నామములు వీని పరిణామ క్రమమున వస్తు విషయమున ఒకానొక దశలో వాని వాని లక్షణములను ప్రత్యేకతలను గ్రహించుచు తనదైన విలక్షణత చేత ఒక ప్రత్యేక ప్రక్రియగా రూపొంది యున్నవి" - అని డా॥ కిడాంబి నరసింహాచార్యులు గారి అభిప్రాయము*7.

తిరునామముల యందు శ్రీ వైకుంఠ నివాసుని అనంతమైన కల్యాణ గుణ గణములు కీర్తింప బడుటయే గాక ఆళ్వారులు, పూర్వాచార్యులు తెల్పిన సంప్రదాయ విషయములు - సులభ శైలిలో తెల్పబడును

పూర్వులైన ఆళ్వారులు తమ ద్రావిడ ప్రబంధములను గాన ప్రధానముగా కూర్చి భగవన్నామ గుణానుభవమునకు ప్రచార మొనర్చిరి. వీని ప్రభావము తిరునామ రచనకు ప్రేరక మైనందున దివ్య ప్రబంధ విషయములకు

ప్రాధాన్య మొసంగి, భక్తి, జ్ఞాన, తాత్త్వికతల బోధించుట తిరునామముల యుద్దేశ్యము.

ప్రౌఢ శ్లోక, పద్య రచనల కన్న సులభముగా అర్థమై గ్రహింప బడునది కీర్తన - లేదా గేయము. దేశి కవితా పద్ధతికి చెందిన ఈ ప్రక్రియ సామాన్య జనులను మిక్కిలిగా ఆకర్షించును. అందువలననే చాలమంది కవులు సంకీర్తనల రచించి ప్రజల మధ్య నిలిచినారు. విశిష్టాద్వైత సంబంధ విషయము లనేకము సులభ శైలిలో భక్తుల కందించి వారికి సంప్రదాయాభినివేశము కలిగించుట తిరునామముల పద్ధతి కావున వీరు దేశి కవితా పద్ధతిని గ్రహించి వీనిని రచించినారు.

శ్రీవైష్ణవమున **శరణాగతి తత్త్వము** ముఖ్యమైనది. భక్త జనులను జ్ఞాన పరిపూర్ణుల నొనర్చి, భక్తియే సర్వజన సమానత్వమునకు ముఖ్యమని చాటి చెప్పిన విశిష్టాద్వైతమందు ఆచార్య పురుషులు తమదైన సంప్రదాయమును రక్షించుటకు సాహిత్యము ద్వారా ప్రచార మొనర్చినారు.

అనేక రాజుల పరిపాలనల యందు ప్రజలు మత విషయికముగా బాధల ననుభవించి రాజాశ్రితులై మతాంతర ప్రవేశమొనర్చు చుండిరి. దీనివలన భారతీయ సంస్కృతి సంప్రదాయములు విచ్ఛిన్నమగు దశ ప్రాప్తించినది. ఈ విధమైన క్లిష్టదశయందు ఆయా మతాచార్యులు ప్రజల నుద్బోధించి చైతన్యవంతుల జేయుటు 'స్వధర్మే నిధనం శ్రేయః' అని ఉపదేశించి, అందు కనుగుణముగా సాహిత్యమును సిద్ధము చేసిరి.

శ్రీ వైష్ణవాచార్యులు జాతి భవిష్య ద్విపత్తును గ్రహించి జమీందారులు మొదలైన వారిని తమ సంప్రదాయముపైవు త్రిప్పుకొని వారికి సమాశ్రయణాదు లొనర్చి వారిద్వారా ఇతర జనము నాకర్షించి, చందన గోష్ఠులు, భగవద్విషయ కాలక్షేపముల నేర్పాటు చేయించి, సంప్రదాయ గ్రంథస్థ విషయములను తిరునామ రూపమున చక్కని రీతిలో చదివిబోధించి, వారి నానందపరచు చుండిరి దీనివలన వారు సంప్రదాయాభినివేశలగుట సంభవించినది ఇట్లు తిరునామములు ప్రసిద్ధి గాంచినవి.

ఆచార్య పురుషుల ద్వారా వీనిని గ్రహించిన చాత్తినివారు, నిత్యులు వాద్యయుక్తముగా పాడి తిరునామముల ప్రచార మొనర్చిరి. తిరునామ పరిశోధకులు - వీనిని విషయ వైవిధ్యము ననుసరించి——

1. గురు పరంపర, 2. భగవత్పరము, 3. శ్రీపరము, 4. ఆళ్వారులు, 5. ఆచార్య, 6. శ్రీరామానుజ, 7. భాగవత, 8. పీఠాధిపతులు, 9. ద్రావిడ వేదము, 10. శ్రీవచన భూషణము, 11. క్షేత్ర, 12. వార్త, 13. మన స్సంబోధన, 14 స్తోత్ర, 15 ఇతర విషయ పరములు*8 అని విభాగించి విశ్లేషించిరి.

తిరు నామముల యందు విస్తృతము, గాఢమైన శాస్త్ర సంప్రదాయ విషయములు సులభ రీతిలో తెల్పుట ముఖ్యము.

'అన్ని శాస్త్రముల వంటిది గాదమ్మా - శ్రీ వచన భూషణ
మన్ని శాస్త్రముల వంటిది గాదమ్మా -'

ఇత్యాది తిరునామమున శ్రీవచన భూషణ ప్రశస్తి వ్యక్తము చేయబడినది.

'గతి మీరె శ్రీ భాగవత మాన్యులారా!
మతిలేని నా వంటి పతితులను బ్రోవన్'-

'మానవ రాక్షసు లమ్మా అనుమానము లేదే ఓ కొమ్మా'-

అను వానియందు భాగవత నిష్ఠ తెల్పబడినది. నిష్ఠా రహితులైనవారు భాగవతులను పరిహసింపగా వారిని మానవ రాక్షసు లని తెల్పుచు, ఇతరు లిట్లు కాకూడ దని బోధించుట వీని పరమార్థము.

'భాగవతార్చన కన్నను మిక్కిలి భాగ్యము లేదమ్మా!'

ఇత్యాది తిరు నామము మిక్కిలి ప్రచారమున గలదు. వీనిని శ్రావ్యముగా గానము చేసినపుడు శ్రోతృ భక్త జనము తన్మయు లగుచురు. ఇట్టి సులభ శైలి ప్రబోధాత్మక రచనలతో పాటు ప్రౌఢ సంస్కృత మయ తిరునామములును కొన్ని గలవు. ఉదాహరణమునకు.—

'భీషణ మిష ఖరదూషణ రావణ
శోషణ కరణ విభీషణ ముఖ పరి
తోషణ శుక మద చోషణ మధు రస
పోషణ చణ మృదు భాషణ భరణమ్—'

'చండతర పాషండ కదళీ
కాండ మద వేదండమా

పులక లాంఛిత గండ యుగళ ప్రతి
దండ ధృత భుజ దండమా—'

తిరు నామములందు ఆధ్యాత్మిక సంపత్తి ముఖ్యము. తద్భిన్నముగా—

'లుబ్ధ ధన పాషాణ దుర్బుద్ధీ - ధన ముండి నీ ప్రా
రబ్ధ మేమిర పాప మభివృద్ధీ
[illegible] శాస్త్ర జ్ఞాన కవితా లక్షణజ్ఞుల యాచకుల గని
స్తబ్ధ రోమ శ్వాన మర్కట సముఁడవై బెదిరించెదవు
ఛీ! లుబ్ధ ధన పాషాణ......'

'రామసింహ విశుద్ధ బోధకు
నీ మనసు కరుగదు మిడికెదవురా - యముని బాధలకూ
ఏమి లేకనె ఏమి గాకనె
ఏమి లేకనె పోవు నీ గతి
లేమి గలిగిన పిదప నిన్నెవ
రేమి యడుగరు ఛీ నరాధమ!—లుబ్ధ ధన పాషాణ......'

అని రామ నరసింహ దేశికులు ఒక ధనవంతుని నిందించినారు*9. శైలీ విషయమున, వస్తు వైవిధ్యమున ఇవి 'నిందా తిరునామము'లలో చేరును.

ఇట్టి విశిష్ట తిరునామములు ఎప్పటివి? వీని ప్రసక్తి ఎక్కడ గలదు? అను వాని విషయమై డా॥ కిడాంబి నరసింహాచార్యులు గారు వివరించి క్రీ. శ. 1690 - 1760 ప్రాంతమున నున్న కూచిమంచి తిమ్మకవి కాలమున కన్న పూర్వమే యివి గలవని, తిమ్మకవియే ప్రథమముగా 'తిర్నామముల' పేర్కొనిన వాడని, అతని కుక్కుటేశ్వర శతక పద్యము నుదాహరించి తెల్పిరి.

డా॥ ఆచార్యులవా రన్నట్లు తిమ్మనకు పూర్వమే 'తిరునామములు' గలవు. కాని వీనిని పేర్కొనిన వారిలో మాత్రము తిమ్మన ప్రథముడు కాడు. ఇతనికి పూర్వుడైన మణింగంటి సింగరాచార్యులు (1520.1590) **'తారక బ్రహ్మ రామ శతకము'న**-

'అనుజుల్ భ్రాత యటంచు, బిడ్డలు గురుం డంచుం, బ్రజల్ రాజటం
చు, గృహస్థుల్ దాంపత్య డంచు తల్లులు తనూజుం డంచు, పితృవ్యులుం

తనుఁ డంచున్, రిపు వైరి యంచు, మఱి తాతల్ పౌత్రుఁ డంచుం బ్రవ
ర్తన '**తిర్నామము**' గాయకోత్తము లయోధ్యాధామః సీతాపతీ!' (111)

అని - శ్రీరాముని ఎవ రెట్లు భావించినది తెల్పుచు 'తిర్నామము'చే గాయకోత్తములు స్తుతించినా రనెను.

దీనివలన సింగరాచార్యుల వరకే ఈ ప్రక్రియ గాయకుల యందు వ్యాప్తి చెందినట్లు తెలియుచున్నది. దీని తర్వాతి పద్యమున—

'తెల తిర్నామము చందన ప్రసవముల్' - అని శ్రీరాముని వర్ణన. ప్రథమ పద్యమునందు 'తిర్నామము గాయకోత్తము' లనునప్పుడు 'తిరు నామముల పఠనము చేయు గాయకోత్తములు' అని యర్థము. తరువాతి పద్యమునందు 'తెల తిర్నామము' - శ్రీ వైష్ణవులు నుదుట ధరించు తెల్లని నామము (బొట్టు) పేర్కొనబడినది.

దీని వలన తిమ్మకవికి ముందే తిరునామము గ్రంథస్థమై ప్రచారమున నున్నది. ఇప్పటివరకు దీనిని పేర్కొనిన వారిలో సింగరాచార్యులే అద్యుడు. ఈయన రచించిన తిరునామములు కూడ కలవు. ఇవియే ప్రాచీనములు. ఈ శాఖపు ప్రథమ రచనలు. నిరోష్ఠ్య రచన వలెనే దీనికిని సింగరాచార్యులే ఆద్యు డనుటలో విప్రతిపత్తి యుండదు.

మఱింగంటి వారికి పూర్వము నుండి కాకినాడ, తత్పరిసరములలో శిష్య వర్గము గలదు. సింగరాచార్యుల నాడు వీరి తిరునామములు ఆ ప్రాంతమున ప్రచారమై యుండును. తిమ్మకవి వీనిని విని తన శతకమునందు పేర్కొనినా డని భావించుటకు వీలు గలదు.

ఈ విధముగా ప్రచారమున ఖ్యాతి గాంచి భాగవతుల జిహ్వాగ్రమునందు వసించిన తిరునామములను ఎవరో ఎక్కడో వ్రాసిపెట్టుకొన్నను, లిఖితరూపముగా నివి ప్రచారమంది వాని వైశిష్ట్యము వెల్లడియగుట అంతంత మాత్రమే!

ఇటీవలి కాలమున కాకతీయ విశ్వవిద్యాలయమునందు తిరునామముల గూర్చి పరిశోధన జరిపి, పిహెచ్.డి పట్టము నందిన కిడాంబి నరసింహాచార్యులు గారు వివిధ ప్రాంతములలో తాము సేకరించిన '**తిరునామములు**' ఒక భాగము

గను. **'తిరునామములు - సమగ్ర పరిశీలనము'** రెండవ భాగముగను 1982-'83లో ప్రచురించినారు. 575 తిరునామములు వీరివలన గ్రంథస్థమైనవి.

ఇదే సమయమున శ్రీ కోదాటి మురళీధరరావు గారు (తొగర్రాయి) సేకరించిన 48 తిరునామములను, 75 మంగళ హారతులను **'ప్రపన్న గానామృతము''***10 పేరున 1988లో ముద్రించినారు. దీనియందు 'మణింగంటి', కొమ్మూరు, ముడుంబ (బూరుగుగడ్డ) వారి రచనలు గలవు.

వరంగల్లు నివాసులు మణింగంటి మణవాళాచార్యులు గారు తమ తండ్రి లక్ష్మణ దేశికుల (మల్లంపల్లి) వారి తిరునామ, మంగళ హారతులను **'తిరునామములు'** పేర 1985లో ముద్రణ చేయించిరి. ఈ గ్రంథమున 140 తిరునామములు, 20 మంగళ హారతులు, 2 లాలి పాటలు, 1 హెచ్చరిక, 4 ఇతరుల మంగళ హారతులు కలవు.

డా॥ కిడాంబి నరసింహాచార్యుల వారి 'తిరునామములు', కోదాటి వారి 'ప్రపన్న గానామృతము' లందు లేనివి, ఇప్పటికి అముద్రితములుగా నున్న మణింగంటి వారి తిరునామములు - నేను సేకరించినవి - **శ్రీరామ పరము** 1, **శ్రీరామానుజ పరము** 8, **మనస్సంబోధన** 7, **ఆచార్య ప్రశస్తి** 1, - మొత్తము 17.

వీనియందు సింగారాచార్యుల రచనలు 2, ఆయన ప్రసక్తి గలవి 2 లభించిన వానిలో కొన్నిటి కర్తృత్వము తెలియలేదు. ఇచట 2 తిరునామముల నిచ్చి మిగిలిన వానిని 'అనుబంధము'న చేర్చినాను.

1. **తిరునామము :** సింగరాచార్యుల కృతియైన యిది చిలుక సంబోధన కలిగి, చివరన 'సింగరప్పని పలుకు' -'సిరిసెన గండ్ల' ప్రసక్తి యున్నందున సింగరాచార్యుల రచనగా పేర్కొనినాను. దశరథరాజ నందన చరిత్ర తాళపత్రము చివర 'శతమంతం సింగరాచార్ల తిరునామాలు' అని 'నెమ్మదిని సమ్మతిని-', 'పాయలేనె వాని చిలుకా-' అనునవి కలవు. వీని తర్వాత 'ఇంకా కొన్ని' అని వ్రాసి. మరి మూడు తిరునామములు లిఖింపబడియున్నవి.

ఈ ఆధారముల వలన వీనిని సింగరాచార్యుల రచనలుగా పేర్కొను చున్నాను.

'నెమ్మదిని సన్మతిని సమ్మతిని సౌమ్యగము
కమ్మకొని యేలునే చిలుకా!
ముమ్మరపు యెమ్మెలను గుమ్మి గరువమ్ములను
జిమ్మి కడతేర్చవే చిలుకా!
చారు వందారు మందారు గభీరు నిండారగా నమ్మవే చిలుకా!
మేరు నగధీరు సువిచారు మదిగోరి విభుజేరి కడతేరుమో చిలుకా!
ఘోర సంసార దుర్వార దుశ్చార గత నారముల నేలునే చిలుకా!
సార గుణ హార సుఖ కార భవదూర భవహార మోక్షప్రదుడె చిలుకా!
లీలకే లోలవై చాల కర్మాల బడి యేల రట్టయ్యేదవె చిలుకా!
కాల భట జాల కరవాల శిత శూలముల పాలగుట మేలటవె చిలుకా!
చాల బుధ జాల నుత శీలుని కృపాలు యతిపాలు పదములు నమ్మ
చిలుకా!

చాల జన్మాల గతి కీలుడుపు నా జగజ్జాలు వశమై మెలగు చిలుకా!
మించులను మించు సతులంచు సుతులంచు భ్రమియించు మాయలో బడకె
చిలుకా!

పంచశరు డించు విలువంచి నిను బొంచి చౌవంచ శరముల నేయు చిలుకా!
ఎంచు ఘను డంచు మది నూచు గురు డంచు నుతు లంచు యతి చెందవే
చిలుకా!

ఎంచు ప్రభు వంచు మది నుంచు రక్షించు నిక త్రుంచు తద్దోషములు
చిలుకా!

శ్రీమ దిభరామ శుభ నామ గుణ ధాముడీ రామానుజార్యులే చిలుకా!
భీమ శరధీ మహిత తాపస గుణ ప్రకట సామజ మృగేంద్రుడే చిలుకా!
పామరుల నేమరక తామె కృప నోమి కడు సేమమున బ్రోచునే చిలుకా!
ప్రేమమున నను జూడ .... నిను గోమునను కామించి యేలునే చిలుకా!
చింత గోరంత పల దెంత పని కింత వలవంతలను దగులకువె చిలుకా!
వింత మతిపంతు జయవంతు గుణవంతు బలవంతు మది నమ్మవే చిలుకా!
కంతు గురు చేత బోధింతు రక్షింతు నను వంత మలరెడు గురుడె చిలుకా!
చెంత సిరిసెనగండ్ల నరసింహు కొలిచేటి సింగరప్పని పలుకె చిలుకా!'

దీనియందు శ్రీమద్రామానుజ ప్రసక్తి యుండి ఆత్మ నివేదన చేయబడినది. సింగరాచార్యుల ఇష్ట దైవము సిరిసెంగండ్ల నరసింహస్వామి ప్రసక్తుడైనాడు. రెండవది: చిలుక సంబోధన, చెన్నయాచార్య ప్రశంస గలది.

'పాయలేనే వాని చిలుకా - చాలా
మరులు గొని యున్నానె చిలుకా!
నాయకారము బోనె చిలుకా - పర
వాసుదేవుడె అతడు చిలుకా!
తా పరబ్రహ్మ మే చిలుకా - భక్తుల
వరము లిచ్చెడి ఘనుడె చిలుకా!
దానవరుల పాలిటి గరుడె చిలుకా - తాను
విష్ణ వర్ధనుడేను చిలుకా! (విష్ణువు, అర్జునుడు)
మనసైని చృష్టి చాలనె చిలుకా - అట్టి
విష్ణుని రమ్మనవె చిలుకా!
సిరిసెంగండ్ల వాడె చిలుకా - ఎవ్వరి
వలచినాడేమొ చిలుకా!
ఇంక నావల్ల నేరము లేదు చిలుకా - అది
ఘన గుహాయుత గిరియె చిలుకా!
ముద్దుగా నేర్చెదరు చిలుకా - అదే
తిరుమంత్ర ద్వయమె ఓ చిలుకా!
దాసులకు చ(ప)రమార్థ మొసగిరే చిలుకా - వారు
ఘన వృషాద్రీశుని కనిన వారలె చిలుకా!
కని చరించగ వలెను చిలుకా - వారు
పరవాది మత్తేభ సింహాలె చిలుకా!
బహుశాస్త్ర వాదులే చిలుకా - వారు
మహిని మహిమలు గల్గువారే చిలుకా!
శేష రూపిగ బుట్టి నారే చిలుకా - వారు
అనంతాచార్యు నాములే చిలుకా!
బోయి చూడగ వలెను చిలుకా - వేగ
సిరిసెంగండ్ల చేరుదమె చిలుకా!'*11

దీనియందు సిరిసెనగండ్ల 'ఘన గుహాయుత గిరి'గా పేర్కొనబడినది. శేషరూపి చెన్నయాచార్య ప్రశస్తి గలదు. 'పరవాది మత్తేభ పంచాస్య', 'అనంతాళ్వారు' పదములు సింగరాచార్యుల రచనతో నున్నవి. చెన్నయ గారు దాసులకు తిరుమంత్ర, ద్వయ, చరమ మంత్రములను బోధించిన ఆచార్యులు. వారిని దర్శించిన మనము తరింతుము. ఇట్లు తెల్పబడిన యీ తిరునామమున - చెన్నయాచార్యుల వారు కూడ సిరిసెనగండ్లలో నున్నట్లు గలదు (వారి నివాసము అజ్మాపుర శైలము).

లభించినంత వరకు ఇవి ప్రాచీన తిరునామములు. సింగరాచార్య కర్తృక ముగా గలవు. వీనిని బట్టి పరిశీలించిన ప్రారంభమునందు తిరునామములు 'సంబోధ నాత్మకములు', 'ఆత్మ నివేదనా పరములు', 'స్వాచార్యకములు'గా నుండి, రాను రాను వివిధ విషయముల ప్రవచించినట్లు భావింప వీలగుచున్నది.

## మంగళ హారతులు :

దేవ పూజాదికము లందు, వివాహాది శుభ కార్యముల యందు 'మంగళము' పాడునట్టి యాచారము భారతదేశ మంతటను గలదు.

మంగళమునే 'మంగళ హారతి' యందురు. దీనికి 'నీరాజనము', 'నివాళి', 'హారతి' యనునవి నామాంతరములుగా నేర్పడినవి

'ఆరాత్రిక' 'ఆరతి'యైనది.*[12] మంగళతర మైన ఆరాత్రికము మంగళా రాత్రికము. మంగళ ఆరతి, మంగళారతి, మంగళార్తి యై ఉచ్చారణ వశమున 'ఆరతి'లోని 'అ' కారము 'హ' కారముగా మారి 'మంగళ హారతి' ప్రచార మైనది.

దీనియందు 'దీప', 'కర్పూర' భేదములు గలవు. దీపముతో నిచ్చు దానిని దీపారతి యని, కర్పూరముతో నిచ్చు దానిని 'నీరాజనము' అని వ్యవహరింతురు. దేవాలయములందు దీపారతి 'దీపార్తి' గను, ధూప ఆరతి 'ధూపార్తి' గను వాడుకలో గలవు.

మంగళ శబ్దము శుభ సూచకముగా అతి ప్రాచీనమై వేదమునందును, కావ్య లక్షణము నందును గలదు.

జానపద సాహిత్య పరిశోధకులు మంగళ హారతులను భక్తి గేయములుగా పేర్కొని వీనిని వర్ణనాత్మక, స్తోత్ర, భక్తి, వేదాంత, శృంగార, హాస్య విభాగము లొనర్చిరి *[13]. ఇంకను వస్తు వైవిధ్యము ననుసరించి 1. భగవద్వర్ణన, 2. రూప వర్ణన, 3. గుణ వర్ణన, 4. గురు పరములు, 5. ఆచార్య (రామానుజ, ఆళ్వారులు) పరములు, 6. కథాత్మకములు, 7. సన్నివేశాత్మకములుగా వీనిని విభాగించి, భాషా పరముగ సంస్కృతము, తెలుగు, ద్రావిడము అని మూడు రకములుగా పేర్కొన వచ్చును.

సంగీత పరమైన 'లయ', మంగళమ్, నీరాజనమ్, నివాళి, హారతి యను వానిలో నొకటి పల్లవిగా నుండు వీనియందు రచయిత ఇష్ట దైవ స్తుతి, గురు స్తుతి చేసి తాను భగవత్కృపా పాత్రుడు కావలెనని ప్రార్థించుట ముఖ్యోద్దేశ్యము. ఇందలి వస్తు వేదైనను పై పద్ధతి మాత్రము మంగళహారతుల యందు తప్పనిసరిగా ఉండును

ఉదా:- 'సాపరాధ నిరాప! దివ్య ప్రతాపగిరి హరిరూప! హరోమకలాప!
సారంగాద్రి శిఖరోద్దీప! మధురాలాప! భవతే—' ఇత్యాది.

దీనియందు ప్రతాపగిరి నరహరి కవి యిష్ట దైవము. సారంగాద్రి శ్రీరామచంద్ర స్వామిని గూర్చి చెప్పబడిన యీ మంగళ హారతి గోవర్ధనం వేంకట నరసింహాచార్య కర్తృకము.

'శ్రీ శేషాచల రక్షకీ, నృహరి సుధీ సారథికీ, రాశీకృత సేవధికి
రాజాద్రి గుహా నిధికీ ——' ఇత్యాది.

మఱింగంటి వరద దేశికులు రచించిన దీనియందు శేషాచల స్వామి యిష్ట దైవము. గురువు నృసింహ దేశికులు రాచకొండ (రాజాద్రి) శ్రీరాముని విషయము గలదు.

విశిష్టాద్వైత సంప్రదాయ ప్రచారమున మఱింగంటి వారి తిరునామము లతో దాటు మంగళ హారతులును భక్తజనాకర్షకము లైనవి. వారు తమ సంచారమున సందర్శించిన వివిధ దేవాలయము లందలి దేవతల గూర్చియే గాక, శ్రీరామానుజ, ఆళ్వారాదుల గూర్చి చెప్పిన మంగళ హారతులును గలవు.

వివిధ ప్రాంతముల నుండు మఱింగంటి వారిని వారి బంధువులను సందర్శించి, వారి కొందరిని లేఖల ద్వారా సంప్రతించి సేకరించిన మంగళ హార

తుల యందు ముద్రితములు, అముద్రితములు గలవు. *14 పేరిలో కొన్ని తెను గునను, మరి కొన్ని సంస్కృతమునందును చెప్పబడినవి (లక్ష్మణ దేశికుల వారు ద్రవిడ భాషా మంగళ హారతి నొక దానిని రచించిరి).

లభించిన వానిలో ముద్రితములు 45, అముద్రితములు 9. వీని వివరములు:

1. **అప్పల దేశికులు**:- మొత్తము 13, సంస్కృతము 10, తెనుగు 3.
2. **నృసింహ దేశికులు**:- మొత్తము 12, సంస్కృతము 6, తెనుగు 6.
3. **లక్ష్మణ దేశికులు**:- మొత్తము 20. సంస్కృతము 9. తెనుగు 10, ద్రావిడము 1.

అముద్రిత మంగళ హారతులు అనుబంధమున నీయబడినవి. మొత్తము మంగళహారతులు శ్రీరామ, గోపాల, గోదా, నృసింహ, రామానుజ, అళ్వారాచార్య, గురుస్తుతి పరములుగా నున్నవి.

అనుబంధమున ఈయబడినవి గాక రెండు (అముద్రిత) మంగళహారతుల నిచట పేర్కొనుచున్నాను.

1. సూర్యాపేట సమీపమున గల రేపాల క్షేత్ర **నృసింహస్వామిని** గూర్చి అప్పల దేశికుల పౌత్రులైన **రాఘవ దేశికులు** చెప్పినది (దైవవర్ణన):

'కరభోరు లివరె మంగళము నరహరికి - సఖా
కర భోరు రేపాల ధరణి ధర దరికి
కరభోరు లివరె......' (పల్లవి)

తరసఘుస్సార సముత్కర సదా తరళ తర
దర హరణ కరణ సుందర దర సదరికి-
చరణ సరసిజ శరణ వరణ పటల
కరణ సంసరణ సరణి మహాబ్ధి
తరణ మణి తరికీ—
కరభోరు లివరె.....

కరశిఖర శేఖర ముఖర ముఖ నిఖాత
నరఖాదన పాపట్యానాము చరచరికి—

పరమధీః ప్రహ్లాద భరణ వరణ స్ఫుర
త్పరిషహాయితాత్మ నిర్భర దయా ఝరికీ - కరభోరు లివరె...
మరకత హరి స్మణీ శరద చారు శరీర
భరణ విహరణ సకాభరణ వృష గిరికీ
వరణీయ గుణ రాఘవ గురు చిత్తాబ్జ బం
ధుర రుచి శుభంకరికీ - నత వరికీ
కరభోరు లివరె మంగళము సరహరికీ - శుభా
కర భోరు రేఖాల ధరణీ ధర వరికీ!'

దీనియందు నృసింహ వర్ణన ముఖ్యము, కరభోరు = స్త్రీ, శుభాకర-భా-ఉరు = శుభంకరమైన కాంతిచే గొప్పనైన - అని 'కరభోరు' శబ్దము ప్రయోగింపబడెను.

2. జడ్చర్ల తాలూకా **గంగాపుర శ్రీ చెన్నకేశవ స్వామిని గూర్చి లక్ష్మణాచార్యుల వారు** చెప్పినది. ఈ రచయిత 80 సం॥ లకు పూర్వము గంగాపురమున నివసించెను.

'నివ్వాళి శివ్వరే మీరలు జవ్వను లీ వేళ - మన
నివ్వాలు వోజివ్వుచు మది నువ్వును గల మాధవునకు
నివ్వాళి శివ్వరే మీరలు జవ్వను లీ వేళ - (పల్లవి)

తన పద చింతన దగు చే
తన రతికిని జతనమైన
తనుగా తన తన వారల
తనయుల గన టనరన్
తన దయ పూతన యుగలన్

దనియగ నిడి త్రోచెకి దార
తన మీ వర్తన మేమన
ధన మని కీర్తన జేయుచు - నివ్వాళి శివ్వరే......'

వర సారస సంస్కృత పద కర సారస చరాదిమ ధీ
వర సాయప సాహస జయకరుడై —

కర భుజ బల కర దనుజాంతర నాశంకర విద్యాధరుడై
కరుణామృత కరుడగు శ్రీకర మూర్తికి నివ్వాళివ్వరే !

భవ సంభవభవ ముఖ స్వర్భువ నాధిపు లీతని పై
భవ మెన్నుట మాదు ససంభవ మని కని తెలిసి
భవ బంధము లుడిపిన తమ భవ మిడగల తత్పరు లం
భవ భజనము బాయక యీ భువన త్రయ భవనునకు
నివ్వాళివ్వరే!

మందర గిరి ధర యని మన మందర మాతని కరుణా
పంప కటాక్షామృత రసముం దనురాగమునన్
మందమతుల గూడు కతన మందారుం దను సమ్మత
ముందుచు శ్రీ కేశవ పురి మందిరునకు సుందరునకు
నివ్వాళివ్వరే మీరలు జవ్వను లీ వేళ......'

దీనియందు గురుస్తుతి, కవి నామములు లేవు, మంగళ హారతి వ్రాసి పెట్టబడిన కాగితమునందు 'మఱింగంటి లక్ష్మణాచార్య దాసుడు రచించి సమర్పించినది' - అని కలదు.

(కృష్ణ-విష్ణు స్తుతి ముఖ్యముగా నున్న యీ మంగళ హారతి గంగాపురం దేవాలయార్చకులు వంగీపురం వేంకటాచార్యుల వారివద్ద లభించినది), ముద్రిత మంగళ హారతులనుండి యొకటి :

విశిష్టాద్వైతమున పెరియాళ్వారుల (విష్ణుచిత్తుల) స్థానము గణనీయమైనది. వీరు వేదమున కోంకారమువలె నాలాయిర దివ్య ప్రబంధమునకు ప్రారంభముగ పాడిన 'తిరుప్పల్లాండు' భగవంతుని శ్రీపాదముల గూర్చి చేసిన మంగళాశాసనము. ఈ పద్ధతియే మంగళహారతిగా, దైవమును గూర్చిన మంగళాశాసనముగా స్థిరపడినది.

'పల్లాండు పల్లాండు పల్లాయిరత్తాండు పలకోటి నూరాయిరమ్
మల్లాండ తిండోళ్ మణివణ్ణా ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు' - అని

(చాణూర ముష్టిక లను మల్లురను మల్లుల వలె నలిపివేసిన స్వామీ! నీ శ్రీపాదములకు ప్రళయకాల పర్యంతము మంగళము!)

దీని ప్రభావము విశిష్టాద్వైతమున మంగళహారతుల రచన కాధారము. ఇట్టి పెరియాళ్వారుల గూర్చి లక్ష్మణ దేశికుల వారి మంగళ హారతి—

'మంగళం భవతే మహామతే!
రంగేశ హృదయాంతరంగ! తత్పద కంజ
భృంగ! నిత్య సూరి పుంగవా! మంగళావహ గుణ
మణిమందిరా! సర్వసంగ పరిత్యాగ సాధ్యానుషంగ! మంగళం

శ్రీశ కుసుమ సంకాశ విగ్రహా సన్నివేశ పేశల మృదులాశయా
ఆశీర్వచోభినివేశ కార్తియుత చిత్తకోశ ప్రదేశ ప్రకాశానుధీశా! మంగళం

బాణ ధనుః పురభాను విష్ణుచిత్త నామాభిరామా! సుధీమణే!
శ్యామల పటపత్ర శయన సమర్పిత కోమలాభిల మృదు కుసుమ
సుధామా! మంగళం

శేషగిరీశా విశేష కటాక్ష నిశ్శేష ప్రావృత గుణశేషిణే
పోషక ధారక భోగ్యభూత చరమశేషి నృహరి గురు చిత్తాబ్జ పోషిణే
మంగళం

(మణవాళాచార్యుల వారి 'తిరునామములు' - 112వ పుట)

మరింగంటి వారి మంగళ హారతులయందు ఇష్టదైవ మైన శ్రీశేషాచలపతి (వృష గిరీశుడు)తప్పక పేర్కొనబడుటతో బాటు గురునామ స్మరణ ముండును (కొన్ని తిరునామముల యందును వీరు ఈ పద్ధతిని పాటించిరి). ఇది వీరి మంగళ హారతుల ప్రత్యేకతయే గాక 'మరింగంటి వారి రచన' యని గుర్తించుటకు ముఖ్యాధారము.

దేశి కవితా పద్ధతికి చెందిన యీ మంగళ హారతులు, తిరునామములు వీరి యితర సాహిత్యమున కన్న మిక్కిలి ప్రచారము నంది విశిష్టాద్వైత సంప్రదాయమును సామాన్య జనులయందు వ్యాప్తి చేయుటకు ఎంతగనో తోడ్పడినవి. వీనియందలి కవితా కళ, వస్తు వైవిధ్యము, భక్తి ప్రబోధము ముప్పేటలుగా గలసి, పండితులనే గాక పామరులను సైత మాకర్షించినవి.

## సూచికలు :

1. 'తెలుగులో కొత్త వెలుగులు' - 1 వ భా. పుట 108.
2. 'నామ ప్రాకాశ్య సంభావ్య క్రోధోపగమ దుత్సవే'-గురుబాల ప్రబోధిక - 859 వ పు.
3. 'సకలేతర విలక్షణ! ఆర్థి కల్పక!' - అని శరణాగతి గద్యయందు శ్రీమద్రామానుజుల వారు భగవంతుని సంబోధించిరి.
4. విజ్ఞాన సర్వస్వము, 4 వ సం. పుట 1070 - విస్సా అప్పారావు గారి వ్యాసము.
5. 'తిరునామములు - సమగ్ర పరిశీలనము'. - పు. 6.
6. వాడి తిరునామ మనగా మంగళాశంసనము, అంపు కుచాహారణ—
 పొరపుగడ్ కమలై వాడి వరన్దామన్ పదం గళ్ వాడి...
 వారిశూడులగమయ్య వైష్ణవ కుడ్డాంగళ్ వాడి' - 'నిత్యానుసంధానము'
7. 'తిరునామములు - సమగ్ర పరిశీలనము' - పు. 21
8. ,, ,, - పు. 81-192
9. 'తిరునామములు' కరదీపికలో మడింగంటి శ్రీరంగాచార్యుల వారు తెల్పినది.
10. 'ప్రపన్న గానామృతము' లోని తిరునామములు కొన్ని డా॥ కిడాంబి వారి రచనలో నున్నను, లేనివి కూడ మరి కొన్ని 'ప్రపన్న...'లో కలవు. వాని సంఖ్యలు 4, 6, 7, 13, 16, 20, 21, 23, 30, 31, 41, 44, 46, 47. వీనిలో 41 వ నెంబరు లక్ష్మణ దేశికుల వారి రచన, వారి తిరునామములలో చేరలేదు.
11. చిలుక సంబోధన తిరునామములు కొన్ని డా॥ కిడాంబి గారి 'తిరు నామములు' (పు. 412) గ్రంథమున గలవు.
12. 'ఆరాత్రిక ఆరతి (నీరాజన కర్మణి) దీపోహి రాత్రా వేవ ప్రదర్శ్యతే, ఇదం దినేఽపి ప్రదర్శ్యతే' ఇతి - సంస్కృత వాచస్పత్యమ్.
13. 'తెలుగు జానపద గేయ సాహిత్యము' - పుట 406.
14. 'ప్రపన్న గానామృతము' - మణవాళాచార్యుల వారి తిరు నామముల యందు ఇవి కలవు.

# 9

# చాటువులు

తెలుగు కవిత ఆశు, మధుర, చిత్ర, విస్తర కవిత్వము లని నాలుగు విధములు. వీనికే చతుర్విధ కవిత అని పేరు.

నన్నయగారి కాలమునుండి ఈ పద్ధతి తెనుగున వెలయుచున్నది. వీని వివరణము —

1. **ఆశు కవిత** : కలము, కాగితము లేక అడిగిన వెంటనే ఆశువుగా చెప్పెడు కవిత, అష్టావధాన, శతావధాన, ఘటికా శత గ్రంథ రచనలు.
2. **మధుర కవిత** : దేశి కవితా భేదము లైన పదములు, రగడలు, గేయములు, ఉదాహరణ కావ్యములు మొదలగునవి.
3. **చిత్ర కవిత** : శబ్ద వర్ణ చిత్ర రచనలు, గర్భ, బంధ కవితలు - మొదలగునవి.
4. **విస్తర కవిత** : పురాణ, ఇతిహాస, కావ్య ప్రబంధాదులు.

వీనియందు 'ఆశు కవిత'లో చాటువులు చేరును.

అప్రయత్నముగ అప్పటి కప్పుడు కవియొక్క స్వీయానుభవము పద్య రూపముగా వెలువడియే చాటువు వీనియందు చెప్పబడిన విషయము చమత్కారముగా నుండును.

'చాటుః[1] అనగా ప్రియ వాక్యము. సంస్కృతాంధ్ర నిఘంటువులలో 'చాటువు' నకు 'ఇంపైన సంభాషణ', 'చమత్కృత సంభాషణ', 'ప్రియ వాక్యము' - అని వ్రాయబడినది. వీని ననుసరించి పరిశీలించినప్పుడు - ఏదేని చమత్కారము కలిగి యుండుట 'చాటువు' ప్రధాన లక్షణ మగును. ఇవి సిద్ధాంతవాదములకు, వినోదపు కథలకు, శృంగార హాస్య అధిక్షేపములకు, సాంఘిక విమర్శలకు, వివిధ భావన నిలయములు.

చాటువు లెందరో రసికుల రసనాగ్రముననే గాదు; పామరుం సంభాష ణము లందును, అముద్రితముగా నున్న తాటాకు పుస్తకముల యందును నిలిచి యున్నవి. పెద్ద లెందరో సేకరించిన సంస్కృతాంధ్ర చాటువులు కొన్ని ముద్రిత గ్రంథములుగా వచ్చినవి.*2

సంస్కృతాంధ్ర కవులు వారి రచనలలో 'చాటూక్తి'ని 'చాటుకారము' లను పేర్కొనిరి. సంస్కృతమున భోజ కాళిదాస శ్లోకములు చాటు కవితలుగా ప్రసిద్ధములు.

తెనుగున - వేములవాడ భీమన, శ్రీనాథుడు, రామకృష్ణుడు, పెద్దన, భట్టు మూర్తి మొదలగు వారు ఈ ప్రక్రియకు ప్రౌఢ శైలి నాపాదించి చమత్కార యుత మొనరించి శాశ్వత మొనర్చినారు.

ఆధునిక యుగమున శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి, తిరుపతి వేంకట కవులు, కొప్పరపు కవులు తమ ఆశువుతో చాటు కవితకు పట్టము కట్టిరి. వ. సు. రాయ కవి, చిలకమర్తి, పానుగంటి వారు తమ మాధురీ కవితను దీనియందు రంగ రించిరి.

వ్యక్తుల లోకానుభవము, సాంఘిక స్థితి, దూషణ, భూషణములు, కావ్య ప్రబంధముల కన్న చాటువుల ద్వారానే మిక్కిలిగా వ్యక్తమగును. కావుననే ఇవి ఎంత ప్రాచీన కాలమున చెప్పబడినను, అన్ని కాలములకు అనువుగా చెలామణి యగుచున్నవి.

"చాటువును చదివి ఆనందించటం ఎంత సులభమో దాని లక్షణాన్ని నిర్దేశించటం అంత కష్టం.చాటువులో అందమైన వస్తువు కంటె అందంగా చెప్పిన పద్ధతికే ప్రాముఖ్యం. చెప్పిన వస్తువును ఒప్పిదంగా చేసి ఒప్పించేటట్లు చేసే సూక్తి ధారయే చాటువు!" అన్నారు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారు *3

ఇట్టి చాటువులు మన సాహిత్యమున పరంపరగా వచ్చుచున్నవి గోల కొండ ఖుతుబ్షాహీల కాలమున వచ్చిన పద్యములు కొన్ని గ్రంథస్థమైనను*4 అలక్ష్యములు మరి కొన్ని గలవు. అట్టి వానిలో మటింగంటి సింగరాచార్యుల చాటువు లున్నవి.

'చాటు పద్య రత్నావళి' యందు మటింగంటి వారి చాటువులు కొన్ని ప్రచురింపబడినవి. వానితో పాటు మరి కొన్నింటిని ఈ ప్రకరణము నందు చేర్చి

నాను. ఇవి ఆ నాటి కవుల ఆత్మ వ్యథను, దూషణ భూషణములను, భక్తి, అనురక్తులను వ్యక్తపరచును.

## 1. వేంకట నరసింహాచార్యులు :

జనకసుతాభ్యుదయాది షోడశ మహా గ్రంథ నిర్మాతయైన ఈ కవి నివాస గ్రామము 'అనుముల'. ఆ నాడు ఎవరో వితరణ శీలురైన భక్తులు వీరికి భూదానము చేయగా దానిని మరెవరో సంగ్రహింప యత్నించిరి. అట్టి బ్రహ్మస్వ గ్రహణముల గూర్చి చెప్పిన 12 **'అగ్రహార పద్యము'లలో** రెండు మాత్రము లభించినవి. వానిలో మొదటిది :

'మా సరివారు లేరనుచు మాన్యపుభూముల పంట పొట్టకుం
గ్రాసము చేసి నీచ నరకంబుల కేగెడు త్రోవ గాంచగా
మీసము దువ్వి విప్రునకు మేమిడు వారమె క్షేత్రమంచు ను
ల్లాసము చేత గాసిలి చలంబున నుందురు దుష్ట భూజనుల్!'

బ్రాహ్మణ మాన్యముల సేద్యము చేసి వచ్చిన పంటలో కొంత యైనను భూమి యజమానికీయక అనుభవించు దుర్మార్గుడు ఆ క్షేత్రమును సైతము హరింప బూనినపుడు బ్రాహ్మణునకు కలుగు బాధ వర్ణనాతీతము. దానినే ఈ పద్యమున కవి వ్యక్తపరచెను.

రెండవ పద్యము :

'తన కళత్రముకు కెంతయు మోహ మొనరించె
నని వరాహ స్వామి యలుగు జూచు
మా యత్తపై యాసచేయు వీ డెవడని
రామచంద్రుండు శరంబు దొడుగు
వసుమ కే నిచ్చితి వసుధ యంచని బలి
చక్రవర్తియును వాక్కరము దరుము
విశ్వప దత్తోర్వి కాచు నీదని జామ
దగ్న్య పరశ్వధాస్త్రంబు బట్టు

నందుకే భూపతులు బ్రాహ్మణాగ్రహార
ములను కన్నెత్తి చూడరు మోస మనుచు

ననుదినము దల్చి మిక మాన్యములను నీయ
విప్ర నికర విధేయ! గోవింద రాయ!'

బ్రాహ్మణాగ్రహారమును హరించిన వారిని గూర్చి వరాహస్వామి, శ్రీరామచంద్రుడు, బలి, పరశురాముడు - ఎట్లు కోపింతురో తెల్పి, ఈ కారణమున రాజులు మా అగ్రహారముల వైపు కన్నెత్తి చూడలేదు. కావున మాన్యముల నీయ దలంచ వలెనే గాని - వానిని గ్రహింపరా దని తెల్పుచు ఈ సందర్భముగా వరాహాద్యవతారముల నిందుప యోగించుకొని విష్ణుపారమ్యమును వ్యక్తముచేయుట దీనియందలి చమత్కారము.

## 2. వరద దేశికులు :

నరసింహాపుర నివాసి యైన దేశికుల వారు అనేక మంగళ హారతులు, తిరునామముల చెప్పి ప్రసిద్ధు లైనారు. వీరి చాటు పద్యములలో ఒకటి మాత్రమే లభించినది :

'రాజిత భాజనంబుగ కరంబున సంపెగ నూనె గొంటివే
రాజముఖీ! యిదేటికి? తిరంబుగ నంతిపురంబు నందు నా
రాజ ముఖీ లలామకు విరాజిత ధామకు నైజయాన జి
ద్రాజ మరాళ కుంతలకు రాజిత మత్త గజారి మధ్యకున్'

దీని చివరి చరణము 'రాజ మరాళకున్ - తలకు రా - జిత మత్తగజారి మధ్యకున్' అని, "రాజమరాళకుంతలకుదా! జితమత్తగజారి మధ్యకున్" 'చేతి యందు గల సంపెగ తైలము ఎవరి కొరకు?' అని రాజముఖియైన స్త్రీని ప్రశ్నింపగా ఆమె 'ఇది రాజ మరాళకున్ తలకు' (రాజమరాళగమనయైన యామె యొక్క తలకు) అని, 'రాజమరాళ కుంతలకురా!' అనియు రెండర్థములు వచ్చునట్లు చెప్పినది. తైలము నుపయోగించు అంగన 'జిత మత్త గజారి మధ్య' (సింహమధ్య). 'రాజ మరాళ కుంతలకు' అని సభంగ శ్లేషతో చెప్పుట ఈ పద్యమందలి చమత్కృతి!

## 3. అప్పల దేశికులు :

శ్రీరామ పాదుకా స్తవ కర్త లైన దేశికులు చిన్నతనమున తమ తండ్రి గారితో కలిసి **'తొగట్టాయి'** గ్రామమునకు వెళ్లిరి. అచటి వేణుగోపాల స్వామిని

గూర్చి, 'తొగరు జాతి నికేతన! తార్క్ష్య కేతనా!' యని పితృపాదు లనగా వెంటనే దేశికులవారు—

'శిక్షిత పూతనా! దితిజ జీవ నిఘాతన! రాధికా వధూ
వీక్షిత నూతనా! పరమ వేద సనాతన! శత్రులోక సం
ధుక్షిత యాతనా! నరక దుర్భర దౌర్భ్యగఖాభిపాతనా!
రక్షిత చేతనా! తొగరు జాతి నికేతన! తార్క్ష్యకేతనా!'

యని పూరించగా దీనికి దేశికులవారి తండ్రి పరమానందము నందిరి. నేటి మహబూబ్‌నగర్ తాలూకాలోని 'తొగర్హాయి' కవిగారి స్వగ్రామమైన నరసింహాపురమున కనతి దూరములో నుండును.

## 4. వేంకట నరసింహాచార్యులు :

శాలాంక నందినీ పరిణయకర్తయైన ఆచార్యులవారు చెప్పిన చాటువులలో రెండు మాత్రమే లభించినవి.

వానియందు దొకటి - కవిగారు శిష్య సంచారమును పూర్తి చేసికొని తిరిగి వచ్చుచుండగా మధ్యే మార్గమున వీరిని దొంగలు దోచుకొనిన విషయము. రెండవది - తమ అవసానదశయందు సంసార బాధల గూర్చి చెప్పినది. వీనితో మొదటిదైన సీసమాలిక—

'శ్రీ నీలగిరి సీమలో నొప్పు కనగంటి
పురము లోపలను కాపురము నొందు
ఘన మఱింగంటి భావన గుహూత్తముని పు
త్రకుఁడ నృసింహాభిధాన కవిని
యేను సంచారార్థ మేగి ద్రవ్యోపార్జ
నం బొనర్చియు మహానంద లీల
మగిడి మా గృహముకై మార్గంబు గొనిరాఁగ
నిందుర్తి సీమలోనం జనర్చు
పెద్దాపురము జాము ప్రొద్దుండగా వచ్చి
యచట నిల్వక నేగు నంతలోన
ఖలుఁడు చరిబము తిమ్మిగాఁడు కలఁడు

నతఁడు నల్లగురు దొంగ లంపఁగా వారలు
చామలపలి గుట్ట చాలు గాంచి
వెన్నాడి కనిపెట్టి లిన్నగా మము బట్టి
కన్నులు బిగగట్టి కడకు నెట్టి
పుత్రభంబు లరువది, కొంతి సవ్వాశేరు
నారికేళంబులు నాల్గు, తామ్ర
భండముల్ మూటలో గల వెన్న ముప్పది
కుచ్చాలు నొక పెద్ద పచ్చడంబు
మైసూరు శాలు, రుమాలు పట్టంచు ధో
వతులు మేల్కోట ధోవతులు రెండు
షకలాదు నొకటి కప్పా దేవతార్చన
పెట్టి గట్టిన ధసల్ పట్టు ధోతి
కాళ్ళ చెప్పుల జోడు కావి దుప్పటి జోడు
మంచి చొక్కము పైడి మాసమెత్తు

ఆస లేకుండ చంద్ర లాటి సమేతు
దోఁచుకొని పోయిన కిరాతు ధూళిచేతు
చచ్చు పెగఁజూతు వానిల్లు చిచ్చు చేతు
మిత్తి నెగదోతు పైన బండెత్తి వైతు!'

అని దోచబడిన వస్తువులను, తన కోపమును ప్రకటించినారు. చకిలము తిమ్మయ కవిగారి వాక్కువలన మరణించినను అతని పాప కర్మల ఫలము వంశమును. వెన్నాడినది. చకిలము గృహ నామము గల కరణాలు నేటికిని నల్లగొండలోను, తత్పరిసరములలోను ఉన్నారు.

పద్యమున తెల్పబడిన 'కనగల్లు' కవిగారి స్వగ్రామము; నల్లగొండకు సమీపములో నున్నది. ఇందుర్తి*5, పెద్దాపురము, చామలపల్లి యనునవి నేడు నల్లగొండ జిల్లా చింతపల్లి మండలములో గలవు ఒకనాడీ ప్రాంతమును 'ఇందుర్తి సీమ' యని వ్యవహరించువారు.

రెండవ పద్యము—

'పెద్దల్లుం డొక నల్ల త్రాచు, ప్రియమౌ పెండ్లాము నా పాలికే
జిద్దూఖోరయె, కన్నతల్లెపుడు నా చేటే నిరీక్షించు, జే
హద్దౌ కాపుర, మగ్ర శిష్యజను లర్థాంధుల్ దయాహీను, లే
ప్రొద్దే తుచ్ఛుల గూడియున్న సుతుఁ డప్పున్ సప్పు చింతింపఁ, డ
స్మద్దోషంబుల నెన్నుచున్ వదిన నా మాటంటె రౌద్రాకృతిన్
హద్దా హద్ది టెనంగు, నాత్మ సుతుఁడే యుక్తం బెరుంగండు, నే
నెద్దిం దోచక పొద్దుటొక్క పొరుగిల్లే సొచ్చినన్ రంకుతే
సిద్ధంబై పెనురద్ది ఖాసిలెను ఛీ! ఛీ! యిట్టి పాపం బిలన్
గద్దా! శ్రీ కనగంటి వాస! నను శీఘ్రంబే మృతుం జేయవే!'

దీనియందు కవిగారి చరమ జీవిత బాధలు చెప్పబడినవి. వృద్ధాప్యము, కుటుంబము పెద్దది. దీనికి తోడు అన్నగారి (కేశవస్వామి శతకకర్త) సంసార బాధ్యత కూడా వీరిపైననే పడినది. ఎదిగిన కుమారుడు యుక్తాయుక్త జ్ఞాన శూన్యుడు. ఈ స్థితిలో వీరిని వదినెగారు, భార్య బాధించుట. ఇన్ని కష్టములనుభవించుటకన్న మరణమే మేలని దైవమును ప్రార్థించి, తరువాత కొద్ది రోజులకే పరమపదించినారట! ఇంటిలోని బాధ లిట్టివి. పూర్వకవి యొకరు—

"ఇల్లు భుజంగమైన తన యిష్టుఁడు వైరికి మర్మ మిచ్చినన్
కల్ల నిజంబు లేర్పడిన కానక భూపతి దంపఁ బూనినన్
తల్లి విషంబు పెట్టినను తండ్రి ధనీశుల కమ్మజూపినన్
పల్లఘుఁ డొల్లకున్న మఱి వారల కెవ్వరు దిక్కు భూవరా!"

అని పగచెను. వీనిని మించి వేంకట నరసింహాచార్య కవి బాధ లున్నవి. 'చితా చింతా ద్వయో ర్మధ్యే చితా ఏవ గరీయసీ' గదా!

ఆచార్యుల వారి వాక్ఛక్తిని గూర్చి వారి బంధువులే గాక కనగల్లు ప్రాంతము వారు కూడా ఈ క్రింది విషయము నుదాహరణముగా చెప్పుదురు. అది : కవిగారు తమ యింటి ముందు గల వేపచెట్టు అరుగుపై కూర్చొని **'శాలాంక నందినీ పరిణయము'** ను వ్రాసికొనుచు పూర్తియైన తాటాకులను ప్రక్కకు పెట్టి గృహములోని కరిగినారు. ఇంతలో వీరి యింటి పాఁడి బఱ్ఱె (గేదె) వచ్చి వానిని భక్షింప నారంభించినది. లోపల నుండి విచ్చేసిన గ్రంథ-

కర్త ఈ సన్నివేశమును చూచి క్రుద్ధుడై మహిషిని నిందించుచు రెండు పద్యముల చెప్పగా, అవి పూర్తియగువరకే అదే చెట్టు క్రింద పడి గేదె మరణించినది. కవిగారి గ్రంథ నష్ట కోపము పాడి గేదెను బలిగొనినది. అప్పటినుండి నేటికిని ఈ కవిగారి శాఖకు చెందిన వారికి గేదెలు బ్రతుకవు.

కనగల్లులో ఆచార్యుల వారు కూర్చొని గ్రంథ రచన మొనర్చిన వేప చెట్టు, దాని యరుగు ఇప్పటికి ఆ వీథి వారికి విశ్రాంతి స్థలము.

## 5. జగన్నాథాచార్యులు :

వీరి స్వగ్రామ మగు రంగాపురమున దేవాలయార్చకులు ముడుంబ రంగాచార్యుల వారు జాతాశౌలాచము పాటింపక స్వామి వారికి నిత్యార్చనలు చేయుచుండిరి. ఈ విషయము కవిగారికి తెలిసి బాధపడి - అర్చక స్వాములతో 'ఈ పని తగదు' అనినారు. పూజారి ఈ విషయమును పెడచెవిని పెట్టగా 'పండిత సభకు సిద్ధము కావలసిన' దని ఆజ్ఞాపించి ఆచార్యులవారు కొన్ని పద్యముల వ్రాసి పంపిరి. వానిలో లభించిన రెండు[6]* పద్యములు :

'భోగ్య సుఖంబు లిచ్చుటకు పూర్ణ వయోరమణీయ భర్త దా
యోగ్య వచ శ్చమత్క్రియల నుల్లములం గరగింప నెట్టి దౌ
ర్భాగ్య పతివ్రతల్ విటుని చెంతను హీనత నుందురే! యిసీ!
రుగ్యుతయై పతిం గనిన రోయు నతండు చెడుం బరేఱహామున్'

అని వ్రాసి పంపించి దీనికి ప్రత్యుత్తరము రానందున—

'ఉత్పలమాల శీర్షమున నుంచుట భూషణ మంతె గాక వా
గుత్పతనం బొనర్చు విహితోత్తర భావము దోఁచె పత్రికన్
జిత్ఫల భంగి కూడదిక శ్రీ జెలఁగన్ సభదీర్చి దెల్ప న
స్మ త్పరమార్థ మచ్చటనె సభ్యు లిటౌనన బల్కు దుల్కఁగన్!'

మరియొక ఉత్పల మవసర మైనది. పండిత సభయందు కవిగారే జయించి ప్రశంసింపబడిరి.

వీరి 'పరిచయము'న పై విషయము విపులముగా గలదు.

## 6. శ్రీరంగాచార్యులు :

**(సీతారాం బాగ్)**

ఆచార్యుల వారు వివిధ సందర్భములలో చెప్పిన సంస్కృతాంధ్ర ప్రాస్తావిక రచన లనేకము గలవు. వానియందు లేఖన రూప మందినవి స్వల్పము. గుర్తున్న వానిలో కొన్నిటిని వ్రాసి యిచ్చిరి అవి :

### 1. మన్మథుని గూర్చి :

'నీవు లేకున్నచో నెలఁత జవ్వనమునన్
చెక్కువా డేడిరాఁ చక్కఁదనము?
నీవు కాకున్నచో నేర్పు మొనగాఁ డేడి
చెలి కన్ను కొనలకున్ చిలిపితనము?
నీవు రాకున్నచో నింపు నెవ్వఁడు సకియ
కెమ్మోవి బింబాన కమ్మదనము?
నీ వగ్గి పాలైన నిల్పుటిం కెట్లురా
చిన్నారి వలపులో చిక్కఁదనము?

నీవు లేకున్న రాగమ్ము నిలుపు నెవఁడు
కామినీ కమ్ర గండ భాగముల పైన
వేన వేలేండ్లు నీవు జీవించ వలెను
రతి మనోహర! లెమ్ము రారమ్ము మరల!'

### 2. ధరల పెరుగుదల గూర్చి-'అత్యర్ఘవిలాసః' :

'గురు ర్బుధో రాజ కవీశ్వరా శ్చ
భవ న్త్వశక్తాః కిల యన్నిరోద్ధుమ్।
శ్రియఃపతి ప్రీతికర శ్చకాస్తి
అహో బలీయా నతను ర్మహార్ఘః॥

ధరల పెరుగుదలను గ్రహాధిపతులు సైతము నిరోధించ లేకున్నారు— అని ఈ శ్లోక భావము. దీనియందలి—

గురువు = ఆచార్యుడు, బృహస్పతి; బుధుడు = పండితుడు, బుధుడు; రాజు = ప్రభువు, చంద్రుడు; కవి = కవీశ్వరుడు, శుక్రుడు; ఈశ్వరుడు = అధికారి, శివుడు; శ్రియఃపతి = ధనికుడు (వ్యాపారి), విష్ణువు.

ధర లధికము కాగా వీరందరు బాధపడుచున్నారే కాని వాని పెరుగుదలను నిరోధించ లేకున్నారు. ఇందుకు 'శ్రియఃపతి' (వ్యాపారి) మాత్రము ప్రీతికరముగా నున్నాడు. వీని యన్నిటికి కారణము 'మహార్ఘము అతను'మైనది (శరీరము, రూపము లేనిది). మన్మథుడు 'అతను' డైనను ఎంత బలవంతుడో! అదే విధముగా 'అతను'వైన మూల్యాధిక్యము కూడ బలవంతమైనదే! అని పెరిగిన ధరలను గూర్చి కవి శ్లేషలో చమత్కరించెను.

## విచిత్రోపదేశము :

ఏలూరు ప్రాంతమునందున్న మఱింగంటి వంశీయు లెవరో తమతో వాదమునకు వచ్చిన విద్వాంసునకు ఈ శ్లోకమును చెప్పి, దీని యర్థ తాత్పర్యముల వివరించవలసినదిగా కోరిరట. వచ్చిన విద్వాంసుడు ఎంతవరకు సఫలీకృత శ్రముడాయెనో తెలియదు.

హైదరాబాదులోనున్న మఱింగంటి వేంకటాచార్యులవారు (వీరిది ఏలూరు) ఈ శ్లోకమును సీతారాంబాగ్‌లో నున్న మఱింగంటి శ్రీరంగాచార్యుల వారి కీయగా వారి ద్వారా నాకు లభించినది.

శ్లో॥ 'దృగ్ భూమీ తవ సోదరౌ వసుజనాయాత్రీశలంకా యుగ
గ్రంథి ర్వేక గిరిశ్చ రాఘవ శరక్ష్మార్యోః సహస్ర శ్రుతిం ।
నో చే త్సా జననాలయే భవ ఇవోన్మగ్నా భవేత్ త్వద్వధూః
సూర్యాక్షీ తు దిశాధ్వజేశు నిధినా సంబాధితా చ ధ్రువమ్॥'

ఈ శ్లోకమునందు రావణునకు హితోపదేశము ముఖ్యముగా చేయబడి ఆ భావము మేషాది ద్వాదశ రాశి నామయుక్తమై ఉండుట విశేషము.

**దృక్, భూమీ తవ సోదరౌ** - దృక్ అనగా నేత్రములు ౨; భూమి 1. రాసులయందు రెండవది **'వృషభము'**. మొదటిది **'మేషము'**. రావణుని తమ్ము లిద్దరు. వారిలో కుంభకర్ణుడు వృషభము, విభీషణుడు మేషము.

**వసుజనాయాత్వీశలంతా** - వసుజను అనగా పురజనులు. **'వసు'** అష్ట వసువులు. ఎనిమిదవ రాశి **'వృశ్చికము'**. అనగా జను లందరు వృశ్చికముల వంటివారు. **'యుగ గ్రంథి శ్వేత గిరిశ్చ'**- యుగ గ్రంథి అనగా **చతుర్యుగ ములు.** రాసుల యందు నాల్గవది **'కర్కాటకము'**- రావణా! నీ వద్ద గలవారు ఎండ్రకాయలవంటివారు (ఎండ్రకాయల మూట), **'భేకగిరిశ్చ'** భేకములనగా కప్పలు. గిరి 7, సప్తాచలములు. **౭వ రాశి 'తుల'**. వీరినందరిని ఏక మొనర్చుట 'కప్పల తక్కెడ' వంటిది. **'రాఘవ శరష్మరోశ్యేక'**- శరములు 5. (మన్మథ శరములు). రాసులలో నైదవది **'సింహము'**. రాఘవుడు సింహము. అరి ౬, అరి షడ్వర్గములు, **ఆరవ రాశి 'కన్య'** (ఇచ్చట కన్య త్వాకన్య - సీతాదేవి). **'సహస్వ శ్రుతిం'**- శ్రుతి-౪ (వేదములు). మూడవ రాశి **'మిథునము'**- అనగా రామునకు సీతనిచ్చి వారిని మరల జంట (మిథునము)గా నుండనీయుము. (అట్లు చేయనిచో నీవు) **'నౌ చే త్వా జననాలయే'**-ఆ లంక, పుట్టిల్లగు సముద్రమున, **'భవ ఇవోన్మగ్నా భవేత్'**- భవ - శివుడు (ఏకాదశ రుద్రులు), 11 వ రాశి **'కుంభము'**- అనగా కుండలవలె లంక భగ్నమగును. **'త్వద్వధూః సూర్యాక్షీ తు'**- నీ భార్య సూర్యాక్షి. సూర్య 12, రాసులలో 12 వది **'మీనము'**- నీ భార్య మీనాక్షి- ఇట్టి ఆమె- **'దిశా ధ్వజేషు నిధినా'**- దిశ - 10. **ధ్వజేషు** నిధి-౯ (నవ నిధులు). ౯వ రాశి **ధనుస్సు**- అనగా నీ భార్య మన్మథ శర తాడితయై **సంబాధితా చ ధ్రువమ్'**- బాధింపబడును. ఇది నిక్కము.

ఇది ఈ శ్లోకమునకు గల అర్థము. రావణునకు బోధించిన నీతి ద్వాదశ రాశులతో పోల్చబడి తదర్థము చక్కగా వివరింపబడినది.

ఈ శ్లోక కర్త యెవ్వరో? వారి సమాచారము మాత్రము లభింపలేదు. (అర్థమును వివరించినవారు మణింగంటి శ్రీరంగాచార్యులవారు).

మణింగంటి వారికి లభించిన యీ చాటువు చమత్కృతి కలిగి వివిధ విషయముల గూర్చి చెప్పబడి, నాటి సాంఘిక సామాజిక పద్ధతుల చిత్రించినది.

## సూచికలు :

1. చాటు + ఉక్తి = చాటూక్తి. తెనుగులోని 'చాటు' (దాపు - రహస్యము) అను పదమునకు ఈ చాటునకు సంబంధము లేదు.
   పామర జనులయందు చాటువు 'సాటువ' అయినది.
2. 'చాటు పద్య మణి మంజరి', 'చాటు పద్య రత్నాకరము', 'చాటు పద్య రత్నావళి', 'తెలుగులో చాటు కవిత్వము', 'చాటువులు', 'తెలుగు చాటువు' మొదలగునవి.
3. 'చాటువులు' పుస్తకమునకు వ్రాసిన 'అభిప్రాయం', పుట. 8.
4. 'చాటు పద్య మణి మంజరి', 2 వ భాగము.
5. 'నల చరిత్ర' పద్య కావ్య కర్తయైన సిరిప్రెగడ ధర్మన నివాస గ్రామము ఈ 'ఇంద్రుర్తి' యే!
6. కవిగారి కుమారులు శ్రీమాన్ రామచంద్రాచార్యుల వద్ద గల కాగితములలో లభించినవి.

లు

# IV

# సంస్కృత కావ్యసాహితి

## 1

## అలంకార శాస్త్రము

**శఠవైరి వైభవ దివాకరము :**

'భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్।
భక్తాంఘ్రి రేణు పరకాల యతీంద్ర మిశ్రాన్
శ్రీమత్పరాంకుశ మునిం ప్రణతోఽస్మి నిత్యమ్॥'

పన్నిద్దరాళ్వారుల నామధేయములు గల యీ శ్లోకమునందలి పరాంకుశలే శఠకోప నామ విఖ్యాతులు. వీరికి వకుళాభరణులు, నమ్మాళ్వారు లనియు నామాంతరములు గలవు.

లోకోపకరణార్థము దైవానుమతిని విష్వక్సేనాంశగా తామ్రపర్ణీ తీరమందలి కురుకాపురి యందు కారి నాథానాయకి గర్భమునం దవతరించిన శఠకోపులు చతుర్వేదాంశ సార రూపము అగు **'తిరువిరుత్తము'** (100 పాశురములు) **'తిరువాశిరియము'** (7 పాశు...) **'పెరియ తిరువన్దాది'** (87 పాశు...) **'తిరువాయ్ మొళి'** (1102 పాశు...) అను దివ్యప్రబంధ చతుష్టయము ననుగ్రహించిరి.

శ్రీమద్రామానుజుల 'శ్రీభాష్యము' నకు, వేదాంత దేశికుల వారి రచనలకు నమ్మాళ్వారుల దివ్య ప్రబంధముల వలననే వేద రహస్యములు అనుగ్రహింపబడిన వనిన వీని ప్రశస్తి ఎంతటిదో వ్యక్తమగును.

జీవులకు అజ్ఞానమును కలిగించు 'శఠ' మను వాయువును నిరోధించి నందున వీరు 'శఠకోపు' లైనారు *1 నిరంతరము శ్రియఃపతి నాశ్రయించి యున్న కారణమున శ్రీ వైష్ణవాలయము లందలి శఠకోపముపై శ్రీ పాదుక లుండును. అందుకే భగవ చ్ఛ్రీపాదుకలకు శఠకోప నామము సుప్రసిద్ధము *2

విష్ణ్వాలయము లందు శఠకోపుల విగ్రహము లేకున్నను 'శఠారి' (శఠకోపము) మాత్రము తప్పక ప్రతిష్ఠింపబడును. అవి లేని దివ్య దేశము లెచ్చట నుండదు.

ఇట్టి భగవ దవతార పురుషుని దివ్య వైభవ ప్రకాశనమును **'శఠవైరి వైభవ దివాకర'**మను పేర అలంకార శాస్త్ర గ్రంధముగా నరసింహాచార్య కవి **రచించి** శఠకోపులకే అంకిత మొసంగి ధన్యుడైనాడు.

సంస్కృత సారస్వతమునందు అలంకార శాస్త్రము ప్రముఖ స్థాన మాక్రమించి కావ్య విమర్శకు మూలాధారమై అనేరుల చర్చోపచర్చల కాస్కార ముగా నిలిచి సాహిత్యాభివృద్ధికి కారణమైనది. అలంకార శాస్త్ర గ్రంథకర్తలు తమ గ్రంథమును అలంకారశాస్త్ర గ్రంథ మనినను అందు నాయికా, నాయక, కావ్య లక్షణ, రస, ధ్వనులను వివరించి అలంకారముల గూర్చి చెప్పిరి. మరి కొందరు కేవలము అలంకారములనే చెప్పిరి. వానిలో **'చంద్రాలోకము'**, **'కువలయానందము'**లు ప్రసిద్ధము లైనవి.

అలంకార శాస్త్రమున భగవంతుని, లేదా భగవ దవతార పురుషులను నాయకునిగా చేసి వర్ణించిన రచనలయందు కొన్ని విష్ణు సంబంధములు గలవు*3. అవి :

| | | | |
|---|---|---|---|
| 1. | **అలంకార రాఘవము** | : | చెయుకూరి యజ్ఞేశ్వర దీక్షితులు. (1600 ప్రాం.) |
| 2. | శఠకోప గుణాలంకార పరిచర్య | : | ? |
| 3. | **రామచంద్ర యశో భూషణము** | : | కచ్ఛపేశ్వర కవి (1701 - 800) |
| 4. | శఠజి వైభవ దివాకరము | : | మణింగంటి నరసింహాచార్యులు (1750 ప్రాం.) |
| 5. | **అలంకార మణి హారము** | : | శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాల స్వామి (1801 - 1900) |

6. శ్రీరామానుజ యశోభూషణము : అమరవాది నారాయణాచార్యులు (1912 - 1972)

7. అలంకార వసంతము : చెలమచెర్ల రంగాచార్యులు (1912 - 1972)

## శఠవైరి వైభవ దివాకరము :

శఠవైరి వైభవ దివాకరము (ప్రభాకరము) అని మరియొక పేరు గల యీ కృతి అముద్రితము.

మదరాసు, మైసూరు, హైదరాబాదు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారముల యందు దీని తాళపత్ర ప్రతులు గలవు*4. ఈ గ్రంథమున లక్ష్య లక్షణ శ్లోకము లన్నియు కలిసి 425.

తన కృతిని గూర్చి కవి—

'శ్రీమత శ్శఠకోపస్య గుణ రత్నైక సుందరైః।
అలంకారైః సతా మగ్రే పరిచర్యాం కరోమ్యహమ్॥'

'సంతః క్వాపి విలీన మాపతు, గుణాం చిన్వంతి గంధం యథా
భృంగా స్తస్య చ దిక్షు సంప్రకటనం కుర్వంతి వాతా ఇవ।
అన్యే దోష పదం గదంత్వమతయః కావ్యాకృతే స్తావతా
చంద్రే చంద్రికయా వితన్వతి ముదం కిం స్యాత్కళంకో క్తితః॥'

'శఠకోపుల గుణరత్నములచే అలంకృత మగు యీ కృతి ముఖమున సజ్జన పరిచర్య నొనర్చుచున్నాను' అని తెలిపి, దీనియందలి సుగుణములను సజ్జను లైనవారు గ్రహించి - సర్వ దిక్కులకు గంధవహుడు సుగంధమును వ్యాప్త మొనర్చినట్లు దీనిని వ్యాప్త మొనర్తురు. కుమతు లైన వారు అదృష్ట దోషములను - కావ్య దోషములుగా నూహించినను ఇది చంద్రుని కళంకముగా భావింపబడును. చంద్రుని నుండి వచ్చు చంద్రికకు మాత్రము అట్టి కళంకము లేదు గదా! కావున తన రచన చంద్రిక వంటి దని కవి అభిప్రాయము. అందుకే-

'[illegible] నాయక గుణాశ్రయతయా రసావహత్వాత్ ఆదరణీయం [illegible]' అని -

'సర్వజ్ఞః స్వయమేవ పశ్యతి మహా దోషం తు నో వీక్షతే
ప్రాయః సర్వ మపి ప్రదాయ బహుధా లజ్జాభరే మజ్జతి।
నిస్సంగోఽపి వికస్వరో గుణకణో యత్రాస్తి తత్రాదరాత్
కిం జాతశ్శరజిద్దురాప మహిమా శ్మామండలీ మండనః॥'

అని తెల్పి హేత్వలంకారోదాహరణ సందర్భమున కవి తన రచనను గూర్చియి ఇట్లనెను :

'ఆనందో విదుషా మనాది వచసాం యాథాస్త్య బోధోదయః
ప్రాలంబః ప్రణమజ్జనస్య విమత వ్రాతస్య గర్వక్షయః।
ఉల్లాసః కరుణా రసస్య కమలా భర్తుః ప్రసాదాగమః
కోఽపి శ్రీ శరవైరిణో విజయతే లీలా కటాక్షాంకురః'॥

ఈ కావ్యమున వర్ణనీయుడైన శరవైరి వైభవ మిట్లున్నది :

'సుందర శ్చతురో విద్వాన్ గంభీరః కరుణాకరః।
కులీనః కీర్తిమాన్ దాతా జీయాత్ శరరిపు స్సదా॥

అయ మేవ శరారాతిః లోకోత్తర గుణాకరః।
మదీయ కావ్య కన్యాయాః కరగ్రహ విచక్షణః॥

అలంకార రసాస్వాద స్పృహణీయ గుణోత్కరా।
శుభ రీతిః కృతి ర్నిత్యం రమతాం శరవైరిణే॥ (7-9)

పర్యాయోక్త్యుదాహరణము నందు మధురమైన లలిత కవితా ప్రస్తావనము నొక శ్లోకమున చేసి కవితా విషయమున తనకు గల అభిప్రాయమును వ్యక్తీకరించిన గ్రంథకర్త దృష్టిలో ఇట్టి కవితయే సాఫల్య మొందునని తెల్పుచున్నాడు :

'మధుర పి లలిత కవితా వనితా నవ యౌవన స్ఫూర్తిః।
కవితా సాఫల్యవతీ యేన త మేనం భజే నిజ హృదయే'॥ (186)

నరసింహాచార్య కవి ఈ గ్రంథమున మొత్తము నూరు అలంకారముల తెల్పినట్లు కృత్యంతమున గల—

'ఇత్థం శత మలంకారాః మయాస్మిన్ ప్రతిపాదితాః
ప్రాచా మాధునికానాం మత మాలోచ్య సర్వశః'॥ (475)

ఆను రా శ్లోకము పంస తిలియుచున్నది. కవి ప్రతి అలంకారమునకు దాని యుదాహరణమునకు ప్రత్యేకముగా శ్లోకముల నిచ్చి 80వ సంఖ్య గల శ్లోకమున ఉన్మీలిత విశేషాలంకారముల చెప్పెను. దీనియందు గల రెండలంకారముల విడదీసిన, అప్పుడు నూరలంకారము లగును.

ఈ గ్రంథకర్త ప్రాచీనులైన భరత, దండి, వామన, రుద్రటాదుల రచనలను, ఆధునికులైన భానుదత్త, విద్యానాథ, సింగభూపాల, జగన్నాథాద్యాధుని కాలంకారికుల కృతులను పరిశీలించి, అలంకార విషయమున గల మత భేదముల గమనించి అవాంతర భేదములతో లాను 10 అలంకారముల ప్రతిపాదించినాడు.

ఒకే విషయమును గూర్చి భిన్న కాలములయందు కృతి నిర్మాణమొనర్చు కపులలో అభివ్యక్తి భేదము తప్పని సరిగా నుండును. అందువలననే ఈ గ్రంథమున అలంకార వివేచన విషయమై కొన్ని భేదము లున్నవి 'శతజిత్...' కర్త నాటికి (క్రీ.శ. 1760) అలంకార శాస్త్రము మిక్కిలి పరిణతి బొందినది. ఆ యా గ్రంథకర్తల మతముల బాగుగా పరిశీలించిన యనంతరమే అధిక వ్యాప్తిలో గల అలంకారములను శత సంఖ్యగా గ్రహించి ఈ గ్రంథకర్త వివరించెను.

దీనియందలి అలంకార వివేచనము-వాని పూర్వులలో కొన్నిటిని గూర్చి దిఙ్మాత్ర పరిశీలన :

గ్రంథమున గల శతాలంకారములు ఉపమతో ప్రారంభమై హేత్వలంకారముతో సమాప్తమైనవి, కవి తాను చెప్పబోవు అలంకారముల గూర్చి 'అలంకారాః పున ర్ద్వివిధాః - శబ్దగతాః, అర్థగతా శ్చేతి. తత్ర శబ్దాలంకారాపేక్షయా చారుతరాతిశయహేతుత్వాత్ అర్థాలంకారాః ప్రకాశ్యంతే' - అనెను. దీనియందలి అలంకార వివరణ పద్ధతి తెలియుట కొరకు ఉదాహరణ :

**శ్లేషాలంకార :** అథ శ్లేషాలంకారో నిరూప్యతే, స చ త్రివిధః. ప్రకృతానేకగోచరో, అప్రకృతానేకగోచరః, ప్రకృతా ప్రకృతానేకగోచర ఇతి. అత్రైవం లక్షణం:

'ప్రకృతాప్రకృతానేక గోచ రోభయగోచరా।
నానార్థ సంశ్రయా శ్లేషాలంక్రియా కథ్యతే బుధైః॥' (171)

కేవల ప్రకృత పర, కేవ లాప్రకృతపర, తదుభయ విషయ శబ్ద విన్యాస రూపః త్రివిధః శ్లేష ఇతి లక్షణార్థః. తత్ర కేవల ప్రకృతాప్రకృత గోచరో యథా-

'గురు రేష లసత్తారా హృదయంగమ వీక్షణః।
మాధుర్య కావ్య సచ్ఛాయా రోధతే భావ భాసనః॥' (173)

ఏష గురు రాచార్యో బృహస్పతి శ్చ లసత్తారా హృదయంగమ వీక్షణః. లసంతీభ్యాం తారాభ్యాం కనీనికాభ్యాం హృదయంగమాని వీక్షణాని యస్య సః. అన్యత్ర లసంత్యాః తారాయాః సపత్న్యాః మనోహరాణి వీక్షణాని యస్య సః. మాధుర్య కావ్య సచ్ఛాయా. మాధుర్య ప్రధానం కావ్యమ్ కవితా యస్య మాధుర్య కావ్యః. మధుర కవి స్తేన సచ్ఛాయ - ఇతి తథోక్తః. అన్యత్ర మాధుర్యేణ కావ్య సచ్ఛాయః శుక్ర సవర్ణః ఇతి తథోక్తః. భావ భాసనః-భావం భాసయతీతి తథోక్తః. తమో నివర్తకత్వాదితి భావః.అన్యత్ర 'భ'రూపో నక్షత్ర రూప స్సన్ అపి భాసత ఇతి తథోక్తః. అత్ర శరీరిపుః ప్రకృతః, బృహస్పతి రప్రకృతః ఇతి ప్రకృ తాప్రకృత శ్లేషః.

ఈ ప్రకారముగ అలంకార వివరణము చేయబడినది. దీనియందు గల అలంకార భేదములలో కొన్నిటిని గూర్చి—

**1. రూపకము :** ఇది అభేద, తాద్రూప్య, సావయవ, నిరవయవ, పరం పరిత భేదములుగా నుండును. ప్రతాపరుద్రీయమున సావయవ, నిరవయవ భేదములే గలవు. అలంకార లక్షణమును బట్టి వీనిలో - అభేద, తాద్రూప్య భేదములకే ప్రాధాన్యము కావున 'శరజిత్...' సర్త లు రెంటినే గ్రహించి ఒక్కొక్క-దానిలో మరల అధిక, న్యూన, అనుభయ భేదముల మూడేసి చెప్పి, ఆరు భేదముల నొసగెను.

**2. సారాలంకారము :** పూర్వ పూర్వమునకన్న ఉత్తరో త్తరములకు ఉత్కర్ష చెప్పుట ఈ యలంకార పద్ధతి. అందువలననే దీనిలో శ్లాఘ్య, అశ్లాఘ్య గుణోత్కర్షను ఉభయ రూపములుగా నీ గ్రంథకర్త చెప్పెను. ఇతర లాక్షణికు లెవ్వరును ఈ భేదముల చెప్పలేదు. ఉదా:—

ఉత్తరోత్తర శ్లాఘ్య గుణోత్కర్షః ఉభయ రూపో యథా-

అతీవ పతిన శైలః శైలా దపి సురాయుధం।
తస్మా త్సుదర్శనం తస్మా చ్ఛఠజి ద్దూర మానసమ్॥' (279)

'అత్ర సుదర్శన పర్యంతేషు శ్లాఘ్య గుణోత్కర్షః శఠజి ద్దూర మానసే తు అశ్లాఘ్య గుణః'- అని వివరణ.

**3. దీపకము:** ఇది దీపకము, ఆవృత్తి దీపకము అని విభజింపబడి, 'ఆవృత్తి' మూడు పద, అర్థ, ఉభయావృత్తులుగ వివరింపబడినది.

**4. వక్రోక్తి:** అవికృత శ్లేష, వికృత శ్లేష యని రెండుగా చెప్పనైనది.

**5. అత్యుక్తి:** ఔదార్యాత్యుక్తి, శౌర్యాత్యుక్తి అని రెండు విధములు.

ఈ విధమైన భేదముల నితర లాక్షణికులు చెప్పలేదు. ఈ గ్రంథకర్త ప్రాచీనాధునిక లక్షణముల పరిశీలించిన వైనము ఈ పద్ధతులయందు పరిస్ఫుటమై అలంకార ప్రవచనమున ఈయనకుగల ఉద్దేశ్యము వ్యక్తమగుచున్నది.

'శఠవైరి...' యందు అలంకార పరిచయముతో పాటు సమ్మాళ్వారుల ప్రభావమును తెలుపుచు ఒక వైపు సాహిత్య దృష్టి, మరియొకవైపు విశిష్టాద్వైత సంప్రదాయానుసరణము చేయబడి, మణింగంటి కవుల సాహిత్యమునందు ఒక ప్రత్యేకత సంతరించుకొనినది.

## సూచికలు :

1. శ్రీ రామానుజ కీర్తి కౌముది - 4వ భా; 26 వ పుట.
2. శఠకోపుడను రాక్షసుని విష్ణు వనుగ్రహించి అతని శిరస్సున చరణముల నుంచుటచే శఠకోప నామము విష్ణు పాదుకలకు ప్రసిద్ధ మైనట్లు కొందరు చెప్పుదురు - శ్రీ రామానుజ కీర్తి కౌముది - 4వ భా ; 39వ పు.
3. నెం. 2, 3, 5 'సాహిత్య కుసుమాంజలి' - ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణమునకు ఈయూణ్ణి వారి పీఠిక-88,89,91 పుటలు. నెం. 6. 'మన పండితులు, కవులు, రచయితలు' 52, 54 పుటలు

4. శ్రీమాన్ న. చ. రామానుజాచార్యులు, పుల్లగుమ్మి శ్రీనివాసాచార్యులు కలిసి వ్రాసి యుంచుకొనిన ప్రతి (ఖమ్మం) నా పరిశీలన కుపకరించినది. ప్రతి చివర 'వికారి పుష్య శుద్ధ ౧ మీ బుధవారం వరకు టూరుగు గడ్డ వేంకట రామానుజాచార్యులుగారి సన్నిధిని లభించిన మాతృకా ప్రకారముగ శ్రీ సంపన్ముదుంబ చక్రవర్తుల లక్ష్మీ నరసింహాచార్యులు వ్రాసుకున్నది.' అని కలదు. దీని మరియొక ప్రతి మానుకోటలో మఱింగంటి నరసింహాచార్యుల వారి వద్ద కలదు (లేఖక దోషము అధికము). మదరాసు ప్రతిని గ్రహించి ఆ విశ్వ విద్యాలయమున C.S రాధాకృష్ణన్ గారు పరిశోధన మొనర్చి, 1982 లో పి. హెచ్.డి. పట్టమును పొందినారు.

5. భరతుడు శబ్దాలంకారములలో యమకమును, అర్థాలంకారములలో ఉపమ, దీపక, రూపకములను తెల్పెను.

దండి 34, మమ్మటుడు 59, జయదేవుడు 101, అప్పయదీక్షితులు 121, విద్యానాథుడు 73, భట్టుమూర్తి 70 అలంకారములను చెప్పిరి. (కావ్యాలంకార సంగ్రహము - సన్నిధానం వారి వివరణ - పు. 560)

# 2

# స్తోత్రములు

## 'స్తోత్ర సాహితి'

స్తోత్రము, స్తవము, స్తుతి, నుతి యనునవి సమానార్థకములైన పదములు. వీనితో పాటు 'ప్రార్థన'ను చేర్చవచ్చును.

భక్తుడైన రచయిత భగవంతుని, తన్నామములను, అవతారములను, దేవిని వీనియందు సభక్తికముగా వర్ణించి తన వినయ విధేయతల వెల్లడించును.

ఇట్టి స్తోత్ర పద్ధతి ప్రాచీన కాలమునుండి వైదిక సారస్వతమున సుప్రతిష్ఠితమై యున్నది. వేదముల యందు స్తోత్ర భాగములు కూడ నుండుట వలన వీని ప్రాచీనతా, విశిష్టతలు వ్యక్తమగుచున్నవి.

సంస్కృతమున భారత, భాగవత, రామాయణములందు స్తోత్రములు గలవు. ద్రావిడ ప్రబంధము అనేకము భగవద్గుణావతార ప్రశస్తులను స్తుతి రూపముగా చెప్పినట్టివే! ఈ విధముగా సంస్కృత, తమిళ సాహిత్యములయందు స్తోత్ర రచన యధికము.

ప్రపంచమునందు సుఖ మనునది సర్వ జనులకు గల యొక వాంఛ. తత్సాధనార్థము చేతనుడు కొన్ని కర్మలయందు ప్రవృత్తుడైనను సుఖము లభింపక పోగా ఇతోఽధిక దుఃఖము మాత్రము సంభవించు చుండును. జీవు డిట్టి దుఃఖమును దూరము చేసికొని బాధలను బాపుకొనుటకు భగవంతుని మననము చేసికొనును. ఇట్లు సుఖము, సంతోషము, భక్తి యనునవి స్తుతులకు మూలము.

ఈ విధమగు స్తుతి రూపమైన గీతను, స్తోత్రమును 'నుతి' యని మన పూర్వులైన వారు తెల్పిరి.

భక్తి సర్వ జనాధికార మగుటచే 'భక్తిః సర్వాధికారా' సర్వ సులభము, సర్వ సంజీవనము, సుఖకర మైనట్టిది. దీని యనుసంధానము భక్తిజనకమై

పరమానంద కారణ మగుచున్నది. అందుకే 'విష్ణు సహస్ర నామ స్తోత్రము' 'యద్భక్త్యా పుండరీకాక్షం స్తవై రర్చే న్నరస్సదా' అని తెల్పినది.

స్తోత్రములు భక్తిని పరాకాష్ఠ దశకు చేర్చి, శ్రీ మహావిష్ణువునకు సంబంధించిన నవవిధ భక్తిని, భక్తుల స్థితిని వివిధ దశలలో వ్యక్తీకరించినవి. కావుననే-

'స్వరూప రూప విభవ గుణ కర్మాణి శార్ఙ్గిణః।
వ్యాపక్షీత నిబంధీయాత్ శృణుయా ద్విలిఖే త్పఠేత్॥'

అనిరి. ఇట్టి స్తోత్ర సాహితి భగవంతుని రూప గుణ విభవాదులు, ఆపాద శిరః పర్యంత కమనీయ వర్ణనములు - వినితో నొప్పారు చుండును.

ఒక భక్తుడైనను, కవి యైనను స్తుతి, ప్రార్థనముల చేయనిదే తన సాహితీ వ్రతము నారంభింపక పోవుట విదితపూర్వ విషయము.

విశిష్టాద్వైతమున శ్రీమద్రామానుజులు, వేదాంత దేశికులు, వీరి ఆచార్యులు పరంపరగా వచ్చు ఆచార్య పీఠస్థులు, అనుయాయులు సంస్కృత సారస్వతములో స్తోత్ర శాఖను సంపుష్టము చేసిరి. వీని ననుసరించి ఇతర భాషల వారు అందును ముఖ్యముగా తెనుగువారు కొన్ని స్తవముల స్వతంత్రముగా రచించి మరి కొన్నిటిని అనువదించుకొనినారు.

ఆంధ్ర సాహిత్యమునందలి శతక ప్రక్రియకు స్తోత్ర సాహితి కారణమై, భక్తి రస శతకములు వచ్చినవి.

మతింగంటి కవుల 'స్తోత్ర సాహితి' యందు శ్రీరామ, శ్రీ గోదా స్తుతులతో పాటు నృసింహ స్తోత్రములును గలవు.

శ్రీమద్రామాయణము దీర్ఘ శరణాగతి తత్త్వ మని విశిష్టాద్వైతుల యభిప్రాయము రామాయణము తరువాత శ్రీరామ కథా సంబంధ రచనల వలెనే శ్రీవిష్ణు, శ్రీరామ స్తోత్రము లధికముగా వచ్చినవి. అట్టి వానిలో అప్పల దేశికుల వారి 'శ్రీరామ పాద స్తుతిః' యొకటి. దీనియందు భగవత్ శ్రీ పాద వైభవము, రాఘవుల గుణ గణములు చక్కగా వర్ణింపబడినవి.

సంస్కృత ద్రావిడ సాహిత్యముల యందు శ్రీ గోదా స్తుతులు కలవు. శ్రీ రంగనా థాచ్రిత హృత్కమల యైన యామె (ఆండాళ్) పన్నిద్ద రాళ్వారు

లలో చేరి ఘనత గాంచినది. అప్పల దేశికులవారీమెను వర్ణించుచు 'శ్రీ గోదా స్తుతి'ని చెప్పిరి.

అవతారముల యందు నృసింహావతారము పరమ విశిష్టమైనది. దశావతారములకు దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ కారణము కాగా, వీరియందు భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుని రక్షించుటకే పరమాత్మ శ్రీ నృసింహావతారము దాల్చెను. అందువలననే యిది అత్యద్భుత మవతారముగా ప్రసిద్ధి. దీని కుదాహరణ - శంకర భగవత్పాదుల 'లక్ష్మీ నృసింహ కరావలంబ స్తోత్రము'.

ఆంధ్ర దేశమున నృసింహ క్షేత్రముల సంఖ్య యధికము. ఆ యా క్షేత్రముల సందర్శించి భక్తులు - ప్రతిభావంతులైన కవులు చెప్పిన స్తోత్రములు మిక్కిలిగా కలవు.

తెలంగాణమున - **అర్వపల్లి, మట్టపల్లి, వాడపల్లి, యాదగిరి** (గుట్ట) **దేవాద్రి** (వేల్పుగొండ) మొదలగు ప్రాచీన నారసింహ క్షేత్రము లున్నవి. ఈ ప్రాంతములకు సంబంధించిన కవులు స్తోత్ర, శతక, ప్రబంధ రూపమున స్వామి మాహాత్మ్యమును గ్రంథస్థ మొనర్చినారు.

నృసింహోపాసకులైన మణింగంటి కవులు బీజాక్షర యుతములైన ఆర్వపల్లి నృసింహ స్తోత్రములను, మరికొన్ని నారసింహ స్తుతులను చెప్పిరి. అప్పల దేశికులు వీనితోపాటు **'శ్రీరామ పాద స్తుతిః'** రచించి, దీని ద్వారా భగవత్పాద వైభవమును, శ్రీరామచంద్ర వర్ణనమును రమణీయముగా నొనర్చి స్తోత్ర సాహితి కొక అమూల్యాభరణము సమర్పించినారు.

విశిష్టాద్వైతమున శ్రీవిష్ణు పాదముల గూర్చిన వర్ణనలకు ఒక ప్రత్యేకత గలదు. కావున 'పాద స్తుతి' వైభవమును దేశికు లొనర్చిరి.

భగవ ద్వర్ణనము ను ఆపాద కేశ పర్యంతము, మనుష్య వర్ణనము ఆశిరః పాద పర్యంతము చేయవలెనని లాక్షణిక నియమ మిట్లు గలదు.

'చిరంతన స్యాపి తథా శివ చంద్రస్య బాలతా ।
మానవా మౌళితో వర్ణ్యా దేవా శ్చరణతః పునః॥' (అలంకార శేఖరము)

దేవతా స్తోత్రముల యందును కావ్య ప్రబంధాదుల యందును ఈ పద్ధతి వర్ణన చేయుదురు. పూజ్యులైన దేవతలకు పాదాభివందన మొనర్చుట ఒక

సముచితాచారము. భగవత్పూజ యందలి షోడశోపచారములలోనున్న పాద్యము పాదపూజనమే! ఇట్టి పూజ్య భావము వలననే దేవతలను ఆపాద మస్తకము వర్ణింపవలె నను ఆచార మేర్పడినది.

శ్రీ మహావిష్ణువునకు అవతార ప్రత్యేకత యున్నందున లక్ష్మి, విష్ణు స్తుతులు మిక్కిలిగా వచ్చినవి. వీనియందు విష్ణు పాదముల పవిత్రత కొన్ని స్తోత్రముల యందు గలదు. అట్టి వానిలో **'ముకుందమాల'**, **'ఆళవందార్ స్తోత్రము'**, **'వైకుంఠ గద్య'**, **'యతిరాజ వింశతి'**, **'వరాంకు శాష్టకము'**, **'ధాటీ పంచకము'**, **'అతిమానుష స్తవము'** పేర్కొనదగినవి.

దాక్షిణాత్యకవి మూక పండితుని **'పంచశతి'** యందలి 'పాదారవింద శతకము' కంచి కామాక్షి పాద వర్ణనకే రచింప బడినది. శంకర భగవత్పాదుల శివ సపరికర 'పాదాది కేశాంత స్తవము*[1]'లో 13వ శ్లోకము, శ్రీ త్రిపుర సుందరీ వేద పాద స్తవము'న 31, 34, 36, 56, 81 శ్లోకములయందు లలితా పంచకమును, 3 శ్లోకములలో పాద మహిమాభివర్ణనయు చేయబడినవి.

శ్రీ మహాభాగవతము నందు భగవచ్చరణారవింద నిఃసృత తీర్థముచే శివుడు శివుడైనాడని పాదార వింద ప్రభావము గొప్పగా వర్ణింపబడినది (3వ స్కం, 28వ అ, 20,21 శ్లో.)

ప్రత్యేకముగా విష్ణు పాదుకా వర్ణన చేసిన మహా కవులయందు ఇదం ప్రథములు వేదాంత దేశికులు. 1008 శ్లోకములు గల వీరి 'పాదుకా సహస్రము' ముక్త పద గ్రస్తములు*[2] అర్థ త్రయ గర్భితములైన శ్లోకములు గలది. దీని యందు శ్రీరంగ నాథ దివ్య పాదుకా వర్ణనమే గాక, శ్రీరాముని పాదుకలు, విష్ణు పాద చిహ్నాంకితులైన శఠగోప ముని వర్ణనలు గలవు (అందుకే ఇది అర్థ త్రయ గర్భితము).

దేశికుల వారి రచనా ప్రభావమున పిళ్ళలోకాచార్యుల వారు 500 శ్లోకములలో భగవత్పాదుకా వర్ణనము చేసిరి *[3]

విశిష్టాద్వైత సంప్రదాయమున శ్రీ పాదుకలకు పరమ భక్తి విశేషములు గలవు. ద్వాదశాళ్వారుల యందు విప్రనారాయణునకు తొండరడిప్పొడియాళ్వార్ (భక్తాంఘ్రిరేణువు) అని నామాంతరము. భక్తుల పాదములం కంటిన ధూళి వంటి

వాడని యర్థము ఇట్లే 'అచార్య తిరువడిగళ్'*4 (ఆచార్య శ్రీపాదములు), 'ఆచార్య స్స హరి స్సాక్షాత్' అనునది ప్రసిద్ధము కావున భక్తుల (భాగవతోత్త ముల) పాదధూళి - పాదములు - మిక్కిలి పవిత్రము లని శ్రీ వైష్ణవ సంప్ర దాయమున చెప్పబడును.

శ్రీ విష్ణ్వాలయములం దుండు శఠకోపముపై విష్ణు పాదుక లుండుట గమనింప దగిన విషయము. దైవ దర్శన వేళ యందు దీనిని భక్తుల శిరస్సు నకు తగులున్నట్లు చేయుట వలన విష్ణు పాదస్పర్శ ఉత్తమాంగమునకు లభించును.

ఈ సందర్భమున పఠింపబడు ఆళ్వందార్ స్తోత్ర శ్లోకములలో—

'విలాస విక్రాంత పరావరాలయం
నమస్య దార్తి క్షపణే కృతక్షణమ్।
ధనం మదీయం తవ పాద పంకజమ్
కదా ను సాక్షాత్ కరవాణి చక్షుషా॥' 80

'కదా పున శ్శంఖ రథాంగ కల్పక
ధ్వజారవిం దాంకుశ వజ్ర లాంఛనమ్।
త్రివిక్రమ! త్వ చ్చరణాంబుజ ద్వయమ్
మదీయ మూర్ధాన మలంకరిష్యతి॥' 81

అని భగవత్పాద వర్ణన చేయబడినది.

శ్రీవైష్ణవుల నిత్యానుసంధాన శ్లోక పఠనము—

'యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మ రుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే।
అస్మ ద్గురో ర్భగవతోఽస్య దయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే॥'

అను దానితో ప్రారంభింపబడి—

'సర్వ ధర్మాం శ్చ సంత్యజ్య సర్వ కామాంశ్చ సాక్షరాన్
లోక విక్రాంత చరణౌ శరణం తేఽవ్రజం విభో!

యని యనుసంధానింపబడుచు—

'యత్పదాంభోరుహ ధ్యాన విధ్వస్తాఽశేష కల్మషః
వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామి తమ్'॥

అని ముగింపబడును. వీనియందు భగవత్పాదారవిందములపు గల పవిత్రత, వానిపై భక్తులకు గల పరమ నిష్ఠ అభివ్యక్త మగును.

సాక్షాత్పరబ్రహ్మమైన శ్రీరామ చంద్రుని పాద ధూళి రాతిని నాతిగా చేసినది. భక్తుడైన (అర్హుడు) భరతుడు శ్రీరామ పాదుకం గ్రహించుట భగవంతుని శరణు జొచ్చుటయే!

విశిష్టాద్వైత సిద్ధాంతములను తెనుగున ప్రతిపాదించుచు విశిష్ట రచనల చేసిన గరీయః ప్రతిభుడు తాళ్ళపాక అన్నమయ్య ఆళ్వారుల రచనలను బాగుగా ఆకళింపు చేసికొని తన సాహిత్యమున ప్రతిఫలింప చేసినాడు. అందుకు—

"బ్రహ్మ కడిగిన పాదము - బ్రహ్మము దా నీ పాదము...
తిరు వేంకట గిరి తిరమని చూపిన పరమపదము నీ పాదము-"

ఇత్యాది దశావతార సంకీర్తనమున త్రివిక్రమావతార విషయము 'తిరుప్పావై' లోని "ఓఙ్గిఉలగళన్ద ఉత్తమన్ పేర్పాడి...", "అన్రివ్వులగ మళన్దాయ్ అడిపోట్రి".*[5] అను పాశురముల భావము తెనిగింపబడి-విష్ణుపాద మాహాత్మ్యము వ్యక్తీకరింపనైనవి.

ఇట్లు స్తోత్ర గేయ రచనల*[6] యందే గాక- ప్రత్యేకముగా శ్రీపాదరేణు విషయమై రేవణూరు వేంకటాచార్యు డను కవి '**శ్రీపాదరేణు మహాత్మ్యము**'ను వ్రాసి - శ్రీ వేంకటేశ్వరుని శ్రీపాదరేణు మాహాత్మ్యము నభివర్ణించెను. అప్పల దేశికులు - ఇంతటి ప్రభావము గల శ్రీపాదములను తమ 'శ్రీరామ పాద స్తుతి, యందు వర్ణించి - భక్తి ప్రపత్తుల వెల్లడించిరి.

## సూచికలు :

1. 'శంకర గ్రంథ రత్నావళి' 8 భా, స్తోత్రములు - ప్రథమ భాగము.
2. నమ్మాళ్వార్ ద్రావిడ ప్రబంధములలోని ముక్త పద గ్రస్త పద్ధతి దేశికుల 'ముక్త పద గ్రస్త' రచనకు కారణమైనను, ముక్త పదము - స్వర్గము (భగవత్పాద సన్నిధి) అని చెప్పుట దీనిలోని మరియొక విశేషము.

3. 'రఘునాథ' కవి 'పద సహస్రము'ను చెప్పగా దేశికుల వారు 'పాదుకా సహస్రము'ను చెప్పినారట. ఈ రెండును చెప్పుట విశేషము గాదని బొమ్మకంటి నరసింహ శాస్త్రి 'తిలక సహస్రము'ను చెప్పినాడు. 'తాళ్ల పాక వారి వివిధ సాహిత్య ప్రక్రియలు'- అభిప్రాయములో నిడుదవోలు వెంకటరావు గారు (పుట xix).

4. శ్రీవైష్ణవమున 'ఆచార్య పాదము'లకు, 'శ్రీపాద తీర్థము'నకు విశేషము గలదు. అనుష్ఠాన సమయమున ఉపదేశ ప్రదాతయైన ఆచార్యుల శ్రీపాద ముద్ర గల వస్త్రమును శిరస్సునం దుంచుకొందురు. వీనినే 'ఆచార్య తిరువడిగళ్' (ఆచార్య శ్రీపాదములు) అని యందురు. ఆచా ర్యుల పాద ధూళి మృత్తికను తీర్థములో కలిపి అనుష్ఠాన సమయమున సేవింతురు. ఇది శ్రీపాద తీర్థము.
వీనియందు 'ఆచార్య స్స హరి స్సాక్షాత్ చరరూపీ న సంశయః' అను నట్టిది ముఖ్యము.

5. ఓఙ్గి ఉలగళన్ద వుత్తమన్ పేర్పాడి...... నీఙ్గాత శెల్వమ్ నిఱైన్దే లోరెమ్బావాయ్'- (3 వ. పాశురము)
ఓఙ్గి = అభివృద్ధి చెంది, ఉలకు = లోకములను, అళంద = కొలిచిన, ఉత్తమన్ = ఉత్తముడైన (విష్ణువు యొక్క). పేర్ = నామమును, పాడి = గానము చేసి. ఇచట 'ఓఙ్గి' పదముచే త్రివిక్రమావతారము సూచింపబడినది. ఇది వామన రూపము యొక్క సంక్షిప్తత్వమునకు లక్షణము.
'అన్ఱివ్వులగ మళన్దా యడిపోత్తి
శెన్ఱఙ్గు త్తెన్నిలంగై శెత్తాయ్ తిఱల్ పోత్తి...... రెమ్బావాయ్'
(24 వ పాశురము)
అన్ఱు = ఆ ప్రకారము, ఇవ్వులక మళన్దాయ్ = ఈ లోకముల కొలుచు, అడి = పాదములకు, పోత్తి = మంగళమ్.
భక్తుల కాశ్రయ స్థానమైన భగవంతుని దివ్య శ్రీ చరణములకు మంగళా శాసనము చెప్పుట ఈ పాశురము(ల) యొక్క ఉద్దేశ్యము.

6. సరహరి గోపాలాచార్యుల వారి 'ప్రణతి', 'శ్రీహరి చరణారవింద స్తోత్రము' అను పద్య కృతులు పాదుకా వైభవమును వర్ణించినవి.

## 1. శ్రీరామ పాదస్తుతిః :

అప్పల దేశికుల వారు నరసింహాపురమున శ్రీరామచంద్ర స్వామిని ప్రతిష్ఠించగా వీరి యగ్రజులైన నృసింహ దేశికులు గోదా, శ్రీరంగ నాయక, శ్రీమద్రామానుజ 'సన్నిధి' (కోవెల) నేర్పాటు చేసినారు.

రామ భక్తులైన దేశికుల వారు నృసింహాపురమున స్వయం వ్యక్తములు[1] నైన శ్రీరామ పాదుకలను ముఖ్యముగా చేసికొని వివిధములగు 28 వృత్తములలో '**శ్రీరామ పాద స్తుతిః**' రచించినారు.

వీనియందు 16 శ్లోకములలో రామ పాద విశేష వర్ణన, మిగిలిన వాని యందు శ్రీరామ లక్ష్మణ భరత సీతా మహాదేవి వర్ణన చేయబడినది. అంఘ్రి కమల స్తుతి గావున ఆచార్యులవారీ స్తోత్రములను ప్రసన్న శైలిలో రచించిరి.

> 'అస్మద్గురుభ్యోఽస్తు నమో యత్ప్రసాద ప్రభావతః।
> రామః ప్రసన్నో న స్సాక్షా ద్వాఞ్ఛితార్థ ఫలప్రదః'॥

ఇది స్తోత్ర ప్రారంభ శ్లోకము. దీనియందు కవి తన గురువులకు నమస్కరించి వినయ సంపద నావిష్కరించి గురు నామ గ్రహణము సంప్రదాయము కానందున వారి నామ ధేయమును వెల్లడించలేదు. ఐనను ఏ సదాచార్యుల యొక్క చల్లని దృక్పరంపరలు వాంఛించిన దాని కన్న నధికమగు కోర్కెల నీడేర్చునో అట్టి శ్రియఃపతి జానకీ నాయకుడైన శ్రీరామ చంద్రుడు మాకు సుప్రసన్నుడై యభీష్టముల నెరవేర్చు గాక యని ప్రార్థనము చేసెను.

> "చిత్రమ్! యత్ర శిలా తలే సుఘటితం రామేణ పాద ద్వయమ్
> సాక్షాల్లక్ష్మణ వారుణాస్త్ర విభవా జ్జాతం చ శీతం పయః॥
> సీతాయాః కరుణా కటాక్ష విభవా త్సంపాదితా స్సంపదో
> మిత్రైరత్ర వృతో నృసింహ నగరే జీవేయ మాయు శ్శతమ్॥" (3)

సాక్షాత్ పరమపద మహద్విభూతిగా చెప్పబడి శ్రుతి శిఖరాయమాణమైన శ్రీరామ పదద్వంద్వము లౌకిక విభూతిని సంపాదింపబడి మాదృశులనే అనుభ

వింపబడుచున్నవి ఆళ్వారాచార్య మహాజన పరివృతమైన ఈ నృసింహ నగరియందు వెలసినవి. ఇది మా పూర్వపుణ్య విశేషము. 'ఇచట నిట్లే మా శతవర్షముల జీవితము గడిచిపోవుగాక' యని కవి భావన.

ఏ శిలాతలము నందు శ్రీరామచంద్ర చరణాంభోరుహ ద్వంద్వము స్వయం వ్యక్తములైనవో, అట్టి శ్రీపాద ద్వయమున సాక్షాత్ లక్ష్మణ స్వామి వారుణాస్త్ర శక్తిచే విలసిల్లిన సరస్సు సర్వకాల సర్వావస్థలయందు సమశీతలోదక పరిపూర్ణమైయున్నది.*2 సాక్షాల్లక్ష్మియైన సీతాదేవి కరుణా కటాక్ష విభవములచే ఉభయ విభూతు లనుభవింప బడుచున్నవి. 'భగవద్భాగవతాచార్య సన్మిత్ర పరివృతముగుచు పవిత్రమైన యీ నృసింహనగరి యందే మా శతవర్షములు గడువవలె'నని దేశికుల భావన!

అర్చాస్వరూపముగా నవతరించిన శ్రీరామచంద్రమూర్తి సాక్షాత్ విష్ణువు. అట్టి మహానుభావుని పాదములు శిలపై శిలాత్వమును కలిగి యుండుట జీవ పరంపరోజ్జీవనార్థమే। సర్వవ్యాపియైన విష్ణువు కఠిన పాషాణ స్తంభాదులయందు ప్రవేశించియుండుట వినీతమైన విషయము. ఇచ్చట - సమస్త చేతనాచేతనము లను కృతార్థుల చేయదలచి స్వామి ఈ రూపమున వెలసినాడు.

సర్వ వ్యాపకుడైన స్వామి యెప్పుడో ఎక్కడో ఎవరినో రక్షించుట విచిత్ర మనిపించును గాని అందరిని అన్ని వేళల అన్ని విషయములందు సంర క్షించుట విచిత్రమయి గదా! అందుకే ఈ శ్లోక ప్రారంభమున 'చిత్రమ్' అని నారు. స్వామివారి ఆశ్రిత వత్సలత్వము సైతము చిత్రము. ఇన్ని విశేషములకు, విశిష్టతలకు ప్రతీకగా నీ శ్లోకము చెప్పబడినది.

'ఇదం దశరథార్జితం భరత లక్ష్మణాభ్యర్చితమ్
తపో ధన మనోధనం సకల సంపదాం సాధనమ్।
నృసింహ నగరాంతికే జయతి రామ పాద ద్వయమ్
శిలా ముకుర బింబితమ్ రహసి సీతయా చుంబితమ్॥' (18)

శ్రీరామ పాదుక లెట్టివో కవి యీ శ్లోకమున తెల్పినాడు. దశరథుడు అరవై వేల వర్షములు తప మాచరించిన గాని ఈ పాదము లార్జింప బడలేదు.

అవి భరత లక్ష్మణాదిసోదరులచే నిరంతరసేవింపబడుచు, తపోధనుల నుతోధనముగా సమస్త లోకికాలౌకికాది సంపదలకు నిలయమై, శిలాతలమును మృదురమున ప్రతిబింబించిన యీ పాదములు రహస్యకాలమున సీతాదేవిచే చుంబించబడినట్టివి.

ఇది సిరికవితా చాతురికి చక్కని నిదర్శనము. దీనియందట్లు తెలిపి 10 వ శ్లోకమున కేవలము శ్రీరామునే వర్ణించుచు, 'క్షమాపుత్ర్యాః స్వాస్వాదధర దళ మాధుర్య విదుషే' అని యద్భుతమైన భావన చేసినాడు.

దేశికులు రచించినటి లఘుస్తుతి యైనను, కవితా పరముగను, భక్తిపరముగను ఇది అలఘుస్తుతి. సరస మధుర ధారాళమైన శైలిలో సాగినది. అందుకు ఒకటి రెండుదాహరణములు:

'రామాయ క్షితి కన్యకా విహరణారామాయ నీలోత్పల
శ్యామాయ స్మర నిత్య బాధిత రిపు శ్యామాయ తుభ్యం నమః।
కీర్తి శ్యామ నిచోళ సంవలిత దిగ్గ్రామాయ దీప్యద్గుణ
గ్రామాయ స్వపద ప్రవిష్ట నృహరి గ్రామాయ భూయో నమః॥ (17)

నమో రామాయాస్తు ప్రతిదిశ సమేతాసుర చమూ
సముహ ప్రాణౌఘ ప్రశమన నిరాయాస ధనుషే।
సమీర వ్యాలోల త్కువలయ దళ శ్యామ వపుషే
క్షమా పుత్ర్యాః స్వాస్వాదధర దళ మాధుర్య విదుషే॥' (10)

వీనిలో మొదటి శ్లోకము తృతీయ చరణమున తప్ప మిగిలిన వానియందు యతిప్రాసలు పాటింపబడగా, తరువాతి శ్లోకమున ప్రాస పాటింపబడినది. ఇది శబ్దాలంకార శైలికి ఒక ఉదాహరణ—

'సదయే హృదయే నిషణ్ణ మాస్తృ
గ్వికలాం సాయ మనాది రత్రి హాస్య।
గ్దయతా మియతా మనుశ్రుతా స్తృ
గ్దయతాం రాఘవ శేఖర స్తాపస్త్రక్॥' (20)

స్తోత్రమున చివరి శ్లోకము—

'మరంద కదళీ సుధా మధు రసాల మృద్వీకయోః
మనోహరణ ధోరణీ వద కదంబ సంపూరితా।
దదాతు శుభ మప్పలార్య కరుణా రసోద్దీపితా
నృణా మఘ విదారిణీ రుచిర రామ పాద స్తుతిః॥' (28)

దేశికుల స్తోత్రముయందు దెక్కడను కవితా శైలి ప్రసక్తి లేదు. దీని యందు మాత్రమే కొద్దిగా తెల్పబడినది. తమ రచన 'మరంద కదళీ సుధా మధు రసాల మృద్వీ'కాది పంచార్థ రసాదులతో తుల్య మనినాడు. వీనియందు మరందము, మోచా ఫలము, మధువు, సుధ యనునవి ఒక్కొక్క విధమైన రుచిభేదము గలవి. అన్నియును క్రమ లేకనే ఆస్వాదింపబడి ఆహరింపబడును. తన కవితయు ఇట్టిదే యనుచు శ్రీరామ పాద స్తుతి యుత్కృష్టతను తెలిపి 'సమస్త జనుల పాపౌఘములు విధ్వస్తము లగుగాక' యని వాంఛించి, శ్రీరామ కరుణా కటాక్ష సంప్రాప్తమైన యీ కవిత అందరకును శుభము కల్గించునని కవి భావన!

## 2. శ్రీగోదా స్తవః :

తమిళ దేశమం దవతరించి మహాభక్తులై ద్రావిడ వేదామృతమును కృప చేసిన విప్యసూరు లను పన్నిద్దరు రాళ్వారులలో ప్రసిద్ధి వహించిన మహిళ శ్రీ గోదా దేవి. ఈమెకే ఆండాళ్, చూడికొడుత్త నాచ్చియార్, విష్ణుచిత్త-ఆముక్త మాల్యద యని నామాంతరములు. సీత వలె అయోనిజ యైన గోదా దేవి తులసీ వనమున శ్రీ విష్ణుచిత్తులకు లభించినది.

'గోదా' అను శబ్దమునకు సుమారు పది యర్థము లున్నవిః. 'గో', 'ద' వాక్కులు నిచ్చినది - అనగా వాగ్రూప మైన మాలతో భగవానుని పూజించి గోదా నామ ప్రసిద్ధి గాంచినది.

శ్రీ విల్లిపుత్తూరు నందు భూదేవ్యంశగా తులసీ కాననోద్భవ యైన యీమె భగవానుడైన శ్రీరంగనాయక స్వామినే పరిణయమాడెను. ధనుర్మాస సమయ మున విష్ణ్వాలయములయందు పనుసంధానము చేయబడు 'తిరుప్పావై' యను

ముప్పది పాశురములు ఆండాళ్ భక్తి కృతికి నిదర్శనము. శ్రీమ ద్రామానుజుల వారు ప్రతి నిత్యము దీనిని అనుసంధానించు వారట! అందుకే వారికి '**తిరుప్పావు జీయ్యరు**' అను నామ మేర్పడినది.

గోదాదేవి మరియొక కృతి '**నాయ్చ్చియార్ తిరుమొళి**'. 143 పాశురము లున్న దీనియందు శ్రీరంగనాయక స్వామిని గూర్చి యీమె పడిన బాధ (విరహ వేదన) మృదు రీతిలో వర్ణింపబడినది. ఈ రెండు రచనలయందు ప్రతి పదమున శ్రీ సహజమగు లాలిత్యము కన్పట్టును.

గోదాదేవి రచనలకు అనేక వ్యాఖ్యలు వెలసి*4, వానిలోని ప్రతి పద రామణీయకమును మిక్కిలిగా తెల్పినవి. శ్రీకృష్ణదేవ రాయల **ఆముక్త మూల్యద** గోదాదేవి చరిత్రకే ప్రాముఖ్య మిచ్చిన రచన.

విశిష్టాద్వైతమున ద్రావిడ ప్రబంధములకు ప్రథమ గౌరవ మొసంగిన విధముగనే శ్రీ గోదాదేవికి ప్రథమ స్థాన మిత్తురు. ఈమె సాక్షా ల్లక్ష్మి. అందుకే వేదాంత దేశికుల వారు '**శ్రీగోదా స్తుతి**' యందు–

'శ్రీ విష్ణుచిత్త కుల నందన కల్పవల్లీ
శ్రీరంగరాజ హరిచందన యోగ దృశ్యామ్।
సాక్షాత్ క్షమాం కరుణయా కమలా మివాన్యామ్
గోదా మనన్య శరణ శ్శరణం ప్రపద్యే॥'

అని, ఆమె గొప్పతనమును వ్యక్తపరచిరి.

సంస్కృతాంధ్ర తమిళ సాహిత్యములయందు గోదాదేవిని గూర్చిన రచన లనేకము గలవు. వీనిలో వేదాంత దేశికుల 29 శ్లోకము లున్న 'శ్రీగోదా స్తుతిః' అధిక ప్రచారము నందినది.

అప్పల దేశికుల శ్రీ గోదా స్తవ రచనకు వేదాంత దేశికుల కృతి ప్రేరకము కావచ్చును. వారు 29 శ్లోకములలో స్తుతిని చెప్పగా, అప్పల దేశికులు 112 శ్లోకములలో స్తవ మొనర్చిరి.

దీని రచనకు మరియొక కారణము - నరసింహపురమున దేశికులవారు శ్రీరామ ప్రతిష్ఠ చేసి వైభవముగా నిత్యార్చనాదుల జరుపుచుండిరి. వీరి యగ్రజులైన నృసింహదేశికులు - కేవలము శ్రీరామ సన్నిధి యొక్కటే యుండుట లోటుగా భావించి, ప్రస్తుతము గల గోదా సన్నిధిని (దేవాలయమున కుడివైపున) ఏర్పాటు చేయించినారు*5.

'శ్రీరామ పాద స్తుతి'ని చెప్పిన అప్పలదేశికులు ఆండాళ్‌పై గల భక్తి, అన్నగారిపై గల గౌరవ భావములతో ఈ 'గోదా స్తవము'ను రచించిరి.

సంస్కృత ఛందమున విభిన్న వృత్తముల గ్రహించి తమ సహజ మాధుర్య కవితా మార్గమున ఈ స్తోత్రమును చెప్పిన అప్పలదేశికులు ఒక పద్ధతిని పాటించినారు. ప్రారంభము నుండి 42 వ శ్లోకము వరకు గోదాదేవిని వేద మాతృమూర్తిగను, శ్రీ లక్ష్మీదేవిగను వివిధ వర్ణనలతో పేర్కొని—

'తాం విష్ణుచిత్త తనయాం సభసి ప్రరూఢామ్
కృష్ణాంకగామపి నిజా కమనీయ రూపామ్।
ధౌతాంపతా మమల పాద సుధావతారామ్
మన్యే జనా మంబ బుధ మాతర మిందు రేఖామ్॥' (42)

అని తెల్పి, తరువాతి శ్లోకమునుండి 94వ శ్లోకము వరకు ఆపాద శిరః పర్యంత వర్ణన చేసి—

'అపనయతు దేవి! భవతీ
భవ తీవ్ర దవానలేన సంజాతమ్।
చేతోగతం సమంతా
దనాది సంతాప మమృత ధారేవ॥' (95)

మిగిలిన శ్లోకములలో తమ మనః ప్రవృత్తిని భగవదనుగ్రహ విశేషములను తెల్పిన కవి దీనియందు తాను వర్ణించిన విషయమున నెచ్చట ఏమి లోపము జరిగినదో యని భావించి గోదాదేవిని మన్నింపుమని వేడుకొనుచు అమృత ధారా ప్రవాహము వలె వచ్చిన పవిత్ర మానసిక

మైన తీవ్ర వేదనతో కూడుకొనినది. దానియందు దోషములు సంభవింపవచ్చును. అట్టివానిని 'అపనయతు దేవి!' అని ప్రార్థించెను. ప్రారంభ శ్లోకములలో నొక దానియందు—

> 'కనక లతికా స్నిగ్ధాం ముగ్ధాంబు జాయత లోచనా
> మమృత లహరీ భోగ్యాం యోగ్యాం మురారి మహోరసః।
> అనవధి కృపా రూపాం అపన్న జీవన దాయినీ
> మనవధి మనో మోదాం గోదా మహం కలయేఽన్వహమ్॥' (8)

అని-ఆమె దివ్య సౌందర్యమును మనో నేత్రానందకరముగా వర్ణించెను. అన వధి కృపారూప - భక్తుల పాలిటి సంజీవిని గోదాదేవి; కవి భావనలో ఆమె రూపము మహోన్నత మైనది.

> 'కరే కమల కుట్మలం కబర మండలే మాలతీ
> ముఖే తిలక రేఖికా మృదు గళే తు ముక్తా స్రజః।
> స్తనే చ మణి కంచుకీ కనక దామ మధ్యే కటౌ
> కడార వసనం పదే కటక మంబ! మే భావనా!॥'

దీనియందు శ్రీదేవిని, గోదను అభేద ప్రతిపత్తితో నిరూపించుట కవి యుద్దేశ్యము.

> 'లావణ్య గౌరవ విధిత్సు రయం విధాతా
> చంద్రం ముఖం చ తులయా కలయాంచకార।
> తత్రేందు రభ్రగత ఏవ పరం లఘీయా
> నేక న్ముఖం భువి తవాంబ గురు వ్యరాజత్॥' (74)

దేవి ముఖ వైభవము ఈ శ్లోకమున చెప్పబడినది. "బ్రహ్మ నీ ముఖ మును చంద్రుని తులా మానము వేసి చూచి ఏది అధిక మైనదో తెలిసికొన దలచి నాడు. కాని అభ్రగతు డైన చంద్రుడు (దూరము కావున) లఘుత్వము వహిం చుట వలన ఆకాశగతు డైనాడు. ఇక నీవు గురుత్వము వలన భూమియం దున్నావు. అందుకే నీ ముఖము దేదీప్యమానముగా నుండి ప్రకాశించుచున్నది." అని చమత్కరించెను.

అప్పలదేశికులవారు ఈ స్తోత్రమున శబ్దాలంకార పూరితములుగా 20 శ్లోకముల రచించిరి. వానిను-డి___

'కలం కలుష సంకులం దురిత యాతనా చేతనా
వపు స్తు రిపు రాత్మనః ప్రళయ యామినీ కామినీ।
కుజల్పిత వికల్పిత వ్యసన సింధవో బంధవః
కి మత్ర శరణం భవ చ్చరణ మంతరేణాంతరే॥' (101)

'అసంకుచిత సంచితం వ్యసన హేతుకం పాతకమ్
సమస్త జనతా తిరస్కరణ భాజనం తే జనమ్।
అకించన మవంచన స్ఖలితయా దయా ధారయా
రయా దవనధీరయా జనని! మా మిమం పాలయ॥' (102)

ఇట్టి రచనకు వేదాంతదేశికుల వారి వైరాగ్య పంచకములోని—

శిలం కి మనలం భవే దనల మౌదరం బాధితుమ్।
శరీర పతనావధి ప్రభు నిషేవణా పాదనా .....' కారణము. దేశికులు

'శ్రీరామ పాదస్తుతి'ని—

'మరంద కదళీ సుధా మధు రసాల మృద్వీచికా
మనో హరణ ధోరణీ పద కదంబ సంపూరితా...'

యని ముగించిన విధముగనే 'గోదా స్తుతి'ని కూడ—

'మోదా రసాల మధు దుగ్ధ రసాతిశాయి
గోదా స్తవం కృతి మిహోప్పలదేశికేన।
పౌద్గల్య వంశ ఏలాబ్ధి సుధాకరేణ
లోకాః పఠంతి యది ముక్తిభవా భవన్తి॥' (112)

అని ముగించిరి. దేవీ వర్ణనా స్తోత్రము కావున మోదా రసాల మధు దుగ్ధ రసాతిశాయి'- గా రచించి ధన్యులైనారు *

---

* 'శ్రీరామ పాద స్తుతి'కి నల్లాన్ చక్రవర్తుల పార్థసారథి ఆచార్యులవారు సంస్కృతాంధ్ర వ్యాఖ్యలను; శ్లోకములకు తెనుగు పద్యములను రచించి ముద్రించిరి (ముద్రణ వత్సరము లేదు).

'శ్రీ గోదా స్తుతి'ని వీరి సోదరులు రామానుజాచార్యుల వారు 1978 వ సం॥మున ముద్రణ మొనరించినారు. (శివ నిర్మల ప్రింటర్స్, ఖమ్మం.)

## 3. శ్రీ అర్వపల్లి లక్ష్మీనృసింహ స్తోత్రమ్:

ఒక దశాబ్దమునకు పూర్వము - మా యింటియందు గల ప్రాచీన లిఖిత ప్రతులను పరిశీలించుచుండగా మా పితృపాదులు వ్రాసి పెట్టుకొనిన పూర్వుల ప్రాస్తావిక పద్యములు, తిరునామములు, మంగళహారతులు మొదలైనవి గల పుస్తకమున ఈ స్తోత్రము కన్పడినది. యథాతథముగా వ్రాసికొని పత్రికలో*[6] ప్రచురించితిని. కాని అప్పటికి స్తోత్ర కర్తృత్వము తెలియలేదు.

కొన్నాళ్ళ క్రితము పరిశోధనపనిపై వరంగల్లులో మఱింగంటి మణవాళాచార్యులవారిని దర్శించి ఈ స్తోత్ర విషయము నడిగినప్పుడు - జ్ఞాన వయోవృద్ధులైన ఆచార్యులవారు - కొన్ని శ్లోకముల కంఠపాఠముగా వినిపించి, స్వయముగా వారు వ్రాసి పెట్టికొనిన ఒక పుస్తకము నొసంగిరి.

దీనియందు సోత్రముతో పాటు బీజాక్షర యుత లక్ష్మీ నృసింహ స్తోత్రము, మంత్రము కూడ కలవు. నావద్ద గల రెండు స్తోత్రములను ఆచార్యులవారిచ్చిన వానితో పోల్చి చూడగా మరికొన్ని శ్లోకములు లభించినవి. 'మఱింగంటి అప్పలదేశికుల రచనలు' అని తెలిసినది*[7].

మా యింట లభించిన స్తోత్రమునందు 29 శ్లోకము లున్నవి. మణవాళాచార్యుల వారి ప్రతిలో అధికముగా రెండు లభించుట వలన ఇవి మొత్తము 31 శ్లోకము లైనవి. రెండింటిలోను ప్రారంభ శ్లోకము, ముగింపు శ్లోకము సరిగనే యున్నను మధ్యన మరికొన్ని శ్లోకములు పోయిన ట్లున్నవి. లభించిన రెండు శ్లోకములు ముగింపునకు ముందే చేరవలెను*[8]. స్తోత్ర శ్లోకము లన్నియు స్రగ్ధరలు, ప్రౌఢములు. ప్రతి వృత్తము చివర **'అర్వపల్లీ నృసింహమ్'** అను మకుటము కలదు. ఏ కారణముననో గాని 26వ శ్లోకము 'సరళ గళ కళాసక్త ముక్తా కలాపమ్' అని, 27వది 'స్వామి భీమం నృసింహమ్' అని ముగింపబడినవి. లభించిన రెంటిలో నొకటి కూడ 'స్వామి భీమం నృసింహమ్' అనియే కలదు.

ఈ స్తోత్రమును అప్పల దేశికుల వారు రచించుటకు గల కారణమును గూర్చి, వీని ప్రభావమును గూర్చి పరంపరగా వినిన దానిని మణవాళాచార్యుల వారు చెప్పిరి. అ విషయము :

ఈ స్తోత్రమును చెప్పిన సమయములో అప్పలదేశికులు 'తుంగతుర్తి'లో బంధువుల యింట నుండిరి. దీని పరిసర గ్రామములైన మద్దిరాల, గోరంట్ల, కొమ్మాలల యందు వీరి బంధువులు గలరు. అప్పటికి అర్వపల్లి నృసింహా స్వామివారి యర్చన మఱింగంటి వారే చేయుచుండిరి.

అప్పలదేశికు లొకమారు అనారోగ్యముతో బాధల ననుభవించుచు ఉపశమనోపాయము తోచక, అర్వపల్లి స్వామి సన్నిధానమును చేరుకొని శరీర బాధను గణింపక ప్రాతఃకాలముననే స్నానా ద్యనుష్ఠానముల పూర్తి చేసికొని దేవాలయములోనికి వెళ్ళి అశువుగా ఈ స్తోత్రమును చదువుచుండిరి. కొంత సేపటికి గర్భాలయమున శేషుడు సహస్ర ఫణములతో నిండుకొని బుసలు కొట్టు చుండెను. దీనిని గమనించని ఆచార్యులవారు తదేక నిష్ఠగా స్తోత్రపఠన మొనర్చుట స్వామికి భరింపరాని స్థితి యేర్పడినది. ఇంతలో నొక వైష్ణవ స్వామి దేశికుల సమీపించి - స్పృశించి, వారి నుపవిష్టుల చేయగా అప్పుడు తెలిసినది. కాని వచ్చిన భాగవతోత్తముడు అదృశ్యమైనాడు. దేవాలయ గర్భ మంటపమున పొగలు, ధ్వనులు-ఆచార్యులవారు నిర్విణ్ణులై లేచి పరికించినారట! అప్పటికి పరిస్థితి శాంతించినది. దేశికులు దృఢగాత్రులైనారు.

ఈ విషయము తెలిసిన అర్వపల్లి వాసులు దేశికుల వారి ప్రభావము నకు ముగ్ధులై ఇచటనే వారికి నివాసమును ఏర్పాటు చేసినారు. వారి కోరికను కాదనలేక కొద్దికాల మిచట నివసించిన అప్పల దేశికులు తాము ప్రతిష్ఠించిన స్వామిని వదలి యుండలేమని మరల 'నరసింహాపురము'ను చేరిరి

నైష్ఠికులు, వాక్ఛక్తి, కవితాశక్తి కలిగిన దేశికులు ఈ స్తోత్రమును చెప్పి నృసింహస్వామిని దర్శించి ధన్యులైనారు. నేటికిని అర్వపల్లి నృసింహా స్వామి భక్తుల పాలిటి పెన్నిధి అప్పల దేశికుల యీ వృత్తాంతమును మనము విశ్వసించుటకు - కవితచే భగవంతుని ప్రత్యక్షము గావించుకొనిన బాణ, మయూర, గోగులపాటి కూర్మనాథకవుల వృత్తాంతములు నిదర్శనము.

స్తోత్ర ప్రారంభ శ్లోకము :

> 'శ్రీమంతం తార్క్ష్య వాహం శ్రుతి శిఖర వచ స్సత్కృతం శేషతల్పమ్
> సంకల్పైక ప్రక్లప్తాఖిల జగదుదయ త్రాణ సంహార కార్యమ్।
> కల్యాణైక ప్రదానం నిరత మఘలవప్రత్యనీకం చ నిత్యమ్
> వాత్సల్యౌదార్య సింధుం ప్రణమ హృదయ! భక్త్యార్వపల్లీ నృసింహమ్॥

చివరి శ్లోకము :

> 'రాకా సంపూర్ణ చంద్రాంచిత సిత సుతనుం రంగదుత్తుంగ గంగా
> త్సంగత్తారుణ్య పూరం తరుణ తరణి బింబోపమానాధరోష్ఠమ్।
> దోర్భ్యాం శంఖం చ చక్రం భృత మధుర సుధా సార ధారానుకారమ్
> వందే లక్ష్మీ నృసింహం ప్రతికల మనుయా మ్యార్వపల్లీ నృసింహమ్॥'

ఆర్వపల్లి స్వామి యోగానంద నృసింహుడు. కవి స్వామివారి రూప వైభవముల నిట్లు వర్ణించుచున్నాడు :

> 'శంఖం చక్రం కరాభ్యా ముపరి విలసితాభ్యా మభాభ్యామ్
> భ్రాంతం యోగాసనస్థం సురుచిర వదనం యోగపట్టాప్త జాన్వోః।
> న్యస్తాభ్యాం సద్భుజాభ్యాం విలసిత మరుణాంభోజ సంభాస దంభ్రిమ్
> యోగానందం నృసింహం ఝటితి హృది భజే హ్యార్వపల్లీ నృసింహమ్॥'

నృసింహమూర్తి తీక్ష్ణ ప్రతాపము స్తోత్రమున విపులముగా వర్ణింపబడినది, అట్టి వానిలో—

> 'జ్వాలా జాజ్వల్యమానం దితి సుత తతయే శాత్రవాదీల తీక్ష్ణమ్
> రక్షో విక్షోతి వక్షో భణ నిపుణ నఖం రౌష్య దేదీప్యమానమ్।
> ప్రహ్లాదాహ్లాద దక్షం ప్రణత జన సుధాప్రాయ ధీప్ర ప్రతాపమ్
> సాంహాస్సంహార రంహా శ్చటుల పటు మనో హ్యార్వపల్లీ నృసింహమ్॥'

స్వామి వారి యవతారమునకు కీర్తి తెచ్చిన ప్రపన్నార్తి చ్ఛిదములగు నఖములు దీనియందు వర్ణింపబడినవి.

నృసింహమూర్తి తన కోప జ్వాలలచే జాజ్వల్యమానుడై రాక్షస తతిని హతమార్చునపుడు వారికి క్షోభను, శత్రువర్గమునకు భయమును కల్గించిన నఖములు దేదీప్యమానములుగా నున్నవి. అవే నఖములు ప్రహ్లాదునకు ఆహ్లాదమును, భక్త జనులకు అమృత తుల్యములునై ప్రకాశించుచున్నవి. ఇట్టి నృసింహుని నేను భజించుచున్నాను-అనినాడు.

ఒకే రకమైన నఖములు ఇరువురకు రెండు విధములుగా భావింపబడినవి. ఇది ఉల్లేఖము.

పోతనగారు స్వామి నఖములను 'స్ఫురిత విబుధ జన ముఖములు...' ఇత్యాదిగా ఒక సర్వ లఘు కందమున వర్ణించిరి.

("స్వేచ్ఛా కేసరిణః స్వచ్ఛ స్వచ్ఛాయాయాసి తేందవః...త్రాయంతాం వో మధురిపోః ప్రపన్నార్తి చ్ఛిదో నఖాః" అనిన ఆనందవర్ధనుని శ్లోకము పోతనగారి కాధారము).

నృసింహస్వామి శ్రీమంత్రమై మంత్ర గోప్య పద్ధతి గల దివ్య శరీర ధారి. అట్టి దివ్య సుందర విగ్రహమును కవి యిట్లు సేవించుచున్నాడు :

'పాటీరాభం కిరీటాగణిత మణిస్ఫుణీ కోటి కోటీర కోటిమ్
ధాటీ స్ఫూర్జల్లలాటం పరిచకిత కటం నూత్ననూత్నం శరత్నమ్।
రత్నం ప్రత్నం స్వపత్న ప్రకర భయకరం వక్షసి భ్రాజయంతమ్
శ్రీమంత్రం మంత్ర గోప్యం హృదయ!భజ సదా హ్యార్వపల్లీ నృసింహమ్॥'

స్తోత్రమున స్వామివారి రూపము ఆ పద్ధతులకు తగినట్లు భీకరాచ్ఛుత శాంతములుగా వర్ణింపబడెను.

వానిలో రౌద్ర రూపము :

'తుంగత్వంగ త్తరంగ శ్వసిత ఖర పరిష్వంగ నిస్సంగ లింగ
ద్గంగం గంధానుగంత్రాగ్రగ గగనగ గంధర్వగీర్వం మహోర్వమ్।
శుభ్రాదభ్రం నిరభ్రం శిశు శశి శిశిర స్స్వీయ కాయోధవస్యా
భీష్టం తీక్ష్ణం పరాక్షాం నను మనసి నమా మ్యర్వపల్లీ నృసింహమ్॥' (10)

ప్రశ్నాంతరూపము :

> దీప్యత్ శ్వేతాతపత్రం మణి మకుట లసన్మస్తకం చ్యుక్త పార్శ్వమ్
> లక్ష్మీ క్ష్మాజా ముఖాబ్జాసకరుణ చరణం పూర్ణిమా చంద్ర వక్త్రమ్।
> సర్వోత్తంసం సమస్తాభరణ విలసితం కోటి సూర్య ప్రకాశమ్
> నేత్రానంద ప్రదం తం మమ హృది కలయే హ్యార్వపల్లీ నృసింహమ్॥'
> (28)

ఇట్లే స్తోత్రమున అవతార వైభవము మొదలగునవి ప్రౌఢశైలిలో చిత్రితములు.

## 4. నారసింహ స్తోత్రమ్ :

'పాతు మాం నారసింహః'- అను మకుటముతో బీజాక్షర యుతమైన యీ స్రగ్ధరా వృత్త స్తోత్రమున 27 శ్లోకములు గలవు. ప్రౌఢ శైలీ పాటవము గల దీనిని మొదట 'చాటుపద్య రత్నావళి'లో ప్రచురించినపుడు 16 శ్లోకములు లభించినవి; కర్తృత్వము తెలియలేదు *9.

మణవాళాచార్యుల వారు (వరంగల్లు) వ్రాసిపెట్టికొనిన 'అర్వపల్లీ నృసింహ స్తోత్రము' గల ప్రతిలో ఈ శ్లోకములు 11 లభించినవి. నావద్ద నున్న శ్లోకముల లోని ఆద్యంత శ్లోకములు - వరంగల్లు వానిలోని ఈ శ్లోకములు సమానములుగా గలవు. మిగిలినవి ముద్రణమైన వాని మధ్యన చేరవలయును. ముద్రింపబడిన 16 శ్లోకములలో 1 నుండి 5, మరియు 10 వ నెం. శ్లోకములు బీజాక్షర యుతములు. అంతేగాక వీనిలోని చివరి శ్లోకము అముద్రితముగా నున్నదానిలో చివరి శ్లోకమునకు ముందు చేరవలయును. అముద్రితములోని ప్రారంభ శ్లోకము స్తోత్రము మధ్యలో నుండవలెను. ఇట్లు సరిచేసిన - స్తోత్ర మొక పద్ధతిగా కుదురును. దీనివలన బీజాక్షరయుత శ్లోకములు (14) పూర్తియైన తర్వాత 'శాంతి' శ్లోకములు వచ్చును. ఇట్టి పద్ధతి బీజాక్షర యుత స్తోత్రములలో పాటింపబడును.

'నక్షత్ర మాలిక' యైన ఈ స్తోత్రకర్త అప్పల దేశికుల వారే యని మణవాళాచార్యుల వారి వద్ద గల ప్రతిలో లిఖింపబడినది. *10 వారికి లభించిన పీచు కాగితముల పుస్తకమందును ఇట్లే గలదట. దేశికుల 'అర్వపల్లీ నృసింహ

స్తోత్రము' నకును దీనికిని కొంత సామ్యము కలదు. ఈ పద్ధతిసైతము దేశికుల రచన యనుటకు తోడ్పడును. కవి యీ స్తోత్రమును ఎప్పుడు ఏ నరసింహ స్వామిని గూర్చి చెప్పినాడో తెలిసికొనుటకు ఆధారము లభింపలేదు.*11

ఇతర మంత్రములకు వలె దీనికి ఛందము, ఋషి, దిగ్బంధము మొదలగునవి కలవు. శ్లోకమున చెప్పబడిన అక్షరములలో 'క్షాం' బీజమ్, 'క్షీం' శక్తిః 'క్షూం' కీలకమ్, వేదవ్యాసుడు మహర్షి, కావుననే ప్రారంభ శ్లోకమున వీనిని తెల్పి, 'వేదాంగో' 'వేదనాదః' పదముల యందు వేదవ్యాసుని పేర్కొనెను.*12 ఆ శ్లోకము :

> 'శ్రీవత్సాంకం త్రినేత్రం శశి సమ ధవళం చక్రహస్తం సురేశమ్
> వేదాంగో వేదనాదః వినుత సురపతి ర్దేవ రూపః పరేశః।
> ఓం ఓం ఓం కార గమ్యం ఉడుపతి సదృశః ప్రజ్వల త్పావకాక్షః
> క్షాం క్షీం క్షూం బీజరూపో నరహరి వపుషః పాతు మాం నారసింహః॥'

స్వామి శశి సమ ధవళుడు, ఉడుపతి సదృశుడు ఐనను ఉగ్ర నరసింహ మూర్తి. అందుకే 'ప్రజ్వల త్పావకాక్షుడు'గా పేర్కొనబడెను. ఉడుపతి సదృశుడనుట వలన నక్షత్రములలో చంద్రుని వలె దశావతారముల యందు నృసింహుడు ప్రకాశమానుడు. దానికి అపదుద్ధారకత్వము కారణము (నరసింహావతారము ఆ పదుద్ధారకావతార మని ప్రసిద్ధి).

> 'కుందేందు శ్శంఖ వర్ణః కృతయుగ భగవాన్ పద్మ ముక్తా ప్రభాసో
> త్రేతాయాం కాంచనాభః పున రపి సమయే ద్వాపరే రక్తవర్ణః।
> ప్రభాంస ప్రాప్త కాలే కలియుగ సమయే నీలమేఘాబ్జనాభః
> ప్రాగ్జ్యోతిః (ప్రద్యోతః) సృష్టి కర్తా పరబల దహనః పాతు మాం
> నారసింహః॥' (18)

చతుర్యుగముల యందు నృసింహ మూర్తి దాల్చిన శరీర ఛ్ఛాయల తెల్పి, అన్ని యుగములలోను ఆయన పరబల దహనుడే యని కవి భావన!

అప్పలదేశికుల వారు బీజాక్షరములతో ఈ స్తోత్రమును చెప్పి భక్తితో పాటు తమ కవితా పాటవమును నిరూపించిరి.

(పూర్తి స్తోత్రము అనుబంధమున రిఁయబడినది).

## 5. స్తంభగిరి లక్ష్మీ నృసింహ స్తోత్రమ్:

'స్తంభగిరి దంభ హారీ భువనోదరంభరీ' అను మకుటము గల యీ స్తోత్రమున పదకొండు శ్లోకములే లభించినవి.*13

నేటి ఖమ్మంమెట్టునకు సంస్కృతీకరణమే 'స్తంభగిరి' (స్తంభ = కంబము. గిరి = మెట్టు-పర్వతము). ఇచట వెలసిన నృసింహ స్వామిని గూర్చి అప్పలదేశికుల వారు ఈ స్తోత్రమును చెప్పిరి.

ప్రౌఢ శైలి, శబ్దాడంబరము గల యీ రచన ఛందః ప్రకారము ఉత్పల మాలికలు. సంస్కృతమున యతి ప్రాసలతో కూడిన వృత్తరచన క్వాచిత్కము. ఆచార్యులవారు స్వామిని ఉత్పలమాలాలంకృతుని చేయదలచి ఈ పద్ధతి నవలంబించినారు. మాలికయందలి పద్యముల విడదీయరాని విధముగనే దీర్ఘ సమాస యుతముగా నివి రచింపబడినది.

'జలవదరీ దరీ కుహర భాస్వ దర యపరీ దరీ హరీ' యను మకుటమున కందుకూరి రుద్రకవి 'జలవదరీ శతకము'ను రచించె నని పరిశోధకుల యభిప్రాయము *14 వీని ప్రభావమున అప్పలదేశికులు 'స్తంభగిరి...' మకుటము నెన్నుకొని స్తోత్రమును రచించినారు. లభించిన రుద్రకవి పద్యములలో 'కలుషలసత్తరీ...' యనునది తెనుగు భాషలేని అంత్య ప్రాస గల పద్యము. ఆచార్యులవారివి పూర్తిగా సంస్కృత సమాస వృత్తము లగుట యొక ప్రత్యేకత !

> 'శ్రీ రమణీ మణీ రరుణ సిధ్మల శేఖర సుస్తనాక్త కా
> శ్మీర మరీచి సంక్రమణ మేదుర వక్ష విహార సార్థతా।
> పూరక పుష్ప మంటప సుపుణ్య మరంద ఝరాళి పాళికో
> ద్ధారక వృక్ష స్తంభగిరి దంభహారీ భువనోదరం భరీ' (1)

ఇది స్తోత్ర ప్రారంభ వృత్తము. దీనియందు నృసింహ స్వామి రూప వైభవము వర్ణింపబడినది. స్వామివారి వక్షః పీఠమునకు శ్రీరమణీ స్తనార్త కాశ్మీర మంటినది. ఎఱుపు పుష్ప మాలికాలంకృతమై యున్న నృసింహ వక్షః

పీఠము మధుప సంచార యోగ్యమై పుష్ప సమ్మిత మహా వృక్షము వలె శోభించుచున్నది. శ్రీ లక్ష్మీ కుచ కుంకుమాంకిత లసత్కాశ్మీరమును మధుప శ్రేణిగా చెప్పి, స్వామి పుష్ప పూరిత తనువును పుష్ప మండపముగా నుత్ప్రేక్షించుట కవి యుద్దేశ్యము.

> 'క్షుద్భయ దుఃఖ రుక్ మృగ నిశుంభ నృసింహ నిస్పృత్త వేద- సం
> విద్భగవత్సతాంహ పృథివీ జన తర్జన స్మర్తన క్రియో।
> ద్భిద్భర కర్కరాభట విదారణ కర్మ హిరణ్య దైత్య రుం
> ధద్భుజ రంహ స్తంభగిరి .......................' (3)

నరసింహమూర్తి భక్తుల క్షుత్, భయ, దుఃఖ, రోగము అను రాక్షసుల హరించువాడు, వేదోద్ధారకుడు, హిరణ్య కశ్యప రాక్షస నిర్మూలము చేసి లోకమందలి జనమును ప్రోచినవాడు. ఈ విషయములు సభక్తికముగా ప్రౌఢ రీతిలో తెల్పబడినవి.

> 'మౌళి లసత్తులస్యమల మాల్య గళ న్మకరంద బింద హిం
> దోళ సరాళ గానగతి దాహళ కాహళ వైఖరీ కథా।
> కాళ వలస్మణి ప్రకర రాజ దభీగణ భూగణ ప్రథా
> దాళధళీక స్తంభగిరి................' (8)

స్వామివారు కంఠమున ధరించిన తులసీ మాలిక విశిష్టమైనది (విష్ణువు తులసీవన మాలా విభూషితుడు). దానినుండి మకరందము (?) జారి మణియుత మాలికలపై బడగా నవి కదలినవి. అట్టి కదలిక సంగీతరాగ యుక్తమై వాని కాంతి భీతజనాభయ ప్రదానమో యనునట్లు తళతళ మనుచున్నది. నృసింహ స్వామి కంఠావలంబిత వివిధ మాలికా వైభవమును కవి యిట్లు చమత్కరించెను.

దేశికుల యీ స్తోత్రము పూర్తిగా లభించినచో వర్ణనలు మొదలగునవి మరింత తెలిసికొనుట కవకాశము కలిగెడిది.

## 6. నృసింహ స్తోత్రమ్:

మఱింగంటి వారియందు అప్పల దేశికుల తరువాత అనేక తిరునామ, మంగళహారతులను చెప్పి ప్రసిద్ధులైన లక్ష్మణ దేశికులు (మల్లంపల్లి)ఈ స్తోత్ర కర్త.

తమ తండ్రిగారు నృసింహ స్తోత్రమును వ్రాసినారని దేశికుల కుమారులు మణవాళాచార్యులు గారు చెప్పిరి. రాని వారివద్ద ఈ శ్లోకములు లేవు. మకుటము మాత్రము గుర్తున్నది.

గోలకొండ కవుల సంచిక (337 పుట) యందు 'నృసింహ స్తోత్రము' శీర్షికతో దీనిలోని 4 శ్లోకములు ముద్రింపబడినవి. ఇవియే ఈ స్తోత్రమున లభించు శ్లోకములు.

'దేవాద్రి ప్రభు మీశ ధాతృ వినుతం లక్ష్మీ నృసింహం భజే'

అను మకుటము గల దీనియందు పేర్కొనబడిన 'దేవాద్రి' వేల్పుగొండ 'జఫర్‌గడ్'కు సంస్కృతీకరణ. ఈ గ్రామము వరంగల్లు జిల్లా వర్ధన్నపేట తాలూకాలో కలదు. పర్వతముపై నృసింహాలయ మున్నది.

దేశికులు వేల్పుగొండ స్వామిని దర్శించి ఈ స్తోత్రమును మనవి చేసియుందురు.

లభించిన 4 శ్లోకములు - మఱింగంటి వారి యితర నృసింహ స్తోత్రముల వలె ప్రౌఢము గాక సులభ శైలిలో గలవు.

> "శ్రీమద్భాసుర దేహ కాంతి విజిత ప్రద్యోత నేందుప్రభమ్
> కోపాగ్ని స్ఫుర దీక్షణాంచిత కన జ్జ్వాలా యుతం సన్ముఖమ్।
> ప్రహ్లాదాస్య సరోజ చిత్ర కిరణం బర్హిర్ముఖానందదమ్
> దేవాద్రి ప్రభు మీశ ధాతృ వినుతం లక్ష్మీ నృసింహం భజే॥"*15 (1)
>
> 'లోకానాం భయదం హిరణ్య కశిపుం హత్వా సురాణాం సుఖమ్
> యచ్ఛన్ సర్వ దిగీశ్వరై స్తు బహుధా సంస్తూయమానం సదా
> భక్తానాం కుశల ప్రదం రిపుహరం దానౌఘ కల్పద్రుమమ్
> దేవాద్రి ప్రభు.....................................' (2)

'గీర్వాణాధిపతిం మహాబలయుతం ధీమాద్విహాసోన్నతమ్
క్షీరాంభోధి సుతా మనోహర విహార ప్రౌఢ లీలాన్వితమ్।
దివ్యాస్త్ర క్షత దేవ దానవ చయం వేదాంత సూక్తి స్థితమ్
దేవాద్రి ప్రభు..................' (3)

మందారాతి వహాన్వితా విలసితం మాణిక్య దిగ్గాంగదమ్
ముక్తాహార విరాజితోరస మతి ప్రాంచ త్కిరీటం శిరః।
సంగ్రామోజ్వల శక్తి సంయుత చతుర్బాహుం ద్విష ద్భీకరమ్
దేవాద్రి ప్రభు మీడ ధాత్ర వినుతం లక్ష్మీ నృసింహం భజే॥ (4)

వీనియందు శ్రీ నృసింహ వర్ణన చేయబడినది.

## 7. శ్రీ యాదగిరి లక్ష్మీ నృసింహ సుప్రభాతాది స్తోత్రములు

శ్రీమాన్ జగన్నాథా చార్యులు (రంగాపురం) వారు రచించిన **'శ్రీయాదగిరి లక్ష్మీ నృసింహ సుప్రభాతమ్'**, **'పంచ రత్నాని'**, **'ధాన్య న్మాల్యమ్'** కలిపి ఒకే గ్రంథముగా ముద్రణ చేయించి, దీని ప్రారంభమున గ్రంథ ముద్రాపకుని—

'ఆద్యత్వో యాదశైలే నృహరి సకల కైంకర్యరాయోః కవిన్న
స్సత్కృత్యాస్మ త్ప్రిణీలా నృషు భువి చ కృతీర్తిను ముద్రాపయిత్వా।
గ్రావ్యాః కర్తుం సమీప్తే స హరిత సకలో బీరకాయాస్వయేందూ
రామారాయ ప్రభు ర్జీవతు శత మిహ వ స్సా ద్విశేషాదృత్య ధన్యః॥'

అని ఆశీర్వదించిరి. దీనియందు పేర్కొనబడిన బీరకాయల రామారావు గారు స్వంత వ్యయముతో విని ముద్రించి*10 కవి కొసంగిరారు. గ్రంథాంతమున దీనియందు గల రచనల గూర్చి—

'ఏకత్రింశత్సు ప్రభాతం పంచరత్నం చ పుంహరేః।
ధాన్యన్మాల్యం వ్యాజనుతి ర్జగన్నాథార్య మత్కృతిః॥' అని తెలిపిరి.

**1. సుప్రభాతమ్:** 31 శ్లోకములు గల దీనియందు కొన్ని 'మమ సుప్రభాతమ్', మరికొన్ని 'తవ సుప్రభాతమ్' అని అంత్య మకుటములతో నున్నవి.

జ్వాలాభి స్స్ఫుటహాస్తై రుభయ భుజగ వక్త్రై ర్విహార్యక్షపక్షై
ర్హుం ఫట్ స్వాహా సహస్రార కురు కరుణ యోత్తిష్ఠ శంస త్రిధామన్ ।

ఈ పద్ధతి రచనయే తర్వాతి రెండు శ్లోకములలోను గలదు.

'భీమం భీమాట్టహాసం పటు చటుల సటం దీర్ఘ దంష్ట్రోత్కరాళమ్
బిభ్రాంతం ఘోరదాభ్రే భ్రుకుటి మివ తటిద్వల్లికాం మల్లికాచ్ఛమ్।
దుష్టాన్ జ్వాలాజ్వలంతం శిఖి పర నఖరం లోక భీకారరావమ్
హుం ఫట్ స్వాహాయిషేంషేం ససిక శిశివు హర్వ్యాం భజే నారసింహమ్' (4)

**3. భాస్వన్మాల్యమ్ :-** 12 శ్లోకములను భాస్వన్మాలా ఛందములో చెప్పి స్వామివారికి భాస్వన్మాలను సమర్పించిరి (ఇది 'స్వాగత' వృత్త లక్షణము కలిగి యున్నది).

'ద్విట్సు త్విట్సు నిధనం హి ధనం త్వ
త్సత్సు హృత్సు పదకం పదకం తే।
భాసు మాసు జితగౌః కృతగౌ స్త్వమ్
యా దయావతు తు యాదగిరౌ మా॥' (3)

'పుండరీక దళ దీక్షణ సేవే
పుండరీక వర రక్షక రక్షే।
మండలాయితభ యాదగిరే! చి
న్మండలాయిత శుభాభయదం త్వామ్॥' (4)

వీనియందు చివరి శ్లోకము '**ముద్రాలంకారము**'గా నిట్లు చెప్పబడినది.

'దాశరథ్య భజ నాభిరతశ్రీ దాశరథ్యభిము ఖోర్పిత వాంఛీ।
వత్సమాదృగతి **భాస్వద మాల్యం** వత్సలం స్పృహితయా దధరేఽహమ్॥'

కవి తనను గూర్చి—

ఉరో జగన్నాథ కవి ర్నిబంధ మౌద్గల్య గోత్ర స్తురకల్య సిద్ధ్యై।
భాస్వత్స్రజా యాద గిరీశితాయాం సంతర్ప్య కృత్వాల మిమం ముదేతి॥

**4. వ్యాజనుతి :** దీనియందు భగవన్మహిమాభివర్ణన వ్యాజనిందా పరముగ 12 శ్లోకములలో చెప్పబడినది.

'శ్రీశాహం త్వం త్వహం త్వం హ్యహమహమికయా శేషతా మమివాహమ్
కుర్వై ర్మన్యే స్వరూపే గుణవినిమయిణం చేదితీత్థం సతీర్థ్యమ్।
బంధేహి త్వానుబంధే విరమ సికిమమూం రక్షకత్వం కుత స్త్వమ్
వాదో౽యం యాద శైలే భవలి భవతినో యాతి మోక్షే౽పి మోక్షే॥'(1)

స్తవము చివర కవి యిట్లు విన్నవించుకొనినాడు:

'భద్రం తే స్పృహారే మమాస్తు చ లథా నక్తం దివం ప్రార్థయన్
ఘన్ను స్త్వం విలసం త్రివార మఖిలా న్భోగాం త్సుభోగ్యాన్ రసాన్।
భుంజన్ శేష మహం చ వంచ శయనే శేషేశయా చింతయా
స్వాతంత్ర్యం తవ పారతంత్ర్య మపి మే యాదాద్రి పాత్రా స్తి కిమ్॥'

'విధేహి కరుణాతురం తనురుణం నిజం వారయ
ప్రదేహి శత మాయు రున్మదరివార ముద్వారయ।
ఉపైహి గృహ మేత్య వస్సుత గృహాది సాహ్యం స్వయమ్
సుయాదధర పుంహరే దృగతి ఘృష్టి శిష్టిం కురు॥'

కవికి భక్తితో పాటు శబ్దాలంకార రచన యిష్టము కావున ప్రతి రచనను అలంకారయుత మొనర్చెను.

## 8. పద్మాష్టకమ్ :

శ్రీరంగాచార్యులు గారు (సీతారాంబాగ్) రచించిన దీనిలోని శ్లోకములు వారివద్ద రెండు లభించినవి.

పూర్వకవులు లక్ష్మీసహస్రమ్, లక్ష్మీ స్తోత్రమ్, లక్ష్మీస్తుతి, లక్ష్మ్యష్ట కముల రచించిరి. అవి ప్రసిద్ధములు.

ఆచార్యులవారి యీ స్తుతి ప్రాచీన కవుల పలితా శైలిని తలపించును.

1. శ్రియః పత్యుః శ్రీమచ్చరణ సరసిజాత యుగళే
ప్రణామ స్సాష్టాంగః పతతు మమ తత్రేవ విషతః।
యదీ యేషత్కాల ప్రణయ లవ సౌభాగ్య గరిమా
వశా ద్భాదా యుగ్మం హ్యలభత మహారాజ్య ముతుజమ్॥'

౨. 'హరంతీ సంతాపం మనసి విహరంతీ మమ సుఖమ్
దిశంతీ కల్యాణం భృశ ముపదిశంతీ హరికథామ్।
హసంతీ మందం శ్రీ హరి ముపహసంతీ గుణగణైః
ప్రసీదంతీ పద్మా నయన యుగ సద్మా భవతు మే॥'

ప్రథమ శ్లోకమున దేవీ చరణములు, ద్వితీయ శ్లోకమున నయనములు వర్ణింపబడినవి. ఇవి మణింగంటి వారి సంస్కృత కృతులు.

## సూచికలు:

1. నరసింహాపుర దేవాలయాంతర్భాగమున శిలపై నున్న శ్రీరామ పాదుకలు నిరంతరము జల పరివేష్టితములు. ఈ నీటినే భక్తులకు 'తీర్థము' గా వినియోగింతురు.
2. దేవాలయ ప్రాకారము నానుకొని కుడివైపున గల యీ సరస్సు (కోనేరు) స్వచ్ఛ జల యుక్తము. దీనిలోని నీరు చల్లగను, ఇదే గోడ నంటిన దేవాలయము లోపల నున్న చిన్న కుండములోని నీరు గోర్వెచ్చగాను ఉండుట యొక్క విశేషము
3 స్వర్గేషు పశువాగ్వజ్ర దిజ్నేత్ర ఘృణి భూజలే, లక్ష్య దృష్ట్యోః స్త్రియాః పుంసి గౌః - సుబుద్ధ్యా ప్రబోధిక - నానార్థ వర్గః.
4. 'నాచ్చియార్ తిరుమొళి' విశేష వ్యాఖ్య, శ్రీగోదా గ్రంథమాల ప్రచురణ (1977).
5. శ్రీరామాలయమునకు వెనుక కొద్ది దూరమున గల రంగకృష్ణ స్వామిని నరసింహ కేశవులే ప్రతిష్ఠించిరి. అనుదినము ఆరగింపు మొదట ఈ స్వామికి, పిమ్మట శ్రీరామునకు. ఈ పద్ధతి నేటికిని కొనసాగుచున్నది.
6. ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక ప్లవంగ మార్గశిర, పుష్యములు (1968 డిసెంబర్, జనవరి 1969) సం. 56, సం. 5, పుటలు 58-60

7. ఈ స్తోత్రములు 'అప్పల దేశికుల' వారివే యని మణవాళాచార్యుల వారికి వారి తండ్రి లక్ష్మణ దేశికులవారు చెప్పిరట. పీరికి దొరికిన పీచు కాగితాల ప్రతిలో అప్పలదేశిక నామము కలదు.
8. ఇవి 27వ నెంబరు శ్లోకము తరువాత చేరినచో మకుటము, వర్ణనలు కుదురును. అప్పు డివి 28వ, 29వ నెం. ర్లగను మిగిలినవి 30వ, 31వ నెంబర్లు.
9. శ్రీమాన్ మఱింగంటి పురుషోత్తమాచార్యుల (సూర్యాపేట) వద్ద లభించినవి.
10. 'వావిళ్ళ' వారి 'బృహత్ స్తోత్ర రత్నాకరము' (2భా, పుటలు 389, 390) నందు దీనిలోనివి 9 శ్లోకము లున్నవి. కర్తృత్వము తెల్ప బడ లేదు. శ్లోక చరణములు పునరుక్తము లైనవి.
11. నృసింహోపాసకు లైన నరసింహ దేశికులు వాడపల్లి నరసింహ స్వామిని గూర్చి ఈ స్తోత్రమును చెప్పి రని మఱింగంటి కృష్ణమాచార్యులు (మహబూబాబాద్) గారు నాతో అన్నారు.
12. అనుబంధమున ఈయబడిన శ్లోకముల చివర మంత్రము కలదు.
13. నకిరెకల్లు తా॥ 'వల్లాల' గ్రామమున కందాళ వేంకట నరసింహాచార్యుల వారి వద్ద లభించినది అప్పలదేశిక కృత మని వారి కాగితాలలో కలదు.
14. 'చాటు పద్య మణి మంజరి' (2వ భా. 119వ పుట) మరియు 'కందుకూరి రుద్రకవి' (31, 32 పుటలు).
15. ఈ శ్లోకము 'మన పండితులు - కవులు - రచయితలు' అను గ్రంథమున ఉదాహరింపబడినది (46వ పుట).
16. 1922 'ఇనుగుర్తి విజ్ఞాన ప్రచారిణీ ముద్రణాలయమున ముద్రింపబడి మ. రా. శ్రీ బీరకాయల గాయాపురావుగారిచే ప్రకటింపబడినది' అప్పుడు రామారావుగారు యాదగిరి దేవస్థానాధిపతి.

# V

# లాక్షణిక మర్యాద

క్రీ. శ. 1600 - 1800 మధ్య కాలమున వర్ధిల్లిన తెనుగు సాహిత్య మంజరి కావ్యభాషా పరిణామము గమనింప దగినట్టిది.

రాజకీయముగా ఒక మహా సామ్రాజ్య మంతరించి చిన్న చిన్న రాజ్యములు, సంస్థానములు స్వతంత్రించి తలయెత్తిన విధముగనే సాహిత్యమునందును అనుస్యూతమైన మార్గమును వదలి, నూతన ప్రక్రియలు, అందు కనుగుణమగు భాషా ప్రయోగము ఈ కాలములోనే ఆరంభింపబడి, ఆంధ్ర భాషా సాహిత్యములయందు ప్రత్యేకతను సంతరించుకొనినది.

మధుర, తంజాపురము దక్షిణాంధ్ర కవులే గాక తెనుగు నాట వర్ధిల్లిన ఎందరో కవులు ఈ కాలముననే భాషా విషయమున స్వతంత్ర ప్రయోగము లొనర్చి, సాహిత్యమున ప్రక్రియా వైవిధ్యముతో రచనల నొనర్చినారు. ఇందు కుదాహరణముగా **'తంజాపుర అన్నదాన సత్ర నాటకము'**, **'రాధికా సాంత్వనము'**, **'తారా శశాంకము'**, **'అహల్యా సంక్రందనము'**, **'హంస వింశతి'**, **'రాఘవాభ్యుదయము'**ల పేర్కొనవచ్చును *[1]

కుతుబ్షాహీల పరిపాలన కాలమున గల జగన్నాథాచార్య, సింగరాచార్యులను మినహాయించినచో తరువాత వచ్చిన మట్లిగంటివంశ కవులు అనేక గ్రంథముల రచించి వానియందు భాషా ప్రయోగ విషయమున దక్షిణాంధ్ర కవుల పద్ధతిని, అనగా - తమ సమకాలమున వర్ధిల్లిన సాహిత్య ప్రయోగ విధానమును స్వేచ్ఛగా అవలంబించి, స్వతంత్రతను నిరూపించుకొనిరి.

వీరిలో వేంకట నరసింహాచార్యులు (ద్వితీయ)'తాలాంక నందినీ పరిణయ' కర్త తమ రచనలయందు వ్యావహారిక పదములను, అన్య దేశ్యములను, ఉర్దూ,

పారసీ పదములను అధికముగా ప్రయోగించుటయే గాక, జన వ్యవహారమున బహుళ ప్రచారము నందిన విధానమును బట్టి కొన్ని సంస్కృత పదములను వాడినారు. (ఉదా:- 'ఇక' అనుటకు 'ఇహ' అని, దిగిభ - 'దిగిభ', ద్విరేఫ - 'ద్విరేభ', ప్రహ్లాద - ప్రహలాద' అని ప్రయోగించిరి).

వీరి యీ పద్ధతిని పరిశీలింపగా ''కాలము బట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశ భాషా లిలితాంగి మారు టది సత్కవి సమ్మతము'' (పాణి గృహీత 1-19) అనునది వీరి యందు మిక్కుటముగా కన్పించును. మన ప్రాచీన కవులనుండి దక్షిణాంధ్ర యుగ కవుల వరకు గల ప్రబంధాదుల పరిశీలించినప్పుడు ప్రతిభావంతులు మహా వ్యుత్పన్నులైన వారు సైతము ఇట్టి పద ప్రయోగములనుండి తప్పించు కొనలేక పోయినా రనిపించును.

భాషా సాహిత్యములయందు సంప్రదాయ బద్ధమగు మక్కువతో పాటు సంఘముపై గల అభిమానముతో ప్రజా వ్యవహారమునందు రూఢియై యున్న పదములను యథాతథముగా ప్రయోగించి వానికి ప్రామాణికత కల్పించుటయే వీరందరి అభిప్రాయముగా భావింపవలెను. అంతేకాని ఇప్పుడున్న వ్యాకరణములతో పూర్వుల ప్రయోగముల చూచి వానిని దిద్ది పరిష్కరించి 'తగును-తగదు' అనుకొని రూపాంతరము నొందించుట ఆ గ్రంథకర్తలకు ద్రోహము చేసినట్లే యగును.

కాలక్రమముగా ప్రాత తరము భాషతో క్రొత్త తరము భాష, ఒకనాడు గ్రామ్యములు, అసాధువులైన పదములు జన వ్యవహారములో నలిగి గ్రంథస్థములై, శిష్ట జన పరిగ్రాహ్యము లగును. అందుకే పెద్దలు 'ప్రవాహినీ దేశ్యా' అనినారు.

పద్యమునకు ఛందస్సు, ఛందోబద్ధమైన భాష ముఖ్యము. భాషకు వ్యాకరణము ముఖ్యము. కావున పద్య రచనమునకు ఛందో వ్యాకరణములు రెండును ఆవశ్యకములే యైనను, వ్యాకరణ దోషము ఛందస్సున సహింపబడినంతగా 'ఛందో భంగము' సహింపబడదు. అందుకే 'అపి మాషం మషం కుర్యాత్ ఛందో భంగం న కారయేత్' అనిరి. ఈ నియమమును పాటించియే కవులు వారికి నచ్చిన పదములను ప్రయోగించు నప్పుడు వ్యాకరణము నుపే

క్షించిరి. కాని 'ఛందో భంగము' మాత్రము చేయలేదు. ఈ పద్ధతినే సంస్కృతాంధ్ర ద్రావిడ సాహిత్యము లందు నిష్ణాతులైన మరింగంటి కవులు అనుసరించినారు.

వీరియందు సింగరాచార్యుల **'సీతాపతి శతకము'**న వ్యావహారిక పదములు స్వల్పముగా నున్నవి. బహు గ్రంథకర్త యైన వేంకట నరసింహాచార్యుల రచనలయందు అధికముగను, **'బాలాంక నందినీ పరిణయము'**, **'కేశవస్వామి శతకము'**ల యందు ఒక మాదిరిగను వివిధములగు పద ప్రయోగము కలదు.

వీనిని స్థూలముగా నిట్లు విభజింపవచ్చును :

1. వ్యవహారము ననుసరించి ప్రసిద్ధ పదముల మార్పు ( వెలుఁగు - ఎలుగు)
2. ఎకార విశిష్ట పదములు అకార విశిష్టములుగను, అకార విశిష్టమైన పదములు ఎకార విశిష్టములుగను మార్పు (చన్నయ, చంత).
3. పదాది 'య'కార 'వ'కార ప్రయోగముతో యతి చెప్పుట.
4. 'ఉ' - 'వు' లకు - 'ఒ' - 'వొ'లకు - ఇకార ధ్వనులకు యతి.

ఈ విధమైన ప్రయోగములను వ్యావహారిక భాషా పరిశోధకులు సమర్థించి వివరించినారు.*2

'జనక సుతాభ్యుదయము'న 'ఏటిరాయని పట్టిన ఎలుఁగు జేని'-(5-217) అని 'వెలుఁగు' - 'ఎలుఁగు'గా మార్చబడినది. తెనుగునందు 'ఎ' ఉచ్చారణము 'య'గా మారినట్లే 'య' 'ఎ'గా మారినది.

ఉదా :- యవ్వన, ఎవ్వన; ఏడ - యాడ అనునవి. వీని పద్ధతిలోనే 'వ'కారాదియైన 'వెలుగు' ఎకారాదిగా 'ఎలుగు' యైనది. ఈ సామ్యము ననుసరించియే యతి చెప్పబడినది.

2. ఎకార విశిష్ట పదములు అకార విశిష్టములుగను, అకార విశిష్టములు ఎకార విశిష్టములుగాను మార్పు చెందుట.

వీనిని లాక్షణికు లంగీకరించకున్నను వ్యవహారమున గల పదోచ్చారణను బట్టి నామవాచకములు, క్రియలు ఇట్టి యతులతో చేరినవి.

ఉదా॥ 'చక్రవర్తి' పదము ఉచ్చారణయందు పదాది ఎకార ధ్వనిగా 'చెక్రవర్తి'యని వాడుకలో స్థిరపడినది. తెలుగునందే 'చ' కలదు. ''చన్నయా

చార్యు డాచార్య చక్రవర్తి'' అను ప్రయోగము ఇట్టిదే. 'చాయనవ్వలె' (చేయనవ్వలె), 'చాటంత' (చేటంత), 'చెరించు'(చరించు) వంటి ప్రయోగములు*3 సైతము ఇట్లేర్పడినవే!

3. పదాది 'య' కార' 'వ'కార ప్రయోగము :

'యకారమును, వు, వూ, వొ,వో లును తెనుగుభాషకు మొదట నుండ' వని వ్యాకర్తల నియమము. కాని తాళపత్ర గ్రంథములయందు ఇట్టి వధికము. జనుల వాడుకయందు అజాది బదులు హలాది ఉచ్చారణ సులభమగుట వలన ఈ పద్ధతి పదములు వ్యాప్తి చెందినవి. ఇందు కుదాహరణగా యితడు, యెవడు యెక్కడ, యెండ, వుడుత, వూరు, వొడ వంటి పదములు గలవు.

అచ్చులైన ఇ, ఈ, ఎ, ఏ లు - యి, యీ, యె, యే లుగా ఉచ్చరింప బడుట సహజమైనందున ప్రాచీన లేఖనమున ఈ పద్ధతి యేర్పడినది.

ఉ, ఊ లు సైతము వ్యవహారమున వు,వూలు గా మారుటకు గల కారణము మానవుడు అక్షరములను ఒత్తి పలుకుటలోని క్రమను తగ్గించు కొనుటకు ఉ, ఊ లను వు,వూలుగా ఉచ్చరించును. ఇట్లే ఒ,ఓలు వొ,వోలుగా వ్యాప్తి చెందినవి. ఈ విధముగా యకార వకారములు లేఖనమున ప్రచురమై నందుననే లాక్షణికులు వీనిని నిషేధించినారు *4

తాళపత్ర గ్రంథములయందు వుదధి, వుల్లము, వోపిక, వూర్వశి, వూరు వంటి పదములు కన్పట్టుటచే లక్షణసార సంగ్రహకర్త వీనిని గూర్చి-

> 'ఉల్లమువిద యుదటు నూరును నోపిక
> యనెడు పలుకు లెల్ల( దెనుగు లోను
> ఉదధి యున్నతంబు నూర్వశి యోంకార
> మమరు ననగ సంస్కృతమున( జెల్లు' (3-9)

అనెను. అప్పకవి య, వ, వు, వూ, వో లు పదాదిని లేవని తెల్పినాడు (2-43, 44,221). కాని 12 వ శతాబ్దమునకు పూర్వము నుండియే వు, వూ, వొ, వోల ప్రయోగములు గలవు *5

మఱింగంటి కవుల యందు పూర్వుడైన సింగరాచార్యుల రచనలలో వ్యావహారిక భాషా పదములు స్వల్పముగా కన్పట్టును.

ద్వితీయ వేంకట నరసింహాచార్యుల కృతులయందు మాత్రము ఈ రక మైన పద ప్రయోగము అధికముగా గలదు. అట్టి వానిని పరిశీలించినపుడు దీనిని క్రీ. శ 1600-1800 సంవత్సరముల మధ్య కాలమున ఆంధ్ర సాహిత్యమునం దేర్పడిన కావ్యభాషా పరిణామముగా గుర్తింపవలెను.

వేంకట నరసింహాచార్యుల గ్రంథములలో గల కొన్ని ప్రయోగము లిట్లున్నవి :

1. 'ఎ' కారమునకు బదులు 'అ' కారమును చేర్చినవి :

చంతను వచ్చియున్ ముసలి నంయమి (చెంత) 'క్షత్ర...' 3-58
చచ్చెర నిర్వాణ పదవి శబరియు చేరెన్ (చెచ్చెర) 'జనక...3-488
చతురాననంబులు చంగలింప (చెంగలింప) 'నృకం... 1-104
'చన్నయాచార్య డాచార్య చక్రవర్తి' (చెన్నయ) 'గోదా'-1-128
'చలిలాడుచు నుండు వారి నంస్కారాదుల్'
(చెలిలాడు) 'క్షత్ర...'-2-291
చలువ దుకూల, చేలమున శాధయు దీరగ
(సేద) 'శ్రీరామా...' 3-892
'చారంబోయిరి ... సాయాహ్న కాలంబునన్'
(చేరన్) 'జనక'...2-270
'యట్టికేలకు జనకుని యాసనంబు' (ఎట్టకేలకు-
ఇది యకారాదియైనది) 'గోదా...' 2-70
'యట్టకేలకు సెలిపియ యన నకులుడు' (ఎట్టకేలకు
ఇది యకారాదియైనది) 'నృకం...' 2-202
'యల్ల జనంబుల స్నరసి యద్భుత మంపగ'
(ఎల్ల) 'జనక...' 2-82
'యలమి నేతెంచెని యతి సమూహంబు' (ఎలమి) 'శ్రీకృష్ణ...'
'నంతసమున పొలజూచి చారగ పిలువన్' (చేరగ) 'విష్వ...' 1-111
'సరస లతోద్యాన చంగల్వ కొలల' (చెంగల్వ) 'శ్రీకృష్ణ...
'సాగి మ్రొక్కి లేచి చంచు లంత' (చెంచుబు) 'క్షత్ర...' 2-14

2. **అజాది పదము హలాదిగా మారుట :**

'వత్స! నీ యెడ మత్కృప వనరు కతన (ఒనరు) 'సీతా...' 1-14
'వదిగి జూచి యిదిగో వచ్చె ననుచు' (ఒదిగి) 'గోదా...' 2-54
'వనర స్వయంవరోత్సవ వివాహ...' (ఒనర) 'జనక...' 2-186
'వనట నొందుచు గుడి నట్లు వదిగి యున్న'
(ఒదిగి) 'క్షత్ర...2-197
'వనరంగ గాంచి యిట్లనియె వారక' (ఒనరగ) 'శ్రీకృష్ణశతా...'
'వనితలు తానును వక వింతగాను' (ఒక) 'శ్రీకృష్ణ...'
'వఱపగు పీఠమున్ మృదుల వస్త్రము' (ఒఱపు) 'జనక...' 1-2
'వనర నీవు మున్ను వ్రాసిన దంతయు' (ఒనర) శ్రీకృష్ణశతా...'
'వొనరగ మ్రోయు వాద్యములు వ్యోమ చరావళి'
(ఒనర) 'నృకం...' 3-157

3. **'అకార విశిష్టములైన సంస్కృత పదములు 'ఎ' కార విశిష్టము లగుట :**

'చెల్లదు నిక్కంబు జెలజాక్షు నాన' ('జెలజ'
అని యతి) 'శ్రీకృష్ణ...'
'జెగము౦ ప్రఖ్యాతిచే నొందు గాన (జగము) (,,)
'జెనక భూవరునకు చెప్పిన యట్టి' (జనక) 'శ్రీకృష్ణ...'
(జెనన, జనక రెండు విధములుగా రాయన ప్రయోగములు గలవు)
'జెర రుజ వైధవ్యములను చెందక' (జర) 'జనక...' 5-712
'శెతకంబు కంటెను చెలగు గద్దె' (శతక) 'చిలుప...' 1-
'శెత సంహితను తెన్గు చేసినావు' (శత) 'సీతా...' 1-18
'శెరజ సురల కొరకు చెలసుండి (శరజ) 'జనక...' 3-344
'శెర పరంపరలచే చెండి గాత్రపుల' (శర) 'శ్రీకృష్ణ...'

4. ఈ విధమైన ప్రయోగములే గాక **'వు' కారమునకు గల 'ఉ'కార ధ్వని విశేషముతో యతి చెప్పుట :**

'కా, వుత మిది మాకు సుమ్ము ముని వొల్లభ' 'విష్వ...' 2-176
('వల్లభ'శబ్దము,'వొల్లభ'యైనది.'వు'లోని'ఉ'కారముతో యతి)

'కా, వున నిది దారు నిర్మితవు వోడయు' (జనక) 3-128
(ఓడను 'వోడ' యని ఉకార ధ్వనితో యతి చెప్పినాడు)

పూర్వ కవులయందును ఈ రకమైన యతులు కన్పట్టును. వాని నుండి కొన్ని. 'ఎ'కారమునకు బదులు 'అ'కారము :

1. సాయం సంధ్యా విధులిక
చాయన్వలె నంచు నదటి జను లెల్ల-' (చేయన్వలె)
రాఘవాభ్యుదయము 6-260

2. 'చఱకగు వింటి బల్మి పెలుచన్' (చెఱకు) కాళిందీ
కన్యా పరిణయము 3-86

3. 'చన్నులు జిటుగు కంచలల నఱుత' (కంచెల)
భాగవతము 10-797

4. 'జాలముల నుండి ముత్యాల వాన లొలుక'
(సేసలు) భాగవతము 10-672

5. 'చరణంబులు నీ పదాబ్జ శావా నిరతుల్' (సేవ)
భాగవతము 11-15

6. 'యజ్ఞనామాత్యు ననుజన్ము దహిప భూష'
(ఎఱ్ఱన) శృంగార శాకుంతలము 1-52

7. 'యవత యేనియు వెన్నుని యౌవనాఢ్యు'
(ఎవతి) కాళిందీ కన్యా...' 2-115

(6,7 సంఖ్యలలో అజాది పదములు హలాదిగా చేయబడినవి)

2. 'వు' కారములోని 'ఉ' కార ధ్వనికి యతి :

1. 'దే, పురకు ననుంగు వాడనని వుత్పుకతన్' వృషాధిప శతకము-9
'ఉత్సుకత' పదము హలాదిగా మార్చుచెంది 'వు'లోని 'ఉ' కారముతో యతి చెప్పబడినది.

2. 'గో', 'వుల గణుతింప ధాతయును నోపడు'-'భాగవతము' 10 ఉత్తర-461వ పద్యము

3 'మ, ఘో ఘ్రుడై పట్టి తెచ్చె పాల్వుండు గద(గి-' 10వ స్కం-ఉత్తర 900వ పద్యము

## యతి భ్రంశములు :

వేంకట నరసింహాచార్యుల (ద్వితీయ) ప్రబంధముల యందు నాల్గింటిలో కొన్ని యతిభంగములు సవరింప వీలులేని విధముగా గలవు.

1. 'శాపముఁ జెంద కాంతిమతి యంగన' శ్రీరామా...3-547
2. 'వేసారెప్పుడు శాస్త్ర సంచయముఁ దా వ్యాఖ్యానముల్ జేయుచున్' శ్రీరామా...1-495

('వేసారి'ఉచ్చారణలో 'వాసారి' యగు నను భావనతో ఈ యతిగలదు.)

3. 'తూల మస్తకు నను మౌని దరదు' 'జనక.' 3-450
4. 'నన శరు వింట్లు గావె కను బొమ్మలు' ,, 2-71
5. సిత కర పల్లవంబులను పారస 'జాంబ.' 4-82

## ప్రాసలు :

జన వ్యవహారమున ప్రచారము శబ్దోచ్చారణ పద్ధతి ననుసరించి వేంకట నరసింహాచార్య కవి యతులను ప్రయోగించిన విధముగనే కొన్ని ప్రాసలను ప్రయోగించినాడు. అవి :

**1. అచ్చుతు :-** ఇది అచ్యుత శబ్దము. జన వ్యవహారమున 'అచ్చుత' యైనది. అచ్యుతలోని 'చ్యు' కారము ఉచ్చారణమున 'చ్చు' కారమైనది. చ, య లకు స్థానము తాలువు (ఇచు య శానాం-తాలు) ఏక స్థానములైన భిన్నాక్షరము లను సంయుక్తముగా ఉచ్చరించుట కంటె ఏక స్థానికములగు ఏకాక్షర సంయుక్తో చ్చారణ ('చ్యు' బదులు 'చ్చు') ఏర్పడి వర్ణ సమీకరణ మైనది.

వచ్చి ప్రభాస తీర్థమున......
యచ్చుతుఁ బిల్వఁ బంప...... తాలాంక...1-226

'రఘునాథ నాయకాభ్యుదయము'నందు 'అచ్చుత' ప్రయోగము లున్నవి.

'తెచ్చిన భూలోక దేవేంద్రుఁ డైన
అచ్చుత రఘునాథుఁ గట గటాక్షింప (30వ పుట)

46, 49, 65, 79 పుటలయందు ఈ విధము ప్రాస ఘటితము.

2. **సఫలత :**

ఇది - సఫలత; కవి - ప్రాస స్థానమున-
'అభిమత విభవోత్సవముల నాత్మల యందున్
సఫలత నొందఁగ సల్పుచు-' (జనక. 2-420)
అని యుంచెను. 'సఫలము' అని ఉచ్చారణ.

3. **లక్షము:-** 'లక్ష్యము' అనుటకు ఈ 'క్షణము'...'లక్షము' అని ప్రయోగింప బడినది.

4. **కాకుస్థ:-**

'కాకుత్స్థ' అను దానిని ఉచ్చారణ రీతిని బట్టి-
'కా, కుస్థ కులుండు మౌని జన కుంజరు...నీ
దుస్తర మైన...' అనినాడు (జనక. 2-321)
థ, త లకు (కుస్థ - దుస్త) స్వవర్గజ ప్రాసముగా భావింపవలెను.

5. **ఖ-ఘ ప్రాస:-**

'మఖ మీవు నిర్వహింపుము
మఘవాది సుపర్వ......' (జనక-1-285)
'మఖము'ను 'మఘము'గా పల్కుట వలన ఈ ప్రాస చెప్పబడినది.

## విశేష వృత్తములు :

పిరి గ్రంథములయందు ప్రయోగింప బడిన విశేష ఛందము లిట్లున్నవి:

1. **ఉత్సాహ :-** దశరథ - 5-309, శ్రీకృష్ణ శతా - 4వ ఆ, క్షత్ర - 3-44, జనక - 2-63, 3-604, నృకం - 3-15, 4-23, 62, శల్య - 1-183, 278, 2-127, విష్వ - 2-88, మాలతి - 2-86, 3-80.
2. **కమల విలసితము :-** శల్య - 3-263.
3. **తలహంస :-** జనక - 4-494.
4. **కవిరాజ విరాజితము :-** జనక. - 5-925, నృకం - 1-340, శ్రీకృష్ణ శతా. - 1వ ఆశ్వా, తాలాంక - 4-351.
5. **తరలః-** దశరథ. - 1-19, సీతా. - 1-117, 3-118, శ్రీకృష్ణ శతా - 1వ ఆశ్వా, జాంబ. - 3-49.

6. **తురంగ ఖురపుట :** ('కవిరాజ విరాజిత' లక్షణము దీనికి సరిపడును) విష్వ - 1-207.
7. **తోటక :** క్షత్ర - 1-275.
8. **దండకము :** విష్వ - 8-125, చిలువ - 1వ ఆశ్వా.
9. **పంచ చామరము:** జనక 2-84,189, 452, 5-40, శల్య 8-317, 856, జాంబ 2-47, 8-48, 128 156, క్షత్ర 3-150, 848, తాలాంక 1-292, మాలతీ 2-85.
10. **బంధుర :** శల్య 1-212.
11. **భుజంగ ప్రయాత :** శల్య 8-337, జాంబ-152, తాలాంక 1-828, 6-289.
12. **మంజు భాషిణి :** చిలువ - 1వ ఆశ్వా.
13. **మణి గణ నికర :** జాంబ. 4-157, జనక 2-519.
14. **మత్త కోకిల :** జనక 2-79, క్షత్ర 2-228, 3-26, 149, శ్రీకృష్ణ శతా-మొత్తము 4, శ్రీరామా 1-172, 8-546, నృకం 2-81, 8-114, 115, 242, 4-210, శల్య 1-168, 169, 278, 2-108, 105, 114, 3-41, 96, సీలో-1-19.
15. **మదన దర్పణ :** శ్రీకృష్ణ-1వ ఆశ్వా.
16. **మహాస్రగ్ధర :** జనక 4-480, శల్య 8-66, శ్రీకృష్ణ శతా-1వ ఆశ్వా, తాలాంక 1-256.
17. **మానిని :** శ్రీకృష్ణ శతా-1వ ఆశ్వా, జాంబ 1-301
18. **మాలిని :** దశ 5-810, సీతా 2-97, క్షత్ర 2-296, జనక 1-340, 8-604, శ్రీరామా 1-562, నృకం 2-199, 4-232, శల్య 8-387, గోదా 8-142, చిలువ 1వ ఆశ్వా, జాంబ 1-305, తాలాంక 8-176, 5-381, భల్లాతక 1-48, 2-47, 8-40, 5-52, సత్యశాంయి 5-210.
19. **రగడ :** శల్య 1-225, 2-27, చిలువ 1వ ఆ; తాలాంక 8-56.
20. **లయగ్రాహి :** జనక 2-146, శల్య 2-86, 8-164, 170, 274, శ్రీకృష్ణ 1వ ఆ, జాంబ 2-192. 3, 122.
21. **లయ విభాతి :-** శల్య 1-215, చిలువ-1వ ఆశ్వా, జాంబ 4 144
22. **లలిత పద :** భల్లాతక 4-51.

23. **వన మయూర** :- కల్వ 3-340, చిత్ర 3-323,352,390, మాలతీ 2-98
24. **వసంత తిలక** :- జాంబ 2-326.
25. **విద్యున్మాల**:- కల్వ 3-270, మాలతీ 1-154, సత్యశాయి 5-275
26. **సుగంధి** :- గోదా 1-174, శ్రీకృష్ణ శతా 1వ ఆశ్వా.
27. **స్రగ్ధర** :- వృకం 4-216, బిలువ 1వ అ,జాంబ 1-247,2-46
28. **స్రగ్విణి** :- దశ 4.173, కల్వ 3-260, నీలా 1-82
29. **శ్రీరమా** :-గోదా 2-186.
30. **మంగళమహాశ్రీ** :- నీలా 4-450

## చిత్రకవిత :

వీరి రచనల యందు గల చిత్ర బంధ కవితా విశేష పద్యము లిట్లున్నవి :

1. **కంద గీత గర్భ సీసము** :- జనక III-90
2. **నిరోష్ఠ్య కందము** : జనక V-61
3. **నిరోష్ఠ్య గీతము** :- శ్రీరామా III-602
4. **నిరోష్ఠ్య చంపకము** :- తాలాంక I-322
5 **మత్తేభ కందగర్భ సీసము** .- జనక III 326
6. **సర్వలఘు కందము** :- జనక III-529
6. **సోష్ఠ్యత్ర్యక్షర కందము** :- తాలాంక IV-352
7. **సోష్ఠ్య నిరోష్ఠ్య చంపకము** :- తాలాంక III-175
8. **కమల గుచ్ఛ బంధము** :- సీతా I-117, కల్వ II-234
9. **ఖడ్గ బంధము** :- దశ V-309, కల్వ I-278, తాలాంక I-322
10. **నాగ బంధము** :- దశ V-308, తాలాంక II-293
11. **పతాక బంధము** :- తాలాంక I-321
12. **సుమ గుళుచ్ఛ బంధము** :- తాలాంక V-330

## తెనుఁగు ఘుఁటుఁగులు :

సింగరాచార్యుల శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము తరువాత ఈ వంశ కవులలో సోదరులైన వేంకట నరసింహాచార్యుల **'చిలువపడగ జేని చరిత్ర'** అచ్చాంధ్ర కావ్యముగా రచింప బడినది. దీనియందు కొన్ని ప్రసిద్ధ పదములు,

నామములు అచ్చ తెనుగునకు మార్చబడినవి. ఇట్టి వానినే - అప్పకవి 'తెనుఁగు మఱుఁగు' అనెను.*6

'చిలువ పడగ జేని చరిత్ర' లోని కొన్ని పదము లిట్లున్నవి :

1. జరాసంధుఁడు - గట్ల పీటి దొర
2. తాఁబేలు - తల పొట్టలో గల తనువు
3. తార - తమ్ముల గొంగని తగులు ముదిత
4. తేజోవతీ పురము - అన్నింటి తిండికాని లావు (అన్నింటి తిండి కాడు - అగ్ని)
5. దంతి పురము - కొమ్ము మొకము పేరొటపు వీడు
6. దుర్యోధనుఁడు - ఏసవాయి పడగి జేడు, చిల్వ సిడెము జేడు
7 నిర్వృతి వీడు - నల్ల త్రాగు మూఁక దొర గీము
8. పురోహితుఁడు - పురోతుఁడు
9. మద్రరాజు - పవల జా నెలల తల్లి తోడు
10. లక్ష్మణుఁడు - దారి దిట్ట కడ చానకు కల్గిన జేని పేరు
11. బ్రహ్మాండము - నలువ పేరిటి గ్రుడ్డు
12. శివుఁడు - ముక్కనువాడు (మూఁడు కన్నుల వాడు)
13. వామనుఁడు - మొదటి వేల్పయగారి మొదటి కిన్న పిఱుంచిన వాఁడు
14. విదురుఁడు - వెన్నుని బత్తుడు
15. శోణనది - రగత యేఱు
16. సంయమినీ నగరము - పగలు చదలూరు మొవలు వెల్పుగన్న కుఱ్ఱని వీడు
17. సూకరము - గొంతు తియుఁగని మొకము
18. సూర్యుడు - ఏడు మావుల తేరెక్కు ఎమ్మెకాడు
19. సింహతలాటపు మొలత్రాడు - గొరగొంగ మొలకట్టు

## సంప్రదాయ పరిభాష :

శ్రీవైష్ణవ కుటుంబములోని వ్యక్తులు, తత్సంప్రదాయానువర్తులు, ఆచార్య పురుషులు, పరివ్రాజకాచార్యులైన మహోదయులు ఇట్టి పదముల నుపయోగించి సంభాషింతురు. వీనియందు ద్రావిడ పదములే గాక, సంస్కృత, ద్రవిడ మిశ్ర పదములు కొన్ని యుండును. '**శ్రీరామానుజాభ్యుదయము**'న ఇట్టి పదముల ప్రయోగ మధికముగా గలదు.

| | పదము | | అర్థము |
|---|---|---|---|
| 1. | **అకయోసము** | - | సామాను (శ్రీరామా. I-422, II-370) |
| 2. | **అడియేన్** | - | 'అయ్యా!' అని వినయ వాచకము. అడియేటి, 'అడియరి' అనియు కలదు. II. 29, 30. గోదా, I-119 |
| 3. | **ఉభయ వేదాంతులు** | - | సంస్కృత ద్రావిడోపనిషత్సారముల గ్రహించిన సంప్రదాయవర్తులగు ఆచార్యులు, I-88 |
| 4. | **ఉభయ విభూతులు** | - | లీలా విభూతి, నిత్య విభూతి. ఇదే ఏక పాద్విభూతి, త్రిపాద్విభూతి, వ్యక్తావ్యక్త స్వరూపములు, I-154 |
| 5. | **ఏకాంతులు** | - | సంసార విరక్తులైన విష్ణుభక్తులు, I-25 |
| 6. | **చైత్తి** | - | గోష్ఠి సమయమున భాగవతోత్తములు వరుసగా కూర్చొనుట, II-248 |
| 7. | **స్థాన చతుర్థి** | - | పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చలలో చివరిది I-95 |
| 8. | **తళిహ** | - | విస్తరి I-319, II 18.24.226. 'వంట' యను అర్థమున కూడ కలదు. |
| 9. | **తిరుచూర్ణము** | - | శ్రీ వైష్ణవులు నుదుట ధరించు ఎరుపు లేదా పసుపుపచ్చ తిరునామము (బొట్టు) I-556 |

10. **తిరునామము** - ఊర్ధ్వపుండ్రము (సాహిత్య ప్రక్రియయైన 'తిరునామము' వేరుగా గలదు) II-110, 226 'సీలాపతి'-102, ఇదే 'తిరుమణికాప్పు' అనబడును.

11. **తిరుమంత్ర, ద్వయ, చరమమంత్రములు** - వీనినే రహస్య త్రయ మందురు I-173

12. **తిరుమామణి మండపము** - పరమపదమున శ్రియఃపతి వసించు మండపము I-86

13. **తిరుముడి** - శిరస్సు I-484, II-24

14. **తిరువడిఘళ్** - పాదములు II-24 ('తిరువడి తామరలు' అనియు)

15 **తిరువంటపడి** - వంట ఇల్లు II-228

16. **తిరువధ్యయనము** - దివ్య ప్రబంధాధ్యయనము (ఈ పదము సంవత్సర శ్రాద్ధమునకు రూఢియైనది)

17. **తిరుమాళిగ** - ఇల్లు II-15 22

18. **తిరువారాధన** - భగవదారాధన II-22 (తిరు - ఆరాధన)

19. **తిరువళిఖ** - దీపము III-106, 'తిరుకళిక' రూపాంతరము

20. **తిరువుళ్ళము** - పూజ్యమైన మనస్సు II-11, II-60 (తిరు + ఉల్లము)

21. **శీర్థ పాదములు** - తీర్థ ప్రసాదములు, గోదా II-181

22. **తిరుపరిపట్టము** - దివ్య దేశాగతులు మహోదయులు సద్వైష్ణవులు భగవత్సన్నిధానమునకు విచ్చేసినప్పుడు వారికి తిరుపరిపట్టము(శిరోవేష్టనము) కట్టి, మాలికా సమర్పణ చేసి, శఠకోపము సమర్పించి తోడ్తెత్తురు II-110

23. **తొహి** - ఊరిన పచ్చడి II-227

24. **నిత్యసూరులు** - అనంత, గరుడ, విష్వక్సేనాదులు I-13 II-81

25. **పేరరుళాళస్వామి** - కరిగిరి వరదుడు, కంచి వరద రాజ స్వామి II-44
26. **పెరుమాళ్ళు** - భగవంతుడు, గోదా II-155.
27. **పిరాట్టి** - శ్రీదేవి (లక్ష్మి) I-96.
28. **పంచ సంస్కారములు** - తాపము, పుండ్రము, నామము, మంత్రము, యాగము.
29. **పడి** - దేవాలయమున భాగవతోత్తముల కిచ్చు ప్రసాదము II-18.
30. **పరిమార్చన** - వడ్డించుట II-245.
31. **మంగళాశాసనము** - దేవాలయమున స్వామివారి కొసంగు నీరాజనము - 'ఆశీర్వచనము' అని కూడ అందురు. I-234.
32. **సాయించు** - అజ్ఞాపించు III-619, 'ప్రసాదించు' ఇట్లయినదే!
33. **సాపాటు** - భోజనము I-208, II-272.
34. **సాదము** - అన్నము I-243, 247.
35. **సమాశ్రయణము** - ఆచార్యులవారు రెండు భుజములంపై శంఖ చక్రముల తాప ధారణ మొనర్చుట.

వీనియందు భగవత్పరములు - సంప్రదాయ పరములు - భోజనపరములైన పదములు కలవు. శ్రీవైష్ణవ కవులు, తదభిమాన కవులు తమ రచనల యందిట్టి పదముల నుపయోగించిరి.

## సంస్కృత పదములు :

వేంకట నరసింహాచార్యుల (ద్వితీయ) రచనల యందు సంస్కృత, సంస్కృతాంధ్ర మిశ్ర పదముల నిత్య వ్యవహార పద్ధతి ననుసరించి వాడబడినవి. **'తాలాంక నందినీ పరిణయమున'** ఇట్టివి స్వల్పము. వీని ప్రయోగ విషయమున సాధు త్వాసాధుత్వములను, వ్యాకరణ రీతులను పరిగణింపక, జన శ్రుతికే వీరు ప్రాముఖ్యము నిచ్చిరి.

మన తెలుగు శాసనములందును, ఇతరుల రచనలయందును ఈ విధమైన ప్రయోగము లున్నట్లు భాషా తత్త్వ పరిశోధకులు[7], వ్యావహారిక భాషా పరిశీలకులు*[8] పేర్కొనినారు.

వివిధ రచనలయందు వీరి పద ప్రయోగము లిట్లున్నవి :

| | | | |
|---|---|---|---|
| 1. | అరుష పౌరుష | - | ఆర్షేయ, పౌరుషేయములు 'నృకం... III-178 |
| 2. | అరుషేయ (ము) | - | ఆర్షేయ - జాంబ ...IV 75, 'శ్రీకృష్ణ...' |
| 3. | ఉరివి | - | ఉర్వి 'నృకం...I-51 |
| 4. | ఉరువర | - | ఉర్వర 'గోదా...I-128, 'విష్ణు...I-18 |
| 5. | ఉర్వీసుర యనుమతి | - | ఉర్వీసురానుమతి, జాంబ...I-15 |
| 6. | ఎతీంద్రు(డు) | - | యతీంద్రుడు 'కల్హ...' - III-369 |
| 7. | ఏకదశ | - | ఏకాదశ, 'జనక...'-I-391 |
| 8. | కర్తారుడు | - | 'దైవము' అను అర్థమున - శ్రీరామా III - 378, కల్హ-II-8,44, III-119, 228, 248 ('క్రీడాభిరామము' 149, విప్రనారాయణ చరిత్ర 3 - 50, యయాతి చరిత్ర 1 - 16 లలో ఈ పదము 'ముస్లిం దేవత' అను అర్థమున కలదు) |
| 9. | కుథ, కుథరులు | - | 'కుథరము' (లు) అనుటకు, 'విష్ణు' II-11, కల్హ-II-218 |
| 10. | కౌపినము | - | కౌపీనము. 'శ్రీరామా...'-III-110 |
| 11. | గరు | - | గరుత్ (రెక్క) 'నృకం...'-I-295 |
| 12. | గర్భగారము | - | గర్భాగారము 'విష్ణు...' I-46. 177 |
| 13. | చంద్రపుష్కరి | - | చంద్ర పుష్కరిణి 'గోదా...' - III-74 |
| 14. | చతురయుగ(ము) | - | చతుర్యుగ'జాంబ...'-II-259' 'క్షత్ర...'-I-53 |
| 15. | చతురసాగర | - | చతుస్సాగర 'జాంబ...' - II-187 |
| 16. | చతురవిధ | | చతుర్విధ 'నృకం...' - I-90 |

| | | | |
|---|---|---|---|
| 17. | చతుర్దశభువన | - | చతుర్దశ భువనములు 'నృకం...'-II-175 |
| 18. | జన్క | - | జనక 'జనక...' I-295, II-88, 229, 318 V-330 జాంబ I-303 |
| 19. | జల్క(ము) | - | జలక 'శల్య...'-III 316, తాలాంక II-204, V-3. |
| 20. | తండోపతండ | - | గుంపులు గుంపులు 'తాలాంక...' V-200, VI-30 |
| 21. | తపదాన | - | తపోదాన 'నృకం...' II-122 |
| 22. | తపవహ్ని | - | తపోవహ్ని 'విష్వ...' I-99 |
| 23. | తరలు | - | తరంగములు జాంబ...' I-129 ('తరలు' కావచ్చును) |
| 24. | తామ్ర ఖండములు | . | రాగి పైసలు 'చాటువు...' |
| 25. | తిల్క(ము) | - | తిలకము 'శల్య' III-316, 'జనక' IV-258 |
| 26. | దశనవ | - | ఏకోనవింశతి, పందొమ్మిది 'గోదా...' I-30 |
| 27. | దానవత్తుములము | - | దానవ తుములము 'జనక...' I-209 |
| 28. | దిగీభ | - | దిగిభ 'తాలాంక...' V-181 |
| 29. | దివ్వవతార | - | దివ్యావతార 'శ్రీరామా...' I-69 |
| 30. | ద్వయిత వనము | - | ద్వైత వనము 'తాలాంక...' IV-158 |
| 31. | ద్విరేఫ | - | ద్విరేఫ 'కేశవ...' 71 |
| 32. | ధనుటంకార | - | ధనుష్టంకార 'జనక...' V-197 |
| 33. | ధన్వు | - | ధనువు 'శల్య' II-184,'విష్వ' III-28,52 |
| 34. | నభచరు | - | నభశ్చరు 'శ్రీకృష్ణ శతా...' 2వ ఆశ్వా. |
| 35. | నమూచి | - | నముచి 'జనక...' III-561 |
| 36. | నవత్సును | - | నవసుకు 'జాంబ...' I-257 |
| 37. | పంచ నవాబ్దములు (9+5) | - | చతుర్దశాబ్దములు 'జనక...' III-169 |
| 38. | పాండురద్వసన | - | పాండురవసన 'శల్య...' II-62 |
| 39. | పులహస్త్య | - | పులస్త్య 'శ్రీకృష్ణ...' |
| 40 | ప్రహాదవ | - | ప్రహ్లాద 'నృకం...' II-95, 103, 118, 124, 149 |

| | | | |
|---|---|---|---|
| 41. | పాయము | - | ప్రాయము (వయస్సు) 'జనక...' I-200 |
| 42. | ప్రోడాశనము | - | పురోడాశము 'జాంబ' III-7 |
| 43. | ఫలహారము | - | ఫలాహారము 'శ్రీకృష్ణ...'లోను, కంకంటి ఉత్తరరామాయణము IV-198లోను కలదు. |
| 44. | బావ గ్రసూను | - | బావ అగ్రసూనుడు 'జనక'... I-253 |
| 45. | భద్రము | - | భద్ర గజము 'శల్య...' II-119 |
| 46. | భవిష్యతి | - | భవిష్యత్ 'బాలాంక...' V-239 |
| 47. | భుజదోర్బల | - | ఈ పదము పునరుక్తి యైనది. 'జాంబ...' IV-69 |
| 48. | మందరధ్వని | - | మంద్రధ్వని 'విష్వ...' I-182 |
| 49. | మంగళార్తి | - | మంగళారాత్రిక, మంగళ హారతి 'కేశవ...' 51 (గంగాపురీ మహాత్మ్యమున 'మంగళార్తి' కలదు II-255) |
| 50. | మరుసుత | - | మరుత్సుత 'జనక...' V-514 |
| 51. | మాత్య | - | అమాత్య 'శల్య...' III-85, 'గోదా...' II-53 |
| 52. | మిథున విడెము | - | మిథున తాంబూలము 'నృకం...' IV-227 |
| 53. | మిన్నతి | - | గొప్ప (మిన్న + అతి) 'శ్రీరామా...' I-70, II-370 |
| 54. | యోషితతి | - | యోషాతతి-యోషిత్తతి 'సీతాపతీ...' 98 |
| 55. | లేలిహానము | - | లేలిహానము 'నృకం...' I-298 |
| 56. | వక్షఖండను | - | వక్షఃఖండను, 'శ్రీకృష్ణ...' |
| 57. | వధువరులు | - | వధూవరులు 'క్షత్ర...' III-342, 'నృకం... IV-204, 'విష్వ...', I-34, II-122, III-184, 186 |
| 58. | వరటికయాన | - | వరాటికా యాన (వరటికాయాన) 'శ్రీరామ...' III-350 |
| 59. | వరవధు | - | వధూవర 'జనక...' II-428, విష్వ...' III-271 |

| | | | |
|---|---|---|---|
| 60. | వరూఢి | - | వరూథినీ (సేన) 'నృకం...' I-287 |
| 61. | పంకరి అష్టకోట్లు (20+8=28) | - | 28 కోట్లు 'జనక...' V-158 |
| 62. | విశిష్టద్వైత | - | విశిష్టాద్వైత 'శ్రీరామా...' III-75 |
| 63. | వినవిత్తు | - | వినవు విత్తు 'తాలాంక...' III-125 |
| 64. | వైతాళికుల్ | - | వైతాళికులు 'తాలాంక...' IV-8 |
| 65. | వైశంపాయ | - | వైశంపాయన 'శ్రీకృష్ణ...' |
| 66. | వ్యంగ్యము | - | వ్యంగ్యము 'నృకం...' I-124 |
| 67. | శంపలత | - | శంపాలత 'నృకం...' II-141 |
| 68. | శర ధనువులు | - | ధను శ్శరములు 'జనక...' V-424 |
| 69. | శిర ఖండన | - | శిరః ఖండన 'గోదా...' II-184, 186 |
| 70. | శిరఖడ్గ | - | శిరఃఖడ్గ 'సీతాపతీ...' 78వ పద్యము |
| 71. | శిబిక | - | శిబిక 'కల్యా...' III-85 |
| 72. | సాగమనము | - | సహగమనము 'జనక...' V-711 |
| 73. | సిరిహృదయ | - | శ్రీహృదయ 'శ్రీరామా...' I-59 |
| 74. | సుల్లభ(ము) | - | సులభము 'శ్రీరామా..' I-121, 'తాలాంక...' IV-12 |
| 75. | సువ్వార్చం | - | సువర్చల 'విష్ణు...' III-250 |
| 76. | హిందువులు | - | హిందువులు 'కల్యా...' II-93 |
| 77. | హృద్యము | - | హృదయము 'కల్యా...' III-17, 'నృకం.' I-177, 211, III-118, IV-87, 220 |

## మాండలికములు :

తెలంగాణ ప్రాంతమున, అందున మహబూబ్‌నగర్, నల్లగొండ జిల్లాల యందు ప్రచారమున గల మాండలికములు జన వ్యవహారమున పలుకబడు పదములు ఈ శీర్షికయందు గలవు. వీనిలోని కొన్ని పదములు డా॥ రవ్వ శ్రీహరి గారి 'నల్లగొండ మాండలిక పదకోశము'న నున్నవి. (వ్యవహారిక పదములకు 'వ్య.' అని గుర్తు)

1. అగడు - అత్యాశ, తొందర 'శ్రీకృష్ణ...'
2. అబ్బరీకము - ఆశ్చర్యము (అబ్రము,అబ్బరము) 'విష్వ...' III-202
3. అమాస (వ్య.) - అమావాస్య, 'జనక...' IV-276
4. ఆడాడ (అడ-అడ) - అక్కడక్కడ 'తాలాంక...' VI - 109
5. ఆలు - ఆవు (వాహనము అను అర్థమున ప్రయోగించెను) 'కేశవ...' 18 ప.
6. అస్త (వ్య.) - ఆసక్తి, ఆశ 'నృకం...' III-124, (అస్థ 'అస్త' యైనది)
7. ఈడకు (,,) - ఇక్కడకు (ఉత్తర హరివంశమున 4-115 గలదు) 'జనక...' V-371
8. ఉక్కబొట్టు - చిన్నపిల్లలకు పెట్టు ఉక్కుబొట్టు 'తాలాంక' I-124.
9. ఎల్లటి గుంటుక - చెల్కలపై వాడబడు వ్యవసాయ సాధనము 'క్షత్ర...' I-208
10. కామోలు (వ్య.) - కాబోలు 'తాలాంక...' IV-385
11. కుచ్చము - నాలుగు పైసలు(హాలీ రూపాయికి 32 పైసలు, 24 కుచ్చాలు) 'చాటువు...'
12. కుతి - ప్రేమ, ఆశ, కోరిక 'కేశవ...'35వ పద్యము
13. కుదువ (పెట్టు) - ధనముకై ఒక వస్తువును వ్యాపారివద్ద నుంచుట 'శ్రీకృష్ణ...' (పాండురంగ మాహాత్మ్యము, క్రీడాభిరామముల యందు కలదు)
14. కొట్టము - కోష్ఠము, పశువుల కట్టివేసే పాక 'విష్వ...' III-133, 134.
15. కోసంటోక - కోసుటోక, వంకరటోక 'తాలాంక ...' IV-34
16. గంతు గొట్టు (వ్య.) - మరణించు 'జనక...' V-362
17. గచ్చులు (కొట్టి) - గప్పాలు కొట్టి, దొంగిలించి, ('పనికిమాలిన' దను అర్థమున 'గచ్చు వంటి యిహ మింతే'- తాళ్ళపాక వారు) 'కేశవ...' 65 వ ప.

18. గోలెము - నీటి తొట్టి 'క్షత్ర...' II-72
19. చిట్టిన చీకట్లు - చిమ్మ చీకట్లు 'తాలాంక...' V-226
20. చూర్న (చూరున) - చూరు 'పెంకుటిల్లు' లాటాకు ఇల్లు కప్పు ముందు భాగము చివర 'చూరు' అనబడును. 'కేశవ...' 75వ ప.
21. చౌలు - చెవులు, జనక...' V-689 (సత్యభామా సాంత్వనము IV-5)
22. జోలి (వ్య.) - స్నేహము, విషయము; ముచ్చట 'శ్రీకృష్ణ..'
23. ఠ త్తటమని - తాళ తాళ మని, ఆగు మని, 'తాలాంక...' VI-202
24. తబుకు - చిన్న పళ్ళెము, 'జాంబ...' IV-62
25. తొలుర్బారు (వ్య.) - తొలి చూలు 'కల్ప...' III-27
26. దగ - బాధ, భయము
27. దబ్బున - తొందరగా 'శ్రీరామా...' III-526
28. దబ్బడి - తక్కువ వాడు 'విష్ణు...' III-83
29. దుందు - అల్లరి 'శ్రీరామ...' III-397
30. దుద్దు - మోసము 'శ్రీరామా...' I-228
31. దూట్కు (వ్య.) - దూదలు 'కేశవ...' 10వ ప.
32. దొంతులకుండలు - ఒకదానిపై యొకటి పేర్చిన కుండల వరుస 'తాలాంక...' II-74
33. ధామంతము (వ్య.) - అల్లరి 'క్షత్ర...' I-205
34. నిపు (వ్య.) - నిప్పు, 'గోదా...' II-66 (యామినీ పూర్ణ తిలకా విలాసము V-20), 'తాలాంక....' V-280, 308, VI-190
35. నేలబప్పు - నేలపై ఇసుక పోసి అక్షరముల దిద్దించుట 'విలావ...' I-అ
36. పట్టము (వ్య.) - పట్నము, పట్టణము 'జనక...' I-270
37. పుట్నింట (వ్య.) - పుట్టినింట 'తాలాంక...'III-156, IV-144

| | | | |
|---|---|---|---|
| 38. | పుల్లావు | - | పుల్ల ఆవు, తెల్లరంగు, గోధుమరంగు శరీరము గలగోవు 'శేశవ.' 51 వ ప ('పుల్లెద్దు' అందురు) |
| 39. | పుల్లెగండు | - | చెడ్డవాడు 'శేశవ...' 32వ ప. |
| 40. | పెద్దొర (వ్య.) | - | పెద్ద దొర 'చిలువ...' II-ఆ |
| 41. | బాంచ | - | బానిస 'జనక...'-IV-419 |
| 42. | బుగులు | - | భయము 'విశ్వ...' II-17 |
| 43. | బూర్గొమ్ము (వ్య.) | - | బూర, కొమ్ము, ఊదినప్పుడు బాగా ధ్వని వచ్చు సాధనము 'శేశవ...' 70వ ప. |
| 44. | బేడెము | - | తలుపు లోపలి భాగాన వేయు అర్గళము, 'జనక...' III-128 |
| 45. | మనసందు | - | మనస్సునందు 'సీతాపతీ...' 19వ ప. |
| 46. | మర్వున | - | మఱుగున 'తాలాంక...' VI-200 |
| 47. | మల్లె (వ్య.) | - | చేలకు వచ్చు వ్యాధి 'క్షత్ర...' II-130 |
| 48. | ముశ్చె (వ్య.) | - | మూట ('మూట ముశ్చె' అని వ్యవహారము) VI-126 |
| 49. | మునిమాపు (వ్య.) | - | సాయం వేళ 'జనక...' IV-154, రాత్రి వేళకు ముందు |
| 50. | మొదటిసంది | - | మొదటి నుండి 'శేశవ...', ఇట్లే 'నిన్నటి సంది', 'రేపటి సంది' |
| 51. | యావ | - | బాధ 'శ్రీరామా...' I-404, II-238 |
| 52. | రద్ది | - | అపవాదు 'తాలాంక...', V-250 లోను, 'చాటుపు' లోను కలదు. |
| 53. | రానికుండు | - | రానియమండు 'నృకం...' IV-70 |
| 54. | వక్కటి | - | ఒక్కటి 'విశ్వ...' II-107 |
| 55 | విచ్చలవీడి | - | విచ్చల విడి 'తాలాంక...' III-61 |
| 56. | పీర్లు | - | పిరులు 'శేశవ...' 70వ ప. |
| 57. | వొయ్యి | - | పుస్తకము 'చిలువ...', I ఆ, ఇదే 'వహి' 'బహి' యైనది. |
| 58. | వైసు (వ్య.) | - | వయస్సు 'తాలాంక...' IV-169, 'క్షత్ర..' II-82 |

| | | | |
|---|---|---|---|
| 59. | సంతకరము | - | సంతలో నిచ్చు కొంత అడ్వాన్స్ ధనము, సంతకరము, సంచకారి, బయానా 'శ్రీకృష్ణ...' |
| 60. | సవరగ (సవురుగ) | - | వయస్సులో అందముగా నున్న, 'షట్త్ర...' II-82, జనక...II-172 |
| 61. | సాదు | - | పెంచు 'శేశవ...' 18వ ప, 'షట్త్ర...' II-270 |
| 62. | సాపించు | - | శపించు 'జాంబ...' I-298 |
| 63. | సుద్ది | - | జోలి, విషయము 'శ్రీకృష్ణ...' |
| 64. | సోయి (సోది) | - | ధ్యాస, స్పృహ 'జనక...' IV-170 శ్రీరామా. III-51,416 |
| 65. | సోలుపు | - | వరుస 'సీతాపతీ' 66వ ప. |

## అన్య దేశ్యములు :

తెనుగు సాహిత్యముపై ఇతర భాషల ప్రభావము మిక్కుటముగా గలదు. వీనియందు ఉర్దూ, పారశీకముల ప్రభావము తెలంగాణ ప్రాంత రచనలయందు అధికముగా నున్నది. ఈ విషయముల గూర్చి పరిశోధనాత్మక గ్రంథములు వెలువడినవి.*9

సింగరాచార్యుల రచనలలో ఉర్దూ, పారశీక పదములు లేవు. ద్వితీయ వేంకట నరసింహాచార్యుల కృతులలో **'తుపాకి'**, **ఫౌజు**, **కందిల్**, **బురుజు**, **ఫిరంగి**, **సిపాయి**, **బూటి**, **కౌలు**, **సలామ్** వంటి పదములు చేరినవి. **'కాలాంక నందినీ పరిణయము'**, **'శేశవస్వామి శతకము'**ల యందు నాటి వ్యవహారమున ప్రచురముగా నున్న ఉర్దూ, పారశీక పదము లున్నవి. వీరియందు ఆధునికులైన కవులు ఉర్దూ పదముల నధికముగా వాడి తెలంగాణ ప్రాంతమున నిజాం పాలనలో ఆ భాషకు గల వ్యాప్తిని నిరూపించినారు (వేంకట నరసింహాచార్యులు - ఐదవ, రంగ కృష్ణమాచార్యులు). **చాటువుల** యందు **'కాలాంక...'**, **'శేశవ...'** యందు గల పదములు :

| | | | |
|---|---|---|---|
| 1. | కితాబు | - | పుస్తకము, బిరుదము, 'నిఖిలాగమము లెల్ల నీ కితాబు' - 'కేశవ...' 18 వ ప. |
| 2. | ఖుద్దు | - | స్వంతము - 'కరుణామయిక మంగళ చర్య నీ ఖుద్దు' కేశవ... 28. |
| 3. | ఖిల్లత్ | - | చెంపయినట్లు చేయు - 'గతి నే యిందు ఖిల్లతుల జేసి' - తాలాంక...II-208 |
| 4. | గరీబ్ | - | బీదవాడు 'భూమి లేడిక నన్ను బోల్గరీబు-' కేశవ... 13 |
| 5. | జాగీర్ | - | రాజు బహుమానముగా ఇచ్చే భూమి, లాభ-కారులకు జాగీరు లొసంగి' తాలాంక...' II-203 |
| 6. | జిద్దూఖోర్ | - | మొండి, కలహకంతి - 'జిద్దూఖోరయి పిన్న తల్లెపుడు నా చేటే నిరీక్షించు' చాటువు. |
| 7. | తనఖా (తన్ఖా) | - | జీతము, కట్టడి - 'గానంపు గమికి తన్ఖా-లొసంగి-' తాలాంక... II-208, 'జీతము' అను అర్థమున ప్రయోగము. |
| 8. | తమాస (ష) | - | ఆనందము 'నేనే మెఱుంగుదు నీ తమాష' కేశవ... 102. |
| 9. | దర్బార్ | - | కొలువు కూటము 'చేరుకున్నాద నీ దరుబారు గాంచి' 'కేశవ...' 59 |
| 10. | దసల్ (దసిలీ) పట్టు | - | ఒక రకం పట్టు ('టస్సర్' దసల్ కావచ్చు-'దేవతార్చన పెట్టి గట్టిన దసల్ పట్టు' చాటువు. ('దసిల్ నూలు' కళాపూర్ణోదయము 2-15) |
| 11. | దాబు (ట్) | - | ఆయుధము(?) 'సకల సురాసువుల్ పెకిలించు నీ దాబు' కేశవ-18 |
| 12. | దివాన్ | - | మంత్రి - 'దురిత రహితుండె నీవంటి దొర దివాంజీ' - 'కేశవ...' 88 |

13. నవా (బా) బు - రాజు - 'ఒరి జగత్ప్రియము లేల(గ నెవ్వడు నవాబు' - 'కేశవ...'13

14. మొ (ఖా) కాబిలా - సంప్రతింపు, సాక్ష్యాధారము, 'నల్లమూతికను మొఖా బిళ్ళ చేసి', 'తాలాంక...' II-208

15. మొహర్ - ముద్ర (stamp) '...లభించిన చక్రమునన్ మొహరొత్తి' తాలాంక V-18

16. లోట - చెంబు, 'నీ మది దయ నీట నిండు లోట- కేశవ...2

17. శాయి - సిరా (ink) 'కస్తురి సారపు నిగ్గు శాయి చే' తాలాంక V-18

18. ష (స) కలాద్ (త్) - ఉన్నితో చేయబడిన వస్త్రము 'షకలాదు నొకటి' - 'చాటువు'

19. సవ్వాశేరు - నాలుగు సవ్వాసేరులు ఒక తక్కెడు (కిలోలు రాక పూర్వము) 'శాంతి సవ్వా సేరు-' చాటువు

20 హుద్దాహుద్ది - పైపైకి వచ్చుట, 'హుద్దాహుద్ది సంప్రాశ రూపములం బోలగ' - 'తాలాంక...' II-154. 'హుద్దా హుద్ది బెనంగు' చాటువు.

21. హిబాబు (ప్) - అదృష్టము - 'తడముట్ట నిన్నెన్న గల్గె నాకు హిబాబు' కేశవ... 13

22. హిసాబ్ - లెక్క - 'ఎల్ల వేల్పుల పొల్పు నీకే హిసాబు' 'కేశవ...' 18

ఈ రీతిగ మరింగంటి కవుల రచనలలో ఛందస్సు, పద ప్రయోగము లెన్నియో భాషా పరిశోధకులు పరిశీలింప దగినవి కలవు. వీని వలన జన వ్యవహారము నందు రూఢియై యున్న భాషకు, పదములకు వీరొసంగిన స్థానము తెలియును.

## సూచికలు :

1. 'తెలుగు భాషా చరిత్ర'లో 'కావ్య భాషా పరిణామము' (1600-1800)ను గూర్చి బి. రామరాజు గారి వ్యాసము, 238-267 పుటలు.
2. 'బాల కవి శరణ్యము', 'ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష'ల యందు వీని వివరణ గలదు.
3. 'తెలుగు భాషా చరిత్ర' 260 వ పుట.
4. 'ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష' 4వ, 5వ పుటలు.
5. 'తెలుగు ఛందో వికాసము' - 161 వ పుట.
6. 'అబ్ధిమేఖల కుదయించి నట్టి సీతఁ
   జేకొనియె రాఘవుం డని చెప్ప చోటఁ
   గడలి మొలనూలి చేడియ గనిన పడుచుఁ
   దెచ్చుకొనె రాముఁ డనఁగను దెనుఁగు మఱుఁగు' (1-112)
7. 'తెలుగు భాషా చరిత్ర'లో 'శాసన భాషా పరిణామము'ను గూర్చి ఎం. కందప్పశెట్టి వ్యాసము - 104-205 పుటలు.
8. 'బాలకవి శరణ్యము' 239-244 పుటలు.
9. చిలుకూరి వారి 'ఆంధ్ర భాషా చరిత్ర', దొణప్పగారి 'భాషా చారిత్రక వ్యాసావళి', గోపాలకృష్ణరావుగారి 'తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము'- అనునవి.

# VI

# తాత్త్విక దృక్పథము

మతింగంటి వారి విపుల రచనలయందు అధిక భాగము విశిష్టాద్వైత సంప్రదాయ ప్రధానములైనందున విశిష్టాద్వైతమును గూర్చి సంగ్రహ పరిచయము అవసరము.

అతి ప్రాచీనమైన విశిష్టాద్వైతము వేదసమ్మితము. దీనికి లక్ష్మీ ముఖ్యులు కావున 'శ్రీ సంప్రదాయ' మనియు భగవద్భక్తికన్న భాగవత భక్తియే ప్రథమాచరణీయమైనందున 'భాగవత సంప్రదాయ' మనియు, విష్ణుప్రోక్తమైనందున 'శ్రీవైష్ణవ' మనియు, శ్రీమద్రామానుజులు దీనికి ముఖ్యులగుటచే 'రామానుజీయమత' మనియు నామాంతరములు గలవు.

వ్యాస శిష్యుడైన బోధాయనుడు బ్రహ్మసూత్రములకు విశిష్టాద్వైత పరముగా విపులమైన వృత్తిని రచించెను. ప్రాచీనులైన గుహదేవ, భారురుచి, బ్రహ్మనంది, ద్రమిడాచార్యులు సంగ్రహ భాష్యముల రచించి తమ యభిప్రాయములను వెల్లడించిరి.

విశిష్టాద్వైతమునకు ముఖ్యులైన పన్నిద్దరాళ్వారులు తమ దివ్యానుభూతులను, భక్తి ప్రపత్తి జ్ఞాన వైరాగ్యములను తమిళ భాషయందు 'నాలాయిరమ్' (నాల్గువేల పాశురములు) పేరున గీతములుగా రచించిరి. ద్రావిడవేద మని ప్రసిద్ధి గాంచిన దీనికి శ్రీవైష్ణవులు వేదసమాన ప్రతిపత్తిని కలిగించి గౌరవించిరి. సంస్కృతమందలి వేదాంతము, ఈ ద్రావిడ వేదాంతము బాగుగా తెలిసిన వారిని శ్రీవైష్ణవమున ఉభయ వేదాంతాచార్యు లనుట పరిపాటి.

ఆళ్వారుల తరువాత వరాంయశ, గాథ, యామునులు తమ రచనల ద్వారా 'శ్రీ సంప్రదాయము'ను పరివ్యాప్త మొనర్చినారు.

శంకరాచార్యులవారికి పూర్వము అద్వైత సిద్ధాంత మున్నను శంకరులకే అద్వైత మతస్థాపకు లను ఖ్యాతి కలిగినట్లు రామానుజుల వారికి ముందు విశిష్టాద్వైతమున్నను వీరికే ఏతన్మత స్థాపకులుగా ప్రఖ్యాతి సిద్ధించినది.

మన భారతీయ సనాతన ధర్మములయందు '**ద్వైతము**', '**అద్వైతము**' '**విశిష్టాద్వైతము**' అను శాఖాత్రయము అతిముఖ్యమైనవి. వీనికి ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రములు ప్రమాణములు.

విశిష్టాద్వైతమున తత్త్వత్రయము అంగీకరింపబడినది. తత్త్వత్రయమనగా చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు. ఈశ్వరునకు చిదచిత్తులు శరీరప్రాయములు. అందువలన చిదచిత్తులు ఈశ్వరునకు పరతంత్రములు. 'అచిత్తు' అనగా ప్రకృతి; 'చిత్తు' అనగా జీవుడు. వీనికి అవినాభావ సంబంధము. విశిష్టాద్వైతమున ప్రకృతి గాని, జీవుడు గాని మిథ్యగాదు. కర్మాచరణ మొనర్చుచు జీవుడు తత్ఫలము ననుభవించును. అనుభవింప చేయువాడు ఈశ్వరుడు. 'ద్వా సుపర్ణా సయుజా...' అనునట్లు, ఈ జీవుడు మౌలికముగా ఈశ్వర ప్రాప్తి పొందవాంఛించును. తత్ప్రాప్తియే మోక్షము. దానిని సాధించుటకు కర్మ-జ్ఞాన-భక్తులు సాధనములు. వీని నెరిగి జీవితమునం దనుష్ఠించిన జీవికి మోక్షము లభించును.*[1] మోక్షము లభించుటకు భక్తి ప్రపత్తులే ముఖ్య మను విశిష్టాద్వైతమున నారాయణుడే ఈశ్వరుడు. అతడే శ్రీమన్నారాయణుడు. నారములకు (చిదచిత్తులకు) ఆశ్రయమైన - లేదా వానితో కలిసియున్న శ్రీమన్నారాయణుడే పరబ్రహ్మము. పర-వ్యూహ-విభవ-అంతర్యామి-అర్చావతారములుగా శ్రీమన్నారాయణుని వ్యాప్తి గలదు. ఇంకను ఈ సంప్రదాయమున జీవాత్మలు బద్ధులు - ముముక్షువులు - ముక్తులు - నిత్యులు అని నాల్గు విధములు. మోక్షము - కైవల్యము, బ్రహ్మానంద మని ద్వివిధా ప్రోక్తము. మరణానంతరమే జీవునకు మోక్షము లభించును. ఇతడు అర్చిరాది మార్గముల ద్వారా పయనించి పరమపదము (శ్రీవైకుంఠము) నందు సాయుజ్య, సాలోక్య, సారూప్య మోక్షముల ననుభవించును. ఇది జ్ఞాన - భక్తి - ప్రపత్తుల ద్వారానే సాధ్యము. భక్తి ప్రపత్తులు కర్మజ్ఞాన సంయుతము లయినప్పుడే స్థిరములై ఫలప్రదము లగును. ప్రపత్తియందు జీవుడు ఏ విధమైన కర్తృత్వాహంకారమును పొందడు.

ప్రపన్నుడైన జీవుని ఆచార్యులు సంప్రదాయ పద్ధతిని పంచ సంస్కారములు (తాపము-పుండ్రము-నామము-మంత్రము-యాగము) ప్రసాదించి ముక్తి మార్గమున నడిపించును.

రహస్యత్రయమైన '**తిరుమంత్రము**', '**ద్వయము**', '**చరమ శ్లోకము**'ల తాత్పర్యమును నిత్యజీవితమున అనుభవములోనికి తెచ్చుకొనుట ద్వారా భక్తుడు ముక్తుడై కైవల్య మోక్షమునందుటకు యోగ్యుడగును.

శ్రీరామానుజాచార్యులవారు బ్రహ్మసూత్రములకు విశిష్టాద్వైత పరముగా రచించిన భాష్యమునకు '**శ్రీభాష్య**'మని ప్రసిద్ధి. ఇదిగాక వీరి '**గీతాభాష్యము**', '**వేదార్థ సంగ్రహము**', '**వేదాంత దీపము**', '**వేదాంత సారము**' '**గద్యత్రయము**' విశిష్టాద్వైతమునకు ప్రామాణిక గ్రంథములు. '**యతీంద్ర మత దీపిక**' వీనికి చక్కని వ్యాఖ్యానము. '**రహస్యత్రయము**', '**ఆరాయిరప్పడి**' (గురుపరంపరా ప్రభావము), '**వార్తామాల**' అను గ్రంథములు విశిష్టాద్వైత సంప్రదాయమును విశేషముగా వివరించినవి.

రామానుజీయ భక్తి మార్గమున వర్ణ వ్యవస్థలోని ఉచ్చనీచములు పరిగణింపబడవు. భక్తులయెడ వీరి పట్టింపు తగదని ప్రప్రథమముగా చాటినవారు ఆళ్వారులే. వీరియందు అనేక కులములవారు కలరు. విశిష్టాద్వైతము భక్తికే ప్రాముఖ్యమిచ్చిన దనుటకు ఆళ్వారులే పరమ సాక్ష్యము. సర్వ వర్ణములవారును ఒక్కటే! జ్ఞాన - భక్తి - వైరాగ్యములే ముఖ్యములు గాని వర్ణ దృష్టి గాదని శ్రీమద్రామానుజులు చాటి, దీని కాచరణలో ప్రప్రథమముగా తిరునారాయణపుర దేవాలయమున అంత్యజులకు ప్రవేశమును కల్పించినారు. తాము మిక్కిలి శ్రమించి గురు శుశ్రూషా ఫలముగ పొందిన పరమ రహస్యమగు '**తిరుమంత్రము**'నకూడ శ్రీరంగ విమానము పైనెక్కి భక్తజనుల కుపదేశించి, సర్వ వర్ణముల వారికి ఈశ్వర ప్రాప్తి సులభమని ప్రబోధించినారు.[2]

శ్రీమద్రామానుజులు తాత్త్వికమైన వేదాంత సిద్ధాంతమనుసరించి, ఆచరణలోని మతమునకు చక్కని సమన్వయమును సాధించి, విశిష్టాద్వైతమునకు ఎనలేని ప్రాశస్త్యమును సంపాదించిరి.

శ్రీరామానుజుల యనంతరము విశిష్టాద్వైతమున **'ప్రపత్తి'** విషయమై సైద్ధాంతికముగా కొన్ని తేడా లేర్పడి, శ్రీవైష్ణవము **'తెంగలై'**, **'వడగలై'** శాఖలుగ చీలినది. వీనియందు మొదటిదానికి పిళ్లై లోకాచార్యుల వారు, రెండవదానికి **వేదాంతదేశికుల వారు ముఖ్యులైనారు.** ఉభయపక్షముల వారును 'శ్రీ సంప్రదాయము'నకు చెందిన రామానుజీయులే!

"...రెండు వాదములకు హేతువు శ్రీమన్నారాయణుడే యుపాయోపేయ భూతుడన్న వాక్యము. ఉపాయమునకే ప్రాధాన్య మిచ్చుట ముక్తికి హేతువని భగవత్సహేతుక కృపా కటాక్షమును 'వడగలు' అంగీకరింతురు. ఉపేయమే ప్రధానము. అది నిర్హేతుక కటాక్షమని 'తెంగలులు' భావింతురు.*3"

వీరి సిద్ధాంత భేదమున ముఖ్యమైన విషయములు 18 గలవు. ఇవియే 'అష్టాదశ రహస్యములు'*4. తెంగళ్ వారికి భక్తి ప్రపత్తుల విషయమై భగవంతుడే స్వయముగా జీవుని అనుగ్రహించును లక్ష్మియే పురుషకార రూపిణి. దివ్య ప్రబంధములే గాక, పిళ్లైలోకాచార్యులవారి 'శ్రీవచన భూషణము' కూడ వీరికి ప్రమాణము. వడగళ్ వారు భక్తి ప్రపత్తులు మోక్ష సాధనము లందురు. భగవదనుగ్రహమే ముక్తికి హేతువు. లక్ష్మీనారాయణులు పుష్ప పరిమళము లట్టివారు. శ్రీదేవి కలిసిన శ్రీమన్నారాయణ తత్త్వమే ఉపాస్యము. వేదోపనిషత్తులు, దివ్య ప్రబంధములు, వేదాంత దేశికుల వారి రచనలు వీరికి ప్రమాణము.

'నారాయణ ఏవ అఖిల జగత్కారణత్వం సర్వవిద్యావేద్యశ్చ'-అనునదే ఉభయులకును ముఖ్య తాత్పర్యము (యతీంద్ర మత దీపిక 10 అవ...).

ఇట్టి విశిష్టాద్వైత సంప్రదాయ విషయములను తమ కృతుల యందు మఱింగంటి కవు లెట్లు ప్రవచించిరో తెలుపబడును.

మఱింగంటి వారు తెంగలై శాఖకు చెందిన శ్రీ వైష్ణవులు. భక్తియే పవిత్ర జీవముగా గల వీరు మత ప్రచారకులుగను, కవులు, పండితులుగను మనకు దర్శన మిత్తురు. కావ్య, మత కళలను సమన్వయపరచి అనుభవమునకు తెచ్చు సంప్రదాయము వీరిది.

వీరి గ్రంథములయందు కొన్నిట సందర్భానుసారముగ విశిష్టాద్వైత విషయములు తెల్పబడినవి. మరికొన్ని విశిష్టాద్వైత సంప్రదాయ ప్రధానములుగ నున్నవి. కథా విషయములందు నూత్నకల్పనము లొనర్చి వినూత్న పద్ధతు లవలంబించి సంస్కృత, ద్రావిడ 'సంప్రదాయ రచనల' ప్రభావమును తమ రచనల యందు వీరు ఆకళింపు చేసికొనిరి.

విశిష్టాద్వైత సంప్రదాయాభిముఖముగా మణింగంటి కవుల రచన లిట్లున్నవి.

లభించినంత వరకు వీరి సాహిత్యమున **'శ్రీ రంగనాథ విలాసము'** ప్రాచీనమైనది. పేరునుబట్టియే యిది శ్రీరంగక్షేత్ర మహిమాభివర్ణనము ప్రధాన ముగ నున్న రచనయని గుర్తింపవచ్చును.

శ్రీ వైష్ణవులకు పరమ ప్రాప్యములైన క్షేత్ర త్రయములో శ్రీ రంగ నాయక స్థానమైన శ్రీ రంగము సిద్ధక్షేత్రము. నిత్యవిభూతిగా సంభావితము. ఇచటనే శ్రీరామానుజ, వేదాంత దేశికాద్యాచార్యుల పవిత్ర జీవితములు గడచినవి. రామానుజులవారు శ్రీరంగనాయకస్వామి వారి అనంత కల్యాణ గుణగణ వర్ణన చేయుచు **'శ్రీరంగగద్య'**ను చెప్పిరి. ఇట్టి విశేషములు గమనించిన జగ న్నాథాచార్యులు శ్రీరంగనాయక వైభవ వర్ణన మొనర్చుచు ఈ ప్రబంధమును చెప్పి, పంచవిధ ఈశ్వరతత్త్వములైన పర - వ్యూహ - విభవ - అంతర్యామి- అర్చావతారములను నియుడు, సాక్షాన్నారాయణుడైన శ్రీరంగనాయకస్వామి మహిమల వెల్లడించెను. దీనివలన భూలోక వైకుంఠమైన శ్రీరంగక్షేత్రమును గూర్చి లదభిమానులు తెలిసికొన వీలు కలిగినది. శ్రీరంగనాయక దర్శనము, శ్రీరంగక్షేత్ర మహిమాకర్ణనములు శ్రీవైష్ణవులకు ముఖ్యము. వీని యన్నిటికి ప్రతీకగా 'శ్రీరంగనాథ విలాసము' చెప్పబడినది

శ్రీవైష్ణవులు దీర్ఘశరణాగతిగ భావించు శ్రీమద్రామాయణమును తెనుగున చెప్పిన వారిలో సింగరాచార్యులు, వేంకట నరసింహాచార్యులు కలరు. **'దశరథ రాజ నందన చరిత్ర', 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము'**లు చిత్ర కవితా ప్రక్రియకు చెందిన రామకథా గ్రంథములు. ఈ విధమైన గ్రంథ రచనకు శ్రీరామ భక్తితోపాటు చిత్రకవితానురక్తియు హేతువైనది. ఇతను ఏ పద్ధతిలో చెప్పి

నను ప్రపత్తి వేదమైన శ్రీ రామాయణ విశిష్టతను వ్యక్తపరచుటయే కవియొక్క ముఖ్యోద్దేశము.

సింగరాచార్యుల రచనలలో **'తారక బ్రహ్మ రామ శతకము'** శతకమే యైనను, ఒక విధముగా నిది రామ కథా రహస్య సర్వస్వము. శ్రీరామచంద్రుని పరబ్రహ్మత్వ నిరూపణమే దీనిలోని ముఖ్య విషయము. శ్రీరామునియం దుండెడి లౌకిక భావనను తొలగించి, కేవల పరమేశ్వరత్వ ప్రతిష్ఠాపన కొరకై - అనేక పురాణములు, వేద వేదాంత విషయములు, వివిధ రామాయణములందలి వృత్తాంతములు ఈ శతకమున ప్రదర్శింప బడినవి.

వేంకట నరసింహాచార్యుల **'జనకసుతాభ్యుదయ'** ప్రబంధముపై తారక బ్రహ్మ రామ శతక ప్రభావ మధికముగా గలదు. కవి దీనియందు—

'అఖిల రామాయణార్థంబు లన్ని యేక
కృతిని యొనగూడు నట్లుగా'

రచించుచున్నా ననెను. 'జనక సుతాభ్యుదయ' కర్త దృష్టిలో శ్రీరాముడు సాక్షాద్విష్ణువు. మహామహిమోపేతుడు. అందుకే—

"మహిజకు రాఘవేంద్రులకు మానుష లీలలు చెందకుండనే
విహితములైన శాస్త్రముల వేమఱు జూచియు సమ్మతంబుగా..."

రాముని దివ్యత్వ నిరూపణకు, వైభవ ప్రకాశమునకు రామ కథను చెప్పుచున్నా ననెను. ఇందుకు తాను ఏ యే పురాణములను, ఎన్ని రామాయణములను పరిశీలించినది తెల్పి, "రాముని లీలా మానుష రూపము. అది శ్రీమన్నారాయణుని లీలా విభూతులలో నొకటి. సాక్షాన్నారాయణుడే ఇలపై కాలు మోపినాడు. దీనివలన దుష్ట శిక్షణమైనది. ఇది రామావతారము యొక్క ఉద్దేశ్య" మని వివరించెను.

శరణాగతి తత్త్వమునకు ముఖ్యమైన రామకథ యందు ప్రపన్న జనోద్ధరణమే ముఖ్య విషయము. దీనియందు ప్రతివ్యక్తియు భగవంతుని (శ్రీరామచంద్రుని) చేరి ప్రణమిల్లిన గాని తదుద్ధరణము జరుగ లేదు.

శ్రీమద్రామాయణమునందు చెప్పబడిన—

'సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే।
అభయం సర్వ భూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ॥'

అను ప్రపత్తిశ్లోకము **'శ్రీరామ చరమము'**గా వైష్ణవ సంప్రదాయమున ప్రసిద్ధము. అట్లే **'సీతా చరమ శ్లోకము'**గ—

'పాపానాం వా శుభానాం వా
వధార్హాణాం పరంతప।
కార్యం కరుణ మార్యేణ
న కశ్చి న్నాపరాధ్యతి॥'

అనునది ప్రసిద్ధము. గీతలో కృష్ణ చరమ శ్లోకము వలె శ్రీరామాయణమున నివి ప్రసిద్ధములు. శ్రీవైష్ణవులు వీనిని పరమ ప్రమాణములుగను, పవిత్రములుగను భావింతురు. జనకసు తాభ్యుదయ కర్త ఈ విధమైన రహస్యముల గమనించి, శ్రీరామ కథను చెప్పెను.

తెంగల, వడగల సంప్రదాయనుల వారు తమ సిద్ధాంతముల కనుగుణముగా శ్రీరామానుజుల జీవిత విశేషముల చిత్రించిరి. వేంకట నరసింహాచార్యులు శ్రీరామానుజుల జీవిత విశేషములను ప్రతిభా పాటవములను **'శ్రీరామానుజాభ్యుదయము'** నందు వివరించెను.

'శ్రీమహావిష్ణువు చరరూపిగా భాగవత రూపమున విచ్చేసి మన మొనరించు కైంకర్యములను పరిగ్రహించును కావున తదారాధనము (భగవదారాధన) కన్న తదీయారాధనమే (భాగవత సేవయే) ముఖ్యమైనది. ఎట్టి సందర్భములోను భాగవతాపచారము తగదు' అని శ్రీమద్రామానుజుల ద్వారా కవి విశేషముగా వివరించెను ఈ గ్రంథమందలి సుదీర్ఘ వచనములు కవిగారి విశిష్టాద్వైత ప్రవచనమున కుపకరించినవి. తాను చెప్పదలచిన సంప్రదాయ విషయముల నన్నిటిని శ్రీరామానుజ వాణిగా చెప్పించినాడు.

శ్రీవైష్ణవమున శ్రీరామానుజుల వారికి గల ప్రముఖ స్థానము వలెనే ఇది 'శ్రీరామానుజ చరిత' మైనది. వీరి ప్రభావ వర్ణనమే ఈ ప్రబంధము, ఈ కథను ముఖ్యముగా చేసికొని విశిష్టాద్వైత తత్త్వ ప్రవచనము నొనర్చుట ఆచార్యులవారి ముఖ్యోద్దేశము

**'విష్వక్సేన ప్రభాకరము'** ఒక అపూర్వ గ్రంథము. ఆచార్యుల వారు ఈ ప్రబంధమును శేష - శేషి సంబంధములకు ప్రతీకగా విరచించిరి. శ్రీమద్రామానుజులవారు "శేష శేషాశన గరుడ ప్రముఖ నానా విధానన్త పరిజన పరిచారికా పరిచరిత చరణ యుగళ!" అని శరణాగతి గద్యయందు తెల్పిరి. విష్వక్సేనులకు శేషాశను లని పేరు. స్వామి భుజింపగా మిగిలిన పదార్థమును భుజించువారు (శేష - అశనులు) అని. అందుకే ఆళవందార్ స్తోత్రమున 'త్వదీయ భుక్తోజ్ఝిత శేష భోజినా' అని వీరిని గూర్చి చెప్పబడినది. విష్వక్సేనులు శ్రీమహా విష్ణువునకు సేనాధిపతిగా నుండి సేవచేయుట ముఖ్య కార్యము. శేష-శేషి సబంంబంధమును కవి యిట్టి ప్రబంధము ద్వారా వివరించినాడు. దీనికి తోడు విష్వక్సేనుల శౌర్య పరాక్రమాదుల వివరించి విష్వక్సేనుల కల్యాణ గాథను చిత్రీకరించెను.

**'శ్రీరంగనాథ విలాసము'** తరువాత వచ్చిన మరియొక క్షేత్ర మాహాత్మ్య రచన **'చల్లపిళ్ళ రాయ చరిత్ర'**. కవి యీ కథను చెప్పుటలోని ప్రధాన కారణ మిట్లుండవచ్చును. 'శ్రీమన్నారాయణుని దృష్టియందు అందరును సమానులు. కుల మత జాతి విచక్షణముల కాస్కారము లేదు' అని తెల్పుటయే! ఇందు కుపబలముగా హిందూ దైవము ముస్లిం కన్యను పరిణయ మాడినట్లు చెప్పి మత భేదముల ఛేదించి, సమానత్వమును స్థాపించుటకే శ్రీవైష్ణవమున భక్తియే ముఖ్యముగాని జాతి భేదము గాదు అని నిరూపింపబడినది. చక్రాంకనము పొందిన ప్రతివారును విష్ణు భక్తులే యనుటకు—

'విప్రో వా యది వా క్షత్రో వైశ్యో శూద్ర స్తథైవ చ।
అన్యే సంకర జాతాశ్చ చక్రాంకా మమ వల్లభాః॥'

అను 'ప్రపన్నానుష్ఠాన భాస్కరము' నందలి భరద్వాజ్య ప్రమాణము గలదు అందుకే గ్రంథకర్త శ్రీరామానుజుల వారిచే ముస్లిం రాజునకు అతని బిడ్డయైన బీబి (నాంచారు)కి సమాశ్రయణ మొనరింప చేసి తత్త్వ ప్రవచన మొనర్చి, 'పంచసంస్కారముల మీరు బడసినారు - (8.85) కావున మా స్వామికి మీ కూతురునకు పరిణయము జరుపుట తగును'—

'అఖిల జీవ తతుల నణుమణు లేకను
కరుణతోడ బ్రోచు కర్త యొకఁడె
మనకె కాని వర్ణ మత ధర్మ కర్మముల్
దైవమందుఁ గలవె ?' (3-288)

అని యుపన్యసించి, టీటీనాంచారు కల్యాణ మొనరించిరి

నృసింహావతార ప్రత్యేకత కేవలముగా భక్త పాలనము. ఇతర అవతారములం దిది అనుషంగికముగా కనిపించును. భాగవత ధర్మమును వ్యాకరించుట నృసింహావతార లక్షణము. వీని నన్నిటిని ప్రమాణ పూర్వకముగా వివరించు కృతియే **'శ్రీనృకంఠీర వాభ్యుదయము'**.

కవి కృత్యాదియందు సాత్త్విక, తామస, రాజస పురాణముల తెల్పి, సాత్త్వికేతర పురాణములయందు శ్రీనృసింహ విషయము లెట్లు వక్రీకరింపబడినవో పేర్కొని, తాను 'శ్రీనృసింహ జయమున్ శాస్త్రోక్త మార్గంబుగా' (1-71) చెప్పుచున్నా ననెను.

'సిరి ధవుఁడె మోక్షదాతయు
సిరి ధవుఁడే యాది బ్రహ్మ సిద్ధాంతముగన్
పరు లెవ్వరు గా రంచును
సరసత శాసించె వ్యాస సంయమి కృతులన్' (1-94)

అని శ్రీమన్నారాయణ ప్రాధాన్యమును ప్రమాణీకరించి, శివుడు పరబ్రహ్మము కాదని—

'శరభాకృతి యగు రుద్రుని
సర మృగ రూపంబు దాల్చి నారాయణుఁడున్
సరి పెనఁగ బలము చాలక
పరిభవ పడి పోవువాఁడు పరబ్రహ్మగునే!' (1-97)

ఇట్లు తెల్పి శరభ రూప శివ పరాజయ విషయమై "భద్ర పురాణంబు కల్పితంబుగా నిట్లు చెప్పెను-", "త్రైత్రరీ యాగ్నేయ పద్మ గారుడ నారసింహ వామన సోత్తర కూర్మాది సప్త పురాణంబుల శాసింపం బడిన ప్రకారము",

శివునకు పరాభవమే ప్రాప్తించినది. 'నృసింహ విజయంబే అనేక అనేకపురాణం బులం గలిగియున్నది'- ఈ విధముగా శివ కేశవ విషయములను చిత్రించుట ప్రధానముగా తమ సంప్రదాయమునందు నిష్ఠ కలిగించుటకే యనవచ్చును.

కవి యీ కథను విష్ణుపారమ్య ప్రతిపాదన మొనర్చుటకు ప్రథమాధారము సాత్త్విక పురాణములు. లోకమున హీనజాతులు నిరసింప దగినవి కావు. అందరి వంటి వారే ఆటవికులు. భగవత్కృప వలన జీవు డుద్ధరింపబడును. ఇట్టు బహు విషయములు ఈ ప్రబంధము ద్వారా తెల్పబడినవి.

ఆళ్వారులయందు పెరియాళ్వారు శ్రీమహావిష్ణువునకు మామగా రైనందున మహాత్ముడు, ఇంతకన్న మహాత్మురాలు గోదాదేవి. తనకు తానై స్వామి సన్నిధి కరిగి దివ్య ప్రబంధమగు 'తిరుప్పావై' పాడి, వారిని ప్రబోధించి తన మనో రథమును పొందగలిగిన గోదాదేవి (ఆండాళ్) ఆళ్వారుల యందు విలక్షణురా లైనది.

'**శ్రీగోదా వధూటీ పరిణయము**' నందు కవి గోదాదేవి జననము నుండి ఆమెకు శ్రీరంగనాయక స్వామితో జరిగిన వివాహ గాథవరకు వర్ణించెను.

శ్రీవైష్ణవుల కుపాదేయ మైన ద్రావిడ వేదమునందు పవిత్రతమ మగు 'తిరుప్పావు' ప్రబంధానుసంధానమున ప్రసిద్ధి గాంచినది. దీని పఠన శ్రవణ ములు శ్రీవైష్ణవుల స్వాధ్యాయముగ చేరినవి. ఇట్టి 'తిరుప్పావు' చెప్పిన తల్లి కథను ప్రవచించుట 'గోదా వధూటీ పరిణయ' రచనోద్దేశ్యము.

వేదాంత దేశికుల వారు తమ 'భూస్తుతి' యందు—

"కాన్త స్తవైష కరుణా జలధి ప్రజానా
మాజ్ఞాతిలంఘన వశా దుపజాత రోషః।
అహ్నాయ విశ్వ జననిః క్షమయా భవత్యా
సర్వావగాహన సహా ముపయా త్యవస్థాన్॥"

అని గోదా స్వరూపమును తెల్పిరి. శ్రీరంగనాయకిని శరణ మనుచే ఆమె కథను చెప్పటలోని పరమార్థముగా 'గోదా వధూటీ పరిణయము' రచింపబడినది.

'**జాంబవతీ కుమార శృంగార విలాసము**' నందు సాంబుని కారణమున దుర్యోధనునకు గర్వభంగ మగును శ్రీకృష్ణుడు ఉభయ పక్షముల వారిని

కాంతింప చేయుట దీనిలోని ఒక ముఖ్య ఘట్టము. ఇచ్చట కవి శ్రీకృష్ణునిద్వారా విష్ణు ప్రాధాన్యమును నిరూపించెను.

**'శ్రీకృష్ణ శతానందీయము'** కేవలము శ్రీకృష్ణుని మాయా చేష్టల నిరూపించి ఆయన మాహాత్మ్యమును వెల్లడించు నట్టిది. 'సృష్టికర్త యైన విధాతయే కృష్ణుని (మాయా బ్రహ్మ) మాయలను తెలిసికొనలేక పోయినాడు. బ్రహ్మ జగన్నాటక సూత్రధారిని ప్రార్థించి బహు విధముల స్తోత్రము చేయగా యథా ప్రకారము శ్రీకృష్ణ డైనాడు. "ఇందు గల డందు లేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుఁడు" అని నిరూపించుట, శ్రీమన్నారాయణ తత్త్వము బ్రహ్మాదుల కతీత మని నిర్ణయించుట ఈ ప్రబంధోద్దేశ్యము.

**'క్షత్రబంధూపాఖ్యాన'** ప్రబంధ ప్రారంభమున విశిష్టాద్వైత విషయము లనేకము తెల్పబడినవి. క్షత్రబంధు డను జీవుడు అనేక పాప కర్మము లొనర్చి ఆచార్య కృప, తిరుమంత్ర ప్రభావము అను వానివలన ముముక్షు వైనాడు.

ఈ కథయందు పంచ సంస్కారములు, గురు - శిష్య పద్ధతులు, భగవద్భక్తి, భాగవత లక్షణము, ఆచార్య సేవ, ఉపాయ పంచకము, భక్తియందలి భేదములు మొదలగునవి తెల్పబడెను.

"న ఖలు భాగవతాః యమ విషయం గచ్ఛన్తి" అను దానికి ప్రత్యక్షోదాహరణము క్షత్రబంధుడు. భాగవతోత్తముల నాశ్రయించి ఉపదేశ మంది పవిత్ర జీవుడై నియమ పూర్వక జీవితమును గడిపిన వాడు శ్రీవిష్ణు పదము నందు నను విషయమును తెల్లము చేయుటకు క్షత్రబంధుడు చిత్రింప బడినాడు.

గురువునుండి 'మంత్రము'ను పొందుటకు భక్తుడు పడునట్టి ఆవేదనము క్షత్రబంధుని యందు మిక్కుటముగా కన్పించును. మంత్రోపదేశ మొనర్చుటకు ఎన్నియో నియమము లున్నవి. అనన్యార్హు లగు మహా పుణ్య పురుషులకు మాత్రమే దీని నుపదేశింపవలెను. 'సంవత్సరం తదర్థం వా మాస త్రయ మథాపి వా' శిష్యుని పరీక్షించి గాని ఆచార్య ద్వైవిధ్యమునం దొకడైన ఘటికత్వ పద్ధతిని*[5] మంత్ర ప్రదాన మొనర్పరాదని సంప్రదాయము. దీని ననుసరించియే వ్యాస శిష్యుడైన పుండరీకుడు క్షత్రబంధుని పరీక్షించి, "తిరుమంత్రమునుం

జరమూర్ధ సారమున్ అను లరుసింప రంగపతి సన్నిధియందుల' తెల్పెద నని నిశ్చయించుకొనెను. అప్పటికి శిష్యుడు "శరీర మర్థం ప్రాణం చ సద్గురు భ్యో నివేదయేత్"*6 అను విషయమును గమనించును.

ఇట్లు అనేక సంప్రదాయ విషయములను పుండరీకుని ద్వారా చెప్పించిన గ్రంథకర్త 'రహస్యత్రయము', 'గురు పరంపరా ప్రభావము','ముముక్షుప్పడి' మొదలైన సంప్రదాయ గ్రంథముల నుండియే గాక సాత్త్విక పురాణములగు భాగవతము, పాంచరాత్ర సంహితల నుండియు ప్రమాణముల నిచ్చి తాత్త్విక విషయముల నధికముగా తెల్పినాడు.

**'శ్రీకృష్ణ తులాభారము'** (ద్విపద) శ్రీమన్నారాయణుని యందు నిశ్చల మైన, నిరహంకారమైన భక్తి గలవా రెవరో తెలియుటకు నారద మహర్షికి లభించిన ఒక చక్కని సందర్భము. దీనియందు రుక్మిణీదేవి భక్తి ప్రపత్తుల నిరూపింపబడి, సపత్నీ మాత్సర్యము గల సత్యకు గర్వభంగము సంప్రాప్తించి నది. నారదుని ప్రయత్నము, శ్రీ మహా విష్ణు ప్రభావము దీనికి ముఖ్య కారణ ములు. రుక్మిణిని సత్యభామ సామాన్యురాలిగా భావించినది. అంతే కాని—

> 'రాఘవత్వే భవే త్సీతా రుక్మిణీ కృష్ణ జన్మని।
> అన్యేషు చావతారేషు విష్ణో రేషానపాయినీ॥' (విష్ణు పురాణము)

అను విషయమును గమనించ లేదు. లక్ష్మీదేవి శ్రీమన్నారాయణుని అంతటను అనుసరించును. అందుకే "విష్ణో రేషానపాయినీ" యని ప్రసిద్ధి. దీనికి తోడు 'దేవత్వే దేవ దేహేయం, మనుష్యత్వే చ మానుషీ' అనునది రుక్మిణీ దేవి విషయమున చెప్పబడినది.

శ్రీకృష్ణునితో రుక్మిణిగా నుండి తులాభార సమయమున తులసీ దళము నుంచి తన ప్రభావమును వెల్లడి చేసెను. భగవంతుడు సైతము "పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి" యను దానికని శ్రీకృష్ణ తులాభార మొక యుదాహరణము.

> 'సి పదాంబుజ భక్తి నిష్ఠ గలిగినను
> నాపద లొందునే యహరహంబు

నీ పేరు నుడివిన నీ మూర్తి గన్న
నే పాప మతికైన నెసఁగు మోక్షంబు!'

అని కలహాశనుడైన నారదుడు శ్రీ కృష్ణుని స్తుతించి, రుక్మిణీ సత్యలకు భక్తి భావమును కల్గించెను.

కని యీ కథవలన తులసీ మహత్త్వముతో పాటు సత్యభామను అహంకార భక్తికి, రుక్మిణిని నిరహంకార భక్తికి ప్రతీకలుగా చేసెను.

వేంకట నరసింహాచార్యుల (ఐదవ) ప్రబంధములు 'సర్వం విష్ణుమయం జగత్' అను దానికి ప్రతీకలుగా నున్నవి.

ఈయన **'మాలతీ వసంతము'** నందు అష్టాక్షరీ జపము వలన మణిభద్రునకు సంతతి కలిగెనని చెప్పి, మంత్రరాజ ప్రాముఖ్యమును వెల్లడించినాడు.

నీలా, మిత్రవిందలు శ్రీ కృష్ణుని భార్యలు. వీరి కథ సాహిత్య ప్రసిద్ధము. ఇరువురి ద్వారా శ్రీకృష్ణ మహత్త్వము వెల్లడించ బడినది.

**'కూర్మనారాయణ చరిత్ర'** ఆర్తత్రాణ పరాయణుడైన విష్ణు మాహాత్మ్య ప్రతిపాదకము. కూర్మనారాయణుడు సంకట స్థితిలో నున్నప్పుడు 'పరిత్రాణాయ సాధూనాం.' అను దానికి నిదర్శనముగా శ్రీ వేంకటేశ్వరుడు ఆయనను రక్షించును. దైవముపై భార ముంచిన (న్యస్తభరుడు) వానికి కష్టము లెట్లు దూరమగునో యీ నాటకము ద్వారా వెల్లడి చేయబడినది.

**సుమాలినీ పరిణయము, సుదిగ్రాభ్యుదయము, శశికళ** నాటకములయందు విష్ణువే సర్వ భక్త జన సంరక్షకు డను విషయము తెల్పినాడు.

హరిరధలైన 'సత్యనారాయణ వ్రతము', **'శ్రీవేంకటాచల మాహాత్మ్యము'** అను వానియందు విష్ణుని సర్వ వ్యాపకత్వము 'కలౌ వేంకట నాయకః' అను దానికి ప్రతీకగా నిల్పబడినది.

లఘుకృతుల యందు 'శబరీ సపర్య' శ్రీరామాయణమునందలి శబరి కథ, రాముని శరణు జొచ్చిన వారిలో శబరి ముఖ్యురాలు. భక్తికి బాల వృద్ధ భేదములుగాని, వర్ణ తారతమ్యములుగాని లేవనుటకు ఈ కథ యొకదృష్టాంతము. 'శరణాగతి' విషయమున 'అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్ వ్రతం

మమ.' అనిన శ్రీరాముని వాక్యం శరణాగతిని వివరించినది. శ్రీరామాయణము నందలి 'ప్రపత్తి'కి ఉదాహరణముగా కవి 'శబరీ సపర్య'ను చెప్పినాడు.

మరింగంటి వారి శతకములు, తిరునామములు, మంగళహారతులు భక్తి ప్రబోధములు, తాత్త్విక విషయ సంభరితములు. ఇట్టి వీని ద్వారా సామాన్య జనులయందు 'శ్రీ సంప్రదాయ' విషయములను పాదుకొల్పిన ఘనత మరింగంటి వారిదే!

వీరి స్తోత్ర సాహితి (సంస్కృతము) యందు **'శ్రీరామ పాదస్తుతిః'**, 'నృసింహ స్తోత్రము'లు కలవు.

విశిష్టాద్వైతమున భగవత్ శ్రీపాద వైభవమును గూర్చి ఎంతగానో వివరింప బడినది. 'శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే' యనుట విష్ణు భక్తుల పద్ధతి. ఇది న్యస్త భరము. శ్రీరామ పాదములు తపోధన, మనోధనములు; సకల సంపత్సాధనములు. అవియే 'శిలా ముకుర బింబితమ్ రహసి సీతయా చుంబితమ్' అని వర్ణింపబడినవి.

నృసింహ స్తోత్రములు మిక్కిలి ప్రభావ వంతములైనవి. వీరి దృష్టిలో అవి 'శ్రీమంత్రం మంత్ర గోప్యము'లు, 'జ్వాలా జాజ్వల్యమాన' మైన నృసింహ మూర్తిని తమ దివ్య కవితామృతాభిషేచనముచే యోగానంద నృసింహుని గను, పరాక్రమ క్రియల వర్ణించి గండభేరుండ నృసింహునిగను వర్ణించిరి. మరింగంటివారు నృసింహోపాసకులు. భక్త పాలనము ముఖ్యమైన నృసింహావతారమును వీరు తమ స్తోత్రములయందు తనివి దీర వర్ణించినారు.

శ్రీ మహావిష్ణువు అలంకార ప్రియుడు కావున విష్వంశజులైన నమ్మాళ్వారుల ప్రభావమును 'శఠవైరి వైభవ దివాకర' మను పేర అలంకార శాస్త్ర గ్రంథముగా రచించి, గుణరత్న సుందరులైన నమ్మాళ్వారులకు అలంకార పరిచర్యల నొనర్చిన వాడు వేంకట నృసింహ కవి.

పన్నిద్దరాళ్వారులయందు ప్రధానులైన శఠకోపులు (నమ్మాళ్వారులు) సహస్ర శాఖోపనిషత్సమాగమమైన ద్రావిడ వేదసాగర రత్నం.*[7] వీరి నుండియే శ్రీవైష్ణవమునకు దివ్య ప్రబంధములు సంప్రాప్తమై అవశ్యానుష్ఠేయములుగా నున్నవి. అందువలననే వీరి వైభవ ప్రకాశము గుణ నామ సంకీర్తనము

అలంకారి రూపముగా ప్రవచింపబడి విశిష్టాద్వైతమునను, అలంకార శాస్త్రమునకు అలంకార మొనగూర్చ బడినది.

ఈ విధముగా మణింగంటి వారు తమ రచనలతో శ్రీవైష్ణవ సంప్రదాయమును జోడించి ప్రయోజనవంత మొనర్చిరి.

వీరి కావ్య దృక్పథము, తాత్త్విక దృక్పథము కూడా భక్తియే! కేవల ప్రవచనముల ద్వారా మాత్రమే గాక కావ్యములను సాధనములుగా స్వీకరించి సంప్రదాయ ప్రచార - పరిరక్షణములు చేయుటయే వీరి ధ్యేయము. ఈ ధ్యేయము నందు వీరు సాఫల్యము నొంది రనుటకు వీరి కావ్య సంసారము, శిష్య సంచారముల యొక్క విస్తృతియే పరమోదాహరణము.

## సూచికలు :

1. 'A Critical Study of the Philosophy of Sri Ramanuja', Page xxii
2. 'గురో ర్వరోఽతిక్రమణే నిశ్చిత్య స్వస్య దుర్గతిమ్।
   పరా నర్థాఽనహిష్ణుత్వా స్మంత్రం ప్రోవాచ భాష్యకృత్'॥
   'విలక్షణ మోక్షాధికార నిర్ణయము' 6వ పుట
3. ఆముక్త మాల్యదా సౌందర్యము, 287-288 పుటలు.
4. అష్టాదశ భేదముల గూర్చి పిళ్లైలోకాచార్యుల వారు, వేదాంత దేశికుల వారు విపులముగా తెల్పిరి. ఏని సంక్షిప్త వివరణమునకు-'భక్తి-నివేదన' (మాస పత్రిక) 1987 అక్టోబర్ 30-35 పుటలు.
5. ఘటకత్వము, ఉపాయత్వము అను వానిలో ఘటకత్వ పద్ధతి యిది - "దిద్దుపాటయి కైంకర్య పరు లగుట కర్హులయిన వారిని వారి హృదయమును పరీక్షించి పరమార్థులైన దానిని గని అనన్య ప్రయోజన పరులై మంగళాశాసన పరులు కాదగుదు రని తోచిన పిమ్మట వారిని భగవంతునితో చేర్చి శరణాగతులనుగా చేసి స్వరూపానురూపముగా నడుచుకొనునట్లు చేయుట-" 'విలక్షణ మోక్షాధికార నిర్ణయము' 24వ పుట.
6. 'శ్రీమ ద్రహస్య త్రయ సారమ్', మూల మంత్రాధికారః, 2వ పు.
7. 'శ్రీరామానుజ కీర్తి కౌముది' 1వ భా. 286-288 పుటలు.

# అలభ్య రచనలు

## 1. సింగరాచార్యుల కృతులు :

**1. వరదరాజ స్తుతి** : కంచి వరదరాజ స్వామిని గూర్చి స్తుత్యాత్మక ముగా రచింపబడినట్టి దీ కృతి. సింగరాచార్యులు తన రచనల పరంపరను తెల్పునపుడు దీనినే మొదట పేర్కొనెను.

**2. శ్రీరంగ శతకము** : జగన్నాథాచార్యులు శ్రీరంగనాథ విలాస ప్రబంధమును రచింపగా సింగరాచార్యులు ఈ శతకమును వ్రాసినాడు. శ్రీవైష్ణవు లకు పరమ పవిత్ర మైనది శ్రీరంగ క్షేత్రము. శ్రీమద్రామానుజులవా రిచట అధిక కాలము నివసించి విశిష్టాద్వైత ప్రచారము నొనర్చిరి. స్వామి వారి 'దామోదర గోపురము'పై నిల్చొని రామానుజులవారు సకల భక్త జనులకు అష్టాక్షరీ మంత్రోపదేశ మొసగినది యిచటనే! తమ గృహనామము 'మలిం గంటి' వారగుటకు శ్రీరంగ నాయకుల అభిభాషణమే మూలము. కావున - వీని నన్నిటిని మననము చేసికొని, కవి యీ శతకమును చెప్పి యుండును.

**3. చక్ర లాంఛన విధి** : 'తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగశ్చ పంచమః' అని చెప్పబడిన పంచ సంస్కారములు శ్రీవైష్ణవులకు ముఖ్యమైనవి. వీనియందు ప్రథమ సంస్కారముగా చెప్పబడిన 'తాప'మే సమాశ్రయణ మన బడును. దీనికే చక్రలాంఛనము', 'చక్రాంకనము' అనియు నామాంతరములు. ఆచార్యులు - ప్రపన్నునకు మంత్ర పూర్వకముగా తప్తము చేసిన చక్రమును కుడి భుజముపై, శంఖమును ఎడమ భుజముపై లాంఛనము (ముద్ర) గా నుంతు దురు. దీనివలన ఆ వ్యక్తి మంత్రోపదేశము నంది శ్రీపాద తీర్థమును పరిగ్ర హించుటకు అర్హుడగును ఆచార్య పీఠస్థులైన మలింగంటి వారికి శిష్య జన మధి కముగా నుండుటవలన వీని యవసర మధిక మైనది.

ఈ శంఖ చక్రములు విష్ణువు ధరించును గావున పవిత్రములు. ఇట్టి వాని విశిష్టతను, చక్రాంకన ధారణ ప్రాశస్త్యమును విధి, విధానములను గూర్చి 'చక్ర లాంఛన విధి' రచించబడి యుండును.

**4. శత సంహిత** : కవియే దీనిని తెనుగు చేసినట్లు తెల్పుకొనెను. సంస్కృతమున గల గరుడ పురాణమునకు 'శతాధ్యాయ సంహిత' యని పేరు. శ్రీరంగ మాహాత్మ్యమునకు 'శత సంహిత'యని ప్రసిద్ధి. అందువలననే పింగళి సూరన గారుడమును తెనిగించినాడు (ఇతిమున్ గారుడ సంహితాదికృతులన్-కళా. 1-14). ద్విపద రామాయణ కర్తయైన కట్టా వరదరాజు 'ఆమ్నాయ చతుష్క సారము సనాతన గారుడ సంహితా శతాధ్యాయి' యని తన శ్రీరంగ మహాత్మ్య మున తెల్పెను. శ్రీగిరి, భైరవుడు అను కవులు దీనిని తెనిగించినారు.*[1] ఇట్లు పవిత్రము, ప్రసిద్ధము నైన 'శత సంహిత'ను సింగరాచార్యులు తెనిగించి శ్రీరంగ మాహాత్మ్య కర్తలలో నొకడైనాడు.

**5. రామకృష్ణ విజయము** : పింగళి సూరన రామ, భారత కథలను జోడించి 'రాఘవ పాండవీయము'ను రచింపగా, దానిని చూచి సింగరాచార్యులు ద్వ్యర్థిగా ఈ గ్రంథమును రచించి యుండును. కథల వస్తువు రెండింటికి ఒకటే!

**6. అష్ట భాషా విశేష కృతులు** : ఎనిమిది భాషల గూర్చిన రచన. 'కృతులు' అనుట వలన 'ఇవి ఎనిమిది రచనలా?' అని అనుమానము.

తాళ్ళపాక చిన తిరుమలాచార్యుల 'అష్ట భాషా దండకము' వలెనే కవి దీనిని రచించినాడేమో! అష్ట భాష లనగా—

> సంస్కృతము ప్రాకృతంబును శౌరసేని
> జగతిపై మాగధియుఁ బైశాచికయును
> జూళికయు నపభ్రంశంబు సౌరిది నంధ్ర
> భాషయును నివి చను నష్ట భాష లనఁగ' (అప్ప. 1-77)

అని అప్పకవి తెల్పినాడు. ఇతనికి పూర్వుడైన చిన తిరుమలాచార్యులు తెల్పిన*[2] అష్ట భాషలకును, వీనికిని భేదము కలదు. అప్పకవి చెప్పిన 'చూళిక', 'అప

భ్రంశము', 'ఆంధ్ర భాష'-అనువానికి బదులు ప్రాచీ, అవంతి, సార్వదేశి భాష లను తిరుమలాచార్యులు పేర్కొనినాడు.

అష్ట భాషలుగా ప్రసిద్ధమైన వీనియందు ప్రాకృతము, దాని యనువాదములు మిక్కిలి ప్రచారమంది, 'ఆంధ్రము' తప్ప మిగిలినవి ఉదాహరణప్రాయములుగా రచనలలో పేర్కొనబడినవి.*3

బహుభాషా పాండిత్య ప్రకటనమునకు పేరువైన ఈ పద్ధతిని సింగరా చార్యులు 'అష్టభాషా విశేష కృతుల' ద్వారా వ్యక్తము చేసినాడు.

తెనుగు కవులలో అష్టభాషా ప్రసక్తి చేసినవారు కలరు. నాచన సోముడు 'అష్టభాషా కవిత్వ శ్రీ' గలవాడు ('పెంచికల దిన్నె శాసనము'న). భాస్కరకవి పుత్రుడు మల్లికార్జున భట్టు 'అష్టభాషా కవి మిత్రుడు.' వెన్నెలకంటి అన్నయ 'అష్టభాషల మధురాను విస్తర చిత్ర కవితల' ప్రసిద్ధుడు. ఇంకను - దోనేరు కోనేరు నాథుడు, అయ్యల రాజు నారాయణ, ధరణిదేవుల రామమంత్రి, రంగా జమ్మ, మఱింగంటి జగన్నాథాచార్యుల రచనలలో వీని ప్రసక్తి గలదు.

**7. ప్రేమాభిరామము :** ఇది ద్విపద రచన. 'జాతి', 'వార్తలు' గల కృతిగా దీనిని చెప్పినట్లు కవి తెల్పుకొనెను. తెనుగు సాహిత్యమున ప్రసిద్ధమగు 'క్రీడాభిరామము' సంస్కృత ప్రేమాభిరామము ననుసరించి వ్రాయబడినట్లు గ్రంథమందు కవియే తెల్పినాడు (3ి, 84 పద్య). రావిపాటి తిప్పన ప్రేమాభి రామమును (నాటకముగా) వ్రాసినట్లు ప్రతీతి. వీనిని గమనించిన సింగరా చార్యులు ద్విపదలో తానొక 'ప్రేమాభిరామము'ను*4 వ్రాసినాడు.

**8. ధనాభిరామము :** కల్పిత కథను చక్కని కావ్యముగా 'ధనాభి రామము' అను పేర నూతన కవి సూరన వ్రాసినాడు. దీని ప్రభావము వలన నేమో సింగరాచార్యులు ద్విపదలో మరియొక 'ధనాభిరామము'ను రచించినాడు. తంజావుర రఘునాథ రాయలు ప్రేమాభిరామమును నాటకముగా*5 వ్రాసినట్లు తెలియుచున్నది.

**9. నల యాదవ రాఘవ పాండవీయము :** సింగరాచార్యుల నాటికి 'ద్వ్యర్థి' రచన ప్రచారమున గలదు. ఈ గ్రంథమును రచించి సింగరాచార్యులు

చతురర్థి కావ్యముం రాయ్య దైనాడు తరువాత ఈ రసమైన రచనలు తెలుగు సాహిత్యమున మరి కొన్ని వచ్చినవి.

**10. సకలాలంకార సంగ్రహము :** అప్పకవి పేర్కొనిన 'పూర్వ గ్రంథ నామ సంగ్రహము' (1-6 లో) 'అలంకార సంగ్రహ' మున్నది. మూర్తి కవి నరస భూపాలీయము (కావ్యాలంకార సంగ్రహము) ప్రసిద్ధమైనది. సింగరాచార్యులకు సంస్కృతాలంకార శాస్త్రమున గల పాండితి, మూర్తికవి రచన ఈ గ్రంథ రచనకు ప్రేరకములు కావచ్చును. సింగరాచార్యుల తరువాత ఈ వంశ కవులలో నరసింహాచార్యులు 'శతవైరి వైభవ దివాకర' మను అలంకార శాస్త్ర గ్రంథమును వ్రాసినాడు. దీనికి 'సకలాలంకార సంగ్రహము' ప్రోత్సాహకమై యుండును.

**11. రాకా సుధాపూర్ణ రస పుష్ప గుచ్ఛము :** 'సాహిత్య చంద్రోదయము', 'రస మంజరి' యను అలంకార శాస్త్ర గ్రంథములను అప్పకవి తెల్పినాడు (1-5). వానివలెనే ఇది కానవచ్చును. అలంకార గ్రంథమును వ్రాసిన సింగరాచార్యులు కావ్యమునకు ముఖ్యమైన 'రసము'ను గూర్చి దీనిలో వివరించినాడనుటకు పేరులో గల 'రస' శబ్ద మూస్కారమును కల్పించుచున్నది.

**12. ఆంధ్రభాషా భూషణము :** ఈ పేరు గల గ్రంథమును కేతన రచించినాడు. మరల నిదే పేరుతో సింగరాచార్యులు దీనిని వ్రాసి కేతన చెప్పని విషయముల నేవైన తెల్పినాడేమో !

**వింశతి నిరోష్ఠ్య కృతులు :** ఇన్ని నిరోష్ఠ్య గ్రంథముల రచించినట్లు కవి తెల్పుకొనినను, 'దశరథరాజ నందన చరిత్ర', 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము' - అను రెండు కృతులు మాత్రమే నేటికి లభించినవి. తక్కిన 18 కృతులు అనుపలబ్ధములు.

**చాటువులు :** మల్కిభరామ్‌ను గూర్చిన చాటు పద్యములు చాటు పద్య గ్రంథములలో గలవు.

ఇబ్రహీం ఖుతుబ్షా సింహాసనమునకు రాకపూర్వము ఇతని అన్న యైన అబ్దుల్ కరీం అనధికార ప్రభువుగా రాజకీయముల నడిపినాడు.*[6] ఇతని సభను గూర్చి సింగరాచార్యులు కచేరీ వర్ణన 'ఉత్పలమాలిక'ను చెప్పెను. శేషాద్రి రమణ కవులు తమ 'తెలంగాణ పర్యటన' (5-5-1924 నుండి 5-6--1924 వరకు)మున దీనిని చూచినట్లు*[7] తెల్పిరి.

## 2. కోనేటి దేశికులు :

**1. తెలుగు వ్యాకరణ పద్యములు :** 'కవితా ధురీణు' డని 'నృకంఠీర వాభ్యుదయము' నందు వర్ణింపబడిన కోనేటి దేశికులు 'తెలుగు వ్యాకరణ పద్యములు' అను గ్రంథమును వ్రాసినట్లు - 'ఆంధ్ర వాఙ్మయ సూచిక' లోని 'ఆంధ్ర సాహిత్య పరిషత్పుస్తక భాండాగారము - అముద్రిత గ్రంథముల పట్టిక' (పుట 11) ద్వారా తెలియుచున్నది. అసమగ్రముగు ఈ గ్రంథము నేడచట కూడ అలభ్యము.

**1. హరివాసర వ్రత మహాత్మ్యము :** శతఘంటావధాన సింగరాచార్యుల పుత్రుడైన వేంకట నరసింహాచార్యులు (ప్రథమ) ఈ గ్రంథమును వ్రాసినట్లు 'జాంబవతీ కుమార శృంగార విలాస' కృత్యాది (1-48, 44) వలన తెలియుచున్నది. 'ఏకాదశి'కి హరివాసర మని నామాంతరము కలదు. ఏకాదశీ మాహాత్మ్యమును గూర్చి తెల్పబడిన గ్రంథము కావున ఈ పేరు పెట్టబడినది. తెనుగు సాహిత్యమున ఇట్టి రచనలు మరి కొన్ని గలవు.

**1 పద్మినీ కన్య కాభ్యుదయము :** 'షోడశ ప్రబంధ నిర్మాణ ధురీణుడ'నని తెల్పుకొనిన వేంకట నరసింహాచార్యుల (ద్వితీయ) రచనలు మొత్తము 15 తెలిసినవి. వీనిలో 10 గ్రంథములు లభించగా మిగిలిన 5 పుస్తకములు అలభ్యములు. అట్టి వానిలో నీ గ్రంథ మొకటి గలదు. గోలకొండ కవుల సంచిక (పుట 410) యందు కవి పరిచయమున ఈ గ్రంథము పేర్కొనబడినది. కావున అప్పటికి (1934) కనగల్లు 'తాళపత్ర గ్రంథ నిలయము'న పై పుస్తకము కలదు.

పద్మినీ కన్యక యనగా లక్ష్మీదేవి. ఆమెను గూర్చిన విషయము దీనికి కథా వస్తువై యుండును.

**2. రతి మన్మథాభ్యుదయము :** గోలకొండ కవుల సంచిక (పుట 410) యందు 182, 186 సంఖ్యలలో ఒకే కవిని పరిచయము చేసి (భిన్ను లనుకొని) 182 సంఖ్య వద్ద తెల్పిన ఆరు గ్రంథములలో నిది కలదు. 186 సంఖ్యవద్ద మాత్రము 'యావకుల అనంతరాజు గారి యొద్ద సిద్దిపేట తాలూకా వరదాపురములో, ప్రతి కలదు' - అని వ్రాసిరి. కనగల్లు శ్రీరంగాచార్యుల వారు (1958 లో) ప్రచురించిన 'గోదా వధూటీ పరిణయ' పీఠికలో కమవద్ద గల 'ఈ గ్రంథకర్త అముద్రిత రచనలు' అను జాబితాలో 'రతిమన్మథాభ్యుద యము' కలదు. తరువాత దీని జాడ తెలియదు.

గ్రంథ నామమును బట్టి దీనిని శృంగార ప్రబంధముగా భావింప వచ్చును.*8

**3. మిత్ర విందోపాఖ్యానము :** కనగల్లు తాళపత్ర గ్రంథ నిలయము నుండి పరహస్త గతమైన గ్రంథములలో నిది యొకటి. శ్రీకృష్ణుని యష్ట మహిషులలో నొకర్తుకయైన మిత్రవిందా పరిణయము దీని కథా వస్తువని గ్రంథ నామమే తెల్పుచున్నది. మిత్రవింద కథను ప్రబంధీకరించిన తెనుగు కవులు మరి కొందరు గలరు.

**4. శ్రీకృష్ణ విలాసము :** 'చిలువ పడగ చేని పేరణము' కృత్యాది యందు 'అలంకార కృష్ణ విలాసము'గా తెల్పబడిన యీ గ్రంథమును గూర్చి మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము కేటలాగులో*9 నిట్లు గలదు :

"తాళపత్ర. గ్రంథము $15\frac{1}{8} \times 1\frac{1}{8}$ సైజు. 109 ఆకులు, ప్రతి అకు నందు 6 లైనుల వ్రాత. లేఖనము మంచిగా లేదు. తప్పులు. అసమగ్ర భాగములు గలవు. తాటాకు పుస్తకము. కొద్దిగా భ్రష్టమైనది.

ప్రారంభము :

> 'శ్రీ మహిళా కుచ స్తబక చిత్రిత కుంకుమ చందనాంకిత
> స్తోమ సుసౌరభంబులకు తొక్కెడు శేష నగేంద్ర వైభవల్
> వేమరు జూపుదు న్నెపుడు వేడ్కతొ సిర్పనగండ్ల గహ్వరీ
> ధాముడు నౌ నృసింహుడు ముదమ్మునర మమ్ముల బ్రోచుఁ గావుతన!'

ముగింపు :

మాలిని - మహిపతి సతి ప్రేమా ! మౌని చిత్రాభిరామా !
అహి వర నగ ధామా ! హాటక ద్వర్ణ క్షామా !
కుహన దనుజ భీమా ! కుంజరార్తి విరామా !
ద్రుహిణజ నుత నామా ! దేవతా సార్వభౌమా !

గద్యం. ఇది శ్రీమద్వేంకట లక్ష్మీ నృసింహ వర ప్రసాద లబ్ధ కవితా విచిత్ర మౌద్గల్య సగోత్ర పవిత్ర వేంకట దేశిక పౌత్ర కుమార వేంకటాచార్య పుత్ర మతింగంటి వేంకట నృసింహాచార్య విరచితంబైన శ్రీ కృష్ణ విలాసం బను మహా ప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము.

ఇందు ఆదినారాయణుని యవతార కథలు, అందును నృసింహ, రామ కృష్ణావతార కథలు వర్ణితము లయినవి. గ్రంథకర్త మతింగంటి వేంకట నృసింహాచార్యుడు. కుమార వేంకటాచార్య పుత్రుడు."

ఈ ప్రతిని కనుపర్తి మార్కండేయ శర్మగారు (మద్రాసు) 19,20,21 సంవత్సరములలో విరాళముగా నిచ్చినారు. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున నేడి ప్రతి లేదు.

**5. తారక బ్రహ్మరాజీయము :** సింగరాచార్యులు' తారక బ్రహ్మ రామ శతకము'ను రచింపగా - ఈ కవి దాని ప్రభావము వలన కావచ్చు - ఈ ప్రబంధమును చెప్పినాడు.

చింతలపూడి యెల్లన యొక 'తారక బ్రహ్మరాజీయము'ను రచించినాడు. 4 ఆశ్వాసములు మాత్రమే లభించినవి.

వేదాంతముతో కూడిన శ్రీరామాయణ కథ దీనిలో నుండును.

**1. మల్లారి చరిత్ర :** "మంజరీ ద్విపద (అసమగ్రము). ఎర్రమిల్లి పేర్రాజు దీనిని సంస్కరించిరట. ఇందు కర్ణ కులీనులగు రాజుల వంశాను చరిత్రము వర్ణిత మయ్యెను రెండు ప్రతులు" - అని 'ఆంధ్ర వాఙ్మయ సూచిక' లోని 'చెన్నపురి ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము - అముద్రిత గ్రంథముల పట్టిక (22 వ పుట) ద్వారా తెలియుచున్నది.

**1. ఇందిరాల గోదా పారిజాతము :** 'ఇందిరాల భాగవత' మను నామాంతరము గల యీ యక్షగాన లిఖిత ప్రతి శేషాద్రి రమణ కవుల ద్వారా లక్ష్మణ రాయ పరిశోధక మండలికి చేరినది.

ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునకు లక్ష్మణరాయ పరిశోధక మండలిలోని తాళపత్ర లిఖిత గ్రంథములు విరాళముగా నీయబడినవి. వానిలో నీ యక్షగానము లేదు.

'తాలాంక నందినీ పరిణయ' కర్తయైన వేంకట నరసింహాచార్య కృతిగా దీనిని 'గోలకొండ కవుల సంచిక' (పుట 411) తెల్పినది.

నల్లగొండ జిల్లా భువనగిరి తాలూకాలోని 'ఇందిరాల' గ్రామమున గల శ్రీగోదాదేవిని, వేణుగోపాల స్వామిని గూర్చి ఈ యక్షగానము చెప్పబడినది. ఇందిరాల, బోదంపల్లి గ్రామములలో నిది ప్రదర్శింపబడగా చూచినట్లు - ఈ గ్రామములయందు గల వృద్ధులు చెప్పిరి.*10 దీని లిఖిత ప్రతి యొకటి శ్రీ బి. రామరాజుగారి వద్ద కల దనిరి. కాని వారి గ్రంథాలయమున లభింపలేదు.

**1. అనిరుద్ధ విలాసము :** వేంకట నరసింహాచార్యులు (చతుర్థ) దీనిని యక్షగానముగా రచించినట్లు 'గోలకొండ కవుల సంచిక' (పుట 410) తెల్పినది. మరింగంటి కవులలో ఈ పేరు గల యక్షగాన, ప్రబంధ, నాటకముల వ్రాసిన వారు గలరు.

**2. శ్రీరామానుజోదాహరణము:** వేంకట నరసింహాచార్యులే (చతుర్థ) దీనిని వ్రాసినట్లు బి. రామరాజుగారు పేర్కొనిరి.*11 వారికీ రచన లభించినదో లేక ఎవరివలననైన వినిరో తెలియదు.

**1. ఆచార్య తారామాల :** జగన్నాథాచార్యుల వారు 'ఆచార్య సూక్తి ముక్తావళి' కి సంక్షేప రూపమున చెప్పిన దీనిలోని పద్యములు నాలుగు లభించినవి:

మౌద్గల్యాన్వయ రామ సోదర గురున్ మత్తాత మత్యాద్యభూ
మౌద్గల్యం పితరం సమన్విమల భక్త్యా శ్రీనివాసం గురుమ్ ।
మౌద్గల్యాది గురు స్రజం త్వకరవం నైలాం జగన్నాథనా
మౌద్గల్యాస్మృత పీఠి యంచు ఘదిధా మస్ రంగ పూర్గేహినై ॥ (1)

రామాలంకృత వత్స దివ్య కృప సూత్రం బందు నాచార్య తా
రా మాలస్యతిరాజ భవ్య గుటికల్ గ్రాలం గళంబందు కీ
రామాలంబుగ దాల్చి వైష్ణవ ఘనుల్ రాజిల్లి కైంకర్య ధా-
రా మాలంబు నొనర్చి శ్రీహరి పదంబం దంధరం దుండగన్ (2)

కని ముని సంతసం బెదుగగా నుగగాని దురుక్తు లాద నిం
కను ముని నాటు చేటు లటు గాలటుగా పరమార్థ నిష్ఠ నీ
కను ముని జొన్పగాను సుదయాచ్ఛ బిజ్ఞణీళ ను
త్కను మునుకొన్న తాల్మి గల భాగల భాగవతాళి నెంచెదన్ (3)

మఱువని మైత్రి నంద్రు మన మా మనమా మన మా ప్షులీ జనుల్
మరువని యర్చుఁడౌట నణిమా నణిమా నణిమానమౌ జనన్
మరువని యర్థ పంచకము నానము నానము నాన ధాడియే
మరువని పాటు నొందుదురయా మఱి యాదురయాత్మ వైష్ణవుల్ (4)

**2. శ్రీకృష్ణ చరిత్ర :** దీనికే 'శ్రీకృష్ణ తాండవ' మని నామాంతరము. పెద్ద యక్షగానము. కవిగారు స్వయముగా నటీ నటులను సిద్ధము చేసి వరుసగా మూడు రాత్రులు ప్రదర్శించువారట. మహబూబ్‌నగర్ జిల్లాలోని రంగాపురం, మొగిలిగిద్ద, కుందుర్థు గ్రామములలో నీ యక్షగాన మనేక పర్యాయములు ప్రదర్శింపబడిన దని కవిగారి కుమారులు తెల్పిరి.

**3. సూతక శిక్ష :** జాతాశౌచ సమయమున పాటించ వలసిన నియమముల గూర్చి వ్రాయబడిన ధర్మశాస్త్ర సంగ్రహ గ్రంథము.

జగన్నాథాచార్యుల నివాస గ్రామమైన రంగాపురములో శ్రీరంగనాథాల యార్చకులుగా నున్న ముడుంబ రామానుజాచార్యుల వారు జాతాశౌచమును పాటింపక దేవాలయమున పూజాదికములు నిర్వహించుచుండిరి. జగన్నాథాచార్యుల వారు 'ఇది తగదు' అనినను అర్చకస్వామి వినక, సిరితో వాదమునకు తలపడిరట!

కవిగారు అనేక ధర్మశాస్త్ర గ్రంథముల పరిశీలించి తదేక దీక్షగా నీ గ్రంథమును సిద్ధము చేసి - ఆ నాడు వరంగల్లులో సుప్రసిద్ధ పండితులైన అసురవాది నారాయణాచార్యులవారి ఆమోద ముద్రను బడసి, వానమామల అహోబిల పీఠాధిపతుల యంగీకారమును లేఖలద్వారా పొందినారు. శక్ల సం ర

జ్యేష్ఠ శుద్ధ ఏకాదశినాడు అచ్చంపేట తాలూకాలోని మామిళ్ళపల్లి నృసింహాలయమునకు వానమామలై స్వామివారు విచ్చేయగా జగన్నాథాచార్యుల వారు వారిని దర్శించి గ్రథస్థ విషయమును మనవి చేసి మంగళాశాసనము లందినారు.

ఆచార్యులవారి పాండితీ ప్రకర్ష, పట్టుదలల కిది యొక నిదర్శనము. గ్రంథముతో పాటు పదిల పరచిన ఆమోదపత్రములు కూడ నష్టమైనవని కవి గారి కుమారులు తెల్పిరి.

**4. తిరునామములు :** జగన్నాథాచార్యుల వారు ప్రౌఢ శైలి గల అనేక తిరునామములను చెప్పిరట. వీనిలో శ్రీమద్రామానుజుల విషయమైనవి అధికము, ఒక్క అసమగ్ర తిరునామము మాత్రము లభించినది. దీనిని తిరునామ ప్రకరణములో నిచ్చినాను.

**1. శ్రీగోదా దేవీ స్తవము :** వేంకట నరసింహాచార్యుల (ఐదవ) రచనలలో చాల భాగము ముద్రింపబడినను వానిలో కొన్ని లభింపట లేదు. 'గోదా దేవి స్తవము'తో పాటు 'ఆచార్య స్మృతి', పద్మవ్యూహము, అనిరుద్ధ విలాసము (యక్షగానము, ప్రబంధము-2) శ్రీ తిరుపతి వేంకటేశ్వర అంత్య ప్రాస శతకము వీనిలో గలవు. శతకము ముద్రణ మైనదో, లేదో తెలియ దని రచయిత కుమారులు చెప్పిరి.

**1. జీమూతవాహన చరిత్ర:-** చెన్న కృష్ణమాచార్యుల వారి (గంగా పురం) ఈ రచనతో బాటు 'ధర్మాంగద', మిగిలిన శతకములు కవి జీవించి యుండగనే ముద్రితమైనవట (1947 కు పూర్వము). వీరి కుమారుల వద్ద కూడ ఇవి లేవు.

**2. బభ్రువాహన విజయము :** సింగరాచార్యుల వారు (అనుముల) దీనిని రచించి సూర్యాపేటలో నున్న వేంకట నరసింహాచార్యుల (అయిదవ) వారిని సరిచేసి యిమ్మని కోరిరట. కవిగారి ప్రతితో పాటు సవరించి వ్రాసిన కాగితములును నష్టమైనవి.

దీనిని హరికథగా రచించిన ఆచార్యులవారు స్వయముగా అనేక పర్యాయములు ఆ హరికథ చెప్పినారు.

పూర్వమునుండి నేటి వరకు గల ఈ వంశ కవుల అలభ్య రచనలను గూర్చిన సమాచార మిట్లు గలదు.

ఒక పెద్ద కవితా వంశమునకు చెందిన అనేక గ్రంథములు లభించుట లేదు. మన అలబ్ధ నష్ట సాహిత్యములలో నివి చేరినవి.

అనుబంధము : రెండు

# స్తోత్రములు

**'అర్వపల్లి నృసింహ స్తోత్రము'** న రెండు అధిక శ్లోకములు: ఇవి మఠింగంటి మణవాళాచార్యుల వారి వద్ద లభించినవి.

28. హిత్వావృత్య ప్రధూత్య శ్వసిత విలసితం దిత్యపత్యాప పత్యమ్
    స్తుత్యం క్షిత్యంతరిక్ష స్థిత నరసుర వక్త్రాంతర వ్యక్త సూక్తైః।
    బిభ్య ద్దైత్యేభ్య సభ్యం పటు పటు ఘటిత ప్రస్త శుంభ న్నితంబమ్
    జృంభంతం స్తంభలంబ స్ఫుట చటుల సటం స్తౌమి భీమం నృసింహమ్॥
29. శ్రీవత్సం కౌస్తుభ శ్రీ సుసర మురసా వైజయన్తీ స్వసత్యే
    నోచేదం భాసయంతం స్వకలిత తులసీ పల్లవా నర్పయంతమ్।
    సంతానోపాయ వంతం సుర వర శరణం సన్నియంతం రమంతమ్
    కాంతం కాంతోపమానం శుభకర మయి నౌ మ్యర్వపల్లీ నృసింహమ్॥

    ఆచార్యుల వారి వ్రాత పుస్తకములో వీని సంఖ్యలు 18, 25.

## నృసింహ స్తోత్రమ్ :

1. శ్రీవత్సాంకం త్రినేత్రం శశి సమ ధవళం చక్రహస్తం సురేశమ్
   వేదాంగో వేద నాదో వినుత సురపతి ర్దేవరూపః పరేశః।
   ఓం ఓం ఓం కార గమ్యం ఉడుపతి సదృశః ప్రజ్వల త్పావకాక్షః
   హ్రాం హ్రీం హ్రూం బీజ రూపో నరహరి వపుషః పాతు మాం నారసింహః॥
2. గోఖండం వారణాండ దరదరదరదం దర్ప దర్పోరు దండమ్
   ఢింభిం ఢింభిం ఢిఢింభిం దహమదహ మహం ఝుంపఝుంపైర్ఝ ఝుంపైః।
   తుల్యా స్తుల్యాస్తు మోఘం ఘుమఘుమఘుమితో కుంకుమః కుంకుమాంకే
   ఏత త్తే పూర్ణయుక్తో వహతు కహకహః పాతు మాం నారసింహః॥

3. ఝం ఝం ఝం కార కారం ఝుటఝుట ఝుటితో జానుదేశం ఝకారమ్,
హం హం హం హం సహంసం హసతి కహకహః ఘోసహాస్య ద్విశేశమ్।
వం వం వందారు కల్పం వరుణ తరుణితం వామ లక్ష్యం సులక్ష్యమ్
లం లం లం లాలితా స్యోఽలఘుగుణ వినుతః పాతు మాం నారసింహః॥

4. భూభృత్ భూభృత్ భుజంగం ప్రబల ఖర కర ప్రజ్జ్వల జ్వాలమానమ్
గర్జం గర్జం గగర్జం ఖచఖచ ఖచితం గర్జదుర్గం జయంతమ్।
భూభాగం భోగభాగం గగగగగమనం గండ మృత్యు శక్రకంఠః
స్వచ్ఛం స్వచ్ఛం స్వగచ్ఛం స్వజన జన ధృతః పాతు మాం నారసింహః॥

5. పాద ద్వంద్వం ధరిత్ర్యాం కటి విపుల తరో ర్మేరు మధ్యాంగ మేతః
దుక్పర్షం తస్య నాభిః కులిశ నఖ ముఖ శ్చంద్ర సూర్యాగ్ని నేత్రః ।
హా హా హా హా హహాహం హసహసహననం భీష భీమాట్టహాసమ్
వక్త్రం వహ్నిస్తు నిత్యం శకల గుణ యుతః పాతు మాం నారసిహంః॥

6. హం హం హం హం సహంసం కకహక హతహం ముక్త ఘోరాట్టహాసమ్
షం షం షం బంధహస్తం త్రిభువన నిలయం రక్త నిర్ణిక్త హస్తమ్।
రం రం రం రంగ రంగ ప్రహసిత వదనం పింగ కేశం త్రినేత్రమ్
లం లం లం లంబనీయం భృకుటి ఘటి ఘటా పాతు మాం నారసింహః॥

7. క్షాం క్షీం క్షూం లంబ వీరా కఖ కఖకం ఏహి ఏహి ప్రచండమ్
జ్ఞాం జ్ఞీం జ్ఞాం జ్ఞాన రూపం రరరరరరరరం రామకృష్ణాది రూపమ్ ।
భే భే భే భూతధాత్రీ బలి బలి నిరతం భద్ర భద్రం సురూపమ్
స్రాం స్రీం స్రూం క్షిప్ర వేగం ప్రశమ పరిణతః పాతు మాం నారసింహః॥

8. విద్యా సంస్కార మూలం లిలిలిల లలిహం చక్రహస్తం ప్రశస్తమ్
రౌద్రం రుద్రాది సేవ్యం హహహహహ హహహం భైరవోత్యుగ్ర నేత్రమ్।
కాళీయం హుంకారాశం గుహగుహ శయనం గుప్త వీర్యం గుణేశం
హుంకారా మంత్ర ధారీ మట మట మట దృక్పాతు మాం నారసింహః ॥

9. యోగీ యోగాధినాథో హన హన హననం గ్రిహి గ్రిహీ ప్రశస్తమ్
చక్రం భూ చక్ర రక్షే రరరర రరరం మాంస భక్ష్యం సుభక్ష్యమ్।
జ్వాంజ్వాం జాజ్వల్యమాలా తృటిత నిశి చరం బభ్రుసింహం నృసింహమ్
బ్లాం బ్లీం బ్లూం శోభ రూపో నరహరి నిరతం పాతు మాం నారసింహః॥

10. జ్ఞాం జ్ఞీం జ్ఞాం జ్ఞాన రూపో ఘనఘన ఘనహుం ఘర్జ ఘూర్వ్యక్త ఘోరమ్
వం వం వం వాయు వేగం వసు గణస మిశం వాసవార్చ్యం సురార్చ్యమ్।
మం మం మం మాయ మాయోమ కవి కులి కులో మంత్రమూర్తి త్రిమూర్తిః
స్వర్గం స్వర్గాపవర్గం విమల గుణ యశః పాతు మాం నారసింహః॥

11. భా భా భా భావ భావం భవ భవ భసితం భుక్తి ముక్తి ప్రదాతమ్
భీ భీ భీ భీషణాక్షం గుహ గుహ గుహాయం వాసుభోగం సుభోగమ్।
భూ భూ భూమి కంపం గగన గతి మహా ఘర్జయం తర్జయంతమ్
భే భే భే భేదనీయం హరహర హర హుం పాతు మాం నారసింహః॥

12. ఉగ్రం ధిగ్రీయ్య ధారం ధమ ధమ బహుళం సత్యవాదం సదంగమ్
హుం హుం హుంకార నాదం ధట నిరవదనం సా చ సంసార గుహ్యమ్।
క్షం క్షం క్ష్యా క్ష్యాళితాంఘ్రిం శశి కర మకుటం బ్రహ్మ రుద్రేంద్ర సేవ్యమ్
టంరూకః కం ప్రలంబో హ్యభయ వరకరః పాతు మాం నారసింహః॥

13. భూ భూ భూ భూషజంఘ ప్రగళ గళగళ ప్రజ్వల జ్వాలమాలాం
ఖర్జం ర్జం ఖర్జ ఖర్జం ఖచ ఖచ ఖచితం ఖర్జ దుర్జ ర్జయంతమ్।
భా భో భో భోగ భాగం ఖగ ఖగ ఖగగం దుఃఖ హం దుఃఖ గంధమ్
స్వచ్ఛన్నం స్వచ్ఛ కర్తా పర బల దమనః పాతు మాం నారసింహః॥

14. యద్భద్రం గర్జ గర్జం ఘుమ ఘుమ ఘుమితో బాల చంద్రార్ధ దంష్ట్రో
హేమాభా సానురూపం ఝుట ఝుట ఝుటితో జాత్యమాన స్తు భీతిః।
దంతానాం ఖాద పానం ఝుట ఝుట ఝుటితో భీష భీమ స్సురేంద్రో
నిష్కోమోఽర్కం సురేశో గహ గహ గహనః పాతు మాం నారసింహః

15. ప్రాజ్య ప్రోద్భూత వర్ణం స్ఫుర దనల హుం భ్రాంతి హల్లోల జిహ్వా
భూభగ్నే భ్రూకుటి శ్ఛ జ్వల దనల ముఖ శ్ఛత్రు రంగార ఘోరః।
స్తంభోర్జం జంభనాశం స్ఫుట నట దనలోద్భ్రాంత భూభృ త్సహస్రా
ఖర్జర్జరోగ్ర దంష్ట్రొ నట నట దనలః పాతు మాం నారసింహః॥

16. కింకేశం మస్తకేశో నరహరి సదృశం దేవసత్వం గృహీత్వా
వేదాద్యో విప్రవంద్యో శ్రుతి రుపనయనం శత్రువ ద్యోగ శేషమ్।
చాపం పాశం చ ఖడ్గం పరశు విషతరం శూలపాశం దుశార్ఙమ్
ఇత్యేవం దైత్య నాశం క్రకచ విదళనః పాతు మాం నారసింహః॥

17. శంఖం చక్రం చ చాపం పరశు విషతరం శూం పాశం దుశార్ఙమ్
టిఙ్ఖాణం వజ్ర ఖేటం హల ముసల గదా కుంత మత్యుగ్ర దంష్ట్రిమ్।
జ్వాలాకేశం త్రినేత్రం జ్వల దనల ముఖం హార కేయూర భూషమ్
ధ్యాయే ప్రత్యక్ష రూపం పరమ పద పతిః పాతు మాం నారసింహః॥

18. కుందేందు శ్శంఖ వర్ణః కృతయుగ భగవాన్ పద్మ ముక్తా ప్రభాసో
త్రేతాయాం కాంచనాభః పున రపి సమయే ద్వాపరే ర క్తవర్ణః।
శుభ్రాంశం ప్రా ప్తకాలే కలియుగ సమయే నీం మేఘాబ్జనాభః
ప్రాగ్జ్యోతిః సృష్టికర్తా పర బల దహనః పాతు మాం నారసింహః॥

19. నాసాగ్రం పీన గండం పర బల దహనం బద్ధ కేయూర హారమ్
రౌద్రా దంష్ట్రో కరాళం పరిమిత గహనం కోటి సూర్యాగ్ని భాసమ్।
గంభీరం పింగళాక్షం భ్రుకుటి యుగ ముఖం షోడశార్ధార బాహుమ్
వందే భీమాట్టహాసం వికృతి విదళనః పాతు మాం నారసింహః॥

20. ఉగ్రాకా రోగ్రదృష్టిః భృకుటి వికట నాటోటిలా వా కరాళమ్
ద్రాఘీయః పూర్ణ దంష్ట్రో త్రుటిత సుర శిరో ర క్త నిర్ముక్త హస్తౌ।
జృంభ న్నాసాగ్ర వ క్త్రః ప్రబల రయతను శ్శ్వాస దోలాయమానమ్
బ్రహ్మాండే ఖాండ ఖండ ప్రళయ భయ కృతః పాతు మాం నారసింహః॥

21. యం దృష్ట్వా నారసింహం కృత నఖ ముఖర స్తీక్ష్ణ దంష్ట్రో కరాళమ్
పింగాక్షం లంబకర్ణం హుతవహ సదృశం కుంచితోదగ్ర కేశమ్।
భీత స్త్వం దానవేంద్రం సురవర భయదం శ క్తిమూ ర్తిం సహ స్తమ్
హః హః కిం కిం ఏమేటం షుభిత జనదృతః పాతు మాం నారసింహః॥

22. ఘోరం భీమం మహోగ్రం స్ఫుట సకుటిలతా భ్రూ లతాభీం ఫాలమ్
ఫాలాక్షం చోర్ధ్వకేశం ప్రళయ శశిముఖం వజ్రదంష్ట్రా కరాళమ్।
ద్వాత్రింశ ద్బాహు యుక్తం వర పరశు గదా శూల పాశం కుఠార్జమ్
ఇత్యేవం దేవనాదం క్రకచ విదళనః పాతు మాం నారసింహః॥

23. క్రోధా దుద్భూత నాశ స్ఫుట సుషిర గళ ధ్వాంత నిర్ఘాంత భూభృ
దూత్భూత స్తంభాయుత స్తం స్ఫుర దధదవశం తీక్ష్ణ దంష్ట్రా కరాళమ్।
దిక్షు ప్రక్షిప్త చక్షు క్షితి ధర భర భూస్వ స్సహస్రాసు చక్షుః
రక్షో వక్షోక్షతాంశుః క్షుభిత నఖముఖః పాతు మాం నారసింహః॥

24. రక్షో వక్షో విదార్యోభనత నఖముఖై ర్విస్ఫులాం గోజ్వలాక్షో
రక్షోభి స్తంభ నిర్య జ్జట ఝుట వికలో ధ్వాంత నిర్ఘాంత సంఘైః।
రక్షో నానాత్మ జన్మా సునయన శమితో భక్తవాత్సల్య రక్షః
వక్షో నిక్షిప్త లక్ష్మీ ర్వికృతి విదళనః పాతు మాం నారసింహః॥

25. ఆకాశే స్థూల జంఘా ప్రళయ పరిణతః గ్రంథి భూమిత్యతత్త్వమ్
కాష్ఠే పాషాణ మధ్యే హ్యుతవహ నిలయం ఉగ్రరూపం మహేంద్రమ్।
లంబోహత్యంతరిక్షం దశ దిశ గమనం మాతృకా మంత్ర రూపమ్
చక్రం పాషాణ వాస స్ఫురగణ నమితః పాతు మాం నారసింహః॥

26. శ్రీ వేదవ్యాస మూర్తి ర్ముఖ ఋషి భగవాన్ సిద్ధమంత్రాది రూపమ్
యోఽధీతే తస్య నిత్యం సకల శివ మతం లోకనాథో దదాతి।
ఓమ్ క్షాం క్షీం బ్రహ్మ విద్యా సకల జన వశం చారు సారస్వతాంగమ్
దర్పం సారం సుసారం త్విహ వరవిభవం దేహి మన్నారసింహః॥

27. ప్రహ్లాదానందమానం జ్వర మరణ భయం మృత్యు చారోపమానమ్
పాశం శస్త్రాస్త్ర హారం విషధర దమనం ప్రేత్య సంసార రోగాత్।
స్తోత్రం భక్తి ప్రయుక్తం వర సకలఫలం సర్వ దారిద్ర్య నాశమ్
ఐశ్వర్యం కాంతియుక్తం సకృదపి మనసా ధ్యాయతే యస్య ముక్తిః॥

ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖమ్।
నృసింహం భీషణం భద్రం మృత్యుం మృత్యుం నమా మ్యహమ్॥

హరిః ఓమ్ అస్య శ్రీ లక్ష్మీనృసింహ స్తోత్ర మహామంత్రస్య వేదవ్యాసో భగవాన్ ఋషిః.

జగతీ చ్ఛందః. శ్రీ లక్ష్మీనృసింహో దేవతా. క్షాం బీజం. క్షీంశక్తిః. క్షూం కీలకం. శ్రీ లక్ష్మీనృసింహ ప్రసాద సిద్ధ్యర్థే స్తోత్రజపే వినియోగః. క్షామితి షడంగ న్యాసః. భూర్భువస్సువరో మితి దిగ్బంధః.

ధ్యానమ్ - శ్రీమన్నృసింహ విభవే గరుడ ధ్వజాయ
తాపత్రి యోపశమనాయ భవౌషధాయ।
తృష్ణారి వృశ్చిక భుజంగ జలాగ్ని రోగ
క్లేశ వ్యయాయ హరయే గురవే నమోఽస్తు॥

పీనియందు 6 నుండి 18, 20 నుండి 27, మంత్రము, 2 శ్లోకములు మణ వాళాచార్యుల వారి వద్ద (వరంగల్లు) లభించినవి.

## సూచికలు :

1. శ్రీరంగ మాహాత్మ్యము - పీఠిక (పుటలు CXLII-CXLV)
2. 'Minor Works of Tallapakam Poets' (పుటలు 151 - 156)
3. అష్టభాషలు - శ్రీ నిడుదవోలు వెంకటరావు, భారతి-1966 జులై.
4. గద్వాల నివాసి రామానుజాచార్యులు తన యొక్క అముద్రిత రచనలో ప్రేమాభిరామమును తెనిగించినట్లు వ్రాసికొనె నని మల్లంపల్లి వారు తెల్పిన విషయమును 11-9-1957 నాటి తమ 'డైరీ'లో వి. రామరాజు గారు వ్రాసి యుంచుకొనిరి. ఆ అముద్రిత గ్రంథ మేదో తెలియదు.
5. రాజగోపాల విలాసము - పీఠిక (పుట 49)
6. 'తారీఖే గోల్కొండ', 'సైర్ గోల్కొండ' అను ఉర్దూ గ్రంథములలో ఈ విషయము గలదు.
7. కుతుబ్షాహీ సుల్తానులు - తెలుగు సంస్కృతి (పుట 182)
8. పరశురాను పంతుల అనంత రామ పండితుడు 'రతిమన్మ థాభ్యుదయము'ను వ్రాసినాడు. ఇతనిని గూర్చిన వ్యాసము - బి. రామరాజుగారు, 'సాహితి' 1962 జనవరి.
9. A Triennial Catalogue of Manuscripts - Vol. V, Telugu - R. No. 749, Page 1817.
10. ఈ యక్షగానము స్వామివారి బ్రహ్మోత్సవముల సందర్భమున 1950వ సం. ము వరకు ప్రదర్శింపబడినది.
11. విజ్ఞాన సర్వస్వము 4 వ భా. తెలుగు సంస్కృతి. పుట 428.

# తిరునామములు - మంగళ హారతులు

## 1. శ్రీరామ పరములు :

అప్పలదేశికుల వారు నరసింహాపురమునకు రాక పూర్వము వీరి నివాసము నేటి సూర్యాపేట తాలూకాలోని సిరిపురము. అచ్చటి శ్రీరామచంద్ర స్వామిని గూర్చి దేశికులవారి పుత్రులు కృష్ణదేశికులవారు చెప్పిన యీ 'తిరునామము' మా యింటిలోనే లభించినది.

ప్రౌఢ సంస్కృత మయమైన రచన, దేశికుల కవితా పాటవమునకు నిదర్శనము :

పూజయామి సిరిపుర రఘు తిలకం
స్ఫుట కపోల ఫలకం,
నైజ పాద ధూళి పవిత్రిత సరయూ తట తిలకం
రాజ దళి ప్రకర విలస దలకం
రభస విభవ ఘన సముదిత పులకం

పూజయామి సిరిపుర......

పూష వేష విశేష దూషక కోటీరం - లోకా
పుషిత విష విషమ కలుష శత కోటీరం
శేష యోషి దశేష రూషిత పాటీరం - ధీరా
శిష మపరుష మపరుష మకలుష పరిపాటీరం
ఓషధీశాంచిత వదనం
ద్వేష ధీ ఖండిత రిపు సదనం
వేష నిందిత నూతన మదనం
రోష మండిత మౌక్తిక రదనం

భీషణ మిష ఖరదూషణ రావణ
శోషణ కరణ విభీషణ ముఖ పరి
తోషణ శుక మద దోషణ మధురస
పోషణ చణ మృదు భాషణ భరణం

పూజయామి సిరిపుర......

ధాటీకాహత తాటకాఖ్య నిశాటికం - దీవ్య
త్కూట విటప చటుల కరి పటల నికట ఘాటికం
కూట పాటవ కూట వత్సల వాటికం - స్యంద
త్కుటప విటప సట కుటీర పటిమ రచ ఘాటికం
శాటకాఢ్య సఖోజ్జ్వల కటకం
ఖేట నిష్ఠుర మణి కంఠకటకం
ఖేట పట్టణ నిభ కంకటకం
ఘోట ఘట దండజ మర్కటకం
కూట కఠోర నిశాటక మకుట వి
పాటక కటి శర నాటక మధిగుణ
పేటక మిందు కిరీటక విధృత
హాటక ఘటిత నిశాటక హరణం-

పూజయామి సిరిపుర......

శ్రీనివాస నృసింహ దేశిక ధామానం - శ్రీవ
ర్తన మిన మనుకృత ఘన వృషగిరి వసుధా మానం
భాను భాను వితాన పానక ధామానం - కంత
స్వన మధురిమ విరసిన వినుత వసుధా మానం
జానకీ తరుణీ సంధానం
మాన సత్త్వ సదనుసంధానం
మౌని సముచయ సన్నిధానం
సానుజాత త్రితయ నిధానం
దానవ రిపు వర దానవహం
జినదాన వరిష్ఠ సదానవ ముల్లస
మానవరాంఘ్రిమ మానవ
వనరుహ సమాన వరేణ్యం

పూజయామి సిరిపుర రఘు తిలకం...

ఈ పద్ధతి (సంస్కృతి) తిరునామములు కొన్ని డా॥ చిదాలవి వారి 'తిరు నామములు' (87, 88, 93, 222 పుటలలో) గ్రంథమున గలవు.

## 2. శ్రీరామానుజ పరములు :

మతింగంటి యాపగిరాచార్యుల వారు (మిర్యాలగూడెం) వ్రాసి యుంచు కొనిన దీనియందు 'సిరిసెనగండ్ల' పేర్కొన బడినది. కావున మతింగంటి వారి పూర్వు లెవరిదో యైయుండునని ఆచార్యులవారి అభిప్రాయము.

**వరాటి రాగం - ఆదితాళం**

1. శ్రీపెరుంబూదూరు యతి శేఖర - మా యయ్య మీ
   శ్రీ పాదాబ్జముల తలను మోపవె మా యయ్యా!
   పంచ భూతములచే కల్పించిన మేనయా
   పంచేంద్రియములు మన్నిలై నొంచియున్న వయా
   పంచ సంస్కారములు మన్నించి యేలుమయ్యా - ఇలను
   పంచమోపాయమై అవతరించినా వయ్యా!
   నీతిమాలిన విశ్వాస ఘాతుకుడ నయ్యా
   చేతనైన పను లన్ని పాతకములే నయ్యా
   యీ తీరు నాకొక మే రీతి చూచెదరయ్యా - మున్ను
   'రీతో భవ' యన్న రీతి బ్రోవు మయ్యా!
   మంచు రీతి మోహాంధ్యములు ముంచుకొనె నయ్యా - నే
   మంచివాని వంచించే కొండెగాడ నయ్యా
   చంచల చిత్తుని నన్నెంచ నెటకయ్యా
   పెంచిన ప్రేమతో సిరిసెనగండ్లను బ్రోచేటి మా యయ్యా :
   జార చోర విద్యల వికారి నైతినయ్యా
   అపచారముల బద్ధ సంసారి నైతినయ్యా
   నెరుపైన దాస్యమునకు దూరమైతి నయ్యా
   సిరిసెనగండ్లను యేలు శ్రీపతి! దారి చూపవయ్యా :
   రట్టడి పాపములచేత పుట్టినాడ నయ్యా

పుట్టువు లన్నియు కట్టబెట్ట చేయు మయ్యా
నట్టడవిలో కాపుర మెట్టు చేతునయ్యా - మీ
పట్టు విడుపులలోని గుట్టు చూపుమయ్యా !
కట్టడి కర్మ పాశముల కట్టుబడితి నయ్యా -
చుట్టుముట్ట విషయ వాంఛ మట్టు మీరెనయ్యా
నట్టేటిలో పుట్టి ముంచ న్యాయము గాదయ్యా
గట్టిగా దాస్య పట్టము గట్టవె మా యయ్యా!
నాటినుంచి నే బుట్టిన దేటి జన్మమయ్యా
నేటికి మిమ్ము గాన నిదేటి జ్ఞాన మయ్యా!
యేటి గడ్డ చెట్టు కెపుడు చేటే గదయ్యా - మీ
పాట లాలకించే వారి చోట నాటు మయ్యా!
కమ్మక దేహావసాన మదె చిమ్మిరేగె నయ్యా - నా
దిమ్మరి మతము లన్ని జిమ్మి వేయు మయ్యా
యిమ్మైన పర యోగివాసాద్రీశ చేర్చుమయ్యా - మా
నమ్మాళ్వారుల సౌమ్మైన మా యయ్య!
ఘనమైన సిర్సెనగండ్ల నుండిన మా యయ్యా
మనములో తలచిన మా భక్త సులభుడవు
తనువు గల్గిన వారు తరియింప బాటవు
చనిన వారికి నీవె మోక్ష ప్రదాతవు............

తిరునామము ముగింపు లేదు. వారివద్ద ఇంత వరకే లభించినది.

2. నల్లాన్ చక్రవర్తుల వరదాచార్యుల వారి యింట (ఖమ్మం) లిఖిత గ్రంథమునందు లభించిన 'మంగళ హారతులు-తిరునామము'లలో నిది యొకటి- 'నరసింహ దేశికుల వాచెద' - అని వ్రాసి పెట్టినారు. (వీరు అప్పలదేశికుల అగ్రజులు).

అయ్యా శ్రీరామానుజార్య! మీ విగ్రహ మనుభవింపగ గంటినే -
ఆయ్యారే అఖిల లోకాళి బూనెడు మారునయ్యకు
నవ సుమ శయ్యా తల్లజ మైన

అయ్యా శ్రీరామానుజార్య!

కంటక మైనట్టి కఠిన తాపాదుల
నంటువలన సుఖ మంటలేక
మంట లెత్తగ చేయు మరుభూమి దిరుగగ
కంటి కింపగు పద్మాకరము గాంచిన రీతి

అయ్య శ్రీరామానుజార్య!

దిక్కు మాలిన అతి విషయేచ్ఛ సుఖముల
సొక్కున మిగుల పెంపెక్కలేర
విక్కి పీగెడు ఘోర విష ధారలను జిక్కి
దక్కి గరుడ మంత్ర ధార గన్న భక్తి

అయ్య శ్రీరామానుజార్య!

చెంగావి శేషాచలాంగ నంబెరుని గ
నుంగొను మార్గ మెరుగ లేక
వెంగలి నన్ను చేరందీసి తెన్న
రంగ పొన్నడిపై కా
వంగ నేలిన తండ్రి!

అయ్య శ్రీరామానుజార్య! మీ విగ్రహ మనుభవింపగ గంటినే!

8. ఇది ఖమ్మంలో లభించినదే. నరసింహ దేశిక రచన:

'పను లేటి పనులు శ్రీవారి జూడని కనులేటి కనులు—
నను నెనరున మన్నన జేసిన గురు
దినమణి శఠరిపు ధీమణి జూడని

పను లేటి పనులు శ్రీవారి......

తను వేటి తనువు నా హరికి గాని తను వేటి తనువు
అనిమిత్త కరుణాభర వేగ
మున నమ్మగని చేకొనిన దేశి
కుని దాస్యకళ లేని -

ఫను లేటి పనులు శ్రీవారి......

తల పేటి తలపు హరికి గాని వల పేటి వలపు
చలపూని మదికి వచ్చిన రీతి నతిభక్తి చరితుడవై దాస్య
ములు చేయకున్న యీ తను వేటికి
అల శేషగిరిని చింతించెడు నరసింహ గురుని
తలపున దగి యావలిపెడు యతికుల
తిలకుని శ్రీపాదముల సన్నిధికి గాని
పను లేటి పనులు శ్రీవారి జూడని కను లేటి కనులు?......

4. ఖమ్మంలో లభించినది - నృసింహ దేశిక కర్తృకము:

నాథ దయారస వారినిధే! - యతి
నాథ దయారస వారినిధే!
బోధ విశృంఖల సాధన చరణా!

సాధు కథాచణ సారమతే! - యతినాథ దయారస......
నిందిత విమ తానందిత చరితా
కందళి తానంద కందకృతే-
యతినాథ! దయా రస......

పాతక మథనా పావన కథనా
భూతి యుగీభర జాతిరథే
యతినాథ! దయారస......

ధారక శేషాచల పతి భూషా
శ్రీ రామానుజ ధీరమతే
నాథ దయారస వారినిధే యతినాథ! దయారస వారినిధే!

5. శ్రీమాన్ మఱింగంటి నరసింహాచార్యుల (మానుకోట) వద్ద లభించిన ఈ రెండు (౫,౬) నరసింహ దేశికుల రచనలని వ్రాసిపెట్టబడినవి:

రావె మహానుభావ శతారాతి సంయమి
నీవే దైవము మాకు గణానక వారిధే
రావె మహానుభావ......

విపన్న లోక జీవనా
ప్రపన్న లోక పాలనా
ప్రపత్తి బోధనైక కళా పార్థసారథే
సుజాత రామ సోదరా
ద్విజాత సూరి సోదరా
నిజాంఘ్రి పద్మ యోగి మనోనిత్య సేవధే।
రావె మహానుభావ......
శేషశైల పాలనా
శేషశైల శీలనా
భాష్యైక శ్రీ నృసింహ సుధీ బద్ధ సేవధే
రావె మహానుభావ శఠారాతి సంయమి ......

6. రాగదవె యిందు రామానుజ! వేగ
వాగమృత లహరి పరిభోగములను నను దనుపగ
రాగదవె యిందు రామానుజ ......
మధురిమ లీలా మహిత సుశీలా
మధురస పరభోగ్య వినిర్మల తర శుభగుణ విగ్రహా
రాగదవె యిందు రామానుజ ......
ప్రణవ విధేయ పర భాగధేయ
పున రవతారణ పరిహృత విమలాంతర
రాగదవె యిందు రామానుజ ......
సమధిక శేషాచల రాజభూషా
స్వమహిమ జిత భువన సముచ్చయ
శఠరిపు చరణాంబుజ-
రాగదవె యిందు రామానుజ ......

7. శ్రీమాన్ రంగ కృష్ణమాచార్య (రంగాపురం) రచితములు :

ఆటతాళం

"రాగదే మద్గురు రాయా శ్రీ రామానుజాచార్య
రాగదే త్యాగ విచారా
వాగమృతసార విభవ
భోగశీలా నైకలోలా
భాగ శ్రీ యతిరాజవర్యా!
రాగదే మద్గురు రాయా......

ఆసూరి శ్రీ కేశవాచార్య
ఆత్మజాశ్రిత పోషణ ధుర్య - శ్రీ
అసామాన్య భాష్య నిచయ భావనా
శ్రీ భాష్యాచార్య!

రాగదే మద్గురు రాయా!......

కరుణా పూరిత వేష - శ్రీ
శేషాంశావతా రోదారా
ప్రాకటముగ కృష్ణదాస
పాలన శ్రీ లక్ష్మణాచార్యా
రాగదే మద్గురు రాయా! శ్రీ రామానుజాచార్య !

8. ఆచార్య వర్యా! రమ్ము పూజించెద హస్తద్వయిని మిమ్ము -
నీచుడని నను దూరకను బహు నేర్పుతో కరుణించి ప్రోచెడి
మీ చమత్క్రియ కెంత నుతి మది నేనొనర్తును గనగ తండ్రీ
ఆచార్య వర్యా! రమ్ము......

పరమేశు గుణ లీలలే తమ కున్న పరమార్థ హిత బోధలే
హరి స్వరూప స్వభావ నిశ్చయమైన సమ్మత సచ్ఛుభాకర
సరణి సుఖ మిటు కలుగజేయగనో గురూత్తమ! నమ్మి యుంటి
ఆచార్య వర్యా! రమ్ము......

మృదుల పీతాంబరము ధరియింపుమి మెరయు శిరోవేష్టము
ఆచార్య వర్యా! రమ్ము......

ఎదను ముద మొదవ యజ్ఞోపవీతము లేర్పరచన్ గనరాగ సంభ్రమ
మొదవగను దయచేసి దాసుని మోహ జలధిని బాప గలిగిన
ఆచార్యవర్యా! రమ్ము......

మల్లె పూవుల దండలను మెడ నుంచెద మంచిగను చేమంతులు
అల్లిబిల్లిగ నల్లుకొన ఘన మొదవగా శ్రీ పారిజాతము
ఉల్లసిల్లగ చందనాదుల నుంచెదో తిరుమే నలంక్రియ
ఆచార్యవర్యా! రమ్ము......

ధూప దీపంబులను ఆర్పించెదను తులసీ దామములను
సాపరాధుడ నన్ను క్రోపుము సారె సారెకు సంస్తుతించెద
నోప నీ సంసార జలనిధి నొడ్డు చేర్చుము ఓ గురూత్తమ
ఆచార్యవర్యా! రమ్ము......

మహి శేషగిరి మీద నా సారసాక్షు రహి రంగపురమునను
సహరహము వసియించి రంగాహ్వాయ కపీంద్రుల కెల్ల వేళల
నిహ పరంబుల సుఖము లీయగ హే గురూత్తమ! దేశికేంద్రా!
ఆచార్యవర్యా! రమ్ము......

## 3. మన స్సంబోధన :

1. కంచి వరరాజస్వామి సంబోధన, ఆత్మవిషయ వ్యక్తీకరణము చేయబడిన దీనియందు సింగరాచార్య ప్రశస్తిగలదు. కర్తృత్వము తెలియదు. గురుచంద్రు లని సింగరాచార్యులు పేర్కొనబడుట వలన ఆయన శిష్యులో, అభిమానులో దీనిని వ్రాసి యుందురు. సూర్యాపేటలో లభించిన తిరునామములలో నిది గలదు.

కరుణించు మిక నైన ఘన సింగరాచార్య గురు పాదముల చేర్చ వరదా!
ధరలోన ఆసూరి స్వామి గాచిన రీతి దరి చేర్చవే కంచి వరదా!
నెలలు తొమ్మిది నరక గర్భమున జనియించి
నీచాత్ముడై యుంటి వరదా!
మల మూత్రముల చెంది మరి రెండు మూడేండ్లు
మలినమున నుంటి నే వరదా!
బాలక్రీడల చెంది పదహారు యేండ్లు నే
ప్రాయమున నుంటినే వరదా!
బలిమి ప్రాయము నమ్మి భామలను గూడి
ముప్పది యేండ్లుంటి వరదా!
తుదను యీ సంసార జోలి నరువది యేండ్లు
దుఃఖాన నుంటినే వరదా!

మదమునను పుచ్ఛిష్ట మతము గైకొని యుంటి
　　　　కొదువ ముప్పది యేండ్లు వరదా!
వదులు దంతము నీచు గదురు గల యీ మేను
　　　　దుష్ట పైత్యాదులే వరదా!
పదిలముగ వలబడ్డ పక్షి చందమున నే
　　　　పలవింపు చున్నాను వరదా!
మున్ను నా తలిదండ్రు లెందరో లెక్కింప
　　　　మును పద్మభవు డెరుగు వరదా !
ఎంద రెందరి యిండ్ల నీ రీతి జనియించి
　　　　మందమతినై యుంటి వరదా !
నింద పొందించు నా పగవార లార్గురు
　　　　నిను చేరనీయరే వరదా !
విందునై తగు భక్తి విన్నవించెద నీకు
　　　　విన్నపము మది నుంచు వరదా !
పసు కీట మృగ పక్షి భామలను జనియించి
　　　　పరితాప మందితినె వరదా !
ఇసుమంత నిలుకడీ జీవునకు లే
　　　　దయిన మీదెట్లౌకో వరదా !
కసురక మీ పాద కమల మున్ తెప్పచే
　　　　వెడల యీదించవే వరదా !
వసుధ నవతారివై వేంచేసి 'సిరిసెన
　　　　గండ్ల' నుంటిని నీవె వరదా।
గతి నీవె మరి లేరు గర్వాంధు డనుకోక
　　　　నను గాచి రక్షింపు వరదా !
నత జనాశ్రిత రక్ష నా తల్లి పెరుందేవి
　　　　పతియైన శ్రీ కంచి వరదా !
శ్రిత జనాశ్రిత లోల శ్రీ లక్ష్మి హృజ్జాల ।
　　　　అతి హీను గావవే వరదా !
చతురుడా శతఘంట సింగర గురు చంద్రు
　　　　తిరువగిఘుకే శరణు పొందించు వరదా!'

2. ఖమ్మంలో లభించిన లిఖిత ప్రతియందు అసమగ్రముగా నున్న తిరునామములలో నిది యొకటి. రచయిత పేరు లేదు.

'ఎంతని నే నిక బోధింతునె ఓ మనసా!
చింతిల నేలను మన కెతికాంతుడు గలి యుండన్
పరమ దయాళుడు హరి మును కరణ కళే
బర శాస్త్ర ప్రవరము లొసగియు
ధర నవతరణము గని దయచేయన్
స్థిరముగ నర నారాయణ ధరణీ వ్యాజమునను దా
చరమార్థము లొసగిన గురు సరణిని ప్రాపించెన్
ప్రాక్తన దోషము లన్నియు పారం దోలగ తమ శ్రీ
సూక్తుల నమృతము లొలుకగ రక్తిని గలిగించెన్
వక్తవ్యార్థము లన్నియు వదలక తెలుపగ నా
సక్తిని జెందక త్రెళ్ళుట సరసం బగునట
ఎంతని నే బడిబడి ప్రాకృత సౌఖ్యం బాళను
చెడి విషయంబుల విడి బడి దిరుగుచు దుఃఖము
గడుపుట లేదాయెన్!
కడ ముట్టని యర్థాదుల కాంక్షను
మఱి మఱి మఱిగియు పుడమిని వెఱ్ఱిని
బోలుచు బొగులుచు వగచెదవే!
ఘట తీర్థ త్యాగమునా ఘట సంబంధులపై
పటు ప్రేమను నిరతంబును నటియించెదవే
ఘటకుడు వృషగిరి నాథుని చటుల మహో
న్నత భక్తిని ఘటియింపగ చూడవె దు
ర్ఘట మని యన బోకన్
ఎంతని నేనిక బోధింతునె ఓ మనసా!

3. ఖమ్మంలో లభించినది. నృసింహ దేశిక రచన :

స్వామి! యీ ప్రకృతితో సంబంధ మిక చాలునయ్యా
యేమె మా యతి చంద్ర! యిక మమ్ము చేర్చి సన్నేలరయ్యా

విరస విషయముల బరగు నిం[ద్రియముల వేగలేనె
సరి నిత్య చపలత స్వాంతముతో కొనసాగలేనె
దొంటికొన జేయు బంధుర పాపముల తులదూగలేనె
ఉరు మన్మథ [గహ మూనిన శివమెత్తి యూగలేనె
స్వామి! యీ [ప్రకృతితో సంబంధ మిక చాలునయ్యా!

సుడిబడ చేయు మించెడి దుఃఖములు చెప్పి చూపలేను
సడలని దురిత వాసనల పెంపునకు సైపలేను
బుధ ధూర్తులగు రాచ పీనుగుల చెయ్యి చాచలేనె
తడబాటు చెడు లోక జడుల సంఘములకే నోపలేనె
తలపున నుండనేల తానె సంతాప మూని
కులపతి యగు చెలువము చూపుమా శఠకోప మౌని
అలర శేషాచల తిలక నృసింహార్య డాపరాని
బలు[పేమ నిచ్చిన పని చూపుమా కలి పాపబూని
స్వామి! యీ [ప్రకృతితో సంబంధ మిక చాలునయ్యా!

4. మఱింగంటి నరసింహాచార్యుల వారివద్ద (మానుకోట) లభించినవి. (4, 5 నెం.) అప్పల దేశిక (ద్వితీయ) రచన :

హృదయా! నా విన్నపం
ఆదుటు కలుష రుచి వదలి వినగదవే
ఈ మేను తానని [భమసి మోహము బూదు
సోమరి పనులకే సొలసి కేవల
భావ తాపములకు తరివలచీ
కామ దాస్యత మరులు గొనుట మేలగునే - ఓ
హృదయా! నా విన్నపం

పరతత్త్వ నిర్ణయ మెరిగి సాత్త్విక జన
వరులతో సంగతి గల్గి పూర్వుం
గారి మరిగి వేరొక చింత దొలగి
పరమ విజ్ఞాన సంపద లభించగలేవా!
హృదయా! నా విన్నపం

అలరు శేషాచల పతికి మేలైన ముద్దుగుల్కు
శరకోపయతికి పొన్నడియై శోభిల్లు
రామానుజ యతికి
వెలలేని దాస్యము విడువక చేయవే
హృదయా ! నా విన్నపం-

5. రావె నా ప్రాణ ధనమా
కేవల దయా సార భావనా- రావె నా ప్రాణ ధనమా!
కలుష విఖండన కుల మణి మండన
ఫలహిత పదయోగి తిలకా- రావె నా ప్రాణ ధనమా!
పరభయ మోచన
పరమ విలోచన రావె నా ప్రాణ ధనమా!
గురుజనతాహార తరళా
అజడిమ రామానుజ హిమ ధామా
నిజపద శేషాద్రి నిలయా! రావె నా ప్రాణ ధనమా!

## 4. ఆచార్య ప్రశస్తి :

1. శ్రీమాన్ రంగ కృష్ణమాచార్యుల రచన. దీనిలో శ్రీవైష్ణవము, ఆచార్య ప్రభావము గూర్చి చెప్పబడినది.

మతములలో ఇది మేలు మత మండీ - రామానుజార్యుల
హితవు చెందిన వారి స్థితి యండీ
సతత భాగవ తార్చనంబులు సలిపి ప్రతిపత్తిని ఘటించిన
అలి వినోదానంద పదవి ప్రత్యహము గాంచెద రంచు నెంచెద
మతములలో ఇది మేలు మత మండీ!

ఉడయవరు తిరువడి గళే శరణ మనుకొనవె మనసా!
తడయకను ఆచార్య వరులకు శరణం
బడియెనికి గతిగా దలంచుచు
పుడమి చేతన వర్గములు హరి
కడకు చేరెద రంచు తెలిపిరి
విడువ తగ దిది విమతులార!
మతములలో ఇది మేలు మత మండీ...

పట్టిమాటలు గావు నిజముంటే - ఆచార్య వచులే
పట్టుకొమ్మని బల్కె హరి యంటి
గట్టిగా తిరుమంత్ర రాజము కన్న లేదు జగత్త్రయంబున
గుట్టు గురువరు చేత తెలిసిన గూఢ విక మాయలు గనండి
మతములలో ఇది మేలు మత మండి...

సాధనాంశము లెల్ల విడువండీ - విఖ్యాతమైన
సార మిది యని మదిని తెలియండి
ఆదరంబున పంచ సంస్కా-
రాదు లందిన వారి చెంతకు
పోదగిన్ వల దనుచు యమగను
బోధ శ్రీ భాగవతము వినుమా!
మతములలో ఇది మేలు మత మండి...

న్యాయమని నమ్మంగ వలెనండీ - శ్రీ వైష్ణవాళిని
పాయకను సేవింప వలెనండీ
మాయ సంసారాబ్ధి పడి యు
పాయ మెరుగ రటంచు మద్గురు
నాయకులు దయదెల్పి రీగతి...' (పూర్తిగా లేదు)

అముద్రిత మంగళ హారతులు - వానియందలి విషయము ననుసరించి శ్రీరామ, గోపాల, గోదా, గురుస్తుతి పరములుగా విభజింప నైనవి.

## 1. శ్రీరామాత్మకములు :

వరంగల్లు జిల్లా కుక్కనూరు సీతారామచంద్ర స్వామిని గూర్చి అప్పల దేశికులవారు చెప్పిన యీ మంగళ హారతి ఇమ్మంటిలో శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల పార్థసారథి గారు వ్రాసి పెట్టుకొనినది. వీరి పనూరులు వరదాచార్యుల వారి ద్వారా దీనిని సేకరించితిని.

'మా సీతారాములకు జయ మంగళం - శుభ మంగళం (పల్లవి)
వాస వామర వాసరేశక
భూషణాంగ భృశావనాదులు-(?)
దాసులై కొలువగను మణి సిం
హాసనంబున నొప్పె మురిసెను- మా సీతారాములకు...

ముందు సురవర బృందములు వెగచెంది వంచన మొందగను కను
విందు చేయగ డెందమున నానంద మొందుచునూ.

సందుగొని దశరథ మహీపతి నందనుండై పుట్టి సద్గుణ
కందళిత సుందర తరంగాకలిత మంగళ దివ్యమూర్తికి- మా సీతా...
మున్ను విశ్వామిత్ర ముని తన జన్మమును రక్షించుటకు నా
పన్నుడయి వేడగను తమ్ముని బన్నుకొని చనుచున్-
పన్నుగా తాటకను ద్రుంచి విపన్న యగు నాహల్య శాపము
తన్ని విల్లును విరచి పుడమి కన్నియను పెండ్లాడి మించిన
మా సీతా రాములకు......

దీటుగా భార్గవుని గర్వము గోటి మీట పురిన్ వసించి వ
నాటవికి జనకాజ్ఞచే జని నీటు వాటిలగన్
పాటలావృత మైన పంచవటీ తటంబున నిలిచి బాణపు
ప్రేటుతో బంగారు లేడిని వేటడంచిన మేటి కనిశము-
మా సీతా రాములకు......

దీనుడగు నా భాను తనయుని సానువులలో దిరుగ గనుగొని
వానరోత్తము ననుపగను సన్మానమున గలిసీ
హీనుడగు వాలిని వధించియు పూని కపులను గూడి దిశలకు
జానకీ మణి జాడ కనిపిన మానవాధిప మౌని కనిశము-
మా సీతా రాములకు......

పవన తనయుం డతిజవంబున లవణ వారిధి దాటి రావణ
భవనమున సీతను గనుంగొని దివి సురలు పొగడన్
ధవుని యుంగర మొసగి సతి తల దాల్చు మణి చేబూని యక్షయ
జవ మణంచియు దర్శనోక్తులు నలుపగను సంతోష మొందిన
మా సీతా రాములకు......

సేతువును గట్టించి యంటట చేరి భుజబల మందరంగను దు
ర్నీతుఁ డగు దశముఖుని ద్రుంచియు సీతతో గూడి
నూతనోన్నతి జెలఁగి కుక్కూనూరు పల్లె విచిత్ర మంటప
భూతలంబున శేషగిరి పతి బోలె వెలసిన హరికి నిత్యము

మా సీతా రాములకు జయ మంగళం - శుభ మంగళం!

2. నృసింహ దేశికులవారు నరసింహాపురం శ్రీరామచంద్ర స్వామిని గూర్చి చెప్పినది:

మంగళ మని పాడరే చెలులు రఘుపుంగవు గొనియాడరె (పల్లవి)
రంగదలఘు తరాంగజాయత భంగకర నీలాంగ రుచికీ - వి
హంగ పుంగవ భవ్య దివ్య శతాంగుఁడైన రథాంగ పాణికి
మంగళ మని పాడరే......

దశరథ గర్భజుఁడై భూసుర జనాభ్యసిత సకల విదుఁడై
కుశిక సుత మఖ విఘట కర లస దసుర విసరము గూల్చి సీతా
శశిముఖిని జేకొనియు భార్గవు వశని జేసిన విశద యశునకు
మంగళ మని పాడరే......

జనకుని యనుమతినీ దండకావనమున మునితతినీ
కనులచే నభయ ప్రదానంబున చతుర్దశ పూర్ణ దశ శత
దనుజులను దనుమాడి తరుభంజక శరంబున వాలి గూల్చెను
మంగళ మని పాడరే......

భూమిరుట్చర సఖుఁడై లంకాపుర ధామున కభిముఖుఁడై
భీమ రావణు గూల్చి సీతారాముఁడై సాకేత మేలుచు
ప్రేమ మలర నృసింహ గురుమణి ధీమణికి సిరు లొసఁగు శౌరికి
మంగళ మని పాడరె చెలులు రఘుపుంగవు గొనియాడరే!

8. అప్పల దేశికుల పౌత్రులైన అప్పల దేశికులు (1800-1870) వేదాద్రి నరసింహస్వామిని గూర్చి చెప్పినట్లు ప్రచారమున గల యీ మంగళ హారతి దుమ్ముగూడెం రామాచార్యుల వారు (కాణిక) వ్రాసి పంపిరి.

మంగళం శుభమంగళం - (పల్లవి)
శృంగార సీతాలింగితాంగునకు భూమ దీక్షా కృతమునివర సాధ్వరపూర్తికి
విగలార్తికి - సోమార్క తారేశ సురుచిం కీర్తికి
మంగళం శుభ మంగళం.

కుటిల రాక్షస వార సంభినీ ధర శరకోటికి, సుగుణ పేటికి
పటుతర తనుతత భావజ కోటికి మంగళం శుభ మంగళం.

వరలక్ష్మణానీత ఖర శర భంజిత శరధికి - దాశరథికి
సరభస రణ రంగ సంభ్రమ శరధికి మంగళం శుభ మంగళం.

మానిత మౌనీంద్ర మానస కమలాంశు మాలికి - ఖిశ వాలికి
భాను తనూజావన పాప నిర్మూలికి మంగళం శుభ మంగళం.

భూరి కృపాయుత నారసింహాఖ్య శరీరికి - మటి హారికి
చారు వేదాచలం సౌధ విహారికి మంగళం శుభ మంగళం

## 2. గోపాలాత్మకములు :

1. నరసింహాపురం రామాలయము ప్రహరీ గోడ వెనుక భాగమున గల శ్రీ రంగ నాయక స్వామిని నరసింహ దేశికుల వారు ప్రతిష్ఠించి దేవాలయమును నిర్మింప చేసిరి. ఇచట మూర్తి శయ్యాగతుడు కాక నిల్చొనిన విగ్రహము. దేశికుల వారీ స్వామిని రంగ కృష్ణ స్వామి అని పేరిడిరి. ఆ స్వామిపై అప్పల దేశికుల వారు చెప్పినది :

రంగ శృంగా రాంతరంగ నరసింహపుర రంగ కృష్ణ స్వామికి - మీ రంగనలు రంగకు నివాళియరే (పల్లవి)

చంద్ర నాసా పేశికి స్మిత ధూత చంద్ర భూషా పాళికీ
చంద్ర ముఖ దీధితికి చంద్ర కాటి ధృతికి చంద్ర కాంచిత మౌళికీ
మీ రంగనలు రంగకు నివాళీయరే!

ఖండ పచన స్ఫూర్తికీ, సదా శ్రీఖండ రూషిత మూర్తికీ
ఖండ పరశు స్ఫటిక ఖండ బిస కుండలాఖండ లాగమ కీర్తికీ
మీ రంగనలు రంగకు నివాళీయరే!

శేషశైల విహారికీ, కస్తూరీ విశేష సుమహో హారికీ
శేష పరతంత్రతాశేష భూషాప్పుల విశేషజ్ఞ మణి హారికీ
రంగ శృంగాగాంతరంగ నరసింహాపుర రంగకృష్ణ స్వామికీ - మీ
రంగనలు రంగకు నివాళీయరే!

2. సూర్యాపేట వేణుగోపాల స్వామి వారిని గూర్చి రాఘవ దేశికులు (అప్పల దేశికుల పౌత్రులు) చెప్పినది :

మంగళము భానుపుర మందిర విహారునకు
మంగళము సౌందర్య మారునకును,
మంగళము రుక్మిణీ మణి మణీహారునకు
మంగళము యాదవ కుమారునకును,
జయ మంగళం నిత్య శుభ మంగళం జయతు జయ మంగళం
మహోత్సవ మంగళం! (పల్లవి)

బిస కుసుమ రసము సరి మెసంగ ముసిరెడి
ఘనం విసరమున సుఖ సరణి మిసిమి సరులున్
బొసకసంగ వెసగ నసమ సుమశర సమర రస
మొసంగె వసతుం సచుం నొందు హారికి -
జయ మంగళం...

కసి మసగి మసలి యాసమున శ్వాసకమును
విసరి ముసురు నసురాగ్రసరుం డెచ్చన్,
హసియించి శిఖరి కేల సవరించి సరిగ పెం
పెసలొందు రసిక గోపీ సఖునకు -
జయ మంగళం...

రసన విసము సుడిబలుదొసగ కుసకపు పాము
గ్రసియింప వెసనొంచి ఓళల యశముల్
వసియింప నసురాసువసువుల నెడల్చి సం
తసమందు పసిగాపు దైవమునకు -

జయ మంగళం...

పసపు పసరు సరములు పసిమి సిరి వసనమును
లసియింప సరవి నుల్లసను మొలచుస
వెస వృషగిరి సురంగ రసను సర్వాపథ ని
శ్వసనీయ వేంకటేశ్వర సమునకు -
జయ మంగళం నిత్య శుభ మంగళం
జయతు జయ మంగళం - మహోత్సవ మంగళమ్ !

8. అరిపిరాల వేణుగోపాల స్వామి వారిని గూర్చి వేంకట దేశికులు చెప్పిన దని మణవాళాచార్యులు గారు చదువగా 'నోట్' చేసికొనినది :

మంగళ మొసంగరె చెలంగి మీ
రంగనలు పొంగి యదు పుంగవుని
శృంగారమును గనుగొనుచు మంగళ మొసంగరె...

యాతాకతి భీతి నిడు జాతి వైరిత్వదని
చేతో మృదు చేతు నన పూతన విఘాతునకు

మంగళ మొసంగరె...

ఎన్నారని మన్ననల బన్ని గొల్ల కన్నియం
వన్నె చిన్నె లన్ని నెలకొన్న చిన్ని వెన్నునకు

మంగళ మొసంగరె...

ముద్దరల యొద్ద చేరి యొద్దికను దిద్ది కసి
కొద్ది తన బుద్ధి తీర ముద్దులిడు గద్దరికి

మంగళ మొసంగరె...

చాల వృషశైల పతి వలె మన నేలు అరిపి
రాల పరిపాలుర దగు బాల గోపాలునకు
మంగళ మొసంగరె చెలంగి మీ రంగనలు పొంగి యదు పుంగవుని...

## 3. గోదాత్మకములు :

1. నరసింహాపురమున గోదాదేవిని ప్రతిష్ఠించిన నరసింహ దేశికులు ఆమెను గూర్చి చెప్పినది—

అంగజుని గన్న శృంగారిణికి జయ మంగళం శుభ మంగళం
ధనువున కటకమునను పూర్వ ఫల్గుణి దినమున తులసీ
వనమున జనియించిన విష్ణుచిత్తు నందనికి -

జయ మంగళం...

పెంపుల ముప్పిరి వాడిన చక్కని బోటికి, సుగుణ పేటికి
తేట మాటల సుధ తెల్పు వధూటికి -

మంగళం జయ మంగళం...

వనశేషుని చక్కదనముకె మోహించు బాలకు, సుగుణ జాలకు -
ఘన వత్సలాంభోధి వినయ ప్రశీలకు -

మంగళం జయ మంగళం...

ముడిచిన విరివంప లిడి శౌరి కనిపిన రేమకు - శ్రీ లలామకు
పుడమి క్రూరుల దోష మడరంచు భామకు -

మంగళం జయ మంగళం...

ధరణి శ్రీ నరసింహ నగరి నున్న వదాన్యకు - గుణ ధన్యకు
వర మఱింగంటి నృహరి గురు మాన్యకు

మంగళం జయ మంగళం...

శృంగార వృష శైల శృంగాంగణ శుక వాణికి - నీల వేణికి
అంగజుని గన్న శృంగారిణికి జయ మంగళమ్
శుభ మంగళమ్ !

2. ధర్మగిరి లాలూరా ఇంగిరాల గోదాదేవిని గూర్చి అప్పల దేశికులు చెప్పిన మంగళ హారతి :

శ్రీమాన్ నల్దిగ శ్రీనివాసాచార్యుల (ఇంగిరాల) ద్వారా సేకరించినది :

ఇంగిరాల పుర గోదాదేవికి యివ్వరె నివ్వాళి
ఇంగిరాల బంగారు ఛంగి మన కిడునటె నివ్వాళి ! (పల్లవి)

దూర్వార తులసీ వనోర్వార కర్కాట
పూర్వ ఫల్గుణి యందు పుట్టి
సర్వ నిర్వాహకుని యందు
గీర్వాణ మొనరించు గీర్వాణ ముని భట్ట
సార్వ భౌముని ముద్దు చక్కని పట్టికి

ఇందిరాల పుర గోదాదేవికి...

వెన్నగు నప్పిన్న చన్నులపై బన్న
వెన్న దిన్న వెన్నునీ - సన్నుతింప నున్న సుప్రసన్నునీ
పన్నుగా సిరాడి తిన్నని భోగ సం
పన్ను నిగా వాని చన్నీన కన్నెకు -

ఇందిరాల పుర గోదాదేవికి...

మాటికీ నమృతంపు తేటల ముప్పది
పాటలా పాడుచునూ అల్ల గొల్ల
బోటుల గూడుచునూ
సీటుగా గోపాల పాటల గంధియై
మేటి నోము నోచు సిరద పాణికి -

ఇందిరాల పుర గోదాదేవికి...

రంగుగ మన్నారు రంగడు గరుడ తు
రంగుఁడై పరతెంచి పెండ్లాడిన
రంగుబాడిని గాంచి.........
బొంగి శేషగిరి పుంగవు కీర్తన
లంగీకరించి చెలంగు శుభాంగికి
ఇందిరాల పుర గోదాదేవికి యివ్వరె నివ్వాళి
ఇందిరా లతాంగి భంగి మన కీడునటె నివ్వాళి !

## 4. గురు పరంపర :

విశిష్టాద్వైతము నందు ముఖ్యులైన వారిని గూర్చి చెప్పబడిన యీ మంగళ హారతి నృసింహ దేశికుల రచన యని ప్రతీతి!

చెంగటను జెలంగుచున్న శేషగిరి రమాధవునకు
మంగళ మనరమ్మా మీరు మగువలార। (పల్లవి)

శ్రీ రమణ రమా చమూ ధురీణ కారిసూను నాథ
సీరజాక్ష రామ యామునేయ మహా పూర్ణులకును -
మంగళ మనరమ్మా......

భాష్యకార గోవింద భట్ట మాధవ కలిఘ్న
శిష్య కృష్ణ లోకదేశిక వరులకును -
మంగళ మనరమ్మా......

శౌరి రాడ్యతీశ భాష్యకార రామ సహజ పూర్ణ
నారసింహ గోవింద నామ శ్రీ శఠారులకును -
మంగళ మనరమ్మా......

స్వామి రామ సహజ నృహరి వర్యులకు తదంఘ్రి భక్తి
సీమ మెగుచు మమ్ము నేలు శ్రీనివాస దేశికులకును
మంగళ మనరమ్మా......

శ్రీనివాస దేశిక ప్రసిద్ధ పాద పద్మములను
పూని మది ధరించినట్టి పూరుషోత్తములకు - నిత్య మంగళం.
చెంగటను చెలంగుచున్న శేషగిరి రమాధవునకు
మంగళ మనరమ్మా। మీరు మగువలార!

శ్రీ వైష్ణవుల నిత్యానుసంధన శ్లోకములలో నొకటైన యిది పై మంగళ హారతికి మూలము :

'అస్మద్దేశిక మస్మదీయ పరమాచార్యా నశేషాన్ గురూన్
శ్రీ మల్లక్ష్మణ యోగిపుంగవ మహాపూర్ణం మునిం యామునమ్।
రామం పద్మ విలోచనం మునివరం నాథం శఠద్వేషిణమ్
సేనేశం శ్రియ మిందిరా సహచరం నారాయణం సంశ్రయే'॥

# అగ్రహార భూదాన పత్రములు

## నారసింహాపు రాగ్రహార దాన పత్రము :

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు ౧౬౧౦ అగు నేటి వర్తమాన వ్యావహారిక చాంద్రమాన ప్లవంగ నామ సంవత్సర మాఘ శు. ౨ లు శ్రీమ ద్వైదమార్గ ప్రతిష్ఠాపనాచా ర్యోభయ వేదాంత ప్రవర్తకు లయిన శ్రీమాన్ మణింగంటి అప్పలాచార్ల అయ్యావార్లం గారికి కేసర నర్సింహ్వారావు దేశముఖు ప॥ మునగాల గారు వ్రాయించి యిచ్చిన భూదాన పత్రిక. స్న ౧౧౯౨ ఫసిల్ తిరుమాళిఘ కయింకర్యం గడియ గలందులకు స్వాస్థ్యము సమర్పించ వల్సిన దని ఆనతి స్థిరి గనుక మా తాలూకాలో మ॥ అకుపాముల శివారులో తూర్పు దిక్కున మారకమ్మ చేను బాడువను వెల్లడి భూమిన్నీ మ॥ (మౌజే) కొమరుబండ శివారులో వూరికి దక్షిణముగా గండి బోయిన శనగకుంట, ఆకుంట వెన్క వరిమడిన్నీ హద్దులు ఏర్పరిచి ఖంద్రిక ఏర్పరిచి సమర్పిస్తిమి, సదరహి యిప్పించిన భూమిలో నరసింహాపుర మనే గ్రామం కట్టించుకొని కుంట్టగండి వేయించి మరమ్మతు చేయించుకొని వెల్లడి వరి మడిన్నీ ఫలపర్చుకొని ప్రతి సంవత్సరం అందుల ఫలం మీ పుత్ర పౌత్ర పారంపర్యము అనుభవిస్తూ సుఖంగా వేంచేసి వుండవల్సినది. యిందుకు హద్దులు:

తూర్పున-కోదాటి పొలిమెర
దక్షిణానికి-చిల్కూరి పొలిమెర
పడమటికి-మారకమ్మ చేను బీడు గట్టు
చాయను చాకలివాని కుంట వుత్తరపు
కొమ్మన్న ముష్టిచెట్టు వుత్తరానకు శనగకుంట

వెన్క చాదువను చింతచెట్టు ఖాని హద్దుగా
యీశాన్యముగా వున్న మోదుగుచెట్టు హద్దుగా
తూర్పున చిలుకూరు బాటను వున్న తొక్కుడుబండ
యీ ప్రకారంగా హద్దులు నిర్ణయం
చేయించి సమర్పించిన భూదాన పత్రిక.

స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం।
అన్యద త్తాపహారేణ స్వ దత్తం నిష్ఫలం భవేత్॥

దస్తూరి రావులపాటి హరే రాముడు
సం॥...కీసర నరసింహ్వారాయడు
తేదీ సదర్ (ఫార్సీ ముద్ర కలదు)

6-6-1860వ తేదీన అప్పటి డిప్యూటి కలెక్టర్ (కృష్ణాజిల్లా) దీనిని ఖాయం చేయగా, 7-11-1860వ తేదీన ఇనాం కమీషనర్ ధ్రువపరచెను.

దానపత్రం అసల్ ప్రతి హైదరాబాదులో మఱింగంటి రంగాచార్యుల వారి వద్ద కలదు (వీరిది నరసింహాపురం). నఖల్ ప్రతి నరసింహాపుర దేవాలయ అర్చకులు ముడుంబ రామ నరసింహాచార్యుల వారి వద్ద లభించినది. ఇనాం ఖాయపరచిన కాగితాలు కూడ నరసింహాపురంలోనే లభించినవి.

## వెల్పుగొండ వారి దానపత్రము :

స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షంబులు ౧౭౭౭ అగు నేటి వర్తమాన వ్యావహారిక చంద్రమాస రక్తాక్షి నామ సంవత్సర మాఘ బ ౩॥ గురువారం నాడు శ్రీసుద్వేదసూగర ప్రతిష్ఠాపనాచార్యులయిన శ్రీమాన్ మఱింగంటి అప్పలాచార్యుల అయ్యవార్లం గారికి వీరారెడ్డి చన్న కృష్ణారెడ్డి దేశముఖు వ॥ వెల్పుకొండ వ్రాయించి సమర్పించిన అగ్రహార పత్రిక. మా తాలూకాలో శ్రీ వుత్సవం కైంకర్యం నిమిత్తం అగ్రహారం కావలెనని అనతిస్తిరి గనక ఆ ప్రకారంగా నేహ...............అనె మవుజె గ్రామం అగ్రహారం క్లుప్తరి. ప్రతి సంవత్సరం అవతారం పత్రాలు దివాణములో యిప్పించేటట్టు యేపాటు చేశి సమర్పిస్తిమి. గ్రామం......ఆత్మ పుత్ర పౌత్ర పారంపర్యా యిందుల వచ్చిన ఫలం వుత్స(వ) వదీయారాధన కాసక విధియుస్తు ప్రతి సంవత్సరం మీద వ్రాసిన నిబంధన వరాడ అయిన......మంగళాశాసనం యిస్తు......

యే భూమిపా స్సతత ముజ్జ్వల ధర్మ చిత్తాః మద్వంశజాః
పర మహీపతి వంశజా వా తద్ధర్మ మేవ సతతం పరిపాల
యంతి తత్పాదుకా ద్వయ మహం శిరసా నమామి. దాన
పాలనయో ర్మధ్యే దానా.........
గ్గా మాప్నోతి పాలనా పదం
ద॥ వీరారెడ్డి చన్న కృష్ణారెడ్డి దేశ
ముఖు వ॥ వేల్పుగొండ
(పార్సీ మొహరు కలదు)

దానపత్రం మధ్య విషయమునకు కుడిపైపు మార్జిన్‌లో
ద॥ నెల్లుట్ల కోనేటిరావు, వృత్తరాజు
రామయ్య, నెల్లుట్ల నర్సింగరావు, దేశపాండ్య
మ॥ వేల్పుకొండ,— అనియున్నది.

---

నోట్: నరసింహాపుర దానపత్రము తర్వాత 17 సంవత్సరములకు ఈ దాన పత్రము వచ్చినది.
దీని అసలు ప్రతి మిర్యాలగూడెంలో మఠింగంటి యాదగిరాచార్యుల వారి వద్ద కలదు. దాని కిది నకలు.

నోట్: ఈ దాన పత్రము పై భాగమున కుడిప్రక్కగా 'నృశింహ్వాపురం చక్రవర్తి తిరుమహనారు' అని కలదు.

## రిజిష్టర్ నెం. 15 యినాముల రిజిష్టరు. ఊరి పేరు : ఆకుపాముల, నందిగామ తాలూకా, కృష్ణా డిష్ట్రిక్టు

పరిమాణము, తరగతి,మరియు యినాము ఖరీదు, యినాము యొక్క తప్సీలు వగైరాలు, మరియు యినాముకు హక్కు అయిన దస్తావేజు, ప్రథమములో యిచ్చినవారి పేరు, ప్రస్తుతం పట్టీకవారి పేర్లు వగైరా తెల్పునది.

| కేసు నెంబరు లేక యావత్తు హోల్డింగ్ క్రింద నెంబరు గ్రామంలోనిది | ఇనాం చెందేటు వంటి జనరల్ క్లాసు | సర్వే నెంబరులో గ్రాంటుతో కూడియున్న హెంము లేక హెలములు, మెరక, పల్లం, లేక తోట | పరిమితి: లోకలు కొల్త యెకరాలు గుంట్లు అణాలలో యున్నప్పటికి ఈ కాలంలో చేర్చవలెను. | పరిమితి: ఇంగ్లీషు కొల్త యెకరాలు డెసిమల్సు | సర్వదామిలా సిస్తు: సర్వే చేయబడక గవర్నమెంటువల్ల సిస్తు ఏర్పరచబడినట్లయితే ఆ మోస్తరు గవర్నమెంటు భూమిమీద సరాసరి అసెస్సుమెంట్ మీద యినాందారుకు రైతు చెల్లించే సెస్సు | | యినాం తప్సీలు: నౌకరికిచ్చినట్లయితే ఆ నౌకరి జరుగుచున్నది లేనిది చెప్పవలెను. చెరువు యిండ్లకు అయినట్లయితే అది మంచి స్థితిలో యుంచబడినది |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 1 | | మెరక గుడికట్టు | 2-0-0 | 42-44 | 21-4-0 | | భటవృత్తి |
| | స్వంతం | పల్లం గుడికట్టు | 4-0-0 | 16-96 | యి 1కి 0-8-0 చాద | | |

షరా:- ఆకుపాముల కొమరబండకు చెందే పల్లం మెర్కభూములయొక్క కొంతభాగం యిచ్చిన హద్దులలో అగ్రహారం కట్టుటకు కూడాను మెర్కభూమిలో కొంతభాగం పల్లంలోకి మార్చబడెను.

| సెన్సు లేకుండా అనగా సర్వ ముంబాలావగైరా లేక క్విటురెంటు ఇచ్చు పద్ధతిని మీదనా, బొడ కట్టుబండ బేడి కము మొదలైనవి ఇందులో తెల్పవలెను | వంశపరం పరా లేక జీవితం వరకా ఒకటా లేక రెండా లేక ఎన్నవ జీవితముల వరకా | ఎవరివల్ల ఇవ్వబడి నది. యే సంవత్స రములో | హక్కుదారు విషయములో దాఖలా యుండే వ్రాతరూపక మైనటువంటి కాగితములో ప్రథమంలో వున్న సనదు లేక ఇతరములను గురించిన కాగితములు యీ కాలంలో ఇనాము ఎవరిచేత ఇవ్వబడినదా లేదా చూపవలెను. అందుకు దాఖలాగా తీసుక్కున్న చూపించబడినదా లేక............చూపిన దస్తావేజులలో చెప్పబడిన యావత్తు సంగతులు తెలుపవలెను. | ప్రథ మంలో పట్టిన వారి పేరు | పర్మినెంటు సెటిల్ మెంట్ అక్కవుం టులో రెజిష్టరయిన పేరు, ఆ ఉదాహ రించినవారికిన్ని మొదటివారికిన్ని ఉన్న సంబంధము | సర్వేలోచేర్చిన పేరు లేక పర్మిలా అక్కౌంటులో చేర్చిన పేరు వారికి, వెనుక వారికి వున్న సంబంధము |
|---|---|---|---|---|---|---|
| 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
| స్వేచ్ఛగా | వంశపరం పరగా | కేసర నరసింహారావు దేశముఖు సన్ 1197 ఫసల్ AD1787 సంవత్సరం | సనదు 1 | | మరింగంటి అప్పలాచార్యులు (స్వచ్ఛంగా కనబడటంలేదు) మరింగంటి అప్పలాచార్యులు సేరపల్లం 4 కత్తులు 1204 ఫసలీలో కొమరబండ క్రింద ఒక భాగమున యినాము చేర్చబడినది. | ఫసిలీ 1232 అప్పలాచార్యులు శేరిపల్లం 4 కత్తు శ్రీనివాసాచార్యులు మనుమడు మెర్క 2 కత్తులుగా ఇవ్వబడినది. |

| పేరు వయస్సు | కాపురస్థులు | ప్రథమం పట్టిన వారితో సంబంధం లేక దర్మిళావచ్చిన వారితో సంబంధం | ఇప్పుడున్న వారికి కాబోయే హక్కుదార్లు | మొట్టమొదటివారితో సంబంధం లేనియెడల సంబంధం ఎలా వచ్చినది? ఏ సంవత్సరం? | రిమార్కులో యిదివరలో అంతరించినట్టుగా రిపోర్టు చేయబడిన ప్రతిదానికిన్నీ గవర్నమెంటు ఆర్డరు అఫ్రూవల్సు యీ కాలంలో చూపించవలెను. డిప్యూటీ కలెక్టర్ అభిప్రాయం. సిఫారసు | యినాము కమీషనర్ తీర్పు లేక వారి యొక్క అసిస్టెంట్లు |
|---|---|---|---|---|---|---|
| 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 1. మడింగంటి నరసింహాచార్యులు (60) | | మనుమడు<br>పెద్దమనుమడు | కొడుకులు 2<br>భార్య 1 | అన్యాక్రాంతంలేదు. వంశంభాగములయినది. ఇనాములు కూడా విభజనమైనవి. | $\frac{1}{8}$ వంతు క్విటురెంటుగా రూ. 10-0-0 ఇప్పటకు వీరు ఒప్పుకున్నారు గాన ప్రస్తుతం వున్న భూకా | ఖాయపర్చడ మైనది. ఆక్టింగ్ స్పెషల్ |
| 2. వెంకటనరసింహాచార్యులు (70) | | మనుమడు | కొడుకులు 2<br>కొడుకు 1 | యీ యినాంమీద వచ్చే అయివజు | మందులకు శాశ్వతముగా గ్రాంటు చేయబడినది. | అసిస్టెంట్ యినాం కమీషనర్ |
| 3. వెంకట రాఘవాచార్యులు (45) | | మనుమడు | చినతమ్ముడు 1 | | | |

క్రిందిటి పుట తరువాయి

| 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
|---|---|---|---|---|---|---|
| 4. చినరామవాచార్యులు (35) | | | భార్య<br>కొడుకులు 2<br>తమ్ముడు 1 | కోదండరామస్వామి నరసింహాపురం వారి గుడికి సమర్పించు చున్నాము. | (సంతకం)<br>యం. వెంకటరత్నం<br>డిప్యూటీ కలెక్టర్<br>6-6-1860 | ఎ. శేషయ్య<br>7-11-'860<br>టైటిల్ డీడు<br>నెం. 213<br>నిజమైనది. |

1860 క్రీ. శ. నాటికి-తరువాత కొంతకాలమువరకు అనగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడువరకు ఈ అగ్రహారప్రాంతం, అకుపాముల మొదలైన గ్రామాలు కృష్ణాజిల్లాలో చేరియుండెను.

# మల్లింగంటివారి కృతులలో పేర్కొనబడిన గ్రామములు

## 1. అజమాపురము :

నల్లగొండ జిల్లా దేవరకొండ తాలూకా పెద్ద అడిశర్లపల్లి మండలములో నున్న యీ గ్రామము, **'పణికరాజుపల్లి'** కలిసి పైపేరున వ్యవహరింపబడు చున్నది. అజమాపురముగా ఎప్పుడు ఎందుకు మారినది తెలియదు (వివరములకు చూ. పణికరాజుపల్లి).

వేంకట నరసింహాచార్య కవి **జాంబవతీ కుమార శృంగార విలాసము** (1-38), **నృకంఠీరవాభ్యుదయము** (1-33)ల యందు ఈ గ్రామము పేర్కొనబడినది.

## 2. అనంతగిరి :

నల్లగొండ జిల్లా **"కోదాడు"** సమీపమునందు వెలసిన యీ గ్రామము చరిత్ర ప్రసిద్ధమైనది. ఇచటి పర్వతముపై శిథిలమైన దుర్గావశేషములు కలవు. గ్రామమున ఎన్నియో జీర్ణ దేవాలయములు కన్పడును. శ్రీకృష్ణదేవరాయలు పూర్వ దిగ్విజయ యాత్రలో ఈ దుర్గమును జయించినాడు. తిరుపతి శాసనము (నెం. 80) నందును, పిమ్మన పారిజాతాపహరణ మందును (1-28) ఈ విషయము కలదు.

అబ్దుల్లా కుతుబ్‌షా (1626-1672) ఈ గిరి దుర్గముపై విడిది చేసి సంతసించినట్లు నిజాముద్దీన్ కవి రచించిన **'హదీ ఉకతుల్ సలాతీన్'** అను పారసీక గ్రంథమువలన తెలియుచున్నది (చూ-**నల్లగొండ మండల సర్వస్వము** 371-72 వ పు. **ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము**-388 వ పుట)

శతఘంటావధాని సింగరాచార్యుల వారి తండ్రి ఆ నాడు ఈ గ్రామమున గల విష్ణ్వాలయము (వేణుగోపాల స్వామి నుద్ధరించి సంప్రోక్షణాదుల గావించి అర్చనలు జరుగునట్లు చేసినాడని **శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతా కల్యాణము-56, నృకం......1-37** ల యందు కలదు

## 3. ఆవంచ :

మహబూబు నగరం జిల్లా **తిమ్మాజిపేట** మండలములో నున్న యీ గ్రామము ఒకప్పుడు **'ఆవంచ సీమ'**కు కేంద్ర స్థానము. దీని పరిధి విస్తృత మైనది. నేటి **'గంగాపురము'** ఆ నాడు **'ఆవంచ సీమ'** క్రింద నుండెడిది. మణింగంటి వారికి ఇచట అగ్రహార మున్నట్లు, దాని ననుభవించుచు గంగాపుర దేవాలయమునకు స్థానాచార్యత్వము వహించిరట్లు **'నృకంఠీర వాఖ్యదేవము** (1-29) న కలదు.

(ఆవంచ ప్రాచీనతా విశేషముల గూర్చి 1976 మార్చి 'భారతి'లో కపిల వాయి లింగమూర్తి గారి వ్యాసము కలదు).

## 4. ఊరుగొండ :

ఈ పేరు గల గ్రామములు మహబూబునగరం, నల్లగొండ జిల్లాలలో కలవు. మహబూబ్‌నగరం జిల్లా కల్వకుర్తి తాలూకాలో గల యీ గ్రామమున గోలకొండ కుతుబ్షాహీలు ప్రతిష్ఠించిన ఎత్తైన ఆంజనేయ స్వామి విగ్రహ మున్నది, కొండపై గల యీ మూర్తికి అర్చనలు జరుగును.

నల్లగొండ జిల్లా మోతె మండలము కరక్కాయల గూడెము దగ్గర గల పెద్ద పర్వతమునకు **'ఉర్లుగొండ'**, **'ఊరుగొండ'** అని పేర్లున్నవి. పర్వతాగ్ర మున నృసింహస్వామి వెలసినాడు. ప్రతి వత్సరము ఫాల్గుణ మాసమున ఉత్సవము జరుగును.

సింగరాచార్యుల వారి తండ్రి 'గురురాయ పట్టణ స్థాపకుడై ' సంచరించి-సందర్శించిన దివ్య స్థలములలో **'ఊరుగొండ'** యొకటి. దీని ప్రసక్తి **'...సీతా కల్యాణము'** (1-56) **నృకంఠీ...** (1-37) ల యందు కలదు. (దేవాలయమును గూర్చి - చూ. ఆంధ్రప్రభ, దిన పత్రిక 20-11-1985)

## 5. ఎండబెట్ల :

మహబూబు నగరం జిల్లా నాగర్ కర్నూలు మండలమున గల యీ గ్రామమునకు ప్రాచీన నామము **కిష్టమ్మ పల్లె.** కేసరి సముద్రము (నాగర కర్నూలు చెరువు) వేసిన తరువాత భీమేశ్వర స్వామి పేర భీమేశ్వర మైనది. కొంత కాలమున కిచట నృసింహ స్వామి వెలసినాడు. ఆ స్వామిపై **భక్తితో** కేసరి సముద్రము నరకేసరి సముద్ర మని వ్యవహృతము. అష్ట భుజ నృసింహ విగ్రహము ఈ దేవాలయములోని ఒక ప్రత్యేకత. ప్రక్కనే వెన్నముద్ద చేతి యందు గల కృష్ణ విగ్రహ మున్నది. మొదట నిది కృష్ణాలయ మనియు, తరువాత ఇచట 'నరకేసరిని' ప్రతిష్ఠించి ఇప్పటి చెరువును ఆ స్వామి పేర వేసి నృసింహ పూజల సల్పుచున్నారనియు స్థానికుల కథనము. ఒకనా డిచట యాదవులదే అధికారము, పూజా పద్ధతి తరువాత మారినది. అందుకు నిదర్శ నము కృష్ణ విగ్రహము. ఇచటి భీమేశ్వరాలయమున క్రీ శ 1070 నాటి ఉదయన చోడుని శాసనము కలదు. తిరువేంగళాచార్యులు వారు సేవించి, ఉద్ధరించిన ఆలయములలో నిది యొకటని '... **సీతాకల్యాణము,** (1-56), **నృకంఠీ...**' (1-87) ల యందున్నది.

## 6. ఓ(వా)డపల్లి :

నల్లగొండ జిల్లా దామెర చర్ల మండలములోని యీ గ్రామము కృష్ణానదీ సంగమ యుక్తము. చారిత్రకముగను, దివ్యయాత్రా స్థలముగను ప్రసిద్ధి గాంచినది. ఒక విధముగా ఈ క్షేత్రము శైవ, విష్ణు దేవతా సంగమము.

ఒకనాడు ఇచట కృష్ణ పెద్ద 'ఓడరేవు'. ప్రముఖముగా నావల ద్వారా వ్యాపారము జరుగుచుండెను అందుకే 'ఓడపల్లి' యై జన వ్యవహారమున 'వాడపల్లి'గా మారినది. ఈ ప్రాంతమునకు **బదరికాశ్రమ** మని నామ మున్నట్లు అనవేమారెడ్డి నాటి 'వాడపల్లి శాసనము' (ARHS 1934 - 35) ద్వారా తెలియుచున్నది.

ఇచట అగస్త్యర్షి ప్రతిష్ఠించిన శివుడు అగస్త్యేశ్వరుడుగా ప్రసిద్ధుడు, ప్రాచీన దుర్గములు, అందులో సద్య చిత్రము లభించు. కృష్ణా, మూసీ నదుల సంగమ స్థానమైన యిచట గల నరసింహాలయము ప్రాచీనము, ప్రసిద్ధమైనది. ఈ స్వామి సన్నిధిలోని దీపము నిరంతరము వింతగా వెలుగుచుండును.

వాడపల్లికి కొలది దూరమున గల **'యాదవాకిళ్ళ'**ను ముల్కాపురాం మఱింగంటి వారికి అగ్రహారముగా నొసంగినాడు. ఈ విషయము సిరి రచనం యందు ప్రస్తుతము. ఆ నాడు వీరిలో తిరువేంగళాచార్యుల వారు ఓడపల్లి నరకంఠీరవ కోవెల స్థలిక స్థానాచార్యులుగా నున్నారు. ఈ విషయముంతో పాటు 'ఓడపల్లి' ప్రసక్తి-వెంకట నరసించార్యుల **విష్వక్సేన...**(1-67), **శ్రీరామా...** (1-41), **నృకంఠీ...** (..37), **శ్రీగోదా...** (1-36) గ్రంథముల యందు కలదు. ఆ నాడు నౌకా వ్యాపారము విరివిగా నున్నందు వలననే కవి 'ఓడపల్లి' అనెను (వివరములకు - చూ నల్లగొండ మండల సర్వస్వము).

## 7. కనగల్లు :

నల్లగొండ జిల్లాలో నేడు ఒక మండల కేంద్రముగా నున్న ఈ గ్రామమే మఱింగంటి వారి మొట్టమొదటి కుదురునకు మూలమైనది. ఇచట నుండియే ఈ వంశము వారు వివిధ ప్రాంతములకు వెళ్ళి స్థిరపడినారు ఆసూరి మఱింగంటి శ్రీరంగాచార్యులవారు ఇచట 'తాళపత్ర గ్రంథ నిలయము'ను ఏర్పాటు చేసిరి. 'తాలాంక...' కర్త ఈ గ్రామములోనే నివసించి ప్రబంధ రచన గావించినాడు. ఈయన, కాణికపి తప్ప ఎవరును తమ రచనలలో ఈ గ్రామమును పేర్కొనలేదు. (చూ - **'తాలాంక...'** 5-332, ఇతని చాటువులు).

## 8. కర్పూర :

నల్లగొండ జిల్లా పెద్దవూర మండలములోని సిరిసెనగండ్ల నృసింహస్వామి యున్న పర్వత గుహలకే **'కర్పూర'** మని నామాంతరము. లోపల స్వామి వెలసిన గుహాకృతిని బట్టి పేరు ఇట్లనినారు. కర్పూరాద్రి, కర్పూరాచల నామములు- **'దశరథ**(1,3-40)...' **సీతాకల్యాణము**(1,11-56),' '**నృకంఠీ...**'(1-37), '**శ్రీరంగనాథ...**' ల యందు కలవు. (వివరములకు చూ. సిరిసెనగండ్ల)

## 8. కేశవ పురము :

మహబూబ్‌నగరం జిల్లా ఐడిచర్ల మండలమున గల **'గంగాపురము'**నకిది యొక పేరు. సమీపమున గల నదీ నామముతో గంగాపురము కాగా- ఇచట వెలసిన చెన్న కేశవ స్వామి పేర కేశవపుర మైనది.

వేంకట నరసింహాచార్య కవి తన '**కేశవస్వామి శతకము**'ను ఈ స్వామికే అంకిత మిచ్చి, 'కేశవపుర చెన్నకేశవ శతక' మనెను (ప. 108 - చూ. గంగాపురము).

## 9. గంగాపురము :

చరిత్ర ప్రసిద్ధమైన గ్రామము. ప్రాచీనము లగు కట్టడములు, దేవాయతనము లిచట గలవు. వివిధ కాలములకు చెందిన రాజులు వేయించిన శిలాశాసనములు దాదాపు 10 యున్నవి. ఇవి ప్రకటితములు (చూ. తెలంగాణ శాసనములు).

'గంగాపుర మాహాత్మ్యము' ఈ క్షేత్రమును గూర్చినదే! సురవరం ప్రతాపరెడ్డి గారు ఈ గ్రంథ పీఠికలో అనేక విషయముల తెలుపుచు గంగాపురమునకే '**మాయాపురము**', '**కేశవపురము**' అని నామాంతరము లున్నట్లు ఆధారముల చూపిరి.

గ్రామమునందలి లక్ష్మీ చెన్నకేశవాలయమునకు పూర్వము నుండి ఇప్పటికిని మరింగంటి వారే స్థానాచార్యులు. వీరిది అనుముల - కనగంటి వారి శాఖ. తిరువేంగళాచార్యుల వారు సంచరించి సేవించిన విష్ణు క్షేత్రములలో నిది యొకటని తెలియుచున్నది. (...సీతా...1-56, నృకంఠీ...1-29-37) ఈ గ్రామ వాసులైన చెన్న కృష్ణమాచార్య కవి తన రచనలను గంగాపుర స్వామికే అర్పించెను.

(గంగాపురమును గూర్చి చూ. 1-8-87, 'సమాలోచన' పత్రికలో కపిలవాయి లింగమూర్తి గారి వ్యాసము)

## 10. గణపవరము :

కాకతి గణపతిదేవుని పేర వెలసిన ఈ పేరు గల గ్రామాలు వరంగల్లు, నల్లగొండ, మహబూబ్‌నగరం జిల్లాలలో అధికము. వేంకట నరసింహాచార్య కవి తన **శ్రీరామానుజాభ్యుదయము** (1-42) నందు తెల్పిన యీ ప్రాచీన గ్రామము పెద్ద అడిశర్ల పల్లి మండలములోనిది. ఇచట మిక్కిలి ప్రాత దేవళములు 3

కలవు. గ్రామమునకు ఉత్తరపు వైపు చెరువులో రాతి విగ్రహనములు, శాసన స్తంభములు పడియున్నవి. తూర్పు దిక్కున వేణు గోపాల స్వామి ఆలయము కలదు. కాని విగ్రహము అపహృతము.

సుమారు 20 సంవత్సరములకు పూర్వము కందాళ లక్ష్మణాచార్యుల వారు ఈ గ్రామముతో దొరగారి చెక్కతో గల ఒక దేవాలయమును దాగుచేయించి శ్రీరామ ప్రతిష్ఠ జరిపించినారు.

గణపవరమునకు 5 కి మీ. ల దూరమున గల **'మేడారం'** గ్రామములో 15 ఎకరాల మెట్టభూమి, దానిలో నృసింహాలయము, హనుమ దాలయ ముండి, సేత్వారీలో మఱింగంటి రంగాచార్యుల పేరున గలదు. ఖాస్రా సమయమున దీనిని ఆ గ్రామ కరణము తన పేర వ్రాయించుకొని అనుభవించు చున్నాడు. గణపవరం చెర్వు క్రింద మఱింగంటి వారికి 2 ఎకరాల తరి భూమి కలదు.

ఈ గ్రామములోని దొరలు పద్మనాయకులు. 'కటికనేని' గృహ నామము కలవారు. నేటికిని మఱింగంటి వారి శిష్యులే. వీరే గాక ఇచ్చటి పరకాల రెడ్లు వరంగల్ జిల్లా మునిగలవీటి మఱింగంటి వారికి శిష్యులు.

**శ్రీరామానుజాభ్యుదయ** కర్త తన నాటి వైభవమును పురస్కరించు కొని 'గణపవరము'ను గ్రంథస్థ మొనర్చినాడు.

## 11. గోలకొండ :

హైదరాబాదు నగరమునకు సమీపమున గల యీ గిరి దుర్గము చరిత్ర ప్రసిద్ధి గాంచినది. కాకతీయుల కాలమున నిర్మింపబడిన యీ కోట క్రీ.శ. 1364 ప్రాంతమున బహుమనీ సుల్తానుల వశమై, 1518 లో కులీ కుతుబ్షా వశమై, వీరి రాజధానిగా మారినది. ప్రథమమున దీనికి 'మహమ్మద్‌నగర'మని పేరు. కుతుబ్షాహీల శాసనాలలోను, గోలకొండ రాజుల నాడు వచ్చిన కృతుల యందును, ఇతరుల రచనల యందును గోలకొండ ప్రసక్తమైనది

మఱింగంటి వారితో జగన్నాథాచార్యులు, అప్పలాచార్యులు, సింగరాచార్యులు గోలకొండ ప్రభువైన మల్కిభరామునిచే సన్మానింపబడి అగ్రహా

రాదుల వొందినారు. మఱింగంటి కవులే ఇబ్రహీం కుతుబ్షాను ప్రప్రథమముగా 'మల్కిభరాము'ని చేసినారు. తరువాత ఈ పేరు వ్యాప్తమైనది.

సింగరాచార్యులు ముగ్గురు రాజులచేత మెప్పు అందినట్లు కలదు కాని, ఆయన గోలకొండ రాజుల ప్రసక్తిని చేయలేదు. **'శ్రీరంగనాథ……', 'నృకంఠీ…'** (1.40)ల యందు గోలకొండ పేర్కొనబడినది.

## 12. చెన్నయ పాలెము :

ఈ పేరు గల గ్రామములు నల్లగొండ జిల్లా యందు రెండు కలవు. ఇది **మఠంపల్లి** మండలములోనిది.

**వాడపల్లి, మట్టపల్లి** నరసింహ క్షేత్రములు. ఇచటి కనతి దూరమున నుండును. వేంకట నరసింహాచార్య కవి తెల్పిన **'చెన్నయ పాలెం'** మిర్యాల గూడెం తాలూకా, కృష్ణాతీరము. అని ఇది **'తంగెడ సీమ' లో చేరి యుండెను.** రామరాజు దేశాయి గారు తమ కిచట అగ్రహార మిచ్చినట్లు **జాంబవతీ కుమార శృంగార విలాసము** (1.46)న తెల్పబడినది.

## 13. జూపల్లి :

మహబూబ్ నగరం జిల్లా వంగూరు మండలములో గల యీ గ్రామమున 'రంగినేని' గృహనామము గల పద్మనాయకులు ఒకనాడు దొరతనము నెరపిన వారు. మఱింగంటి వారి శిష్యుల పంపకములో వీరు ఐదవ నరసింహాచార్యుల (సూర్యాపేట) విభాగమున చేరి, గురుభక్తితో ఆచార్యుల వారి గ్రంథములలో కొన్నిటిని ముద్రింపకొనుటకు ఎంతగానో తోడ్పడినారు. నేటికిని వీరందరును విశిష్టాద్వైత సంప్రదాయమునే అనుసరించి మఱింగంటి వారి శిష్యులుగనే యున్నారు (వీరి వంశ ప్రశస్తి, వివరములు వేంకట నరసింహాచార్యుల వారి కృతులందు కలవు)

## 14. తంగెడ :

కృష్ణానది కావలి తీర గ్రామము. గుంటూరు జిల్లాలోనిది. 1750 ప్రాంతమున నిజాం నైజాం ఇలాఖా దేవరకొండ సీమను చెందియుండెను. **అప్పకవీయము** (1 84 101)న తంగెడ పేర్కొనబడినది.

వేంకట నరసింహాచార్య కవి కూ నాడు తంగెడ సీమకు చెందిన చెన్నయ **పాలెము** నందు రామరాజువారు అగ్రహారము నిచ్చినట్లు తన **జాంబవతీ...** **(1-46)** లో తెల్పెను (చూ. చెన్నయపాలెము).

ఆళియరామ రాయల రాక్షస తంగడి (రక్కెస తంగెళ) యుద్ధము జరిగిన **'తంగెడ'** ఈ ప్రాంతమే యని కొందరి యూహ.

## 15. ధర్మపురి :

కరీంనగరం జిల్లాలో గల సుప్రసిద్ధ నరసింహ క్షేత్రము. గోదావరీ **తీర** గ్రామము. మణింగంటి తిరువేంగళాచార్యుల వారు సేవించి యుద్ధరించిన దివ్య స్థలములలో నిది కలదు. (కృష్ణా జిల్లా పెనుగంచిప్రోలు నృసింహస్వామికి **కూడా** ధర్మపురి నృసింహు డని పేరు. నరహరి గోపాలాచార్యుల వారు ఈ **పేరున** కృతుల రచించినారు).

**వ**రంగల్లు జిల్లా మునిగలవీటిలో నున్న మణింగంటివారు మొదట ధర్మపురిలో నుండగా నెల్లికుదరు నాయనివారు వీరిని ఆహ్వానించి, ధర్మారెడ్డి **పల్లి**ని సర్వాగ్రహారముగా నొసంగి యుంచుకొనిరి. ఇచ్చటి నుండియే వీరు మునిగలవీడు చేరి పెద్ద కుటుంబముగా నైనారు. తిరువేంగళాచార్యుల వారి **కాలము**ననే మణిగంటి వారు ధర్మపురిలో నివాస మేర్పరచుకొని నృసింహాలయమున ప్రముఖులైనారు. (**'...సీతాకల్యాణము'** 1-56, **'నృకంఠీ...'** 1-87 లలో ఈ గ్రామ ప్రసక్తి కలదు)

## 16. దేవరకొండ :

నల్లగొండ జిల్లాలో ఒక తాలుకా కేంద్రము. నేడు మండలము. చరిత్ర ప్రసిద్ధి గలది. స్థల, గిరి దుర్గము లున్నవి. దీనిని గూర్చి **'ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము'**(896), **'నల్లగొండ మండల సర్వస్వము'** అను గ్రంథములలో చూడవచ్చును.

మణింగంటి వారి ప్రథమ నివాసమైన **'కనగల్లు'**, **'అనుముల'**, **'గంగాపురము'** గ్రామములు, మహబూబ్ నగరం జిల్లాలోని **'కల్వకుర్తి'**, **నాగర**

**కర్నూలు**, జడచర్ల రాలూకాల ప్రాంతము ఒకనాడు **'దేవరకొండ సీమ'**కు చెందినవే! వాడపల్లి శాసనమున దేవరకొండ సీమ పేర్కొనబడినది. (**'...సీతా కల్యాణము** 1-51, **విష్వక్సేన...'** 1-51, **శ్రీరామా...'** 1-33,34, **చల్లపిళ్ళ ...**1-27, **జాంబ...'** 1-64, **నృకంఠి...'** 1-33. ల యందు దేవరకొండ ప్రసక్తమైనది)

## 17. నరసింహాపురము :

నల్లగొండ జిల్లా సూర్యాపేట నుండి విజయవాడకు వెళ్ళు జాతీయ రహదారిపై అకుపాముల గ్రామమునకు దక్షిణ దిశ 2 కి.మీ.ల దూరమున మునగాల మండలమున ఈ గ్రామము కలదు.

ఆ నాడు కీకారణ్యముగా నున్న ఈ ప్రాంతము కీసర వారి(నాయని వారి పూర్వులు - నడిగూడెం) అధీనములోనిది. వీరియందు నరసింహరాయలు అప్పల దేశికుల వారికి ఈ భూమిని (800 ఎకరాలు) సర్వాగ్రహారముగా నిచ్చి, రామాలయ నిర్మాణ మొనర్చుటకు తోడ్పడి, మతింగంటి వారికి ఆశ్రయ మిచ్చెను. దేశికుం వారు ఇచ్చట స్వయం వ్యక్తములైన శ్రీరామ పాదుకలను ముఖ్యముగా చేసికొని శ్రీరామాలయ నిర్మాణ మొనరించి, అందులో గోదాదేవిని, శ్రీరామానుజుల వారిని ప్రతిష్ఠించిరి. ఈ ఆలయము వెనుక భాగమున శ్రీరంగనాయక స్వామి దేవళమును దేశికుల అన్నగారైన నరసింహ దేశికులు నిర్మాణ మొనరించినారు.

మొదట శ్రీరంగనాయక స్వామికి ఆరగింపు జరిగిన తరువాతనే రామాలయమున జరుగు సంప్రదాయము ఏర్పాటై, నేటికిని అట్లే కలదు. దేవాలయమున కానుకొని యున్న బయటి కోనేటి నీరు చల్లగాను, దాని వెంబడే లోపల గల గుండములోని నీరు వేడిగాను నిరంతర ముండుట ఇచటి ఒక విశేషము. దీనికి తోడు స్వామివారి పాదుకల సన్నిధి ఎల్లప్పుడు జలము కలిగి యుండును. ఈ విశేషములను దేశికుల వారు **'శ్రీరామ పాద స్తుతి'** యందు తెల్పినారు. ఇచట శ్రీ గోదాదేవిని గూర్చి **'గోదా స్తుతి'** అనేక మంగళ హారతులు, తిరునామము లున్నవి.

'దేశికులవారికి భూదాన మొసంగిన నరసింహరాయని పేర ఇది నరసింహపుర మైన దనియు, నరసింహ దేశిక నామ ముంచి దేశికులవారు దీనిని నర

సింహాపుర మని రనియు రెండు నామములు గలవు. కీసర వారిచ్చిన అగ్రహార దాన పత్రము **ఫసలీ 1197 (క్రీ. శ. 1787)** నాటిది మఱింగంటి వారి వద్ద కలదు (దాని నకల్ ఈ గ్రంథమున ఈయబడినది) నరసింహాపురము నుండి వెళ్ళిన మఱింగంటి వారే వరంగల్ జిల్లా దివిటిపల్లి, మానుకోట, వరంగల్లులలో స్థిరపడినారు.

శ్రీరామపాచస్తుతి యందు నరసింహాపురము పఠింపబడినది.

## 18. పణకరాజు పల్లి :

నల్లగొండ జిల్లా పెద్ద అడిశర్ల పల్లి మండలములోని ఈ గ్రామమునకు **'బ్రహ్మరాజ పురము'** ('బొంరాసి పల్లె' వ్యవహారమున) అని మరియొక పేరు. **పణకరాజు పల్లి - అజ్మాపురం** కలిసి **పణ్కరాజు పల్లిగా** వ్యవహరింపబడు చున్నవి.

మఱింగంటి వారిలో చెన్నయాచార్యుల గూర్చి చెప్పునప్పుడు ఈ గ్రామ ప్రసక్తి వచ్చును. పణ్కరాజుపల్లి శైలము పైననే చెన్నయాచార్యులు గారు శేష రూపిగా నేటికిని పూజ లందుకొనుచున్నారు. **'దశరథ** - (1-21), **సీతా కల్యాణము'** (1-50, 51, 56), **జనక** - (1-38), **'నృకంఠీ** - (1-87)' **'చల్వ** - (1-27) లలో ఈ గ్రామ ప్రసక్తి కలదు.

## 19. బాదేపల్లి :

మహబూబ్ నగరం జిల్లాలో ఒక ప్రసిద్ధ వాణిజ్య కేంద్రము. దీనికి అను బంధముగా జడ్చర్ల అభివృద్ధి యైనది. బాదేపల్లికి ప్రాచీన నామము **'భాగ్యేశ్వరి పురము'**. భాగ్యేశ్వరి ఒక భక్తురాలి పేరు. గ్రామమునందు భాగ్యేశ్వరి ఆలయము కలదు. ఇక్కడి పర్వతముపై శ్రీరంగనాథ దేవళము ప్రాచీనమైనది. శ్రీరంగ నాథ రామాయణ కర్త ఈ స్వామివారి సన్నిధానముననే రంగనాథ రామాయణ మును రచించినాడని ఐతిహ్యము.

ఇప్పుడు గంగాపుర వెన్నకేశవ స్వామిని దర్శించుటకు వెళ్ళు యాత్రికులు మొదట ఇచటి శ్రీరంగనాథుని దర్శించిన తర్వాతనే గంగాపురమునకు వెళ్ళు ఆచార ముండెడిదట. దీనివలన బాదేపల్లి గంగాపురమునకు అనుబంధ క్షేత్ర మని తెలియుచున్నది. క్రీ. శ. 1167 నాటి జడచర్ల **శాసనమున** గంగాపుర ప్రసక్తి యున్నదే కాని బాదేపల్లి రంగనాథుని గూర్చి లేదు. కావున ఆ నాటికి ఈ స్వామి ఇచట వెలయలేదేమో!

తిరువేంగళాచార్యులు నాటికి బాదేపల్లిలో శ్రీరంగనాథుని ఆలయ మున్నది. దీనిని కూడా ఆయన పునస్సంప్రోక్షణ మొనరించి సేవించినాడు. ఈ ప్రసక్తి '...సీతా' - (1-56), '...నృకంతే' - (1-37) లలో కలదు.

## 20. యాత (ద) వాకిళ్ళ :

నల్లగొండ జిల్లా మఠంపల్లి మండలము లోని యీ గ్రామము పురాతనమైనది. మరింగంటి సింగరాచార్యు సోదరులకు ఇబ్రహీం కుతుబ్షా దీనిని అగ్రహారముగా నిచ్చినాడు. ఆ నాడు సింగరాచార్యుల వారి తండ్రి యిచట నివసించి, వాడపల్లి నృసింహాలయమునకు స్థానాచార్యులుగా నుండిరి. ఈ గ్రామము నుండియే మరింగంటి వారిలో కొందరు కనగల్లునకు వెళ్ళి స్థిరపడినారు. యాత వాకిళ్ళలో ప్రాచీనమైన వేణుగోపాల స్వామి సన్నిధి కలదు.

దీనిని గూర్చి - '**శ్రీగోదా...**' (1-38), '**చల్వ...**' (1-38), '**జాంబ...**' (1-51), '**నృకం...**' (1-38), '**క్షత్ర...**' (1-29) లలో కలదు.

## 21. రంగాపురము :

మహబూబ్‌నగరం జిల్లాలో ఈ పేరున మరికొన్ని గ్రామాలు కలవు. ఇది మహబూబ్ నగరం జిల్లా పంగూరు మండలము లోనిది. దీనికే **ఎల్లమ్మ రంగాపుర** మని పేరు.

పూర్వ మిచట 'గున్న' గృహనామము గల రెడ్డి దొరలు 16 గ్రామాల పట్టీ గలవారు. రంగాపురమున ఎల్లమ్మను స్థాపించినారు. ఇచ్చట **మోదెంపల్లి ఎల్లమ్మ, రావికంటి యెల్లమ్మ** అని యిద్దరు దేవతలు. మోదెంపల్లి ఎల్లమ్మయే

మొదటి దేవర. పూర్వము సంవత్సరానికి ఒక పర్యాయము ఈ దేవతను జాతర చేసేవారు. అప్పుడు 1000 దీపాలను వెలిగించి పుట్టెడు బియ్యమును వంటి కుంభము పోసి, 100 గొర్రెలను కొట్టేవారు. నివేదనము నుంచి తెర తీయగానే ఆ దేవతా దృష్టి పడి ఈ పదార్థము లన్నియు మాయ మయ్యేటివి

రావికంటి ఎల్లమ్మకు బ్రాహ్మణ పూజారులు తీపి పదార్థములనే నివేదన చేయుదురు. ఇరువురు ఎల్లమ్మ లుండుట వలన నిది ఎల్లమ్మ రంగాపుర మైనది.

ఇచ్చటి దొరలు ఒకప్పుడు యాత్రకు వెళ్ళి వచ్చుచు స్తంభాద్రి (ఖమ్మం మెట్టు) నుండి మణికంటి వారిని తీసికొని వచ్చి, వారికి 7 గ్రామాలను అగ్ర హారములుగా నిచ్చి వారికి పేరు కిప్పులై నారు. ఇది సింగరాచార్యుల వారి పౌత్రుల కాలమున జరిగినది ('వంశ పరిచయము'న వివరములు గలవు). ఇప్పటికిని అగ్రహార భూమి 160 ఎకరములు మణికంటి వారి అనుభవములోనే కలదు. ఈ గ్రామములోను, దీని సమీపమున గల **కోనాపురము** లోను నేడును మణికంటి వారు నివసించుచున్నారు.

జగన్నాథాచార్యుల వారి పుత్రులలో శఠకోపాచార్యులు, రామచంద్రా చార్యులు ఉన్నారు. 1987 లో రంగ కృష్ణమాచార్యులు పరమపదించినారు. జగన్నాథాచార్య, రంగకృష్ణమాచార్య రచనలలో **'రంగాపురము'** ప్రసక్తము. ఈ రంగాపురమునసే శ్రీరంగనాథాలయము ప్రాచీనమైనది కలదు. దీనివల్ల ఇది రంగాపురము. దేవత(ల) వలన 'ఎల్లమ్మ రంగాపురము'గా నిది ప్రసిద్ధము.

## 22. రేబల్లె :

ఈ పేరు గల గ్రామములు నల్లగొండ జిల్లా మేళ్ళచెరువు, నాంపల్లి మండలాలలోను, మహబూబ్‌నగరం జిల్లా నాగర కర్నూలు తాలూకాలోను కలవు. మణికంటి వారు పేర్కొన్న గ్రామము - నాగర కర్నూలు సమీపము లోనిది. నాగర కర్నూలు నుండి 'వీపనగండ్ల'కు వెళ్ళు సర్వీసు మార్గమున గల యీ గ్రామము **అగస్త్యేశ్వర శాసన** ము (తెలంగాణ శాసనములు-2 వ భా. 39 నెం.) నందు కలదు. ప్రేపల్లె - రేబల్లె - రేపుపల్లె - జేనిపల్లె అని దీనికి వాడుక.

గ్రామమునకు దక్షిణమున గల పర్వతముపై జగన్నాయక దేవాలయ మున్నది. సంక్రాంతి నాడు గుట్టపైకి బండ్ల నెక్కించి ఈ దేవళము చుట్టు త్రిప్పు ఆచారము కలదు. మరియొక గుట్టపై శివాలయము, వేరొక పర్వతముపై పెద్దమ్మ గుడి యున్నవి.

ప్రాచీనమైన జగన్నాయ కాలయము ఆటు పోటుల ననుభవించినది. మడిగంటి వారు దీనిని దర్శించి బాగుచేయించినా రని వాడుక. రేబల్లె 'సీతా' (1-56), 'నృకం...' (1-37) లలో పేర్కొనబడినది.

## 23. సిరిసెనగండ్ల :

నల్లగొండ జిల్లా పెద్దవూర మండలం చిన్నగూడెం సమీపమున గల పర్వతమునకు ఈ పేరు. పైన గుహలో లక్ష్మీ నరసింహ స్వామి వెలసినాడు. గుహ రూపమును బట్టి దీనికి 'శర్వాద్రి' యని నామాంతరము. మడిగంటి వారి కులస్వామి ఈ లక్ష్మీ నరసింహుడే! తమ కవితా సర్వస్వమును వీరికే అర్పించినారు.

గోవర్ధనం వేంకట నరసింహాచార్య కవి ఇక్కడకు సమీపమున గల ఇబ్రహింపేటలో ఉండేవాడు. అయన దీనిని 'ప్రతాపగిరి' యనెను. సిరిసెన గండ్లకు పశ్చిమ, దక్షిణాలలో ప్రాచీనమైన ధార్వాడ శిలలు కలవు.

యడవల్లి దొరలు ఈ దేవాలయ ధర్మకర్తలు. ప్రతి వత్సరము ఫాల్గుణ శు॥ ౧౩ నుండి బ॥ ౩ వరకు బ్రహ్మోత్సవము జరుగును. ఇచ్చట గల కోనేరులో నిరంతరము జలము నిండియుండును. దీనికి కారణము మత్స్యాకార సాలగ్రామము ఇందులో కల దని వాడుక. గుహలో నున్న పెద్ద నాగుపాము మొగిలి రేకుల పరిమళము గలదై, ఎప్పుడో ఎవరికో దర్శన మిచ్చుచుండును.

మడిగంటి వారి రచన లన్నిటియందును సిరిసెనగండ్ల పేర్కొన బడినది.

# ఉపయుక్త గ్రంథ సూచిక

## 1. సంస్కృతము :


| | రచయిత | గ్రంథము |
|---|---|---|
| 1. | అధ్యాత్మ రామాయణమ్ | వావిళ్ళ ప్రచురణ, 1961 |
| 2. | అప్పాగారు, ఎరుంబి | విలక్షణ మోక్షాధికార నిర్ణయమ్<br>అను : కందాడై శేషాచార్యులు, 1926 |
| 3 | ఆండానుదాసుడు, మొదలి | ప్రపన్నానుష్ఠాన భాస్కరమ్ |
| 4. | దండి | దశకుమార చరితమ్<br>'వావిళ్ళ' 1963 |
| 5. | భట్టోజి దీక్షితులు | సిద్ధాంత కౌముది<br>'చౌఖాంబ' 1957 |
| 6. | బృహత్ స్తోత్ర రత్నాకరః (విష్ణు) | 'వావిళ్ళ' 1967 |
| 7. | యామునాచార్యులు | ఆళవందార్ స్తోత్రమ్<br>శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు - 1986 |
| 8. | రాజశేఖరుడు | కావ్య మీమాంస<br>అను : పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి<br>ఆర్యభారతీ గ్రంథమాల, మదరాసు - 1980 |
| 9. | రామచంద్రుడు | చంపూ రామాయణమ్<br>మంజూషికా వ్యాఖ్య, 'వావిళ్ళ' 1948 |
| 10. | విద్యానాథుడు | ప్రతాపరుద్రీయమ్<br>'వావిళ్ళ' 1954 |

| | | |
|---|---|---|
| 11. | వేదాంత దేశికులు | శ్రీమద్రహస్య త్రయ సారమ్,<br>శ్రీకృష్ణ విలాసముద్రాక్షరశాల<br>బెంగుళూరు 1804<br>—స్తోత్ర భాష్యమ్<br>—పాదుకా సహస్రమ్<br>ఉభయవేదాంతగ్రంథమాల-మదరాసు. 1970 |
| 12. | శ్రీనివాస దాసః | యతీంద్ర మత దీపికా<br>శ్రీరామకృష్ణ మఠం, మైలాపూర్ - 1978 |
| 18. | శ్రీమద్రామానుజులు | గద్య త్రయమ్<br>శ్రీగోదా గ్రంథమాల ప్రచురణ, 1987 |
| 14. | శ్రీ వ్యాస మహర్షి | శ్రీమహా భాగవతమ్<br>వీరరాఘవీయ చంద్ర చంద్రికాఖ్య వ్యాఖ్య,<br>బ్రహ్మ విద్యావిలాస ముద్రాక్షరశాల - వన<br>పర్తి, 1885 |
| 15. | సాధన గ్రంథ మండలి,<br>తెనాలి. | శంకర గ్రంథ రత్నావళి. 8. భా. ము-? |

## 2. తెలుగు :

| | | |
|---|---|---|
| 1. | అయ్యలరాజుకవి, వార<br>ణాసి. | సురతాణీ పరిణయము.<br>సంపా. భాగవతుల నరసింహశర్మ,<br>వేగుచుక్క గ్రంథమాల. బరంపురం- 1981 |
| 2. | అనంత పద్మనాభరావు,<br>రేపూరి. | ఉదయహరి రుద్రకవి, 1977 |
| 3. | అన్నయ్య, తాళ్ళపాక | చెన్నపిన్న రాయచరిత్ర<br>సంపా. ఆశావాది ప్రకాశరావు, 1982 |
| 4. | అప్పకవి, కాకునూరి | అప్పకవీయము,<br>'వావిళ్ళ' 1966 |
| 5. | అప్పప్ప కవి | శశిరేఖా పరిణయము - 1921 |

6. అప్పలాచార్యులు, శ్రీభాష్యం — విశిష్టాద్వైతము.

7. అప్పారావు, పి.ఎస్.ఆర్. — తెలుగు నాటక వికాసము, 1967

8. ఆదిభట్ల నారాయణదాసు, అజ్ఞాద — నా యెఱుక
దాస భారతీ ప్రచురణ, విశాఖపట్టణం-1976

9. ఆనందమూర్తి, వేటూరి — తాళ్ళపాకవారి వివిధ సాహిత్య ప్రక్రియలు. 1974
—తాళ్ళపాక కవుల పదకవితలు - భాషా ప్రయోగ విశేషాలు, 1976

10. ఆరుద్ర — సమగ్ర ఆంధ్ర సాహిత్యము
(8-11 సంపుటములు)
యం. శేషాచలం అండ్ కంపెనీ, 1965-68

11. ఈశ్వరదత్తు, కుందూరి — ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము
ఆం.ప్ర. సాహిత్య ఎకాడమీ, 1966

12. ఎఱ్ఱన — హరివంశము, వావిళ్ళ ప్రచురణ.

13. కవిత్రయము — ఆంధ్ర మహాభారతము,
ఉస్మానియా విశ్వవిద్యాలయము 1968-1970

14. కాళకవి, చెంగల్వ — శ్రీరాజగోపాల విలాసము,
సంపా. నిడుదవోలు వెంకటరావు
మదరాసు, ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము - 1951

15. కేతన — ఆంధ్ర భాషా భూషణము 'వావిళ్ళ' 1949

16. కేశవాచార్యులు, నంబూరి — ఆచార్య సూక్తి ముక్తావళి,
శ్రీరామా ప్రెస్, వెస్టువార్డ్, మదరాసు 1931

17. కృష్ణమూర్తి, ఇరివెంటి — 'చాటువులు'
యువభారతి ప్రచురణ, హైదరాబాదు-1985

18. కృష్ణమూర్తి, భద్రిరాజు — తెలుగుభాషా చరిత్ర
ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ, 1970

19. కోటీశ్వర దీక్షితులు, డై. గోత్ర ప్రవర సంగ్రహము, 1972

20. కోటీశ్వరరావు, తుమ్మపూడి
అముక్తమాల్యదా సౌందర్యము, 1971

21. గోపాలకృష్ణయ్య, వర్ధమూడి
ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష, ఆంధ్ర గ్రంథాలయ ట్రస్ట్, పటమట లంక, 1969
—తాను తెనుగు, కళాకృష్ణుల ప్రచురణ, హైదరాబాదు-1972

22. గోపాలకృష్ణరావు, కె. ఆంధ్ర శతక సాహిత్య వికాసము, 1976
—తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము, 1968

23. గోపాలాచార్యులు, నరహరి
ప్రణతి - ఆత్మసమర్పణము, 1941

24. ఛాయాపతి, చింతలపల్లి రాఘవాభ్యుదయము
సంపా. బి. రామరాజు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి, 1965

25. జగ్గన, పెదపాటి ప్రబంధ రత్నావళి
సంపా. వేటూరి ప్రభాకరశాస్త్రి, 'వావిళ్ళ' 1994

26. జోగారావు, యస్వీ ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, ఆంధ్ర విశ్వ విద్యాలయము-1961

27. తిమ్మన, కూచిమంచి లక్షణ సార సంగ్రహము
సంపా. కోవెల సంపత్కుమారాచార్య, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి, 1971

28. తెలగన, పొన్నికంటి యయాతి చరిత్రము
కాకతి పబ్లికేషన్స్, హైదరాబాదు-1977

| | | |
|---|---|---|
| 29. | తెలుగు భాషా సమితి | విజ్ఞాన సర్వస్వము 4 వ భా. (తెలుగు సంస్కృతి 2 వ భా.) 1964 |
| | | — ,, ,, 6 వ భా. 1964 |
| 30. | తెలుగు వైతాళికులు 1 భా | ఆంధ్రప్రదేశ సాహిత్యఎకాడమీ, 1976 |
| 31. | తిక్కన | నిర్వచనోత్తర రామాయణము 'వావిళ్ళ' 1941 |
| 32. | తిరువేంగళ నాథుడు - తాళ్ళపాక | అష్టమహిషీ కల్యాణము, 1987 |
| | | —పరమయోగి విలాసము, 1938 |
| | | (తిరుమల - తిరుపతి దేవస్థాన ప్రచురణలు) |
| 33. | దొణప్ప, తూమాటి | తెలుగు హరికథా సర్వస్వము, 1978 |
| | | —భాషా చారిత్రక వ్యాసావళి, ఆంధ్ర సారస్వత పరిషత్, 1972 |
| 34. | దొరస్వామిశర్మ, రావూరి | తెలుగు భాషలో ఛందో రీతులు యం. శేషాచలం అండ్ కంపెనీ, 1962 |
| 35. | నన్నెచోడుడు | కుమార సంభవము, 'వావిళ్ళ' 1965 |
| 36. | నరసింహకవి, సంకుశాల | కవికర్ణ రసాయనము ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమి, 1967 |
| 37. | నరసింహకవి, అల్లాడు | నారదీయ పురాణము, ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార ప్రచురణ, 1976 |
| 38. | నరసింహాచార్యులు, కె.టి.యల్. | ద్వాదశ సూరి చరిత్ర, 1973 |
| | | —దివ్య ముని త్రయము 1974 |
| | | (శ్రీ గోదా గ్రంథమాల ప్రచురణలు) |

39. నరసింహాచార్యులు, కిడాంబి — తిరునామములు, 1983
— తిరునామములు - సమగ్రపరిశీలనము, 1984

40. నాగయ్య, జి. — తెలుగు కావ్యావతారికలు, 1968
— దాక్షిణాత్య సాహిత్య సమీక్ష, 1976

41. నారాయణరావు, చిలుకూరి — ఆంధ్ర భాషా చరిత్రము. I భా.
ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రచురణ, 1937

42. నారాయణరావు, కోదాటి — చిన్ననాటి జ్ఞాపకాలు,
ప్రభాత ప్రచురణ సమితి, హైదరాబాదు, 1987

43. నారాయణరెడ్డి, సి. — ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు,
యం. శేషాచలం అండ్ కంపెనీ. 1977

44. ప్రభాకరశాస్త్రి, వేటూరి — చాటుపద్య మణి మంజరి II భా.
'వావిళ్ళ' 1952

45. పెద్దన, అల్లసాని — మను చరిత్ర,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ, 1966

46. పెద్దన, చిత్రకవి — లక్షణ సార సంగ్రహము,
ఆంధ్రసాహిత్య పరిషత్, కాకినాడ 1961

47. పెద్దన, చిన్నకోట — కావ్యాలంకార చూడామణి,
వేదం వేంకటరాయ శాస్త్రి అండ్ బ్రదర్స్, మదరాసు, 1964

48. పోతన, బమ్మెర — శ్రీమహా భాగవతము,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి, 1968

49. భాస్కరుడు — భాస్కర రామాయణము
'వావిళ్ళ' 1928

50. భైరవకవి — శ్రీరంగ మహత్త్వము<br>సంపా. శ్రీరంగాచార్య<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి, 1979

51. మణవాళాచార్యులు, అసూరి మఱింగంటి — తిరునామములు, 1985

52. మల్లారెడ్డి దేశాయి, రెడ్డి — శ్రీగంగాపుర మాహాత్మ్యము,<br>సంపా. సురవరం ప్రతాపరెడ్డి<br>విజ్ఞానవర్ధినీ పరిషత్, హైదరాబాదు, 1946

53. మురళీధరరావు, కోదాటి — ప్రపన్నగానామృతము, 1983

54. యువభారతి, హైదరాబాదు — చైతన్యలహరి, 1972

55. రంగాచార్యులు, చెలమచర్ల — ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము,<br>శ్రీనివాసవిలాసప్రచురణ-హైదరాబాదు, 1961

56. రంగాచార్యులు, మాడభూషిణి — మఱింగంటి వేంకట నరసింహాచార్యుల (చతుర్థ) రచనల సమగ్ర పరిశీలన (సిద్ధాంత వ్యాసము, అము.)

57. రత్నయ్య, వి. — తెలుగు నిరోష్ఠ్య సాహిత్యము-దశరథ తనయ చరిత్ర (సిద్ధాంత వ్యాసము, అము.)

58. రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని — ఆంధ్ర నాటక రంగ చరిత్ర,<br>రేణుకా గ్రంథమాల, మదరాసు, 1969

59. రామకృష్ణుడు, తెనాలి — పాండురంగ మాహాత్మ్యము,<br>'వావిళ్ళ' 1952

60. రామరాజ భూషణుడు — వసు చరిత్ర, 'వావిళ్ళ' 1954<br>——కావ్యాలంకార సంగ్రహము<br>సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి వివరణయం. శేషాచలం అండ్ కంపెనీ, 1959

| | | |
|---|---|---|
| 61. | రామరాజు, బి. | సంపా. ఖుతుబ్షాహీసుల్తానులు-ఆంధ్ర సంస్కృతి.<br>ఇదార అద్బియాతె ఉర్దూ-హైదరబాదు 1962<br>—తెలుగు జానపద గేయ సాహిత్యము<br>జానపద విజ్ఞాన ప్రచురణలు, హైదరాబాదు, 1978 |
| 62. | వరదాచార్యులు<br>ధనకుధరం | సంపా. శ్రీరామానుజకీర్తి కౌముది 1-7 సం.<br>శ్రీరామానుజకీర్తి కౌముదీ గ్రంథమాల<br>గుంటూరు, 1972-86 |
| 63. | వరవరరావు, పి. | తెలంగాణ విమోచ నోద్యమం-నవల<br>సృజన ప్రచురణలు-వరంగల్లు, 1988 |
| 64. | వీరభద్రరావు, ఆదిరాజు | మన తెలంగాణము, 1968<br>—సంపా. తెలంగాణ శాసనములు 1. భా.<br>లక్ష్మణరాయ పరిశోధక మండలి,<br>హైదరాబాదు, 1985 |
| 65. | వేంకటరమణ కవి,<br>పౌత్రపి | లక్షణ శిరోమణి<br>సంపా. రావూరి దొరస్వామి శర్మ<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి, 1979 |
| 66. | వేంకట రామమూర్తి<br>పంతులు, గిడుగు | బాలకవి శరణ్యము,<br>విశాలాంధ్ర ప్రచురణ, 1969 |
| 67. | వేంకటరావు, నిడుదనోలు<br>అప్పారావు పి.ఎస్ ఆర్. | మానవల్లి కవి-రచనలు<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి, 1972 |
| 68. | వేంకట సుబ్బారావు,<br>పైడిమఱ్ఱి | అమృత వాహిని,<br>సర్వోదయాశ్రమము-సర్వేలు, 1960 |
| 69. | వేంకటాద్రినాయుడు,<br>సాయప | సకల జీవ సంజీవనము,<br>సంపా. బి. రామరాజు<br>తిరుమల-తిరుపతి దేవస్థానములు, 1983 |

70. శమంతకమణి, పండా — తెలుగు సాహిత్యములో రామకథ ఆంధ్ర సారస్వత పరిషత్, 1972

71. శాస్త్రి బి. ఎన్. — విప్లవ జ్వాల 1986
——సంపా. నల్లగొండ మండల సర్వస్వము 1986 (కాకతీయ పబ్లికేషన్స్, హైదరాబాదు ప్రచురణలు)

72. శ్రీకృష్ణదేవరాయలు — ఆముక్తమాల్యద - 'వావిళ్ళ' 1964

73. శ్రీరంగాచార్య — సంపా. చాటు పద్య రత్నావళి ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి, 1978

74. సంపత్కుమారాచార్య, కోవెల — తెలుగు ఛందో వికాసము, కులపతి సమితి, వరంగల్లు, 1962
——మన పండితులు-కవులు-రచయితలు, జనధర్మ ప్రచురణ, వరంగల్లు 1970

75. సుబ్బారావు, వంగూరి — శతక కవుల చరిత్ర కమలకుటీర్ ప్రెస్, నరసాపురం 1957

76. సుబ్బారావు, నాయని — నాయని సుబ్బారావు కృతులు, 1958

77. సుబ్బారావు, పంతులు వావిలికొలను — శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, శ్రీ కోదండరామ సేవక సమాజము, అంగలకుదురు 1952-1964

78. సూర్యనారాయణ, అబ్బరాజు — ఆంధ్ర మహాభారత నిఘంటువు 1 భా., ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమి 1979

79. సూర్యనారాయణశాస్త్రి, మల్లాది — ఆంధ్ర దశ రూపకము, శ్రీరామా బుక్ డిపో, సికింద్రాబాదు 1967

80. సీతారామాంజనేయ భాగవతార్, వాడరేవు. — ఆంధ్రహరికథ వాఙ్మయము, 1976

81. సోమన-నాచన — ఉత్తర హరివంశము, సంపా. పి. యశోదారెడ్డి ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడామి, 1970

**3. తమిళము :**

| | | |
|---|---|---|
| 1. | గోదాదేవి | తిరుప్పావై, అను. నరహరి గోపాలాచార్యులు, 1968<br>—నాయ్చ్చియార్ తిరుమొళి<br>శ్రీగోదా గ్రంథమాల ప్రచురణ 1977. |
| 2. | తిరువరంగ త్తముదనార్ (శ్రీరంగామృతకవి) | ఇరామానుశ నూత్తందాది, శ్రీగోదా గ్రంథమాల, 1977 |
| 3. | సమ్మాళ్వారులు | తిరువాయ్మొళి (శ్రీశఠకోపవాక్సుధ)<br>కె.టి.యల్. నరసింహాచార్యుల వారి ప్రబంధమాధురీ వ్యాఖ్య,<br>శ్రీ గోదా గ్రంథమాల, 1972-1982. |
| 4. | పిన్బళగియ పెరుమాళ్ | గురు పరంపరా ప్రభావమ్,<br>సంపా. యనసుదల వేంకటాచార్య. |

**4. ఆంగ్లము :**

| | | |
|---|---|---|
| 1. | Anima Sengupta | A Critical Study of the Philosophy of Sri Ramanuja, Chowkhamba 1987. |
| 2. | Swami Ramakrishnananda | 'Life of Sri Ramanuja' Sri Ramakrishna Math, Madras 1965 |

**5. ఉరుదు :**

| | | |
|---|---|---|
| 1. | సిద్దికీ అబ్దుల్ మజీద్ | తారీఖే గోల్కొండ, 1939<br>(అను - బి. ఎన్. శాస్త్రి - అముద్రితము) |
| 2. | | హైర్ గోల్కొండ - ము - ? |

## 6. నిఘంటువులు :

1. అమర సింహుడు — అమరకోశః, గురుబాల ప్రబోధికా వ్యాఖ్య వావిళ్ళ, 1958
2. తారానాథ తర్కవాచస్పతి — వాచస్పత్యమ్. I భా చౌఖాంబా ప్రచురణ, 1961
3. శ్రీహరి, ఆర్ — నల్లగొండ జిల్లా మాండలిక పదకోశము, పతంజలి పబ్లికేషన్స్, హైదరాబాదు, 1986
4. సీతారామాచార్యులు, బహుజనపల్లి — శబ్దరత్నాకరము, చెన్నపట్టణపు దేశ భాషా గ్రంథకరణ సభ, 1969

## 7. ప్రత్యేక సంచికలు

1. నాగేశ్వరరావు,కాశీనాథుని — ఆంధ్ర వాఙ్మయ సూచిక, ఆంధ్రపత్రికా కార్యాలయము,మదరాసు 1929
2. ప్రతాపరెడ్డి, సురవరం — గోలకొండ కవుల సంచిక. గోలకొండ ముద్రణాలయము, హైదరాబాద్ - దక్కన్. 1934

## 8. CATALOGUES

(Govt. Oriental Manuscripts Library, Madras)

1. An Alphabetical Index of Telugu Manuscripts-1932
2. A Triennial Catalogue of Manuscripts, Vol IV Part - 8, Telugu - 1934.
3. A Triennial Catalogue of Manuscripts, Vol V Telugu - 1942

4. A Triennial Catalogue of Manuscripts, Vol VI Telugu - 1949.

## 9. వ్యాసములు

| | | |
|---|---|---|
| 1. | గోపాలాచార్యులు, తెన్మఠం | సందేహాలు - సంహాలు. (అష్టాదశ రహస్యములు-సంగ్రహవివరణ) 'భక్తి-నివేదన' (మాసపత్రిక), అక్టోబర్, 1987 |
| 2. | రాజేశ్వరి, ఫణిభట్ల | ఇంటిపేర్లు 'ఫణిభట్ల' వారు 'ఆంధ్రజ్యోతి' (వారపత్రిక) 28-8-1986 |
| 3. | రామచంద్ర, తిరుమల | సాహిత్యవిమర్శ ఆవశ్యకత 'పరిశోధన' (త్రైమాసిక). I 1987 నవంబర్-జనవరి, 1988 |
| 4. | రామరాజు, బి | ఆంధ్రభాషా యోష కమూల్యాభరణము అర్పించిన మఱింగంటి కవులు 'ఆంధ్రభూమి' (దినపత్రిక) ప్రారంభోత్సవ సంచిక 30-9-1960 |
| | | —పరశురామ పంతుల అనంతరాము పంగితుసు, 'సాహితి' 1962 జనవరి |
| 5. | వీరభద్రరావు పంతులు, ఆదిరాజు | లాలాంక నందినీ పరిణయము, మఱింగంటి వేంకట నరసింహాచార్యులు 'తెలంగాణ' సం.4. సం 44-45 |
| 6. | శేషసహూర్, హరి | శతావధాని శ్రీ పోకూరి కాశీపత్యవధానులుగారు 'అక్షరార్చన' పొటిబంగ మాధవశర్మ గారి షష్టిపూర్తి సన్మాన సంచిక 1972 |
| | శేషాచార్యులు, [illegible] | [illegible] భాగవతములో [illegible] పోలిన [illegible] [illegible]-'భారతి' మార్చి 1979 |

8. శ్రీరంగాచార్య

అర్వపల్లి లక్ష్మీనృసింహ స్తోత్రమ్
ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక, సం. 58 సం. 5 (1968 డిసెంబర్, 1969 జనవరి)
—కేశవస్వామి శతకము - పరిశీలన
'భారతి' 1968 డిసెంబర్.
—తాలాంక నందినీ పరిణయము - ఒక పరిశీలన
'భారతి' 1967 డిసెంబర్.
—మన ప్రాచీన తాళపత్ర గ్రంథములు - వాని దుఃస్థితి
'కృష్ణాపత్రిక' 1967 స్వాతంత్ర్య దినోత్సవ సంచిక
—శ్రీరామ పాదుకా స్తవము.
'భారతి' 1967 సెప్టెంబర్.
—స్తంభగిరి లక్ష్మీనృసింహ స్తోత్రము,
'మూసీ' (మాస పత్రిక) 1981 మార్చి.
—సీతారాఘవ చరితము - ఒక పరిశీలన
'సమాలోచన' (పక్షపత్రిక) సం. 1. సం. 4 (1-11-79)
ద్వితీయ ప్రత్యేక వార్షిక సంచిక, రాజమండ్రి.

9. సాంబశివమూర్తి, మునునూరి

లక్ష్మీభీమవరాగ్రహార దాన శాసనము,
'భారతి' 1967 అక్టోబర్, నవంబర్.





గ్రంథకర్త :

## డా॥ శ్రీరంగాచార్య

జననం : 23-10-1944

చందుపట్ల గ్రామం

నకిరేకల్లు మండలం

నల్లగొండ జిల్లా.

| | | |
|---|---|---|
| విద్య | : | ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రప్రథమునిగా స్నాతకోత్తరవిద్య. కాకతీయ విశ్వవిద్యాలయం నుండి పి హెచ్.డి. |
| వృత్తి | : | 1967 నుండి కళాశాలలో అధ్యాపకత్వం. ప్రస్తుతం - మహబూబ్‌నగర్ జిల్లా. పాలెం ప్రభుత్వ ఓరియంటల్ కాలేజీలో. |
| ప్రవృత్తి | : | సంస్కృతాంధ్ర సాహిత్యముల అధ్యయనం. అముద్రిత గ్రంథ సేకరణ, ప్రచురణ, పరిశోధన. |

పరిష్కృత రచనలు :

1. దశరథరాజనందన చరిత్ర (1970, 1979
2. చాటుపద్య రత్నావళి (1978)
3. శ్రీరంగమహాత్త్వము (1979)
4. తాలాంకనందినీ పరిణయము (1980)
   ఇవి ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ వారు ప్రచురించినవి.
5. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకల్యాణము (1980)
6 క్షత్రబంధూపాఖ్యానము (1981)
7. సి పి. బ్రౌన్ వ్యక్తిత్వం - సాహిత్యం (1985)
8. శ్రీకృష్ణశతానందీయము (ముద్రణలో) (ఆం.ప్ర.ప్ర ప్రా.లి. పుస్తక భాండాగారము ద్వారా)

పరిష్కృత గ్రంథములు మరికొన్ని అముద్రితములు కలవు.

వ్యాసములు : 1965 నుండి భారతి, ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక, కృష్ణా పత్రిక, మూసీ, సమాలోచన, మొదలైన సాహిత్య పత్రికలలో వివిధ విషయాలపై 80 రచనలు.